# పురాతన సమాజం

మూ లం :

లూయీహెన్రీ మోర్గన్

అ ను వా దం :

మహీధర రామమోహనరావు

పావులర్ షూ మార్టు
గ్రూపు సంస్థలు

విజ్ఞాన వికాస సమితి
3 వ లైను, మారుతీ నగరు, విజయవాడ - 4

ప్రథమ ముద్రణ :
జనవరి, 1987

రెండువేల ప్రతులు



మేలు ప్రతి : రు 45-00

సాదా ప్రతి : రు. 30-00

ముద్రణ
చైతన్య ప్రింటర్స్
విశాలాంధ్ర రోడ్
విజయవాడ - 4






ప్రచురణకర్త
సోమూరి వెంకట్రామయ్య
3 వ లైను, మారుతీ నగర్
విజయవాడ - 520 004

సోల్ డిస్ట్రిబ్యూటర్స్
ప్రజాశక్తి బుక్ హౌస్
కారల్ మార్క్స్ రోడ్
విజయవాడ - 520 002

Anji Reddy. C
Kurnool Medical college

# మా మాట

10.6.59 Tenali

మోర్గను మహాశయుడు 1877 సం॥లో ఆంగ్లభాషలో 'ది ఏన్షెంట్ సొసయిటీ' వ్రాశారు. వారి జీవితకాలంలోనే యీ పుస్తకం మేధావుల్లో, పరిశోధకుల్లో గొప్ప సంచలనం కల్గించింది. విమర్శలు, ప్రతివిమర్శలు వచ్చాయి. అమెరికాలోను, ఇంగ్లాండులోను యీ పుస్తకాన్ని దొరక్కుండా చేశారు. అయినప్పటికీ మానవ శాస్త్ర, సాంఘిక శాస్త్ర పరిశోధకులకు కరదీపికయై, ఆర్థిక, రాజకీయ శాస్త్రవేత్తలకు శాస్త్రీయ అధ్యయనమునకు తోడ్పడినదై, తరువాతి తరం వారికి ఆధార గ్రంథమై కాలక్రమేణ ప్రాముఖ్యతను సంతరించుకుంది.

1. మోర్గను పుస్తకం మీద మార్క్సు - ఏంగెల్సులు తమ భావి రచనల కోసం 'నోట్సు' తయారుచేసుకున్నారు.
2. 'కుటుంబం పుట్టుక - పూర్వోత్తరాలు, రాజ్యాంగం' పుస్తకంలో ఏంగెల్సు అనేకచోట్ల మోర్గన్‌ను ఉటంకిస్తూ ప్రతి ఒకరు మోర్గను పుస్తకాన్ని చదివి తీరాల్సిందే,' అన్నారు.
3. డార్విను సిద్ధాంతం ఎంతటి అపురూపమైందో, మార్క్సు అదనపు విలువను కనిపెట్టడం ఎంతటి అసాధారణ విషయమో, అంతటి మహత్తరమైనదీ గ్రంథం అని ఏంగెల్సు చెప్పారు.

డార్విను, మార్క్సు, ఏంగెల్సు, మోర్గను — సమకాలికులు అవడం విశేషం. ఇది ప్రకృతి చేసిన సహాయం. ఒకే వాక్యంలో యీ పుస్తకమిచ్చే సందేశాన్ని యిట్లు చెప్పుకోవచ్చు — 'ఈ విశ్వమొక కుటుంబం, మన పూర్వీకులు ఒక్కరే, మానవులంతా ఒకటే: ప్రపంచంలో అంతటా వారి పురోగతి కూడ కొంచెం ముందు వెనుకగా ఒకే విధంగా సాగింది.'

ఇటువంటి గొప్ప గ్రంథాన్ని మోర్గను వ్రాశాడంటే సరిపోదు. ఇందులోని సమాచారం సేకరించడానికి ఆయన పడిన శ్రమ యింతా అంతా కాదు. రెడ్ యిండియనులు నిరుపేదలు. వారిది దయనీయస్థితి. మోర్గను వారికి వకీలు కావడం వలన రెడ్ యిండియన్లకు న్యాయం చేకూరింది. వారు అమితానందంతో మోర్గన్‌ను వెంట తీసుకొని వెళ్ళి తమ మధ్యనే జీవిస్తూ సాయపడుటకుగాను దత్తత చేసుకున్నారు. ఇలాంటి ఘట్టాన్ని ప్రపంచ చరిత్రలో మరెక్కడా చూడం. ఈ విధంగా మోర్గనుకు అవకాశం చిక్కింది. వారు రెడ్ యిండియన్లలోని అన్ని జాతుల గురించి ఏక దీక్షతో

పంబై సంవత్సరాలు పరిశోధనలు చేసి సేకరించిన సమాచారం యీ గ్రంథంలో నిక్షిప్తమై వుంది. అప్పుడప్పుడూ, అక్కడక్కడ కొందరు పరిశోధకులు మోర్గను పరిశోధనలు సరికావన్నప్పటికీ అధిక సంఖ్యాకులు ప్రధాన విషయాలలో మోర్గన్‌ను సమర్ధించి తమ గురువుగా స్వీకరించారు.

మోర్గను అనేక దూరదేశాల నుంచి తనలాంటి సమకాలీన పరిశోధకుల నుండి సమాచారం తెప్పించుకొని ఆ పరిశోధనలను ఆయా పరిశోధకుల పేర్లను తన పుస్తకంలో ఆయా సందర్భాల్లో నమోదు చేశారు. ప్రపంచంలో అన్ని ఖండాలలో మానవజాతి అటవిక, అనాగరిక, నాగరిక దశల ద్వారా ఎట్లు క్రమ వికాసాన్ని పొందిందో విపులమైన సాక్ష్యాధారాలతో, తులనాత్మక సమీక్షతో వివరించారు. ఆయా దశలలో ఆనాడు వారు కనిపెట్టిన పనిముట్లు, నిప్పు, వేట, పశుపాలన, వ్యవసాయం, గ్రామ, పట్టణ నివాసముల ఆధారంగాను, అలవర్చుకున్న ఆచారాల ద్వారాను వారి సాంఘిక, రాజకీయ వికాసం ఎట్లు జరిగిందో అద్దం పట్టి చూపారు.

అప్పటిలో యిటువంటి గొప్ప పుస్తకాన్ని రచించి వెలుగులోకి తీసుకొని రావడానికి మోర్గను ఎంతగా శ్రమ పడ్డారో, ఎంతగా కృషి చేశారో యిప్పుడు ఆ గ్రంథాన్ని తెలుగు భాషలోకి అనువదింప జేసి, ముద్రించి పాఠకులకు అందించడానికి ఆరు మాసాలు పట్టిందని చెప్పడానికి సంకోచపడం.

ఈ పుస్తకం తెల్గు భాషలోకి రావడం గురించిన విషయం చాల ఆసక్తికరంగా వుంటుంది. అందుకని ఆ విషయాన్ని సహృదయులైన పాఠకుల ముందు ఉంచుతున్నాం.

ఆంగ్ల భాషలో యీ పుస్తకం వెలువడి ఒక శతాబ్దం గడిచింది. మనకు స్వతంత్రం వచ్చిన తర్వాత మన దేశ భాషలు వికసించాయి. శాస్త్రీయ గ్రంథ పఠనం అవసరమైంది. 1982 లో ఆంగ్లప్రతి మనదేశంలో మొట్టమొదటి సారి ముద్రించబడింది. కాని యింత వరకు తెలుగు భాషలోకి మోర్గను వ్రాసిన యీ గ్రంథం రాకపోవడం చూచి మా మిత్రులు మిక్కిలినేని అక్కయ్యగారు బాధ పడ్డారు. వ్యధ పడ్డారు. తొలుత ఒంటరిగానే ఆలోచన చేశారు. దీన్ని ఎలాగైనా తెలుగు భాషలోకి తీసుకొని రావల్సిందేనని నిర్ణయించుకున్నారు. ఇక యిల్లు విడిచి సంఘంలోకి వచ్చి పడ్డారు. మిత్రులతో, సహృదయులతో, మేధావులతో సంప్రదించారు, చర్చించారు. ఆలోచనలు చేశారు. కొందరు నిరుత్సాహపర్చారు. మరి కొందరు యిది పనల కాదుగదా అన్నారు. ఇంకొందరు మాటలతో ప్రోత్సహించారు. బహు కొద్ది

మంది మాత్రం ప్రోత్సహించి ఆర్థిక సహాయం చేస్తామన్నారు. ఈ కృషి నిరంతరంగా ఆరు మాసాలు పాటు జరిగింది. మిత్రులు సోమూరి వెంకట్రామయ్య గారు ముందుకు వచ్చి అయిదువేల రూపాయలు సహాయం ప్రకటించడంతో అక్కయ్య గారు తలపెట్టిన కార్యక్రమానికి కొత్త ఊపు వచ్చింది. ఉద్యమ రూపమొచ్చింది. ఈ గ్రంథ ప్రచురణకు వెంకట్రామయ్య గారు పట్టుగొమ్మ అని చెప్పుకొనుటకు గర్వపడు తున్నాం. ఒక దశలో వారి చేయూత, ప్రోత్సాహం లేకుంటే ఏమి జరిగేదో! మా వరకే ఆ విషయాన్ని పరిమితం చేసుకొంటున్నాం. మేమొక సమన్వయ సంఘంగా ఏర్పడ్డాం. తరచు కల్సుకొంటూ, అడ్డంకులను తొలగించు కొంటూ వచ్చాం. ఈ మా కృషిలో మిక్కిలినేని సుబ్బారావు గారు అంతర్వాహినిగా వుంటూ మాకు తోడుగా నిలబడ్డారు. తెలుగులోకి మోర్గను పుస్తకం వస్తోందని బహిరంగ పర్చాం. పలువురు ప్రోత్సాహకాలు పంపారు.

అయితే అనువాదకులను వెదకుట కూడ అంత తేలికైందికాదు. ప్రచురణకర్త యీ వ్యవహారంలో వివేకంతో వ్యవహరించాలి. అనువాదకుల్లో అనుభవజ్ఞులు సుప్రసిద్ధులు మహీధర రామ్మోహనరావు గారు. వారిని కలిసి అక్కయ్య గారు ఏన్షెంటు సొసైటీని తెనిగించమని కోరడమే తరువాయి. వారు మహదానందంతో, సంతృప్తితో అంగీకారాన్ని తెల్పి, పట్టుదలతో అనువదించి సకాలంలో మాకు అందించారు. తర్వాత అక్కయ్యగారు కావలసిన ధనం సేకరించి యీ పుస్తకాన్ని మార్కెట్టులోకి తీసుకువచ్చే వరకు విశ్రమించలేదు.

మిత్రులు మాకినేని బసవ పున్నయ్య, వి. రాఘవాచారి గార్లు యీ పుస్తకానికి ఉపోద్ఘాతములు వ్రాసి మా యీ గ్రంథ ప్రచురణను ప్రోత్సహించినందుకు వారికి మా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

మా యీ ముద్రణకు ఆర్థికంగా పాటుపడిన వదాన్యులకు మా ధన్యవాదములు.

సకాలంలో యీ పుస్తకాన్ని అచ్చువేసి యిచ్చిన చైతన్య ప్రింటర్స్ వారికి, టైటిలు పేజీని తీర్చిదిద్దిన విశాలాంధ్ర విజ్ఞాన సమితి వారికి, అభినందనలు.

తెల్గు పాఠకలోకం మా యీ కృషిని ప్రేమతో స్వీకరించి యీ గ్రంథాన్ని 'ప్రతి ఒకరు చదివి తీరాలి' అను మా ఆశయాన్ని జయప్రదము చేయగలరని విశ్వసిస్తున్నాం.

అందరి సహకారాన్ని ఆకాంక్షిస్తూ — ఆపేక్షిస్తూ

ఇట్లు

26-1-1987 — ప్రకాశకులు

# మోర్గన్ విశిష్టత

జీవ శాస్త్రానికి డార్విన్ పరిణామ సిద్ధాంతం ఎంత ముఖ్యమో, ఆర్థిక శాస్త్రానికి మార్క్సు అదనపువిలువ సిద్ధాంతం యెంత ముఖ్యమో, నాగరిక ప్రజలలో కనిపించే తండ్రిపరంపర గణాలకు పూర్వం తల్లి పరంపరగణాలు వుండేవని మోర్గన్ కనిపెట్టిన అంశంకూడా అంతే ముఖ్యం దీనిని ఆధారంచేసుకొని ఆయన కుటుంబవ్యవస్థయొక్క చరిత్రను మొట్టమొదటిమారు రేఖామాత్రంగా చిత్రించాడు కుటుంబవ్యవస్థయొక్క పరిణామంలో వచ్చే ప్రధాన దశలను ఆయన దానిలో చూపాడు మనకు దొరికినంతవరకు సమాచారాన్నిబట్టి వానిని మనం స్వీకరించవచ్చును ఆదిమ చరిత్ర రచనలో ఒక నూతనయుగం దీనితో ప్రారంభమయిందనవచ్చును ఈ విజ్ఞానశాస్త్ర శాఖకు తల్లిపరంపర గణాలు కీలకం అయాయి వానిని కనిపెట్టి నప్పటినుంచీ మనం మన పరిశోధనలను ఏ దిశగా సాగించాలో, వేటిని పరిశోధించాలో, మన పరిశోధనల ఫలితాలను ఏ విధంగా వర్గీకరించాలో మనకు అర్థం అయింది అందుచేత ఇతఃపూర్వంకన్న మోర్గన్ పుస్తకం వచ్చాక ఈ విషయంలో మనం వేగంగా ముందుకు పోగలుగుతున్నాం

మోర్గన్ కనిపెట్టిన విషయాలను ఇప్పుడంతా అంగీకరిస్తున్నారు అంతకంటే, ఇంగ్లండులోని ఆదిమ చరిత్ర పండితులు, అవి తమవయినట్లే వుపయోగం చేసుకుంటున్నారు అంటే సరిగా వుంటుంది మన దృక్పథంలో వచ్చిన ఈ మార్పుకు కారణం మోర్గనేయని వారిలో ఒక్కరైనా బహిరంగంగా చెప్పరు ఇంగ్లండులో ఆయన పుస్తకం సాధ్యమైనంతవరకు కనబడకుండా చేశారు ఆయన వ్రాసిన వెనుకటి పుస్తకాలేవో పేర్కొని వాటి రచయితగా అభినందిస్తున్నారు ఆయన కనిపెట్టిన మహత్తర విషయాలను గురించి పెదవి విప్పరు వానిని సమర్థిస్తూ చేసిన వివరణలను పట్టుకొని విమర్శలు సాగిస్తారు 'ప్రాచీన సమాజం' మొదటి ముద్రణ అయిపోయింది ఈ మాదిరి పుస్తకాలు అమెరికాలో ఎక్కువగా అమ్మవు ఇంగ్లండులో చూస్తే ఈ పుస్తకాన్ని పనికట్టుకుని కనబడకుండా చేసినట్లు కనబడుతూంది నూతన యుగాన్ని నిర్మించిన ఈ ఉద్గ్రంథం ఇప్పుడు మార్కెట్టులో జర్మన్ భాషలో మాత్రమే దొరుకుతూంది

దీనికి కారణం ఏమిటిః ప్రాచీనచరిత్ర పండితులు తమ రచనలలో మర్యాద కోసం ఆయన పుస్తకాలనుంచి చాలా భాగాల నుదహరిస్తున్నారు ఇతర విధంగా

మర్యాదలు చూపుతున్నారు అయినా ఆయన పుస్తకం మార్కెట్టులో దొరకదు. దీనిని చూస్తే బుద్ధిపూర్వకంగానే మూకీభావం వహించి దానిని వ్యాప్తిలోకి రాకుండా చెయ్యాలనే తలపెట్టారనిపిస్తుంది దీనికి కారణం, మోర్గన్ అమెరికను కావడం కాదుగదా? తమకు కావలసిన విషయాలను సేకరించుకోవడంలో బ్రిటిష్ ప్రాచీనచరిత్ర పండితులు చూపే శ్రద్ధా జాగ్రత్తా ప్రశంసనీయాలు ఆ విషయాలనూ తమ భావాలను ఒక క్రమపద్ధతిలో పెట్టుకొనేటందుకు కావలసిన దృక్పథాన్ని ఇద్దరు విదేశీయులనుంచి బాకోఫెన్ మోర్గన్‌లనుంచి తీసుకోవలసి రావడం వారికి బాధ అనిపిస్తుందో, యేమో జర్మనీవాడంటే, పోనీ అనుకోవచ్చు కాని అమెరికను ! అమెరికా దేశీయుని ముందు, బ్రిటిష్ వాళ్ళలో దేశభక్తి ఆవేశాలు పొంగిపొరలుతాయి. నేను అమెరికాలో వున్నప్పుడు చాలా తమాషాయైన సంఘటనలను చూశాను దీనికి తోడు ఇంగ్లండులోని ప్రాచీనచరిత్ర పండితులందరికీ మాక్లెన్నాన్ నాయకుడూ ఆది పురుషుడూను శిశుహత్యలు బహుభర్తృత్వం తల్లి పరంపర కుటుంబాలలో రాక్షస వివాహపద్ధతులు గురించి ఆయన తయారుచేసిన ఊహాజనిత సిద్ధాంతాలను ఎంతో భక్తి విశ్వాసాలతో పునరుచ్చరిస్తుంటారు బహిర్వివాహ పద్ధతినీ అంతర్వివాహ పద్ధతినీ అనుసరించే పరస్పర వ్యతిరేకములయిన తెగలు వున్నాయంటూ ఆయన చేసిన సిద్ధాంతాన్ని ఎవరన్నా కాదంటే మీదపడిపోతారు దైవదూషణగా భావిస్తారు ఆ తప్పు సిద్ధాంతాలను ఎగరకొట్టేసిన మోర్గన్‌వారి దృష్టిలో దైవద్రోహం చేసినట్లే పైగా ఆయన (మోర్గన్) తన అభిప్రాయాల్ని బహు సున్నితంగా పెట్టాడు వాటిని విన్నవాళ్ళెవరూ కాదనలేరు అంతవరకూ బహిర్వివాహ పద్ధతికీ అంతర్వివాహ పద్ధతికీ మధ్య కొట్టుమిట్టాడుతున్న మాక్లెన్నాన్ భక్తులు ఆ వాదాన్ని వినగానే ఆశ్చర్యంతో జుట్టు పీక్కోవలసివచ్చింది "ఇంత స్వల్పవిషయం ఇంతకాలంగా మనకెందుకు తోచలేదా" యనివాళ్ళ ఆశ్చర్యం

ఇదేమీ చాలనట్లు మోర్గన్ నాగరికతను విమర్శించాడు పెట్టుబడిదారీ సమాజాన్ని విమర్శించాడు ఫౌరియర్ ధోరణిలో ఈ నాటి సామాజిక వ్యవస్థకు పునాదిగా వున్న వర్తకపు సరుకుల ఉత్పత్తి పద్ధతిని విమర్శించాడు కారల్‌మార్క్స్ ఉపయోగించే మాటలలో భావిసమాజ పరిణామాన్ని గురించి మాట్లాడాడు దానితో ఆయన పాపభాండం నిండింది. తగిన శిక్ష లభించింది మాక్లెన్నాన్‌కు ఆయన మీద కోపం వచ్చి "చారిత్రక దృక్పథం" ఆయనలో లేదన్నారు జెనీవా నివాసి ప్రొఫెసర్ గిరాడ్ తులా కూడా 1884లో మోర్గన్ గురించి అదేమాట అన్నాడు నిజానికి

మాక్లెన్నాన్ తెచ్చిన బహిరంతర్వివాహం మధ్య చిక్కుపడి పదేళ్ళ క్రితం యీ గిరాద్ తులా గింగిరు లాడి పోతూ వుంటే (1874 Origine de la famille) మోర్గనే అయనను బయటకు లాగారు

ప్రాచీన చరిత్రలో మోర్గన్ తీసుకొచ్చిన ఇతర మార్పుల్ని గురించి ఇక్కడ వ్రాయడం నాకు అనవసరం అవసరమైనంత వరకు పుస్తకం లోనే ఎక్కడికక్కడ వుదహరించాము ఆయన వ్రాసిన ఈ ప్రధాన గ్రంథం వెలువడి అప్పుడే పద్నాలుగేళ్ళయింది ఈ మధ్య కాలంలో ప్రాచీన కాలపు మానవ సమాజ వ్యవస్థను గురించి మనకెన్నో కొత్త సంగతులు తెలిశాయి మానవజాతి విజ్ఞాన శాస్త్రజ్ఞులు, దేశ సంచారులు ప్రాచీన చరిత్ర పండితులే గాక వేర్వేరు కాలాలలోని ధర్మశాస్త్రాల్ని ఒక దానితో ఒకటి పోల్చి అధ్యయనం చేస్తున్నవారు కూడా రంగంలోకి దిగారు అనేక కొత్త సంగతులనూ ఆలోచనలనూ మనముందు పెట్టారు దీని ఫలితంగా కొన్ని విషయాలలో మోర్గన్ ఆలోచనలు తప్పు అని తేలింది కాని ఆ కొత్త విషయాలేవీ ఆయనే చెప్పిన ప్రధానాంశాలను తోసివేయలేదు ప్రాచీన కాలపు చరిత్రను ఆయన అమర్చిన పద్ధతే మొత్తం మీద ఈ నాటికీ చెల్లుబడి అవుతూ వుంది ఈ అభివృద్ధిని తెచ్చిన రచయితను దాచిన కొద్దీ అది అధికాధికంగా జనాదరణ పొందుతూందని కూడా మనం చెప్పవచ్చు

ఫ్రెడరిక్ ఏంగిల్సు
లండన్ 16 జూన్ 1891

# మోర్గన్ ముందుమాట

మానవుడు భూమి మీద పుట్టి చాలా చాలాకాలం - అయిందని నిర్ధారణ అయింది దానికి రుజువులు ముప్పయ్యేళ్ళ ఈ మధ్యనే దొరకడమూ ఈ తరం వారే ప్రథమంగా అటువంటి అతి ప్రధాన విషయాన్ని గుర్తించడమూ చిత్రంగా కన్పిస్తుంది

హిమానీ యుగం ఆరంభం నాటికే యూరపులో మానవుడు వుండినట్లు స్పష్టమయింది అంతకు పూర్వపు హిమానీ యుగం నాటికే అతడు వుండివుండవచ్చు అతడు తన కాలంనాడున్న అనేక క్రూర మృగాల బారినుంచి బయట పడ్డాడు మానవ కుటుంబ శాఖలు అనేకం అభివృద్ధి క్రమంలో పురోగమించేయి

వారి జీవయాత్ర భౌగోళిక దశలకు ముడిపడి వున్నదనడం చేత చిన్న - చిన్న కాలవ్యవధుల గణనం నిరుపయోగం ఉత్తరార్ధగోళంలో హిమానీనదాలు అదృశ్యమయి ఒకటి రెండు లక్షల సంవత్సరాలయి వుంటుంది ఆకాలం ఎంత అనేది చెప్పలేము అయితే మనుష్యుడు పుట్టి ఎంతెంతో కాలం అయిపోయింది అని చెప్పడానికి సందేహించనక్కరలేదు

అటవికులకూ అనాగరికులకూ మధ్య అనాగరికులకూ నాగరికులకూ మధ్య వుండిన సంబంధాల గురించిన అభిప్రాయాలను ప్రస్తుత పరిజ్ఞానం ఎంతగానో మార్చేస్తూంది నాగరికతకు ముందు అన్ని తెగలలో అనాగరిక దశ కొనసాగినట్లే దాని ముందు అటవిక దశ వున్నదని నేడు గట్టిగా సాక్ష్యాధారాలతో రుజువు చేయవచ్చు మానవజాతి చరిత్రకు మూలం ఒక్కటే వారి అనుభవం అభివృద్ధి ఒకే మాదిరిగా వున్నాయి

ఇంతింత కాలాన్ని మనుష్యజాతి ఏ విధంగా గడిపిందో అటవికులు కదులుతున్నట్లు కూడా కనిపించనంత నెమ్మదిగా అనాగరికుల స్థాయికి ఎల్లా చేరేరో అదే విధంగా అనాగరికులు నెమ్మదిగా పురోగమించి నాగరిక దశను చేరుకున్నారో కొన్ని జాతులూ తెగలూ ఈ పురోగమనంలో వెనకబడ్డారో తెలుసుకోవాలనిపించడం సహజం ఈ ప్రశ్నలకు సమాధానం దొరుకుతుంది

మానవుని పురోగమన మార్గం పొడుగునా వేర్వేరు దశలలో కల్పనలూ అన్వేషణలూ పరస్పర సంబంధం కలిగి వుంటాయి విరామం లేని మానవానరాల దృష్ట్యా అతి ప్రాథమికములైన కొద్దిపాటి ఆలోచనలను నుంచి సామాజిక పౌర నియమాలు వస్తాయి మానవుని అనుభవాలకు నిదర్శనంగా ఈ నీతి నియమాలూ

కల్పనలూ అన్వేషణలూ నిలిచి వున్నాయి వాటిని సరి పోల్చి చూసినప్పుడు మానవ జాతి అంతా ఒక్కటేనని ఒకే అభివృద్ధి దశలలో ఎక్కడ వున్నా వారి కోరికలు ఒక్కలాగే వుంటాయనీ సమాజంలో పరిస్థితులు ఒక్కలాగే వున్నప్పుడు వారి మనస్సులు ఒక్కలాగే పనిచేస్తాయనీ సూచిస్తాయి

ఆటవిక యుగం ఉత్తర భాగం లోనూ అనాగరిక యుగం కాలమంతటానూ మానవజాతి గణాలు ఫ్రాత్రీలు, తెగలుగా ఏర్పడి వుంది ప్రపంచమంతటా అన్ని ఖండాలలోనూ ఈ సంస్థా రూపాలే వున్నాయి అవే ఆ ప్రాచీన కాలంలో సమాజాన్ని నిలబెట్టి వుంచేయి వాటి నిర్మాణ రూపం, వాటి మధ్యనున్న సంబంధాలు వాటి వాటి సభ్యుల హక్కులూ బాధ్యతలూ మానవుని మెదడులో ప్రభుత్వ భావన పెరిగిన విధానాన్ని చూపుతున్నాయి మానవజాతి యొక్క ప్రధానములైన నీతి నియమాలు ఆటవిక యుగంలోనే వచ్చేయి అనాగరిక యుగం వర్ధిల్లేయి నాగరిక దశలో పక్వమయ్యేయి అదే విధంగా కుటుంబం కూడా క్రమంగా అనేక రూపాలు పొందింది రక్త సంబంధాలు బంధుత్వాలు ఏర్పడ్డాయి. అదే ఈనాటికీ కొనసాగు తున్నాయి ఈ నియమాలు ఆయా కాలం నాటి కుటుంబంలో వుండే బంధుత్వాలను నమోదు చేస్తుంటాయి కుటుంబం రక్త సంబంధీకుల వ్యవస్థ నుంచి మధ్యంతర దశలు గడచి దంపతీ వ్యవస్థకు చేరుకునే వరకూ మానవజాతి పొందిన అనుభవాలను ఇది గుర్తు చేస్తున్నాయి

ఆస్తి భావన కూడ ఇదే మాదిరిగా వృద్ధి పొందింది ఆటవిక యుగంలో నామ మాత్రంగా వున్న ఆస్తి పెంపొంది జీవనోపాధికి ప్రతినిధిగా విపరీతమైన మమకారాన్ని కల్గించి నాగరిక జాతుల మనస్సులను పూర్తిగా ఆకట్టుకుంది.

పైన చెప్పిన నాల్గు తరహాల సంఘటనలూ మానవుడు ఆటవిక దశ నుంచి నాగరిక దశకు ఎదిగిన క్రమంలో పక్క పక్కనే విస్తరించిన క్రమాన్ని యీ పుస్తకంలో చూపించదలిచాను

అమెరికనులైన మనం యీనాడు ప్రత్యేక శ్రద్ధతో బాధ్యత వహించి ఒక పని చేయవలసి వుంది అమెరికా ఖండంలో భౌతిక సంపద అత్యధికంగా వుంది అదే విధంగా మానవజాతి దశా విశేషాలు, భాషా సంబంధమైన, పురావస్తు సంబంధమైన వస్తువులు ఇతర ఖండాలలో కంటె యిక్కడ అధికంగా వుండి అనాగరిక మహాదశ రూపాన్ని చూపుతున్నాయి. మానవజాతి మూలం ఒక్కటే వివిధ ఖండాలలో ఒకే మాదిరి వేర్వేరు మార్గాలలో సాగినప్పటికీ వారి జీవిత పద్ధతి

# XI

ఒక్కటే మానవ తెగల్లో జాతుల్లో అన్నింటా అభివృద్ధి దశలు ఒకే విధంగా వుంటాయి అంటే అమెరికను యిండియనుల చరిత్ర అనుభవంలో కొంచె మించుగా అదే స్థాయిలో వున్నప్పటి మన పూర్వీకుల చరిత్ర అనుభవమూ కన్పిస్తుంది వారి ఆచార వ్యవహారాలూ కళలు కల్పనలు అన్వేషణలు అనుభవాలు మానవజాతి సంపదల్లో భాగం. అమెరికను యిండియనుల కంటె అవి మనకు అమూల్యములు

మనం అమెరికను యిండియనుల గురించి కనుక్కున్న నాటికే వారిలో విస్పష్టమైన మూడు మానవ దశలు వున్నాయి ప్రపంచంలో ఎక్కడా లేని విస్పష్ట రూపంలో అవి యిక్కడ కనిపిస్తున్నాయి మానవజాతి దశలు భాషలు పురాతత్వ వస్తువుల సమాచారం చాల ఎక్కువగా వుంది కాని యీ శాస్త్రాలు గత శతాబ్ది వరకు యించు మించు లేనేలేవు ఈ నాటి వరకు వానిలో విశేష కృషి జరగడం లేదేమో కార్య కర్తలు తగు సామర్థ్యం చూపలేకున్నారు శిలాజాలు నేలలో కప్పబడి వుండి భవిష్యత్తు పరిశోధకునికి దొరుకుతాయి కాని కళలు భాషలు నీతి నియమ వ్యవస్థలు అలా వుండిపోవు అవి మూడు శతాబ్దాల కంటె మించి ప్రాతవు అమెరికను నాగరికత ప్రభావం వలన ఆ యిండియను తెగల తెగ జీవితం నిర్మూలించబడుతూ ఉంది వారి కళలు భాషలు అదృశ్యమౌతున్నాయి వారి నీతి నియమ వ్యవస్థ నీరు కారిపోతూంది ఈనాడు కొద్దిపాటి శ్రమతో సంపాదించగల సమాచారం కొన్ని ఏళ్ళుపోతే మరి దొరకదు అమెరికనులు ఈ రంగంలో ప్రవేశించి వారి అపారమైన సంపద నెంతైనా సేకరించ వలసిన అవసరాన్ని నేటి పరిస్థితులు చాటుతున్నాయి

# మోర్గన్ రచించిన "పురాతన సమాజం"

లూయి హెన్రీ మోర్గన్ అనే మానవ సమాజ పరిణామశాస్త్రవేత్త 1818లో జన్మించి, 1881లో మరణించాడు. ఆయన న్యూయార్కు నగరంలో న్యాయవాదవృత్తి చేస్తుంటూ సెనెకా అనే ఆటవిక తెగకు సంబంధించిన వారి భూమి తగాదాలో ఆ సెనెకా తెగతో సంబంధం పెట్టుకున్నారు. సెనెకా తెగకు చెందిన భూమిని కాజేయ చూచిన ఒక అమెరికన్ కంపెనీకి వ్యతిరేకంగా పనిచేసి, ఆటవిక తెగకు చెందిన సెనెకా ప్రజల హక్కులను కాపాడి వారి అపార గౌరవ ప్రేమలకు పాత్రుడయ్యారు. సెనెకా తెగలోనే గాకుండా ఆయన అనేక ఇతర ఆటవిక జాతి ప్రజలకు అత్యంత సన్నిహితుడయ్యాడు. ఆ క్రమంలో సెనెకా తెగ, మోర్గన్‌కు అపార గౌరవమిచ్చి తమ తెగలో సభ్యత్వం గూడా ఇచ్చారు. మోర్గన్‌కు క్రమేపి తన న్యాయవాద వృత్తి కంటె అమెరికాలోని ఆటవిక జాతుల జీవిత విధానం అధ్యయనం చేయడంపై ఎక్కువ ఆసక్తిగల్గి, ఒక మహోన్నత సామాజిక తత్వవేత్తగా (Anthropologist)గా పరిణమించాడు.

లూయి హెన్రీ మోర్గను 1851లోనే ఇరాకీ జాతి సమాఖ్యను గూర్చి తన ప్రథమ గ్రంథాన్ని ప్రచురించాడు. 1870వ సంవత్సరంలో మానవ కుటుంబాల పరిణామం వాని రక్తసంబంధాల పూర్వాపరాలు అన్న మరొక కొత్త గ్రంథాన్ని రచించాడు. మరికొన్ని సంవత్సరాల ఆటవిక సమాజ ప్రజా జీవితాన్ని అధ్యయనం చేసిన తరువాత 1877లో పురాతన సమాజం అనే మహోద్గ్రంధాన్ని వ్రాశాడు. ఒక విధంగా చెప్పాలంటే ఒకరినొకరు కలుసుకునే అవకాశం లేకుండా వేల మైళ్ళ దూరంలో ఉండి, మోర్గన్ మార్క్సు—ఎంగెల్సుల సమకాలికుడుగ సహచరుడుగ పనిచేశాడు. వివిధ గట్టి వీలులేని విషయాలను గ్రంధస్తంచేసి మోర్గన్ మానవ కోటికే ఎనలేని జ్ఞాన సంపదను అందించగలిగాడు. ఈయన వ్రాసి ప్రపంచ ప్రజలకు వదలిపెట్టి వెళ్ళిన గ్రంథాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేస్తే తప్ప ఎన్ని పరిశోధ ఉపోద్ఘాతాలు వ్రాసినా మోర్గన్ రచనలకు న్యాయం సమకూర్చడం అసంభవం.

మోర్గన్ యొక్క మహా మేధాశక్తిని గూర్చి ఫ్రెడరిక్ ఎంగెల్సు వ్రాసిన మాటల సారాంశం చెప్పడం నా విద్యుక్త ధర్మంగా భావిస్తున్నాను. మహా విజ్ఞాన ఖనియైన మార్క్సు మహనీయుడే తాను తనంతటే 1844–45 సంవత్సరాల కాలంలో నిర్ణయానికి వచ్చిన విషయాలకు మోర్గన్ చేసిన ప్రత్యేక పరిశోధనా ఫలితాలు ఉన్న

చారిత్రక భౌతికవాద పునాదుల యొక్క అత్యంత ప్రాముఖ్యతను విశదీకరించాలని భావించాడు 1844 40 సంవత్సరాలలో మార్క్సు సామాజిక పరిణామ క్రమంలో అనాగరిక యుగం, నాగరికతాయుగం ఎలా ఆవిర్భవించి అంతరించాయన్న అభిప్రాయాలకు వచ్చారో అదే అభిప్రాయాలకు తన స్వయంకృషితో మోర్గన్ వచ్చారని ఎంగెల్సు వ్రాశారు మార్క్సు రచించిన కాపిటల్ గ్రంథాన్ని ఒకవైపు గ్రంథచౌర్యం చేస్తూ మరోవైపున దాన్ని దుర్మార్గంగా త్రొక్కిపడుతూ జర్మను అస్థాన ఆర్థిక శిష్యులు ఏ రీతిగ వ్యవహరించారో మోర్గన్ యొక్క పురాతన సమాజం అనే గ్రంథాన్ని గూడ పాతాళ లోకంలో పాతిపెట్టాలని ఇంగ్లండులోని సామాజిక శాస్త్ర పండితులంతా ప్రయత్నించారు మోర్గన్ యొక్క ప్రత్యేక విశిష్టత ఏమంటే రచనాత్మకమైన చరిత్రలేని కాలంలోని మానవ సమాజ పునాదులను పరిశీలించడం ప్రధానమైన విజయం మోర్గన్ వ్రాసిన పురాతన సమాజం ఏ ఒక్క రోజులోనో పూర్తి కాలేదు ఈ సమస్యపై మోర్గన్ దాదాపు నలభై సంవత్సరాలు కృషి సల్పారు అందుచేత ఆయన రచించిన గ్రంథం ఒకానొక యుగంలో వెలువడ్డ గ్రంథాలలో అగ్రతాంబూలం అందుకుంటున్నది ఈ వివరణ తర్వాత మోర్గన్ యొక్క మహా గ్రంథాన్ని మరింత ప్రముఖంగా వివరించబూనుకోవడం ఒక దుస్సాహస చర్యగా తయారవుతుంది

ఎంతగానో కృషిచేసి, పెద్దగా శ్రమచేసి దీన్ని తెలుగు భాషలోకి అనువదించిన శ్రీయుత మహీధర రామమోహన్ గారికి తెలుగువారం ఎంతైనా ఋణపడి ఉంటాం ఈ అనువాదానికి అనేక విధాల ప్రోత్సాహమిచ్చిన శ్రీ మిక్కిలినేని అక్కయ్యగారికి అనేక ధన్యవాదాలందజేయాలి

ఇంతకుమించి ఈ గ్రంథానికి పరిచయ వాక్యాలు వ్రాయడం ఒకదుస్సాహసం ఆ పనికి పూనుకోనందుకు పాఠకులు నన్ను మన్నించాలి

[సం] మాకినేని బసవపున్నయ్య

# అనవసరమే, అయినా చెప్పక తప్పదు

సమాజ పరిణామ క్రమాన్ని అత్యంత విశదంగా సవివరంగా శాస్త్రీయంగా పరిశీలనచేసి లూయీ హెన్రీమోర్గాను మహాశయుడు కూర్చిన ఉద్గ్రంథం పురాతన సమాజం మానవజాతి సప్రామాణికమైన వివేచనా పద్ధతుల్లో సమాజాన్నీ ప్రకృతినీ పరస్పర సంబంధాలను నిరాఘాటమైన అభివృద్ధినీ అందుకుపడిన ప్రయత్నాలను ప్రయాసలను అర్థం చేసుకోవటానికి ఉపకరించినగ్రంథాల్లో అధ్యయనాల్లో అన్వేషణల్లో దక్కిన కొద్దిపాటి సరసన సగర్వంగా నిలబడగల ప్రతిభ ఈ గ్రంథానికి వుంది

ముద్రణా పరిశ్రమలో పుస్తక ప్రచురణలో వచ్చిన సాంకేతిక అభివృద్ధి ఫలితంగా ఈనాడు అన్నిభాషల్లోను రచనా వ్యాసాంగం కొత్తపుంతలుతొక్కి శరవేగమే కాదు,అణువేగంతో వర్ధిల్లుతోంది ఈ సాంకేతిక సాధనాలను ప్రక్రియలను స్వార్థపర తిరోగామి అభివృద్ధి నిరోధకవర్గాలు ప్రపంచవ్యాప్తంగా దోపిడీ ప్రయోజనాలకై ఎంతగా దుర్వినియోగం చేస్తున్నా మానవాళి శ్రేయస్సుకు వాటిని వినియోగించగల సానుకూలావకాశాలను చూడకుండా తోసిపుచ్చడం అవివేకమవుతుంది సముద్ర మధనములో అమృత మొచ్చేదాకా గరళంకూడ వచ్చింది అయినా దానికి వెరచి ఫలితార్థం వచ్చేదాకా ఆ ప్రయత్నం మానని పురాణోపమానాన్ని యిక్కడ ప్రస్తావించడం అసందర్భం కాదు

సర్వశాస్త్రాలు సమస్తవిజ్ఞానము సకల కళారూపాలు విస్తృతంగా ప్రజా సామాన్యానికందుబాట్లోకి తేవడములో ఈ సాంకేతిక పరిణామాన్ని తక్కువ అంచనా వేయరాదు. ఒకనాడు సమాజంలో ఏ కొద్దిమంది సంపన్నులకో శిష్టులకో మాత్రమే లభ్యంగావున్న సమస్తం ఈనాడు సామాన్యులకు లభ్యంకాగల అవకాశాలున్నాయి వీటిని సద్వినియోగం చేసుకోవడం ఆయా సామాజిక వ్యవస్థల స్వభావంపైన ఆధారపడి వుంటుంది. సోషలిజం ధ్యేయంగా వాస్తవవిప్లవ పరిణామాలు సంభవించిన సోవియటు యూనియన్ యితర సోషలిస్టుదేశాలలో ఈ అవకాశాలుకూడ అందుకు అనుగుణ్యంగానే ఆచరణలో కొస్తున్నాయి వ్యష్టి వ్యాపార ధోరణులు రాజ్యమేలుచున్న పెట్టుబడిదారీ ప్రపంచంలో ఈ అవకాశాలు ముఖాముఖి ఉద్యమం గాఎంచుకొన్న విలువలకు వ్యతిరేకంగా కొందరైన దోపిడీవర్గ దుర్గాధిపతుల లాభాపేక్షకు దుర్వినియోగపడుతున్నాయి కొడవటిగంటి కుటుంబరావుగారు ఒక సందర్భంలో చెప్పినట్లు మార్పుల

వల్ల అందరికీ అందుబాటులోవుండే సాహిత్యం అందరికీ అర్థమయ్యే సాహిత్యం మాత్రం ఎంఖాను ఎంఖాలుగా వస్తూనేవుంది అయితే ఇలా వచ్చివడే సాహిత్యం అందరి ప్రయోజనాలకు శ్రేయస్సుకు పనికివచ్చేదేనా అంటే అది ప్రశ్నార్థకమే?

కాలక్షేపానికో సాంఘిక మానసిక దౌర్బల్యంపై వ్యాపారానికో జీవ జుగుప్సా ధోరణులు పెచ్చరిల్లటానికో ఆ మోతాదులో ఈ లక్ష్య రహితమైన జీవన పద్ధతుల్ని వగిషి నాటకులలో రమ్యాతిరమ్యంగా చిత్రించే మత్తు గమ్మత్తుల రచన లకు ఈనాడు ప్రపంచంలోను మనదేశంలోను కొదవలేదు 1987లో వెనక్కి తిరిగి చూస్తే కొన్ని మినహాయింపులతో మనతెలుగు ప్రచురణరంగం దుస్థితికూడ అదేనని విచక్షణ శీలురు ఒప్పుకోవక తప్పదు ఈ సాధారణ సూత్రానికి అపవాదుగా తెలుగులో వస్తున్న ప్రచురణలో ఈ పురాతన సమాజం నిస్సందేహంగా ఉగ్గడించతగింది అలాంటి ఉత్కృష్ట గ్రంథాన్ని తెలుగు పాఠకులకు సులభశైలిలో సాపేక్షికంగా స్వల్పమూల్యంలో అందించే సాహసానికి సంకల్పించిన పురోగామి మిత్రులు సర్వశ్రీ సోమూరి వెంకట్రామయ్య మిక్కిలినేని అక్కయ్య మిక్కిలినేని సుబ్బారావు మహాధర రామమోహనరావు ప్రభృతి పెద్దలకు అభినందనలు

ఈ పుస్తకం ఉబుసుపోకకు చదువుకొనే గ్రంథం మాత్రంకాదు కిష్టపడి అధ్యయనం చేయవలసిన విజ్ఞాన ఖని లాంటది కాని ఆ కష్టార్జిత ఫలితం మాత్రం పాఠకుని నిస్సందేహంగా వివేచనా పరునిగా తీర్చిదిద్దుతుంది ఇప్పుడు మనం నాగరిక సమాజంగా భావిస్తున్నదెలా అభివృద్ధి క్రమంలో స్థాయిలో మానవ ప్రయత్నాలవల్ల సామాజిక సంబంధాలవల్ల మారుతూవస్తున్నదో ఆ తెలివి తప్పకుండా కల్గుతుంది ఈ పరిణామ వికాసాలలో మానవాతీతమైన శక్తుల ప్రమేయం ఏ మాత్రమూ లేదనికూడ స్పష్టమవుతుంది మనిషి తన చరిత్రను, సమాజాన్ని సాంఘిక వ్యవస్థలను, ఆర్థిక సంబంధాలను ఉత్పత్తిశక్తుల అభివృద్ధిని, శాస్త్ర విజ్ఞానాన్ని ఎలా నిర్మించుకొంటూవచ్చాడో ఆ మహేతిహాసం కళ్ళకుకట్టినట్లు కనబడుతుంది అంతేకాదు స్పర్థలు వైరుధ్యాలు వైషమ్యాలు వర్గఘర్షణలులేని సమాజమే అనంతమైనకాల గమనంలో ఎక్కువభాగం వుండేదనీ వర్గసమాజం వర్తమానయుగంలో స్థూలదృష్టికి ఎంత శక్తివంతంగాతోచినా తిరిగి వర్గాలు వైరుధ్యాలులేని ఆ సమాజాన్నే మానవవాళి శాస్త్ర సాంకేతికాధునిక సాధనాలద్వారా వినూత్నస్థాయిలో పునర్నిర్మించుకో గలదనే ప్రగాఢ విశ్వాసం వివేకం కలుగుతుంది

పాతవ్యవస్థ పునాదులలోనే కొత్తవ్యవస్థకు బీజప్రాయంగా అంతర్గతమైన సామాజికశక్తులు నిబిడీకృతమై ఉంటాయనీ ఆ శక్తులను స్వాధీనంలోకి తెచ్చుకోవడం ద్వారా నూతన సమాజం వర్గాలు దోపిడీలేని సమాజం దిశగా చైతన్య శీలురైన మానవులు పురోగమిస్తారని సూత్రప్రాయంగా ఈ మహద్గ్రంథం సూచిస్తుంది ఆ వైపు లోతైన ఆలోచనలకు కార్యాచరణకు ప్రేరణ అవుతుంది సోషలిస్టు సిద్ధాంత ప్రవక్తలు కారల్ మార్క్స్ ఫ్రెడరిక్ ఏంగెల్సులు రూపొందించిన మహత్తర గతితార్కిక చారిత్రక భౌతిక వాదానికి లక్ష్యలక్షణ సమన్వితమైన నిదర్శన గ్రంథంగా ఈ పురాతన సమాజం దర్శనమిస్తుంది అందుకే ఏంగెల్సు మహాశయుని సువిఖ్యాత రచన— కుటుంబం ఆస్తి రాజ్యాంగం పుట్టుక పరిశోధనా గ్రంథానికిది ఎంతో దోహదకారి అయింది దానికి మోర్గన్ పేర ఉపశీర్షిక పెట్టడంద్వారా ఏంగెల్సు ఆ గ్రంథ ప్రాభవవిస్తృతిని శాస్త్ర వైదుష్యాన్ని సామాజిక పరిణామగాథను తెలిపే స్వభావాన్ని వక్కాణిస్తూ గౌరవం వ్యక్తం చేశారు అందుకే సమాజ పురోగామి ఆశయశుద్ధి, లక్ష్యసిద్ధి కలవారంతా ఏ దేశంలోనైనా ఏ భాషలోనైనా జీవితంలో ఒక్కసారైనా తరచి తరచి చదువతగిన చదువవలసిన గ్రంథం పురాతన సమాజం

డార్విను పరిణామవాద గ్రంథంతో న్యూటను భౌతికశాస్త్ర నిర్ధారణవల్లె మార్క్స్ కాపిటల్లో అధ్యయనంచేసి వెలుగులో ఆచరణను రూపొందించుకొని సమాజ శ్రేయోసాధనాలుగా సార్థకం చేసుకోవలసిందీగ్రంథం ఈ మహద్గ్రంథంలోని విశేషాలను వివరాలను, నిర్ధారణలను ఎవరికివారు తమశక్తికొద్దీ, అధ్యయనంద్వారా మాత్రమే అర్థం చేసుకోవలసి వుంటుంది ఇట్టి ఉత్తమగ్రంథాన్ని ఆమూలాగ్రం తెలుగు పాఠకలోకానికి అందించాలన్న సదాశయంతో ప్రయత్నించి ఆ కార్యభారంలో సఫలీకృతులైన మిత్రులందరికీ తెలుగు జాతి సదా ఋణపడి వుంటుందనడంలో అణు మాత్రం సందేహంలేదు

[సం] సి రాఘవాచారి

# ఈ పుస్తక ముద్రణకు సహకరించినవారు

**Morgan** వ్రాసిన **Ancient Soceity** అనే ఉద్గ్రంథాన్ని మహీధర రామోహనరావు గారి చేత తర్జుమా చేయించి ముద్రించటానికి సహృదయంతో సహాయం చేసిన వారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు అందిస్తున్నాను –

వారి పేర్లు యీ క్రింద పొందు పరుస్తున్నాను –

సర్వశ్రీ

1 మిక్కిలినేని కస్తూరి
2 సోమూరి వెంకట్రామయ్య
3 దాసరి నారాయణ శాస్త్రి
4 చలసాని ధర్మరాజు
5 మిక్కిలినేని రామ సుబ్బారావు
6 కోవెలమూడి బసవరావు
7 పోలవరపు మాధవరావు
8 వేములపల్లి హనుమంతరావు
9 తుమ్మల వెంకట కృష్ణారావు
10 పరుచూరి సాంబశివరావు
11 కోయ నరసింహారావు
12 కనకమేడల కొండయ్య
13 శాస్త్రి చంద్రమౌళి
14 అల్లూరి స్టాలిన్
15 Dr P B G తిలక్ & అరుణ
16 Dr కామినేని పట్టాభి రామయ్య
17 కానూరు చంద్ర శేఖరరావు
18 C నరసింహారావు
19 మిక్కిలినేని ముకుందరావు
20 కొట్రగడ్డ వెంకట నారాయణరావు
21 కొరపాటి సమత
22 కొరపాటి మమత
23 యమ్ రాఘవయ్య
24 యాడ్పుగంటి రామచంద్రరావు & పుష్పావతి
25 మిక్కిలినేని వెంకటేశ్వరరావు (సుబ్బయ్యగారి కుమార్లు)

— మిక్కిలినేని అక్కయ్య

# ఇందులో

## ఒకటో భాగం



## రెండో భాగం

## మూడో భాగం



## నాలుగో భాగం

# ఒకటో ప్రకరణం

# మానవ దశలు

**అట్టడుగు** స్థితినుంచి మానవుని పురోగతి—అన్వేషణలు కల్పనలు ఆచార నియమాల ఉదాహరణలు పాలనాంగం రెండు రూపాలు గణాల ద్వారా ఏర్పడిన సమాజం రెండోది రాజకీయంగా ఏర్పడిన రాజ్యం దీనిలో మొదటిది వ్యక్తులు గణాలు ప్రాతిపదిక మీద ఏర్పడింది రెండోది ప్రాంతాలు ఆస్తులు పట్టి ఏర్పడింది

—మొదటిది పురాతన సమాజంలోని పాలనాంగం రెండోది ఆధునిక నాగరిక సమాజపు ప్రభుత్వాంగం మానవుల అనుభవాలు ఒకే విధం మానవ దశల ప్రతిపాదన 1 అటవిక యుగం దిగువదశ 2 మధ్య దశ 3 ఎగువదశ 4 అనాగరిక యుగం దిగువదశ 5 మధ్యదశ 6 ఎగువదశ 7 నాగరికత దశ

మానవజాతి ఆదిమకాల పరిస్థితుల గురించి ఇటీవలి కాలంలో విశేష పరిశీలన జరిగింది వాని వలన మానవుడు తన జీవయాత్రను అట్టడుగునుంచి ప్రారంభించి, నెమ్మది నెమ్మదిగా అనుభవ జ్ఞానం కూర్చుకుని అటవిక దశనుంచి నాగరిక దశకు మార్గం వేసుకున్నాడు అని తేలింది

మానవ కుటుంబంలో కొన్ని శాఖలు నేటికీ అటవిక దశలోనే వున్నాయి మరి కొన్ని అనాగరిక దశలో వుండగా కొన్ని నాగరిక దశను అందుకున్నాయి ఈ మూడు దశల మధ్య సహజ సంబంధం ఒకటే కాక పురోగతి క్రమంలో తప్పని సరియైన అనుబంధం కూడా వుంది మొత్తం మానవ కుటుంబంలో ఈ దశలు ఒక క్రమంలో వచ్చేయనేది చారిత్రక సత్యం అభివృద్ధి పొందే క్రమంలో ప్రతి ఒక్క విభాగమూ ఒకటో రెండో అంతకన్న ఎక్కువేనో పరిస్థితులలో ఆయా దశలను చేరుకున్నాయి

మానవజాతి ఆదిమ దశలో చాలా మొరటుగా వుండేది అనుభవం ద్వారా వారి మానసిక నైతిక శక్తులు క్రమ వికాసం పొందేయి నాగరికతా పథంలో వారికి

అనేక అటంకాలు ఎదురైనాయి వానిని అధిగమించి ముందడుగు వేయడానికి వేల లక్షల సంవత్సరాలే పట్టేయని చెప్పడానికి ఎంతో సమాచారం దొరికింది ఈ పుస్తకంలో నేను వ్రాయదలచింది దానినే మానవుని పురోగతి మార్గంలో పొడుగునా అన్వేషణలూ కల్పనలూ ఒకటి తర్వాత ఒకటిగా ఎన్నో కనిపిస్తున్నాయి అనేకాదు అతనిలో అభిమానాలూ ఆలోచనల పెరుగుదలను సూచిస్తూ కుటుంబ నియమాలు కనిపిస్తున్నాయి ఈ రెంటినీ ఆధారం చేసుకుని గీసినదే ఈ చిత్రం

మానవుని ఆదిమకాల దశలలో అభివృద్ధి అనేక మార్గాలలో వచ్చింది అయా దశలలో కనిపించే అన్వేషణలూ కల్పనలలో ఆ దశాక్రమాన్ని అనుసరించి ఒక క్రమ పురోగతి కనిపిస్తూంది అయా దశాక్రమంలో మానవుల మధ్య విస్తరిస్తున్న అనుబంధాలను ఆనాటి నైతిక నియమాలు సూచిస్తున్నాయి వీటికీ అన్వేషణలూ కల్పనలకీ మధ్య కొంచెం ఇంచు మించు సరాసరి సంబంధం కనిపిస్తుంది అయితే నైతిక నియమాల స్థితివేరు అవి అతి స్వల్పమయిన ఆలోచనా బీజాలనుంచి పుట్టేయి నాగరిక దశకు చెందిన నైతిక నియమాల వేళ్ళు అనాగరిక దశలో వుంటే వాటికి బీజావాపం జరిగింది ఆటవికదశలో యుగ యుగాలుగా వస్తున్న సంబంధపు చారలో ఒక పురోగతి క్రమంలో అవి వరసగా సంక్రమిస్తూ వస్తున్నాయి

అంటే మన పరిశీలన రెండు మార్గాలలో జరగవలసివుంది ఒకటి అన్వేషణలు కల్పనల మీదుగా నడిచిన మార్గం రెండోది అతి ప్రాథమిక నైతిక నియమాలమీదుగా నడిచిన మార్గం దీనివలన సంపాదించిన పరిజ్ఞానంతో మానవ పురోగతి క్రమంలో ఏర్పడిన ప్రధాన దశలను సూచించగలమనే అనుకుంటున్నాను వానిని బలపరచే సమాచారం ప్రధానంగా కుటుంబ నైతిక నియమాల నుంచే లభిస్తుంది అవి సార్వజనికమూ ఇతరేతర విషయాలకు అనుబంధించి వుండేవీను కనక వానిని బౌద్ధికంగానే పరిశీలించ గలుగుతాం

కొన్ని భావాలు ఆశలు ఆశయాలు క్రమంగా ఏర్పడి అభివృద్ధి పొందినట్లు ఘటనలను పట్టి వూహించ గలుగుతాం వాటిలో ముఖ్యమైనవి కొన్ని కొన్ని నిర్దిష్ట భావనలతో అనేక రూపాలలో అనుబంధించి వున్నాయి ఆ భావనల పరిణామ రూపాలే అవి ఇక్కడ చెప్తున్నది అన్వేషణలు కల్పనలు గురించి కాదు పైన చెప్పినట్లు అతి ముఖ్యంగా పరిగణించబడే దశకు చేరిన భావాలూ ఆశలూ ఆశయాలూ ఇవి

1 జీవనోపాధి ఆహారం
2 పాలనాంగం ప్రభుత్వం
3 భాష
4 కుటుంబం
5. మతం
6 గృహం వాస్తువు
7 ఆస్తి.

మొదటిది ఒకదాని తరవాత ఒకటిగా సుదీర్ఘకాల వ్యవధులలో ప్రవేశపెట్టిన నిపుణతల ఫలితంగా జీవనోపాధి విస్తరించి పరిపూర్ణత పొందింది ఈ నైపుణ్యాలకి అన్వేషణలూ కల్పనలకీ ఇంచు మించు సరాసరి సంబంధమేవుంది

రెండోది ఆటవిక దశలోని కుదురులలోనే (ఒకే పూర్వపురుషుడు కల అనేక కుటుంబాల సమూహం) పాలనాంగపు బీజాలు కనిపిస్తాయి ఇది క్రమోత్తరంగా అనేక రూపాలలో విస్తరించి నేటి రాజకీయ వ్యవస్థగా పరిణామం పొందింది

మూడోది మోటుగా వుండే అతి సామాన్యమయిన భావప్రకటన ధ్వనుల నుంచి మానవుని మాట పెంపొందినదనిపిస్తుంది లూక్రేషియను చెప్పినట్లు సంజ్ఞల నుంచి నోటిమాట వచ్చి వుంటుంది ఏకాక్షరాల నుంచి పదాలు వాని నుంచి శ్లిష్టములైన మాటలు వచ్చివుంటాయి ఒక నిర్దిష్టమైన పద్ధతి ఏర్పరచుకొని చేసినది కాక పోయినా కంఠధ్వనులను ఉపయోగించుకొని మానవమేధస్సు వాగ్రూపమైనభాషను రూపొందించింది ఇదో పెద్ద శాస్త్రమే అయింది ఆ లోతులు మనకిక్కడ అవసరంలేదు.

నాలుగోది కుటుంబం పరిణామ దశలు రక్తసంబంధాన్ని పట్టి దగ్గర దూరపుతనంపట్టి ఏర్పడిన వ్యవస్థలు మూర్తిమంతాలు వైవాహికాచారాల్నిపట్టి కుటుంబరూపాల వరసక్రమాన్ని పట్టుకోవచ్చు

అయిదోది మతభావనల పెరుగుదలలోనే ఎంతో సంక్లిష్టతవుంది కనక వాటిని సంతృప్తికరంగా విశదీకరించడం ఎప్పటికీ జరగనిపని మతం అన్నది ప్రధానంగా భ్రమలకు, వ్యాకులపాటులకు సంబంధించినది. అంటే మన పరిజ్ఞానంలోని సందిగ్ధ అంశాలకు చెందినది కనకనే ఆదిమకాలపు మతాలన్నీ వికృతంగా విడ్డూరంగా కొంతవరకు అర్థం కాకుండా వుంటాయి అక్కడక్కడ సందర్భవశంగా తప్ప ఇది కూడా మనకు అప్రస్తుతం

ఆరోది కుటుంబం యొక్క స్వరూపానికి గార్హస్థ్య జీవిత పద్ధతికి అనుసంధించి వుంటుంది గృహ నిర్మాణం దీనిని పట్టి ఆటవిక దశనుంచి నాగరిక దశలోకి వచ్చిన పెరుగుదలను చాలవరకు చెప్పవచ్చు ఆటవికదశలో గుడిసె అనాగరిక దశలో సామూహిక గృహం నాగరిక జాతులతో విడివిడిగా కుటుంబాలకు ఇళ్ళు వీనితో ఒకదానికి ఒకదానికి మధ్య అంతర రూపాలుంటాయి ఈ విషయాన్ని కూడా ప్రసంగవశాత్తూ ప్రస్తావించడం జరుగుతుంది

చివరిది - ఏడోది ఆస్తి అనే భావం మానవుని మేదస్సులో చాల నెమ్మదిగా ఏర్పడింది అతి ప్రారంభరూపంలో దృశ్యాదృశ్యంగా ఎంతోకాలం వుండి పోయింది ఆటవిక దశలో తలఎత్తింది అది వూపిరి పోసుకోడానికి ఆటవిక అనాగరిక దశలతో సమకూడిన అపారానుభవం కావలసి వచ్చింది చివరికి మానవ మేదస్సు దాని సర్వాధికారాన్ని ఆమోదించింది ఆస్తి దాహం సర్వోన్నతం కావడం నాగరికత అవతరణను సూచిస్తుంది నాగరికతలోకి అడుగు పెట్టకుండా మానవజాతికి కలిగిన అవరోధాలన్నిటిని పక్కకు తొలగించడమేకాదు భూభాగాలు ఆస్తి ప్రాతిపదికపై రాజకీయ వ్యవస్థ ఏర్పడడానికి కూడా అదే దారి తీసింది ఆస్తిభావం ఎలా పరిణామం పొందిందో సవిమర్శంగా అర్థం చేసుకోవడం మానవజాతి మానసిక వికాస చరిత్రలో అతి ముఖ్యభాగం

కల్పనలు అన్వేషణలూపక్షే ప్రభుత్వం కుటుంబం, ఆస్తి భావనల పెరుగు దలనుపట్టి మానవజాతి పెరుగుదల క్రమంలోని దశలను పట్టుకోవచ్చు ఆ విధంగా మానవునిలో వచ్చిన అభివృద్ధిని తెలిపే సమాచారాన్ని అందించడం ఈ రచన వుద్దేశ్యం

ప్రభుత్వరూపాలు అన్నింటినీ రెండు చట్రాలలో ఇమడ్చవచ్చును ఆ రెండింటికీ పునాదులు వేర్వేరు కాలాన్ని పట్టి అతి ప్రాచీనమైన పాలనారూపం ఒకటి ఇది కేవలం వ్యక్తులూ వారిమధ్యనుండే వైయక్తిక సంబంధాలూ మీద ఏర్పడింది. దీనిని సమాజము అంటారు ఈ నిర్మాణానికి యూనిటు గణం ప్రాచీన కాలంలో ఈ గణాలు కొన్ని కలిసి ఫ్రాత్రేగా (సోదర సంఘం) అవి కొన్ని కలిసి తెగగా తెగలుకలిసి కన్ఫెడరసీ (సమాఖ్య)గా ఏర్పడ్డాయి వీరిని ప్రజలనీ జాతి అనీ పేర్కొంటారు తరవాతికాలంలో ఒకే ప్రదేశంలో వుండిన తెగలుజాతిఅయ్యేరు గణాలు ఏర్పడినాక చిరకాలంపాటు ప్రాచీనకాలపు సమాజంలో ఇటువంటి నిర్మాణమే కొనసాగింది గ్రీకులు రోమన్లలో నాగరికదశ ఏర్పడినాకకూడా ఈ నిర్మాణం వుంది

ఇక రెండోరకం భూభాగంపట్టీ ఆస్తినిపట్టీ ఏర్పడిన ప్రభుత్వాలు దీనిని రాజ్యం అనాలి సరిహద్దుల పరిధిలో అందులోని ఆస్తులతో సహా ఏర్పడిన వగరంవార్డు దీనికి పునాది యూనిటు దీనిమీద ఏర్పడినది రాజకీయ సంఘం రాజ్యం ఈ రాజ్యం అన్నది భూభాగాలమీద ఏర్పడుతుంది ఆస్తి సంబంధాలలోనూ ప్రాంతీయసంబంధాలు గల వ్యక్తులతోనూ ఇది ఏర్పడుతుంది ఈ నిర్మాణానికి యూనిటు వగరం జనపదం కొన్ని జనపదాలు కలిసి కౌంటీ లేక మండలం ఆ కౌంటీలూ మండలాలూ కొన్ని కలిసి దేశము దేశప్రజలంతా రాజ్యం అవుతారు గ్రీకులూ రోమనులూ నాగరిక దశకు చేరినాక వారిమీద బాగా వన్నులువేసి వగరాల్ని వార్డుల్ని ఏర్పరచారు ఆ విధంగా రెండో ప్రభుత్వ చట్రానికి ప్రారంభం జరిగింది నేటివరకు నాగరిక దేశాలలో అదే కొనసాగుతూంది ప్రాచీన నమాజంలో భూభాగ పరిమితమైన రాజ్యం అనేదిలేదు ప్రాచీన నమాజానికీ ఆధునిక నమాజానికీ మధ్య సరిహద్దు ఈ భూభాగ పరిమితమైన రాజ్యం ఏర్పడ్డాకనే స్పష్టం అయింది

ఇక్కడ మరొకటి గమనించాలి మరీ ఆదిమకాలంనాటి ప్రజలలో కనిపించడం లేదు గాని ఆటవిక ప్రజలలోనూ అనాగరిక ప్రజలలోనూవున్న కుటుంబ వ్యవస్థలలో అనేక పరిణామదశలు నేటికీ కనిపిస్తున్నాయి లింగభేదాల్ని పట్టి రక్త బంధుత్వాన్ని పట్టి ప్రాంతీయ ప్రాతిపదిక పట్టి ఏర్పడిన సామాజిక నిర్మాణాలలో ఇవి కనిపిస్తున్నాయి వివాహరూపాలు కుటుంబరూపాలుద్వారా ఏర్పడిన రక్తసంబంధాల రూపాల్నిపట్టి గార్హస్త్య జీవితం గృహ వాస్తువుపట్టి ఆస్తి యాజమాన్యం, వారసత్వం గురించిన అలవాట్లలో వచ్చిన మార్పుల్నిపట్టి వీటిని గుర్తించగలం

పతితులూ భ్రష్టులూ అయిన జనమే ఆటవికులూ అనాగరికులూ అనేసిద్ధాంతం ఈవేళ చెల్లుబాటుకాదు ఆ సిద్ధాంతం ఆటవిక ప్రజలెందుకున్నారంటే నమాధానం చెప్పలేదు అంతేకాదు మనకు అనుభవంలోకి వస్తున్న యదార్థ విషయాలు ఆ సిద్ధాంతాన్ని బలపర్చవు

ఈనాడు కనిపించే ఆటవిక అనాగరిక తెగల అనుభవాలే ఆర్యజాతుల పురాణ పురుషులవికూడా అనాగరికయుగం ఉత్తర భాగంతో సహా ప్రాచీన, ఆధునిక నాగరిక దశలను గురించి చెప్పడానికి కావలసిన ఉదాహరణలు ఈనాటి ఆర్యజాతుల అనుభవాల లోనే దొరుకుతాయి ఆటవిక అనాగరిక తెగలలో మిగిలివున్న నైతిక నియమాలూ కల్పనల పోలికలుగలవి ఆర్యులలో నేటికీవున్నాయి వానినిపట్టి ఆర్యుల ప్రాచీనకాలపు అలవాట్లను ఊహించగలము

మానవజాతి అనుభవాలు ఇంచుమించు ఒకే పంథాలో సాగేయని చెప్పవచ్చు ఒకే రకమైన పరిస్థితులలో వారి అవసరాలు కూడా మొత్తంమీద ఒకే విధంగా వుంటాయి మానవజాతులన్నింటిలో మెదడు లక్షణాలు ఒకే విధంగా వుండడంచేత ఆ మెదడులు పనిచేసే విధంకూడా ఒక్కలాగే వుంటుంది ఫలితాలు అన్ని చోట్లా ఒకే విధంగా వుండడానికి గలకారణాలలో ఇదొకటి మానవుడు అనాగరిక దశలో ఉంటున్ననాడే ప్రధానమైన నైతిక నియమాలకూ జీవిత కౌశలాలకూ బీజారోపణ జరిగింది అనాగరిక నాగరికదశలనాటి అనుభవాలు ఈ భావాల విస్తరణకే ఉపయోగపడ్డాయి వేర్వేరు ఖండాలలో నైతిక నియమాలకూ ఆద్యకాలపు సర్వ సామాన్యమూలభావనలకూ ఎక్కడన్నా పోలికలుకనిపిస్తే ఆ రెండు ప్రదేశాలలోని ప్రజలదీ మూలం ఒక్కటేనని తేల్చవచ్చును

మానవ పురోగతి దశలు కొన్నింటిని నిర్ధారణ చేస్తే అనేకానేక వాస్తవ ఘటనలగురించిన చర్చ సులభమవుతుంది సమాజంలోకనిపించే విశిష్టపరిస్థితులనుబట్టి ఆ దశకే పరిమితమయ్యే విశిష్ట జీవిత పద్ధతులనుబట్టి మానవ పురోగతి దశలను వేరుపరచగలుగుతాము శిలాయుగం కాంస్య యుగం ఇనుము యుగం అంటూ డేనిష్ పురాతత్వ శాస్త్రవేత్తలు కొన్ని సంకేతాలను ప్రవేశపెట్టేరు కొన్ని అవసరాలకు అవి ఎంతో ఉపయోగకరంగా వున్నాయి ప్రాచీనకాలపు కళాఖండాల వర్గీకరణకు అవి అత్యంతోపయోగంగా వున్నాయి అయితే విజ్ఞానం పెంపొందిన కొద్దీ మరికొన్ని అంతర్విభజనలు అవసరమయాయి ఇనుప పనిముట్లో కంచుపనిముట్లో రాగానే మానవుడు రాతిపనిముట్లను పక్కకు పెట్టెయ్యలేదు కాకి రాయిని కరిగించి ఇనుమును చేయడం ఒక నూతన దశకు అంకురార్పణ చేసింది కాని అప్పుడే కాంస్యయుగం మారి కొత్తయుగం ఆరంభమయిందని చెప్పలేము కంచు ఇనుము యుగాలలో రాతి పనిముట్లూ వుపయోగించేరు ఇనుము వచ్చేక కంచుపనిముట్లూ వుపయోగించేరు అందుచేతవానిని విస్పష్ట, స్వతంత్ర దశాభేదాలనుగా హద్దులు పెట్టలేము

సుదీర్ఘ కాలవ్యవధులలో తలఎత్తిన జీవనోపాధినైపుణ్యాలు మానవజాతి జీవనపరిస్థితులమీద గొప్ప ప్రభావం కలిగించి ఈ విభజనలకు సంతృప్తికరములైన ఆధారాలను అందించేయి అయితే అవసరమైన సమాచార సేకరణకై తగినంతగా పరిశీలన జరగలేదు మానవజాతి దశాక్రమాన్ని నిర్ణయించేందుకై అవసరమైన పరిశీలనకు తోడ్పడగల అన్వేషణలూ కల్పనలను విరుకుంటే ప్రస్తుతం మనకున్న పరిజ్ఞానంతోనే మంచి ఫలితాలను సాధించగలుగుతాము వీటిని తాత్కాలికమైనవిగానే

భావించినా ఈ దశా విభజన అనుకూలంగానూ ఉపయోగకరంగానూ వుంటుంది మనం చెప్పబోయే ప్రతిదశా ఒక విస్పష్ట సంస్కృతిని తెలుపుతుంది ఒక జీవిత పద్ధతిని చూపిస్తుంది

ఆటవికయుగాన్ని మూడు విభాగాలు చేయవచ్చు ప్రథమ భాగం మధ్యభాగం, ఉత్తర భాగం ఈ అంతర్భాగాలు ప్రతిఒక్కదాంట్లోనూవున్న సామాజిక పరిస్థితులను దిగువ మధ్య, ఎగువదశలనుగా వేర్పరచవచ్చు

అదే విధంగా అనాగరికయుగాన్ని కూడా మూడుభాగాలనుచేసి వానికి ప్రథమ మధ్య, ఉత్తర భాగాలనుగా చెప్పవచ్చు ఈ అంతర్భాగాలలోని సమాజ పరిస్థితులను దిగువ మధ్య ఎగువ దశలనుగా వేర్పరచవచ్చు

ఈ అంతర్భాగాల ఆరంభాన్ని నిశ్చితంగా సూచించే ఘటనలు అన్ని ఖండాలలోనూ ఒకే విధమైనవి దొరకవు మినహాయింపు లుండకూడదను కోవలసిన అవసరం కూడాలేదు నిశ్చితమైన పరిస్థితులలో వారు సాధించిన అభివృద్ధి స్థాయినిపట్టి ప్రధానములైన తెగల్ని వర్గీకరిస్తే చాలు

1 ఆటవికయుగం దిగువ దశ మానవజాతి శైశవంతో ఈఅంతర్దశ ప్రారంభమయిందనవచ్చు నిప్పును వుపయోగించే తెలివి సంపాదించడం చేపలను ఆహారంగా చేర్చుకోవడంతో ఈ దశ ముగుస్తుంది అంతవరకు మానవుడు తాము పుట్టిన పరిమిత నివాస ప్రాంతంలోనే జీవిస్తూ పళ్ళు కాయలతో పొట్టనింపు కుంటున్నాడు మాట అనేది ఈ దశలోనే ప్రారంభమయింది ఈ దశలోవున్న తెగలేవీ చారిత్రక కాలం నాటికే లేవు

2 ఆటవిక యుగం మధ్య దశ నిప్పును ఉపయోగించడం చేపలు తినడంతో ప్రారంభమైన ఈ దశ విల్లు అంబులను కనిపెట్టడంతో ముగుస్తుంది ఈ దశలో మానవుడు తాము పుట్టిన చోటునుండి ప్రపంచంలో బాగా విస్తరించేడు నాగరిక ప్రపంచం కళ్ళబడ్డనాటికి ఆస్ట్రేలియాలోని ప్రజలూ పోలినీషియన్లలో హెచ్చుభాగమూ ఈ దశలో వున్నారు

3 ఆటవిక యుగం ఎగువ దశ విల్లంబులను కనుక్కోవడంతో ప్రారంభమయి ఈ అంతర్దశ కుండలుచేసే నేర్పు సంపాదించడంతో అంతమవుతుంది హడ్సన్స్‌బే ప్రాంతంలోని "అతపాస్కాన్ తెగలూ కొలంబియా నదీలోయలోని తెగలూ ఉత్తర దక్షిణ అమెరికాలలోని కోస్తా ప్రాంతపు తెగలుకొన్నీ ఆటవిక యుగం మధ్య దశలోనే దిగబడివున్నారు ఇది వారిని కనుక్కొన్ననాటిమాట దీనితో ఆటవికయుగం ముగుస్తుంది

4 అనాగరిక యుగం దిగువ దశ కుండలుచేసే నేర్పు అటవిక యుగానికి అనాగరిక యుగానికి మధ్య సరిహద్దుగా భావించవచ్చు ఈ రెండు యుగాల మధ్య అంతరం గుర్తించేరు కాని ఒక దశనుంచి రెండవదశలోకి వచ్చే మార్పుకు కారణం ఏమయివుంటుందనేది ఇంతవరకు తేలలేదు ఇక కుండలు చేయగల నైపుణ్యాన్ని సంపాదించని తెగలన్నీ అటవిక తెగలుగా ఆ నైపుణ్యం పట్టుబడినా ధ్వని సంకేతాలను వ్రాతను ఎరగకపోతే అనాగరికయుగంలోవున్న వారినిగా గుర్తించాల్సి వుంటుంది

కుండలు చేసే పద్ధతిని తామే కనుక్కొన్నదీ లేదా ఇతరుల నుంచి నేర్చుకొన్నదీ ఏ విధంగానైనా కుండలు చేయగలగడంతో అనాగరిక యుగం దిగువ భాగం ప్రారంభమవుతుంది అటవికయుగం ముగిసినాక మానవుని పురోగతిని ప్రభావితం చేసిన పరిస్థితులు పూర్వ పశ్చిమార్ధగోళాలలో భిన్నంగా వున్నాయి ఫలితంగా అనాగరికయుగం దిగువ మధ్య దశలను గుర్తించడంలో చిక్కులు వచ్చేయి అయితే ఒకదానికొకటి దీటైన వానిని చూసుకుంటే ఈ చిక్కులనుంచి బయట పడవచ్చు పూర్వార్ధగోళంలో పశువుల మచ్చికనూ పశ్చిమార్ధగోళంలో నీటిపారుదల క్రింద మొక్కజొన్న ఇతర మొక్కలు పండించడం వచ్చి ఇటుకలతో ఇళ్ళు కట్టుకోవడాన్నీ అనాగరికయుగం దిగువదశ నుంచి మధ్యదశకి ఎదుగుదలనుగా గుర్తించవలసివుంది దీనివలన అమెరికాలో మిస్సోరి నదికి తూర్పునవున్న ఇండియన్ తెగలూ కుండలు చేసే నేర్పు వున్నా పశువులను మచ్చికచేయడం తెలియ యూరపు ఆసియాలలోని తెగలూ అనాగరికదశ దిగువస్థాయిలోనే వున్నట్లు పరిగణించాలి

5 అనాగరికయుగం మధ్యదశ పశువులను మచ్చిక చేయడంతో పూర్వార్ధగోళంలోనూ నీటిపాగు వచ్చి ఇటుక రాయితో గృహనిర్మాణంలో పశ్చిమార్ధగోళంలోనూ అనాగరిక యుగం మధ్యదశ ప్రారంభం అయింది ముడి ఇనుము కరిగించే నైపుణ్యం కలగడంతో ఆపాయి ఆఖరవుతుంది న్యూమెక్సికో మెక్సికో మధ్య అమెరికా పెరూలలోని గ్రామవాసి ఇండియనులూ పూర్వార్ధగోళంలో పశువులను మచ్చిక చేయడం నేర్చుకున్నా ఇనుము వుపయోగం తెలియని తెగలూ మధ్య దశలోనే వున్నట్లు ప్రాచీనకాలపు బ్రిటన్‌లకు ఇనుము వాడకం తెలిసినా ఈ స్థాయికే చెందుతారు దగ్గరలోనే యూరపులోని తెగలతోడి సంబంధంలో బ్రిటన్లు తమ గార్హస్థ్య నైతికస్థాయిని మించిన జీవిత నైపుణ్యాలను అనుభవించడం నేర్చుకొన్నారు

6 అనాగరిక యుగం ఎగువ దశ ఇది ఇనుము తయారీతో

ప్రారంభమయి ధ్వని సంకేతాక్షరాలను ఏర్పరచుకొని సాహిత్య రచనారంభంతో ముగుస్తుంది ఇక్కడి నుంచి నాగరికదశారంభం దీని ప్రకారం హోమర్ కాలంనాటి గ్రీకులు రోమ్‌నగర నిర్మాణానికి ముందునాటి ఇటాలియను తెగలూ సీజరుకాలంనాటి జర్మను తెగలూ అనాగరిక యుగం ఎగువస్థాయి వారుగానే పరిగణించాలినుంటుంది

7 నాగరిక దశ ధ్వని సంకేతాక్షరాల నిర్ణయముతో సాహిత్య రచనతో ఈదశ ఆరంభమవుతుంది అన్నాను కదా ఇది ప్రాచీన ఆధునిక నాగరికతలుగా స్థాయీ విభజన చేయబడుతూంది చిత్రలిపితో రాతిమీద చెక్కడం కూడా వీనితో సమానమనే అంగీకరించవచ్చు

## పునః పరిశీలన

| దశలు | లక్షణాలు |
|---|---|
| 1 ఆటవిక యుగం | ఆటవికదశ |
| ప్రథమభాగం | దిగువదశ |
| 2 మధ్యభాగం | మధ్యదశ |
| 3 ఉత్తర భాగం | ఎగువదశ |
| 4 అనాగరిక యుగం | అనాగరిక దశ |
| ప్రథమ భాగం | దిగువ దశ |
| 5 మధ్యభాగం | మధ్య దశ |
| 6 ఉత్తర భాగం | ఎగువ దశ |
| 7 | నాగరిక దశ |

| | |
|---|---|
| 1 ఆటవిక యుగం | |
| దిగువ దశ | మానవజాతి శైశవంనుంచి తరువాతి దశ ఆరంభం వరకు |
| 2 మధ్య దశ | చేపలను ఆహారం చేసుకోవడం నిప్పును వుపయోగించడం వగైరాతో |
| 3 ఎగువ దశ | విల్లంబులు కనుక్కోవడంనుంచి |
| 4 అనాగరిక యుగం | |
| దిగువ దశ | కుండలు చేయడం దగ్గరనించి |
| 5 మధ్య దశ | పూర్వార్ధగోళంలో పశువులను మచ్చిక చేయడం తోనూ పశ్చిమార్ధగోళంలో నీటిపాగు కింద |

| | | |
|---|---|---|
| | | మొక్కజొన్న మొదలైన పైరులు పండించటం తోనూ వచ్చి ఇటికలతో ఇళ్ళు కట్టుకోవడంతోనూ ప్రారంభం అయింది |
| 6 | ఎగువ దశ | కాకిరాయి కరిగించి ఇనుము చేయడం, ఇనుప పనిముట్ల వాడకం నుంచి. |
| 7 | నాగరిక దశ | ధ్వని సంకేతాలను కనుగొని, రాతకుపయోగించడం నుంచి నేటివరకు |

వీనిలో ప్రతి ఒక్క కాలానికి దానిదాని సంస్కృతి వుంది. దానికే ప్రత్యేకం అయిన జీవితపద్ధతి వుంది మానవజాతి దశాక్రమాన్ని విశ్లేషం చేయడంవలన ఒక్కొక్క సమాజం ఎంత అభివృద్ధి పొందిందో ప్రత్యేకా ధ్యయనం చేయడానికి చర్చి చడానికి అనువవుతుంది ఒకే ఖండంలో వున్న వేర్వేరు తెగలు ఒకే భాషా కుటుంబానికి చెందినవికూడ ఏక సమయంలో భిన్నస్థాయిలలో వుండొచ్చు అదో ఇబ్బందికాబోదు మనకా తెగల "పరిస్థితే" విచారణాంశ గాని "కాలంతో" పనిలేదు

జంతువుల్ని మచ్చికచేయడం, ఇనుము కరిగించడం ధ్వని సంకేతాక్షరాల్ని రూపొందించడం కన్న కుండల తయ్యారీకి ప్రాముఖ్యం తక్కువే అయినా దానిని ఒక దశ ఆరంభానికి సూచనగా ఎందుకు తీసుకున్నామో చెప్పాలి కుండల తయ్యారీ గ్రామజీవితాన్ని సూచిస్తుంది చిన్నచిన్నవని నైపుణ్యాలు వారికి అలవడ్డాయని సూచిస్తుంది చెకుముకి రాతి పనిముట్లూ కుమ్మరిపనికన్న ప్రాచీనం కుండలఅవశేషాలు కూడాలేని, ప్రాచీనకాలపు చెత్తపోగులు, దిబ్బలలో అనేకచోట్ల చెకుముకి రాతిపని ముట్లూదొరికేయి దిగువదశలోనే చాల అవసరమైన కల్పనలు జరిగి అమలులోకివచ్చి వుంటాయి అప్పటికి కుండల అవసరం కనబడి వుండదు వానిని తయారుచేసే అవసరం ఏర్పడక పూర్వమే గ్రామజీవితం జీవనోపాధి పశువుల మీదకొంత పట్టు

---

* నిప్పులమీద పెడితే కాలిపోయే కర్రపాత్రలకు మట్టిమెత్తి కాలిపోకుండా చేస్తున్నారని 1503లో దక్షిణ అమెరికా ఖండపు ఆగ్నేయకోస్తా ప్రాంతంలో తిరిగిన కెప్టెన్ గొన్నెవిల్లె చెప్పినట్లు గోగెట్ తన "ఎర్లీహిస్టరీ ఆవ్ మేన్కైండ్" లో వ్రాసేడు దానిని వుదాహరిస్తూ ఎడ్విన్ బి టైలరు "లోపలకర్ర పాత్రలుపెట్టి మన్నుమెత్తనక్కర్లే కుండా మన్నుతోనే పనిజరుగుతుందని గ్రహించడంతో కుండలుచేసే నేర్పు ప్రపంచంలో పట్టుబడింద ని వ్రాసేరు

కర్రతోచేసిన పాత్రలూ గిన్నెలూ నారతీసి వేళ్ళతోపేని నెయ్యడం బుట్టలు అల్లడం విల్లు అంబులూ మనిషి జీవితంలోకి వచ్చేసేయి అనాగరిక యుగం మధ్య దశలో వున్న ఆదివాసులు అజ్టెకులు చోలులాన్‌లు మొదలైన గ్రామవాసి ఇండియనులు పెద్ద సంఖ్యలోనే కుండలు తయారుచేసేరు వానిలో శ్రేష్ఠమనదగినవి చాలరకాలు వుండేవి అనాగరికయుగం దిగువదశలో వున్న ఇరాక్వాలు చోకిలు చెరోకీలు కూడా పెద్దసంఖ్యలోనే కుండలుచేశారు అయితేఅవికొద్దిరకాలే ఈఇండియన్లు గ్రామజీవితానికి బాగా అలవడ్డవాళ్ళుకాదు. ఆట కష్టాయిలోనే వుండి పంటలు పండించడం తెలియని అతపాస్కన్‌లు కాలిఫోర్నియాలోనూ కొలంబియా నదీలోయలోనూవున్న ఇండియను తెగలవారికీ కుండల వుపయోగం తెలియదు లుబ్బోక్ రాసిన ప్రిహిస్టారిక్ టైమ్స్ టైలర్ రాసిన, "ఎర్లీహిస్టరీ ఆఫ్ మేన్‌కైండ్" పెషెల్‌రాసిన రేసెస్ ఆఫ్ మేన్ లలోనూ ఈ కళను గురించిన వివరాలు అదివిస్తరించిన వివరాలు ఎంతోవిశతంగా పరిశోధించి రాసేరు తోంగన్‌లు జియన్లు మినహా పోలినీషియాలో కాలిఫోర్నియాలో హడ్సన్స్‌బే మండలంలో దీనిగురించి ఎరగరు "ఆశియాకు వెలుపల మున్న దీవులు చాలావానిలో నేత తెలియద సీ "సౌత్‌సీదీవులు చాలావానిలో కుండలు గురించి తెలియద"నీ టైలర్ రాసేరు ఆస్ట్రేలియాలో వుంటున్న ఇంగ్లీషు మిషనరీ రెవరెండ్ లోరిమర్ ఫిసన్‌ను ఈ గ్రంధకర్త అడిగినప్పుడు ఆయన ఆస్ట్రేలియన్లకు నేసిన బట్టలులేవు కుండలులేవు విల్లంబులు తెలియవు అన్నారు పొలినీషియన్లకు కూడా విల్లంబులు తెలియవు కుండలు తయారీతో మానవుని పురోగతిలో ఒక నూతన దశారంభం జరిగింది వారి జీవిత పద్ధతులు మెరుగయ్యాయి గృహ సౌకర్యాలు పెరిగేయి చెకుముకి రాతి పనిముట్లూ చాలముందుగానే వచ్చేయి వానివలన జరగగల పనులన్నీ తెలుసుకోనే పరికి చాలదీర్ఘకాలమే పట్టింది వానితో మనిషి దోనెలు చేసుకున్నాడు. కర్రపాత్రలూ గిన్నెలూ చేసుకున్నాడు గృహనిర్మాణానికి అవసర మయ్యే దుంగలు దూలాలు చెక్కలు చేసుకున్నాడు. కుండవచ్చేక ఆహారం ఉడక పెట్టుకొనేందుకు మన్నికయిన పాత్రదొరికింది అంతకుపూర్వం అందుకు మట్టిమెత్తిన బుట్టలనుపయోగించేవారు గోతులలో కాలిన రాళ్ళమీద ఆహారం ఉడికించు కొనేవారు

ఆదివాసులు కుండలను నిప్పులతో కాల్చి చేశారా మట్టనే ఎండబెట్టి గట్టిపరిచారా అనే ప్రశ్న వస్తుంది ఇండియానా పొలిస్‌కు చెందిన ప్రొఫెసర్ యి టి కాక్స్ ప్రాచీన కాలపు కుండలనూ హైడ్రాలిక్ సిమెంటునూ పరిశీలించి పోలికలు చెప్పారు "కుండలలో వున్న రసాయనిక సమ్మేళనం హైడ్రాలిక్ రాళ్ళలోలాగే వుం-

"దిబ్బలమీద ఇళ్ళు కట్టుకొనే ఆచారం వాటి కుండలన్నీ నేను చూసినంతవరకు ఒండ్రు మన్నులో ఇసక కలిపి చేసినవో మంచినీటి ఆలిచిప్పల గుండను కలిపి చేసినవో ఆ విధంగా తయారుచేసిన మట్టికి హైడ్రాలిక్ పుజోలానీ లోనూ పోర్ట లాండ్ సిమెంట్ లోనూ వుండే గుణాలన్నీ చాల ఎక్కువగా వున్నాయి ఆ మట్టితో చేసిన కుండల్ని మామూలు కుండల్నిలాగ కాల్చనక్కరలేదు కృత్రిమ శిలలను చేయ డానికి హైడ్రాలిక్ మన్నంలో సన్న కంకరో సన్నని రాయి రజనో కలిపితే వుండే వుపయోగం ఈ మన్నులో ఆలిచిప్పల గుండ కలిపితే వుంటుంది " అన్నారు ఆయన హైడ్రాలిక్ సిమెంటుతో ఇండియనుల కుండలమన్నులోని సమీకరణను పోల్చడంవలన ఆ కళను పట్టుకోవడంలోవున్న కష్టం అర్థం అవుతుంది ఆ కళను అందుకోవడంలో మానవునికి అంత వ్యవధి ఎందుకవసరమయిందో అర్థం అవుతుంది ప్రొఫెసర్ కాక్స్ ఏం చెప్పినా కుండలను క్రుత్రిమమైన వేడితోనే గట్టిపరిచి వుంటారు. కొన్ని సందర్భాలలో ఆ విషయం స్పష్టంగానే రుజువయింది గల్ఫ్‌లోని తెగలను గురించి చెప్తూ అడైర్ ఇట్లా అన్నారు వారు రెండునుంచి పది గేలన్లువరకూ పట్టే అనేక పరిమాణాల మట్టి పాత్రలను నీరు తెచ్చుకొనేందుకు పెద్ద కుండలు దాకలు మూకుళ్ళు పళ్ళేలు తొట్టెలు మొదలైన అనేక రకాల పాత్రలను తయారుచేశారు అవన్నీ పాతకాలపు రకాలు వాటిని వర్ణించడం కష్టం పేర్లు పెట్టడం అసంభవం పొగలు చిమ్మే దేవదారు బొందుమీద వాటిని కాలుస్తారు దానితో అవి నున్నగా నల్లగా గట్టిగా అవుతాయి "

మానవ దశలను నిర్ధారణ చేయడంలో మరో ఉపయోగం వుంది. ఆయా స్థాయిలకు ఉదాహరణగా ఎలిచే తెగలమా జాతులనూ శ్రద్ధగా పరిశీలించి ఆయా స్థాయిలకు ఉదాహరణలు చూపే అవకాశం లభిస్తుంది కొన్ని తెగలూ కుటుంబాలూ భౌగోళికంగా ఏకాకులుగా వుండిపోయాయి వారు స్వీయ మనశ్శక్తితో సమస్యలకు సమాధానాలు వెతుక్కుని పురోగమించవలసి వుంటుంది ఫలితంగా వారి నైపుణ్యాలూ నైతిక నియమాలూ అచ్చంగా మిశ్రం కాకుండా వుంటాయి మిగిలిన జాతుల నైపుణ్యాలూ నైతిక నియమాలూ ఇరుగు పొరుగుల సంపర్కంలో కలగలిపి పోతాయి అ దుచేతనే ఆటవిక అనాగరిక జాతులు కలగలిసి అక్కా పట్టి గంద్ర గోళంగా కనిపిస్తుంది ఆస్ట్రేలియా పోలినీషియాలలో ఆటవికత అచ్చమైన రూపంలో కనిపిస్తుంది అక్కడి నైపుణ్యాలూ నైతిక నియమాలూ అచ్చంగా ఆ దశకే చెందినవి అదే విధంగా అమెరికాలోని ఇండియన్ల కుటుంబం వరసగా మూడు

మానవ దశలలో జీవించిన మానవుల స్థితికి ఉదాహరణ ప్రాయంగా వుంది అటువంటి కుటుంబాల్ని మరెక్కడా చూడం ఒక పెద్ద భూఖండం చిరకాలం పూర్తిగా వారిదిగానే వుంది అక్కడున్నవారంతా ఒకే పూర్వ పురుషుని సంతతికి చెందినవారు వారి నైతిక నియమాలన్నీ బాహ్య సంపర్కం లేకుండా అచ్చంగా వున్నాయి ఈ కారణాలచేత వారు బయట ప్రపంచం కళ్ళబడేనాటికి దిగువ మధ్య అనాగరిక దశలకు సంపూర్ణ వుదాహరణలుగా నిలిచి వున్నారు ప్రపంచంలో మరెక్కడా ఇటువంటి స్థితి లేదు బాగా ఉత్తరానవున్న తెగలూ ఉత్తర దక్షిణ అమెరికాల కోస్తా ప్రాంతాల తెగలూ ఆటవిక యుగం ఎగువ దశలో వున్నారు మిస్సిసిపీ నదికి తూర్పున వున్న ఇండియన్లు గ్రామాలలో ఇంకా పూర్తిగా స్థిరపడి వుండలేదు వారు అనాగరిక యుగం దిగువ దశలో వుండే ఉత్తర దక్షిణ అమెరికాలలోని గ్రామవాసులైన ఇండియన్లు అనాగరిక యుగం మధ్య దశలో వున్నారు పురోగతి దశాక్రమంలో నైపుణ్యాలూ నైతిక నియమాలూ ఏర్పరచుకోడానికి కారణభూతమైన మానవ అనుభవాలూ పురోభివృద్ధి గురించి సూక్ష్మంగానూ సంపూర్ణంగానూ పరిశీలించేఅవకాశం చరిత్రయుగంలో మరెక్కడా దొరకవు అవి ఇక్కడ స్పష్టంగా నిరూపించబడ్డాయి చారిత్రక దశా కాలంనాటిదే ఏమీ దొరకలేదు

పూర్వ పశ్చిమార్ధ గోళాలలోని పరిస్థితులు భిన్నంగా వుండడంవలన ఒకే దశకు చెందినా అక్కడి సంస్కృతులలో వైవిధ్యం వచ్చింది కాని దశ ఒక్కటే అవడానికి సమాజ స్థితి రెండుచోట్లా ఒకే విధంగా వుంది

గ్రీకు రోమన్ జర్మను తెగలు పైన చెప్పిన దశలన్నింటినీ చూశాయి చిట్ట చివరి దశ జరుగుతుండగా మధ్యలో చరిత్ర వెలుతురు వారిమీద పడింది అనాగరిక యుగం మధ్య దశకు పూర్వంనాడు వారూ మిగిలిన అనాగరికుల స్థాయిలోనే వున్నారు తేడా ఏమీ లేదు చారిత్రక పరిశీలనలకు అందేనాటికి వారు తమతో తెచ్చుకొన్న నైతిక నియమాలు కల్పనలు అన్వేషణలు తప్ప మిగిలిన పూర్వ అనుభవాలన్నీ అదృశ్యం అయిపోయాయి హోమరు రోములస్‌ల కాలంనాటి గ్రీకు ఇటాలియను తెగలు అనాగరిక యుగం ఎగువ దశకి మంచి వుదాహరణలుగా వున్నారు వారి నైతిక నియమాలు అకలుషకంగా శుద్ధంగా వున్నాయి వారి అనుభవాలు సరాసరి నాగరికత విజయానికి అనుసంధించి వున్నాయి

ఆస్ట్రేలియనులు పోలినీషియనులతో ప్రారంభించి, అమెరికన్ ఇండియన్ తెగలమీదుగా రోమన్ గ్రీషియన్ తెగల అనుభవాలు మానవజాతి పరిక్రమించిన ఆరు

పాయిలకు చక్కని వుదాహరణలు అవుతున్నాయి ఆటవిక యుగం మధ్య దశనుంచి అనాగరిక యుగం ఎగువ దశవరకు పొందిన అనుభవాలు మొత్తం మానవ కుటుంబం యొక్క అనుభవాలుగానే గుర్తించవచ్చు ఆర్యన్ తెగలు ఆటవిక దశలో వున్నప్పుడు ఆస్ట్రేలియనుల పోలినీషియనుల అనుభవాలనే చవి చూశారు అనాగరిక యుగం దిగువ దశలో వున్నప్పుడు గ్రామాలలో ఇంకా బాగా స్థిరపడని అమెరికను ఇండియనుల పరిస్థితులలో మధ్య దశలో వున్నప్పుడు గ్రామ జీవితంలో స్థిరపడ్డ ఇండియన్ల స్థాయిలో వున్నారు ఆ యుగం ఎగువదశలోనున్న పరిస్థితి వారికి ఎరుకే ఆ విధంగా ఏ ఖండంలో వున్నా ఒకే దశలోవున్న మానవుల నైపుణ్యాలు నైతిక నియమాలు జీవిత పద్ధతులు ఒకేవిధంగా వుంటాయి గ్రీకులూ రోమన్లూలోని నైతిక నియమాలు ప్రాచీన కాలంలో ఎట్లా వుండేవో తెలుసుకొనేందుకు అమెరికను ఆదివాసులలో చూస్తే కనిపిస్తాయి. ముందు ముందు అదే చూపిస్తా మానవజాతిలో వున్న ప్రధానములైన నైతిక నియమాలకు బీజరూపం ఒకటేనని నిరూపించుతుంది ఈ సమాజాచారం అదేవిధంగా వారి పురోగమన అభివృద్ధి పొందిన పద్ధతి స్వల్పమైన తేడాలున్నా నిర్దిష్టమైన పంథాలో కొన్ని పరిధుల మధ్యనే సాగింది మానవజాతి మెదడుకున్న సహజ తార్కిక స్వభావమూ దాని శక్తికిగల సహజ పరిమితులూ ఆ గతినీ అభివృద్ధి పద్ధతినీ నియమిస్తాయి వేర్వేరు ఖండాలలో నివశిస్తున్న వేర్వేరు తెగల జాతులు ఒకే అవస్థా క్రమంలో ఒకే విధమైన అభివృద్ధిని చూపుతున్నారు ఏవన్నా తేడాలుంటే దానికి అక్కడక్కడి ప్రత్యేక కారణాలు కనిపిస్తాయి మానవ జాతి మూలం ఒక్కటేనని ఇది చూపుతూంది

వివిధ యుగాలూ దశలలో జీవించిన తెగలనీ, జాతులనీ పరిస్థితులను పరిశీలించడంలో మనం మన ప్రాచీనుల చరిత్రనూ పరిస్థితులనే తెలుసుకుంటున్నాము

# రెండో ప్రకరణం
# జీవనోపాధి నైపుణ్యాలు

భూమిమీద మానవుని ఆధిక్యత జీవనోపాధిపై స్వాధీనం నిబం ధన-మనుష్యుడి కొక్కడికే ఆ స్వాధీనం వుంది క్రమోత్తరంగా జీవనోపాధి నైపుణ్యాలు 1 ప్రకృతి దత్తమైన జీవనోపాధి 2 చేపలు ఆహారం 3 ధాన్యాహారం 4 పాలు మాంసాల ఆహారం 5 మడిచెలకల సాగుద్వారా అపార జీవనోపాధి వాని మధ్య సుదీర్ఘ కాలవ్యవధులు

మానవ జాతి అట్టడుగున తన జీవయాత్ర ప్రారంభించి క్రమంగా పైకి ఎక్కివచ్చిందనడానికి వారు క్రమోత్తరంగా సంపాదించిన జీవనోపాధి నైపుణ్యాలే గట్టి సాక్ష్యం ఈ విషయంలో వారు సాధించిన సామర్థ్యంమీదనే భూమిమీద వారి ఆధిక్యత ఆధారపడివుంది ఆహారోత్పత్తిమీద పూర్తి స్వాధీనం సంపాదించిన ప్రాణిమానవు డొక్కడే ప్రారంభంలో వారూ ఇతర జంతువుల స్థాయిలోనేవున్నారు జీవనోపాధికి పునాదిని విస్తరింపచేసుకోకుండా మానవుడు వేర్వేరు ఆహార పదార్థాలు దొరికే చోట్లకి చివరికి ప్రపంచం మొత్తానికి విస్తరించడం సాధ్యమయ్యేదికాదు వివిధ ఆహారపదార్థాలమీద వాని విస్తరణమీద ప్రభుత సంపాదించలేకపోతే అత్యధిక జనాభాగల జాతులుగా విస్తరించలేక పోయేవారు అందుచేత జీవనోపాధి మూలాలు విస్తరించడానికీ మానవాభివృద్ధిదశలు పురోగమించడానికీ సరాసరి సంబంధం వుంది అనవచ్చు

మానవుని ఆహారానికి మూలం అయిన పదార్థాలు అయిదింటిని గుర్తించవచ్చు ఒకదాని వెనుక నొకటిగామానవుడు ఈ నైపుణ్యాలను సంపాదించేడు అయితే వానిలో ఒకదానికీ రెండోదానికి మధ్య దీర్ఘ సుదీర్ఘ కాలం అంతరం వుంది దీనిలో మొదటి రెండూ ఆటవికయుగం నాటివి మిగిలిన మూడూ అనాగరికయుగం నాటివి మానవుడు వానిని సాధించిన క్రమం ప్రకారం ఇక్కడ రాస్తున్నా

1 పరిమిత ప్రాంతంలో పళ్ళుదుంపలు జీవనోపాధిగా వున్నకాలం ఇది మానవ జాతియొక్క అతి ప్రాచీన దశనాటి మాట అనాడు వారి సంఖ్యకొద్ది ఆహారం అతి సాధారణం పరిమిత ప్రదేశాలలో వుండెవారు అప్పుడే కొత్త జీవితంలో అడుగు పెడుతున్నారు ఈనాడు వూహించేందుకుకూడా సాధ్యంకాదు అనాటి నైపుణ్యాలూ నైతిక నియమాలూ ఏంవుండేవో ఒక్కటి ఆ ప్రాచీన తమకాలంనాటి నైపుణ్యం మాట పలుకుబడి మాత్రమే అదే ఈ నాటికి కొనసాగుతూంది అనాటి ఆహార వస్తువులనుపట్టి వారు సమశీతోష్ణ ఉష్ణమండలాలలో వుండెవారని ఊహించాలి ఆదిమమానవుడు ఇటువంటి ప్రదేశంలోనే జీవించి వుంటాలని నేడు అందరూ అంగీక రిస్తున్నారు ఉష్ణమ డలాలలోని అడవులలోనే కాయలూ పళ్ళూ ఇచ్చే చెట్లు వుంటాయనేది మన అనుభవం ఆ కారణం చేతనే మన పూర్వీకులు ఇక్కడే తమ జీవితయాత్రను ఆరంభించి వుంటారని అనుకోవచ్చు

మనుష్యుడు రాకపూర్వమే భూమిమీద జంతుజాలం వుంది మనుష్యుడు పుట్టిన నాటికని సంపూర్ణ బలో త్తేజ తో అధిక సంఖ్యతో వుండడమే ఈ వూహకు కారణం ప్రకృతిలో దొరికేపళ్ళూ దుంపలూతింటూ మానవుడు తలదాచుకొనేందుకై తోపుల కోసం గుహలకోసం అడవిజంతువులతో మర్షణపడ్డాడని ప్రాచీన కవులు వర్ణించేరు బహుక్రూర జంతువులమధ్య ఓ అనుభవమూ ఓ ఆయుధమూ లేకుండా మనిషి జీవించేడంటే కనీసం రక్షణకోసం భద్రత కోసం పూర్తిగా కాకపోయినా కొంత వరకైనా చెట్లమీద వుంటుండే వాడను కోవాలి

బతకడానికి తిండి వెతుక్కోవడం అనేది అన్ని జంతువులకూ జీవితం ఎత్తిన మోయనేని బరువు జీవపరిణామదశలలో మనం అంతకంతకు ప్రాగ భదశకేసివెడితే అది అంతకంతకు సులభం సులభతరం అవుతూ చివరకు అదృశ్యం అయిపోతుంది కాని పైకివచ్చినకొద్దీ అదిక్రమంగా కష్ట కష్టతరం అవుతూ మనిషివద్దకు వచ్చేసరికి కష్టతమం అయి ది జీవియొక్క శరీరనిర్మాణం క్లిష్టం న క్లిష్టం కావడ తో వచ్చింది ఇది ఇక్కడినుంచి మేధ సర్వప్రధానం అవుతుంది బహుశా అతి ప్రథమ దశలోనే జంతుమాంసం మనుష ని ఆహారం అయివుంటుంది శరీర నిర్మాణం రీత్యా సర్వగ్రాసి కాగలమానవుడు పళ్ళుతి టూ కూర్చున్నాడా జ తువులకోసం వె టబడ లేదా అన్నది వూహించుకోవలసిందే ఈ మాదిరి వల ఆహారదశ అత్య త ప్రాచీనకాలం నాటిది.

2 చేపల ఆహారం మనుష్యుని కృత్రిమాహారాలలో చేపలు మొదటి రకం అని చెప్పాలి వీటిని వండనిదే పూర్తిగా జీర్ణంకాదు ఈ అవసరం కోసమే మొదట నిప్పునుపయోగించేరనడం తప్పేంకాదు చేపలు అన్నిచోట్లా దొరుకుతాయి అన్నికాలాల్లోనూ దొరుకుతాయి అపారంగా దొరుకుతాయి ఆ ప్రాచీనకాలం నాటికే కాయ పప్పు ధాన్యాలున్నా మనిషికి వాని జాడ తెలియదు వేటవలన బతకడం అదే ఆహారంగా బతకడంచాలకష్టం చేపలు ఆహారంగావడంతో మనిషి ఒకే చోట వుండవలసిన స్థితి తప్పింది వాతావరణం బెడదా తీరింది సముద్రం వొడ్డున సరస్సుల వొడ్డున నదుల వెంబడిపడి ఆ ఆటవిక దశలోనే మానవుడు అత్యధిక భూభాగాలకు విస్తరించేడు ఆ దశకు చెందిన చెకుముకి రాతిపనిముట్లు అన్ని ఖండాలలోనూ దొరుకుతుండడమే దీనికి సాక్ష్యం ఏ పశుతినో బ్రతకవలసివుంటే తానున్న చోటువదిలి దూరం పోవడం మనిషికి సాధ్యం కాదు

చేపలు ఆహారంగా చేసుకుని వలయమూలలకి విస్తరించినాటికి ఆహారధాన్యాలు పండించినవాటికీ మధ్యవ్యవధి చాలా చాలావుంది ఆటవికదశలో అధికభాగం అందులోనే గడిచింది అయితే ఈ వ్యవధి కాలంలో ఆహారం పరిమితులూ పెరిగేయి వైవిధ్యమూ పెరిగింది దుంపల్ని గోతులలో కాల్చడం నేర్చుకున్నారు ఆయుధాలు రాటుతేలినకొద్దీ ముఖ్యంగా విల్లు అంబులు వచ్చేక వేట మాంసం దినసరి ఆహారాలలో చేరింది • బల్లెము గద తరవాత విల్లు అంబులు అతి ముఖ్యమైన కల్పన వేటకు ఎక్కువ వుపయోగకరమైన ఈ పనిముట్టు ఆటవిక యుగం చివరి భాగంలో వచ్చింది ఈ పనిముట్టును కనుక్కోడంతో ఆ యుగంలో ఎగువదశ ఆరంభం అవుతుంది అనాగరిక యుగంలో ఇనుపకత్తి నాగరికదశలో తుపాకిలాగే

---

• విల్లు అంబు అనేది అనేక విగూఢ శక్తులసమ్మేళనతో సాధ్యం కనుక దీనిని అసంకల్పితంగానే కనుక్కొన్నారనుకోవచ్చు కొన్నిరకాల కర్రచాలగట్టిగా వంగి యథాస్థితికి వచ్చేలక్షణం కలిగివుంటుంది నరంతోనో నారతోనో ఆ కర్రను వంచి కడితే బిర్రుగావుంటుంది ఈ రెండు శక్తులకు మనిషి ఐచ్ఛికశక్తి కూడా జతఅయితే బాణాన్ని వేగంగా పంపవచ్చునవే ఆలోచన ఆటవికదశలో మానవునికి తోచడం సాధ్యంకాదు పోలినీషియన్లు చాలమందికి ఆస్ట్రేలియన్లకూ విల్లు అంబుతెలియదు. దీనినిపట్టి వానిని కనుక్కునేనాటికి ఆటవికదశలోనే మానవుడు చాలా ముందుకు ఎదిగేడని వూహించవచ్చు

ఇది అటవికదశలో ప్రాచీన కాలపు సమాజం పురోగతికి మంచి ప్రోత్సాహాన్నిచ్చిందనాలి చేపలు దొరికే ప్రాంతంలో తప్ప మిగతా చోట్ల ఆహారసౌకర్యాలు అంతవిశ్వసనీయం కాక పోవడంచేత మానవులకు మనుష్య మాంసాశనం తప్పనిసరి అయి వుంటుంది ప్రాచీన కాలంలో ఈ అలవాటు సర్వసాధారణంగా వుండేదనడానికి నిదర్శనాలు ఇప్పుడు దొరుకుతున్నాయి

## 3 వ్యవసాయం ద్వారా ధాన్యాల పిండి జీవనోపాధి అయింది

మనం ఇప్పుడు అటవిక యుగాన్ని దిగ త్రొక్కి కాని అనాగరిక యుగంలో అడుగు పెడుతున్నాం అటవికదశ నుంచి పురోగమించిన తెగలలో తప్ప పశ్చిమార్ధ గోళంలో ధాన్యాలూ మొక్కలూ పెంచడం ఎరగరు పూర్వార్ధ గోళంలోని తెగలకు అనాగరికయుగం దిగువ దశనుంచి ఎదిగి మధ్యదశకి చేరుతూన్న స్థితివరకూ వ్యవసాయంతెలియదు పూర్వార్ధ గోళంలోకన్న ఒక్క స్థాయీ కాలంము దే అనాగరిక యుగం దిగువ దశలోవున్న అమెరికను ఆదివాసులు పంటలుపండించడం ఎరుగుదురు. రెండు అర్ధగోళాలలోనూ వున్న ప్రాకృతిక పరిస్థితులు దీనికి కారణం పూర్వార్ధ గోళంలో మచ్చిక కాగల జంతువులన్నీ వున్నాయి ఒక్కటి తప్ప ధాన్యాలన్నీ వున్నాయి. పశ్చిమార్ధగోళంలో ఒకే ధాన్యం చాల శ్రేష్ఠమైనదివుంది ఇందువలన పూర్వార్ధగోళంలో అనాగరికదశ దీర్ఘ కాలం కొనసాగి ది పశ్చిమార్ధగోళంలో అది హ్రస్వం అయింది ఇది అమెరికను ఆదివాసులకు సహకరించింది పూర్వార్ధగోళంలో అనాగరిక యుగం మధ్యదశ నాటికి మానవునికి పాలు మాంసం అందిచ్చే జంతువులన్నీ మచ్చిక అయ్యాయి అయితే వారు పంటలు పండించడం ఎరగరు అయినా వారిస్థితి జంతువుల్ని మచ్చిక చేయడం ఎరగకున్నా మొక్క జొన్న పండించడం మాత్రం తెలిసి అదే స్థాయిలో వున్న అమెరికను ఆది వాసులకన్న ఎంతో ఉన్నతంగావుంది అనాగరిక యుగంలో వున్న తెగలందరికన్న సెమిటిక్ తెగలూ, ఆర్యనుతెగలూ పురోగమించడానికి కారణం వారు పశువుల్ని మచ్చికచేయగలగడమే

ఆర్యను తెగలవారు జంతువుల్ని ముందు మచ్చిక చేసుకున్నారనీ ధాన్యాలు పండించడం తరవాత వచ్చిందనడానికి తగిన సాక్ష్యంవుంది ఆర్యనుభాషా కుటుంబపుభాషలన్నింటా జంతువుల పేర్లు ఒకే మాదిరిగావుంటాయి కాని పంటలకు మొక్కలకు పేర్లు ఒకటిగాలేవు సంస్కృతం, గ్రీకు లాటిన్ భాష లో జంతువుల పేర్ల సామ్యాన్ని మామ్‌సెన్ చూపించారు తరవాత మాక్స్‌ముల్లరు ఇతర ఆర్యన్

భాషలలో కూడ అసామ్యం చూపేరు అంటే ఆర్యుసు తెగలవారు చెదిరిపోక పూర్వమే జంతువుల్ని మచ్చిక చేశారు అంటూ థామ్సెన్ ఇల్లా అన్నారు "కాగా వారికి వ్యవసాయం తెలుసు ననడానికి సాక్ష్యం ఏమీలేదు భాషను పట్టి అయితే తెలియదనే చెప్తోంది లాటిన్ గ్రీకు భాషలలోని ధాన్యాల పేర్లు సంస్కృతంలోని పేర్లతో కలవ్వు ఒక జియా అన్నది సంస్కృతంలో యవ అవుతుంది భాషా శాస్త్ర విషయాల ద్వారా కాని అది ఇండియన్ బార్లీ పేరు గ్రీకుభాషలో దానిని స్పెల్ట్ అంటారు మచ్చికచేసిన జంతువుల పేర్లతో పోలికలుంది పంటల పేర్లతో పోలికలు లేవంటే వ్యవసాయానికి మూలం బొత్తిగా లేదని అనుకోనక్కర్లేదు భారతీయుల వరి గ్రీకుల గోధుమ స్పెల్ట్లు జర్మనుల కెల్టుల రై ఓట్లు ఇవన్నీ ఒకే కేంద్రం నుంచి విడబడ్డాయనడానికి అవకాశాలున్నాయి ఇది ఊహే మడిసాగు కన్న తోటపెంపకం ముందు జరిగింది మడి చెక్క అన్నదానికి హద్దులు వుంటాయని అనుకుంటాంగాని ఆ మాటలో దాని సూచనలేదు కాని తోట అనే అర్థంఇచ్చే హార్టోస్ అన్నదానికి దొడ్డిమట్టూ ఆవరణవున్న స్థలం అని అర్థం తోటకన్న దుక్కి ముందు జరిగివుంటుంది సహజ క్రమంలో ఖాళీగా వున్న ఒండ్రునేలల్ని ముందు దున్ని పంట వెయ్యడం జరుగుతుంది తరవాత వస్తాయి పెరళ్ళు దొడ్లు ఆవరణవస్తుంది మడి చెక్క పశువుల సాయంతో అరక కట్టిదున్నడమూ అయితే ధాన్యపు పంటకు ముందే చిక్కుడు బీన్ బీట్ దోస వంటివి ఏమన్నా పండించేరేమో అనడానికి మన వద్ద సాక్ష్యాధారం ఏమీలేదు వీటిలో కొన్నిటికి గ్రీక్ లాటిన్ భాషలలో నామసామ్యంవుంది ప్రసిద్ధ భాషా శాస్త్రవేత్త ప్రొ॥ డబ్ల్యు డి విట్నీ వీనిలో వేనికీ గ్రీకు, లాటిన్ సంస్కృత భాషలలో నామ సామ్యంలేదన్నారు

తోటలు దొడ్లు వ్యవసాయం ఇవి మనుష్యావసరాలకన్న పెంపుడు పశువుల అవసరాలకై ప్రారంభమయినట్లు తోస్తుంది పశ్చిమార్ధగోళంలో మొక్కజొన్న వేయడంతో అది ప్రారంభమవుతుంది ఈ నూతన యుగం అర్ధగోళాల రెండింటా ఏకకాలంలో జరగక పోయినా మానవజాతి భవిష్యత్తుమీద దాని ప్రభావం ఎంతో వుంది వ్యవసాయంలో నైపుణ్యం సంపాదించడానికి ధాన్యాహారంమీద ప్రధానంగా ఆధారపడాలంటేనూ సుదీర్ఘకాలం పట్టివుండాలి అమెరికాలో అది గ్రామ జీవితానికి దారి తీసింది చేపల్నీ వేటనూ వెనక్కునెట్టింది ధాన్యాలూ మొక్కల పెంపకం వచ్చేక మానవునికి తిండి సమృద్ధిగా దొరకగలదనిపించివుంటుంది

అమెరికాలో ధాన్యాహారం, ఆసియా యూరపులలో జంతువుల మచ్చికావచ్చేక

ఆ తెగలు మనుష్య మాంసం తినడం మానేశారనుకోవచ్చు ఇతర చోట్ల యుద్ధాలలో పట్టుబడినవారిని తినేసేవారు కరువులొస్తే స్నేహితుల్నీ కుటుంబంలోని వారినీకూడ తినేసేవారు ఆటవికదశ మొత్తంలో ఈ ఆచారం సాగింది యుద్ధంలో దొరికినవారిని చంపితినే అలవాటు అమెరికను ఇండియన్లలో అనాగరిక యుగం మధ్యదశ వరకూ కొనసాగింది ఇరాక్వ్యాలనూ అజ్టెకులను ఇందుకు ఉదాహరణగా చూపవచ్చు అయితే అది సర్వసాధారణ ఆచారంగా వుండలేదు మానవజాతి పరిస్థితిని చక్కబరచడంలో సుస్థిర గా దండిగా ఆహారం దొరకడానికి గల ప్రాముఖ్యాన్ని ఇది చూపుతూంది

## 4 ఆహారంగా పాలు మాంసం

ఒక్కలామా తప్ప పశ్చిమార్ధగోళంలో మచ్చిక అయే జంతువు మరొకటి లేదు రెండు అర్ధగోళాలలో పండే ధాన్యాలలో కూడ ఎంతో తేడావుంది ఈ తేడా ఈ అర్ధగోళాల ప్రజల పురోగతిలో ఎంతో అంతరాన్ని తెచ్చింది ఆటవికయుగంలో ఈ తేడాల ప్రభావంలేనేలేదు అనాగరిక యుగం దిగువదశలో కూడ కనిపించలేదు కాని, అనాగరిక యుగం మధ్యస్థదశకి వచ్చే సరికి ఎంతో అంతరం ఏర్పడింది పశువుల్ని మచ్చిక చేయడంతో పాలు, మాసం స్థిరంగాలభ్యమయ్యేస్థితి వచ్చింది ఆ అవకాశంపొందిన తెగలకూ మిగి న అనాగరిక ప్రజాసముదాయానికి తేడా వచ్చేసింది పశ్చిమార్ధగోళంలో వేటజరిగితేనే మాంసం లభ్యంఅవుతుంది ఈ పరిస్థితి గ్రామవాసి ఇండియనులకు అననుకూలం అనాగరిక యుగం దిగువదశలోవున్న ఇండియన్ల మెదడుకన్న గ్రామవాసి ఇండియన్ల మెదడు చిన్నదిగా వుండడానికి ఇదే కారణం పూర్వార్ధగోళంలో పశువులు మచ్చిక అయ్యాయి కష్టపడి సాకుతూ పొదుపుగా వుపయోగించుకు టే పాలూ మాంసం ఎప్పుడూ దొరుకుతాయి ఇవి

---

* పశ్చిమ ఇండీస్‌లోనూ మెక్సికోలోనూ మధ్యఅమెరికాలోనూ "మూగి కుక్క" (అదే జంతువో అజతెలియలేదు ఎల్ హెచ్ మోర్గన్)ను పెంచడం చూసినట్లు వెనకటి స్పానిష్ రచయితలు రాసేరు అమెరికా ఖండం మీద కోళ్ళు టర్కీకోళ్ళు వున్నాయని వారే పేర్కొన్నారు. ఆదివాసులు టర్కీ కోడిని మచ్చిక చేశారు వానొట్లాక్ తెగలు కొన్ని రకాల అడవి పక్షుల్ని మచ్చిక చేశారు

గ్రీకులు మేకలు గొర్రెలు ఆవులను పాలు పితికేవారని ఇలియడ్ కావ్యంలో హోమర్ రాసేడు

మనిషిని ముఖ్యంగా పిల్లలను ఆరోగ్యంగా చురుగ్గా వుంచుతాయి ఆర్యులూ సెమైట్లూలో కనిపించే ఉత్తమ లక్షణాలకు మూలం మనకు తెలిసినంతవరకు వారి అధీనంలోవున్న పశువుల మందలే ఇవి వాళ్ళకి క డ మాంసం పాలను జీవితంలో భాగంగాచేశాయి మానవజాతిలో మరేభాగమూ వీరి అంతగా ఈ పశుసంపదను ఉపయోగించుకోలేదు అందులోకూడ సెమైట్లకన్న ఆర్యులు ఎక్కువ లాభం పొందేరు

పశువులను మచ్చిక చేయడంతో మానవుని జీవిత పద్ధతిలోనే మార్పువచ్చింది యూఫ్రేట్స్ నదీ మైదానాలలో ఇండియాలోని మైదానాలలో ఆసియాలోని స్టెప్పీలలో పశువుల్ని తిప్పుకుటూ గోపాలకులుగా జీవించడం వచ్చింది ఈ ప్రదేశాలలో ఎక్కడో ఇది మొదట ప్రారంభమయింది వారి చరిత్రలూ వారి ప్రాచీక సంప్రదాయాలూకూడ ఈ స్థలాలనే సూచిస్తున్నాయి ఇవి మానవజాతి పుట్టిన చోట్లు కాదు అటవిక యుగంలో గాని అనాగరిక యుగం దిగువ దశలో గాని ఈ ప్రదేశాలకు రావడానికి మానవులు ఏ మాత్రం ఒప్పుకోరు ఆ దశలలో వారు చెట్లు అడవులు వుండే ప్రదేశాలలో వు డటానికే ఇచ్ఛయిస్తారు వారికవి స్వతస్సిద్ధములయిన నివాస ప్రదేశాలు ఒకమారు గోపాలక జీవితానికి అలవాటు పడ్డాక వారు తమ పశువులను తీసుకుని పశ్చిమాసియాలోనూ యూరపులోనూ వున్న అడవులలోకి మళ్ళీ వెళ్ళలేరు అల్లా వెళ్ళాలంటే ముందు మైదానాలకు దూరంగా పశువుల మేతకోసం ధాన్యాలు పండించే నేర్పు అలవడాలి పశ్చిమ దశగా వారు వలసలు పోయినప్పుడు పశుపోషణ అవసరాలకై ధాన్యాలు పండించటం ప్రారంభమయివుంటుంది ఆ విధంగా సమకూర్చుకున్న అనుభవంతో ఈ తెగలు ధాన్యాలను తమకు కూడా ఆహారం చేసుకున్నారు

పశ్చిమార్ధగోళంలో ఆదివాసులు అధిక భాగం -నాగరిక యుగం దిగువ దశకీ కొందరు మధ్యదశకీ ఎదిగారు పెరూలోని ఒక్క లామా తప్ప ఈ అర్ధగోళంలోమచ్చిక అయ్యేజంతువులులేవు ఒకే ధాన్యం మొక్కజొన్న తప్పలేదు అయితే బీన్సు గుమ్మడి పొగాకు కొన్ని ప్రదేశాలలో కోకో పత్తి మిరియము కూడ పండించడానికి వుండేవి మొక్కజొన్న మెట్టపైరు నరాసరి విత్తడానికి వీలయినది లేతగామూ ముది నాకకూడ మంచి పుష్టికరమైన ఆహారం అధికంగా పండుతుంది పోషక పదార్థాలు ఎక్కువ ఆ ప్రారంభదశలో మిగిలిన ధాన్యాలు అన్నీ కలిపితే కన్న మానవపురోగతికి అధికంగా తోడ్పడింది పశువుల మచ్చిక లేకపోయినా అమెరికన్ ఆదివాసులు అభివృద్ధి పొందడానికి కారణం మొక్కజొన్న పెరూ ప్రజలు కంచుపోత కనిపెట్టారు దాని కాలమూ ఇనుము కరిగించడం నేర్చిన కాలమూ దగ్గర దగ్గరనే

5 మడి– చెలకల వ్యవసాయం ద్వారా అపారమైన ఆహారం

మానవుని కండ బలానికి మచ్చిక చేసిన జంతువులు ఎంతో సహకరించేయి ఇది ఎంతో విలువగల కొత్త తరహా సహాయం కాల క్రమంలో ఇనుమును కనుక్కొన్నారు దానితో నాగలికి కర్రు మంచి పార గొడ్డలి వచ్చేయి ఇదివరకటి పెరటి దొడ్లలో మొక్కల పెంపకానికి సాయపడిన ఇవి మడి చెలకల సాగుకు సాయం అయ్యేయి దానితో ప్రప్రథమ గా అపారమైన జీవనోపాధి కంటి ముందు కనపడింది జంతువుల లాగుతూంటే నాగలితో దున్నడం ఒక కొత్త నైపుణ్యమే అడవుల్ని కొట్టి విశాలమైన భూముల్ని సాగులోకి తేవాలనే ఆలోచన మొదటి మాటు కలిగింది అంతేకాదు పరిమిత ప్రదేశాలలో జనసాంద్రత పెరగడానికి అవకాశం ఇప్పుడే వచ్చింది మడిచెలకల సాగు రాక పూర్వం ప్రపంచంలో ఎక్కడా కూడా అయిదారు లక్షల మందిని కలిపి వుంచిన పాలనా వ్యవస్థ లేదు ఎక్కడేనా వుందన్నా విశిష్ట పరిస్థితులలో నీటిసాగుతో పెరటిదొడ్లలో సాగు జరగగలుగుతేనూ మైదానభూములలో గోపాలక జీవిత పద్ధతి ఫలితంగానూ సంభవపడి వుండాలి

వివిధ మానవ దశలలో కుటుంబ జీవితం గురించి ప్రస్తావవశంలో చెప్పవలసి వస్తుంది ఒక దశలో వున్న కుటుంబరూపానికీ మరొక దశనాటి దానికీ పూర్తి తేడా వుండొచ్చు ఈ వివిధ రూపాల్ని గురించి మూడో భాగంలో ప్రత్యేకంగా వివరిస్తాను కాని రెండో భాగంలో వాని ప్రసక్తి తరచు వస్తుంది కనక పాఠకుని సౌకర్యం కోసం కనీసం సంగ్రహంగా వాటిని గురించి ఇక్కడ చెప్తాను

1 రక్త సంబంధీకుల కుటుంబం ఒకే గుంపుకు చెందిన సోదరీ సోదరుల వివాహం దీనికి పునాది ఇప్పటికీ అతి ప్రాచీన రక్త సంబంధీకుల కుటుంబ పద్ధతి మలయాలో వుండినట్లు సాక్ష్యం వుంది రక్త సంబంధీకుల కుటుంబ పద్ధతి అతి ప్రథమ కుటుంబ రూపం ఇది ప్రపంచం అంతటా ఆచరణలో వుండినదే

2 పునలాన్ కుటుంబం ఈ పునలా అనేది హవాయి ద్వీపపు బంధుత్వం పేరు సోదరులంతా ఉమ్మడిగా గుంపుగా భార్యలను కలిగివుంటారు ఈ కుటుంబంలో అలాగే అక్కచెల్లెళ్లు ఉమ్మడిగా గుంపుగా భర్తలను కలిగివుంటారు ఇక్కడ సోదర శబ్దం సోదరీ శబ్దం ఎంతో దూరపు బంధుత్వంవున్న సోదరీ సోదరులకు కూడా చెల్లుతుంది వారంతా సోదరీ సోదరులుగానే పిలుచుకుంటారు ఇది

ర క్త సంబంధీకులకు కుటుంబాన్ని పట్టి వచ్చిందే దీ నుంచి వచ్చినవే తురానియన్ కుటుంబ పద్ధతి గనోవానియన్ కుటుంబ పద్ధతీను ఇవీ ఇంతకు ముందు చెప్పిన పద్ధతి కూడ ఆటవిక యుగంకాలం నాటివి

3 సిండ్యాస్మియన్ (జంట) కుటుంబం సింద్యాజో అంటే జతకూడు, సింద్యాస్మోస్ జతగా ఏర్పడు అనే శబ్దం నుంచి వచ్చింది ఈమాట ఇద్దరికే పరిమితం అనే దృష్టిలేకుండానే ఒక మగ ఒక ఆడ జత కూడే వివాహ రూపం ఇది దంపతీ వివాహానికి ఇది బీజరూపం విడాకులు విడబాటుకు స్త్రీ పురుషులిద్దరికీ హక్కు ఇందులో వుంది ఈ కుటుంబ పద్ధతి ర క్త సంబంధీకుల జ్ఞాతుల కుటుంబాల నుంచి వచ్చిందే కాని వానికిది కారణంకాదు.

4 పితృస్వామిక కుటుంబం ఒక మగవాడు బహు భార్యలను కలిగి వుండడం పట్టి ఇది ఏర్పడింది హీబ్రూ గోపాలక తెగలలోని ప్రత్యేక రూప కుటుంబాన్ని సూచించడానికి ఈ పదం వాడబడింది ఆ తెగల నాయకులు పెద్దలు బహు భార్యాత్వాన్ని పాటించేవారు ఇది సార్వత్రికంకాదు కనక మానవ వ్యవహారాలలో దీని ప్రభావం తక్కువ

5 దంపతీ కుటుంబం మూడో మనిషితో సంపర్కం వుండరాని విధంగా ఒక పురుషుడు ఒక స్త్రీ వివాహం చేసుకోడం దీనికి ప్రాతిపదిక మూడో వ్యక్తితో సంబంధ వుండకూడదనడం దీనిలోని ప్రధానాంశం ఇది నాగరిక సమాజంలో వచ్చింది అందువేత ఆధునిక రూపం ఆ మాదిరి కుటుంబం స్వతంత్రంగా కొ త్త ర క్త సంబంధ వ్యవస్థను నిర్మించింది

మానవ పురోగతి క్రమంలో వివిధ దశలలో ఈ వివిధ కుటుంబ రూపాలు వుండేవని చూపడానికి ముందు పుటలలో సాక్ష్య ఆధారాలు వ్రాస్తాను

# మూడో ప్రకరణం

# మానవ పురోగతి ప్రమాణాలు

మానవ పురోగతి మార్గాల పునర్విమర్శ ఆధునిక నాగరికత కలిగించినసౌలభ్యాలు పురాతన నాగరికత కలిగించినవి అనాగరిక యుగం ఉత్తర భాగంలో కలిగినవి మధ్య భాగంలో కలిగినవి ప్రథమ భాగంలో కలిగినవి ఆటవిక యుగంలో ఆదిమానవుని దీన స్థితి క్షేత్ర గణిత ప్రమాణంలో మానవ పురోగతి మానవదశ కాలాల సాపేక్ష దైర్ఘ్యం - సెమిటిక్ ఆర్యన్ కుటుంబాల ఆవిర్భావం

పైన చెప్పిన వివిధ మానవదశలలో దేనిలో మానవుడు ఎంత అభివృద్ధి సాధించేదో తెలుసుకోవాలంటే ఒక్కొక్కదశలో సాధించిన అభివృద్ధిని ఒక చోట చేర్చి దానిని ప్రక్కవానితో పోల్చి చూసినప్పుడే అర్థమవుతుంది దీనివలన ఒక్కొక్క దశ ఎంతెంతకాలం సాగిందో గ్రహించగలుగుతాం కూడా దీనిని స్పష్టంగా తెలుసుకోవాలంటే ఆ సమిష్టి క్రోడీకరణ రూపంలో వుండాలి అంతేకాదు ఆయాదశలలో సాధించిన ప్రధాన విజయాలకే మనం పరిమితం కావాలి

మానవుడు నాగరిక స్థాయిని చేరాలంటే నాగరిక లక్షణాలన్నీ సమకూర్చుకోవాలి అంటే ప్రప్రథమంగా ఆటవిక దశనుంచి అనాగరికదశ దిగువ స్థాయిలోకి అందులోంచి హోమరుకాలంనాటి గ్రీకుల స్థాయికో అబ్రహాం కాలంనాటి హిబ్రూల స్థాయికో ఎదిగిపోవాలి నాగరికదశలో సాధించిన అభివృద్ధిని చరిత్ర నమోదు చేసింది మిగిలినదశలలో సాధించిన విజయాలు అందుకేమాత్రం తీసిపోవు

నాగరిక దశనుంచి మానవుడు జీవితం ఆరంభించిన ఆదిమకాలంవరకూ వరస క్రమంలో ఒక్కొక్క దశలో సంపాదించిన నైశికనియమాలు కల్పనలు అన్వేషణలు అతి ప్రధానమైన వానిని ఒకచోట పెట్టేస్తూ అభివృద్ధి క్రమాన్ని పట్టుకుని వెనక్కి వస్తే ఒక్కొక్క దశలో మానవుడు ఎంతెంత అభివృద్ధి సాధించేదో తెలుసుకోవచ్చు

ఆధునిక నాగరికతయొక్క ప్రధాన విజయాలు టెలిగ్రాఫ్ బొగ్గునుంచి గాస్ వడుకుయంత్రం మరమగ్గం ఆవిరియంత్రమూ దానిమీద ఆధారపడి నడిచే రైలు ఇంజను మొదలైన ఇతరయంత్రాలు రైలుమార్గము ఆవిరిఓడలు టెలిస్కోపు వాతావరణం గురించి సౌరకుటుంబంగురించి పరిశీలించే పద్ధతులను కనుక్కోవడం ముద్రణకళ కాలువలకు లాకులు నౌకలకు దిగ్దర్శిని తుపాకిమందు మొదలైనవి ఇతరేతర కల్పనలు ఎరిక్సన్ ప్రొపెల్లర్ వంటివి దేనికో ఓ దానికి అనుబంధాలు అయితే ఫొటోగ్రఫీవంటి ఇతరములైన పెద్దగా పేర్కొనవలసిన అవసరంలేని అనేక కల్పనలు వున్నాయి దీనితోపాటు ఆధునాతన విజ్ఞాన శాస్త్రాలు మత స్వాతంత్ర్యం ప్రజాస్వామికానికి పాతకాలలు వున్నాయి ప్రతినిధుల తోటి ప్రజాతంత్రం పార్లమెంటుతోపాటు బద్ధనిబద్ధమైన రాజరికం ఫ్యూడల్ రాజ్యాలు ఆధునికయుగపు సంపన్నవర్గాలు అంతర్జాతీయ నిబంధనలు సార్వజనిక చట్టాలున్నాయి వీటన్నింటినీ పక్కకు పెట్టాలి

ప్రాచీన నాగరిక సమాజాలలోని మంచిని తనూ ఆధునిక నాగరికత తీసుకుని స్వాయత్తం చేసుకుంది ఆధునిక నాగరికత మానవునికి ఎంతో అద్భుతమైన విజ్ఞానాన్ని వేగంగా సమకూర్చిపెట్టినా ప్రాచీన నాగరికతలను దిగతొక్కి కనపడకుండాచేసేటంత అధికంకాదు, అది

*గోథిక్* వాస్తుకళను *వంశపారంపర్యపు హోదాలను తెలిపే బిరుదులుగల* ఫ్యూడల్ పెత్తందారులను పోప్‌కింద వంశక్రమంతో మతాచార్యులను ప్రసాదించిన మధ్యయుగాలను దాటితే రోమను, గ్రీకు నాగరికతలవద్దకు వస్తే ఆ కాలంలో గొప్ప కల్పనలు, అన్వేషణలు కనిపించవు. కాని కళలకు తాత్వికచింతనకు, శారీరక నియమాలకు అవి చాల ప్రసిద్ధిపొందేయి చక్రవర్తి ప్రభుత్వాలూ రాజరికప్రభుత్వాలూ పౌరచట్టం, క్రైస్తవమతం పెత్తందార్లూ ప్రజా ప్రతినిధులతో సెనేటు కాన్సల్‌లుగల ప్రభుత్వం విధానసభ, ప్రజా ప్రతినిధిసభగల ప్రజాతంత్ర ప్రభుత్వం సైనిక శిక్షణ నిచ్చిన కాల్బలం అశ్విక సైన్యాలనిర్మాణం నౌకాయుద్ధాల నేర్పుతో నౌకాసైన్యనిర్మాణం మునిసిపల్ చట్టాలతో మహానగరాలనిర్మాణం సముద్రాంతర వాణిజ్యం నాణేల ముద్రణ భూభాగాల ఆస్తి ప్రాతిపదికపై రాజ్యాల నిర్మాణం కాల్చిన ఇటిక వరుసలు ఎత్తేక్రేన్ మిల్లును తిప్పేందుకై నీటితో తిరిగే చక్రం వంతెనలు అక్విడక్టులు మురుగు నీటిపారుదలకు గొట్టాలు కుళాయి గొట్టాలుగా ఉపయోగించే సీసంగొట్టం కమాను తూకప్పు క్రాము వివిధ వాస్తుకళలతో పలు పూర్వకాలపు కళలు

శాస్త్రాలు అరబిక్ అంకెలు అక్షరాలతో వ్రాత ఇవన్నీ ఈ నాగరికతలు మనకిచ్చినవి

పూర్వపు అనాగరిక యుగంలో సంపాదించిన కల్పనలమీద అన్వేషణలమీద నైతిక నియమాలమీద ఆధారపడి ఏర్పడినవే ఇవన్నీ నాగరిక మానవుడు సాధించినవి విజ్ఞానికి చాల గొప్పవీ గణనీయములూనే అయినా మానవుడు అనాగరిక దశలో సాధించిన విజయాలను మరిపింపచేసేటంత మహత్తరములు కావు ఒక్క అక్షర రచన తప్ప నాగరికతకు సంబంధించిన మూలవిషయాలన్నీ అనాగరిక మానవుడు ఎరుగును అతనికి అవి అన్నీ చేతనవును అనాగరికదశలో మానవుని విజయాలను మానవుడు పొందిన అభివృద్ధి మొత్తంతో పోల్చిచూడాలి సాపేక్షంగా ఆలోచిస్తే తరువాతికాలపు విజయాలన్నిటికన్నా అవి అధిక ప్రాముఖ్యం గలవేనని ఒప్పుకోక తీరదు

అక్షర రచనగాని దానికి సమానమే అయినదే రాళ్ళమీద చెక్కిన చిత్రరచన గాని నాగరికత ఆరంభానికి మంచి పరీక్ష అనవచ్చు రాత మూలకమైన ఆధారాలు లేనిదే చరిత్రగాని నాగరికతగాని వున్నదనడానికి గట్టి అవకాశంలేదు మౌఖికంగా వున్నా రాతపూర్వకంగా వున్నా హోమరు రచనలే గ్రీకు నాగరికతారంభాన్ని సూచిస్తున్నాయి ఈ గీతాలు నిత్యనూతనం నిత్య సుందరమూను వానిలోని మానవ విలువలు వాని ఇతర మంచి లక్షణాలకు మెరుగుపెడుతున్నాయి దీనిలో ఇలియడ్‌ను ముఖ్యంగా చెప్పాలి ఆయన రచనలలో అది చాలా మొదటిది దాని రచనా కాలం వరకూ మానవజాతి సాధించిన అభివృద్ధికి దాఖలాగా వున్నదని హోమరును భూగోళశాస్త్ర జనకుడంటాడు స్ట్రాబో అయితే ఆ మహా రచయిత అనుకోకుండానే తరవాతితరాలకు ఒక మహానిధిని అందజేశాడు ప్రాచీన గ్రీకు ప్రజల కళలు వాడుకలు,

• గొప్పగొప్ప కల్పనలన్నింటిలాగే ధ్వని సంకేతాక్షర రచన కూడా ఎంతో ప్రయత్నం ఫలితంగానే వచ్చింది ఈజిప్షియనులు చాల నెమ్మదిగా అనేక రూపాలలో మార్చిమార్చి చిత్రలిపి ప్రారంభించేరు. చివరకు చిత్రాలనే ధ్వని సంకేతాలుగా స్థిరపరిచి రాళ్ళమీద చెక్కడం ప్రారంభించేరు. నౌకాయానం సముద్రాంతర వర్తకం మొట్టమొదట ప్రారంభించిన ఫొనీషియన్లు ఆ వ్రాత చూసేరు. వారికి అదివరకే చిత్రలిపి తెలుసో లేక ఈజిప్షియనులను చూసేక కలిగిన ప్రోత్సాహమో చిత్రాలకు బదులు ధ్వని సంకేతాలతో 16 అక్షరాలను కల్పించారు కాలక్రమంలో మానవజాతికి భాషాలిపి వచ్చింది. క్రమంగా సాహిత్యం, చారిత్రక సక్రమ సాధ్యం అయింది

కల్పనలు అన్వేషణలు జీవిత పద్ధతులను ఆయన దానిలో వర్ణించేరు అనాగరిక దశనాటి ఆర్యజనసమాజం యొక్క సమగ్ర చిత్రాన్ని అంతవరకు వారు సాధించిన దేమిటో సవివరంగా అందించేరు నాగరికదశలో అడుగుపెట్టక పూర్వం గ్రీకులకు తెలిసింది ఏమిటో దీనినుంచి మనం తెలుసుకోగలం అంతేకాదు అనాగరిక దశలోనూ ఇంకా అంతకన్న పూర్వంనాటి పరిస్థితు లెల్లావుండేవో కూడ చెప్తుంది

హోమరు రచనలు ఆధారం చేసుకొని అనాగరిక యుగంలోని ప్రారంభకాలం దిశగా వెళ్ళాలంటే మనంకవిత్వాన్ని మరిచిపోవాలి మానవజాతి కల్పనలు అన్వేషణల నుంచి ప్రాచీనకాలపు దేవతల్ని నాగరికతల్ని ఒలింపియాలోని దేవతల్ని దేవాలయ శిల్పాన్ని మరిచిపోవాలి ఒక్క మొక్కజొన్న చెట్ల పెంపకం తప్ప మిగతా సస్య ధాన్యాలగురించిన పరిజ్ఞానాన్ని మరవాలి రాతిగోడల మధ్య బురుజులు గవనులు ద్వారాలతో నగరనిర్మాణాన్ని భవన నిర్మాణ లో చలవరాయి వుపయోగాన్ని చెక్కలతో బహుశా షేకులు కూడా ఏర్పరిగివుండవచ్చు నౌకల నిర్మాణాన్ని బళ్ళు రథాలను లోహకవచాన్ని రాగిములుకు వేసి బల్లెం ఉప్పెత్తుగా వుండేదాలును ఇనుము కత్తిని, బహుశా మద్యం తయారీని బరమా మినహాగా చేతివృత్తి పనిముట్లు కుమ్మరి చక్రాన్ని ధాన్య పిండి చేయడానికై తిరగలిని నార పూలుతో మగ్గ మీద బట్టలనేతను ఇనుప గొడ్డలి పారలను ఇనుప మత్తి బాడిసెను మత్తి దాగిలిని కొలిమిని కొలిమి తిత్తిని ఇనుము గురించీ ఇనుము కరిగించేందుకై కొండపక్కనే కట్టినబట్టీల గురించి మానవునికివున్న పరిజ్ఞానాన్ని మరిచి పోవాలి వీనితోపాటు దంపతీకుటుంబాన్ని వీరయుగంనాటి సైనిక ప్రజాతంత్రాల్ని గణాలుగా ఫ్రాత్రీలుగా తెగలుగా వచ్చిన తర్వాతికాలపు సమాజనిర్మాణాల్ని అగోరా లేక పౌరసభను ఇళ్ళు భూములమీద వ్యక్తిగత ఆస్తి హక్కును కోటలలో బాగా అభివృద్ధి పొందినరూపంతో వున్న నగరాల చట్టబద్ధ జీవితాన్ని మరిచిపోవాలి ఇది జరిగినప్పుడు అనాగరికయుగం ఎగువదశలోని మానవుడు తన మహత్సాధనాలు వాని ద్వారా లభించిన మానసిక నైతిక అభివృద్ధిలో ప్రధాన భాగాన్ని పక్కకుపెట్టే సట్లు అవుతుంది

ఇక్కడి నుంచి అనాగరిక యుగంమధ్య దశగుండా వెనక్కి పరిక్రమించాలంటే దానిగుర్తులు స్పష్టంగా కనిపించవు ఏవరస క్రమంలో నైతికనియమాలు అన్వేషణలు కల్పనలు పురోగమించేయో స్పష్టంగా అర్థంకాదు అయితే అంత ప్రాచీనకాలంలో కూడా ఆర్యుల కుటుంబాల జీవితగతి పూర్తిగా తెలియకుండా వుండలేదు ఆర్యేతర కుటుంబాల సమాచారం కూడా సేకరించ వలసివుంది

అనాగరిక యుగం మధ్యదశలోకి వస్తే ఇంతకుపూర్వం లాగే మనం పక్కకు పెట్టవలసినది, కంచు తయారుచేసే పరిజ్ఞానం మచ్చికచేసిన పశువుల మందలు పచ్చిఇటిక గోడలతో సామూహిక గృహనిర్మాణం మన్ను ఇసక కలిపిన మందడితో చెక్కుడురాతి గోడలనిర్మాణం, పెద్దపెదరాళ్ళతో మహాకుడ్యాల నిర్మాణం చెరువులలో కర్రస్తంభాలమీద గృహనిర్మాణం నైసర్గిక శుద్ధలోహాల పరిజ్ఞానం బొగ్గుతో మూసలలో లోహాల్ని కరిగించడం రాతిగొడ్డలి ఉలి అను మగంయొక్క ఆదిమ రూపాన్ని నీటిపారుదలతో సాగు, కట్టబాటులు చెరువులు నీటిపారుదల కాలవలు రాయిపరిచినరోడ్లు ఓసీర్ తీగతో ఉగుడువంతెనలు కుటుంబ దేవతలు ప్రత్యేక దుస్తులతో పురోహితులు వారిలో హెచ్చుతగ్గు వరసక్రమం నరబలులు అజ్ టెక్ జాతులలోవున్న మాదిరి సైనిక ప్రజాతంత్రాలు పశ్చిమార్ధ గోళంలో వత్తితోనూ మొక్కల నారతోనూ పూర్వార్ధ గోళంలో ఉన్ని కిత్తనారలతోనూ బట్టలనేత రంగులద్దిన కుండలు చెకుముకి ములికలు బిగించిన కర్రకత్తులు చెకుముకి రాయితో చేసి, పదునుకు తెచ్చిన ఆయుధాలు పత్తి నారల పరిజ్ఞానం పశువుల మచ్చికయున్నూ పక్కకు పెట్టాలి

ఈదశలో సాధించిన విజయాల మొత్తం, తరవాత దశలో సాధించిన వానికన్న తక్కువే కాని మానవజాతి మొత్తం అభివృద్ధితో పోల్చినప్పుడు అదిచాల ఎక్కువ ఈదశలో పూర్వార్ధభాగంలో పశువుల్ని మచ్చిక చేశారు అందువలన పాలు మాంసం జీవనోపాధికి పుష్కలంగా దొరికేయి అదేచెంత మడి సాగుకుదారి చేసింది శుద్ధ ప్రాకృతిక లోహాలలో జరిగిన పరిశీలనలలో కంచు ఉత్పత్తి అయింది క్రమంగా ఇనుప ఖనిజాన్ని కరిగించే నేర్పుదొరికింది పశ్చిమార్ధ గోళంలో కూడ ప్రాకృతికలోహాల్ని కనుక్కొని వానితో అన్వేషణలు జరిగించి స్వతంత్రంగానే కంచును కొనుక్కొన్నారు మొక్కజొన్ననూ ఇతర మొక్కలనూ పెంచడంలో నీటి పారుదలను ప్రవేశపెట్టేరు రాయి, పచ్చిఇటికతో కోటల మాదిరిగా పెద్దపెద్ద సామూహిక నివాసగృహాలను నిర్మించేరు

ఇంకా వెనక్కి వెళ్ళి అనాగరిక యుగం దిగువ దశలోకి అడుగుపెడితే మానవజాతి విజయాలనుంచి తొలగించవలసి వచ్చేవి ఇవి గణాలు ప్రాత్రే తెగలు ఎనాదిగా ఏర్పడిన కాన్ఫెడరసీ, అంతకు పూర్వంకన్న ఎంతో నిర్మాణయుతమైన సమాజాన్ని నెలకొల్పిన తెగ నాయకుల సమితిచేతిలో ఏర్పడిన ప్రభుత్వమూను మొక్కజొన్న చిక్కుడు, దోస, పొగాకుల పెంపకంతోపాటు పశ్చిమార్ధ గోళంలో

ధాన్యం పిండిని తిండికి ఉపయోగించడం నేర్చుకున్నారు పడుగు పేక వేసి చేతితో నేత నేర్చుకున్నారు పదను పెట్టిన లేడి చర్మంతో మొలకుర్ధ మోకాస్సిన్ (బూట్) లెగ్గిన్‌లు తయారు చేశారు పక్షుల వేటకు గాలి తుపాకి చేశారు రక్షణకై గ్రామం చుట్టూ దడి కట్టేరు తెగల క్రీడలు పూజాగంధాల సూచనలు మహాదేవత వుందనే భావానికి సూచనలు యుద్ధ కాలంలో నరమాంస భక్షణ చివరదిగా కుండల తయారీ ఇవన్నీ ఈ దశలో వచ్చినవి

కాలాన్ని అభివృద్ధిని పట్టి మనం ముందడుగు వేసినా మానవ పరిణామ ప్రమాణాన్నిపట్టి వెనక్కి మళ్ళినా కల్పనలు చాల సాధారణంగా వుంటాయి ప్రాథమికావ రాలకు అనుగుణమైనవై వుంటాయి సామాజిక నిర్మాణం అతి ప్రాథమిక స్వరూపాలకు సన్నిహితంగా వుంటుంది రక్త సంబంధ మీద ఏర్పడిన గణాలు వారిలో ఎన్నుకున్న పెద్ద బంధుత్వంగల గణాలు కలిసి తెగ వుంటాయి దాని పాలనాధికారాన్ని నాయకుల సమితి నిర్వహిస్తుంది ఈ కాలంనాటికి ఆర్యను సెమెటిక్ తెగలంటూ వేర్పడడం జరిగి వుండదు ఈ కాలంనాటి ఆసియా యూరపు ప్రజల స్థితుగతులేమిటో తెలియవు జంతువుల్ని మచ్చిక చేయడానికి కుండలు చేయడానికి మధ్యకాలపు చిత్రాలు దొరుకుతున్నాయి వానినిపట్టి పూర్వాంచాలి బాల్టిక్ సముద్ర తీరాన వర్తుల గుల్లల్ని ఆలిచిప్పల్ని పెద్ద పెద్ద పోగులుగా పోసిన జనంకూడా ఆనాటివారే వారికి ఒక్క కుక్కతప్ప మరే పెంపుడు జంతువూ లేదు

ఆటవిక యుగం మూడు దశలలోనూ మానవుడు పొందిన విజయాలు చాలా గొప్పవి సంఖ్యలోనే కాదు వాని అతర్లీన విలువలు కూడా వానితోపాటు తప్పని సరిగా వచ్చే మానసిక నైతికాభివృద్ధికూడా చాల ఎక్కువ

సుదీర్ఘ కాలం సాగిన ఆటవిక యుగంలో మానవుడు సంపాదించిన విజయాలు గణాలు స్త్రీలు తెగలుగా నిర్మాణం జంట కుటుంబం అతి ప్రాథమిక రూపంలో ప్రకృతి శక్తుల ఆరాధన ఏకపద భాష విల్లు అంబు, రాయి ఎముకతో చేసిన పనిముట్లు తీగ పేముతో చేసిన బుట్టలు చర్మపు వస్త్రాలు పునలాన్ కుటుంబం స్త్రీ పురుష భేదం ప్రాతిపదికపై సంఘ నిర్మాణం గుంపుగావున్న గుడిసెలతో గ్రామం దోనెలు పడవల నిర్మాణం చెకుముకి పేడుతో మలికి తీర్చిన బల్లెం యుద్ధానికి గద మోటయిన చెకుముకి రాతి పనిముట్లు రక్త సంబంధీకుల కుటుంబం ఏకాక్షర భాష ప్రకృతి దేవతారాధన నరమాంసాహారం నిప్పునుపయోగించే పరి

జ్ఞానం సంజ్ఞలతో భాష ఈ విజయాలను మానవుడు పొందిన క్రమంలోనే ఒక్కొక్కటే మినహాయిస్తూ వెనక్కి వస్తే మానవుని శైశవ దశకు వస్తాం మానవుడు నిప్పునుపయోగించ కోడం నేర్చుకున్న దశ అది దానినుంచి చేపల్ని ఆహారం చేసుకో గలుగుతాడు అక్కడినుంచి తాను పుట్టినచోటు వదిలి బయటపడగలుగుతాడు

---

భాష పుట్టుక గురించి చాల పరిశోధనలు చేసి చేసి, తేలక పూరుకున్నా రనిపిస్తుంది భాషకి వస్తువుకన్న మానవుని పురోగతి బౌద్ధికంగా అవసరమైన క్రియలూ ముఖ్యం అదిమ దశలో మానవుడు నట్టుతూ సజ్ఞలూ ధ్వనులతో తన మనసులోని భావాన్ని ఎదటివానికి తెలిపేవాడని బ్రుక్రేషియను రాసేడు ఆలోచన దాని *తరవాత మాట వచ్చిందం టాడు నోటి మాటకు ముందు సజ్ఞలు వుండేవంటాడు* అటవిక దశలో కాదుగాని అనాగరిక దశలో విభిన్న భాషలవారు కలిసినప్పుడు సంజ్ఞల తోనే మాట్లాడుకుంటారు అమెరికను ఇండియనుల సంజ్ఞల భాష ఎంతో అందంగా భావస్ఫోరకంగా చూడ ముచ్చటగా వుంది దానిని సర్వత్ర సాధారణంగా వుపయో గించవచ్చుననిపిస్తుంది సహజ సంజ్ఞా సంకేతాల భాష అది ప్రపంచభాష కావడానికి కావలసిన హంగులు వున్నాయి ధ్వని సంకేతాల్ని కల్పించడంకన్న సంజ్ఞలు కల్పిం చడం సులభం దాన్ని సులభంగా నేర్చుకోవచ్చు నైపుణ్యం సంపాదించవచ్చు *అందుచేతనే నోటి మాటకన్న సంజ్ఞల భాష ముందు వచ్చిందని వూహిస్తున్నారు* ఈ వూహనిబట్టి సజ్ఞలకు సహకారంగా కంఠ ధ్వనులు వస్తాయి క్రమంగా ఆ ధ్వని సంకేతాలు ఒక నిర్దిష్ట రూపం తీసుకుని సంజ్ఞలను వెనక్కి నెట్టేస్తాయి ఆ విధంగా సంజ్ఞలు కంఠ ధ్వనులలో భాగం అవుతాయి కంఠనాళాల శక్తి విస్తరించడానికి అవి పోయపడతాయి నోటి మాటకు ప్రారంభంనుంచి సంజ్ఞలు తోడుగా వుంటూ వచ్చే యనే అనుకోవాలి ఇప్పటికీ వాటి అనుబంధాన్ని విడతీయరాకుండానేవుంది వెనకటి అలవాటు ఇంకా కొనసాగుతూందన్నా తప్పులేదు. భాష అనేది పరిపూర్ణంగా వుంటే అర్థాన్ని నొక్కి చెప్పడానికి సాగతియ్యడానికి సంజ్ఞలు అనవసరం భాష ఏర్పడిన క్రమంలో వెనక్కి వెళ్ళనకొద్దీ సంజ్ఞా భాగం పెరుగుతుంది వైవిధ్యమూ పెరుగు తుంది చివరకు నోటిమాట ధ్వనులు సంజ్ఞలకు సాయంగావుండే స్థితి కనబడుతుంది ఆ సంజ్ఞలు లేకపోతే ధ్వనులు అర్థమే కావు *అవి ఒకదాని పక్క ఒకటి* పెరుగుతూ అటవిక దశనుంచి మనిషి అనాగరిక దశలోకి వచ్చేసరికి రెండూ అభేద్యంగా కలిసి పోయాయి భాష మూలాన్ని తెలుసుకోవాలంటే సంజ్ఞల భాషనుంచి దారి దొరుకుతుంది.

అప్పుడే గోటమాట వచ్చింది ఈ పట్టంలో మానవుడు పరిణామ క్రమంలో అట్టడుగు మెట్టులో వున్నాడనాలి అతనికి మెదడుంది కాని అభివృద్ధి క్రమంలో వచ్చిన ఆలోచనలు నైతిక నియమాలకు కల్పనలకు అన్వేషణలకు సంబంధించిన ఆలోచనలు అవేవీ దానిలో ప్రవేశించలేదు ఒక్కమాటలో చెప్పాలంటే అతడు అట్టడుగు మెట్టుమీదనే వున్నాడు, అయితే భవిష్యత్తులో విజయాలు సాధించగల శక్తి అతనిలో వుంది

అన్వేషణలు కల్పనలుతో నైతిక నియమాల పెరుగుదలతో మానవ మేధస్సు పెరిగి విస్తరించింది క్రమంగా మెదడు పెరుగుతుంది ముఖ్యంగా నాడీమండలం భాగ విస్తరించింది మేధోవికాసం నెమ్మదిగానే జరుగుతుంది అది సహజమే ఏమీ లేని చోట అది సాధారణమైన కల్పనచేయాలి మెదడుకి సాయపడేది ఇంచుమించు ఏమీ వుండదు అల్లాంటి అతి గడ్డు జీవితపరిస్థితులలో తన ఎదురుగా వున్న ప్రకృతిలో ఏదన్నా కొత్తదానిని కనుక్కోవడం, సృష్టించడం ఇంచుమించు అసంభవం అటువంటి ఆటవిక స్థితిలో అతి సాధారణమైన సామాజిక నిర్మాణాన్ని ఊహించడం కూడా సాధ్యంకాదు మొట్టమొదటి కల్పనలనూ మొట్టమొదటి సామాజిక నిర్మాణాన్నీ సాధించడమే చాల కష్టం అ దుచేతనే ఒక దానికీ రెండోదానికీ మధ్య అంతంత వ్యవధి తీసుకోవడం. దీనికి వుదాహరణ వేర్వేరు కుటుంబ రూపాల అవతరణే ఈ అభివృద్ధి గతి క్షేత్రగణిత ప్రమాణంలో సాగుతుంది అందుచేతనే మానవుని ఆటవికదశ సుదీర్ఘకాలం సాగిందనడం

పైన చెప్పిన విధంగా మానవుని ఆద్యకాలంగడిచి వుంటుందనేది కొత్త ఆలోచనకాదు. ప్రాచీన కవులూ తత్వవేత్తలలో కొందరు ఈ విస్మయాన్ని గుర్తించేరు వారి అభివృద్ధిక్రమాన్ని అన్వేషణలూ కల్పనలూలో చూడగచ్చునని కూడా గమనించేరు. అయితే సామాజిక నిర్మాణాలలో అందుకు తిరుగులేని సాక్ష్యం దొరుకు తుందనేది వారూహించలేదు

ఈ అభివృద్ధియొక్క సాపేక్ష ప్రమాణానికి ఆయా మానవ దశాభేదాల సాపేక్ష దైర్ఘ్యాలకూ సరాసరి సంబంధం వుంది మానవుని పురోగతి ప్రారంభంనుంచి నేటివరకూ ఇంచుమించు క్షేత్రగణిత ప్రమాణంలోనే సాగుతూంది యదార్థ ఘటనలు దీనికి సాక్ష్యం సాధించిన ప్రతి నైరూప్య(absolute) జ్ఞాన అంశమూ ఇతర సాధన

౩)

పొవులర్ షా మార్టు
గ్రూపు సంస్థలు

లకు దారితీసింది ఆ క్రమంలోనే మనం ఈనాటి సంక్లిష్ట జ్ఞానభాండారాన్ని సంపాదించాం ప్రథమదశలో అభివృద్ధి నెమ్మదిగా వుంది తరవాత వేగవంతమయింది అందుచేత ప్రథమదశలో సాధించినది సాపేక్షంగా అత్యధికమూ తరువాతి సాధనలు సాపేక్షంగా తక్కువగా వున్నాయి అనవచ్చు ఈ పరిగణన మానవజాతి మొత్తం సాధనం దృష్టిలోంచి చూసినప్పుడే, దీనిని పట్టి ఆటవిక దశలో మానవుడు సాధించినది తరువాత అనాగరికయుగం మూడు దశలలోనూ సాధించిన దానికన్న చాల ఎక్కువ అని చెప్పాలి అలాగే అనాగరికదశలో సాధించినది నాగరికదశలో సాధించిన దానికన్న చాలా ఎక్కువ

వివిధ మానవదశల సాపేక్ష దైర్ఘ్యాలు ఊహామాత్రగానే నిర్ణయించతగినవి అది ఇంతింత అని నిశ్చితంగా చెప్పడానికి వీలుకాదు ఊహించుకోవడమే క్షేత్రగణిత ప్రమాణసిద్ధాంతం ప్రకారం ఆటవిక యుగం అన్నిటికన్న దీర్ఘం అనాగరిక యుగం నాగరిక దశకన్న దీర్ఘం ఎంతెంత ? భూమిమీద మానవుని పుట్టుక లక్ష సంవత్సరాల నాటిదనుకుంటే దానిలో అయిదింట మూడువంతులు అంటే 60 వేల సంవత్సరాలు ఆటవిక యుగాన్నిగా లెక్కవేయవలసి వుంటుంది మిగిలినదానిలో 20 వేల సంవత్సరాలు అయిదో వంతు భాగాన్ని అనాగరికయుగం దిగువదశకి కేటాయించాలి మిగిలిన మధ్య ఎగువదశలకు పదిహేనువేల సంవత్సరాలు మిగిలిన అయిదువేల సంవత్సరాలు నాగరికదశకు

ఈ లెక్క లెల్లా కట్టేరన్న ప్రశ్న అనవసరం మానవుని ఆటవికదశ పైలెక్కలోకన్న ఎక్కువే వుండి వుంటుంది ప్రాచీన కళారూపాలు చూస్తే మానవుని అభివృద్ధి క్రమాధిక ప్రమాణంలో కనిపిస్తూనేవుంది నైతిక నియమాలలో కూడ అదే నిజం ఆటవికదశలో మానవుని అనుభవం దీర్ఘకాలం పరివ్యాప్తమనీ, నాగరికదశ మానవజాతి జీవితంలో చాల స్వల్ప వ్యవధి కలదనీ చెప్పడం మానవ శాస్త్రంలో ప్రధాన విషయం

వివిధ జంతువుల మందలు కలిగి వుండడంవల్లనో జీవనోపాధి మంచిది కావడంవల్లనో స్థాన విశిష్టతవల్లనో లేక అన్నీ కలిసి రావడంవల్లనో ఆర్యన సెమిటిక్ జాతులు అనాగరిక దశ నుంచి మొట్టమొదటగా బయటపడ్డారు వారే నాగరికతకు ఆరంభకులు అయితే వారు వేరు వేరు జాతులుగా విడబడినది తరువాత

తరువాత జరిగినది వారిద్దరి పూర్వులెవరో చెప్పలేము ఆనాటి అనాగరిక జన సముదాయంలో వారూ ఒకరు అంతే జంతువులను మచ్చికచేసిన సందర్భంలో మొట్ట మొదట ఆర్యను తెగల పేరు వినిపిస్తుంది ఆనాటికి వారిద్దరిదీ భాష ఒక్కటే అది ఒకటేజాతి అనాగరికయుగం మధ్య దశకి ముందు ఆర్యను సెమెటిక్ జాతులు విడబడి విలబడగల స్వతంత్రస్థాయికి ఎదగడం జరిగి వుండదు పశువులను మచ్చిక చేయడమే వారిని అనాగరిక ప్రజాసముదాయం నుంచి వేరుపరచింది

మానవజాతిలో ఎంతో పురోగమించిన జనంకూడా ఒక్కొక్కదశకు వచ్చేక వారి పురోగమనం నిలిచిపోతుంది పశువుల్ని మచ్చిక చేయడం ఇనుము కరిగించడం వంటి ఓ గొప్పకల్పనో అన్వేషణో జరిగి వారిని ముందుకు నెట్టాలి ఆ విధంగా వారు నిలబడిపోయి వున్నకాలంలో అంతవరకూ వెనకబడివున్న జనసంఘాలు పురోగమిస్తూ కొంచెం ఇంచుమించు అదే స్థాయిని అందుకొంటారు ఖండాలమధ్య సంబంధాలు వుంటే అక్కడుండే తెగలన్నీ ఏదోరూపంలో ఒకరి పురోగతిని మరొకరు పంచుకొంటూనే వుంటారు గొప్పగొప్పకల్పనలూ అన్వేషణలూ వాటంతట అవే ప్రచారం అవుతాయి అయితే వెనకబడివున్న తెగలు ఆ నూతన కల్పనల అన్వేషణల విలువను అర్థం చేసుకుంటే తప్ప వాటిని స్వీకరించలేవు భూఖండాల మీద కొన్ని తెగలు ముందు దారితీస్తాయి అయితే ఒక్కో మానవదశా కాలంలో ఆ నాయకత్వం అనేక మార్లు ఇతర తెగలచేతికి పోతూంటుంది కొన్ని కొన్ని తెగలు క్షీణించి వాని జీవితమూ మానవసంబంధాలూ విచ్ఛిన్నమై కొంతకాలంపాటు మానవ జాతి పురోగతియే నిలిచి పోవచ్చు ఇల్లాగ చాల మార్లేజరిగింది అనాగరికయుగం మధ్యదశ నుంచీ ఈ పురోగతికి ఆర్యను సెమిటిక్ తెగలు ప్రాతినిధ్యం వహించాయి అయితే నాగరిక దశ వచ్చాక క్రమంగా ఆ ప్రాతినిధ్యం ఆర్యనుల చేతుల్లోకి వచ్చేసింది

దీనికి వుదాహరణగా యూరపియనులు అమెరికాను కనుగొన్ననాడు అక్కడున్న ఆదివాసుల్ని చూపించవచ్చు అమెరికాఖండంలో వారి జీవితం ఆటవిక దశలో ప్రారంభమయింది ఆనాటి వారి మానసిక శక్తులు తక్కువే అయినా వారు మొత్తంగా ఆటవికదశను దాటి అనాగరికయుగం దిగువదశకి ఎదిగేరు వారిలో ఒకభాగం ఉత్తర దక్షిణ అమెరికాలలోని గ్రామవాసి ఇండియనులు వీరు మధ్యదశకి ఎదిగేరు

అమెరికాలో మచ్చికకాగల ఉపయోగ పడగల జంతువు పెరూలోని లామా ఒక్కటే దానిని మచ్చిక చేసుకున్నారు తగరాన్ని రాగినీ కలిపి కంచును తయారుచేసుకున్నారు ఇనుమును కరిగించడం ఒక గొప్పకల్పన అది తెలుసుకోగలిగితే అనాగరికదశ ఎగువ దశకి చేరుకొంటారు పూర్వార్ధగోళంలోని పురోగమించిన తెగలతో ఏమాత్రం సంబంధం లేకుండానే వారు స్వయంగా ఇతరులతోడ్పాటు లేకుండా ఆటవిక దశనుంచి ఎదిగేరంటేనే చాల గొప్పవిషయం యూరపు ఆశియాలలోని తెగలు ఇనుప పనిముట్లు సంపాదించే క్రమంలో వుండగా అమెరికను ఇండియనులు కంచును కనిపెట్టేక్రమంలో వున్నారు ఇనుముకన్న కంచు ఒక్కమెట్టే వెనకవుంది పూర్వార్ధ గోళంలో మానవ పురోగతి నిలిచిపోయిన ఈకాలంలో అమెరికను ఇండియనులు అమెరికాను కనుగొన్న నాటికి వున్నదశకు ఎదగలేదుగాని కొంచెం ఇంచుమించు దగ్గరకువచ్చేరు ఈలోపున పూర్వార్ధగోళపు తెగలు అనాగరిక యుగం ఎగువదశకి అందు నుంచి నాగరికదశలోకి అందులో కూడ నాలుగువేల ఏళ్ళు ముందుకి సాగిపోయేరు ఆర్యను తెగలకన్న అమెరికను ఆదివాసులు ఎంతకాల వ్యవధి వెనకబడివున్నారో దీనినిపట్టి తెలుస్తుంది అనాగరిక యుగం ఎగుదశాకాలము నాగరిక దశలో నాలుగు వేల ఏళ్ళూ కలిపితే ఆ వ్యవధి ఆర్యను గనోనియను తెగలు రెండూ మానవజాతి పురోగతి దశలు అయిదింటికి ఉదాహరణలను చూపుతున్నాయి ఆటవికయుగం దిగువదశకి ఉదాహరణగా ఎవ్వరూ ఎక్కడాలేరు

ఆటవికయుగంలో మానవజాతి రూపుదిద్దు కుంటుంది పరిజ్ఞానం, అనుభవం ఏ మాత్రంలేని దశలో వుంటాడు మానవుడు నిప్పు నెరగడు మాటలేదు ఓ నేర్పు వుండదు. ఆ స్థితిలోవుండి మన పూర్వీకులు మొదట బతికి వుండడానికీ తరవాత పెరుగుదలకూ మహా పోరాటం జరిపేరు క్రూరమృగాల నుంచి రక్షణ కావాలి సుస్థిర జీవనోపాధి దొరికే వరకూ ఆ పోరాటం సాగింది ఆ ప్రయత్నాలలో మానవుడుమాట నేర్చేడు క్రమంగా భూగోళం నలుమూలలకీ వ్యాపించేడు వారి సంఖ్య తక్కువ సంఘ నిర్మాణానికి తగిన స్థితీ లేదు మానవజాతిలో బాగా పురోగమించిన తెగలు ఆటవిక దశనుంచి అనాగరికయుగం దిగువదశలో అడుగుపెట్టేనాటికి ప్రపంచ జనాభా చాల తక్కువగా వుండి వుంటుంది నైరూప్య (abstract) తర్కశక్తి చాల బలహీనంగా వుంటుందేమో అతి పురాతనకాలపు మొదటి కల్పనలకు రూపం ఇవ్వడం చాల కష్టం సంపాదించిన పరిజ్ఞానం ముందడుగు వేయడానికి ప్రాతిపదిక అవుతుంది.

అయితే పురోగతికి ప్రోత్సాహం కలిగించే అవసరాలెన్ని వుంటాయో దాన్ని వ్యతిరేకించే అవరోధాలూ అన్నే వుంటాయిగనక పురోగమనం చాల నెమ్మదిగా తెలియకుండానే సాగుతుంది వేలకువేల సంవత్సరాలు సాగిపోతాయి అటవిక దశలో మానవుడు సాధించిన విజయాలు మరీ గొప్పవేం కాదు కానీ ఏ సౌకర్యాలూ లేని స్థితిలో వాటిని సాధించడానికే మానవుడు విసుగు విరామంలేకుండా ఎంతశ్రమ పడ్డాడో వూహిస్తే ఆశ్చర్యం కలుగుతుంది విల్లు అంబులు కనిపెట్టడం దీనికో మంచి వుదాహరణ

అటవిక మానవుడు బౌద్ధిక నైతిక ప్రమాణాలరీత్యా చాల దిగువ స్థాయిలో వున్నాడు అభివృద్ధిలేదు అనుభవంలేదు నీచస్థాయి పాశవిక అభిరుచులూ ఆవేశాలూ అణచి వుంచుతున్నాయి ఈ విషయాన్ని మహాకష్టంమీద ఒప్పుకు టున్నారు అయితే చెకుముకి రాళ్ళతోనూ ఎముకలతోనూ చేసిన పనిముట్లు అతని గుహాజీవితం మిగిలివున్న ఎముకలూ ఆ స్థితికి ప్రత్యేక నిదర్శనాలుగా వుంటున్నాయి భూమిమీద మారుమూల ప్రదేశాలలో మిగిలిపోయిన అటవిక తెగలు గతానికి నిదర్శనంగా నేటికీ వున్నారు అయితే ఈ దశ నాటికే వారికి మాటలు, భాష ఏర్పడింది వారిలో రెండు కుటుంబ రూపాలు ఏర్పడ్డాయి మూడోరూపంకూడా ఏర్పడుతూంది గణరూపంలో సమాజ నిర్మాణమూ వచ్చింది మానవుడు తన జీవయాత్రను అట్టడుగునుంచి ప్రారంభించే డనడానికి ఇదంతా సాక్ష్యం "మానవుని గురించీ అతని కార్యకలాపాలు గురించీ ఎంతో శ్రద్ధతో సమగ్ర గా అధ్యయనంచేసి, ఆధునిక విజ్ఞానశాస్త్రం దీనిని రుజువు చేస్తూంది"— అన్నారు విట్నే తన "ఓరియంటల్ అండ్ లింగ్విస్టిక్ స్టడీస్"లో

అదే విధంగా అనాగరిక యుగంలో నాలుగు గొప్ప కల్పనలు వచ్చేయి ఒకటి జంతువుల్ని మచ్చిక చేయడం రెండు ధాన్యాలను కనుక్కోవడం మూడు నిర్మాణాలకై రాళ్ళనుపయోగించడం నాలుగు ఇనుము కరిగించడం బహుశా మొదట వేటలో వెంటపడి వచ్చిన కుక్క మచ్చిక అయి వుంటుంది వరదా పుట్టో మరో విధంగానో ఇతర జంతువుల పిల్లల్ని పట్టుకుని సాకడం ప్రారంభించి వుంటారు ఒకొక్క జంతువు వుపయోగాన్ని తెలుసుకొనేందుకు ఎంతకాలం పట్టిందో వాటిని మందలుగా పెంచడానికి ఎన్ని అవకాశాలు కావలసి వచ్చేయో ఏ కరువులో వచ్చినప్పుడు వాటిని విశ్శేషంగా కోసుకు తినెయ్యకుండా ఎంత నిగ్రహం చూపవలసి వచ్చిందో ఒక్కొక్క జంతువును మచ్చిక చేసిన కథ తెలిస్తే ఎన్నెన్నో అద్భుతాలు

బయట పడతాయి అనుమానాస్పదమైన విజయావకాశాలమధ్య మానవజాతి భవిష్యత్తును నిర్ణయించిన అన్వేషణలు కొనసాగేయి రెండోది వ్యవసాయం చేసి శరీరానికి పిండి పదార్థం సమకూర్చే ఆహారాన్ని సంపాదించడం మానవ జాతి యొక్క మహా విజయాలలో ఒకటి పూర్వార్ధ భాగంలో జంతువుల మచ్చిక వచ్చినాక దీనికంత ప్రాధాన్యం లేదుకానిపశ్చిమార్ధగోళంలో అమెరికను ఇండియన్లలో అధిక భాగం అనాగరిక దశ దిగువ దశకీ కొంత మంది మధ్య దశకీ ఎదగడానికి ఇదే సహాక రించింది మాన జాతి ఈ దశని మించి ఎదగకపోయినా సుఖంగా రోజు గడవడానికీ ఆనందంగా జీవితాన్ని గడపడానికీ ఈ విజయాలు చాలు మూడోదైన గృహనిర్మాణం వచ్చి ఇటిక రాయితో ఇళ్ళు కట్టుకోవడంతో జీవిత విధానం మెరుగు అయింది దీనితో మానవుని మానసిక శక్తి విస్తరించింది కష్టపడి పరిశ్రమ చేసే అలవాటు వచ్చింది ఇంకా మెరుగులు దిద్దుకోవడానికి ఉత్సాహాన్ని సమకూర్చింది అయితే మానవజాతి పురోగతికీ, ఉన్నతికీ సంబంధి చినంత వరకు నాలుగోదయిన ఇనుము కరిగింపు గొప్ప ఘటనగా చెప్పాలి నాగరికతకు దారి తీసినది ఇదే అనాగరికదశలో మానవుడు ఖనిజాల్ని వాని సహజరూపంలో కనుక్కున్నాడు మెట్టు మెట్టుగా పురోగమిస్తూ వానిని మూసలలో కరిగించడం, అచ్చులలో పోయడం తెలుసుకున్నాడు రాగినీ టిన్‌నూ కలిపి కరిగించి కంచు తయారుచేశాడు అక్కడి నుంచి ఎంతో వూహా శక్తి నుపయోగించి బట్టీ కనిపెట్టాడు ఇనుప ఖనిజాన్ని కరిగించి ఇనుము తీశాడు దీనితో నాగరికత పొందుకొనేందుకు సాగుతున్న కృషిలో నూటికి తొంభయి పంతులు పూర్తి అయినట్లే * ములిక్కి, దాయ కలిగి వుండే ఇనుప పనిముట్లు రావడంతో

—>

---

క్వికెరెజ్ అనే స్విస్ ఇంజనీరు బెల్జి మండలంలో ఇనుము ఖనిజం కరిగించేందుకు కొండ పక్కనే కట్టిన బట్టీం అవశేషాల్నీ పనిముట్లని ఇనుము బొగ్గు మిగుళ్ళని కనుక్కొన్నాడు ఆ బట్టీని నిర్మించడానికై కొండ పక్కనే తవ్వి మట్టితో ఖాళీ తొట్టె తయారు చేశారు పొగ పోవడానికి పైన దోమ్‌తో గొట్టం పెట్టారు గాలి తిత్తుల్ని వుపయోగించిన సూచనలేవీ లేవు గుండగా కొట్టిన ఇనుప పలుకలూ బొగ్గూ పొరలు పొరలుగా ఆ గుల్ల తొట్టెలో పేర్చివుంటారు బహుశా విసిరి మంట చేసి వుంటారు ఈ ప్రయత్నంలో ఇనుము మెత్తబడి ముద్దగా తయారయ్యేది. తర్వాత దానిని మత్తులతో కొట్టి ఆకారం ఇచ్చేవారు. అక్కడే 20

—>

మానవుడు నాగరికుడు కావడం స్థిరమయింది ఇనుము ఉత్పత్తి చేయడం మానవుని గొప్ప విజయం అద్వితీయం దాని ముందు మిగతా కల్పనలూ అన్వేషణలూ అవధానాలుకాదు గాని, దాని తరవాత చెప్పవలసినవే దానినుంచి లోహపు నమ్మెట, దాగలి వచ్చేయి గొడ్డలి, ఉలి కత్రుగం నాగలి ఇనపకత్తి ఒకటేమిటి ! నాగరికతకు పునాది ఈ లోహం మీదనే ఏర్పడింది ఇనుప పరికరాలు లేకపోవడమే మానవజాతిని అనాగరిక దశలో నిలబెట్టేసింది ఆ లోపం సవరణ కాకుంటే మానవుడు నేటికీ అక్కడే వుండిపోయేవాడు ఇనుము కరిగించాలనే వూహా కరిగించే విధానమూ మనిషికి ఏకకాలంలోనే తోచి వుంటాయి ఈ పరిజ్ఞానం సంపాదించి నాగరికతకు దారి తీసిన తెగ ఏదో కుటుంబం ఏదో తెలిస్తే ! అనాడు పెమైల్లు మానవ పురోగతిలో ముందు పీటిన వున్నారు ధ్వని సంకేతాలతో భాషను మానవులకు ఇచ్చినది వారు బహుశా ఇనుము కరగపోత కూడా వారి నుంచే వచ్చిందేమో

హోమరు కవితలు వచ్చిన కాలం నాటికి గ్రీకులు భౌతికంగా ఎంతో పురోగతి సాధించేరు ముడి లోహాల్ని కరిగించడంతో సహా పరిపాటిలో వున్న లోహాలన్నీ వారికి తెలుసు బహుశా ఇనుము నుంచి ఉక్కు చేయటం కూడా తెలిసే వుంటుంది ముఖ్యమైన ధాన్యాలన్నీ తెలుసు వ్యవసాయ నైపుణ్యం వుంది మరి చెలక వ్యవసాయంలో నాగలి ఉపయోగం తెలుసు కుక్క గుర్రం గాడిద అవు, పంది మేకలు గొర్రెలు మచ్చిక అయాయి మందలు మందలుగా పెంచుతుండడం కనిపిస్తుంది అనేక గదులు అంతస్థులతో మన్నికైన వస్తువులతో గృహ నిర్మాణం నౌకా నిర్మాణం, ఆయుధాలు వస్త్రాలు ద్రాక్ష నుంచి మద్యం తీయడం, ఆపిల్ పంట పియర్ అలివ్ ఫిగ్ల పంట తెలుసు సుఖంగా ఉండేటట్లు దుస్తులు అనుకూలమైన వస్తువులు, ఉపయోగ కరంగా వుండే పాత్రలు తయారయి, వినియోగంలోకి వచ్చేయి కాలంతో పాటు మానవజాతి ప్రారంభకాల చరిత్ర మరుగున పడిపోయింది దిగువ అనాగరిక దశ వరకూ సంప్రదాయం కనబడుతూంది. తరవాత దొరకడంలేదు భాష వృద్ధి పొందింది ఉత్తమ కవితా రూపంలో మానవ మేధా విన్యాసాలను ఇముడ్చుకుంది అనాగరిక దశ ముగిసే నాటికి ఈ మానవ కుటుంబం

---

—> అడుగుల ఒత్తున పీట్ పొర కింద బొగ్గుపొర కనపడింది ఇనుము ఖనిజాన్ని కరిగించే పరిజ్ఞానం కలిగిన నాటివి అయి వుండవు ఈ బట్టలు అయితే అసలు కొలిమలకూ వీనికీ పోలిక లేదనమూలేము

నాగరికత ముంగిటికి చేరుకుంది గతంలో సాధించిన విజయాల ఉత్సాహంతో అనుభవాలతో దృఢ పడింది తెలివి సంపాదించుకుంది సృజనాత్మక శక్తుల పూర్తి వికసనలో అంతు పొంతులేని వూహలు అల్లుకుంది అనాగరికులు ఉచ్ఛ స్థితికి చేరడంతో అనాగరిక దశ ఆఖరయింది గ్రీకు రోమను రచయితలు ఆ కాలంనాటి సమాజ స్థితిని అర్థం చేసుకున్నారు కాని స్పష్టమైన సంస్కృతి అనుభవాలతో ఏర్పడిన అంతకు ముందు నాటి రాజ్యవ్యవస్థ గురించి మనలాగే వారికీ తెలియదు సమీపకాలంలో బతికిన వాళ్ళు గనక ఆ నాటి వర్తమానానికి గతకాలంతోగల సంబంధాలను స్పష్టంగా గ్రహించారు కల్పనలలో అన్వేషణలలో అట్లాగే అటవిక దశ నుంచి మానవజాతి హోమరు కాల స్థితికి ఎదగడం క్రమంలో వచ్చిన నీతి నియమ వ్యవస్థలో ఒక క్రమానుగతి వున్నదని వారికి అర్థం అయింది. అయితే ఈ రెండు దశలకూ మధ్య ఎంతోకాలం గడిచి వుంటుందనే విషయాన్నివారు వూహించ డానికూడా ప్రయత్నించలేదు

— o —

## ఒకటో ప్రకరణం

# స్త్రీ-పురుష భేదం ప్రాతిపదికగా సమాజ నిర్మాణం

**ఆస్ట్రేలియన్** తరగతులు లింగభేదం ఆధారంగా నిర్మాణం నిర్మాణ రూపం ప్రాచీనత ఆస్ట్రేలియన్ గణాలు ఎనిమిది తరగతులు వివాహ నిబంధన తల్లి హక్కు పరిగణన అసాధారణములైన స్త్రీ పురుష సంబంధాలు ప్రతిగణంలో రెండు మగ తరగతులు రెండు ఆడ తరగతులు తరగతుల మీద చేర్పులు గణాలింకా ప్రాథమిక దశలోనే.

ప్రభుత్వ భావన పెరుగుదల గురించి చెప్పదలచినప్పుడు బంధుత్వ ప్రాతిపదికపై ఏర్పడిన గణాల నిర్మాణమే ప్రాచీన సమాజం యొక్క పురాతన రూపం అని సహజంగానే తట్టుతుంది కాని అంత కంటె ప్రాచీనమూ ఎంతో పురాతనమూ అయిన నిర్మాణ రూపం వుంది లింగభేదం ప్రాతిపదికపై తరగతి విభజన జరగడం కనిపిస్తుంది అదేదో కొత్తగా వుందని దానిని గురించి చెప్పడం లేదు గణాల పుట్టుకకు మూలమైన ఆలోచన దానిలో కనిపిస్తుంది ఇదిప్పుడు ఆస్ట్రేలియను ఆదివాసులలో మాత్రమే కనిపిస్తున్నా ఇది మానవులందరిలోనూ గణాలు ఏర్పడక పూర్వంనాటి సమాజ నిర్మాణరూపంగా విస్తృతంగా వుండింది.

అటవికయుగం దిగువ దశలో నిర్ణీత పరిధులలో భార్యలు భర్తలు కూటాలుగా ఏర్పడి వుండడం ఆనాటి సామాజిక వ్యవస్థకు కీలకంగా వుండేది గుంపులో నెలకొన్న వైవాహిక నియమాలు హక్కులు ఒక బ్రహ్మాండమైన చట్రంలా తయారయాయి సమాజం ఆ నిర్మాణసూత్రాలమీద ఏర్పడింది ఈ నియమాలూ హక్కులూ సంఘంలో ఎంతోలోతుగా పాతుకుపోయాయేమో వాని నుంచి బయట పడటం చాల నెమ్మదిగా జరిగింది. వానికై జరిగిన ప్రయత్నాలు అనాలోచితంగానే

సంస్కరణలను తెచ్చిపెట్టేయి ఈ దాంపత్యసంబంధాల పరిధి క్రమంగా సంకుచిత మైన క్రొత్త కుటుంబాల దిగువదశ నుంచి ఉన్నతరూపానికి వచ్చింది రక్త సంబంధీకులతో కుటుంబం ప్రారంభమయింది ఇది గుంపులోని సోదరీసోదరుల మధ్య దాంపత్య బంధం దాని నుంచి రెండో దశ పునలాన్ కుటుంబ దశవచ్చింది ఇది ఆస్ట్రేలియా లోని వర్గీకరణలకు సన్నిహితంగా వుంటుంది దీనిలో సోదరీ సోదరుల మధ్య దాంపత్యంపోయి దాంపత్యబంధం సోదరుల జట్టుకు సోదరిల జట్టుకు మధ్య ఉమ్మడి అయింది ఈ దాంపత్యం గుంపులోపలనే అనేది మరవకూడదు లింగభేదం మీద తరగతులుగా ఏర్పడడం తరవాత బంధుత్వం ప్రాతిపదిక మీద గణాలుగా ఏర్పడడం ఈ మార్పులన్నీ అనుద్దిష్టంగా సహజమైన ఎన్నిక (Natural Selection) ద్వారా సంభవించినవే అందుచేత మానవ జీవితంలో చాలా దిగువదశకి చెందిన దయినా ఆస్ట్రేలియను ఆదివాసులలోవున్న ఘట్టంతో దీనిని ప్రారంభిస్తున్నా మానవజాతి యొక్క పురాతన సామాజిక చరిత్రలో ఇదొక ముఖ్యఘట్టం

కమిలరాయ్ భాషమాట్లాడే ఆస్ట్రేలియను ఆదివాసులలో నేటికీ లింగభేదం ప్రాతిపదికగా తరగతుల ఏర్పడడమూ బంధుత్వం ప్రాతిపదికగా గణ నిర్మాణాల ప్రాథమిక రూపమూ కనిపిస్తుంది సిడ్నీకి ఉత్తరంగా డార్లింగ్‌నది జిల్లాలో వారు ఉంటున్నారు ఈ రెండు నిర్మాణాలూ ఇతర ఆస్ట్రేలియన్ తెగలలో కూడా కని పిస్తున్నాయి వాని వ్యాప్తిని పట్టి ఒకప్పుడు ఇవి ఆస్ట్రేలియనులందరిలోనూ వుండి వుంటాయని అనుకోవచ్చు వానిలోని అంతర్గత సాక్ష్యాధారాలనుపట్టి గణాల నిర్మాణంకన్న లింగభేదం మీద ఆధారపడిన తరగతి నిర్మాణం పూర్వపుది అని అనుకోవాలి రెండోది కమిలరాయ్ లలో భిన్న లింగ తరగతి నిర్మాణం క్రమంగా గణనిర్మాణానికి దారి తీస్తుండడం కనిపిస్తుంది వారి సామాజిక నిర్మాణానికి స్త్రీ పురుష తరగతుల నిర్మాణాలు మూల సంస్థలు అవి పూర్తిగా అభివృద్ధి పొందినప్పుడు గణాలు ఆ స్థానంలో ఏర్పడుతాయి ఆ విధంగా రెండు ఘటనలు చాల అద్భుతంగా సమన్వ యించి కనబడుతున్నాయి భిన్న లింగ నిర్మాణమూ గణ నిర్మాణమూ ఏక కాలంలో ఇక్కడున్నాయి వీ తో మొదటిది కీలక స్థానంలోనూ రెండోది ప్రారంభ దశలోను వుండి క్రమంగా మొదటిదానిస్థానాలను ఆక్రమిస్తూ ఇది ప్రాధాన్యానికి వస్తుంది

అయితే ఆస్ట్రేలియాకు వెలుపల ఏ తెగలోనూ ఈ భిన్నలింగ తరగతి నిర్మాణం కనబడ లేదు ఏకాంతంగావున్న యీ భూభాగంలో ఈ ద్వీపవాసులు చాలనెమ్మదిగా వృద్ధిపొందడం, గణాలలోకాకుండా లింగభేదం ప్రాతిపదికగా అతి ప్రాచీనమైన

సమాజ నిర్మాణమూ చూస్తే గణ నిర్మాణం కనిపించే తెగలన్నింటాసార్వత్రికంగా ఈ భిన్న లింగ తరగతి నిర్మాణం వుండేదనుకోవచ్చు ఈ తరగతి నిర్మాణం గురించి ఇంకా వివరాలు సంపాదించగల్గితే ఆశ్చర్యకరమైన విషయాలు బయట పడతాయి అటవిక ప్రజలలో వుండే ఒక విచిత్రమైన వ్యవస్థగా దానియెడ పెద్ద ఆసక్తి వుండక పోవచ్చు ఇంతవరకు కనుక్కొన్న సమాజరూపాలలో ఇది అత్యంత ప్రాచీనం మన ఆర్యను కుటుంబాల ఆదిపురుషులు కూడా ఇటువంటి సమాజరూపం లోనే బతికివుంటారు అందుచేతనే దానికి ప్రాధాన్యం అది మనకి చాల విషయాలు తెలుపగలుగుతుంది

ఆస్ట్రేలియనులు పోలినీషియనుల కన్న దిగువ స్థాయిలో వున్నారు అమెరికను ఇండియనులకన్న మరీను ఆఫ్రికను నీగ్రోకన్న దిగువనే వున్నారు అంటే అట్టడుగు మెట్టులో వున్నారు అనాలి అందుచేత వారి సామాజిక నియమాలు ఇప్పుడున్న ప్రజలు ఎవ్వరికన్న చాల పూర్వపువి అయివుండాలి

వచ్చే ప్రకరణంలో గణాలనుగురించి వ్రాయబోతున్నా కనక దీనిలో చర్చచేయ కుండా ప్రస్తావవశంగా దానిని పేర్కొనడం జరుగుతుంది తరగతులు గురించి చెప్పేటప్పుడు వాని సందర్భంవస్తుంది

కమిలరాయ్‌లు ఆరుగణాలుగా ఏర్పడి వున్నారు దాంపత్య సంబంధాల రీత్యా ఈ ఆరు గణాలు రెండు గ్రూపులుగా వున్నాయి

1వ గ్రూపు

1 ఇగువానా (దుని)
2 కంగారూ (ముర్రీరా)
3 ఒపోస్సం (మూచే)

2వ గ్రూపు

4 ఎమూ (దినౌన్)
5 బాండికూట్ (బిల్‌బా)
6 బ్లేక్‌స్నేక్ (నూరై)

మొదట్లో ఏ గ్రూపులో వాళ్ళు ఆగ్రూపు వాళ్ళని వివాహం ఆడకూడదు గ్రూపు ఒక గణం ఆ గ్రూపులోని మూడు విభాగాలూ ఆ గణానికి ఆ శాఖలకు చెందిన వారు రెండో గ్రూపుకు చెందిన ఏ శాఖల వారినైనా పెళ్ళి చేసుకోవచ్చు కమిలరాయ్‌లు ఈ ప్రాచీన నియమాన్ని పూర్తిగా కాకపోయినా కొంతవరకు సవరించేరు ఒక

గ్రూపుకు చెందిన శాఖలలోని వారు మరోగ్రూపుకు చెందిన ఏ శాఖ వారినైనా పెళ్ళి చేసుకోవడంగాక ఒక గ్రూపులోని ఒక శాఖవారు మరోగ్రూపులోని ఒక శాఖతోనే సంబంధం పెట్టుకోవచ్చునని నిబంధిస్తున్నారు స్త్రీ పురుషులెవ్వరూ తమ గణంలో వారిని (గ్రూపు) పెళ్ళిచేసుకోకూడదు అది నియమం సంతానాన్ని తల్లివేపునుంచి గుర్తిస్తారు వారు తల్లిగణానికి (గ్రూపు) చెందుతారు గణం అనేది ప్రాచీన తర రూపంతో ఎక్కడుండినా దాని ప్రధానలక్షణాలు ఇవి అందుచేత బాహ్య లక్షణాలకు సంబంధించినంత వరకు కమిలరాయ్‌లలో గణ సంస్థ శుద్ధ పూర్ణరూపంతో వుందనే అనవచ్చు

అయితే అంతకన్న ప్రాచీనమైన విభజన ఒకటి వారిలో వుంది అందులో జనాన్ని ఎనిమిది తరగతులుగాచూస్తాం వానిలో నాలుగింట కేవలం మగవాళ్ళే వుంటారు మిగతానాలుగింట ఆడవాళ్ళు మాత్రమే వుంటారు వివాహం సంతాన వారసత్వ విషయంలో వాని నియమాలు గణ నియమాలకు భిన్నం వీనిమంచి గణం క్రమంగా వెలదొక్కుకుంటున్నట్టు కనిపిస్తూంది మగవాళ్ళ తరగతులలో ఒకటి ఆడ వాళ్ళ తరగతులలో ఒక దానినుంచే భార్యను తెచ్చుకోగలదు అంటే ఒక తరగతిలోని మగవాళ్ళూ మరొక తరగతిలోని ఆడవాళ్ళూ ఒకరికొకరు సిద్ధాంతరీత్యా భార్యలూ భర్తలూను పైగా మగ వాడుగాని ఆడదిగాని మొదట చెప్పిన ఏదో ఒక గణం వారు రెండో గణం వారినే పెళ్ళి చేసు కోవాలి అంటే ఆ విధంగా ఒక గణానికి చెందిన వారితోనే కొందరు మరో గణం లోని మరికొందరితో మాత్రమే వివాహం చేసుకో గలిగేటట్లు నియమితం చేయబడి ది ఇది గణనియమాలకు విభిన్నం ఒక గణానికి చెందినవారు మరో గణానికి చెందిన వారినెవరినైనా పెళ్ళి చేసుకోవచ్చునన్న గణ నిబంధనలో మినహాయింపు ఏర్పడింది

ఈ ఎనిమిది తరగతుల విభజన ఈ రూపంలోవుంది

| మగ | ఆడ |
|---|---|
| 1 ఇప్పై | ఇప్పాటా |
| 2 కుంబో | బూటా |
| 3 ముర్రి | మాటా |
| 4 కుబ్బై | కపోటా |

ఈ తరగతుల విభజనతో ఇప్పైలు ఏ గణానికి చెందినా వారంతా సోదరులు

వారందరికీ అది మాత ఒక్కరే ననేది వారి భావన అల్లాగే కుంబోలు ముగ్రీలు కుబ్రైలు కూడా అల్లాగే స్త్రీల తరగతులలో ఇప్పాటా తరగతిలోని స్త్రీలు ఏ గణం గ్రూపుకు చెందినా అక్కా చెల్లెళ్ళు అలాగే బూటా మాటా కపోటాలున్నా ఇంక ఇప్పైలూ ఇప్పాటాలూ సోదరీ సోదరులు ఒకతల్లి బిడ్డలేకాని రక్తసంబంధీకులే కాని వారు ఏ గణానికి చెందిన వారనేది నిమిత్తం కాదు అల్లాగే కుంబోలూ బూటాలూ ముగ్రీలూ మాటాలూ కుబ్రైలూ కపోటోలూ ఏ గణానికి చెందిన వారే అయినా సోదరీ సోదరులు ముఖం కూడా చూసి వుండక పోయినా ఒకఇప్పై ఒక ఇప్పాటా ఎదురైతే అన్నా చెల్లీ లేక అక్కా తమ్ముడూ అనే పిలుచుకుంటారు ఈ విధంగా కమిలరాయ్‌లు నాలుగు పెద గ్రూపులుగా విడబడి, విశాల ప్రదేశంలో విస్తరించి కలిసిపోయి జీవిస్తున్నారు. ఈ తరగతులు స్త్రీ పురుష భేదంతో ఏర్పడ్డవి గాని రక్త సంబంధం మీద ఏర్పడ్డవి కావు అందుచేతనే తరగతి విభజనను ప్రాచీన తరంఅనడం ఈ సమాజ రూపం మరెక్కడా కనిపించను

ఈ తరగతులలో గణలక్షణాలు కనిపిస్తున్నాయి కాని పూర్తిగా కాదు వాస్తవానికి ఇప్పై ఇప్పాటాలు ఒకే తరగతికి చెందిన రెండు శాఖలు వారిలో వారు వివాహం చేసుకోకూడదు కనుక వారు ఒక గణంగా ఏర్పడొచ్చు కానివారు ఒక పేరు కిందలేకపోవడం ఒకటి రెండోది వారి పిల్లలు వారి పేర్లతో గాక మరో పేర్ల కింద వుంటారు గనుకనున్నూ ఇక్కడ తరగతులుగా విభజన లింగభేదం పట్టి జరుగుతుంది రక్తసంబంధం పట్టికాదు. వానిమధ్యనున్న వివాహ నియమాలు చిత్రంగా కొత్తగా వున్నాయి

సోదరీ సోదరుల మధ్య వివాహం కూడదు కనుక వివాహ హక్కు రీత్యా వాటి మధ్య సంబంధాలు భిన్నంగా వుంటాయి ఇక్కడ వివాహం అన్న సాంప్రదాయక పదం కన్న స్త్రీ పురుష సంబంధం అన్న వాక్యం సముచితంగా వుంటుంది. ఆ విధంగా

ఇప్పైలు కపోటాస్త్రీలను తప్ప మరెవ్వరినీ వివాహం ఆడకూడదు
కుంబాలు మాటాస్త్రీలను తప్ప మరెవ్వరినీ
ముగ్రీలు బూటా స్త్రీలను తప్ప మరెవ్వరినీ,
కుబ్రైలు ఇప్పాటా స్త్రీలను తప్ప మరెవ్వరినీ వివాహం ఆడకూడదు

ఈ కఠిన నిబంధనను తరువాత కొంచెం సవరించడం కనిపిస్తోంది. ప్రతి మగ తరగతివాడూ తమకు నిర్దేశింపబడ్డ తరగతి స్త్రీలతోనే గాక మరొక తరగతి

వారితో కూడా సంబంధం ఏర్పరచు కోవచ్చు ఈ విధంగా తరగతుల హక్కులలోకి గణాలు చొరబడడం కనిపిస్తూంది క్రమంగా తరగతులను తోసేసి గణాలు నిలబడ తాయి.

అంటే ప్రతి మగవాడు తనకు భార్యను మొత్తం కమిలరాయ్ తెగలోని స్త్రీలలో నాలుగో వంతు మందినుంచి ఏరుకోగలడు దీనిలో వున్న ప్రత్యేకత ఇంతేకాదు సూత్రప్రాయంగా ప్రతి కపోటా స్త్రీ ప్రతి ఇప్పై మగవానికి భార్య ప్రతి మాటా స్త్రీ ప్రతి కుంబోవానికి ప్రతి బూటా స్త్రీ ప్రతి ముర్రీ ప్రతి ఇప్పాటా స్త్రీ ప్రతి కుబ్బైకి భార్య డార్లింగ్ నది మీదనూ ఆ నదీ పరిసరాలలోనూ వున్న పశుపోషణ కేంద్రాలలో చాలా ఏళ్ళు పనిచేసి, దేశీయులతో సంపర్కం పెట్టుకున్న లాన్స్ రాసిన లేఖను ఫిసన్ వుదాహరిస్తూ ఇల్లా రాసేరు కుబ్బై మగవాడు అపరిచితురాలయిన ఇప్పాటాను కలుసుకున్నా ఆమెను గోలీర్ -మరదలా అని పిలుస్తాడు ఆమె తెగ వేరయినా సరే ఆమెతో సరసకలపవచ్చు తెగ అభ్యంతరం చెప్పదు. అతనికి దగ్గరలో వున్న ప్రతి ఇప్పాటా స్త్రీ అతనికి భార్యయే కాగలదు

అయితే ఇక్కడ చాలా విస్తృత రూపంలో పునలాన్ కుటుంబ లక్షణాన్ని చూస్తున్నాం చిన్న చిన్న గ్రూపులు, మొత్తం అందరికీ ప్రతినిధి రూపంగా వున్నాయి ఇక్కడ నివాసప్రదేశమూ జీవనోపాధీ దాని పరిమితుల్ని విధిస్తున్నాయి ఈ విధమైన దాంపత్య సంబంధాలతో తెగలోని మగవాళ్ళందరిలో నాలుగో వంతుమంది, తెగలోని ఆడవాళ్ళందరిలో నాలుగో వంతు మందికి ముడిపడివున్నారు ఆటవిక జీవితంలోని ఈ ఘట్టాన్ని చూసి మనం అసహ్యించు కోనక్కర్లేదు అది దాంపత్య సంబంధాల ఒక రూపం మాత్రమే అది అమర్యాద ఏమీకాదు బహు భార్యాత్వ బహు భర్తృత్వాల విస్తృతరూపం అది. ఆటవిక తెగలన్నింటా సూక్ష్మరూపంలో అవి కొనసాగనే కొనసాగేయి. నేటికీ రక్తబంధుత్వ సంబంధాల పరిగణనలో బంధుత్వపు పిలుపులలో ఆచారాలూ అలవాట్లలో ఆనాటి వివాహ సంబంధాల రూపాలు కనిపిస్తున్నాయి. వాని పరసల నెరగని యథేచ్ఛా సంబంధం కన్న ఇదొక మెట్టు పైది ఆ సంబంధాలకు ఒక పరిధి ఏర్పరచడం కన్న దీనిలో విశేషం ఏమీలేదు అయినా సమాజ నిర్మాణం రీత్యా నియమం ఏర్పరచడం చేత యథేచ్ఛా సంబంధాల కన్న ఒక మెట్టు పైది వివాహ సంబంధాల రూపమూ కుటుంబ రూపమూ మించి మనకు దీనిలో విశేషం ఏమీ తెలియదు ఇప్పుడే మొట్ట మొదటిమారు సమాజ స్వరూపం గురించి సాక్ష్యం దొరుకుతూంది దీనిని పట్టి అంతకు పూర్వపు సమాజం గురించి ఊహించవలసిందే

రక్త సంబంధాలు బంధుత్వాల వ్యవస్థలను పట్టి ఊహలు సాగించ వలసిందే

కమిలరాయ్ తెగలో పిల్లలు తల్లి గణం లోనే వుంటారు కాని వారిని తల్లి దండ్రుల తరగతులకు భిన్నంగా వేరు తరగతులలో వుంచుతారు ఆ పట్టికను దిగువ విస్తున్నాను

ఇప్పై మగవాడు కపోటాస్త్రుని పెళ్ళాడతాడు వాళ్ళ పిల్లలు మగ ముర్రీ ఆడ మాటా తరగతులకు పోతారు అలాగే కుంబో మాటాల పిల్లలు మగ కుబ్బి ఆడ కపోటా అవుతారు ముర్రీ బూటాల పిల్లలు మగవాళ్ళు ఇప్పై తరగతీ ఆడ ఇప్పా టాలూ కుబ్బీ ఇప్పాటాల పిల్లలు మగ కుంబో ఆడబూటా తరగతులుగా విభజింప బడతారు స్త్రీల వేపునుంచి ఈ పారంపర్యాన్ని గమనిస్తే మాటాల తల్లి కపోటా మళ్ళీ కపోటాలకి మాటా తల్లి అలాగే ఇప్పాటాకి తల్లిబూటా బూటాకి తల్లి ఇప్పాటా మగవాళ్ళ తరగతులు కూడా అంతే అయితే కిమిలరాయ్‌లలో తల్లి పారంపర్యం గణవ సాగుతూంది తెగ ఇద్దరు స్త్రీల సంతానంగా రెండు గణాలుగా వుంది ఈ పారం పర్యాన్ని ఇంకా వెనక్కి తీసుకెడితే ప్రతి తరగతి వారి రక్తం మిగిలిన తరగతు లన్నింటితో కలియడం కనిపిస్తుంది

ప్రతి ఒక్కరికీ పైన చెప్పిన వారి తరగతి పేరు వుంటుంది అదిగాక వ్యక్తికి పేరొకటి వు టుంది ఆటవిక అనాగరిక ప్రజలందరిలోనూ ఇది మామూలే భిన్న లింగ తరగతి వ్యవస్థను జాగ్రత్తగా పరిశీలిస్తే ఆటవిక ప్రజల ఈ ఏర్పాటు చాల అద్భుతంగా కనిపిస్తుం ఈ వ్యవస్థ కొన్నితరాలు గడిచేసరికి అది స్థిరపడిపోతుంది దానిని మార్చడం మహాకష్టం అటువంటిదే అంతకన్న ఉన్నతమైన వ్యవస్థరావాలి కొన్ని శతాబ్దాలు గడవాలి అప్పుడే దాంపత్య సంబంధాల పరిధిని తగించడం జరుగుతుంది

భిన్నలింగ తరగతి వ్యవస్థను మార్చకుండా దానిని తనలో ఇముడ్చుకుంటూ అంతకన్న ఉన్నతమైన గణవ్యవస్థ వచ్చింది ఈ రెండు వ్యవస్థలమధ్య స బంధాలు వున్నాయి గణాలు బాగా పురాతనరూపంలో వున్నాయి త గతులే ఇ కా సమాజంలో మూలకంగా వుంటున్నాయి కాని గణనిర్మాణం తాకిడిలో బలహీనపడి పోతున్నాయి ఇదంతా మాతృగణం తర్వాతి కాలంలో వచ్చిందేనని గ్రహించవచ్చు దీని ముందు ముందు ఇంకా స్పష్టం చేయగలను

4)

భిన్న లింగ తరగతులతో పోల్చి చూసినప్పుడు గణనిర్మాణంగురించి ఇంతవరకు చెప్పినది విశదం అవుతుంది తరగతులు అన్నవి సోదరీ సోదరులతో జంటలు జంటలుగా వుంటాయి గణాలు కూడా తరగతుల మూలంగా జంటలుగానే వుంటాయి

ఇగువానాలో ముర్రీ మాటాలూ కుబ్బీ—కపోటాలూ వుంటారు
ఎమూలో కుంబో బూటాలూ ఇప్పై ఇప్పైటాలూ వు టారు
కంగారూలో ముర్రీ మాటాలూ కుబ్బీ కపోటాలూ వుంటారు
బాండికూట్‌లో కుంబో బూటాలూ ఇప్పై ఇప్పాటాలూ వుంటారు
ఓ పోస్సమ్‌లో ముర్రీ మాటాలూ కుబ్బీ కపోటాలూ వుంటారు
బ్లాక్ స్నేక్‌లో కుంబో బూటాలూ ఇప్పై ఇప్పాటాలూ వుంటారు

పిల్లలు వలానా గణానికి చెందాలనేది వివాహనిబంధనలు నిర్ణయిస్తున్నాయి ఇగువానా గణానికి చెందిన మాటా స్త్రీ కుంబోనే పెళ్ళాడాలి వారి పిల్లలు కుబ్బీ—కపోటాలు అవుతారు ఈ పిల్లలు ఇగువానా గణానికే చెందుతారు కారణం తల్లి హక్కు

ఇగువానా గణానికి చెందిన కపోటా స్త్రీ ఇప్పైనే పెళ్ళాడాలి వారి పిల్లలు ముర్రీ మాటాలే అవుతారు వారి గణంపైన చెప్పిన కారణంచేత ఇగువానాయే

అదే విధంగా ఎమూ గణానికి చెందిన బూటా స్త్రీ ముర్రీనే పెళ్ళాడాలి వారి పిల్లలు ఇప్పై—ఇప్పాటాలు అవుతారు వారి గణం ఎమూయే

ఎమూ గణానికి చెందిన ఇప్పాటా స్త్రీ కుబ్బీనే పెళ్ళాడాలి వారి సంతానం కుంబో—బూటాలు అవుతారు. గణం మాత్రం ఎమూయే

ఈ విధంగా స్త్రీల తరపునుంచి వారి సంతానాన్ని నిలుపుకొంటూ గణం తన సంఖ్యను కాపాడుకొంటూంది మిగిలిన గణాలవిషయంకూడా ఇంతే ప్రతి గణంలో ఇద్దరు ఆదిమాతల సంతానం వుంటారనీ మొత్తం ఎనిమిది తరగతులలో నాలుగు ఒక గణంలో వుంటాయనీ గమనించవచ్చు ప్రారంభంలో రెండు మగ తరగతులు రెండు స్త్రీ తరగతులూ వుండివుంటాయి అవి పరస్పర వివాహబద్ధం అయివుంటాయి ఈ నాలుగూ తరవాత ఎనిమిదయి వుంటాయి ఈ తరగతులు ప్రాచీనతరం అవి గణాలలో ఇమిడిపోయినాయేగాని గణ విభజనమూలంగా వచ్చినవి కాదు

అంతేకాదు ఇగువానా కంగారూ ఓపస్సుం తెగలు ఒకదానికొకటి అనుబంధంగా కనిపిస్తున్నాయి వానిలోవున్న తరగతులనుపట్టి అలా అనుకోవలసి వస్తూంది మూలగణం ఒకటి వుండేదనీ దానికివి శాఖలనీ అనుకోవాలి ఎమూ




బాండికూట్ బ్లేక్‌స్నేక్‌ల విషయంకూడా అంతే ఈ విధంగా ఆరు గణాలూ మూలంలో రెండేనని అవి రెండూ పరస్పర వివాహాలు చేసుకోవాలనేగాని తమలోని వారిని చేసుకోరాదనీ నియమం వుంది మొదటి మూడు గణాల వారు తమలో తాము వివాహం చేసుకోకూడదు అలాగే రెండో జట్టువారున్నూ ఆ మూడూ ఒకటిగా వున్నప్పటి నిషేధం మూడుగా విడిపోయిన తరవాతకూడా కొనసాగింది గణం పేర్లు వేరుగావున్నా వారి మూలం ఒక్కటే సెనెకా ఇరాక్వాలలో కూడా ఇదే పద్ధతి కొనసాగుతూంది దానిని గురించి తరవాత చెప్తా

రెండే గణాలు వున్నప్పుడు కొన్నికొన్ని తరగతుల వారి మధ్యనే వివాహం జరగాలన్న నియమంవల్ల ఒక గణంలోని ఆడవాళ్ళలో సగ మంది రెండో గణంలోని మగవాళ్ళలో సగం మందికి భార్యలుగా లెక్క అవుతారు కాని అవి ఆరుగా విభజింపబడినప్పుడు గణం వెలుపల వారినే వివాహం చేసుకోవాలన్న నియమం దెబ్బ తింటుంది ఆ నియమమూ తరగతుల విభజనా కూడా వుండిగనక అది పూర్తిగా నిలిచిపోదు ఒకే కడుపున పుట్టిన సోదరీ సోదరుల మధ్య వివాహం ఆగిపోయినా వేలు విడిచిన సోదరీ—సోదరుల మధ్య కొనసాగుతూనే వుంటుంది తరగతులు రద్దు అయితే ఈ నష్టం చాలవరకు తగ్గేది అన్నాచెల్లెళ్ళ మధ్య వివాహబంధం నిషేధించడమే తరగతుల విభజనకు మూలకారణం కాని కేవలం అన్నా చెల్లెళ్ళ అనుబంధం అనుచిత మన్నంతవరకే వారి ఆలోచన అంతకన్న ముందుకు చూడక పోవడంచేత అంత అపచారంగానూ భావించవలసిన దాంపత్యబంధం శాశ్వత రూపంలో స్థిరపడింది

తరగతుల వ్యవస్థను అధిగమించి గణ నిర్మాణానికి అనుకూలంగా ఒక మార్పు కనిపిస్తూంది ఒక గణంలో మూడుతరగతులను రెండోగణంలోని తరగతుల వారితో వివాహానికి అనుమతించడం ఒకటి రెండోది ఇతః పూర్వం అనుమతించని తరగతులలో వివాహబంధాన్ని అనుమతించడం దీని ప్రకారం ఇగువానాలోని ముర్రీ కంగారూలోని మాతాను వివాహం చేసుకోవచ్చు ఆమె అతనికి వేలు విడిచిన చెల్లె లవుతుంది ఇంతకుముందు అతడు బూటా కుని—రెండో మూడింటినుంచి—మాత్రమే వివాహం చేసుకోవాలి అదే విధంగా ఇగువానా — కుబ్బీ తన వేలు విడిచిన సోదరీ కపోటాను చేసుకోవచ్చు ఎమూ — కుంబో అదే విధంగా బూటానూ ఎమూ ఇప్పై బ్లాక్‌స్నేక్‌గణానికి చెందిన ఇప్పాటానూ పెళ్ళిచేసుకోవచ్చు మొదట ఈ మాదిరి సంబంధాలు నిషిద్ధం మూడింటిలోని ప్రతి జట్టులోని మగవాడూ ఇదివరకు రెండో జట్టులోని ఒక తరగతి పడుచునే పెళ్ళాడడానికి అర్హుడు ఇప్పుడల్లాగాక తమ

జట్టులోని మిగతా రెండుతరగతులలో ఒక తరగతి వరుడును వివాహం ఆడవచ్చును అన్నారు ఇది వరకు అది నిషిద్ధం ఫిసన్ పంపిన పత్రంలో ఈ మార్పు ఎంత దూరంవరకు సాగిందో చెప్పలేదు

ఈ మార్పు ఒక వెనక అడుగే కాని అది తరగతుల విభజనను భగ్న పరుస్తూంది కమిలరాయ్‌లలో కనిపిస్తున్నంతవరకు తరగతుల నుంచి గణ నిర్మాణం వేపు అభివృద్ధివుంది సమాజానికి తరగతిని యూనిటుగాగాక గణాన్ని యూనిటుగా మార్చాలనే ప్రయత్నం వుంది ఈ ప్రగతికి వెనుకటి దాంపత్య వ్యవస్థ ఆటంకం కలిగిస్తూంది దాంపత్యవ్యవస్థలోవున్న విస్తృతిని తగ్గిస్తే తప్ప పురోగతి వుండదు దాంపత్యసంబంధాల హక్కులతో తరగతులు దృఢంగా వున్నంతకాలం సామాజికాభి వృద్ధి సాధ్యంకాదు ఈ తరగతులకున్న దాంపత్యబంధాల హక్కులు కమిలరాయ్ తెగ మెడలో గుదిబండలు దానిని మార్చకపోతే మరోకొన్ని వేల సంవత్సరాలు గడిచినా మనం వారిని కనుగొన్నప్పటి స్థితిలోనే వుండేవారు

హవాయియన్‌ల పునాలువా కూడా ఇంచుమించు ఇటువంటిదే ఆటవికదశ దిగువ మధ్యస్థాయిలలో వున్న తెగలు కనబడినచోట తరగతుల విభజనలను నిర్దే శిస్తూ మొత్తం గుంపుల మధ్య వివాహబంధాలు క పిస్తున్నాయి అవి ప్రత్యక్షంగా అమలులోవు దడమో లేక వాని సూచనలో కనిపిస్తున్నాయి వీనిని పట్టి మానవ చరిత్రలో ఆ దశలో ఈ మాదిరి వివాహసంబంధాలు సర్వత్రా అమలులో వున్నట్లు అనుకోవచ్చు ఆ గుంపు ఎంత పెద్దది అనేది సమస్యకాదు ఆనాటి జీవిత పరిస్థితులు ఈ మాదిరి సంబంధాలు కలిగివు డే గుంపు ప్రమాణాన్ని నిర్ధారణచేస్తున్నాయి ఆటవిక దశలో గుంపుల మధ్య భార్యల భర్తల స బంధంవుండడం అనేది నియమం అయితే మన పూర్వీకులు కూడా ఆటవిక దశలో ఈ నియమాన్నే పాటించి వుంటా రనేది నిస్సందేహం

ఆటవిక ప్రజలు దిగువస్థితిలో వుండడమే అటువంటి ఆచారాలూ అలవాట్లకూ కారణం ప్రపంచంలో అక్కడక్కడ ఏకాంత ప్రదేశాలలో ఆటవిక దశలో వున్న ప్రజలు కొందరు మిగిలిపోవడంచేత ప్రాథమికదశలో మానవజాతి ఏ విధంగా జీవిం చారో తెలుసుకోగలుగుతున్నామేకాని లేకుంటే ఆ దశలో మనిషి ఎలా బ్రతికేవాడో వూహించడం కూడా సాధ్యమయ్యేదికాదు సమాజంలో అప్పటికున్న దోషాలను సరి దిద్దడానికై ప్రారంభమయిన అనుదిష్ట సంస్కరణోద్యమాల ఫలితంగా వచ్చినదే నీతి నియమాల వ్యవస్థ అని అది ఒక క్రమంలో పురోగమించడం చూస్తున్నామనీచెప్పాలి.

వేల సంవత్సరాలు గడిచిన కొద్దీ ఈ నీతి నియమవ వస్తలు శిథిలం అవుతుంటాయి వానిని సరిగ్గా అర్థం చేసుకోవాలంటే ఈ దృష్టిలోంచే వానిని అధ్యయనం చెయ్యాలి కళలూ నీతి నియమాలూ చాల తక్కువ స్థాయిలో వుండడంచేత అస్ట్రేలియను ఆదివాసులు తక్కువ స్థాయిలో వుండలేదు తత్ భిన్నంగా వారు తక్కువ స్థాయిలో వుండడంచేతనే వారి కళలూ నీతి నియమ వ్యవస్థా తక్కువ స్థాయిలో వున్నాయి వారు ఒకప్పుడు ఉన్నత స్థాయిలో వుండి తరవాత దిగజారేరనడానికి వీలులేదు మానవుని అనుభవం అటువంటి వూహలకు అవకాశం ఇవ్వడంలేదు. కొన్ని జాతులూ తెగలూ శారీరకంగానూ మానసికంగానూ క్షీణించ వచ్చు దానికి కారణాలు కనిపిస్తుంటాయి కాని మానవజాతి పురోగతిని అని విరో ధించలేవు మానవజాతి మొత్తంగా దిగువస్థాయి నుంచి ఎగువకు నిలకడగా పురో గమిస్తూందని మన పరిజ్ఞానమూ అనుభవమూ కూడా చెప్తూంది ఆటవికులు తమ జీవితాలను గడుపుకునే పద్ధతులు ఒకే విధంగా కొనసాగుతాయి అంతకన్న ఉన్నత మైన పద్ధతులు వచ్చి గెంటివేస్తే తప్ప అవి అంతరించవు ఈ పద్ధతులను అను సరిస్తూ సామాజిక సంస్థల ద్వారా సంపాదించిన అనుభవంతో మానవజాతి ఒక క్రమంలో అభివృద్ధి పొందుతు ది ఆ అభివృద్ధి శతాబ్దాలు గడిచినా దృశ్యాదృశ్యంగానే వుంటుంది వారి జీవిత విధానాలు భగ్నమై అనేక తెగలు, జాతులు నశించిపోయాయి మనిషికిలాగే జాతుల విషయంలోనూ అది అంతే

గణ సంస్థలు ఏర్పడే క్రమాన్ని అంతకు పూర్వం అతి ప్రాచీనమైన భిన్న లింగ తరగతుల నిర్మాణాన్ని తెలుసుకోడానికి ఈ వేళ అస్ట్రేలియను ఆదివాసులలోని తరగతులే ఆధారం ప్రారంభ దశలో మానవసమాజం ఏలావుండేదో చూచాయగా చూపించుతూంది, అది దాంపత్యవ్యవస్థ పరిధిని పరిమితపరచిన ప్రమాణంలో ఇతర తెగలలోకూడ గణం బలపడడం కనిపిస్తూంది సమాజం తన అంతరిక నిర్మాణాన్ని మెరుగుపరుచుకొనేందుకు ప్రయత్నించిన కొద్దీ మానవజాతి ఎత్తుకు ఎదుగుతుంది కుటుంబం దశలవారీగా పురోభివృద్ధి పొందుతుంది

బహిఃప్రపంచం కంట బడక పోతే అస్ట్రేలియన్లు మరో కొన్ని వేల సంవత్సరాలదాకా తరగతుల నిర్మాణం నుంచి బయటపడకనే వుండేవారు అమె రికాల్యాలున్న ఖండాలలోని తెగలు గణాలను నిర్దుష్టం చేసుకున్నారు తర్వాత దశలను గడిచి చివరకు నాగరికతలోకి వచ్చేక దానిని పక్కకుపెట్టేసేరు లింగభేదాన్నిపట్టి

రక్తబంధుత్వాన్నిబట్టి సామాజిక నిర్మాణాలు ఏర్పడడానికి మానవజాతి చరిత్రలో ఎంతో విలువవుంది మానవజాతి ప్రారంభ చరిత్రను ఒకపద్ధతిప్రకారం పునర్నిర్మించాలంటే అవి దేనిని సూచిస్తున్నాయో తెలియాలి

పోలినీషియన్ తెగలలో గణంలేనేలేదు హవాయియనుల పునాలా ఆచారంలో ఆస్ట్రేలియనుల పద్ధతి ఛాయగా కనిపిస్తుంది వెనుకటి పరిజ్ఞానమూ అనుభవమూ లేనిదే స్వపూర్ణంగా నవీనమైన భావాలు స్వతంత్రంగా రావడం బహుశక్యాన మాతృక లేకుండా పుట్టిన మానవ ఆలోచనలు లెక్కకు తీస్తే ఆశ్చర్యం కలిగించేటంత స్వల్పంగా వుంటాయి మానవుని పురోగతికి మార్గం ఉన్నవాటిని మెరుగుపరుచుకోవడంలోనే వుంది

ఈ వాస్తవాల దృష్టిలోంచి చూస్తే ఆధునిక నాగరికతా వికారాలవదగిన మోర్మనిజం వంటివి మానవుని మెదడులో పాతుకుపోయివున్న ఆటవిక దశ అవశేషాలు మాత్రమే అతి ప్రాచీన ఆటవికులూ అనాగరికులూ కపాలాలలో పని చేసి, తిరిగి తిరిగి పుడుతూ అనశ్వరంగా వస్తున్న మెదడే మనదిన్నీ ఈ మధ్యలో జరిగిన లక్షల ఏళ్ళ కాలం పనిచేస్తూ ఆలోచనలు ఆశయాలు ఆవేశాలతో నిండి మన వరకు సంక్రమించింది యుగాలు గడిచిన కొద్దీ అనుభవాలతో నిండి పెద్దదైన ఆ మెదడే మనది అనాగరికత సెలవువేసి ప్రాచీనకాలపు పరిస్థితులను బయటపెడుతున్నాయి అనువంశిక మానసిక లక్షణాలనుగా వీటిని చెప్పాలి

అతి ప్రాథమిక దశలో మెదడులో పుట్టిన కొద్దిపాటి ఆలోచనలనుంచే మానవ జాతి యొక్క ప్రధానమైన నీతినియమాలు పరిణామం పొందేయి ఆటవిక దశలో వాని పెరుగుదల ప్రారంభమయింది అనాగరిక దశా కాలంలో విస్తరించేయి నాగరిక దశలో అవి ఇంకా పెరిగేయి బీజప్రాయంగా వున్న ఆలోచనలు పెరగడానికి మెదడుకు సహజమైన తర్కధోరణి సాయపడింది తర్కించడం మెదడుయొక్క ప్రధాన లక్షణం అన్ని పరిస్థితులలో అన్ని కాలాలలో ఈ లక్షణం

---

• అమెరికాలోని ఊటా రాష్ట్రంలో 1890 వరకు విస్తరించిన ఒక మతశాఖ బహుభార్యాత్వాన్ని బోధించింది 1830లో జోసెఫ్‌స్మిత్ అనే ఆయన "చర్చ్ ఆఫ్ జీసస్ క్రీస్ట్ ఆఫ్ లేటర్ డే సైంట్స్" పేరున ఏర్పరచేడు స్మిత్ భార్యలలో కొందరు కోర్టుకెళ్ళి దానిని బయటకు ఈడ్చేరు

సక్రమంగా తనబాధ్యతను నిర్వర్తించింది అందుచేత దాని ఫలితాలు ఒకే విధంగా వున్నాయి పొందికగానూ వున్నాయి వాటినిబట్టి మూలస్థానానికంటా అనుక్రమాన్ని పట్టుకోవచ్చు మానవజాతి ఒక్కటేననడానికి తిరుగులేని సాక్ష్యాధారాల నివ్వగలవి ఈ ఫలితాలే నీతినియమాలు కల్పనలు అన్వేషణలో కనిపించే మానవ మనస్సు చరిత్ర ఒకే జీవజాతి చరిత్ర అనాటి వ్యక్తులు దానిని ప్రోదిచేసేరు అనుభవాలతో అది అభివృద్ధి పొందింది మానవుని మనస్సుమీదా అతని భవిష్యత్తు మీదా అసాధారణ ప్రభావం కలిగించిన మౌలిక ఆలోచనా బీజం ప్రభుత్వానికి కుటుంబానికి భాషకు మతానికి ఆస్తికి సంబంధించినది ఏనాడో ఆటవిక దశలోనే ఆ బీజాలు పడి మొలిచేయి క్రమంగా పరిణామంపొందుతున్నాయి వాటికి ముగింపులేదు కారణం అవి ఇంకా పురోగమిస్తూనేవున్నాయి ఎప్పటికీ పురోగమిస్తూనే వుంటాయి

# రెండో ప్రకరణం

# ఇరాక్వా గణాలు

గణనిర్మాణం దాని విస్తృతి గణ నిర్వచనం తల్లి హక్కు అతి ప్రాచీన నియమం గణ సభ్యుల హక్కులు సౌకర్యాలు బాధ్యతలు సాకెమ్‌నూ నాయకునీ ఎన్నుకొనే హక్కు తొలగించేహక్కు గణంలో వివాహం నిషిద్ధం చనిపోయిన సభ్యుల ఆస్తి వారసత్వం గురించిన పరస్పర హక్కు ఆపదలో సహాయానికి ఆత్మరక్షణకి ప్రతీకార చర్యకూ పరస్పర బాధ్యతలు — నామకరణం హక్కు గణంలోకి పైవారిని దత్తు చేసుకొనే హక్కు ఉమ్మడి మత కర్మలు ఉమ్మడి శ్మశానం గణసమితి జంతువుల పేర్లతో గణాలు గణంలో సభ్యుల సంఖ్య

మానవ జాతి అనుభవం రెండు తరహాల పాలనా వ్యవస్థలను రూపొందించిందని పైన చెప్పేను రెండూ కూడ విశిష్టములూ క్రమబద్ధములూ అయిన సామాజిక సంస్థలు అందులో మొదటిదీ అతి ప్రాచీనమూ అయినది సామాజికసంస్థ రెండోదీ ఇటీవలిదీ రాజకీయ సంస్థ మొదటిది గణాలూ ఫ్రాత్రీలు తెగల మీద ఏర్పడింది రెండోది భూభాగము, ఆస్తి మీద ఏర్పడింది మొదటి దాని క్రింద గణ సమాజ ఏర్పడింది గణానికి తెగతో గల సంబంధాల బలం మీద వ్యక్తుల మీద అది పాలన నిర్వహించేది ఆ సంబంధాలు కేవలం వ్యక్తిగతం రెండో దాని కింద రాజకీయ సమాజం ఏర్పడింది ప్రాంతంతో అంటే పట్టణం జిల్లా రాష్ట్రంతో గల సంబంధాల ద్వారా వ్యక్తులపై ప్రభుత్వం పాలనను సాగిస్తుంది ఈ సంబంధాలు పూర్తిగ ప్రదేశ పరిమితం ఈ రెండు పద్ధతులూ పరస్పర భిన్నం ఒకటి ప్రాచీన సమాజానికి సంబంధించినది రెండోది ఆధునిక సమాజానికి సంబంధించినదీను

చాలా విస్తృతంగా వ్యాపించిన మానవ వ్యవస్థలలో చాలా పురాతనమైనది గణ నిర్మాణం ఆసియాలోగాని, యూరపులోగాని, ఆఫ్రికాలోగాని, ఆస్ట్రేలియాలో

గాని ప్రాచీన సమాజంలో సర్వత్రా దానిఆధిక్యం కనిపిస్తుంది సమాజాన్ని నిర్మాణ పరచి నిర్వహించుతూన్నది ఆ సంస్థే ఆటవిక యుగంలో ప్రారంభమయి అనాగరిక యుగం దశలు మూడింటా కొనసాగి నాగరిక దశ వచ్చి రాజకీయ సమాజం ఏర్పడే వరకూ అది కొనసాగింది గ్రీకుల గణాలు ప్రాత్రే తెగ రోమనుల గణాలు క్యూరియా తెగ అమెరికను ఆదివాసుల గణాల ప్రాత్రే తెగ ఒకే మాదిరివి అదే మాదిరిగా ఐరిషు ప్రజల సెప్ట్ స్కాటిష్ ప్రజల క్లాన్ ఆర్యేనియనుల ప్రారా సంస్కృతం లోని గణం అమెరికను ఇండియనుల క్లాన్ ఒకే తరహావి మనకు తెలిసినంత వరకు అన్ని జాతుల ప్రజలలో ఈ నిర్మాణం వుండింది నాగరికత పొందిన ప్రజలలో వారి తక దశాకాలం వరకూ కొనసాగింది అంతే కాదు గణ సమాజం ఎక్కడ కనిపించినా దాని నిర్మాణమూ పనిచేసిన తీరూ ఒకే విధంగా వుంది ప్రజలతో పాటు అది కూడా దిగువ స్థాయి నుంచి ఎగువస్థాయికి పెరిగింది ఈ మార్పులు చరిత్రలో ఎక్కడైనా ఒకే విధంగా వచ్చేయి

జెన్స (లాటిన్) జెనోస్ (గ్రీకు) గణ (సంస్కృత) వీనిలో బంధుత్వం ప్రాధాన్యం కను — అనే అర్థం ఇచ్చే జిగ్నో జిగ్నోమై గనమైః అనే ధాతువుల నుంచి వచ్చేయి గణంలోని సభ్యులందరూ ఏకమాత సంతానం అనే భావం ఆ శబ్దంలో అంతర్లీనం గణం అన్నది రక్తసంబంధీకుల గుంపు వారందరి పూర్వమాత ఒక్కరే వారందరి గణం పేరు ఒక్కటే రక్తబంధుత్వం వారిని కలుపుతూంది వారిలో ఒక భాగం మాత్రమే తల్లి సంతానం మాత్రమే దానిలోవుంటారు ప్రాచీనకాలంలో సర్వత్రా తల్లి పారంపర్యమే పాటించబడేది ఆ గణంలో ఒకే పూర్వీకురాలి సంతానంలోఆడ పిల్లల సంతానం వారి ఆడ పిల్లల సంతానం ఇల్లాగేఅనంతంగా సాగేది తర్వాత ఆస్తి అనేది ఏర్పడ్డాక మగవాని పారంపర్యం వచ్చింది ఇప్పుడో పూర్వ పురుషుడు, అతని మగసంతానం వాని మగ సంతానం అనంతంగా సాగింది మన ఇంటి పేరు కుటుంబం పేరు అన్నది మగ వారసత్వం కొనసాగినప్పటి గణ నామం అవశేషమే ఆ పేరుతో చలామణీ అవుతున్న ఈ నాటి కుటుంబము నిర్మాణం కోల్పోయిన గణమే రక్తబంధుత్వం తెగిపోయింది ఆకుటుంబ సభ్యులు పలుమూలలకి చెదిరిపోయారు వారిని గుర్తు పట్టడానికి మిగిలింది ఆ పేరు ఒక్కటే

పైన చెప్పిన జాతులలో గణం అనేదిఒక అసాధారణమైన నిర్మాణంగా వృద్ధి పొందింది దాని ప్రారంభం ఎప్పుడో గుర్తించలేని అతి ప్రాచీనం ప్రాచీన సమాజానికి పునాది అదే. సామాజిక నిర్మాణానికి సాంఘిక నిర్మాణానికి బీజం అది. లాటిన్ గ్రీకు,

సంస్కృత భాషలు మాట్లాడిన వారికే ఇది పరిమితం కాదు అయితే వారిలో ఇది చాలా విస్పష్టరూపం తీసుకుంది ఇతర ఆర్యను తెగలలో సెమిటిక్ యురలియన్ తురానియన్ కుటుంబాలలో ఆ(్ర కా ఆస్ట్రేలియా అమెరికాలలోని ఆదివాసులలో ఇది కనిపించింది

గణముల కార్యకలాపాలు,హక్కులు సౌకర్యాలుతో వాని నిర్మాణాన్ని పరిశీలించడం ఇప్పుడు మనం చేయవలసివుంది అటు తర్వాత పోలికలను మౌలిక ఐక్యతను నిరూపించే దుకు మానవజాతికి చెందిన తెగలు జాతులలో దాని ఉనికిని సాధ్యమైనంత వి_స్తృతంగా అన్వేషించాలి అప్పుడే అది మానవజాతి యొక్క మౌలిక నిర్మాణంగా గు_ర్తించబడుతుంది

మానవజాతి అభివృద్ధి పొందిన కొద్దీ దానితోపాటే గణం ప్రాచీన దశ నుంచి మెట్టుమెట్టుగా అభివృద్ధి పొందింది ఈ అభివృద్ధి ప్రధానంగా రెండు దశలలో జరిగింది ఒకటి మాతృ పారంపర్య రూపం ఇది అతి ప్రాచీనం గ్రీకు, రోమను గణాలలో ఇది కనబడుతూంది చ పోయిన వాని ఆస్తి ఈ ప్రాచీన దశలో అతని గణంలోని వారికి చెందేది రెండో దశలో అది అతని సంతానానికి చెందేటట్లు మార్చబడింది. ఈ మార్పులు చిన్నవిగానే కనిపిస్తాయి కాని, పరిస్థితులలో చాలా పెద్ద మార్పును, ఎంతో అభివృద్ధిని సూచిస్తాయి

గణ నిర్మాణం పుట్టింది ఆటవిక యుగంలో అనాగరిక యుగం మూడు దశలలో కొనసాగింది చివరకు పురోగమించిన తెగలు నాగరిక దశనుచేరుకొనే సరికి వారి అవసరాలకు అది సరిపడలేదు కనక అది రద్దయి పోయింది గ్రీకులలోనూ రోమనులలోనూ గణ సంస్థ మీద రాజకీయ నిర్మాణం పైచేయి సంపాదించింది కాని అది నాగరికదశ ప్రారంభంకాక పూర్వపు ఘటన పట్టణం లేక అటువంటిదే జనపదం ఏర్పడడం, దానికో భౌతికమైన ఆస్తి వుండడం, దానిలో వుండే ప్రజలు ఒక రాజకీయ నిర్మాణంగా ఏర్పడడం జరిగి — అది ఆ కొత్త పాలనా వ్యవస్థకు యూనిటు అయింది. రాజకీయ సమాజం ఏర్పడ్డాక చిరకాలంగా వచ్చిన ఈ గణ నిర్మాణం దాని నుంచి వచ్చిన ప్రాట్రీ తెగ నిర్మాణాలు క్రమంగా అంతరించి పోయాయి ఆటవిక యుగంలో పుట్టి నాగరిక దశలో నిరాకరించబడే వరకూ ఈ గణ నిర్మాణం యొక్క ప్రగతిని అన్వేషించడం నేనీ గ్రంథంలో చేయ బూనుకున్నాను ఆటవిక యుగంలో వుంటూనే కొన్ని తెగలు ఈ నిర్మాణం ద్వారానే అనాగరికస్థాయికి ఎదగ గలిగేరు ఆ అనాగరిక దశ నుంచి నాగరికతకు ఎదగడానికై వారికి ఈ గణ

ంస్థలే సాధ్యపడ్డాయి మానవజాతిలో కొందరిని ఈ గణ నిర్మాణాలు ఆటవికదశ నుంచి నాగరికతకు చేర్చేయి

ఎన్నో తెగలూ జాతులలో ఈ నిర్మాణాన్ని జీవద్రూపంలోనూ చారిత్రక రూపాలలోనూ అధ్యయనం చెయ్యగలం ఆ పనికి మొదట ప్రాచీనరూపంలోంచి ఎత్తుకొని పురోగమిస్తున్న కొద్దీ దానిలో ఎటువంటి మార్పులు చేర్పులు వచ్చేయో పరిశీలిస్తే ఆ మార్పులేమిటో వాటికి కారణాలు ఏమిటో తెలుస్తాయి అందుచేత నేను అమెరికను ఆదివాసులలోని గణసంస్థలతో నా అన్వేషణను ప్రారంభిస్తాను వారిలో అది ఇప్పుడు అతి ప్రాచీన రూపంలో కనిపిస్తుంది గ్రీకులు రోమనులలో వున్న గణాల చారిత్రక రూపాలనుంచి కన్న వీనినుంచి మనకు వాని నిర్మాణ సూత్రాల్నీ పని పద్ధతుల్నీ పరిశీలించేందుకు అవకాశం ఎక్కువ వుంటుంది గ్రీకు రోమనుల లోని గణాలను గురించి సమగ్రంగా తెలియాలంటే అమెరికను ఇండియనులలోని గణ సభ్యుల హక్కులు సౌకర్యాలు బాధ్యతల గురించిన పరిజ్ఞానం చాలా ముఖ్యం

అమెరికనులు మానవజాతి శాస్త్రంలో గణం అనే పేరుకు బదులు తెగ క్లాన్ అనే శబ్దాలు వాడుతున్నారు దీనికి ముందు రాసిన పుస్తకాలలో నేనూ వారిలాగే ఆ శబ్దాలనే వాడేను ఇండియనుల క్లాన్‌ను గ్రీకు రోమనుల గణాలతో పోల్చి చూసినప్పుడు వాని నిర్మాణమూ పనీ ఒక్కటేనని తెలుస్తుంది ఫ్రాత్రీ తెగంలో కూడా ఆ పోలిక కనిపిస్తుంది ఈ సంస్థల పోలికలను కనబరుస్తే లాటిన్ గ్రీకు పారిభాషిక పదాలను వాడి వివరించడానికి అధికారం వుంటుంది ఆ పదాలు చరిత్రలోకి ఎక్కడమేకాదు. శబ్దార్థాన్ని పూర్తిగా ఖచ్చితంగా చెప్తున్నాయి కూడా ఇక్కడ అవసరమైన శబ్దాలను చేర్చి ఈ నిర్మాణాలలో వున్న పోలికలను చూపడానికి ప్రయత్నిస్తాను

అమెరికను ఆదివాసులలో పాలనా వ్యవస్థ గణంతో ప్రారంభమయి సమాఖ్యతో అంతమవుతుంది వారి పాలనా వ్యవస్థ చేరుకున్న చివరి ఉన్నతస్థానం సమాఖ్య ఆ నిర్మాణంలో మొదటిది గణం సమిష్టిగా గణనామం ధరించే రక్త సంబంధీకుల సమూహం ఈ గణం రెండోది ఫ్రాత్రీ ఏవో కొన్ని ఉమ్మడి పనుల కోసం, బంధుత్వం వున్న కొన్ని గణాలు కలిసి ఏర్పడిన ఉన్నత నిర్మాణం మూడోది తెగ ఒకే భాషమాట్లాడే గణాలతో ఫ్రాత్రీల స్థాయిలో కలిసి ఏర్పడే నిర్మాణం ఇల్లాంటి తెగలుకొన్ని కలిసి ఏర్పడుతుంది సమాఖ్య దీనిలోనివారు మాట్లాడేదానికి మూలభాష ఒకటే అయివుంటుంది ఇది గణ సమాజం రాజకీయ

సమాజానికి లేక రాజ్యానికి దీనికి మౌలికంగానే చాలా తేడావుంది యూరపియనుల కంటబడినప్పటికి అమెరికాలో ఓ రాజ్యం ఓ పట్టణనివాసం ఓ రాజకీయసమాజం, ఓ నాగరికత ఏమీలేవు ఉన్నత దశకి చేరిన అమెరికను ఆదివాసులకీ నాగరికతకూ మధ్య ఒక పూర్తి మానవసమాజ దశ అంతరం వుంది

అదే విధంగా నాగరికదశకు పూర్వం నాటి గ్రీకు తెగలలోని పాలనా వ్యవస్థ కూడా ఇదే నిర్మాణాలతో వుంది అయితే వానిలో చివరదిమాత్రం తేడాగా వుంది మొదటిది గణం ఒకే గణ నామం వుపయోగించే రక్త సంబంధీకులతో కూడినది గణం రెండోది ఫ్రాత్రీ సామాజిక మతకర్మల కోసం కలిసిన గణాల సంఘం మూడోది తెగ ఒకే పరంపరలోని గణాలు ఫ్రాత్రీలుగా ఏర్పడి, వానితో కూడిన సంఘం నాలుగోది జాతి ఒకే ప్రదేశ లో నివసిస్తూ గణసమాజంగా కలిసిన తెగల సమ్మేళనం అత్తికాలో నాలుగు అథీనియను తెగలు స్పార్టాలో మూడు దొరియన్ తెగలూ కలిసి ఏర్పడినట్లు సమాఖ్య కన్న సమ్మేళనం పైస్థాయిది సమాఖ్యలో తెగలు వేరువేరుగా తమ తమ ప్రదేశాలలోనే నివసిస్తాయి సమ్మేళనంలో అల్లాకాదు

రోమనుల పాలనా వ్యవస్థా పరస క్రమం కూడా అదే మాదిరిది మొదటిది గణం ఒకే గణనామం గల రక్త సంబంధీకులతో ఏర్పడినది రెండోది క్యూరియా మతకర్మల కోసమూ పాలనా వ్యవహారాల కోసమూ గణాలు కలిసి ఏర్పడిన ఒక ఉన్నత సంఘం మూడోది తెగ క్యూరియాలుగా ఏర్పడిన గణాల సమూహం నాలుగోది జాతి గణ సమాజంగా సమ్మేళనం పొందిన తెగల సముదాయం వెనుకటి రోమనులు తమ్ము "పాపులస్ రోమనస్ — రోమను ప్రజ గా చెప్పుకునేవారు

రాజకీయ సమాజం ఏర్పడక పూర్వం గణ సంస్థలు వుండిన ప్రతి చోటా ప్రజలు గణ సమాజాలలోనే వుండేవారు రాజ్యం అనేదే లేదు వాని పాలనా వ్యవస్థలు పూర్తిగా ప్రజాతంత్రాలు గణాలు ఫ్రాత్రీలు తెగల నిర్మాణం ప్రజాతంత్ర సూత్ర బద్ధం దీనికి చారిత్రక ప్రాముఖ్యత వుంది ఈ నిర్మాణానికి యూనిటు అయిన గణం మౌలికంగా ప్రజా తంత్రం గనక ఫ్రాత్రీ తెగ వానితో ఏర్పడిన సమాఖ్య సమ్మేళనం కూడా ప్రజాతంత్రాలే

రక్త బంధుత్వం మీద ఏర్పడిన అతి ప్రాచీన నిర్మాణమే అయినా గణంలో ఒకే పూర్వీకుని సంతతి అంతా వుండరు గణం అన్నది ఏర్పడినప్పుడు ఒక్కొక్క స్త్రీ పురుష జంటల మధ్య వివాహం అనేది లేదు సామూహిక దాంపత్య సంబంధాలలో తండ్రిని స్థిరపరచడం సాధ్యం కాదు. కనక రక్త సంబంధం తల్లిద్వారా స్థిర

నడచే వారు ప్రాచీన గణాలలో పారంపర్యం స్త్రీల సంతానానికే పరిమితం ఆది మాత ఆమె సంతానం వారిలో స్త్రీల ద్వారా కలిగిన సంతానం వారి స్త్రీ సంతానాల న తానం వీరే గణనామం తీసుకోగలరు గణ సభ్యులుగా వుంటారు ఈ గణానికి చెందినా మగ వారి సంతానం తల్లి గణం లోకి పోతారు అతి ప్రాచీన రూపంలో గణ నిర్మాణ రూపం అది అనాడు సంతానం యొక్క పితృత్వం అనిశ్చితం తల్లిదనం నిశ్చితం కనక వారిని తల్లివేపు ను చే గుర్తించేవారు

ఈ విధమైన పారంపర్యాన్ని ఆస్ట్రేలియను ఆది వాసులలో లాగ ఆటవిక యుగం మధ్య దశవరకూ చూడవచ్చు ఆటవికయుగం ఎగువదశగుండా అనాగరిక యుగం దిగువ దశవరకూ అమెరికను ఆదివాసులలో అది కొనసాగింది దీంకి అక్కడక్కడ మినహాయింపులు లేక పోలేదు అనాగరిక యుగం మధ్యదశ నాటికి అమెరికను ఆది వాసులలో జంట కుటుంబాలు ఏకపత్నీ పతి రూపం (దంపతి) తీసుకోవడం ప్రారంభం అయింది దానితో పాటు పారంపర్యం తల్లి నుంచి పురుషుని వేపు మారడం ప్రారంభమయింది అనాగరిక యుగం ఎగువ దశలో ఒక్క లిసియన్ తెగలు మినహాగా గ్రీకు తెగలలోనూ ఎట్రూస్కన్లు మినహాగా ఇటాలియను తెగలలోనూ పారంపర్యం మగవాని వేపునుంచి గుర్తించడం ప్రారంభమయింది పిల్లల పితృత్వం యెడ విశ్వాసం ఏర్పరిచే దంపతీ (ఏక పత్నీ పతి) వివాహ రూపం స్థిరపడడం మీదనూ తల్లి పారంపర్యం నుంచి తండ్రి పారంపర్యానికి మార్పు రావడం మీదనూ ఆస్తి దాన్నన క్రమింప చేయడాల ప్రభావం వుంది దానిని ముందు ముందు రాస్తా ఈ రెండు పారం పర్యపు హక్కుల మధ్య మానవ జాతి దశలు మూడూ వేల కొద్దీ సంవత్సరాలు—గడిచేయి

పారం పర్యం మగవాని నుంచి గుర్తించినప్పుడు ఒక పూర్వ పురుషునినుంచి అతని సంతానంలో మగవాళ్ళు, మరలవారిసంతానంలో మగవాళ్ళ ఇలాగే అనంతంగా సాగి పోతూ వారితో గణం ఏర్పడుతుంది ఆ యింట పుట్టిన ఆడపిల్లల సంతానం వారితండ్రి గణానికి పోతారు అంటే ఇత పూర్వం ఒకగణంలో ఒకవాడు నిలుపుకొన్న వారిని ఈ మారు వేరు పెట్టడం ఇది రెండువేపుల నుంచీ జరుగుతుంది దంపతీ వివాహంతో పిల్లల పితృత్వం స్థిరపడిన అనంతరం గణం యొక్క రూపం ఆఖరు దశకు చేరింది గణంలో తల్లి పారంపర్యం నుంచి తండ్రి పారంపర్యం ఏర్పడడానికి ఏ విధమైన ఉత్పాతంతో నిమిత్తం లేదు బహు సన్నితంగా జరిగిపోయింది కావలసిందల్లా బలమైన కారణం పారంపర్యంలో మార్పు జరిగినా ఆ గణమే

గతంలోలాగా సామాజిక వ్యవస్థలో మూలసంస్థగానే వుంటూంది ప్రారంభ రూపంలో వుంది గనకనే తరువాతి రూపంలో పారంపర్యం సమస్య వచ్చింది

గణంలో అంతర్వివాహం నిషిద్ధం ఆ విధంగా అది రక్తసంబంధీకుల మధ్య వివాహాలు జరగడం వలన కలుగుతున్న అపదలనుంచి సభ్యులను కాపాడింది ఆ విధంగా ఆరోగ్యవంతులైన ప్రజ ధృఢ పడసాగింది గణం అన్నది మూడు ముఖ్య సూత్రాల మీద ఏర్పడింది రక్తసంబంధం స్త్రీ వైపు నుంచి నిర్దిష్టమైన పారంపర్యం అంతర్వివాహ నిషేధ గణ నిర్మాణం గురించిన ఆలోచన కలిగి నప్పుడే జంట గణాల నిర్మాణావసరం కనబడుతుంది మగవారి సంతానాన్ని గణానికి వెలుపల వుంచడం వుంది గనక స్త్రీ పురుషుల సంతానాల పారంపర్యం కాపాడ డానికై రెండుగణాలు వుండాలి రెండు గణాలను ఏక కాలంలో ప్రారంభిస్తేనే వారి వుద్దేశాలు నెరవేరుతాయి ఒక గణానికి చెందిన స్త్రీ పురుషులు రెండో గణానికి చెందిన స్త్రీ పురుషులను వివాహమాడ గలుగుతారు వారి సంతానం తల్లి పారంపర్యం రీత్యా తల్లుల గణాలకు చెందుతారు గణాన్ని పట్టివుంచే రక్త సంబంధ సూత్రం గణ సభ్యులకు మరో విధంగా లభ్య కాని రక్షణను కల్పిస్తుంది

గణ సభ్యులకు గల హక్కులు సౌకర్యాలు బాధ్యతలను గురించి తెలుసు కొన్నాం ఇప్పుడు గణానికి ప్రాత్రీతో తెగతో సమాఖ్యతో గల సంబంధాల దృష్ట్యా అది వానికేవిధంగా ఉపయోగమో దాని వలని సౌకర్యాలేమిటో దానినియమాలేమిటో తెలుసుకుందాం ఈ వ్యవస్థకు మంచి వుదాహరణగా ఇరాక్వ్యూ గణాలను తీసుకుని విచారిద్దాం వారు గణం నుంచి సమాఖ్య వరకు పాలనా వ్యవస్థను సర్వాంగీణంగా దృఢ పరిచేరు. అవి అతి ప్రాచీన రూపంలో వున్న గణనిర్మాణంలో ఎటువంటి శక్తి వుందో బాగా చూపిస్తాయి. ప్రపంచం దృష్టిలో పడిన నాటికి ఇరాక్వ్యూలు అనాగరిక యుగం దిగువ దశలో వున్నారు ఆ దశకిసంబంధించినంత వరకూ కళలలో బాగా సామర్థ్యం గడించేరు వేరళ్ళ నుంచి నారతీసి వానితో వలలు సంచిక సగ్గాలుతయారు చేశారు దానిని పడుగు పేక వేసి బెల్టులు పటకాలు నేశారు ఇసకలో మన్ను కలిపి పాత్రలు కుండలు చేసి కాల్చి గట్టి పరిచేరు వానికి అలంకారాలు అద్దేరు మొక్కజొన్న చిక్కుడు, దోస, పొగాకులను పెరళ్ళలో వేసి పండించేరు మొక్కజొన్నను మట్టి పాత్రలలో ఉడకపెట్టి దంచి రొట్టెలు చేశారు చర్మాలు పదును పెట్టి తోళ్ళు చేసి వాటితో అంగవస్త్రాలు లెగ్గిన్‌లు మొకాసిన్‌లు తయారుచేశారు విల్లు బాణం, గద ప్రధాన ఆయుధాలుగా వుపయోగించేరు. చెకుముకి రాయితో ఎముకతో పనిముట్లు

చేసుకున్నారు తోలు వస్త్రాలు కట్టుకున్నారు వేటలో చేపలు పట్టడంలో బహు నిపుణులు అయిదు పది ఇరవై కుటుంబాల వరకు నివసించేందుకు పొడుగా ఉమ్మడి ఇళ్ళు కట్టుకన్నారు ప్రతి ఇంటా కమ్యూనిజం పద్ధ లో జీవించారు ఇళ్ళు కట్టుకొనడంలో వారు రాళ్ళను వచ్చి ఇటికలను వుపయోగించడం ఎరగరు లోహాలు ఎరగరు మానసిక శక్తులలోనూ పురోగతిరీత్యానూ వారిని న్యూమెక్సికోకు ఉత్తరాన వున్న ఇండియను కుటుంబాలలో నగటు శాఖ అని చెప్పవచ్చును వారియుద్ధ శక్తిని గురించి జనల్ ఎస్ ఎ వాకర్ రెండు వాక్యాలలో వర్ణించేడు "ఇరాక్వాల పని విధానం బహు భయంకరం ఖండంలోని ఆదివాసులకు వారు దేవుడు ఇచ్చిన శాపం"

కాలగతిలో ఇరాక్వా తెగల సంఖ్య కొంచె మారింది. ఆయాగణాల పేర్లలోనూ మార్పు వచ్చింది దేనిలోనూ గణాలు ఎనిమిది కన్న ఎక్కువ లేవు

సెనెకాలలో— 1 తోడేలు 2 ఎలుగు 3 తాబేలు 4 బీవర్ 5 లేడి 6 ఉల్లంకి (పిట్ట) 7 కొంగ, 8 డేగ గణాలు

కయూగాలు 1 తోడేలు 2 ఎలుగు 3 తాబేలు 4 బీవర్ 5 లేడి 6 ఉల్లంకి 7 మలుగు (చేప) 8 డేగ

ఒనాందాగాలు 1 తోడేలు 2 ఎలుగు 3 తాబేలు 4 బీవర్ 5 లేడి 6 ఉల్లంకి 7 మలుగు, 8 బంతి

ఒనీదాలు 1 తోడేలు 2 ఎలుగు 3 తాబేలు

మోహాక్‌లు 1 తోడేలు 2 ఎలుగు 3 తాబేలు

టుస్కారోరాలు 1 బూడిదరంగుతోడేలు 2 ఎలుగు 3 పెద్దతాంబేలు 4 బీవర్ 5 పసుపురంగు తోడేలు 6 ఉల్లంకి పిట్ట 7 మలుగుచేప 8 చిన్న తాంబేలు

ఈ మార్పుల్ని పట్టి కాలగతిలో కొన్ని తెగలలోని కొన్ని గణాలు అంతరించిపోయాయనీ కొన్నింటిలో జనం పెరిగిపోయి అనుబంధ గణాలు ఏర్పడ్డాయనీ తెలుసుకోవచ్చు

గణ సభ్యులకున్న హక్కులు, సౌకర్యాలు బాధ్యతలు తెలుసుకుంటే సామాజిక పాలనా వ్యవస్థకు మూల సంస్థగా దాని సామర్థ్యం అర్థం అవుతుంది ప్రాచీన తెగ సమాఖ్యల వంటి పైసంస్థలలో అది చేరిన విధమూ తెలుస్తు ది

ఏ గణాని కా గణం తన సభ్యులకు దిగువహక్కులు సౌకర్యాలు బాధ్యతలు ఇచ్చింది

1 గణ సభ్యులు శాకెమ్‌నూ నాయకుణ్ణీ ఎన్నుకుంటారు

2 శాకెమ్‌నూ నాయకుణ్ణీ పదవులనుంచి తొలగిస్తారు

3 గణం బయటనే వివాహమాడాలి

4 చనిపోయిన వారి ఆస్తుల వారసత్వం గురించిన పరస్పర హక్కు

5 సహాయానికి రక్షణకు ప్రతీకారానికి పరస్పర బాధ్యత

6 తన సభ్యులకు నామకరణం చేసే హక్కు

7 పరాయివారిని గణంలోకి దత్తుచేసుకొనే అధికారం

8 ఉమ్మడి మతకర్మకాండలు

9 ఉమ్మడి శ్మశానం

10 గణసమితి

ఈ హక్కులూ అధికారాలూ గణానికి ఒక ప్రత్యేకతనూ శక్తినీ సమకూరుస్తున్నాయి దాని సభ్యుల వైయక్తిక హక్కులను కాపాడుతున్నాయి

## 1 శాకెమ్‌నూ, నాయకుణ్ణీ ఎన్నుకొనే హక్కు

ఇంచుమించు అన్ని అమెరికన్ తెగలలో రెండు తరగతుల నాయకులుంటారు వీరిలో ఇద్దరు ప్రముఖులు మిగతావారు విశేష విధులు నిర్వర్తించేవారు ప్రతిగణంలోనూ సభ్యులనుంచి వారిని ఎన్నుకుంటారు పారంపర్యము తల్లివేపునుంచి గనక తండ్రి తరవాత కొడుకు నాయకత్వానికి వచ్చే అవకాశంలేదు కొడుకు మరోగణంలో సభ్యుడు మరోగణానికి చెందిన వారిని శాకెమ్‌గా గాని నాయకుణ్ణిగా గాని ఏ గణమూ అంగీకరించదు. శాకెమ్ స్థానం గణంలో పారంపర్యంగా వస్తుంది అంటే ఆ స్థానం ఎప్పుడూ ఖాళీగా వుంచబడదు నాయకత్వ స్థానానికి పారంపర్యంలేదు, వ్యక్తిలోని ప్రత్యేకతను బట్టి ఆ స్థానానికి ఎన్నుకుంటారు అది అతనితోనే ఆఖరు పైగా శాకెమ్ బాధ్యతలన్నీ శాంతి సమయానికి సంబంధించినవి అతడు శాకెమ్ హోదాతో యుద్ధానికి పోలేడు రెండోవేపున శౌర్యం కారణంగానో వ్యవహార జ్ఞానానికో సభికులలో కనబరిచే వాదనాపటిమకో నాయకత్వస్థానానికి వచ్చినవారు సమర్థులైతేకావచ్చు కాని గణం మీద పెద్దరికం వహించరు శాకెమ్ ప్రధానంగా గణవ్యవహారాలు చూస్తాడు దానికతడు పెద్దనాయకుడు తెగతోటి సంబంధాలు చూస్తాడు సమితి పనులు చూస్తాడు సమితిలో శాకెమ్ నాయకుడు ఇద్దరూ సభ్యులే

శాకెమ్ స్థానం గణంలో సహజావసరం రక్త సంబంధీకుల కూటమిగా దానికి ప్రాతినిధ్యం వహించే అధిపతి వుండాలి ఈ స్థానం గణాలకన్న ప్రాచీనం గణాలు ఏర్పడక పూర్వం పునలాన్ గ్రూపులవంటి వాటిలో అంతకన్న పూర్వం నాటి గుంపులలో ఈ శాకెమ్ పదవివుంది గణంలో శాకెమ్‌ను ఏర్పరచే విధానం నిర్వచించబడి ది అదొక సుస్థిరమైన స్థానం దానివన్నీ పెద్దరికపు బాధ్యతలు గణంలో అది పారంపర్యంగా కొనసాగే పదవి దానికి గణంలోని మగవారినుంచి ఎన్నిక జరుగుతుంది ఇండియనులలోని రక్తసంబంధ వ్యవస్థను గమనిస్తే గణంలోని మగవాళ్ళంతా సహోదరులో జ్ఞాతి సోదరులో మేనల్లుళ్ళో మేనమామలో తాతలో మనమలో (వరసకి) అయివుంటారు శాకెమ్ పదవి అన్ననుంచి తమ్ముడికి రావచ్చు లేదా వారి అక్క-చెల్లెలి కొడుకుకు రావచ్చు తాత నుంచి మనుమనికి రావడం చాలా అరుదు గణంలో వయసు వచ్చిన స్త్రీ పురుషులంతా కలిసి శాకెమ్‌ను ఎన్నుకుంటారు సాధారణంగా చనిపోయిన శాకెమ్ సోదరుని లేకుంటే అతని అక్క-చెల్లెలి కొడుకును ఎన్నుకొంటారు స్వంత సోదరునికి స్వంత సోదరి కొడుక్కి ప్రాముఖ్యం ఇస్తారు స్వయాన సోదరులు జ్ఞాతి సోదరులు స్వంత అక్క-చెల్లెలి కొడుకులు జ్ఞాతి అక్క-చెల్లెళ్ళ కొడుకులు వుండొచ్చు ఫలానావారినే ఎన్నుకోవాలనే ప్రత్యేకత ఏమీలేదు గణంలోని మగ సభ్యులందరికి ఎన్నుకోబడే హక్కు సమానమే వారిలో ఎవరు శాకెమ్ కావాలనేది ఎన్నుకోబడడం పట్టి వుంటుంది

సెనెకా ఇరాక్వాలలో చనిపోయిన వాని స్థానంలో శాకెమ్‌ను ఎన్నుకొనేందుకు గణసమితిని సమావేశపరుస్తారు చేయవలసిన పనులను పట్టి ఇద్దర్ని ఎన్నుకోవాలి వారిద్దరూ గణసభ్యులే అయివుండాలి వయస్సు వచ్చిన స్త్రీ పురుష లందర్నీ అడుగుతారు ఎక్కువమంది అంగీకారం తెలిపినవారిని శాకెమ్‌గా నియమిస్తారు అయితే తెగలోని మిగతా ఏడు గణాలూ కూడ ఆ ఎన్నికను అంగీకరిస్తేతప్ప నియామకం పూర్తికాదు ప్రత్యేకంగా ఈ గణాలు ఇందుకోసం సమావేశం అవుతాయి వారు ఆ ఎన్నికను అంగీకరించకపోతే అది రద్దు అయి గణం వేరొకరిని ఎన్నుకొంటుంది గణం ఎన్నుకొన్న వ్యక్తిని మిగతా గణాలు కూడా ఆమోదిస్తే ఎన్నిక పూర్తి అయినట్లే అయితే సమాఖ్య సమితి అతనిని ఆ పదవిలో కూర్చోబెట్టాలి అంతవరకు అతడు తన విధులను నిర్వర్తించలేడు వారితో అధికారం కట్టబెట్టే పద్ధతి అది ఈ విధంగా వివిధ

గణాల హక్కులనూ ప్రయోజనాలనూ గణనకు తీసుకుని వాటిని కాపాడడం జరుగుతూంది శాకెమ్ తెగ సమితిలోనూ సమాఖ్య సమితిలోనూ ఎక్స్ అఫిషియో సభ్యుడుగా పాల్గొంటాడు నాయకుని ఎన్నికా ధృవీకరణా కూడ ఇదేవిధంగా జరుగుతాయి కారణాలు అవే శాకెమ్ కన్న చిన్న పదవుల ఎన్నికను ధృవీకరించేందుకు జనరల్ కౌన్సిలు సమావేశం జరగదు ఎప్పుడో శాకెమ్ ధృవీకరణకాలం వరకూ అవి వేచివుంటాయి

గణాలతోనే ఎచ్చిన ప్రజాతంత్రం శాకెమ్‌నూ నాయకుణ్ణీ ఎన్నుకోవడంలో దానినెవరూ అతిక్రమించుకునికూర్చోకుండా రక్షణలు ఏర్పరచడంలో ఎన్నికవిషయంలో ఇతర గణాల పరిశీలనను ఏర్పరచడంలో వ్యక్తమవుతూంది

సాధారణంగా గణసభ్యుల సంఖ్యను పట్టి వారి నాయకుల సంఖ్య వుంటుంది సెనెకా ఇరాకూ్యలలో ప్రతి ఏభయిమందికీ ఒక నాయకుడు వుంటాడు ఇప్పుడు న్యూయార్కులో వారి సంఖ్య మూడువేలు వారికి ఎనిమిది మంది శాకెమ్‌లూ అరవై మంది వరకూ నాయకులూ వున్నారు ఇదివరకటి కన్న ఇప్పుడు ఎక్కువ మంది వుంటున్నారనుకోడానికి కారణాలున్నాయి తెగలో జనసంఖ్య ఎక్కువయి నప్పుడు గణాలసంఖ్య పెరుగుతుంది వేరు వేరు తెగలలో ఆ సంఖ్య భిన్నంగా వుటూంది దెలావరేంలలోనూ మున్సీంలలోనూ తెగలో మూడేసి గణాలుంటే ఒజిబ్వాలూ క్రీక్‌లూలో ఇరవైగణాల వరకూ వున్నాయి ఆరు, ఎనిమిది, పదీ సామాన్యం

## 2 శాకెమ్‌నూ, నాయకుణ్ణీ తొలగించేందుకు హక్కు

ఎన్నుకొనే హక్కులాగే ఇదీ అంత ముఖ్యమే గణసభ్యులకు ఈ రెండు హక్కులూ వున్నాయి ఈ పదవిలో జీవితాంతమూ వుండగలడనేది పేరుకు మాత్రమే కాని సాధారణంగా ఆ వ్యక్తి సక్రమంగా వ్యవహరించినంతకాలమే పదవిలో వుంటాడు తొలగించే హక్కు గణానికుంది ఈ పదవినివ్వడాన్ని "కొమ్ములు ఇవ్వడ" మనీ తొలగించడం "కొమ్ములు కోసెయ్యడ" మనీ పిలుస్తుంటారు. చాలా తెగలలో ఒకదానికొక దానికి సంబంధంలేని సందర్భాలలోకూడ ఈ పదవికీ, అధికారానికీ చిహ్నంగా సంకేతంగా కొమ్ములనే వుపయోగిస్తారు. కొముకిలుండే జంతువులలో పెద్దకొమ్ములుగల మగ జంతువు గంభీరంగా కనిపించడం దీన్కి కారణమై వుంటుందని సైంరు అంటున్నారు మర్యాద తప్పి వ్యవహరించడం ప్రజల

విశ్వాసాన్ని కోల్పోవడం పదవి నుంచి తొలగించడానికి కారణం అవుతుంది గణ సమితి క్రమపద్ధతిలో శాకెమ్‌నూ నాయకుణ్ణి తొలగించిన తరవాత వారు మామూలు సభ్యులుగా మాత్రమే వుంటారు గణం పూనుకొనేవరకూ వేచిచూడకుండా వారియిష్ట లకు వ్యతిరేకంగాకూడా తెగసమితి శాకెమ్‌లనూ నాయకుల్ని తొలగించవచ్చు ఈ హక్కు వుండడమూ అప్పుడప్పుడు దానిని అమలు పరుస్తుండడమూద్వారా శాకెమ్‌లూ నాయకులూ మీద గణాలకున్న అధికారం ధృవీకరించబడుతూంది గణాల ప్రజాతంత్ర స్వభావాన్ని కూడా అభివృద్ధిపరుస్తూంది

## 3 గణంలో అంతర్వివాహానికి అభ్యంతరం

ఈ నిరాకరణ చాల ముఖ్యం ఆదిమాత సంతానంలో ఒక భాగం రెండో భాగం వారితో [రక్త సంబంధం కారణంగా] కలియకుండా నిరోధించడం గణం యొక్క ప్రధానోద్దేశం గణ సంస్థ ఏర్పడిన నాటికి సోదరులు ఒకొకరి భార్యలతో గుంపుగా వివాహ సంబంధం కలిగివు డెవారు అలాగే సోదరీలూను గణ సంస్థ దానిని ఆటంక ప చలేదు కాని, సోదరీ సోదరులను ఒకే గుంపునుంచి విడతీయ డానికి పూనుకుంది మొత్తం వివాహ వ్యవస్థనంతనూ మార్చ పూనుకుంటే అది జరిగి వుండెదికాదు బహుశా ఈ గణం కొద్దిమందివున్న అటవికుల గుంపులో ప్రారంభ మయివుంటుంది బలమైన సంతానం కలగడానికి అది తోడ్పడడాన్ని గమనించిఅందరూ దానిని స్వీకరించి వుంటారు ప్రాచీన ప్రపంచంలో గణసంస్థ సర్వత్రా పరివ్యాప్తమై వుండడం చూస్తే అటవిక అనాగరిక యుగాలలో మానవుల అవసరాలకు అది సరిపడి వుందనీ దానివలన అనేక ప్రయోజనం కలిగిందనీ చెప్పడానికి సందేహం అక్కర్లేదు తమ గణంలోని వారిని వివాహ మాడరాదనే నియమానికి ఇరాక్వాలు నేటికీ గట్టిగా కట్టుబడివున్నారు

## 4 చనిపోయిన వారి ఆస్తి వారసత్వం గురించిన పరస్పర హక్కు

అటవికయుగంలోనూ అనాగరికయుగం దిగువ దశలోనూ ఆస్తి చాలాకొద్ది అటవికదశలో స్వంత వస్తువులు అంటూ వుంటాయి అనాగరికయుగం దిగువ దశలో ఉమ్మడి ఇళ్లలోనూ తోట దొడ్డిలోనూ భోక్తృహక్కులు వుంటాయి విలువైన స్వంత వస్తువుల్ని మరణించిన వానితోపాటే పాతి పెడతారు అయినా వారసత్వం సమస్య రాకమానదు ఆస్తి పరిమాణమూ వైవిధ్యమూ ఎక్కువైన కొద్దీ దీని ప్రాధాన్యం

పెరుగుతుంది అందుచేత ఒక స్పష్టమైన నియమం చేయవలసి వచ్చింది అనాగరిక యుగం దిగువ దశలోనూ ఇ కా అంతకుముందు ఆటవిక యుగంలోనూ దీనికి నియమాలు చేయబడినాయి ఆస్తిగణంలోనే వుండాలి చనిపోయిన వాని గణ సభ్యులకు ఆ ఆస్తిని పంచుతారు అనాగరికయుగం ఎగువ దశలోవున్న గ్రీకు లాటిన్ తెగలు దానిని ఆచార గా పాటించేయి నాగరికదశలో చాలకాలం వరకూ లిఖితచట్ట గా పాటించేరు కాని ఆధీనియన్లలో సొలోన్ తర్వాత వీలునామాలేని సందర్భాలకు మాత్రమే దానిని పరిమితం చేశారు

ఆ ఆస్తిని ఎవరు తీసుకోవాలనే ప్రశ్నకు వసనగా మూడు ముఖ్యమైన నియమాలు చేయబడినాయి వారి గణ సభ్యులకు మాత్రమే పంచాలనేది మొదటిది అనాగరికయుగం దిగువదశలో చేసిన దీ నియమం ఆటవికయుగంలో కూడా ఇది వుండినట్లు కనబడుతూంది గణంలోని వారందరికీగాక చనిపోయిన వారి రక్తబ వు వుల మధ్య పంచాలనేది రెండో నియమం ఇది బీజప్రాయ గా అనాగరికయుగం దిగువ దశలోనే కనబడింది మధ్యదశలో గట్టిగా నెలకొన్నట్లు క పిస్తూంది అందరు రక్తబ ధువులకిగాక చనిపోయిన వారి స తానానికే ఆస్తిచెందాలనేది మూడో నియమం అనాగరికయుగం ఎగువదశలో ఇది ఖండితం అయింది

సిద్ధాంతరీత్యా ఇరాక్వూలలో మొదటి నియమం వర్తించాలి కాని వాస్తవానికి చనిపోయినవాని గణంలోని దగ్గర బంధువులు తీసుకుంటున్నారు అతని సహోదరులు అక్కచెల్లెళ్ళు, మేనమామలు తమలో తాము పంచుకు టున్నారు వారసత్వాన్ని అతి సన్నిహిత గణ బంధువులకు పరిమితంచేయడం పైతృక వారసత్వానికి బీజం అనవచ్చు చనిపోయిన ఆమె స్త్రీ అయితే ఆమె ఆస్తిని ఆమెపిల్లలూ అక్కచెల్లెళ్ళూ తీసుకుంటారు అన్నదమ్ములకు ఇవ్వరు ఏ విధంగా అయినా ఆస్తిగణంలోనే వుంటు ది చనిపోయిన మగివాని సంతానం మరోగణంవారు కనకవారికి తండ్రి ఆస్తి వెళ్ళదు భార్యనుంచి భర్త భర్తనుంచి భార్య ఏమీ తీసుకోరు దానికి అదే కారణం వారసత్వం గురించిన ఈ పరస్పర హక్కు గణంయొక్క స్వతంత్రతను ర క్ష పరుస్తూంది

## ౫ పరస్పర సహాయ, రక్షణ ప్రతీకారముల బాధ్యత

నాగరిక సమాజంలో వ్యక్తుల ఆస్తుల రక్షణ బాధ్యత రాజ్యానిది వ్యక్తిగత హక్కుల పరిరక్షణకు రాజ్యం వైపు దృష్టి మళ్ళించిన కొద్ది రక్తబంధుత్వపు

అనుబంధాల బలం నన్నగిల్లుతుంది గణ సమాజంలో వ్యక్తులు తమ రక్షణకు గణం మీదనే ఆధారపడతారు తరవాతకాలంలో రాజ్యం తీసుకున్న ఆ బాధ్యతను అప్పుడు గణ వహించింది ఈ రక్షణ బాధ్యతను నిర్వహించేందుకు దానివద్ద బలగం వుంది గణ సభ్యులలో రక్త అనుబంధం చాలబలంగా వుంటుంది అందుచేత పరస్పర సహాయం చేసుకుంటారు ఒక మనిషిని బాధించడం ఆ గణాన్ని బాధించడం ఒకటే ఒక మనుషుల బలిపర్చడం అంటే తన గణంలోని బంధువులందరితో కలిసి అతనికి వత్తాసుగా నిలబడడం అన్నమాట

కష్టాలు ఇబ్బందులలో గణసభ్యులొకరొకరికి సాయంచేసుకుంటారు ఇండియను తెగలనుంచి ఒకటిరెండు ఉదాహరణలిస్తాను యుకటాన్‌లోని మాయాలను గురించి హెర్రెరా ఇలా రాసేరు నష్టపరిహారం చెల్లించినప్పుడు దాని ఫలితంగా చెల్లించినవాడు దరిద్రంలో మునిగితే బంధువులంతా విరాళాలిస్తారు” ఇక్కడ ప్రయోగించిన బంధు శబ్దాన్ని గణమని అర్థంచేసుకోవాలి ఫ్లోరిడా ఇండియన్లగురించి ఇల్లారాసేరు సోదరుడో కొడుకో చనిపోయినప్పుడు మూడునెలలవరకూ ఆ ఇంటి వాళ్ళు మాంసానికైనా చస్తారు గాని తిండి తెచ్చుకోరు ఆ మూడు నెలలూ బంధువులూ జ్ఞాతులూనే వారికి తిండి తెచ్చిపెడతారు.” ఊరునుంచి మరో వూరుకు మారినప్పుడు ఎవరూ తమరు చేసుకుంటున్న భూములమీదా తమరు కాపురం వుంటున్న ఉమ్మడి ఇళ్ళలో వాటామీద హక్కుభుక్తాన్ని మరొక పైవానికి మార్చి ఇవ్వడానికి వీలుండదు వాటిని తన గణ బంధువులకి వదిలేసి పోవలసిందే నికరాగువాలోని ఇండియను తెగలలో ఈ ఆచారాన్ని గురించి హెర్రెరా వ్రాసేరు. “ఒక పట్టణం నుంచి మరోపట్టణానికి మకాం మారుతున్నప్పుడు తమకున్నది దగ్గర బంధువుకు వదిలి పోవలసిందేకాని అమ్ముకు పోరాదు” వారి ఆస్తి ఉమ్మడి హక్కులో వుండడం చేత దానిని మరోగణం వారికి వప్పచెప్ప వీలుండదు క్రియారూపంలో వారి కున్నది అల్లాగ అనుభవించేహక్కు దానిని విడిచి పెడితే అది మరల గణానికే చేరుతుంది పెరూలోని ఆండే పర్వతాల తెగలగురించి గార్సిలా సోదే లావెగా రాసేరు “మామూలు సభ్యులు పెళ్ళిచేసుకుంటే ఆ కూటంలోనివారు వారికి ఇల్లుకట్టి ఇవ్వాలి” ఆయవకూటం అన్నది గణమేనని అర్థంచేసుకోవాలి ఈ తెగలను గురించే హెర్రెరా వ్రాసేడు “వారు తెగలు జాతులు కుదుళ్ళగా విడబడి వుండడం మూలంగానే అన్ని భాషలున్నాయి” ఇక్కడ కూడా కొత్తగా వివాహం చేసుకున్నవారికి గణ సభ్యులు ఇల్లు కట్టి ఇవ్వాలి

రక్త ప్రతీకారం మానవజాతి తెగలన్నింటా వుంది దానికి మూలం గణాలలోనే వుంది తమ సభ్యులలో ఒకరిని చంపితే ప్రతీకారం చేసే బాధ్యత గణానిది నేరస్థులను విచారించే పంచాయతీలూ, వానికి విధించవలసిన శిక్షలను నిర్ణయించే చట్టాలూ గణ సమాజంలో అలస్యంగా వచ్చేయి కాని రాజకీయ సమాజం ఏర్పడక పూర్వమే వచ్చేయి హత్యలనేది మానవ సమాజంలో అత్యంత ప్రాచీనమైన నేరం గణ సభ్యులు ప్రతీకారంగా శిక్షించడంకూడా అంత ప్రాచీనమే ఆరాక్యూలలోనూ, ఇతర ఇండియను తెగలలోనూ జ్ఞాతిహత్యకు ప్రతీకారం చేయడం విధిఅని అంగీకరించబడింది

ప్రతీకార చర్యగా హత్యకు పూనుకొనేముందు హతునిగణంవారూ, హంతకుని గణంవారూ సర్దుబాటు చేయపూనుకోవడం వారి బాధ్యత రెండు గణాల సమితులూ వేరువేరుగా సమావేశం అవుతాయి హంతకుని గణం హంతకుని తరపున తమ సూచనలు తెలుపుతారు సాధారణంగా అవి విచారం ప్రకటించడం, నష్టపరిహారంగా విలువైన బహుమతులివ్వడం అయివుంటాయి హత్యకు తగిన కారణాలూ, కవ్వింపులూవుంటే సాధారణంగా సర్దుబాటు చేసుకుంటారు కాని హతునిగణం పట్టుదలగా వుంటే వారు తమ గణంలో ఒకరిని ప్రతీకారం చెయ్యడానికి నియమిస్తారు అతడు హంతకుని వెంటాడి, దొరక పట్టుకుని, చంపెయ్యాలి ఆ విధంగా చంపేసినప్పుడు హతునిగణం ఆ చర్యను తప్పుపట్టకూడదు ప్రాణానికి ప్రాణం తీసుకొన్నారు న్యాయం అమలు అయింది

తోడి గణసభ్యులు ఆపదలలో వున్నా అతనిని తోడివాళ్ళు ఆదుకుంటారు కష్టాలకి అడ్డుపడతారు అటువంటి సోదరభావం గణంలో వుంది

## 6 సభ్యులకు నామకరణంచేసే హక్కు

అటవికులలోనూ, అనాగరికులలోనూ కుటుంబాలకు పేర్లులేవు వ్యక్తుల పేర్లు పట్టి వారి కుటుంబాన్ని గుర్తించడం సాధ్యంకాదు కుటుంబనామాలు నాగరికతతోవచ్చినవే. ఇండియనులలో పేరు చెప్పగానే, ఏగణం వాడో, తెగలోని ఇతరులు తెలుసుకోగలరు. ప్రతిగణానికి తన సభ్యులకు పెట్టే పేర్లమీద హక్కువుంది ఆ పేర్లను తెగలోని మరో గణం వాడకూడదు గణాల హక్కులలో గణ నామాలు ఒకటి వానిని గణం ప్రకటించుకొంటుంది ఆ విధంగా పరిపాటి అవుతాయి ఉదా

సెనెకాల 12 గణాలలో లా టా వా (సాత్రస్సు దేగ) ఒకటి వారిలో

మగవారి పేర్లు ఆ హి పే- నారా (పొడుగురెక్కలు) గ్లా- దాన్ నో- చే (గాలిలో తేలి ఎగురుతున్న దేగ) నెస్ తా పే- కా (పెలికన్ను పక్షి) అనీ, ఆడువారికి —మె- తా- నా- (పగలు పాడే పిట్ట), లా- తా- దా- విన్ (ఒకపక్షి) వా- తా- నా- (పక్షి గుడ్డు) యున్నా పేర్లు

పిల్ల పుట్టేక తల్లి తన గణంలో వాడుకలో లేని పేరును, తన దగ్గర బంధు వుల ఆమోదంతో ఎన్నుకుంటుంది ఆపేరు పెడతారు అయితే ఆటు తరవాత జరిగే తెగ సమితి సమావేశంలో ఆ బిడ్డ పుట్టుకను, పెట్టిన పేరును, తల్లిపేరు, ఆమె గణం పేరు, తండ్రిపేరుతో సహా ప్రకటించిన తరువాతనే ఆ బిడ్డ నామకరణం జరిగినట్లు లెక్క ఒకవ్యక్తి మరణిస్తే వారి పేరును అప్పటికి సజీవులుగా వున్న ఆయన సంతా నంలో పెద్దవారి అనుమతితో తప్ప ఆయన జీవితకాలంలో వేరొకరు వుపయోగించ కూడదు.

పేర్లలో కూడ రెండు తరగతులవి వుపయోగిస్తారు చిన్నవాడు వుపయోగిం చేది పెద్దవారయ్యేక వుపయోగించేది ఈపేరు మార్పుకు కూడా అంత తతంగం వుంది ఒకటి తీసెయ్యడం, మరొకటి పెట్టడం జరుగుతుంది ఏటి వాలువపోతున్న పడవ, వేలాడుతున్న పువ్వు— ఇవి ఆడువారికీ, సుందరమైన నరస్సు ద్వారపాలకుడు ఇవి మగవాళ్ళకి, పెద్దవాళ్ళు అయ్యాక సెనెకా- ఇరాక్వ్యాలలో పెట్టే పేర్లు పదహారు లేక పద్దెనిమిదేళ్ళ వయస్సు వచ్చేక సాధారణంగా గణం నాయకుడు రెండోతరగతి పేర్లలోఒకటి పెడతాడు అటు తరవాత జరిగే తెగ సమితి సమావేశంలో ఆ మార్పును ప్రకటిస్తారు కొత్త పేరు పెట్టినది మగవానికైతే అతడు అప్పటినుంచి పెద్దవాళ్ళు చేయవలసిన బాధ్యతలు ఎత్తుకోవలసి వుంటుంది కొన్ని ఇండియన్ తెగలలో వయస్సు వచ్చిన యువకుడు యుద్ధోత్సాహం చూపించి ఏమన్నా వీర కృత్యాలు చేసి నప్పుడే ఈ పేరు మార్చేయడం జరుగుతుంది ఏదన్నా పెద్ద జబ్బుచేసినప్పుడు మరో మార్పుకోరి పేరుమార్చుకొనే మూఢాచారంవుంది బాగా ముసలివారయ్యేక పేరుమార్చు కోవడం కూడా జరుగుతుంది శాకెమ్ గానో, నాయకుడు గానో ఎన్నుకోబడినప్పుడు ఆ హోదా తీసుకొనేసమయంలో పాతపేరు తీసేసి కొత్త పేరు పెడతారు పేరు మార్పు విషయం గురించి వ్యక్తుల పెత్తనం ఏమీ వుండదు అది గణంలోని స్త్రీల, నాయకుల ఇష్ట ప్రకారం జరుగుతుంది తండ్రి చనిపోయినప్పుడు ఆయన పేరు మీద పెత్తనం ఆయన పెద్ద కొడుకుది. ఆ కొడుకు తన తండ్రి పేరును మరో గణంలోని మిత్రునికి ఎరువు ఇయ్యవచ్చు అయితే ఆ ఎరువు తీసుకొన్న అతను చని పోయాక

ఆపేరు పరలు మొదటి గణంలోకి వచ్చి చేరుకుంది

ఇప్పుడు షానీలు, డెలావరేలలో తల్లి తన బిడ్డకు తన ఇచ్ఛ వచ్చిన గణాం లోని పేర్లను పెట్టుకునే హక్కు వుంది దాని వలన ఆ బిడ్డ తన పేరుకు సంబంధించిన గణానికి చెందుతుంది ప్రాచీన కాలపు అలవాట్లకు ఇది భిన్నం విశిష్టమైన ఆచారమున్నా దీనివలన గణాలలోని పారంపర్యం గందరగోళంలో పడుతుంది ఈ నాటికీ ఇరాక్వాలలోనూ, ఇతర ఇండియన్ గణాలలోనూ అనాదిగా గణాలలో ప్రయోగించబడుతూ వచ్చిన పేర్లనే వాడుతున్నారు.

గణానికి చెందిన పేర్లను ఉపయోగించడంలో తీసుకుంటున్న జాగ్రత్తలుచూస్తే, వానికి గణాలలో ఇచ్చే ప్రాధాన్యతా వాని వలన సమకూడే గణ హక్కులూ అర్థం అవుతాయి.

వ్యక్తుల పేర్ల సమస్యలో అనేక విషయాలు కలిసివున్నాయి అన్నిటినీ గాక, కేవలం గణ సభ్యంతో అంత స్సంబంధాలను సూచిస్తున్నంత వరకే ఇక్కడ చర్చిస్తాను. వందనం తెలిపేటప్పుడూ, మాటకలిపేటప్పుడూ ఇండియన్లు మాట్లాడేవారితో తనకున్న బంధుత్వం పిలుపును మాత్రమే ప్రయోగిస్తారు బంధువులను బంధుత్వపు పిలుపుతోనూ ఆ బంధుత్వం లేనిచోట "మిత్రమా" అని అంటారు ఇండియనును అతని పేరుతో సంబోధించడం గాని, ఆయననే మీ పేరేమిటని అడగడం గాని అవమానంగా భావిస్తారు

నార్మనుల ఆక్రమణ కాలం వరకూ మన ప్రాచీన శాక్షనులకి ఒకే స్వంత పేరు వుండేది కుటుంబం పేరు కలిపేదికాదు వారిలో ఏక పత్నీ- పతి (దంపతీ) కుటుంబ పద్ధతి ఆలస్యంగా వచ్చిందనడానికిది సూచన దానిని పట్టి శాక్షనులలో గణ సంస్థ వుండే దనుకోవడానికి అవకాశం వుంది

## 7 బయట వారిని గణంలోకి దత్తు చేసుకొనే హక్కు

దత్తు చేసుకొని కొత్త వారిని గణసభ్యులుగా తీసుకొనే హక్కు గణానికి వుంది యుద్ధంలో పట్టుబడిన వారిని చంపెయ్యడమో, ఏదైనా గణంలోకి దత్తుతీసుకోవడమో జరుగుతుంది పట్టుబడిన స్త్రీలనూ, పిల్లలనూ దత్తుతీసుకోవడం ద్వారా దయచూపుతారు. దత్తు తీసుకొన్నవారికి గణహక్కులే గాక, తెగవారుగా పరిగణించబడడం కూడ వుంటుంది దత్తు తీసుకొన్న వ్యక్తి అన్న- దమ్ముడుగానో, అక్క-చెల్లిగానో పరిగణించబడతారు తల్లిని దత్తు చేసుకుంచే కొడుకో, కూతురో అవుతారు

దత్తు చేసుకున్నాక ఇక వారిని ఆ బంధుత్వంతోనే చూస్తారు అనాగరిక యుగం ఎగువ దశలో యుద్ధ ఖైదీలను బానిసల్ని చేశారు. కాని దిగువదశలో వున్న అది వాసులలో బానిసలు లేరు గాంట్ లెట్ (రెండువరసల జనం మధ్య నడుస్తూ ప్రతి ఒక్కరూ కొట్టేదెబ్బలు తినే శిక్ష)కూ దత్తు తీసుకోడానికి కొంత సంబంధం వుందని పిస్తుంది దత్తు చేసుకొనే వానిని ముందు గాంట్ లెట్ నడిపిస్తారు పట్టుపడిన ఖైదీలను గణంలో చనిపోయిన వారి స్థానాలు ఇచ్చి సంఖ్య భర్తీ చేసుకుంటారు క్షీణించి పోతున్న గణం దత్తత ద్వారా సభ్యులను కూర్చుకుని బలపడవచ్చు కాని అటువంటి ఘటనలు చాలా అరుదు ఒక దశలో సెనెకా దేగగణం సంఖ్య బాగా పడిపోయి, అది అంతరించి పోతుందనుకున్నారు ఆ గణాన్ని నిలవబెట్టడానికి తోడేలు గణం నుంచి పెద్ద సంఖ్యలో జనాన్ని దత్తు చేసుకున్నారు ఇందుకు రెండు గణాలూ సమ్మతించేయి దత్తు చేసుకోవడం ఆ గణం యొక్క ఇష్టానిష్టాలకు వదిలేయబడింది ఇరాక్వాలలో తెగసమితి సమావేశంలో దత్తు జరుగుతుంది అది ఇంచుమించు మత కర్మ రూపం తీసుకుంటూంది

సభాభవనం వద్ద జనం సమావేశం అయ్యాక నాయకులలో ఒకరు దత్తు చేసుకొనే వారిని గురించి, దత్తు చేసుకొంటున్న కారణం గురించి చెప్తారు అతడు ఏ గణంవాడో, అతని పేరేమిటో చెప్తారు ఇప్పుడు అతనికి పెడుతున్న పేరు చెప్తారు తరవాత ఇద్దరు నాయకులు అతని రెండు చేతులూ పట్టుకొని, దత్తతపాటపాడుతూ సభాభవనం ఆదికొనుంచి ఈ చివరకు మరల వెనక్కి నడుస్తారు ప్రతిచరణం చివర జనం అంతా పల్లవి ఎత్తుకుంటారు: పాటచరణాలన్నీ అయ్యేవరకూ వారు అటూ ఇటూ తిరుగుతూ మూడు చుట్లు చుడతారు దానితో దత్తు పూర్తి అవుతుంది ఒక్కొకప్పుడు అభిమాన సూచకంగా అమెరికన్లను దత్తత చేసుకోవడం జరుగుతుంది. కొన్నేళ్ళ క్రితం వన్నే సెనెకాల దేగ గణంలోకి దత్తు తీసుకొన్నప్పు ఇదే తంతు జరిగింది

## 8 గణంలో మతకర్మకాండ

గ్రీకు, లాటిన్ తెగలలో ఈ కర్మకాండ చిత్రమైన పరిస్థితులలో జరపబడేది గణాల నుంచి బహుదేవతాకమైన మతం రూపొందినట్లు కనుపిస్తుంది అందులో మత కర్మలు నిరంతరం నిర్వహించబడేవి వానిలో కొన్నింటికి మహత్వం ఆపాదించి వానిని జాతీయం చేశారు కొన్ని నగరాలలో కొందరు దేవతల పూజారితనం కొన్ని

గణాల పారంపర్యపు హక్కుగా వుండింది మతం తలెత్తడానికి, మత కర్మకాండ రూపొందించడానికి గణమే జన్మస్థానం

ఇండియన్ తెగలలో కూడా గ్రీకు, రోమను తెగలలో ఏర్పడినట్లే బహు దేవతారాధన పద్ధతే వచ్చింది కాని తరవాతి కాలపు తెగలలోలాగ మతం వారిమీద గట్టి ప్రభావాన్ని కలిగించలేదు. ఇండియను తెగ దేట్లోనూ ప్రత్యేకించిన మత కర్మకాండ అంటూలేదు కాని మతం అన్నది ఇంచు మించు గణంలోనే పుట్టింది మతభావాలు సహజంగా పుట్టేది ఇక్కడే పూజా పద్ధతులు రూపొందేది కూడా ఇక్కడే అవి అక్కడే గణంలోనే నిలిచిపోవు తెగకంతకూ పాకుతాయి ఇరాక్వ్యాలలో ఏడాదిలో మత కర్మకాండలతో ఆరు పండుగలు జరుపుతారు మేపుల్ (ఒకచెట్టు), నాట్లు, బెర్రీ, పాలు పోసుకోడం, కోతలు, ఉగాది వేడుకలు తెగలోని గణాలన్నింటా, నిర్ణీత కాలాలలో ఈ పండుగలు జరుపుకుంటారు

ప్రతి గణం కొందరు స్త్రీ - పురుషుల్ని ఆసాదుల్నిగా నియమిస్తుంది ఈ పండుగల నిర్వహణ బాధ్యత వారిది గణ నాయకులలాగ గణంలో ఆసాదులూ చాల మందే వుంటారు వీరిని గణంలోని అనుభవజ్ఞులూ, పెద్ద ముత్తయిదువులూ ఎంపిక చేస్తారు తరవాత తెగ సమితి దానికి నిర్ణయించిన కర్మకాండతో వారిని పదవులలో స్థిరపరుస్తుంది ఇల్లా ఎన్నుకొన్న స్త్రీ - పురుష ఆసాదులు సమాన సంఖ్యలో వుంటారు వీరు ప్రజలలో నీతినియమాలు అమలు జరుగునట్లు చూడాలి ఎవరన్నా తప్పు చేస్తే సమితికి ఫిర్యాదు చేసే హక్కు వీరికి వుంది ఈ పదవికి ఎన్నుకోబడినవారు ఆ పదవిని స్వీకరించి తీరాలి కొంత కాలం ఆ పని చేశాక వదిలి వెయ్యవచ్చు తరవాత ఆసాదిగా తనకు పెట్టినపేరు వదిలి పెట్టి అసలు పేరుతో మామూలు సభ్యుడిగా వుండిపోతాడు ఈ ఆసాదులెందర్ని నియమిస్తే మతం మీద గణానికి అంత భక్తి విశ్వాసాలు వున్నట్లు వారు పండుగ రోజులు నిర్ణయిస్తారు అవసరమైన ఏర్పాట్లు చేస్తారు శాకెమ్‌లు నాయకులతో కలిసి ఉత్సవాలు జరుపుతారు శాకెమ్‌లూ నాయకులూ ఎక్స్ అఫీషియో ఆసాదులే ఈ ఆసాదులకు ఓ పెద్ద అంటూ వుండడు వృత్తి చిహ్నాలంటూ వుండవు వారందరూ చేసేపని సమానమే ప్రతి రోజూ సాయంకాలం సమావేశంలో పాల్గొన్న వారికందరికీ విందు వుంటుంది ఆ విందు తయారీ బాధ్యత ప్రధానంగా ఆడ ఆసాదులకు వప్పచెప్తారు ఈ విందు అందరికీ ఈ మత కర్మకాండ గురించి నా "లీగ్ అఫ్ ఇరాక్వ్యాస్"లో వివరంగా ఇచ్చేను ఇక్కడ మళ్ళీ రాయడం అనవసరం. మహాదేవత [గ్రేట్ స్పిరిట్] మ

ఆహ్వానించడం, అభినందనలు తెలపడం తమ జీవిత సుఖాలను ఎప్పటిలా సమకూర్చుతూండవలసిందిగా చిల్లర దేవుళ్ళను కోరడమూ ఈ ఉత్సవాలలో జరుగుతుంది

మానవజాతి అనాగరిక యుగం దిగువ దశ నుంచి మధ్యదశకి ముఖ్యంగా మధ్యదశ నుంచి ఎగువ దశకి ఎదిగిన కొద్దీ గణాల మతాల సంకుచితతో మతాభివృద్ధికి కేంద్రాలయాయి మనకు అజ్టెక్ మత వ్యవస్థలో మోటు భాగం మాత్రమే తెలుసు వారి జాతీయ దేవతలతో పాటు ఇతర కొద్దిపాటి ప్రజలకు చెందిన చిల్లర దేవుళ్ళు కూడా వున్నట్లు కనిపిస్తుంది అజ్టెక్లలో మత కర్మకాండ, పూజారి వర్గమూ వుంది దానిని చూస్తూంటే ఇరాక్వ్యలలో కన్న వారిలో మత కర్మకాండకీ గణానికీ సన్నిహిత సంబంధం వున్నట్లు కనిపిస్తుంది కాని వారి సామాజిక నిర్మాణం లాగనే వారి మత విశ్వాసాలూ, కర్మకాండలూ గుప్తంగానే వుండి పోయాయి. తెలియడంలేదు

## 9 ఉమ్మడి శ్మశానం

మనిషి చనిపోయాక శవాన్ని మంచె మీద మాంసం అవీ పోయి ఎముకలు మిగిలే వరకు వుంచడం తరవాత వాటిని ఏరి, బెరడుతో చేసిన గూనల్లో వుంచి, మరణ మందిరంలో జాగ్రత్త చేయడం ప్రాచీనకాలం నుంచీ వస్తున్న ఆచారం ఒకే గణానికి చెందిన వారిని సాధారణంగా ఒకేయింట్లో వుంచుతారు 1827 లో చోక్టాలలో ఈ ఆచారం చూసినట్లురివరెండ్ డా సైరస్ బింగ్హన్ రాసేరు ఇటువంటి ఆచారాన్నే చెరోకీలలో చూసినట్లు అడైర్ వ్రాసేరు "వాళ్ళ పట్టణం ఒకదాంట్లో దగ్గరదగ్గరగావున్న మూడు ఇళ్ళు చూశాను ప్రతిఒకదాంట్లో ఒక్కొక తెగవాళ్ళ ఎముకలు ఉన్నాయి వింత ఆకారంలో వున్న పెట్టెల్లోపెట్టి వాని మీద చిత్రలిపిలో కుటుంబం (గణం) పేర్లు వ్రాసి వున్నాయి బంధువుల ఎముకల్ని ఇతరుల వాటితో కలపడం అపచారం అని వారి భావన "ఎముకను ఎముకతో,మాంసాన్ని మాంసంతోనే ఎప్పుడూ కలపాలి," ప్రాచీన కాలంలో ఇరాక్వ్యాలు మంచెలు కట్టి వుంచేవారు చనిపోయిన బంధువుల ఎముకల్ని బెరడు పెట్టెలలో వుంచేవారు సాధారణంగా వాటిని తాము నివశించే ఇళ్ళలోనే దాచి వుంచేవారు వాటిని నేలలో పాతెయ్యడమూ వుంది పాతేసే సందర్భంలో తెగవారికో శ్మశానం ప్రత్యేకించి వుంచే తప్ప ఒకే గణానికి చెందిన వారిని ఎక్కడికక్కడ పాతి పెట్టడం జరగను సెనెకాలలో మత బోధకుడుగా పని

చేసిన రివ. అషర్ రైట్ నాకు ఓ జాబు వ్రాసేరు. "చనిపోయిన వారి సమాధి స్థలాలలో కుదురు బంధుత్వాల ప్రభావం కనబడ్డంలేదు అంటారని ఒకే చోట సమాధి చేస్తున్నారు అనుకుంటాను అయితే గతంలో వివిధ కుదురులవారు ఇప్పటి కన్న ఎక్కువగా కలిసి వుండేవారని అంటారు ఒకే కుటుంబంగా వున్నప్పుడు కుటుంబ భావన ప్రభావం ఎక్కువగా వుంటుందనీ, వ్యక్తి ప్రయోజనాల ప్రభావం తక్కువగా వుంటుందనీ అంటారు అందుచేత అప్పుడప్పుడు ఒకే ప్రదేశంలో సమాధి చేయబడినవారిలో ఎక్కువ భాగం ఒకే గణానికి చెందినవారు కావడం అప్పుడప్పుడు జరుగుతుంది". ఒకే వూరిశ్మశానంలో ఆ వూళ్ళో వుండే అన్ని గణాలవారి మృతుల్నీ సమాధి చేస్తున్నారనేది నిజమే అయినా అందులోనే ఒకే ప్రదేశంలో ఒకగణం వారిని ప్రత్యేకించి సమాధి చెయ్యడమూ నిజమే దీనికి కొత్తగా సాక్ష్యం దొరికింది లెవిస్టన్ సమీపంలోని తుస్కారోరా రిజర్వేషన్‌లో తెగ అంతకూ ఒకే సమాధి స్థలంవుందనీ దానిలో ఒక్కొక్క గణం తమ వారి మృతదేహాలను ఒక వరసలో సమాధి చేస్తారనీ తెలుస్తూంది ఒక వరసలో బీవర్ గణం వారు, ఎలుగుగణంవారు రెండు వరసల్లో, ఎర్ర తోడేలు వారు ఒక వరసలో, పెద్దతాబేలు వారు ఒక వరసలో, ఇల్లా ఎనిమిది వరసలలో సమాధి చేస్తున్నారు భార్యాభర్తల్ని వేరువేరు వరసల్లో సమాధి చేస్తున్నారు తండ్రుల్నీ వారి సంతానాన్నీ ఒకే వరసలో, తల్లుల్నీ వారి పిల్లల్నీ, అన్నదమ్ములు, అక్క చెల్లెళ్ళనీ ఒకే వరసలో సమాధి చేయడం చూస్తున్నారు దీనిలో గణబంధుత్వాల బలమూ, అనుకూల పరిస్థితులున్నప్పుడు పూర్వపు అలవాట్లకు మరలే స్వభావమూ కనిపిస్తున్నాయి తుస్కారోరాలు ప్రస్తుతం క్రైస్తవులయారు కాని, వెనకటి అలవాట్లు పోలేదు ఒనాండాగా, ఒనీడా శ్మశానాలలోకూడా ఇటువంటి అలవాటే కొనసాగుతున్నదని ఒక ఒనాండాగా ఇండియను ఈ రచయితకు రాసేడు ఈవేళ ఇండియను లందరూ ఈ ఆచారాన్నే పాటిస్తున్నారననేను కాని పూర్వకాలం ఈ మాదిరి సమాధి పద్ధతినే అనుసరించి వుంటారు

ఇరాక్వాయిలలో ఎవరన్నా మరణించి నప్పుడు ఆ గణం వారంతా మైలపడతారు వాళ్ళలో వుండంచే ఇతర ఇండియను తెగలందరి లోనూ వున్నట్లే సమాధి వద్ద ప్రసంగాలు, సమాధి తవ్వడం వగైరాలు సమాధి చెయ్యడం అన్నీ గణసభ్యులే చేస్తారు

మధ్య అమెరికా మెక్సికోలోని ఇండియనుల నాయకుల్నీ, ప్రముఖవ్యక్తుల్నీ ఈవిధంగా సమాధి చేస్తున్నారు మామూలు జనాన్ని తోచిన రీతిగా మంచెం మీదపెట్టడమో, సమాధి చెయ్యడమో జరిపేస్తారు.

## 10 గణసమితి

ఆసియా, యూరపు, అమెరికాలలో ఆటవిక దశనుంచి నాగరికత కాలం వరకూ, గణ నిర్మాణం వుంది ప్రాచీన సమాజానికి దీని సమితి ఒక ప్రధాన లక్షణం అయింది అదే పరిపాలనాంగం గణంలో, తెగలో, సమాఖ్యలో ప్రభుత దానిదే సాధారణ వ్యవహారాలను నాయకులు చక్కబెడతారు గణం అంతకూ సంబంధించిన విషయాలను సమితి నిర్ణయానికి పెడతారు గణంతోపాటు సమితి వచ్చింది. కనక ఈ రెండూ అనాదిగా వస్తున్నాయి మానవజాతి అనుభవాన్ని రూపొందించి, దానిని మానవ వ్యవహారాలకు సమన్వయ పరచడం నాయకుల సమితి చేస్తుంది గణాలలో, తెగలలో సమాఖ్యలో నాయకసమితి చరిత్ర ప్రభుత్వ భావన ఉత్పన్నమయి పెరగటాన్ని తెలుపుతుంది రాజకీయ సమాజం ఏర్పడ్డాక సమితి సెనేట్‌గా మారింది.

గణసమితి సమితి యొక్క అతి సాధారణమైన రూపం అద్దరుగు దిన్ని అది ప్రజాతంత్ర సభ దాని ఎదటికి వచ్చిన ప్రతి సమస్యమీద అభిప్రాయం ప్రకటించగల హక్కు ప్రతి స్త్రీకి, పురుషునికి వుంది శాకెమ్‌లనూ, నాయకుల్ని, ఆసాదుల్ని అది ఎన్నుకొంటుంది తొలగించగలదు గణసభ్యులు చంపబడితే నిందితుణ్ణి క్షమించగలదు ప్రతీకారచర్యకు నియమించనూగలదు గణంలోకి కొత్తవారిని దత్తుచేసుకోగలదు తెగ సమితికి, అంతకన్న పైనుండే సమాఖ్య సమితికి బీజం ఇదే ఆ పై సమితులు రెండింటా గణాల ప్రతినిధులుగా నాయకులుంటారు

ఇరాక్వా గణసభ్యులకున్న హక్కులు, సౌకర్యాలు, బాధ్యతలూ ఇవి. ఇవే ఇండియన్ తెగలలోని గణాల సభ్యులందరికీ అనికూడా చెప్పాలి గ్రీకు, లాటిన్ తెగలలోని గణాలను పరిశీలించినప్పుడు ఒకటవ, రెండవ, ఆరవ సంఖ్యలవి తప్ప మిగతా హక్కులూ, సౌకర్యాలూ, బాధ్యతలూ వాటిలోని సభ్యులకూ వున్నాయి. ఆ తెగలలోని గణాల ప్రాచీనతకు ఇతర సాక్ష్యాధారాలు దొరకక పోయినా, వీనినిబట్టి వూహించవచ్చు

ఇరాక్వా గణాలలోని సభ్యులందరూ స్వతంత్రులు వారు ఒకరొకరి స్వాతంత్ర్యాన్ని కాపాడెందుకు నిబద్ధులున్నా. వ్యక్తిగతమైన హక్కులూ, సౌకర్యాలూ అందరికీ సమం శాకెమ్‌లూ, నాయకులూ ప్రత్యేక స్థానాన్ని కోరలేరు రక్తబంధుత్వంతో నిబద్ధమైన సోదర సంఘం వారిది స్వాతంత్ర్యం, సమానత్వం, సోదరత్వం-అంటూ సూత్రీకరించకపోయినా గణాలలోని ప్రధాన సూత్రాలు అవే. సామాజిక, పరిపాలనా వ్యవస్థలకు మూలకం గణం. ఆ పునాది మీదనే ఇండియను సమాజం ఏర్పడింది.

అటువంటి మూలకాల మీద ఏర్పడిన నిర్మాణం మీద వాని లక్షణాల ముద్రపడి తీరుతుంది ఇండియనులలో స్వాతంత్ర్య స్ఫూర్తి, వ్యక్తిత్వం సహజ గుణాలుగా వుండడానికి ఇదే మూలం.

అమెరికను ఆదివాసుల సామాజిక వ్యవస్థలో గణం అతి ముఖ్యమైనదీ, దృఢమైనదీను. ఇతర ఇండియను తెగలు చాలా వాటిలో ఇంకా గణాలు సజీవంగా వున్నాయి ప్రాత్రేకి, తెగకి, సమాఖ్యకు గణమే మూలకం. ఆ గణాలను గురించి ఇంకా చాలా చెప్పవచ్చు. గణాల సుస్థిర లక్షణాన్ని కనబరచేందుకు అవసరమైనంత వరకూ ఇప్పుడు చెప్పేను

యూరపియనులు కనుక్కొన్న నాటికి అమెరికను, ఇండియను తెగలు గణాలుగా ఏర్పడివున్నాయి. వాటిలో స్త్రీ పారంపర్యం వుండింది డకోటాల వంటి కొన్ని తెగలలో గణాలు విచ్ఛిన్నం అయిపోయాయి ఓజిబ్వా, ఒమాహా, మాయా, యాకుటాన్‌ల వంటి కొన్ని తెగలలో మాతృ పారంపర్యం నుండి పితృ పారంపర్యానికి మార్పువచ్చింది అమెరికను ఆదివాసులందరిలో గణాలకు జంతువుల పేర్లో, వస్తువుల పేర్లో వుపయోగించారు కాని మనుష్యుల పేర్లుపయోగించలేదు. సమాజం యొక్క ఈ ప్రాథమిక దశలో గణంలో వ్యక్తుల పేర్లకు ప్రాముఖ్యం వుండదు. గ్రీకు, లాటిన్ తెగలలో కూడ మొదటి రోజులలో అటువంటి పరిస్థితే వుండేదని వూహించవచ్చు. చరిత్రకు వారు తెలిసిన నాటికి వారిలో గణాలకు వ్యక్తుల పేర్లువుండినాయి. న్యూమెక్సికోలోని మోకీ గ్రామవాసి - ఇండియనులు తాము జంతువు సంతానమేననీ, ఆ జంతువు పేరే గణానికి పెట్టుకున్నామనీ, దేవుడు ఏనాడో తమ పూర్వీకుల రూపం మార్చేసి, మనుష్య రూపం ఇచ్చేడనీ చెప్పుకుంటారు. ఓజిబ్వాలలోని కొంగ గణంలో కూడ ఇటువంటి కథేవుంది. కొన్ని గణాల వారు తమ పేరిటి జంతువు మాంసం తినరు. బహుశా వారిలోనూ ఇటువంటి ఆలోచనే వుండివుంటుంది.

గణాల సంఖ్యనుబట్టీ, తెగ యొక్క కలిమిలేముల్ని బట్టీ గణ సభ్యుల సంఖ్య వుంటుంది. సెనెకాలు మూడు వేలమంది ఎనిమిది గణాలుగా వున్నారు అంటే సగటున గణంలో మూడు వందల డెబ్బయ్యయిదు మంది వున్నారు. ఓజిబ్వాలు పదిహేను వేలమందీ ఇరవైమూడు గణాలుగా వున్నారు. అంటే సగటున గణంలో ఆరువందల ఏభయి మంది వున్నారు చెరోకీలు సగటున గణానికి వేయిమంది వున్నారు. ప్రస్తుతం వున్న పరిస్థితులలో ఇండియను గణాలలో నూరు నుంచి వేయి వరకు సభ్యులుంటున్నారు.

మానవజాతి నిర్మాణాలలో బహుపురాతనమూ, బహుళ వ్యాప్తమూనైనది గణం మానవ పురోగతి మీద వాని ప్రభావం చాల అధికం. విభిన్న ఖండాలలో అటవిక యుగంలో, అనాగరిక యుగం దిగువ, మధ్య, ఎగువ దశలలో అది కనిపిస్తుంది గ్రీకు, లాటిన్ తెగలు నాగరికతలో అడుగుపెట్టేక కూడ వానిలో గణాలు మంచి జీవశక్తి కలిగివున్నాయి ఒక్క పోలినీషియన్లు తప్ప మానవజాతి కుటుంబాలన్నీ గణసంస్థగుండా వచ్చినవే బతికి బట్ట కట్టడానికీ, పురోగతికీ సాధనాలు అవే అయాయి దానితో సమంగా దీర్ఘకాలం మన్నినది రక్తసంబంధ వ్యవస్థ అది గణాల కన్న ముందునుంచేవుంది నేటికీ కొనసాగుతూంది దానిలోంచి పుట్టిన వివాహ పద్ధతులు అదృశ్యమే అయిపోయాయి.

ఏనాడో ప్రారంభమయి, లక్షల సంవత్సరాలు కొనిసాగి, అటవిక, అనాగరిక దశలలో గణసంస్థ మానవజాతిని అంటిపెట్టుకొనే వుందని నిరూపించబడింది

# మూడో ప్రకరణం

# ఇరాక్వ్యా ఫ్రాట్రీ (సోదర్య సంస్థ)

ఫ్రాట్రీ అంటే ఏమిటి? — బంధుత్వం గల గణాలు ఉన్నతమైన సంస్థలో కలుస్తాయి- ఇరాక్వ్యా తెగల ఫ్రాట్రీ- దాని కూర్పు- దాని ఉపయోగాలు, కార్యకలాపాలు - సామాజిక, మతసంబంధి - ఉదాహరణలు - గ్రీకుల ఫ్రాట్రీతో పోలికలు, కాని చాల పురాతన రూపం - చోక్టాల ఫ్రాట్రీలు - చికాసాల ఫ్రాట్రీలు - మోహెగాన్‌లవి - త్లింకిట్లవి - అమెరికను ఆదివాసి తెగలందరిలో ఫ్రాట్రీలు సర్వసామాన్యం అయివుండాలి

ఫ్రాట్రీ అంటే సోదరసంస్థ గణాల నుంచి ఈ సంస్థలోకి పెరుగుదల సహజంగా వచ్చేస్తుంది ఏవో కొన్ని ఉమ్మడి కార్యకలాపాల కోసం తెగలోని రెండు మూడు గణాలుచేరి ఫ్రాట్రీగా ఏర్పడతాయి. సాధారణంగా ఈ విధంగాచేరే గణాలు పూర్వం ఒకటిగావుండి విడిపోయినవె అయివుంటాయి

గ్రీకు తెగంలో ఫ్రాట్రీ గణమంత విలకడగానూ వుంటూ ఒక విశిష్టతను సంపాదించుకొంది. ఆథీనియన్లలో నాలుగు తెగలుండేవి ఒక్కొక్కదాంట్లో మూడు చొప్పున పన్నెండు ఫ్రాట్రీలు, ఒక్కొక్క ఫ్రాట్రీలో ముప్ఫయ్యేసి గణాల చొప్పున మూడువందల అరవై గణాలు వుండేవి గణాలు సహజక్రమంలో విడబడి ఫ్రాట్రీలుగా ఏర్పడివుంటే సమాన సంఖ్యలో ఫ్రాట్రీలు, తెగలు వుండటం సాధ్యంకాదు పొందికగా నిర్మించటం కోసం చట్టంచేసి వుంటారని గ్రోటే అన్నారు. తెగలోని గణాలన్నిటికీ మూలం ఒకటే అయివుంటుంది. అన్నిటి గణనామం ఒక్కటే అందుచేత ఫ్రాట్రీకి గణాలన్నీ, తెగకు ఫ్రాట్రీలన్నీ వుండాలని నియమించటానికి కఠోర శాసనాల అవసరం వుండదు అయితే ఫ్రాట్రీలోని గణాలన్నీ బంధుగణాలయి వుంటాయి అవన్నీ ఒక గణం విభజనఅయి ఏర్పడినవే అయివుంటాయి గ్రీకు ఫ్రాట్రీలు మొదట అలాగే ఏర్పడి వుంటాయి. అయితే ఆథీనియను తెగలలోని ఫ్రాట్రీలలో గణాలు సమ

సంఖ్యలో వుండడానికై పరస్పరాంగీకారంతో పై గణాలను ఫ్రాట్రీలోకి చేర్చుకొని వుంటారు

రోమనుల క్యూరియా కూడా గ్రీకుల ఫ్రాట్రీలాంటిదే డయోనిసస్ దానిని ఫ్రాట్రీ అనే పిలుస్తూవచ్చేరు ప్రతి క్యూరియాలో పదేసి గణాలున్నాయి. అటువంటి క్యూరియాలు పదేసి చొప్పున రోమను గణాలు మూడింటిలోనూ వున్నాయి అంటే ముప్పయి క్యూరియాలు, మూడు వందల గణాలూ వున్నాయి గ్రీకుల ఫ్రాట్రీకన్న రోమనుల క్యూరియా కార్యకలాపాలు గురించి బాగా తెలుస్తూంది ఇవి గ్రీకు ఫ్రాట్రీలకన్న కొంచెం పై స్థాయికి ఎదిగాయి ప్రభుత్వ వ్యవహారాలలో సరాసరి ప్రవేశించేయి గణాల సమావేశం (Comitia Curiata) లో క్యూరియాలు వోటు వేసేవి. ప్రతి క్యూరియాకూ సామూహికమైన వోటు ఒకటేవుండేది సెర్వియస్ టుల్లియస్ కాలం వరకూ రోమను ప్రజల మీద సర్వాధికారం ఈ కమిటీకే వుండేది.

ప్రత్యేకమైన మత కర్మకాండలు జరపడం, ఫ్రాట్రీలో సభ్యుని ఎవరన్నా చంపితే వారిని క్షమించడమో, ప్రతీకారం చేయడమో నిర్ణయించడం, హంతకుడైన తన సభ్యుడు ప్రతీకారం నుంచి తప్పి బయటపడితే, అతనిని తిరిగి గణంలో చేర్చుకొనేముందు శుద్ధి కార్యక్రమం నిర్వహించడం వంటివి గ్రీకు ఫ్రాట్రీ కార్యకలాపాలలో కొన్ని క్లీస్థెనస్ యాజమాన్యాన అథీనియనుల రాజకీయ సమాజంలో కూడ ఈ సంస్థ కొనసాగింది పౌరుల నమోదు బాధ్యతను అది నిర్వహించేది ఆ విధంగా పారంపర్యాన్ని కాపాడడం, పౌరసత్వపు హక్కును కాపాడడం దాని బాధ్యతలుగా వుండేవి వివాహానంతరం భార్యను భర్త ఫ్రాట్రీలోకి చేర్చుకొనేవారు ఆ దంపతులకు కలిగిన పిల్లలను తండ్రి యొక్క గణంలోకీ, ఫ్రాట్రీలోకీ చేర్చుకొనేవారు. ఫ్రాట్రీలోని సభ్యుణ్ణి చంపిన వానిమీద న్యాయస్థానంలో కేసుపెట్టేపని ఫ్రాట్రీదే పూర్వకాలంలోనూ, తర్వాతి కాలంలోనూ కూడా ఫ్రాట్రీలు నిర్వహించిన బాధ్యతలు ఇవి వివరాలన్నీ పూర్తిగా ధృవీకరించుకోగలిగితే - విందులలో, ప్రజాబాహుళ్యపు ఆటలలో, ప్రముఖ వ్యక్తులు మరణించినప్పుడు, ప్రాథమిక దశలో సైన్యసంస్థగా ఫ్రాట్రీ కార్యకలాపాల జాడ దొరకవచ్చు సమితి సమావేశాలలో, మత కర్మకాండ నిర్వహణలో, సామాజిక సౌఖ్యాల రక్షణలో దాని ప్రమేయం వుంటుంది.

అమెరికన్ ఆదివాసుల చాలమందిలో ఫ్రాట్రీవుంది. వారిలో అది సహజ

రూపంలో వచ్చినట్లే కనిపిస్తుంది గ్రీకు, లాటిన్ తెగలలోలాగనే నిర్మాణాల క్రమంలో దానిది ద్వితీయ స్థానమే గణానికిమల్లే దానికి ప్రప్రథమ పాలనాంగపు బాధ్యతలులేవు తెగకూ, సమాఖ్యకూవున్న పాలనా బాధ్యతలూ లేవు తెగ పెద్దదిగా వున్నప్పుడు అవసరం కొద్దీ గణంకన్న పెద్దదీ, తెగకన్న చిన్నదీ అయిన నిర్మాణాన్ని ఏర్పరచి కొన్ని సామాజిక బాధ్యతలు దానికి వప్పచెప్పేరనుకోవాలి. గ్రీసు, రోమను ఫ్రాట్రీలను గురించి బాగా తెలుసుకోవాలంటే ఇండియను ఫ్రాట్రీలను గురించి తెలుసుకోవడం అవసరం.

సెనెకా-ఇరాక్వో తెగవారి ఎనిమిది గణాలు రెండు ఫ్రాట్రీలుగా చేయబడ్డాయి

మొదటి ఫ్రాట్రీలో గణాలు

**1. ఎలుగు, 2. తోడేలు, 3. బీవర్, 4 తాంబేలు.**

రెండో ఫ్రాట్రీలో గణాలు

**1. లేడి, 2 ఉల్లంకి (పక్షి), 3 కొంగ, 4 డేగ.**

ఫ్రాట్రీని వారి భాషలో "దే-అ-నోం-దా-యో" అంటారు దాని అర్థం కూడా సోదర సంస్థే ఒక ఫ్రాట్రీలోని గణాలు సోదర గణాలు. రెండో ఫ్రాటీలోని వానికి జ్ఞాతి గణాలు. స్థాయిలో, లక్షణాలలో, సౌకర్యాలలో రెండూ సమానమే తమ ఫ్రాట్రీలోని గణాలను సోదర గణాలనీ, రెండో ఫ్రాట్రీలోని వానిని జ్ఞాతి గణాలనీ సెనెకాలు పిలవడం పరిపాటి మొదట్లో ఫ్రాట్రీ సభ్యులలో అంతర్వివాహం నిషిద్ధం ఒక ఫ్రాట్రీవారు రెండో ఫ్రాట్రీకి చెందిన ఏ గణం వారినైనా వివాహం చేసుకోవచ్చు. ఈ నిషేధాన్నిబట్టి ఫ్రాట్రీలోని గణాలు ఒక మాతృగణం చీలిఏర్పడ్డట్టే అనుకోవచ్చు ఒక గణంలో అంతర్వివాహ నిషేధం దాని శాఖలకు కూడా వర్తింపచేయబడింది. ఈ నిషేధం తొలగి చాల కాలమే అయింది ఇప్పుడు తన గణంలోని వారితో వివాహం మాత్రమే నిషిద్ధం. సెనెకాలలోని సంప్రదాయాన్ని బట్టి ఎలుగు, లేడి గణాలు ఆదికాలపు మాతృగణాలనీ, మిగిలినవి వాని శాఖలనీ ఊహించవచ్చు. దీనిని బట్టి గణాలలోవున్న బాంధవ్య అనుబంధం బట్టి ఫ్రాట్రీలు సహజంగా ఏర్పడ్డాయనుకోవచ్చు జనాభా పెరిగి గణం విడబడినాక ఉమ్మడి బాధ్యతల నిర్వహణకోసం గణంకన్న ఉన్నతమైన నిర్మాణం కావలసివచ్చింది ఇరాక్వోలలోని ఇతర తెగల్ని చూస్తే, ఒకే గణాలు ఒకే ఫ్రాట్రీలో శాశ్వతంగా అతుక్కుని వుండడంలేదని కనిపిస్తోంది. ఫ్రాట్రీలలో గణాల సంఖ్య తగ్గడమో, హెచ్చడమో జరిగినప్పుడు వానిని ఒక

దాంట్లోంచి వేరొక దాంట్లోకి మార్చివుంటారు. ఇక్కడ అర్థం చేసుకోవలసింది ఏమంటే- ప్రాచీన సమాజంలో, సామాజిక వ్యవస్థలో భాగంగా ప్రాట్రి అతి సహజంగా ఏర్పడింది బహు సులభంగా నడపబడింది. గణంలో జనాభా పెరిగినప్పుడు దానిలోని సభ్యులు ఎక్కడికక్కడ విడబడతారు విడిపోయినవారు వేరే గణనామం పెట్టుకుంటారు కాని, వెనక తామంతా కలిసేవున్న సంప్రదాయం వుంది కదా, అదే వారు ప్రాట్రిగా ఏర్పడేటట్లు చేస్తుంది

అలాగే కయూగా - ఇరాక్యూలని ఎనిమిది గణాలు రెండు ప్రాట్రిలూనే, కాని, ఈ గణాలు రెండు ప్రాట్రిలలో సరిసమానంగా పంచిలేవు

మొదటి ప్రాట్రీలో గణాలు.

1 ఎలుగు, 2 తోడేలు, 3 తాబేలు, 4 ఉల్లంకి, 5 మలుగు చేప

రెండో ప్రాట్రీలో గణాలు

1. లేడి, 2 బీవర్, 3 డేగ

వీనిలో 7 గణాలు వెనెకాలలో వున్నటువంటివే కాని కొంగ గణం అంతరించి పోయింది మలుగు చేప గణం దాని స్థానంలోకి వచ్చింది కాని దానిని రెండో ప్రాట్రీలోకి నెట్టారు అదేవిధంగా బీవర్, తాబేలు గణాలు కూడా ప్రాట్రీలు మారేయి. కయూగాలు కూడా ఒక ప్రాట్రీలోని వానిని సోదర గణాలనీ, రెండో దానిలోని వానిని జ్ఞాతి గణాలనీ పిలుస్తారు

ఒనాందాగా - ఇరాక్యూల గణాల సంఖ్య అదే అయితేవానిలో రెండు గణాల పేర్లు వెనెకాల వానికి భిన్నం అవీ రెండు ప్రాట్రీలలోనే కూర్చబడినాయి.

మొదటి ప్రాట్రీలో గణాలు

1 తోడేలు, 2 తాంబేలు, 3 ఉల్లంకి, 4 బీవర్, 5 బంతి.

రెండో ప్రాట్రీలో

1. లేడి, 2 మలుగుచేప, 3 ఎలుగు

ఇక్కడ కూడా ప్రా ట్రీ ల లో ని గణాల కూర్పు వెనెకాలదలోన్న వేరుగానే వుంది మొదటి ప్రాట్రీలో మూడు గణాలు రెంటిలోనూ ఒకటే. కాని ఎలుగు గణాన్ని రెండో ప్రాట్రీలో లేడి గణంతోపాటు పెట్టేరు వానిలోని గణాల సంఖ్య కూడా భిన్నమే, కయూగాలలోలాగ ఒకే ప్రాట్రీలోని గణాలు సోదరగణాలు. వానికి రెండోదానిలోనివి జ్ఞాతి గణాలు. ఒనాందాగాలలో దేగగణం

లేదు వెనెకాలలో మలుగు చేపగణంలేదు కాని రెండింటి సభ్యులూ కలిసినప్పుడు బాంధవ్యం వున్నట్లు సౌదర్యం చూపుతారు.

మోహాక్, ఒనీదాలకు మూడేసిగణాలేవున్నాయి 1 ఎలుగు, 2 తోడేలు, 3 తాంబేలు వాటికి ఫ్రాట్రీలులేవు అయితే సమాఖ్య ఏర్పడినప్పుడు వెనెకాల ఎనిమిది గణాలలో ఏడు గణాలు ఇతర తెగలలోనూవున్నట్లు వాటిలోని శాకెమ్‌హోదాల్ని పట్టి తెలుస్తూంది కాని మోహాక్, ఒనీదాలలో పైన చెప్పిన మూడేసి గణాలే వున్నాయి దానిని పట్టి వారిలో ఒక ఫ్రాట్రీ మొత్తం నష్టపోయినట్లు వూహించాలి. వున్నదాంట్లో కూడ ఒక గణం అంతరించిందనుకోవాలి. మొదట్లో ఈ తెగలన్నీ ఒకేరకంగణాలతో ఏర్పడ్డాయి-అనుకుంటే. గణాలతో, ఏర్పడిన తెగలో ఫ్రాట్రీలుగా విభజన జరుగుతే అది ఫ్రాట్రీల స్థాయి నుంచే జరుగుతుంది. తెగలోని జనం అందరూ వివాహాల ద్వారా కలిసి మెలిసిపోయినా ఫ్రాట్రీలోని గణాలలో స్త్రీలు, స్త్రీల సంతానం, వారి స్త్రీ సంతానం మాత్రమే వుంటారు, పారంపర్యం గుర్తించేది స్త్రీల వైపు నుంచిగనక మగవాళ్ళు మరోగణంలోని స్త్రీలను పెళ్ళి చేసుకుంటారు వారు భార్యలతోనే వుంటారు. వారి సంతానం భార్యల గణంవారే అవుతారు ఇండియను తెగల చరిత్రను ఆనుపూర్వికగా సేకరించాలంటే వేర్వేరు తెగలలోని గణాలు, ఫ్రాట్రీలు, ద్వారానే సేకరించవలసి వుంటుంది. ఆ విధంగా పరిశీలనకు పూనుకున్నప్పుడు ఫ్రాట్రీలుమిగిలిపోయి, తెగలు మాత్రం ఎక్కడయినా అంతరించిపోయాయేమో చూడవలసివుంటుంది. కనీసం అలా జరగడం సాధ్యంకాదు.

టుస్కారోరా-ఇరాక్వాలు ప్రధాన తెగనుంచి ఏనాడో విడిపోయారు వారిని కనుక్కున్ననాటికి ఉత్తర కరోలినారాష్ట్రంలో న్యూసే నదీ మండలంలో వారు వుంటున్నారు క్రీ.శ. 1712 ప్రాంతంలో వారిని అక్కడినుంచి లేవగొట్టేరు. అక్కడి నుంచి వారు ఇరాక్వాలు నివసిస్తున్న చోటికివచ్చేరు. వారిని ఇరాక్వాలు తమ సమాఖ్యలో ఆరోసభ్యునిగా చేర్చుకున్నారు వారిలో ఎనిమిది గణాలు రెండు ఫ్రాట్రీలలో వున్నాయి

మొదటి ఫ్రాట్రీలో గణాలు

1 ఎలుగు, 2 బీవర్, 3 పెద్దతాంబేలు 4 మలుగు చేప

రెండో ఫ్రాట్రీలో గణాలు

1 బూడిద రంగు తోడేలు, 2 పసుపు రంగు తోడేలు, 3 చిన్న తాంబేలు, 4 ఉల్లంకి.

కయూగాలకి, ఒనాందాగాలకి, వీరికి ఆరు గణాల పేర్లు ఒక్కటే. సెనెకాలకి అయిదు గణాలలో సమానం మోహాక్‌లకి, ఒనీదాలకి మూడు గణాల పేర్లు సమానం ఒకప్పుడు వీరిలో లేడిగణం వుండేది అది ఈనాడు మాసిపోయింది. తోడేలు గణం విభజించబడి బూడిదరంగు, పసుపురంగుల తోడేలుగణాలు అయింది. అలాగే తాంబేలు గణం విడిపోయి పెద్ద, చిన్న తాంబేళ్ళు అయింది వీరి మొదటి ప్రాత్రీలోని మూడు గణాలు సెనెకా, కయూగాల మొదటి ప్రాత్రీలోని మూడు గణాలతో సమానం ఒక్కటే తేడా తోడేలు గణం రెండుగా అయింది. తోటి గణాల వారినుంచి టుస్కారోరాలు విడి, దూరంపోయి కొన్ని వందల ఏళ్ళు గడచిపోయినా గణాలలో మార్పులేదు అవి స్థిరంగానే వున్నాయి ఇతర తెగలలో మాదిరిగానే వారు కూడా తమ ప్రాత్రీలోని గణాలను సోదర గణాలనుగా, రెండో దానిలోని వానిని జ్ఞాతి గణాలనుగానే పిలుస్తారు

అనేక తెగల ప్రాత్రీల కూర్పుల్లో తేడాలు కనిపిస్తున్నాయి. పరిస్థితుల మార్పును బట్టి మధ్య మధ్య వానిలోని గణాలకూర్పులో మార్పులు చేసినట్లు అను కోవాలి కొన్ని గణాలలో జనాభా పెరుగుతుంది అపదలువచ్చి కొన్నింట తగ్గుతుంది. మరికొన్ని అంతరించి పోతాయి అందుచేత ప్రాత్రీల సంఖ్యను నిలబెట్టి వుంచడానికై ఒక ప్రాత్రీనుంచి వేరొకదానికి గణాలను మార్చవలసివచ్చి వుంటుంది. ఇరాక్వాలలో ప్రాత్రీ చాలా పురాతన కాలంనుంచీ వుంది వారిలో నాలుగువందల ఏళ్ళక్రితం సమాఖ్య (కాన్ఫెడరసీ) ఏర్పడింది ప్రాత్రీ అంతకు ముందునుంచీ వుండి వుంటుంది. వాని కూర్పులోనే వున్న భేదాలు, వానిలోవున్న గణాలుచూస్తే ఈ మధ్యకాలంలో తెగలు అనుభవించిన కష్టనష్టాలు అర్థం అవుతాయి గణాలు, ప్రాత్రీల సుస్థిరత దృష్ట్యాచూస్తే ఆ నష్టాలు అంత ఎక్కువ కానే కావు

ఇరాక్వా తెగలు నాలుగింటిలో ఎనిమిది ప్రాత్రీలు, మొత్తం ముప్పయ్ ఎనిమిది గణాలు ఉన్నాయి.

ఇరాక్వా ప్రాత్రీల కార్యకలాపాలు గురించి మనకు విశేషం తెలియకపోయినా వానికృత్యాలు, వుపయోగాం దృష్ట్యా గ్రీకు ప్రాత్రీలకన్న అవి దిగువమెట్టులో వున్నాయని చెప్పవచ్చు రోమను తెగల ప్రాత్రీల గురించి తెలిసినంతవరకు వాని కన్న తక్కువ ఉపయోగస్థాయిలోనే వున్నాయి. రోమను, గ్రీకు ప్రాత్రీలతో పోల్చి నప్పుడు ఇరాక్వా ప్రాత్రీలు రెండు మానవ పరిణామ దశలు వెనకబడి వున్నాయి. వాని సామాజిక పరిస్థితులు కూడా చాల భిన్నం, తేడా అల్లా మెట్టులోనే, రీతిలోకాను,

ప్రతిజాతిలోను ఇదే వ్యవస్థ మనకు కనబడుతుంది. వీటి కన్నింటికీ బీజం ఒక్క మాదిరిదే. సామాజిక వ్యవస్థలో భాగంగా ఇవి చిరకాలం మని వుంటాయి. రాజకీయ సమాజం ఏర్పడే వరకూ గ్రీకు, రోమనులలో అవసరంకొద్దీ గణసమాజమే కొనసాగింది. నాగరికత కన్న రెండు దశలు వెనకగా వున్నారు కనక ఇరాక్వ్యూలలో అది నిలిచి వుంది అందుచేత, ఇండియను ప్రాత్రీ యొక్క కార్యకలాపాలూ, వినియోగాలు గురించిన ప్రతి అంశమూ తెలుసుకోవడం ముఖ్యమే. సమాజం బాగా అభివృద్ధి పొందిన దశలో ఎంతో పలుకుబడి వెరపిన సంస్థకు ఇది ఆదిమ రూపం కావడమే కారణం.

ఇరాక్వ్యూలలో ప్రాత్రీ కొంత సామాజికమూ, కొంత మత సంబంధీను. కొన్ని వుదాహరణలను ఇస్తే వాని కార్యకలాపాలూ, వినియోగాలూ అర్థం అవుతాయి. చాలా దిగువ మందే క్రీడలతో ప్రారంభిద్దాం. తెగ సమితి, సమాఖ్య సమితి సమావేశాల సందర్భంగా క్రీడలు సాగుతాయి. బంతి ఆట వుంది. దీనిలో పెనెకా ప్రాత్రీలు పోటీపడతాయి దానిలో గెలుపు, ఓటములమీద పందేలు కాస్తారు. ప్రతి ప్రాత్రీ తన ఆటగాళ్ళలో మంచి సమర్థులైన వారిని పంపుతాయి. ఆటగాళ్ళు ఒక్కొక్కవేపున ఆరు మంచి పదిమంది వరకు వుంటారు. ప్రాత్రీల సభ్యులు ఆటలకు హాజరవుతారు. కాని ఆట స్థలంలో కలిసికాక చెరో వేపున కూర్చుంటారు. ఇరు పక్షాల ఆటగాళ్ళూ తమ తమ వ్యక్తిగత ఆస్తుల్ని మధ్యవర్తుల వద్ద ఉంచుని పెడతారు. మంచి వుత్సాహం, పట్టుదలతో ఆట జరుగుతుంది. రెండు ప్రాత్రీల వారు ఆటను బహు శ్రమతో చూస్తూ తమవాళ్ళు గెలుపొందినప్పుడు హర్షధ్వానాలు చేస్తుంటారు.

అనేక రూపాలలో ప్రాత్రీల వునికి తెలుస్తూనే వుంటుంది. సమితి సమావేశాలలో ప్రాత్రీల శాకెమ్‌లు, నాయకులు ఎదిరి పక్షాలుగా కూర్చుంటారు. ఉపన్యాసకులు ప్రాత్రీ ప్రతినిధులుగా, ఎదిరిని ఆ ప్రాత్రీ ప్రతినిధులనుగా సంబోధిస్తారు. వ్యాపార వ్యవహారాలలో రెడ్ ఇండియన్లకు ఈ మాదిరి సంప్రదాయాలంటే మహా ప్రీతి.

ఇంకా, ఏదన్నా హత్య జరిగినప్పుడు హతుని గణం వారు సమావేశం అవుతారు. సంగతి ఏమిటో స్థిరపరచుకొని, ప్రతిక్రియ ఏం చెయ్యాలో ఆలోచిస్తారు. హంతకుని గణం కూడా సమావేశం అవుతుంది. చనిపోయిన వాని గణంతో సర్దుబాటు చేసుకోడానికో, పరిహారం చెల్లించడానికో ఆలోచిస్తుంది. అయితే హతుడూ, హంతకుడూ వేరు వేరు ప్రాత్రీలకు చెందినట్లయితే హంతకుని గణంవారు తమ ప్రాత్రీలోని ఇతర గణాలవారిని కలుసుకుని నేరాన్ని మాఫ్ చేయించడానికి వారి సహాయం కోరుతారు. అటువంటి సందర్భంలో ప్రాత్రీ సమితి సమావేశం అవుతుంది. తెల్లని

శంఖపూసలు కుట్టిన పటకాలు ధరించిన ప్రతినిధి వర్గాన్ని రెండో ఫ్రాట్రీవారి వద్దకు పంపుతారు ఆ ఫ్రాట్రీ సమావేశం జరపకోరుతారు. నేరాన్ని క్షమించమని కోరుతారు. విచారం ప్రకటించి మృతుని కుటుంబానికీ,గణానికీ విలువైన వస్తువులు నష్టపరిహారంగా చెల్లిస్తారు. అంగీకారమో, అనంగీకారమో తేలే వరకూ రాయబారాలు నడుస్తాయి. ఈ రాయబారాలను ఒక గణం వారు నడపడంకన్న బహుగణాలు కలిసివుండే ఫ్రాట్రీ నడపడంలో విలువ వుంది హత్యకు తగిన కారణాలున్నప్పుడు రెండో ఫ్రాట్రీని ఆహ్వానించడం వలన నేరాన్ని క్షమించే అవకాశాలు ఎక్కువుంటాయి. నాగరికదశకు పూర్వం హత్య కేసుల సమన్వయంలోనూ, శిక్ష తప్పించుకున్న నేరస్థుని శుద్ధికార్యక్రమంలోనూ గ్రీకు ఫ్రాట్రీ చాలవరకు ప్రాధాన్యం వహించడం సహజంగా జరిగిందేనని దీనిని బట్టి గ్రహించగలం. రాజకీయసమాజం నెలకొన్నాక న్యాయ స్థానంలో హంతకుని మీద కేసు నడిపించే బాధ్యత ఫ్రాట్రీదే కావడం కూడా సహజమే.

తెగలో ప్రాముఖ్యానికి వచ్చిన వ్యక్తుల అంత్యక్రియలలో ఫ్రాట్రీ పాత్ర చిత్రంగా వుంటుంది చనిపోయిన వాని ఫ్రాట్రీవారు సామూహికంగా మైలపడతారు. ఎదిరి ఫ్రాట్రీవారు సామూహికంగా అంత్యక్రియలు జరుపుతారు. చనిపోయినది సాకెమ్ గనకనైతే ఆ వార్తను తెలపడానికి ఎదిరి ఫ్రాట్రీ వారు చనిపోయిన వాని శంఖు పటకాను ఒనాందాగాకు పంపిస్తారు. (సమితులు ఏ సందర్భంలో సమావేశం అయినా అగ్నిహోత్రం ముందు జరపాలనేది నియమం. క్రమంగా అగ్ని అంతర్ధానం అయింది దానికో స్థానం నిరుకు చేశారు ఆ స్థానం వద్దనే సమావేశాలు జరుగు తాయి అగ్ని ముందర జరుగుతున్నట్లే భావన). మరల సాకెమ్‌ను ఎన్నుకొని,అతని పదవిలోకి వచ్చే వరకూ ఆ పటకా ఒనాందాగాల వద్దనే వుంటుంది పెనెకాల ఎనిమిది మంది సాకెమ్‌లలో ఒకరైన గా - నె- ఓ- ది- యో (సుందర సరస్సు) మరణించి నప్పుడు ఇరవయ్యేడు మంది సాకెమ్‌లూ, నాయకులూ, రెండు ఫ్రాట్రీలకూ చెందిన ఎందరో సభ్యులూ అంత్యక్రియలకు వచ్చేరు. కొద్ది కాలం క్రితం ఇది జరిగింది. మృత శరీరాన్ని కదిలించే ముందు ఆ శరీరాన్ని సంబోధిస్తూ ఒకరు ప్రసంగిస్తారు. ఇతర ఉపన్యాసాలుంటాయి ఇవన్నీ ఎదిరి ఫ్రాట్రీ వారు చేయడమే సంప్రదాయం. ఉపన్యాసా లయింతర్వాత శవాన్ని శ్మశానానికి తీసుకెళతారు. శవవాహకుల్ని ఎదిరి ఫ్రాట్రీవారు తమలోంచి నియమిస్తారు శవం వెనక సాకెమ్ల్యూ, నాయకులూ, వారి వెనక మృతుని కుటుంబమూ, గణమూ, వారి తరవాత ఆ ఫ్రాట్రీకి చెందిన మిగిలిన

సభ్యులూ, చివరన రెండో ఫ్రాట్రీకి చెందిన వారూ నడుస్తారు. శవాన్ని గోతిలో పెట్టేక శాకెమ్‌లూ, నాయకులూ, దానిచుట్టూ నిలబడతారు. వారిలో వయస్సుకి పెద్ద అయిన వానితో ప్రారంభించి వరసన తలో మూడుసారల మన్ను పోస్తారు. వారి మతంలో ఈ మూడుకి ఎంతో ప్రాముఖ్యం వుంది మొదటి సారమన్ను మహాదాత్మకి రెండోది సూర్యుడికి. మూడోది భూమి తల్లికి సంబంధించినది సమాధి పూర్తి అయాక, వారిలో పెద్ద అయిన శాకెమ్ చనిపోయిన వాని హోదాకు సంకేతం అయిన కొమ్ములను సమాధిమీద, తలవేపున- ఒక వుపన్యాసం చేసి పెడతారు. ఆయన స్థానంలో కొత్తవాని ఎన్నిక జరిగి, స్థిరపడి పదవి తీసుకొనే వరకూ అవి అక్కడే వుంటాయి. కొత్తవాడు పదవిని తీసుకొనే సందర్భంగా ఆ కొమ్ములను చనిపోయిన వాని సమాధి మీదినుంచి తెచ్చి కొత్త శాకెమ్ తలకు అమరుస్తారు దీనినుంచి ఫ్రాట్రీ నిర్వహించే సామాజిక, మత సంబంధి కార్యకలాపాలూ, ప్రాచీన సమాజ నిర్మాణంలో దాని సహజ పాత్రనూ అర్థం చేసుకోవచ్చు.

చనిపోయినవాని ఆత్మ భూమినుంచి స్వర్గానికి పదిరోజులు ప్రయాణం చేస్తుందని ఇరాక్యూల విశ్వాసం ఈ పదిరోజులూ ప్రతిరాత్రీ మైల పట్టిన వారు ఒకచోట చేరి గొల్లున ఏడుస్తారు ఏడుపు పాట ఆడవాళ్ళు పాడతారు ఆ పది రోజులూ ప్రతి రాత్రీ సమాధిమీద అగ్ని హోత్రం వుంచటం ప్రాచీనాచారం. పదకొండో రోజున విందు. అప్పటికి మృతుని ఆత్మ స్వర్గం చేరి విశ్రాంతి తీసుకొంటుంది కనక ఏడుపు పనిలేదు. విందుతో మైల ముగుస్తుంది

అనేక గణాల శాకెమ్‌లనూ, నాయకుల్నీ ఎన్ను కొనడంలో ఫ్రాట్రీకి సరాసరి సంబంధం వుంది వారి ఎన్నికను అది తోసివేయవచ్చు. ధృవపరచవచ్చు. ఒక గణం చనిపోయిన తన శాకెమ్‌ను గాని, రెండోస్థాయి నాయకుణ్ణిగాని ఎన్నుకొన్నప్పుడు దానిని ఫ్రాట్రీ అంగీకరించి ధృవపరచాలని పైన చెప్పేను. అదే ఫ్రాట్రీలోని ఇతర గణాలు అంగీకరిస్తే చాలదు రెండో ఫ్రాట్రీ కూడా ఒప్పుకోవాలి ఈ విషయంగా అప్పుడప్పుడు వ్యతిరేకత వచ్చినట్లు కనిపిస్తూంది. ఫ్రాట్రీల సమితులు సమావేశము అయి తమతమ అభిప్రాయాల్ని తెలుపుతాయి రెండు సమితులూ అంగీకరిస్తే పని జరిగినట్లే అందులో ఎవరు కాదన్నా ఎన్నికరద్దు అవుతుంది. కొత్త ఎన్నిక జరుగుతుంది. గణం ఎన్నుకొన్న వానిని రెండు ఫ్రాట్రీలూ అంగీకరించి నప్పటికీ కొత్త శాకెమ్‌నో, నాయకుణ్ణో పదవిలో కూర్చోబెట్టి వలసింది సమాఖ్య సమితి అతనికి పదవిని కట్టబెట్టే అధికారం వున్నది సమాఖ్య సమితికే.

ఆధునిక కాలంలో పెనెకాల వైద్య మందిరాల ప్రభావం తగ్గి పోయింది. కాని ఇది వరకు వారి మత వ్యవస్థలో వైద్య మందిరాలకు చాల బలం వుండేది వైద్య మందిరం చేతిలో వుండటంటే చాల ఉన్నత స్థాయి మతకర్మ కాండ జరిపించే అధికారం, గొప్పగొప్ప అద్భుత శక్తుల నిర్వహించే శక్తి వుండన్న మాట. పెనెకాలకు ఒక్కొక్క ఫ్రాట్రీలో ఒక్కో వైద్య మందిరం వుంది. ఫ్రాట్రీకి మతకర్మ కాండకి వున్న సంబంధాన్ని అది తెలుపుతూంది ఇప్పటి మందిరాన్ని గురించి, అక్కడ జరిగే మతకర్మ కాండల్ని గురించి అట్టే తెలియదు. ఫ్రాట్రీలు సోదర సంస్థలు- దానిలోకి కొత్త సభ్యుల్ని చేర్చుకోవడం మామూలుగా జరిగిపోతుంది.

పాలనా వ్యవహారాలలో ఫ్రాట్రీకి ప్రమేయం లేదు. అదంతా గణం, తెగ సమాఖ్య చూసుకుంటాయి ప్రజల పరిస్థితి బాగుపడిన కొద్దీ ఫ్రాట్రీ వారి మత విషయాల నిర్వహణలో ఎక్కువ జోక్యం తీసుకొనేది గ్రీకు రోమను ఫ్రాట్రీలకు మల్లె పెనెకా ఫ్రాట్రీలకు నాయకుడు అంటూ ప్రత్యేకించి లేడు గణానికీ, తెగకూ సంబంధం లేకుండా ఫ్రాట్రీకంటూ ఓ మత కర్మకాండా ఏర్పడలేదు. ఇరాక్వాలలో ఫ్రాట్రీ పురాతన కాలపు ప్రాథమిక రూపంలోనే వుంది కొన్ని అవసరాలకై అది సహజంగానే ఏర్పడింది నిలదొక్కుకుని చిరకాలం మనగలిగింది మానవ జాతిలో ఒక నియమం ఒక వ్యవస్థ సుస్థిరంగా వుంటూంది— అంటే దాని అవసరం వుంది గనకనే. గణం, తెగ, సమాఖ్య వున్నప్పటికీ ఫ్రాట్రీ వుండవలసిన అవసరం వుంది. దానివలన జరగగల ప్రయోజనాలన్నీ స్పష్టంగా పొందాలంటే కాలం, అనుభవం కావాలి.

మెక్సికోలోని గ్రామవాసి ఇండియన్ల లోనూ, మధ్య అమెరికా ఇండియన్ల లోనూ ఫ్రాట్రీలు వుండే వుంటాయి. బహుశా ఇరాక్వాలలో కన్న హెచ్చుగా బాగా వృద్ధి పొంది, మంచి పటుబడి కలిగే వుంటాయి స్పానిష్ ఆక్రమణ అనంతరం ఒక శతాబ్ది కాలం పాటు స్పానిష్ రచయితలు వ్రాసిన వ్రాతలలో ఆ సంస్థ గురించి ఒకటి అరా మాట మాత్రమే కనిపిస్తూంది ట్లస్కాలా గ్రామం నాలుగు భాగాలలో నాలుగు "కులాల" ట్లస్కాలాన్లు అధిక సంఖ్యలో వున్నారని వారు వ్రాసేరు నాలుగు కులాలు నాలుగు ఫ్రాట్రీలే అయి వుంటాయి. లేకుంటే అందరు జనం వుండరు వారు ఒకేచోట వుండడం, ఒకే భాష మాట్లాడడం వుంది గనక వారిలో ఫ్రాట్రీ సంస్థ అవసరం వుంటుంది. ఒక్కొక్క కులము, లేక ఫ్రాట్రీ ఒక

సైనిక నిర్మాణం వారి దుస్తులు జెండా వేరువేరు. పెక్ ట్లీ- యుద్ధ నాయకుడు- వారి సైన్య
నాయకుడు. వారు ప్రాత్రీలుగా యుద్ధాలకు వెడతారు ప్రాత్రీలుగా సైన్యాలు ఏర్ప
రచడం, తెగలుగా పాల్గొనడం హోమరు కాలంపు గ్రీకులలోనూ వుంది అగమెమ్నాన్ కు
నెస్తరు ఇచ్చిన సలహా. "ప్రాత్రీలు, తెగలుగా సైన్యాలను విడగొట్టు అప్పుడు ప్రాత్రీలు
ప్రాత్రీలకు తెగలు తెగలకు పక్తాసుగా వుంటాయి," (ఇలియడ్) గణ వ్యవస్థ బాగా
పురోగమించి నప్పుడు రక్త సంబంధం బాలవరకు సైన్య నిర్మాణంలో ప్రాముఖ్యత
వహిస్తుంది అదే విధంగా మెక్సికో గ్రామంలో అబ్ టెక్ లవి కూడా నాలుగు విభా
గాలు వుండేవి ప్రతి విభాగంలోని వారూ ఒకరికొకరు బంధువులు. త్లస్కాలాన్ం
లాగే వారివీ వేరువేరు కుదుర్లే ఆ విభాగాలు ప్రాత్రీలే అయి వుంటాయి వారి వారి
దుస్తులు, జెండాలు వేరు. నాలుగు కుదుళ్ళ వారూ నాలుగు వేరువేరు విభాగాలుగానే
యుద్ధాలకు వెళ్ళేవారు వారు నివశించిన ప్రాంతాలను మెక్సికోలో క్వార్టరు అనేవారు
దీనిని గురించి మళ్ళీ చెప్తా

అనాగరిక యుగం దిగువ దశలో ఇండియను తెగలలో ఈ సంస్థ విస్తృతంగానే
వుండినా దానిని గురించి పరిశీలన విశేషం జరగలేదు పాలనేతర వ్యవహారాలలో
అవసరం అయి అతిసహజంగా ఏర్పడేది కావడం చేత ఇది ప్రధాన ఇండియను
తెగలలో పరిపాటిగా వుండే వుంటుంది.

కొన్ని తెగలలో ప్రాత్రీలు చాల ప్రముఖంగా కనిపిస్తాయి ఆ విధంగా ఛోక్తా
గణాలు రెండు ప్రాత్రీలుగా వున్నాయి అందులో ఒకటి "విడబడ్డ జనం". దానిలో
నాలుగుగణాలున్నాయి. రెండోదాని పేరు "ప్రేమపాత్రజనం". దానిలోవున్న గణాలూ
నాలుగే ఈ విధంగా వేరుబడిన జనం రెండు ప్రాత్రీలుగా ఏర్పడ్డారు. ఈ ప్రాత్రీల
కార్యకలాపాలను గురించి కొంచెం తెలుసుకోవడం మంచిది తెలియక పోయినా
ఆ విభజనే వాస్తవానికి విదర్శనం ఏ తెగలోనూ రెండుకన్న తక్కువగణాలుండవు
ఆ రెండింటినుంచే క్రమంగా సమాఖ్య వస్తుంది గణాలలో జనం ఎక్కువైన కొద్దీ
విడబడుతుంటాయి రెండు అవుతాయి అవి మళ్ళీ చీలి నాలుగవుతాయి ఎనిమిదవు
తాయి కాలక్రమంలో అవి రెండో, మూడో,నాలుగో ప్రాత్రీలుగా ఐక్యం అవుతాయి
ఈ ఫ్రాత్రీలు కలిసి ఒక తెగ అవుతాయి తెగ వారందరి భాష ఒక్కటే కాలక్రమంలో
ఈ తెగలోనూ విభజన వస్తుంది. అనేక తెగలవుతుంది. అవన్నీ మరల ఏకమై

సమాఖ్య అవుతాయి. రెండుగణాలనుంచి పెరిగి ఫ్రాత్రీయై, తెగ అయివచ్చినదే సమాఖ్య.

చికాసాలలో రెండు ఫ్రాత్రీలున్నాయి వాటిలో ఒక దానిలో నాలుగూ, వేరొక దాంట్లో ఎనిమిదీ గణాలున్నాయి

1 చిరతపులి ఫ్రాట్రీలోని గణాలు

1 అడవిపిల్లి, 2 పక్షి, 3 చేప, 4. లేడి.

2 స్పానిష్ ఫ్రాట్రీలోని గణాలు

1 రాకూన్ (అడవి కుక్క) 2. స్పానిష్, 3 రాయల్, 4 హష్కోపి, 5 ఉడత, 6 అలిగేటర్ (మొసలి జాతిది) 7. తోడేలు. 8 పల్లపిట్ట.

చోక్టా, చికాసాల ఫ్రాత్రీలు గురించిన వివరాలు చెప్పలేను. పద్నాలుగేళ్ళ క్రితం రివరెండ్ డాక్టరు సైరస్ బింగ్‌టన్, రివరెండు ఛార్లెస్ సి తూప్లాండ్‌లు నాకి సమాచారం చెప్పేరు వాటిని గురించి చర్చ జరగలేదు.

మొహెగాన్ తెగ నిర్మాణంచూస్తే, గణాలు పెరిగి సహజంగా ఫ్రాత్రీలు ఎలా ఏర్పడతాయో కనిపిస్తుంది. వారిలో మూలగణాలు మూడు. 1 తోడేలు 2. తాంబేలు, 3 టర్కీకోడి.

ఈ మూడూ విభాగాలయాయి ఆ విభాగాలు దేనికదే ఒక్కొక్క గణం అయాయి అయితే అవి తమ ఫ్రాత్రీలకు మూలగణాలపేర్లనే పెట్టుకొన్నాయి అంటే ఒక మూలగణం విడిపోయిఏర్పడిన గణాలు ఆ పేరుతో ఫ్రాత్రీగా ఏర్పడ్డాయి దీనిని చూస్తే గణాలు విడబడడం, అలా విడబడినవి కలిసి ఫ్రాత్రీగా ఏర్పడడం అతి సహజంగా జరిగేదేనని అర్థం అవుతుంది

1 తోడేలు ఫ్రాట్రీలోని గణాలు

1. తోడేలు, 2 ఎలుగు, 3 కుక్క, 4. ఒపోస్సమ్

2. తాబేలు ఫ్రాట్రీలో గణాలు

1 చిన్నతాబేలు, 2. బురద తాబేలు, 3 పెద్ద తాబేలు, 4. పచ్చమలుగుచేప.

3. టర్కీకోడి ఫ్రాట్రీలో గణాలు

1. టర్కీకోడి, 2. కొంగ, 3 కోడిపిల్ల.

ఆ విధంగ మొదటి తోడేలు గణం నాలుగు గణాలయింది తాబేలు గణం నాలుగయింది టర్కీగణం మూడు అయింది ప్రతి కొత్తగణమూ కొత్త పేరు పెట్టుకొంది మూలగణం మొదటి పేరుతోనే వుంది దానిదే పెద్దరికం ప్రాట్రీ పేరు దానిదే అయింది తల్లిగణం, అది విరబడడం,ఆ గణాలన్నీ తల్లిగణం పేరున ప్రాట్రీలుగా ఏర్పడడం - ఇంత స్పష్టమైన సాక్ష్యం అమెరికను ఇండియను తెగలలో కనబడడం అసాధారణం. గణాల మధ్యనున్న బాంధవ్యం వల్ల ప్రాట్రీలు ఏర్పడతాయని అది చూపుతూంది గ్రీకు ప్రాట్రీలలాగ ఈ ప్రాట్రీలుకూడా సామాజికమూ, మత సంబంధీయే తప్ప పాలనా వ్యవహారాలతోదానికి ప్రమేయం వుండదు అందుచేత సమాజపాలనా వ్యవహారాలతో ప్రమేయం వుండే గణమూ, తెగలాగ ఇది పైకి తెలియదు అథీనియనులలోని పన్నెండుప్రాట్రీలలో ఒక్కదాని పేరు మాత్రమే చరిత్రకెక్కింది ఇంక ఇరాక్యూలలో దానిసోదరత్వం - ప్రాట్రీ అనే పేరు తప్ప మరోపేరు లేనేలేదు

డెలావరేలు, మున్సీలలో అవే గణాలు తోడేలు, తాంబేలు, టర్కీ గణాలు మాత్రమే వున్నాయి డెలావరేల ప్రతి తెగలో పన్నెండు గణాలు రూపుదాలుస్తున్న దశలోవున్నాయి అవి ఇంకా గణనామం తీసుకోకుండా కుదురులుగానే చలామణీ అవుతున్నాయి. అయితే అవి గణాలుగామారే క్రమంలో వున్నాయన్నమాట

వాయువ్యకోస్తా మీది త్లిన్కిట్స్‌లోకూడా ప్రాట్రీలు వచ్చేయి. అవి రెండు

1. తోడేలు ప్రాట్రీలోని గణాలు

1. ఎలుగు, 2 గద్ద, 3 డాల్ఫిన్ చేప 4 సొరచేప, 5 ఎల్కా (Elca)

2. బొంతకాకి (Raven) ప్రాట్రీ గణాలు

1 కప్ప, 2. బాతు, 3 సీలసింహం, 4 గూబ, 5 సాల్మన్‌చేప

ప్రాట్రీలో అంతర్వివాహం నిషిద్ధం. అంటే దానిలోని గణాలు ఒకేమూలగణం నుంచి వచ్చేయని అర్థం ఒక ప్రాట్రీలోని ఏ గణంవారైనా రెండో ప్రాట్రీలోని ఏ గణంలోనివారినైనా వివాహమాడవచ్చు

ఇంతవరకు చెప్పిన దానినిబట్టి అమెరికను ఆదివాసులలోని వివిధ భాషల ప్రజలలో ప్రాట్రీవుందని స్థిరపడుతూంది పైనచెప్పిన తెగలలో ప్రాట్రీ వున్నదంటే, గణాలున్నచోటనల్లా అదివుంటనే వూహించవచ్చు గ్రామవాసి ఇండియన్ల గణాల

లోనూ, తెగలలోనూకూడ జనసంఖ్య అధికం. అందుచేత అక్కడ ఫ్రాట్రీ బాగావృద్ధి పొంది, అధిక ప్రాధాన్యంవహించి వుంటుంది. ఒక సంస్థగా అది ఇంకా పురాతన రూపంలోనేవున్నా గ్రీకు, రోమను ఫ్రాట్రీలలో కనిపించే ప్రధాన లక్షణాలన్నీ దానికి ఏర్పడే వుంటాయి ప్రాచీన సమాజపు నిర్మాణవ్యవస్థా రూపాలన్నీ అమెరికా ఖండంలో దృఢంగా నెలకొన్నాయని చెప్పవచ్చు. గణాలు, ఫ్రాట్రీ, తెగ, తెగల సమాఖ్య ప్రపంచఖండాలన్నింటా గణసంస్థ వుండేదనడానికి సాక్ష్యం చూపుతా

అమెరికను ఆదివాసుల తెగలలో ఫ్రాట్రీ నిర్వహించిన కార్యకలాపాలమీద విశేషించి పరిశీలన జరుపుతే, ఇండియనుల జీవితంలోనూ, ఆచారాలలోనూ ఇంత వరకు అర్థంకాకుండా వుండిన ఎన్నో విషయాలు తెలుస్తాయి వారి ఆచారాలు,అలవాట్లు, వారి జీవిత పద్ధతి, పాలనావ్యవస్థ గురించి కొత్త సమాచారం లభించగలదు.

# నాలుగో ప్రకరణం

# ఇరాక్వ్యా తెగలు

ఒక సంస్థగా తెగ - ఒకే భాష మాట్లాడే గణాలతో ఏర్పడుతుంది - నివాస ప్రాంతాల విడతీయడంవలన భాషలు వేరవుతాయి. వేరుపడతాయి- తెగ సహజంగానే ఏర్పడుతుంది- ఉదాహరణలు- తెగలక్షణాలు- ప్రాంత నిర్ణయం, పేరు- నిర్దిష్ట భాష- శాకెమ్‌ల, నాయకుల ఎన్నిక తొలగింపు హక్కు- మత విశ్వాసం, కొలుపులు- నాయకుల సమితి- కొన్నిచోట్ల తెగ నాయకుడు ఉంటాడు -గణపాలనా వ్యవస్థలో వరసగా ఏర్పడిన మూడురూపాలు- పాలనా సంస్థలో ఒకరి అధికారం, ఇద్దరి పెత్తనం, ముగ్గురి పెత్తనం.

ఇరాక్వ్యా తెగ కూర్పు ఏ విధంగా జరిగిందో ఖచ్చితంగా చెప్పడం కష్టం. అయితే అది అమెరికను ఆదివాసులందరిలో స్పష్టంగా కనిపిస్తున్న ఉన్నత నిర్మాణం. సహజ క్రమంలో జనం విడబడి స్వతంత్రములైన అనేక తెగలుగా ఏర్పడ్డారని స్పష్టంగా కనిపిస్తూంది. ప్రతి తెగకూ ఓ పేరు వుంటుంది వారి భాష వేరు దానికో ప్రత్యేక పాలనా వ్యవస్థ వుంటుంది అది నివసించేప్రాంతం ప్రత్యేకం ఆప్రాంతాన్ని తనదిగా, దానిని రక్షించుకుంటుంది మాండలికాల లాగే తెగలుకూడా అధికం. మాండలికం భేదం ప్రారంభమయితే తప్ప తెగలు విడబడడం పూర్తికాదు. ఒకే ప్రాంతంలో నివశించే ప్రజలు భాషలో మార్పువచ్చి, విడబడి, స్వతంత్రమయి సహజంగా ఏర్పడినవే అమెరికను ఆదివాసులలోని తెగలు.

ఫ్రాట్రీ ఒక సామాజిక సంస్థయే గాని పాలక సంస్థ కాదనీ, గణము, తెగ, సమాఖ్య — ఇవి ప్రభుత్వ భావన పెరుగుదలలో వచ్చిన అత్యవసర దశలనీ పైన చెప్పుకున్నాం గణ సమాజంలో సమాఖ్య ఏర్పడడానికి తెగల పునాది అవసరం. తెగలకు ఫ్రాట్రీలు లేకుండే వర్యాలేమగాని గణాలు వుండి తీరాలి ఒకే ప్రజ నుంచి అనేక తెగలు ఎల్లా ఏర్పడ్డాయో ఈ ప్రకరణంలో చెప్పబోతున్నాను. ఆ ప్రజలు

వరసగా విడబడి పోతుండడానికి కారణాలు ఏమిటో, ఒక సంస్థగా ఇండియనుల తెగ కున్న ప్రధాన లక్షణాలు ఏమిటో చెప్పబోతున్నాను.

జన సంఖ్య కొద్దిగానే వున్నా ఒకే భాష, ఒకే ప్రదేశంలో వుండడమూతో ఇండియను తెగలను జాతులుగా పేర్కొనడం వింటున్నాం తెగా, జాతీ విజంచేత ఒకటి కావు అత్తికాలో నాలుగు అధీనియను తెగలు మిశ్రం అయినట్లుగా, స్పార్టాలో మూడు డొరయను తెగలలాగ, రోములో మూడు లాటిన్, శాబైన్ తెగలు కలిసి పోయినట్లు తెగలు ఒకే ప్రభుత్వం కింద మిశ్రం అయిపోతే తప్ప గణ వ్యవస్థలో తెగలు జాతిగా ఏర్పడవు స్వతంత్రము లైన తెగలు, తమ తమ ప్రాంతాలలోనే నివశిస్తూండడం సమాఖ్య లక్షణం గణాలూ, తెగలుగా, వేరు వేరు జట్లుగా నివశించే ధోరణి ఇంకా వున్నా వారు ఒకే ప్రదేశంలో మిశ్రం అయిపోవడం జాతి లక్షణం జాతిగా మిశ్రం కావడానికి సన్నిహిత దశ సమాఖ్య అంతే గాని అవి రెండూ ఒకటి కావు గణ నిర్మాణం కొనసాగుతూన్నప్పుడు మిగిలిన నిర్మాణాలను సరిగ్గా వర్ణించేందుకు తగిన శబ్దాలు వున్నాయి.

ఒక ఇండియను తెగలో చాలా గణాలుంటాయి అవన్నీ రెండో, అంతకన్న ఎక్కువో మూలగణాల నుంచి వచ్చినవే అయివుంటాయి. తెగలోని సభ్యులంతా వివాహాల రీత్యా కలిసి పోయేవుంటారు పై వానికి తెగ ఏదో తెలుస్తుంది కాని గణం కనబడదు వేర్వేరు భాషలు మాట్లాడే ప్రజలు ఒకే తెగలో వున్న మర్దం అమెరికను ఆదివాసులలో చాలా అరుదు అటువంటిదెక్కడన్నా వుంటే, చాలా సన్నిహితంగా వుండే మాండలికం మాట్లాడే బలహీనమైన తెగ బలీయమైన దానితో కలియడం వలన ఏర్పడినదయి వుంటుంది ఒటోయేలు మిస్సోరీలను ఓడించేక వారు ఏకం అయి ఒక తెగగా కలిసేరు ఆదివాసులలో అత్యధిక భాగం వేరు వేరు తెగలుగానే వుండడం చూస్తే, గణ నిర్మాణంలో ప్రభుత్వ భావన పెంపొందడం ఎంత కష్టమో అర్థం అవుతుంది వానిలో కొద్ది మాత్రమే, ఒకే మూల భాషలోంచి వచ్చినవే మాండలికాలు మాట్లాడే తెగలలో సమాఖ్యగా ఏర్పడే దశకు పెరిగేయి అమెరికా ఏ ప్రాంతంలోనూ కూడా ఒక జాతిగా తెగలు మిశ్రం అయే స్థితి ఏర్పడలేదు

నిరంతరం విడిపోయేందుకు దారి తీసే లక్షణమే ఆటవిక అనాగరిక తెగల అభివృద్ధికి ఆటంక కారణం ఆ లక్షణం గణ వ్యవస్థలోనే వుంది దానికి భాషవేరే అయిపోయే లక్షణం తోడు అవుతుంది వారి సామాజిక స్థితి, వారు నివశించే ప్రాంతాలు చాల విశాలమైనవి కావడమూ దీనికి మూలం. వాగ్రూపమైన భాష, దానిని

మాట్లాడే వారిలో స్థిరంగానే వుంటుంది. వ్యాకరణరూపాలలో మార్పుండదు అయినా అది స్థిరంగా వుండలేదు ఒక్కొక ప్రాంతంలో వుండే ప్రజ భాష మార్పుతో విడబడతారు దానికి ఫలితంగా వారి ప్రయోజనాలు వేరు అవుతాయి చివరికి స్వతంత్ర తెగలు అవుతారు ఈ పరిణామం జరగడానికి శతాబ్దాలూ, సహస్రాబ్దాలూ పడుతుంది ఒక్క ఎస్కిమోల భాష తప్ప ఉత్తర దక్షిణ అమెరికాలలోని మాండలికాలూ, ప్రధాన భాషలూ అన్నీ ఒకే మూల భాషనుంచి వచ్చేయని అంచనా ఈ పరిణామానికి మూడు మానవజాతి దశల కాలం పట్టింది

సహజమైన పెరుగుదల క్రమంలో కొత్త గణాలు, కొత్త తెగలు పుట్టుకు వస్తుంటాయి. అమెరికా ఖండం చాల విశాలమైనది కావడం ఈ గతి క్రమాన్ని త్వరిత పరిచింది అందులో పెద్ద తికమకేం లేదు ఒక ప్రదేశంలో జనాభా ఎక్కువ కావటంతో, బతకడానికి ఎక్కువ అవకాశాలున్న చోటికి కొంతమంది వెళ్ళిపోతారు వారి వెనక మరి కొందరు ఇల్లాగే మొదటి నివాస ప్రాంతానికి సమీపంలోనే మరో చోట ఆ ప్రాంతపు తెగకు చెందిన ప్రజలలో కొందరు మకాం చేస్తారు ఏడాది కేడాదికి వారి సంఖ్య పెరుగుతుంది వారి ప్రయోజనాలు భిన్నమవుతాయి క్రమంగా తాము వేరనే భావం ఏర్పడుతుంది చివరికి భాషా కొత్తదవుతుంది వేర్పడడం, స్వతంత్రం కావడం జరిగిపోతుంది. వారుండే ప్రాంతాలు ఇరుగు పొరుగువే కావచ్చు. కొత్త తెగ ఏర్పడుతుంది అమెరికను ఆది వాసులలో తెగలు ఏర్పడిన విధం సంగ్రహంగా ఇది అయితే సర్వత్రా ఇల్లాగే జరిగిందనుకోవద్దు కొత్త ప్రదేశాలలోనూ పాత చోట్లనూ ఇదే ప్రక్రియ జరగడం చూస్తే గణ సంస్థకిది సహజమూ, తప్పనిసరీ అనిపిస్తుంది వాటి పరిస్థితుల అవసరం అది అదనపు జనం పోగుపడి జీవనాధారం కొరవడె స్థితి వచ్చినప్పుడు కొందరు జనం మరో చోటు చూసుకుని అక్కడ స్థిర పడతారు కష్టం ఏం వుండదు. ప్రతి గణంలోనూ పాలనా వ్యవస్థ నిర్దుష్టంగా వుంటుంది. ఎన్నో గణాలు జట్టుగా కలిసివున్నా చిక్కులుండవు గ్రామవాసి ఇండియన్లలో కూడ కొంచెం తేడాగా ఇదే క్రమం కొనసాగింది. గ్రామంలో జన సంఖ్య పెరగ్గానే కొంత మంది నది ఎగువకో, దిగువకో కొంత దూరం పోయి కొత్త వూరు కట్టుకొని స్థిర పడేవారు. కాలం గడిచిన కొద్దీ అల్లా చాల వూళ్ళు లేచేవి. దేనికది స్వతంత్రం. దేనికి దానికే స్వపరిపాలన అయితే పరస్పర రక్షణ కోసం అవి అన్నీ ఒక కూటంగానో, సమాఖ్యగానో ఏకం అయేవి క్రమ క్రమంగా వాటిలో మార్పులు వస్తాయి. తెగలుగా మార్పు చెందుతాయి.

ఒకదానినుంచి వేరొకటిగా తెగలు ఎల్లా పుట్టుకువస్తాయో ఉదాహరణలు చూపించవచ్చు తెగల విభజనకు సంప్రదాయం కొంతవరకు, ఒకేసంఖ్య గణాలు ప్రతి దానిలోనూ వుండవలసి రావడం కొంతవరకు,వారి మాండలిక భాషా సంబంధాలు కొంతవరకు కారణం అవుతాయి మూల తెగ విభజనవలన ఏర్పడిన వానిలో గణ సంఖ్య సమానంగా వుంటుంది వారంతా ఒకే భాష మాట్లాడే వారయివుంటారు. శతాబ్దాలు గడిచినా దానిలోని గణాల సంఖ్యలో మార్పువుండదు. ఆ విధంగా హురోన్‌లలో, నేడు వాన్‌డోట్‌లలో ఒకేపేరుగల గణాలు ఆరేసి వున్నాయి అవి సెనెకా - ఇరాక్వాలలో వున్న ఆరు గణాల పేర్లే. వీరి నుంచి విడిపోయి నాలుగు వందలేళ్లు గడిచినా అవే పేర్లు కొనసాగుతున్నాయి ఒజిబ్వాల ఇరవై రెండు గణాలలో పోటవట్టామీల పద్నాలుగు గణాలలో ఎనిమిదింటి పేర్లు సమానం మిగిలినవి వేరు పేర్లూను. తెగ విభజన నాటి కున్న ఎనిమిది గణాలు కాలక్రమంలో విడబడి కొత్తవి ఏర్పడ్డాయని దాని అర్థం ఒజిబ్వాల నుంచి ఏనాడో విడిపోయినదో, లేక రెండింటికీ తల్లి తెగ మరొకటి వుండెదో - మియామీ తెగకీ ఒజిబ్వా తెగకీ ఒకే పేరుగల గణాలు మూడేసి వున్నాయి- తోడేలు, చందమామ, గద్ద పేరుగలవి గనోవానియన్ కుటుంబాల తెగల సామాజిక చరిత్ర గణాల పెరుగుదలలో నిక్షిప్తమై వుంది ఈ విషయం గురించి గట్టి పరిశోధన చేయదలిస్తే గణాలే సరియైన దారి చూపిస్తాయి. బహుశా ఆదివాసుల మూలం గురించీ, ఒకే మూలంనుంచి వచ్చిన తెగలు విడబడడం గురించీ సమాచారం వానినుంచే లభిస్తుంది

అనాగరిక యుగం దిగువదశలో వున్న తెగలనుంచి వుదాహరణలు కొన్ని ఇక్కడ ఇస్తాను. యూరపియన్లు కనుక్కున్న నాటికి మిస్సోరి తెగలు ఎనిమిదీ మిస్సోరినదీ దాని ఉపనదులైన కన్సాస్, ప్లాట్టే నదుల వెంబడినే ఓ వేయిమైళ్ళకు పైగా విస్తరించి వున్నాయి. ఇయోవానది చిన్న ఉపనదుల వెంబడినే కూడా వారే వున్నారు మిస్సిసిపీ నది పడమటిగట్టున అర్కాన్సాస్ వరకూ వారేవ్యాపించి వున్నారు. వారి భాషల్నిపట్టి తరవాత తరవాత జరిగిన విభజనలకు పూర్వం వారు, వారు మూడు తెగలుగా వున్నట్లు కనిపిస్తుంది. పుంకాలూ, ఒమాహాలు ఒకదానిలో, ఇయోవాలూ, ఒటోయేలూ, మిస్సోరీలూ రెండవదాంట్లో, కా లు, ఒసాగేలు, కువాప్పాలూ మూడవ దాంట్లో వున్నారు వీరంతా డకోటియన్ భాషా కుటుంబంవారు. ఆ మూల భాషతో

వీరి మాండలికాలకు పోలికలు తక్కువగానే వున్నా, ఈ మూడు శాఖలవారి మాండలికాలు చాల దగ్గరగా వున్నాయి దానినిబట్టి ఈ మూడు శాఖలూ ఒకే మూలం తెగ విడబడి ఏర్పడ్డాయని వూహించ వచ్చును. అందుచేత ఒకే మూల తెగ నుంచి విడబడినాయని చెప్పడానికి భాషను పరిగణించ వలసిందేనని గమనించాలి ఏదో ఒక కేంద్రస్థలం నుంచి తెగలు నది ఎగువకూ దిగువకూ విస్తరించడంతో వాని మధ్య దూరాలుపెరిగి వాని ప్రయోజనాలు భేదిస్తాయి వానితో భాషా మారుతుంది చివరకవి స్వతంత్రం అవుతాయి ఒకమైదాన ప్రాంతంలో నదుల వెంబడే విస్తరించే ప్రజలు మొదట మూడు తెగలుగా, తరవాత ఎనిమిది తెగలుగా విడబడవచ్చు కాని వానిలో ప్రతిభాగమూ స్వయంపూర్ణంగానే వుంటుంది విడబడడం ఆశ్చర్యం కలిగించదు. అదో ప్రమాదంకాదు విశాలప్రదేశంలో విస్తరించడం వలన భాగాలుగా ఏర్పడి, విడిపోవడం అతిసహజం మిస్సోరినది మీద, నియోబ్రారా నదీ ముఖంవద్ద నున్నది పుంకాలు చాలా దిగువన అర్కాన్సాస్ నదీముఖం వద్ద, మిస్సిసిపీ నదిమీద వున్నది కువాప్పాలు ఈ రెండు తెగల మధ్య పదిహేను వందల మైళ్ళ దూరం వుంది ఈ మధ్యలో మిస్సోరీనది పొడుగునే వున్న అడవిలో మిగిలిన ఆరు తెగలూ వ్యాపించి వున్నాయి. ఇవన్నీ నదీ జీవనం నెరపే తెగలే

సుపీరియర్ సరస్సుమీద వున్న తెగలు మరో వుదాహరణ ఓజిబ్వాలు, ఒటావాలు, పొటవట్టామీలు ఒక మూల తెగ సంతానం వీరిలో ఓజిబ్వాతెగ మూలతెగ ఏమంటే సరస్సునుంచి బయటికి పోయేదారి మొగలో చేపలు బాగా దొరుకుతాయి ఈ తెగ ఆ కీలక స్థానంలోనే వుంది పైగా వారిని మిగిలినవారు "పెద్దన్నయ్య"లు అంటారు ఒట్టావాలను "చిన్నన్నయ్యలు" అంటారు. పొటవట్టామీలు "చిన్న తమ్ముళ్ళు" మాండలిక భాషాభేదాలు ఎక్కువగా వుండడం పట్టి ఈ మూడింటిలో మొదట విడిపోయినది పొటవట్టామీలనీ, తరువాత విడిపోయింది ఒట్టావా తెగ అనీ అర్థం అవుతూంది 1641 లో మొదట కనుక్కున్నప్పుడు ఓజిబ్వాతెగ సుపీరియర్ సరస్సు ముఖద్వారంలో వున్న ఉరవడుల వద్ద వున్నారు అక్కడి నుంచి సరస్సు దక్షిణపు పొడుగు వెంబడి ఫోంటోనాగాన్ వరకూ, అక్కడి నుంచి ఈశాన్యం పొడుగునే సైంట్ మేరీ దిగువగా హ్యూరోన్ సరస్సువరకూ వ్యాపించివుండేవారు వారికి మొక్కజొన్న ఇతర పంటలు పండించడం తెలియదు. వారి ప్రధాన జీవనోపాధి చేపలు, వేట. ఒక్క కొలంబియా లోయలో తప్ప ఉత్తర అమెరికాలో మరెక్కడా ఇది ఏ మాత్రమూ అసౌకర్యం కలిగించదు ఆ సౌలభ్యం వుండడంచేతనే వారి

జనాభా త్వరగానే పెరుగుతుంది. వలసలు పోయి స్వతంత్ర తెగలుగా విస్తరిస్తారు మిచిగాన్ ఎగువ భాగాన్నీ, విస్కాన్సిన్‌నూ పొటవట్టామీలు ఆక్రమించుకొన్నారు. 1641నాడు వారిని దకోటాలు తరిమివేసే ప్రయత్నంలో వున్నారు అదే కాలంలో ఒట్టావాలు —వీరు మొదట కెనడాలోని ఒట్టావా నదిమీద వుండే వారని తోస్తుంది— వడమరగా వ్యాపించి జార్జియన్‌బే, మనిటోలైన్ దీవులు, మాకినావద్ద నివశిస్తున్నారు అక్కడి నుంచి, దిగువమిచిగాన్ మీదుగా దక్షిణానికి వ్యాపిస్తున్నారు మొదట వీరంతా ఒకే తెగకు చెందిన జనం వారి గణాలు ఒకటే అయితే చాల విశాల ప్రదేశాన్ని ఆక్రమించు కొన్నారు వేరు వేరు చోట్ల నివాసమూ, దూరం దూరంగా వూళ్ళు కావడంచేత వారిని చూచి నప్పటికే మాండలికాలు వేరుకావడం, స్వతంత్ర తెగలుగా మారడం జరిగిపోయింది పక్కపక్కనే వున్న ప్రాంతాలలో నివశిస్తున్న వీరితెగలు మూడూ, పరస్పర రక్షణకై ఒక కూటమిగా ఏర్పడ్డారు దీనిని అమెరికనులు "ఒట్టావా సమాఖ్య" అనిపిలుస్తున్నారు కాని, అది ఇరాక్వాలలో మాదిరి సన్నిహిత సమాఖ్యగాకాక, ఆత్మరక్షణకోసం, ఆక్రమణలకోసం ఏర్పడ్డ కూటమితప్ప వేరుకాదు

ఈ మూడు తెగలూ విడిపోవడానికి పూర్వమే మియామీలు ఒజిబ్వాలనుంచి విడిపోయారు బహుశా ఒజిబ్వాలూ, మియామీలూ ఒకే మూలతెగ నుంచి విడిపోయిన శాఖలూ కావచ్చు ఈ మియామీలు ఎప్పుడో విడిపోయి ఇల్లినాయిస్ నదిమి ప్రాంతానికీ, ఇండియానా పశ్చిమ ప్రాంతానికీ వలసపోయేరు ఈ వలస పోయే దారిలోనే ఇల్లినాయిస్ వుంది ఆ కాండానికి చెందినదే ఒకశాఖ అక్కడ దిగబడి పోయింది తరవాత వీరు పియోరీలు, కస్‌కస్‌కియాలు, వెయాలు, పియాంకెషాలుగా విడబడ్డారు వీరి మాండలికాలకూ, మియామీల భాషకూ ఒజిబ్వాల భాషతో సామీప్యం ఎక్కువ కనిపిస్తుంది అంతకన్న తక్కువ సాన్నిహిత్యం క్రీల భాషతోవుంది పొటవట్టామీలు విడిపోయిన తర్వాత బహుశా ఒజిబ్వాలూ, ఒట్టావాలూ, క్రీలూ ఒకే ప్రజగా ఒకేభాషతో వుండివుంటారు సుపీరియర్ సరస్సుమీది చేపలు దొరికే మహాకేంద్రం నుంచి ఈ తెగలన్నీ బయటకు విస్తరించడం గమనిస్తే జీవనోపాధి కేంద్రంనుంచి విస్తరించి, విడబడి తెగలు ఏలా ఏర్పడతాయో తెలుస్తుంది న్యూ ఇంగ్లండు, డెలావరే, మేరీలాండ్, వర్జీనియా, కరోలినా అల్గాంకిన్‌లు ఇదేవిధంగా ఒక మూలంనుంచి వచ్చిన వారై వుంటారు పైన చెప్పిన మాండలికాలు ఏర్పడడానికీ, వానిలో ఈనాడు మనకు కనిపించేవైవిధ్యాలు వృద్ధి పొంద డానికీ వందల సంవత్సరాలే పడుతుంది.

పైన చెప్పిన వుదాహరణలను బట్టి, తెగలు సహజ క్రమంలో ఒకదానినుంచిఒకటి ఎలాఏర్పడతాయో, మంచి అనుకూల్యం గల ప్రదేశంలో వున్న మూలగణంనుంచి ఎలా విడబడతాయో తెలుస్తుంది వలసకు బయలు దేరిన ప్రతి జట్టూ ఒక సైన్యదళం లాంటిది అనడం తప్పుకాదు. అది కొత్త ప్రదేశాన్ని ఆక్రమించుకొని నివాసం ఏర్పరచుకొంటుంది మొదట్లో సాధ్యమైనంత కాలం మాతృగణంతో సంబంధం వుంచుకుంటుంది. ఈ మాదిరిగా కొత్త కొత్త వలసలు ఏర్పరచు కొంటూ తమ అధీనంలోని మండలాన్ని విస్తరించుకుంటారు అది వారందరి ఉమ్మడి హక్కులోది. బయటి వారు దానిలో ప్రవేశిస్తే ప్రతిఘటిస్తారు. ఒకేమూల భాషయొక్క మాండలికాల్ని మాట్లాడే తెగల నివాస భూములు పక్క పక్కనే వుండడం అమెరికన్ ఇండియన్లలో కనిపిస్తుంది భాషరీత్యా సన్నిహితంగా వుండే తెగలు ఈ విధంగానే ఎక్కడైనా వుంటారు. ఏమంటే ఒక కేంద్రప్రదేశం నుంచి విస్తరించే జనం అతి కష్టంమీద జీవనోపాధి కూర్చుకొంటున్న స్థితిలో, కొత్త ప్రాంతాలలో స్థిరపడుతున్నప్పుడు ప్రమాద స్థితిలో తోడ్పాటుకూ అవసరమైతే తల దాచుకొనేందుకూ మాతృ భూమితో సంబంధం నిలుపుకుంటారు

జనాభా పెరిగి వలస ఏర్పరచుకోవాలంటే జీవనోపాధి సౌకర్యాలు బాగావుండే ప్రదేశాలు కావాలి ఉత్తర అమెరికాలో ఇందుకు సహజ వసరులు గల ప్రదేశాలు చాల తక్కువ మూడు మాత్రమే వున్నాయి కొలంబియా నదీలోయ ఒకటి అక్కడ అడవులూ, పచ్చిక మైదానాలూ కూడ వుండడంచేత మంచి వేట దొరుకుతుంది మైదానాలలో కమాష్ అనే దుంప దండిగాదొరుకుతుంది వేసవిలో బెరికాయలు పుష్కలం ఇవి ఇతరప్రాంతాల లోనూ వుంటాయి వాటికన్న గొప్పతనం ఏమీ లేదు ఉన్న గొప్పతనం కొలంబియా నదిలోనూ, తీర ప్రాంతపు ఇతర నదులలోనూ సాల్మన్ చేపలు చాల ఎక్కువ. ఈ నదులలో అవి కోటానుకోట్లు ఆ రుతువు వచ్చినప్పుడు చాల సులువుగా, అపారంగా దొరుకుతాయి. వాటిని చీరి ఎండబెట్టి తమ గ్రామాలకు తీసుకుపోతారు సంవత్సరంలో అధిక భాగంలో వారి ప్రధాన ఆహారం అదే ఇవిగాక కోస్తామీద గుల్ల చేపలు బాగా దొరుకుతాయి శీతాకాలంలో అవి ఆహారం వీటికి తోడు సమ శీతోష్ణమైన వాతావరణం. సస్యధాన్యాలు తెలియక పోయినా తెగ ప్రజలకు అది నిజంగా స్వర్గమే.

మొక్కజొన్న, ఇతర పంటలు రాకముందు వైవిధ్యంలోనూ, పరిమాణంలోనూ ఇంతగా జీవనోపాధిని చూపగల ప్రదేశం, భూమిమీదనే లేదు రెండోది సుపీరియర్ సరస్సు, హూరాన్, మిచిగాన్ సరస్సుల మధ్యనున్న ద్వీపకల్పం ఒజిబ్వాలు

ఇక్కడుంటున్నారు ఎన్నో అమెరికను తెగలు ఇక్కడ పుట్టినవే మూడోవి మిన్నెసోటాలోని వరన్పుం మండలం నేటి దకోటా తెగలన్నీ ఇక్కడి నుంచే వచ్చేయి. ఉత్తర అమెరికాలో ప్రకృతి సిద్ధమైన, జీవనోపాధి సమకూర్చే కేంద్రాలు ఈ మూడే. జనాభా పెరుగుదలకి మూలభూతమైనవీ ఈ మూడే దకోటాలు ఆక్రమించుకోక పూర్వం మిన్నెసోటా అల్గోంకిన్‌మండలంలో భాగంగా వుండేదను కొనేందుకు అవకాశాలున్నాయి మొక్కజొన్నా, తదితర పంటలూ వచ్చేక ఎక్కడి వాళ్ళక్కడ స్థిరపడి పోవడమూ, వారి జీవనోపాధికి కొద్దిపాటి ప్రదేశం సరిపోవడమూ, వారి సంఖ్య త్వరగా పెరగడమూ జరిగింది అయితే మొత్తం ఖండంలో గ్రామవాసి ఇండియనులు మాత్రమే పూర్తిగా వ్యవసాయం మీదనే జీవనోపాధి సమకూర్చుకుంటున్నారు. అనాగరిక యుగం దిగువ దశలో మొక్కల పెంపకం (Horticulture) ప్రధానములైన తెగలన్నింటిలోకీ పాకింది. వారిస్థితి గతులు బాగుపడ్డాయి ఉత్తర అమెరికాను కనుక్కొన్ననాటికి మొక్కల పెంపకం ఎరిగిన తెగలూ, ఎరగని తెగలతోనే ఆ ఖండంలోని విశాల ప్రాంతాలు నిండివున్నాయి వారినుంచి కొత్త జనాభా పుట్టుకొచ్చి నూతన ప్రదేశాలకు విస్తరిస్తున్నారు

గనోవానియన్ కుటుంబానికి కొలంబియా నదీలోయ పుట్టినిల్లు అనడం న్యాయం. అతి పూర్వకాలంలో జనం జట్లు జట్లుగా బయలుదేరి అమెరికా రెండు ఖండాలకూ వ్యాపించేరు. యూరపియన్ల రాక వరకూ ఈ విధంగా వలస పోవడం జరుగుతూనే వుంది. ఇండియను తెగల భాషా సంబంధాలు, శరీర నిర్మాణం, పోలికలు పట్టి ఇల్లా జరిగిందని వూహించవచ్చు. ఉత్తర అమెరికాలో ఉత్తర దక్షిణాలకు పదిహేను వందల మైళ్ళు, తూర్పు పడమరలకు వేయి మైళ్ళకు పైగానూ వ్యాపించి పసిఫిక్, అట్లాంటిక్ కోస్తాల మధ్య ఒకే అతి విశాలమైన మైదానం విస్తరించివుండి అటూ యిటూ సంబంధాలు లేకుండా అటంక కారి అయింది. అందుచేత భౌతిక కారణాల వలన కొలంబియా నదీలోయ నుంచి వలస బయలు దేరినవారు ఫ్లోరిడా చేరడం కన్న పాటగోనియా చేరడం సులువు ఇప్పటికి తెలిసిన సమాచారమే చాలు, ఇండియనుల మూల స్థానం కొలంబియా లోయ అనడానికి. ఇంకా అదనపు సాక్ష్య సమాచారం లభిస్తే ఇంక సందేహానికి అవకాశం వుండదు.

మొక్కజొన్న వ్యవసాయంతో పరిస్థితులు పెద్దగా మారలేదు. వలస పోయే పరిస్థితులు అల్లాగే వున్నాయి ఆ వ్యవసాయం వల్లనే అభివృద్ధి త్వరితం కావడంవేరు. ఈ అమెరికను కాయ ధాన్యానికి జన్మస్థలం ఏదో తెలియదు ఇది బహుశా మధ్య

అమెరికాలో పుట్టి వుండవచ్చు ననేది సర్వ సాధారణ మైన అభిప్రాయం. అక్కడ మొక్క పెరగడం చాల సులువు అక్కడ ఈ పైరు బాగా పండుతుంది గ్రామ వాసి ఇండియను తెగల ఆదిమ నివాస భూములు అక్కడ ఇన్ని కారణాలను పట్టి అలా వూహించ వంసి వస్తూంది మొక్కజొన్న సాగు మధ్య అమెరికాలో ప్రారంభమయి వుంటే మొట్టమొదట అది మెక్సికోకు పాకివుంటుంది అక్కడినుంచి న్యూ మెక్సికోకు తరవాత మిస్సిసిపీ నదీలోయకు, అక్కడినుంచి తూర్పుగా అట్లాంటిక్ తీరానికి వ్యాపించి వుంటుంది చివరకు వెళ్ళిన కొద్దీ దీనిని వ్యవసాయం చేయడం తగ్గుతూ వచ్చింది అనాగరిక తెగలు కొత్తరకం జీవనోపాధిని సమకూర్చు కోడం కోసం గ్రామవాసి ఇండియన్లతో ప్రమేయం లేకుండానే తమంత తాముగా దానిని వ్యాపింపచేసి వుంటారు. ఉత్తరాన ఎగువ మిసోరీలో మిన్నిటారీలూ, మన్‌డాన్‌లూ, రెడ్‌రివర్‌కు ఉత్తరాన షాన్‌లూ, కెనడాలోని సిమ్‌కోయీ సరస్సు మీది హూరోన్‌లూ, కెన్నెబెక్‌లోని అబెనాకీలూ, మిస్సిసిపీకి అట్లాంటిక్‌కూ మధ్య నివశిస్తున్న తెగలూ వ్యవసాయం చేయడం నేర్చుకుంటున్నా, అది న్యూ మెక్సికో దాటి కొలంబియా లోయ వేపుగా పాకనేలేదు కొలంబియాలోయ నుంచి వలస పోయే జనం న్యూ మెక్సికో, మెక్సికోల మీదుగా దక్షిణ అమెరికాలోకి తమ పూర్వులు వెళ్ళిన మార్గాన్నే విస్తరించేరు వారి వొత్తిడికి బెదిరి పోయిన గ్రామవాసి ఇండియను తెగలలో కొందరు కొందరు భూ సంధి మీదుగా దక్షిణ అమెరికాలోకి చేరేరు గ్రామవాసి ఇండియనులు సంపాదించిన అభివృద్ధి బీజాల్ని వీరు తమతో తీసుకెళ్ళారు ఇల్లాగేమరికొన్ని పర్యాయాలు జరిగే సరికి వదిలి వచ్చిన వారికన్న ఎంతోవృద్ధి పొందిన తరగతి ప్రజ దక్షిణ అమెరికాలో వచ్చేరు ఆ విధంగా దక్షిణ అమెరికా అంత గొప్పగా కాక పోయినా అభివృద్ధి క్రమంలో కొంతముందుకు పోయింది. సూర్యుని కొడుకూ కూతురూ అయిన మాంకో కాపాక్, మామా ఒయెల్లోలు, - వీరు, భార్యాభర్తలు - వీరి గురించి పెరూవియన్లలో ఓ పురాణ కథ వుంది. దానిని పట్టి మనం ఒక విషయాన్ని వూహించవచ్చు. ఉత్తర అమెరికానుంచి కాకపోయినా ఏదో దూరపు దేశం నుంచి వచ్చిన వలస దారుల జట్టు ఆండేస్ పర్వత వాసులకు మొక్కజొన్నను పండించడమూ, ఇతర జీవిత కళలూ నేర్పేరనుకోవాలి. కాలక్రమంలో జనం నోట నాయకుల పేర్లు మాత్రం మిగిలి అసలు జట్టు రాక మరుగుపడి వుంటుంది.

తెగల సంఖ్య, భాషలసంఖ్య పెరగడం ఆదివాసుల మధ్య ఎడతెగని యుద్ధాలకు కారణం అయింది సాధారణంగా వేర్వేరుమూల భాషల మాండలికాలుమాట్లాడే

ప్రజల మధ్య ఎప్పుడూ ఘర్షణే వుండేది. ఇరాక్వాలకూ అల్గోంకిన్‌లకూ మధ్య, డకోటాలకూ ఇరాక్వాలకూ మధ్య ఎల్లప్పుడూ ఘర్షణలే వుండేవి. డకోటా,అల్గోంకిన్ లలో చాలా తెగలు శాంతంగా వుండేవి. లేక పోతే వారు పక్కపక్కనే వుండడం పొసగేది కాదు. ఇరాక్వాలు అల్లాకాదు. రక్త బంధుత్వం వున్న ఈరీ, నియోట్రల్ జాతి, హురాన్‌లు, సస్క్వహన్నోక్‌లు మొదలయిన తెగలనే వారు నాశం చేశారు. ఒకే మూల భాష తాలూకు మాండలికాలు మాట్లాడే తెగలు ఒకరితో ఒకరు మాట్లాడుకో గలరు పేచీలు సర్దుకోగలరు. అంతేకాదు తామంతా ఒకేగణంనుంచి వచ్చేమన్న జ్ఞానం, సహజ మిత్రులుగా ఒకరిపై ఒకరు ఆధారపడగల మనే జ్ఞానం వుంటుంది.

జీవనాధారం పరిమితిని పట్టి ఒకే ప్రదేశంలో వుండగల జనసంఖ్య ఆధారపడి వుంటుంది. చేపలూ, వేట మీద బతకాలంటే కొద్దిమందికే విస్తారమైన ప్రదేశం కావాలి. చేపలు, వేటకు పక్కన మూకలు, పండి ఆహారంగా తోడు అయినా (పండించినవి కాక పడిమొలిచిన వరి ధాన్యాల ఉత్పత్తులు) జనాభాను పట్టి విస్తీర్ణం ఎక్కువవున్న ప్రదేశమే కావాలి. ఉదాహరణకు న్యూయార్కు విస్తీర్ణం నలభయ్యేడు వేల చదరపుమైళ్ళు. హడ్సన్‌నదికి తూర్పునా, లాంగ్ ఐలండ్ మీదా ఇరాక్వాలూ, అల్గోంకిన్‌లూ వుండేవారు. ఆ రాష్ట్రానికి పశ్చిమ భాగంలో ఈరీలూ, నియోట్రల్ నేషనూ వుండేవారు. వారితో కలిపి, న్యూయార్కు వాసులు ఏనాడూ ఇరవయ్యయిదు వేల మందికి మించలేదు. పెరుగుతున్న జనాభా అందుబాటులో వుంటుంటే తప్ప వారిని అదుపులో వుంచగల కేంద్ర అధికారాన్ని గణాలలో ఏర్పడిన స్వపరిపాలన పెంపొందించ లేదు.

న్యూ మెక్సికో, మెక్సికో, మధ్య అమెరికాలలోని గ్రామవాసి ఇండియన్లు పరిమిత ప్రదేశాలలో వుంటున్నా, జనాభా పెరుగుదలతో విడబడక తప్పలేదు. ఏ గ్రామానికా గ్రామం (ప్యూబ్లో) స్వతంత్రం, స్వయంపాలితం. ఒకే నది ఒడ్డున పలుగ్రామాలు దగ్గర దగ్గరగా వుండే ఆ ప్రజ సాధారణంగా ఒకే మూలంనుంచి వచ్చినవారే అయివుంటారు. ఒక తెగ లేక సమాఖ్య పాలనకింద వుంటారు. ఒక్క న్యూ మెక్సికో లోనే ఏడు మూలభాషలున్నాయి. ప్రతి ఒక్కటీ ఎన్నో మాండలికాలు కలిగివుంది. 1540-1542లో కొరొనాడో బృందం చూసినప్పుడు చిన్నచిన్న గ్రామాలు చాలా కనిపించేయి. కిటోలా, తుకయాన్, క్వివిరా, హెమెజ్‌లని ఏడేసి, తిగుయెక్స్‌లని పన్నెండు గ్రామాలు కనిపించేయి, ఇతర గ్రూపులవారూ వున్నారు. వారందరిదీ ఒకే మూలభాష. అయితే ఆ గ్రూపులు సమాఖ్యలుగా ఏర్పడ్డాయో లేదో వారు వ్రాయలేదు.

కొరొనాడో బృందం చూచిన ఏడు మోకి గ్రామాలూ (తుకయాన్ గ్రామాలు) ఈ వేళ ఒక సమాఖ్యలో వున్నాయి బహుశా అనాడూ అవి సమాఖ్యగానే వుండే వుండవచ్చు.

పైన వ్రాసిన విధంగా అమెరికను ఆదివాసులలో విభజనక్రమం వేల సంవత్స రాలపాటు సాగుతూనే వుంది క్రమంగా, మనకు తెలిసినంతవరకు ఒక్క ఉత్తర అమెరికాలోనే వలభయివరకు మూల భాషలు ఏర్పడ్డాయి. అన్నిటిలో ఎన్ని మాండలి కాలున్నాయో అన్ని తెగలున్నాయి. అదే పరిస్థితులున్నప్పుడు వారి అనుభవం లాంటిదే ఆశియా, ఆఫ్రికా, యూరపులలోని తెగలది కూడా అయివుంటుంది

పైన చెప్పిన దానినిబట్టి అమెరికను ఇండియను తెగ అతి సామాన్యమూ, నిరాడంబరమునైన సంస్థ అని అర్థం అవుతుంది కొన్ని వందలమంది, మహా అయితే కొన్నివేలమంది ప్రజలుంచే ఒక తెగ తయారవుతుంది. గణ సమాజంలో దానికి గౌరవస్థానం లభిస్తుంది

ఇండియను తెగ లక్షణాలు, కార్యకలాపాలు కింద చెప్తున్నా

1 ఒక నివాస ప్రాంతము. పేరు.
2 ప్రత్యేక మాండలిక భాష.
3 శాకెమ్‌లనూ, నాయకులను పదవిలో స్థిరపరిచే హక్కు.
4. ఆ శాకెమ్‌లను, నాయకులను పదవుల నుంచి తొలగించే హక్కు.
5 ఒక మతవిశ్వాసం. పూజా విధానం కలిగి వుంటుంది.
6 నాయకుల సమితితో ఏర్పడి సర్వాధికారంగల పాలనా వ్యవస్థ
7. కొన్ని సందర్భాలలో తెగకు ప్రధాన నాయకుడు వుంటాడు.

పైన పేర్కొన్న తెగ లక్షణాలు గురించి కొద్ది వివరణ ఇవ్వడం అవసరం.

1 ఒక నివాస ప్రాంతము, పేరు.

తెగలోని ప్రజలు వుండే గ్రామాలు, ఆ ప్రజలు వేటకు, చేపల పట్టడానికి గాని ఉప యోగించు కొనే వైశాల్యం- ఇతరుల ఆక్రమణనుంచి రక్షించుకోగలమేర తెగ ప్రాంతంగా పరిగణించ బడుతుంది పొరుగున వున్న తెగ వేరు భాష మాట్లాడే వారైతే ఈ యిద్దరి నివాస మండలాల మధ్య విశాలమైన తటస్థభూమి వుంటుంది అది ఆ ఇద్దరిలో ఏ ఒకరిదీ కాదు, అయితే ఆ తెగలు ఒకే భాష మాట్లాడేవయితే ఈ తటస్థ భూమి అంత విశాలంగానూ వుండదు స్పష్టంగా సరిహద్దులు పెట్టి వుండదు ఆ విధంగా హద్దులమధ్య స్పష్టంచేసిన భూమి కొద్ది అయినా, ఎక్కువైనా అది ఆ తెగది [illegible] కాపాడుకుంటూను దాని హక్కును ఇతర తెగలు గుర్తిస్తాయి.

కాలక్రమంలో తెగకు ఓ పేరు అంటూ స్థిరపడి, ప్రత్యేకతను కూర్చుకుంటుంది. ఆ తెగవారి ఏ ప్రత్యేకతో ఆ పేరుకు కారణం అవుతుంది సాధారణంగా, ప్రత్యేకించి పేరుపెట్ట నక్కర్లేదు ఆ విధంగానే సెనెకాలు "మన్- దా- వా- ఓ- నో,"పెద్దకొండ మీది వాళ్ళు అయారు తుస్కోరోరాల్ని("దుస్- గా- ఓ- వే- ఓ- నో") -చొక్కా తొడిగే వాళ్ళు సిస్సెటాన్‌లు ("సిస్- పే- టో- వాన్") - బురదనేలలో వుండే వాళ్ళు. ఒగలాల్లాలు (" ఓ- గ- లాల్- లా") "మకాములుమార్చే") వాళ్ళు ఒమాహాలు ("ఓ- మా- హా") లు -నదిఎగువవాళ్ళు ఇయోవాలు("పా- హూ-చా") "ముక్కుమసి" వాళ్ళు (పేచీకోర్లు), ఓన్నిటావేలు ("ఎ- నాట్-జా") దూరదూరాల వాళ్ళు చెరోకీలు (శ్యా- లో - కి)- మహాజనులు, షానీలు (సా- వాన్- వాకీ)- దాక్షిణాత్యులు మోహెగాన్‌లు ("మో- హే- కున్- ఏ- ఉక్") - సముద్రం వేపు వాళ్ళు ప్లేవ్ సరస్సు ఇండియన్లు ("అ- చావో- తిన్- నే"), పల్లంలో వాళ్ళు, ఇల్లాగే పేర్లు ఏర్పడతాయి. మెక్సికోలోని గ్రామవాసి ప్రజలలో సోచిమిల్కోలు తమ రివి "పువ్వుల వి త్తనాల జాతి" గా చెప్పుకుంటారు చల్కాన్‌లు తమ్ము 'నోరున్న వాళ్ళను' గా . తెపనెకాలు తమ్ము "వంతెనమీది జనం"గా తెజ్కొకాన్‌లు లేక కుల్హౌస్‌లు తమ్ము 'మాయ గాళ్ళను' గా త్లస్కాలాన్‌లు తమ్ము 'తిండిమనుష్యులను' గా చెప్పుకుంటారు ఆపేర్లకు అర్థాలుఅవే అమెరికా ఉత్తర భాగాన్ని యూరపియనుల ఆక్రమించుకొన్న తర్వాత ఇండియను తెగల వారు తమతెగలకు పెట్టుకున్న పేర్లకు బదులు ఇతర తెగలవారు పెట్టినపేర్లు వాడుకలోకి వచ్చేయి ఫలితంగా ఈవేళ అమెరికను తెగలపేర్లు- చరిత్రకెక్కినవి- వారి స్వంతపేర్లుకావు పెట్టుడుపేర్లు మాత్రమే.

## 2. వారు మాత్రమే మాట్లాడే మాండలిక భాష

తెగ, మాండలికాలు సహజీవనం చేస్తాయి కాని, కొన్ని ప్రత్యేక పరిస్థితులలో ఇందుకుమినహాయింపులుండవచ్చు. ఈనాడు డకోటా జట్లు పన్నెండూ విజానికి వేనికవి తెగలే వాని ప్రయోజనాలు, నిర్మాణాలు భిన్న భిన్నంగానే వున్నాయి కాని అమెరికనుల వారి నివాస మండలాల్ని ఆక్రమించడంచేత వారు మైదానాలలోకి చేర వలసి వచ్చింది అందుచేత తెగలుగా వేరుపడే అవసరం ఏర్పడక ముందే పన్నెండు గురు విడిపోవలసి వచ్చింది. అంతవరకు వారు అతి సన్నిహితంగానే వుండడంచేత మిస్సోరీ నదిమీదున్నవారి టేటాన్ భాషతప్ప కొత్త మాండలికాలు ఏర్పడనేలేదు.

మిస్సిసిపీ నదిమీద వుంటున్న వారి అసలుభాష ఇసౌంటీ. కొద్దిఏళ్ళక్రితం అమెరికాలో కెల్లా పెద్ద తెగ అయిన చెరోకీలు ఇరవయ్యారువేల మందీ ఒకే మాండలికం మాటేవారు. జార్జియాలోని పర్వత ప్రాంతంలో భాషలో తేడా రావడం ప్రారంభమయింది. కాని, అది వేరే మాండలికంగా ఎదగలేదు. ఇల్లాంటి వుదాహరణలు మరికొన్ని వున్నాయికాని, సామాన్య సూత్రం మార్చవక్కరలేదు. ఆదివాసి దశలో తెగ-మాండలికం సహజీవనం చేస్తాయి మొక్కల పెంపకం ఎరగని దశలోనే వున్న పదిహేను వేలమంది ఒకేచోట ఒకే మాండలికం మాట్లాడుతారు. మొత్తం మీద పాతిక వేలమంది వున్న డకోటాతెగలు ఎంతో సన్నిహితంగా వుండే రెండు మాండలికాలు మాట్లాడుతారని పైనచెప్పాను. ఈ తెగలన్నీ చాలాపెద్దవి. అమెరికా సంయుక్త రాష్ట్రాలలోనూ, బ్రిటిష్ అమెరికాలోనూ వున్న తెగలు ఏవీ రెండువేల జనాభాను మించివుండవు.

## ౩. గణాలు ఎన్నుకొన్న శాకెమ్‌లనూ నాయకులనూ పదవిలో స్థిరపరిచే హక్కు

నాయకుల సమితి పదవిలో స్థిరపరిచేవరకూ ఇరాక్వాలలో ఎన్నిక అయినంత మాత్రాన నాయకుడు కాజాలడు. గణాల నాయకులు తెగల సమితిగా ఏర్పడతారు సమష్టిప్రయోజనాలు దాని అధికారంలోనివి. అందుచేత ఆ స్థానానికి నియమించే అధికారం తెగసమితికి ఇవ్వబడింది అయితే సమాఖ్య ఏర్పడ్డాక, గణనాయకుల్ని "పైకి ఎత్తే" అధికారం తెగ సమితి చేతినుంచి సమాఖ్య చేతికి వప్పచెప్పబడింది గణానికి సంబంధించినంతవరకూ పదవిని స్థిరపరిచే పద్ధతి వుపయోగం ఏమిటో చెప్పడానికి మనవద్ద తగిన సమాచారంలేదు. ఇండియను తెగల సామాజిక నిర్మాణాన్ని పూర్తిగా అర్థం చేసుకోవాలంటే తెలుసుకోవలసిన అనేక విషయాలలో అదొకటి మెక్సికోకు ఎగువనవున్న తెగలన్నింటిలో శాకెమ్‌ల నాయకుల స్థానాలు సర్వసామాన్యంగా ఎన్నికతో జరిగేవి; ఖండంలోని ఇతర భాగాలలో కూడా అటువంటి సంప్రదాయమే వుండనేందుకు తగినంత సాక్ష్యం వుంది.

డెలావేర్లలో ప్రతి గణానికీ ఒక (సా — కెమా) శాకెమ్ వుంటాడు. ఆ పదవి గణంలో పారంపర్యంగా వుంటుంది అయినగాక ఇద్దరు మామూలు నాయకులు, ఇద్దరు యుద్ధనాయకులూ వుంటారు. ఈ విధంగా మూడు గణాల నుంచీ పదిహేను మంది తెగ సమితిలో సభ్యులవుతారు.

ఒజిబ్వాలలో సాధారణంగా ఒక్కో గ్రామంలో ఒక గణంవాళ్ళు ప్రముఖంగా వుంటుంటారు. ప్రతి గణానికీ ఒక సాకెమ్ వుంటాడు. ఆ పదవి గణంలో పారం పర్యంగా వుంటుంది గణంలో మామూలు నాయకులు చాలమందే వుంటారు ఒకే గణసభ్యులు చాలమంది ఒకే ప్రాంతంలో వున్నప్పుడు వారిలో నిర్మాణ వ్యవస్థ ఒకే తరహాగా వుంటుంది నాయకులింత మంది వుండాలనే నియమంలేదు. వారి ఆచారాలూ, అలవాట్లూ బోలెడువున్నాయి వాటిని సమగ్రంగా పరిశీలించనే లేదు ఇండియను తెగలు చాలావాటిలో శాకెమ్‌లా, నాయకులా ఎన్నిక జరగడం, పదవిలో స్థిర పరచడం వుంది వాటిని గురించి తెలియడం చాల వుపయోగకరం శాకెమ్‌లనూ, నాయకులనూ "పైకిఎత్తే" ఇరాక్వాల పద్ధతిని వచ్చే ప్రకరణంలో రాస్తాను

4. శాకెమ్‌లనూ, నాయకులనూ పదవి నుంచి తొలగించే హక్కు.

శాకెమ్‌లూ, నాయకులూ ఏగణంవారో ఆ గణానికే ప్రధమంగా ఈ హక్కు వుంటుంది అయితే తెగ సమితికి ఈ హక్కువుంది గణ నిర్ణయాలకు విరుద్ధంగా కూడా తెగసమితికి ఆటవిక యుగంలోనూ, అనాగరిక యుగం దిగువ మధ్యదశల లోనూ తప్పు చెయ్యకపోతే ఈ పదవి ఎన్నుకొన్న వ్యక్తికి జీవితాంతం వుంటుంది. ఎన్నుకొన్నాక, ఆ పదవి ఇన్నేళ్ళకు మాత్రమే వుండాలని నియమించే పద్ధతిని అప్పటికి మానవ జాతి నేర్చుకోలేదు అందుచేత స్వయంపాలన సూత్రాన్ని అమలు జరపడానికై పదవినుంచి తొలగించే హక్కు అతిముఖ్యం అయింది ఈ హక్కు గణమూ, తెగల సర్వతంత్ర స్వతంత్రతను ధృవపరుస్తోంది. సర్వతంత్ర స్వతంత్రత గురించి వారికో స్పష్టమైన భావం లేకపోయినా వాస్తవానికి అదివుంది

5 ఒక మతవిశ్వాసమూ, పూజాపద్ధతీ వుంటుంది.

అనాగరిక ప్రజల మాదిరిగా అమెరికను ఇండియనులూ మత విశ్వాసాలు కలిగివున్నవారే సంవత్సరంలో ఒక్కొక్క ఋతువులో తెగలు తమ మతం పండుగలను జరుపుతారు దేనికి దానికి వారిపూజా పద్ధతులు, కొలుపులు, నృత్యాలు, ఆటలు వుంటాయి చాలతెగలలో వైద్యమందిరం వద్ద ఈ కార్యకలాపాలు అన్నీ సాగుతాయి. ఈ వుత్సవాలమీద జనంలో ఆసక్తి కలిగించేందుకై అందుకు ముందే కొన్ని వారాలు-కొన్ని నెలలపాటు వైద్యమందిరం వాటిని గురించి ప్రకటిస్తుంది అది మామూలు. ఆదివాసుల మతవిధానం గురించి కూడా విశేష పరిశీలన జరగలేదు. భవిష్యత్తులో పరిశోధకులు కష్టపడితే ఎంతో సమాచారం దొరుకుతుంది. ఈ తెగలలో పెంపొందిన

మత విశ్వాసాలూ, కొలుపుల పద్ధతులూ మానవజాతి అనుభవాలలో ఒక భాగం మత విశ్వాసాల తారతమ్య విజ్ఞానంలో వీటికి చాల ప్రాధాన్యం వుంటుంది

వారి మతం కొంచెం ఇంచుమించు అస్పష్టం అనిర్దిష్టం వట్టి మూఢ విశ్వాసాలమయం ప్రధాన తెగలలో పూజాక్రమం ఛాయా మాత్రంగా కనిపిస్తుంది పురోగమించిన తెగలు బహుదేవతాకం. ఉదాహరణకు ఇరాక్వాలు దేవ దేవుడు(great spirit) ఒకడున్నాడు -అనీ, పెద్దమ్మ (అనిష్ట దేవత) ఉన్నదనీ, ఎందరో చిల్లర దేవుళ్ళు వున్నారనీ, ఆత్మ అనశ్వరం అనీ, పునర్జన్మలున్నాయనీ నమ్ముతారు వారి దేవ దేవుడు మనుష్యరూపి. పెద్దమ్మ (హె-నో) కూడా అంతే. ఉరుముల దేవుడుగా -ఓహ్ గాలిదేవుడు ఒకడు వున్నారు మొక్కజొన్నల దేవత, చిక్కుళ్ళదేవత, దోసలదేవత- వీరుముగ్గురూ అక్కచెల్లెళ్ళు వీరిని ఉమ్మడిగా "మన ప్రాణదాతలు" "మనపోషకులు"- అనిపిలుస్తారు వీరుగాక అనేక మంది వృక్షదేవతలు, మొక్కల దేవతలు, నదులు, వాగులదేవతలు వున్నారు ఈ అసంఖ్యాక దేవతల ఉనికి గురించీ, లక్షణాల గురించీ ఊహలు మాత్రమే వినిపిస్తాయి అనాగరిక యుగం దిగువదశ ప్రజలలో దేవతా విగ్రహాల పూజలు తెలియవు గత శతాబ్ది చివరిలో సెనెకా-ఇరాక్వాలు అల్లెఘనీ నది మీద వున్న ఒక గ్రామంలో కర్రబొమ్మను పెట్టి దానిచుట్టూ పూజా పునస్కారాలు జరిపి, నృత్యాలుచేసి, దానిని నదిలో పారవేయగా చూసినట్లు విలియం పార్కర్ అనే ఆయన నాకు చెప్పేరు. అయితే ఆ విగ్రహం ఏదేవతదో ఆయన తెలుసుకోలేదు. అజ్టెక్‌లకు స్వంత దేవతలు, ఆ దేవతలకు విగ్రహాలు, గుడులు పూజలు వున్నాయి. వారి మత వ్యవస్థ సవివరంగా తెలుసుకో గల్గితే ఇండియన్ తెగలలో సాధారణంగా కనిపించే నమ్మకాల నుంచి మతం ఎలా పెరిగిందో తెలియవచ్చు

నాట్యం, నృత్యం అనేది అమెరికను ఆదివాసుల కొలుపుల పద్ధతులలో ఒకటి అన్ని మతం పండుగులలో అదొకభాగం. ఈ భూమిమీద మరెక్కడా, అనాగరిక ప్రజలలో నృత్యం అంతగా వృద్ధి పొందలేదు ప్రతి తెగకూ పదినుంచి ముప్పయి వరకూ నృత్యరూపాలున్నాయి. ప్రతిదానికీ ఓ పేరు పాటలు, వాద్య విశేషాలు ఉంటాయి అడుగువేసేపద్ధతి, మనుష్యులు నిల్చునేవిధము, దుస్తులు అన్నీ ప్రత్యేకంగా వుంటాయి వానిలో యుద్ధ నృత్యం అన్నది అన్ని తెగలకూ ఒక్కటే కొన్ని కొన్ని నృత్యాలు ఒక గణానికో, ఒక తెగకో, లేక యుద్ధం కోసం ఏర్పడిన జట్టుకో, స్వంతం. ఈ జట్లలోకి మధ్య మధ్య కొత్త వాళ్ళని తీసుకుని శిక్షణ నిస్తుంటారు,

దకోటాలు, క్రీఋ, ఒజిబ్వాలు, ఇరాక్వాలు, న్యూ మెక్సికోలోని గ్రామ వాసి ఇండి యన్లలో నృత్యాలు, నాట్యాలు లక్షణంలో అడుగువెయ్యడంలో, మనుష్యుల కూర్పులో సంగీతంలో ఒకే విధంగా వుంటాయి మనకి తెలిసినంతవరకు అజ్టెక్ లలోనూ అంతే ఇండియను తెగలన్నింటిలోనూ వున్న ఈ పద్ధతి కొలుపులే వారి విశ్వాసాలకు కొలుపులకు మధ్య పరస్పర సంబంధం వుందని చూపుతున్నాయి.

## 6 నాయకుల సమితి ద్వారా సర్వస్వతంత్ర పాలనా వ్యవస్థ.

గణాల నాయకులతో సహజంగానే ఏర్పడిన సంస్థ తెగ సమితి అది ఒక అవసరం కోసం ఏర్పడింది. కనక గణ వ్యవస్థ వున్నంత వరకూ వుండేదే గణానికి దాని నాయకులు, ప్రతినిధులు, అలాగే గణ నాయకులతో ఏర్పడిన సమితి తెగకు ప్రతినిధి సామాజిక నిర్మాణానికి అదొక శాశ్వత లక్షణం తెగమీద సర్వాధికారాలూ దానివి అందరికీ తెలిసే పద్ధతిలో దానిని సమావేశ పరుస్తారు ప్రజల మధ్య అది జరుగుతుంది దానిలో ఎవరైనామాట్లాడవచ్చు అది జనం పలుకుబడికింద పనిచేస్తుంది. కొందరు పెద్దల పెత్తనంకింద సాగే పాలనలా కనిపించినా,అది ప్రజాప్రతినిధుల వ్యవస్థ. దానికిప్రతినిధుల్ని జీవిత కాలవ్యవధికి ఎన్నుకుంటారు కాని,వారిని తొలగించే హక్కు వుంటుంది గణంలో సోదర భావం వుండటం, పదవులకు మనుష్యులను ఎన్నుకొనే పద్ధతి, ప్రజాతంత్ర సూత్రానికి బీజాలూ, ప్రాతిపదికాను అభివృద్ధి ప్రారంభ దశలోవున్న అన్ని గొప్పగొప్ప నియమాల లాగే ఇదీ అంత పరిణత రూపంలోకి వృద్ధిపొందలేదు అయినా మానవ జాతిలో తెగల నాటి మంచి వున్నదన్న ప్రతిష్ఠ దీనికుంది.

తెగ యొక్క ఉమ్మడి ప్రయోజనాలను కాపాడి రక్షించే బాధ్యత సమితికి వుంది ప్రజలకున్న తెలివీ, ధైర్య సాహసాలూ, సమితి యొక్క విజ్ఞతా, దూరదృష్టీ వీటిమీద తెగయొక్క పెంపూ, బతుకూ ఆధారపడి వుంటాయి ఇతర తెగలతో జరిపే నిర్విరామ యుద్ధాల సర్వసాధారణంగా అనేక సమస్యలూ, అక్కరలూ, పుట్టుకొస్తుంటాయి వాటిని ఎదుర్కొనేందుకూ, పరిష్కరించేందుకూ ఈ లక్షణాలన్నీ కావలసిందే అందుచేత తప్పని సరిగా ప్రజాభిప్రాయలక్షణం ప్రధానంగా కావలసే వుంటుంది. సమితి సమావేశంలో పలుగురికీ సంబంధించిన సమస్య మీద ఎవరైనా మాట్లాడవచ్చు తమకు నమ్మకం వున్న మనిషిద్వారా స్త్రీలు కూడా తమ అభిప్రాయాల్ని సమితి ముందు పెట్టవచ్చు అయితే నిర్ణయం చేయవలసింది సమితి.

ఇరాక్వ్యాలలో దాని నిర్ణయాలు ఏకవాక్యత మీద జరగడం అనేది ఒక ప్రాథమిక సూత్రం. అయితే అది అందరిలోనూ అంతేనా అంటే చెప్పలేను

సైనికచర్యలలో సాధారణంగా వ్యక్తి స్వాతంత్ర్యాన్ని పాటిస్తారు శాంతి ఒప్పందం జరిగి వుండక పోతే ప్రతి తెగా రెండో దానితో యుద్ధస్థితిలో వున్నట్లే లెక్క. ఎవ్వరైనాసరే పదిమందిని పోగుచేసి తనకు తోచిన వారిమీదికి దాడికిపోవచ్చు. యుద్ధనాట్యం ఏర్పాటుచేసి, తన ఆలోచనను ప్రకటిస్తాడు వచ్చేవాళ్ళని రమ్మంటాడు ఆ ప్రయత్నానికి ప్రజలలో ఎంతబలం వుందో దీని వలన తేలిపోతుంది రాదలచిన వాళ్ళు యుద్ధనాట్యంలో పాల్గొంటారు. తగినంత మంది సమకూడేరా, మహోత్సాహంతో అక్కడి నుంచి అల్లాగే యుద్ధానికి వెళ్ళిపోతారు ఒక తెగ మీద ఎవరన్నా దాడిచేసే ప్రమాదం వున్నప్పుడు, దాడిని ఎదుర్కొనడానికి ఇదే విధంగా యుద్ధదళాలను ఏర్పాటు చేసుకుంటారు ఆ విధంగా బలగాన్ని సమకూర్చి నప్పుడు అవి ఒకే జట్టుగా కలిసి పనిచేస్తాయి ఆ కెప్టెన్‌లసమితి వారు ఏం చెయ్యాలో విధిస్తుంది వారిలో ఆదివరకే పేరు ప్రఖ్యాతులు గడించిన యోధుడు వుంటే అతడు సహజంగానే వారికి నాయకత్వం వహిస్తాడు అనాగరిక యుగం దిగువ దశలో వున్న తెగలలో జరిగే పద్ధతిని గురించినది ఇదంతా అజ్‌టెక్‌లూ, త్లస్కాలాన్‌లూ ప్రాత్రీలుగా యుద్ధాలకు వెడతారు ప్రతి దళానికి దాని నాయకుడుంటాడు అతని జెండావేరు దుస్తులు వేరు

ఇండియను తెగలకు, చివరకు సమాఖ్యలకు కూడ యుద్ధచర్యలకు తగిన నిర్మాణాలు లేవు ఇరాక్వ్యాలవీ, అజ్‌టెక్‌లవీ, సైన్యదళాలు దాడులలో చాల ప్రసిద్ధి పొందేయి. ఇరాక్వ్యాలూ, అజ్‌టెక్‌లూతో సహా అనాగరికయుగం దిగువ దశలోని తెగలలో చిన్న చిన్న యుద్ధదళాలు నిరంతరం దూర దూర ప్రాంతాల కంటా దాడులు జరిపి ఎంతెంతో విధ్వంసం చేశారు ధాన్యం వేయించి పిండిచేసి మూటకట్టి మొల దట్టీకి కట్టుకుంటారు. దారిలో దొరికినవేట, చేపలు, ఈ పిండి వారికా దండయాత్రా కాలంలో తిండి ఇల్లా దండ యాత్రలకు బయలుదేరడం, తిరిగివచ్చిన వారికి తెగవారు చేసే సన్మానం ఇవే ఇండియనుల జీవితాలలో ప్రముఖ ఘటనలు ఈ విధంగా దాడి బయలు దేరడానికి సమితి అనుమతి కోరరు అవసరమూ లేదు.

## 7 కొన్ని సందర్భాలలో తెగకు ప్రధాన నాయకుడు

కొన్ని ఇండియను తెగలలో శాకెమ్‌లలో ఒకరిని నాయకుల పెద్దగా గుర్తిస్తారు. అతని తోటివారిలో ఉన్నతమైన స్థానం. సమితి సమావేశాలు లేని

సమయంలో తెగకు ప్రతినిధిగా వ్యవహరించేందుకు నాయకత్వ అధికారంలో ఒక వ్యక్తి వుండవలసిన సందర్భాలు ఏర్పడుతుంటాయి. అయితే ఈ పదవికి గల బాధ్యతలూ అధికారాలూ, కూడ స్వల్పం సమితి సర్వోచ్చ అధిపత్యం వున్నా, అది ఎప్పుడోగాని సమావేశం కాదు మధ్యకాలంలో తెగ తరపున తాత్కాలికంగా చర్య తీసుకోవలసిన సమస్య లేవో వుత్పన్నం అవుతాయి ఆ సందర్భంగా ఒక నాయకపెద్ద కావలసివచ్చేరు అయితే ఈయన చేసే పనులను అటు తరవాత సమితి అంగీకరించవలసి వుంటుంది. నాయకపెద్ద పదవి ఏర్పడటానికి నాకు తెలిసినంత వరకు మరో కారణం కనబడలేదు ఈ పదవి కొన్ని తెగలలో కనిపించింది కాని చట్ట నిర్వహణాధికారి స్థానంకన్నా దిగువ స్థానమే దానిది. కొంతమంది రచయితలు వారిని రాజులంటూ పేర్కొన్నారుగాని, నిజానికి వారి అధికారం నామ మాత్రం మాత్రమే. ప్రధాన చట్ట నిర్వహణాధికారి కావాలనే ప్రభుత్వ యంత్ర పరిజ్ఞానము ఇండియను తెగలలో ఏర్పడలేదు. ఇరాక్వా తెగలలో నాయకపెద్ద లేనేలేడు. సమాఖ్యకు ఒక చట్ట నిర్వహణాధికారీ లేడు. నాయకుడిని ఎన్నుకోవలసి వుండడమూ, అతనిని తొలగించే హక్కు వుండడమూ అనేవి ఆ పదవి లక్షణాలను స్థిర పరుస్తున్నాయి

ఇండియను నాయకుల సమితికి వున్న ప్రాముఖ్యమే స్వల్పం. అయితే అది ఈనాటి పార్లమెంటుకు కాంగ్రెసుకు, శాసనసభకు బీజ ప్రాయమైనది గనక, దానికి మానవ జాతి చరిత్రలో ప్రాముఖ్యం వుంది. అంతవరకే.

అటవికయుగంలో గణనిర్మాణంలోనే ప్రభుత్వ భావన పెరుగుదల ప్రారంభం అయింది దాని ప్రారంభానికీ, నాగరికత వచ్చి రాజకీయ సమాజ నియమాలు ఏర్పరచు కొనే వరకు మధ్యకాలంలో జరిగిన అభివృద్ధి క్రమంలో మూడు ప్రధాన మజిలీలు కనిపిస్తున్నాయి గణాలు ఎన్నుకొన్న నాయకులతో తెగ సమితిని ఏర్పరచడం మొదటి మజిలీ. దానిని ఏకాధికారం లేక సమితి అధికారం అనవచ్చు. అనాగరిక యుగం దిగువ దశలోవున్న తెగలన్నింటా సర్వ సాధారణంగా ఇదివుంది నాయకుల సమితీ, సైన్య నాయకుడూ తమ మధ్య పని వ్యవహారాలను సమన్వయ పరుస్తుండిన దశ రెండోది. వీనిలో ఒకటి పౌర వ్యవహారాలనూ, రెండోది సైనిక బాధ్యతలనూ నిర్వహించుతాయి ఈ రెండో మజిలీ అనాగరికయుగం దిగువ దశలోనే, సమాఖ్యలు ఏర్పడ్డాక ప్రారంభమయింది అనాగరిక యుగం మధ్య దశలో దాని రూపం స్పష్టమయింది. రాజు, చక్రవర్తి, అధ్యక్షుడు వంటి స్థానాలకు ప్రధాన సైన్యాధి

పతి స్థానం బీజరూపం దానిని ద్వంద్వ ప్రభుత్వం అనవచ్చు. నాయకుల సమితి ప్రభుత్వం, సేనాధిపతి ప్రభుత్వం మూడో మజిలీ నాయకుల సమితి ద్వారా ప్రజల ప్రభుత్వం, ప్రజలసభ, సర్వ సైన్యనాయకుడు అనాగరికయుగం ఎగువదశకి చేరిన ప్రజలలో ఇది కనిపించింది ఉదాహరణకు హోమర్ కాలం నాటి గ్రీకులలో, రోములస్ కాలంనాటి ఇటాలియన్ తెగలలో, జనాభా బాగా పెరిగింది కోటలు కట్టుకొని నివసిస్తున్నారు ధనమూ, పశు సంపదా ఏర్పడింది వీని ఫలితంగా ప్రజాసభ అధికార నిర్వహరణకై ఏర్పడింది నాయకుల సమితులు ఇంకా వున్నాయి. ప్రజలే వీనిని కోరి నిలుపుకున్నారు ప్రజావసర చర్యలను గురించి వీరు ప్రజాసభముందు తమ ప్రతిపాదనలను పెడతారు. ఆ ప్రజాసభ వానిని ఆమోదించవచ్చు నిరాకరించనూ వచ్చును. అందుకే అది ప్రజాసభ అయితే ఈ సభ ఏ చర్యలకూ పూనుకోదు. ఆమోదమో, నిరాకరణో అంతవరకే దాని నిర్ణయానికి తిరుగులేదు. అది రంగంమీదికి వచ్చినప్పటి నుంచి ప్రభుత్వ వ్యవస్థలో అది సుస్థిరంగా వుండి పోయింది సమితి ఇప్పుడు ముఖ్యమైన ప్రజావసర చర్యలను ఆమోదించలేదు చట్టాలను రూపొందించే ఆలోచనా ప్రధానమైన సంస్థగా మాత్రమే వుంటుంది. ఆ చట్టాలకు అధికార బలం ఇచ్చేది ప్రజాసభ. దీనిని త్రితయ ప్రభుత్వం అనవచ్చు ఆలోచనా సమితి, ప్రజాసభ, సైన్యాధిపతి-ఇవీ త్రితయం రాజకీయ సమాజం ఏర్పడే వరకూ ఇది కొనసాగింది. తరవాత ఉదాహరణకు — అథీనియన్లలో నాయకుల సమితి సెనేట్ అయింది. ప్రజాసభ (ecclesia) అలాగే వుండింది. అవే ఈ నాటికి వచ్చేసరికి పార్లమెంటు రెండుసభలు అయినాయి. విధానసభలు, శాసనసభలు సర్వ సైన్యాధ్యక్ష స్థానం నేటి ప్రధాన కార్యనిర్వహణాధికారి పదవికి బీజరూపం అని చెప్పేను

మరల మొదటికి వస్తే, తెగలో జనాభా పరిమితం. బలం తక్కువ వనరులూ తక్కువే. అనాగరికయుగం దిగువ దశలో మానవుని స్థితి గతులకది వుదాహరణ. మధ్యదశలో జనాభా పెరిగింది వారి పరిస్థితి మెరుగయింది అయితే చెప్పదగిన మార్పులేదేమో గణ సమాజమే కొనసాగింది అభివృద్ధి రాలేదు గనక రాజకీయ సమాజం ఏర్పడలేదు తెగలూ, తెగలలో గణాలూ అల్లాగే వున్నాయి. కాని సమాఖ్యలు అధికంగా ఏర్పడుతున్నాయి మెక్సికోలోయ వంటిచోట్ల ఒకే ప్రభుత్వం కింద అధిక జనాభా వున్నారు వారి జీవిత పద్ధతులూ మెరుగయాయి. అయితే వారు కూడా గణసమాజాన్ని తోసేసి, రాజకీయ సమాజాన్ని ఏర్పరచుకొన్న దాఖలాలు లేవు గణాలుండగా రాజకీయ సమాజమూ, రాజ్యాంగమూ ఏర్పడడం అసంభవం.

రాజ్యము అన్నది వ్యక్తులతో గాక ప్రాంతాలతో ఏర్పడుతుంది సామాజిక వ్యవస్థకు యూనిటుగా గణాలుంటాయి రాజకీయ వ్యవస్థకు యూనిటుగా పట్టణంమీద ఆధారం పడుతుంది రాజ్యం వ్యవస్థలలో అంత మూలమట్టు మార్పురావాలంటే అమెరికను ఇండియను తెగలకు ఇంకా ఎంతో కాలం పడుతుంది. ఎంతో అనుభవమూ కావాలి. దానికి గ్రీకుల, రోమనుల మానసిక స్థాయిగల మనుష్యులు కావాలి తమ పూర్వులు తరతరాలపాటు సాధించిన అనుభవాలతో నేడు నాగరిక దేశాలు తాము జీవిస్తున్న నూతన తరహా ప్రభుత్వ రూపాలకు రూపం ఇచ్చి క్రమంగా అమలులో పెట్టేరు

మనం ఇప్పుడు నిర్మాణాల వరసక్రమంలో తెగల సమాఖ్యను గురించి పరిశీలించ వలసివుంది గణాలు, ఫ్రాట్రీలు, తెగలూ — వీనికి సమాఖ్యతో వుండే సంబంధాలు కొత్తగా వుంటాయి అనాగరిక యుగంలో మానవజాతి పరిస్థితులకూ, అవసరాలకూ గణ వ్యవస్థ ఎంత అద్భుతంగా కుదురుకుందో ముందు పేజీలలో ఇంకా స్పష్టంగా వ్యక్తమవుతుంది.

# ఐదో ప్రకరణం

# ఇరాక్వ్యాల సమాఖ్య

సమాఖ్యల సహజమైన పెరుగుదలలు - గణ సమానత్వమూ, భాషా సమానత్వమూతో ఏర్పడతాయి- ఇరాక్వా తెగలు - న్యూయార్కులో వారి నివాసము- సమాఖ్యగా ఏర్పడడం- దాని స్వరూపము, నిర్మాణ సూత్రాలు- ఏభయి శాకెమ్ పదవుల ఏర్పాటు- కొన్ని గణాలలో ఆ పదవుల పారంపర్యం చేశారు- తెగకు పదవుల సంఖ్య కేటాయింపు- ఈ శాకెమ్‌లే సమాఖ్య సమితిగా ఏర్పడ్డారు- పౌరసమితి- అది వ్యవహరించే తీరు- దాని వ్యవహారానికి ఏకవాక్యం అవసరమైన సందర్భాలలో-శాకెమ్‌లను "పైకి ఎత్తే" పద్ధతి- సాధారణ సైన్య నాయకులు- ప్రధాన కార్య నిర్వహణాధికారి పదవికి ఇది బీజప్రాయం - ఇరాక్వ్యాల మేధాశక్తి

పక్కపక్కనే వుంటున్న బంధు గణాలు పరస్పర రక్షణకోసం సమాఖ్యగా ఏర్పడడం సహజంగానే జరుగుతుంది అనుభవం ద్వారా కలిసి వుండడంలోని లాభాన్ని తెలుసుకున్నాక, ప్రథమంలో కూటమిగా ఏర్పడ్డవారు క్రమంగా సమాఖ్యలో ఏకం అవుతారు. నిరంతర యుద్ధ స్థితి వుండే ఆ దశలో బాగా తెలివితేటలు సంపాదించుకొని, జీవితంలో మెలకువలు, వాని ప్రయోజనాలు అర్థం చేసుకున్నవారిలో ఈ మార్పు త్వరితంగానే వచ్చేస్తుంది గణాలను తెగగా ఐక్యం చేసిన సూత్రమే ఇక్కడా ఒక దిగువస్థాయి నిర్మాణం ఎగువ స్థాయికి పెరుగుతుంది.

ఉత్తర అమెరికాను కనుగొన్న నాటికి అక్కడ వివిధ ప్రాంతాలలో అనేక సమాఖ్యలు ఏర్పడి వున్నాయి. వాని నిర్మాణ స్వరూపం, స్వభావం చాల గణనీయం వీనిలో ఇరాక్వ్యాల సమాఖ్య అయిదు స్వతంత్ర తెగలతో ఏర్పడింది. ఆరు తెగలతో క్రీక్‌ల సమాఖ్య, మూడింటితో ఒట్టావా, "ఏడు సమితి- అగ్ను"లతో దకోటా కూటమి, ఏడు గ్రామాలతో న్యూ మెక్సికోలో

మోకీ సమాఖ్య, మెక్సికో నదీ లోయలో మూడు తెగలతో అజ్టెక్ సమాఖ్య ఏర్పడి వున్నాయి మెక్సికో ఇతర భాగాలలోనూ, మధ్య, దక్షిణ అమెరికాలోనూ వున్న గ్రామవాసి ఇండియన్లలో రెండేసి, మూడేసి బంధుతెగలు కలిసి సమాఖ్యలుగా ఏర్పడే వుంటాయనుకోవచ్చు. వారి నిర్మాణాల స్వభావాన్నిబట్టీ, వారిలో వస్తున్న క్రమాభివృద్ధి గతిని బట్టీ ఈ పరిణామం తప్పనిసరి అయినా, ఆ జనంతో ఆ అస్థిరమైన భౌగోళిక సంబంధాలతో సమాఖ్యలుఏర్పడడం కష్టమే గ్రామ వాసి ఇండియన్ల గ్రామాలు దగ్గర దగ్గరగా వుండడం వల్లనా, వారి నివాస ప్రాంతాలు చిన్న చిన్న విస్తీర్ణం కలవి కావడంవల్లనా గ్రామవాసి ఇండియన్లలో సమాఖ్యలు ఏర్పడడం సులువు. కాని, అక్కడక్కడ అనాగరిక యుగం దిగువదశలో వున్న ఇరాక్వ్యా తెగల వంటివి సమాఖ్యలుగా ఏర్పడడం కనిపిస్తుంది సమాఖ్య ఏర్పడింది అంటే అది ఆ ప్రజల మేధా పరిణతిని సూచిస్తుంది.

ఉత్తర అమెరికాలోని ఇండియన్ తెగల సమాఖ్యలకు ఇరాక్వ్యా, అజ్టెక్ తెగల సమాఖ్యలు మంచి వుదాహరణగా చెప్పాలి. వానికిగల సైనిక సామర్థ్యంబట్టీ, భౌగోళికంగా అది ఉన్నస్థితిని బట్టీ అవి, రెండూ చాల మంచి ఫలితాలనే సాధించేయి ఇరాక్వ్యా సమాఖ్య నిర్మాణం గురించీ, దాని నియమాలు గురించీ మనకు స్పష్టంగా, సమగ్రంగా తెలుసును. కాని రెండోదానిని గురించి అంతబాగా తెలియదు. అజ్టెక్ సమాఖ్య చరిత్ర విషయంలో అంత శ్రద్ధ తీసుకొని వుండక పోవడం చేత అది రక్షణకూ, దాడులకూ గాను మూడు బంధు తెగలు ఏర్పరచుకున్న కూటమి మాత్రమేనా, ఇరాక్వ్యాల సమాఖ్యలాగ క్రమ బద్ధమైనదా -అనేది సందేహంగానే మిగులుతూంది. ఇరాక్వ్యాల సమాఖ్యకు సంబంధించి వ్రాసేది, బహుశా అజ్టెక్ సమాఖ్యకూ సరిపడ వచ్చుననీ, ఒకదాన్ని గురించి తెలుసుకుంటే రెండోదాన్ని గురించీ తెలుస్తుందనీ అనుకోవచ్చు

సమాఖ్యలు చాల సామాన్యములైన పరిస్థితులలో ఏర్పడతాయి. వాని నియమ నిబంధనలు కూడా అది సామాన్యం అదివరకు వున్న నిర్మాణాల నుంచే అవి కాల క్రమంలో పుట్టి పెరుగుతాయి. ఒక తెగ అనేకంగా విభజితమై, అవన్నీ ఒకదాని పక్కనొకటి స్వతంత్రంగా వుంటున్న దశలో, తెగకన్న వున్నతమైన నిర్మాణంగా సమాఖ్య వాని నన్నింటినీ కలుపుతుంది దీనికి కావలసినవి రెండు గణాలన్నిటికీ మూలం ఒక్కటే అయివుంటుంది. వారు మాట్లాడే మాండలికాలన్నింటికీ మూలభాష ఒకటై వుంటుంది. గణాలలో వుండె బంధుత్వపు అనుబంధమూ, పరస్పరం అర్థం

చేసుకోడానికి అవకాశం మిగిలిన మాండలికాలూ సమాఖ్యగా ఏర్పడడానికి కావలసిన హంగులన్నీ సమకూరుసాయి అందుచేత సమాఖ్యకు కేంద్రం గణాలు. మూలభాష దానికి ఆచ్ఛాదనం. మూలభాష నుంచి వచ్చిన మాండలికాలుగాక ఇతరమైనవి సమాఖ్య లలో చేరిన వుదాహరణలు కనిపించవు ఈ సహజ సరిహద్దులను అధిగమిస్తే భిన్న భిన్న గణాలు నిర్మాణంలోకి వస్తాయి. ఏదో తెగలో మిగిలిపోయిన కొద్దిమంది, భాష ఒకటి కాక పోయినా సమాఖ్యలో చేరిన ఘటనలున్నాయి. ఫ్రెంచివారి చేతిలో ఓడి పోయిన నాచెజ్ తెగ క్రీక్ సమాఖ్యలో చేరిన వుదాహరణ కనిపిస్తుంది కాని ఇది సర్వసామాన్యం కాదు తెగలు, గణాలతో ఏర్పడిన సమాఖ్య ద్వారా అమెరికా ఖండంలో ఇండియనుల అధికారం ఏర్పడాలంటే అక్కడున్న వన్నీ ఒకే మూలం నుంచి వచ్చిన గణాలు అయివుండాలి మూల భాషలు అనేకం వుండడమే ఆ విధంగా జరగ లేదనడానికి సూచన ఒక గణంలోనో, తెగలోనో సభ్యత్వం వుండడమూ, భాషాసామ్యం వుండడమూ తప్ప సమాన హోదాలో సమాఖ్యలో సభ్యులై వుండేం దుకు అవకాశం లేదు.

గణ సంస్థలతో భూమిమీద ఎక్కడాకూడ అనాగరిక,యుగం దిగువ, మధ్య ఎగువ దశలకాలంలో సహజ క్రమంలో రాజ్యం అనేది ఏర్పడడం అసంభవంఅని పై దానిని బట్టి చెప్పవచ్చును నేను చర్చాప్రారంభంలోనే ఇలా తేల్చి చెప్తున్నానంటే కారణం గణాలు, ఫ్రాట్రీలు, తెగలుగా ఏర్పడిన పురాతన సమాజం యొక్క నియమ నిబంధనలమీద దృష్టి బాగా లగ్నం అయ్యేటట్లు చెయ్యడానికే గణాలకీ, రాజరికానికీ పొత్తుకుదరదు రాజరికం అన్నది తరవాతికాలపు నాగరిక దశకు చెందినది అనాగరిక యుగం ఎగువ దశలో గ్రీకు తెగలలో నిరంకుశత్వాలు కనిపించేయి అవి అన్యాయ అధికార అపహరణలూ, ఆక్రమణలూ ఫలితాలయినా, కాని వానిని ప్రజలు అన్యాయమనే పరిగణించేరు గణ సమాజంలోని భావాలకు అవి వ్యతిరేకం. గ్రీకు తెగలలో వచ్చిన దౌర్జన్య పూరిత నిరంకుశాధికారాలు దురాక్రమణ ఫలితాలు అవి తరువాతి కాలపు రాజరికాలకు బీజాలు. వీరయుగం నాటి రాజరికాలు సైనిక ప్రజా తంత్రాలు తప్పవేరుకాదు

నేర్పరితనంగా, చట్టాల బలంతో సహజ క్రమంలో సమాఖ్య ఎలా ఏర్పడు తుందో ఇరాక్యూలను చూసి గ్రహించగలం వీరు మొదట మిస్సిసిపీ నది ఆవల నుంచి వలస వచ్చేరు బహుశా డకోటా తెగలలో ఒక శాఖ అయివుంటారు సైంట్ లారెన్స్ నదీ లోయలోకి వచ్చి మాంట్రీల్ సమీపంలో స్థిర పడ్డారు. అయితే చుట్టూ

వున్న తెగలు పేచీపెట్టడంతో అక్కడినుంచి వచ్చేసి న్యూయార్కు రాష్ట్రం మధ్య ప్రాంతానికి చేరేరు. అప్పటికి వారి సంఖ్య కొద్ది ఒంటారియో సరస్సు తూర్పుఒడ్డునే పడవల్లో ప్రయాణించి ఓస్వెగో నదీ ముఖద్వారం వద్ద తమ మొదటి వలస ఏర్పరచు కొన్నారు అక్కడ తమ అలవాటు పద్ధతిలో చిరకాలం వున్నారు అప్పటికి వారు మూడు భిన్న తెగలుగా వున్నారు. వారిలో ఒకరు కన దిగువా సరస్సు ముఖద్వారంలో మకాం ఏర్పరచుకొని సెనెకాలుగా పిలవబడ్డారు మరో తెగ, ఒనాందాగా లోయలో చేరి ఒనాందాగా తెగ అయింది మూడోది తూర్పుగా వెళ్ళి ఉటికా మండలంలోని ఒనీడా సమీపంలో మొదటి మకాం చేసింది వారిలో అధికభాగం మోహాక్ నదీ లోయకు వెళ్ళి స్థిరపడ్డారు వారు, మోహాక్‌లు అయారు ఒనీడాలో వుండి పోయిన వారు ఒనీడాలు అయారు. ఒనాందాగాలలో కొందరు కయూగా సరస్సు తూర్పుతీరాన స్థిర పడ్డారు వారు కయూగాలు ఇరాక్వాలు రాక పూర్వం న్యూయార్కు అల్గోంకిన్ తెగల ప్రదేశం అవితోస్తుంది. ఇరాక్వాలే చెప్పే కథన్నిపట్టి వారు అంతకు పూర్వం అక్కడున్న వారిని తరిమేశారు క్రమంగా తూర్పున హడ్సన్ వరకూ, పడమట జెనెసీ వరకూ తమ వలసలు విస్తరింప చేశారు న్యూయార్కు చేరిన చాలాకాలం వరకూ ఒక కూటంగా వుండి తమ శత్రువులతో పోరాటాలు జరిపేరు. ఆ క్రమంలో సమాఖ్యగా ఏర్పడితే వుండే ప్రయోజనాలు గ్రహించి చాలాకాలం తర్వాతనే సమాఖ్యగా ఏర్పడినట్లు చెప్పుకుంటారు. వారు గ్రామాలు కట్టుకొని నివసించేవారు గ్రామాలచుట్టూ కొయ్య గసికలతో దడులు కట్టుకొనే వారు. చేపలు, వేట, పరిమితమైన పెరటి తోటల్లో పండే వాటితో బతికేవారు వారి సంఖ్య ఎప్పుడూ 20 వేలకు మించలేదు. చాలీ చాలని తిండి, నిరంతర యుద్ధాలు మూలంగా గ్రామ వాసి ఇండియనులతో సహా ఆదివాసి తెగల జనసంఖ్య తరిగి పోతూనే వుంటుంది అనాడు న్యూయార్కు అడవుల మయం వాటిలో వుండేవారు ఇరాక్వాలు. వారిని 1608లో మొదట కనుక్కున్నారు 1651-55 ల మధ్య తమ జ్ఞాతి తెగలైన ఈరీలను జెనెసీ నదికీ ఈరీ సరస్సుకి మధ్యనున్న ప్రాంతం నుంచి తరిమేశారు కొద్దికాలం తరవాత నయాగరా నదినుంచి నియోట్రాల్ జాతుల్ని తరిమేశారు ఆ విధంగా వారు హడ్సన్ దిగువ భాగమూ, లాంగ్ ఐలండు తప్ప మిగిలిన న్యూయార్కు వంతనూ తమచేతిలోకితెచ్చుకొన్నారు. 1675 నాటికి వారి అధీన ప్రాంతం బాగా విస్తరించింది. న్యూయార్కులో అధిక భాగం, పెన్సిల్వేనియా, ఓహియో, ఒన్‌టారియో సరస్సుకు వుత్తరాన కెనడా భాగమూ వారి చేతిలోవుంది. వారిని కనుక్కున్న నాటికి తెలివిలోనూ, అభివృద్ధి

లోనూ న్యూమెక్సికోకు ఉత్తరాన వున్న ఎర్ర ఇండియన్లలో కెల్లా మంచి ఉచ్ఛస్థితిలో వున్నారు. జీవిత పద్ధతిలో మాత్రం గల్ఫ్ ప్రాంత తెగలు కొన్నిటికన్న లొచ్చుగా వున్నారు మానసిక లక్షణాలలో గాని రీత్యానూ, వాని రీత్యానూ కూడ ఉత్తర అమెరికాలోని ఆదివాసి ఇండియనులలో మేలు బంతిలో వున్నవారిలో వారొకరు వారి సంఖ్య తగ్గిపోయినా ఇప్పటికి న్యూయార్కులో నాలుగు వేల మంది, కెనడాలో వేయిమంది, మరోఅందరు పశ్చిమానా వున్నారు. అస్తిత్వాన్ని కాపాడు కోవడంలో అనాగరిక జీవిత పద్ధతులు ఎంత సమర్థవంతమో, ఎంతక్రియాశీలమో దీని నుంచే తెలుసుకోవచ్చును. ఇప్పుడు వారి సంఖ్య క్రమంగా పెరుగుతున్న దంటారు

తాము యూరపియన్లను చూసిన నాటికి మూటయాభయి- రెండువందల ఏళ్లకు పూర్వం తమసమాఖ్యఏర్పడిందంటారు,ఇరాక్వాలు తుస్కరోరావాడైన డేవిడ్ కుక్ రాసిన "తరతరాల శాకెమ్‌ల చరిత్ర"ను పట్టి అది ఇంకా పూర్వమే ఏర్పడినట్లు తెలుస్తుంది ఏమయినా ఇరాక్వాల సమాఖ్య 1400 — 1450 మధ్య ఏర్పడినప్పటికి పైన చెప్పిన పరిస్థితులే వున్నాయి. అయిదు స్వతంత్ర తెగలు వారివి వున్నాయి ఒక దాని పక్కనొకటిగా కలిసి వున్నాయి, వారి నివాస ప్రదేశాలు. పరస్పరం అర్థం అయ్యే, ఒకే మూలభాష యొక్క అయిదు మాండలికాల్ని వారు మాట్లాడు తున్నారు. ఇదిగాక ఇరాక్వా తెగలు చాల వానిలో ఒకే గణాలు వుండడం పైన చూశాము. ఒకే గణం యొక్క విడివిడి భాగాలుగా ఈ గణాలు సమాఖ్యకు సుస్థిరమైన పునాదిగా వుంటున్నాయి. ఈ అంశాలన్నీ వున్నా సమాఖ్యను ఏర్పరచాలంటే తెలివీ, నేర్పూ వుండాలి ఖండంలోనితర ప్రాంతాలలో అటువంటి సంబంధాలేగల తెగలు చాలానే వున్నాయి. కాని వానిలో సమాఖ్యలు ఏర్పడలేదు అవనిని ఇరాక్వా తెగలే చేశాయంటే అది వారి అధిక సామర్థ్యానికి గుర్తు అంతేకాదు, అమెరికను ఆది వాసుల నిర్మాణాలలో సమాఖ్య అత్యున్నతం చాల తెలివైన తెగల వారిలో మాత్రమే అది ఏర్పడ గలుగుతుంది.

సైరా క్యూజ్ సమీపంలో, ఒనొందాగా సరస్సు ఉత్తర తీరాన సమాఖ్యను ఏర్పరచేందుకై తమ అయిదు తెగలలో వున్న పెద్దలూ, నాయకులూ సమితి సమావేశ మయిందని ఇరాక్వాలే చెప్తుంటారు. ఆ సమావేశం ముగిసేసరికి సమాఖ్యకు నిర్దిష్ట రూపం ఇచ్చి, వెంటనే అమలులోకి తెచ్చారట. శాకెమ్‌లను నియమించేందుకు అప్పుడప్పుడు జరిగే సమావేశాలలో దానిని ఎంతకాలం పాటు చర్చించి శాసనంచేసి, ఏర్పరచ వలసి వచ్చిందో చెప్తుంటారు. అంతకు పూర్వం పరస్పర రక్షణకై చేసుకున్న

కూటంవలని ప్రయోజనాన్ని చూశారు. దానిని సుస్థిరం చేసుకోవాలనే ఆలోచన కలిగి వుంటుంది

ఈ పధకం వేసినది "హా-యో-వెంట్-హా" అని చెప్పుకుంటారు లాంగ్ ఫెలో రాసిన సుప్రసిద్ధ గీతం "హైవాతా" ఆయనను గురించినదే. ఆయన ఆ సమావేశంలో వున్నారనీ దానిని నడిపినవాడు ఆయనేననీ సంప్రదాయం. సమితికి తన అభిప్రాయాన్ని తెలియపరచడానికి ఆయన దా-గో-నో-వె-దా అనే ఒనాందాగో మేధావిని దుబాసీగా వుపయోగించేరట ఆ దుబాసీ మంచి వక్త ఏర్పరచ దలచిన సమాఖ్య యొక్క విధి నియమాలనూ, స్వరూపాన్నీ వివరించేరట. ఆ పని అయిపోయాక హా-యో-వెంట్-హా (హైవాతా) ఒక తెల్లని నావలో కూర్చున్నారనీ, ఆ నావ ఆయనతో పాటు ఆకాశంలోకి లేచి అదృశ్యమయి పోయిందనీ ఓ అద్భుతగాధ చెప్పుకుంటారు మరికొందరు మహా మేధావులు కూడా ఈ సమావేశంలో పాల్గొని, సమాఖ్య ఏర్పాటును ప్రకటించేరట. ఇండియనుల మహా మేధకు నిదర్శనంగా నేటికీ ఈ పండుగ జరుపుకుంటున్నారు. అది నిజమే కూడ. గణ నిర్మాణాలను పెంపొందించడంలో వారు కనబరచిన తెలివికి అది జయస్తంభమే. అనాగరికయుగం దిగువదశలో ఆ దశలో వుండే అసౌకర్యాల మధ్య పాలనాధికార నిపుణతను మానవజాతి తెగలు ఏ విధంగా సంపాదించేయో చెప్పడానికి ఇదొక వుదాహరణగా నిలిచి పోతుంది.

పైన చెప్పిన ఇద్దరిలో సమాఖ్యను నిర్మించినది ఎవరో చెప్పడం కష్టం. నిశ్శబ్దంగా పని జరిపించిన హా-యో-వెంట్-హా ఇరాక్వాల పారంపర్యంలోని వాడే అయివుండాలని సుప్రసిద్ధ భాషా శాస్త్రవేత్త హొరాషియో హారే అంటారు. కాని ఆయన మీద కల్పించుకున్న కధలు ఆయనను వారిలోంచి పైకిఎత్తి అతిలోక మానవుడిగా చూపెడుతున్నాయి. హా-యో- వెంట్-హా లేక హైవాతా నిజమైన మనిషే అయితే దా-గా-నో-వె-దా ఆయన సహాయకుడై వుంటాడు. లేక దీనికోసం ఒక లోకాతీత వ్యక్తిని కల్పించివుంటే సమాఖ్యను ఏర్పరచినవాడు, దా-గా-నో-వె-దా యే అయి వుంటాడు.

ఆ సమితి ఏర్పరచిన సమాఖ్యయే అధికారాలలోగాని, చేసే పనులలో గాని, పాలనా ప్రక్రియలలోగాని ఏ మాత్రమూ మార్పు లేకుండా నేటి వరకూ కొనసాగుతూందని ఇరాక్వాలు చెప్పుకుంటారు. తరవాత తుస్కరోరాలు సమాఖ్యలో చేరినప్పుడు మర్యాదకోసం వారి శాకెమ్‌లను సమాన హోదాతో జనరల్ కౌన్సిల్‌లో- సమితి సర్వసభ్య సమావేశంలో కూర్చోనిచ్చారేగాని దానిలో మొదట వున్న శాకెమ్‌ల

సంఖ్యను పెంచలేదు. అంటే తుస్కారోరాలకు సమాఖ్య నిర్వహణలో భాగం లేదన్నమాట.

ఇరాక్వా సమాఖ్య లక్షణాలు సంగ్రహంగా ఇవి

1 గణాలలో ఏర్పడిన అయిదుతెగల ఐక్యసంస్థ ఈ సమాఖ్య సమానత్వంతో అవి ఒకే ప్రభుత్వం కింద వుంటాయి స్థానిక స్వపరిపాలన విషయాలలో తెగలు సర్వ తంత్ర స్వతంత్రాలు

2 దానికి ఒక నిర్ణీత సంఖ్య శాకెమ్‌లతో జనరల్ కౌన్సిలు వుంటుంది వీరి హోదా, అధికారం సమానం సమాఖ్య వ్యవహారా లన్నింటిమీదా వారికి సంపూర్ణ అధికారం వుంటుంది.

3. ఏభయిమంది శాకెమ్‌లను జనరల్ కౌన్సిలుకు నిర్ధారణ చేశారు. అనేక తెగలకు చెందిన కొన్ని గణాలలో వానికి పారంపర్యం పేర్కొన్నారు దానికి ఖాళీలు వచ్చినప్పుడు ఆగణాలే వారిని ఎన్నికలద్వారా నింపాలి అవసరం వచ్చినప్పుడు వారిని తొలగించే హక్కుకూడా వారి కుంటుంది. అయితే ఆ శాకెమ్‌ల పదవిని స్థిర పరిచే అధికారం మాత్రం జనరల్ కౌన్సిలుదే

4. సమాఖ్యలో శాకెమ్‌లు తమ తమ తెగల్లోనూ శాకెమ్‌లే అయివుంటారు వారూనాయకులూ కలిసి తెగకి సమితిగా వుండేవారు తెగకి సంబంధించిన వ్యవహారాల్లో నిర్ణాయ కాధికారం తెగ సమితిది.

5 ప్రజావసర నిర్ణయాలు చెయ్యడానికి సమాఖ్య సమితిలో ఏకగ్రీవాభిప్రాయం విధిగా వుండాలి

6 సర్వ సభ్య సమావేశంలో శాకెమ్‌లు తెగల వారీగా వోటువేస్తారు దీని వలన ప్రతితెగకూ ఇతర తెగలతో భేదించే అవకాశం ఇవ్వబడింది.

7 ప్రతితెగ యొక్క సమితికి సమాఖ్య సర్వసభ్య సమావేశాన్ని పిలిచే అధికారం వుంది సర్వసభ్య సమావేశం తానుగా జరగడానికి వీలులేదు.

8 అందరికీ సంబంధించిన విషయాలమీద సర్వసభ్య సమావేశంలో ప్రజలలోనుంచి ఎవరైనా మాట్లాడవచ్చు. అయితే నిర్ణయాధికారం మాత్రం జనరల్ కౌన్సిల్‌ది.

9 సమాఖ్యకు ప్రధాన కార్యనిర్వహణాధికారి, లేక అధిపతి అంటూ వుండడు.

10 సైన్యాధిపతిని అవసరాన్ని గుర్తించి, వారు రెండు పదవుల్ని సృష్టించేరు వారిద్దరికీ సమానాధికారాలనిచ్చేరు. ఎవరు తొందరపాటు చూపినా రెండో వారు నిలవరించడం జరుగుతుంది.

పైన చెప్పిన వరసక్రమంలో గాక, అనుకూల క్రమంలో ఈ విషయాలను సోదాహరణంగా వివరిస్తాను

సమాఖ్యను ఏర్పరచినప్పుడు ఏభయి శాకెమ్ పదవులను నిర్ణయించేరు. వాటికి పేర్లు పెట్టేరు. వాటిని గణాలకు విభంధించేరు వానిలో రెండింటిని మాత్రం ఒక్క-పర్యాయమే శాశ్వతంగా నిర్ధారణ చేశారు మిగిలినవాని స్థానంలో ఎందరో నియమించ బడుతూ అనేక తరాలు మారేరు శాకెమ్ ఆ పదవిలో వున్నంత కాలం ఆ పదవిః ఇచ్చిన పేరుతోనే అతడూ పిలవబడతాడు ఆయన తర్వాత వచ్చిన ఆయనకు మళ్ళీ ఆ పేరు వస్తుంది అప్పటికింకా చట్ట నిర్మాణం, కార్యనిర్వహణ, న్యాయవిధాయక అధికారాలంటూ వేరు వేరుగా ఏర్పడలేదు కాని ఆ మూడు అధికారాలూ జనరల్ కౌన్సిలుకు వున్నాయి సమావేశ కాలంల్లో శాకెమ్‌లు అంతా కలిసి జనరల్ కౌన్సిలుగా ఏర్పడతారు. శాకెమ్ పదవి ఖాళీ అయినప్పుడు ఆ స్థానాన్ని నప్పచెప్పిన గణమే దానికి కొత్తవానిని ఎన్నుకోవాలి శాకెమ్‌ను ఎన్నుకోవడం, తిగ వానిని ధృవపరచడం జరిగినాక జనరల్ కౌన్సిలు ఆ పదవిని నప్పచెప్పాలి ఆ విధంగా పదవిని నప్పచెప్పేటప్పుడు అంతవరకూ అతనికి వున్న పేరును తీసేసి శాకెమ్ పదవి పేరును అతనికిస్తారు తరవాత ఆపేరుతోనే చలామణీ అవుతాడు. పదవిలోకి అధికారంలో, సౌకర్యాలలో వారంతా సమానులే

ఈ శాకెమ్ పదవుల్ని తెగల్నింటికీ సమానంగా పంచరేరు. మోహాక్‌లకు తొమ్మిది. ఒనీదాలకు తొమ్మిది. ఒనాందాగాలకు పన్నాలుగు. కయూగాలకు పది సెనెకాలకు ఎనిమిది ఇచ్చేరు మొదట ఇచ్చిన సంఖ్యే తర్వాతా సాగుతూంది శాకెమ్‌ల పట్టికను సెనెకా మాండలికంలో వ్రాసేరు. సమావేశంలో ఏక గ్రీవత సంపాదించడంకోసం వారిపేర్లను తరగతులవారీగా తయారు చేశారు

సమాఖ్యను ఏర్పరచినప్పుడు ఇరాక్వా శాకెమ్ పదవులకు పెట్టిన పేర్లనే ఆనాటినుంచి నేటివరకూ ఆ పదవులకు వచ్చిన శాకెమ్‌లకు వుపయోగిస్తున్నారు

మోహాక్‌ల ఒకటో గణం (తాబేలు) లో

1 దా-గా- ఎ- ఓ- గా(దాలు) 2 హా- యో- వెంట్ - హా (దువ్వే మనిషి)

3. దా- గా- నో- వె- దా (అదుపు లేని వాడు)

రెండో గణం తోడేలులో

4. సో- అ- యె- వాహ [తక్కువ మాట్లాడే వాడు] 5 దా- యో- హో- గో [దారి మలుపులో] 6 ఓ- అ- అ- గో- వా [పెద్ద నదిమీద].

మూడో గణం ఎలుగులో

7. దా- అన్- నో- గా- ఎ- నే [కొమ్ములు ఊడ్చు కుంటూ] 8. పా- దా- గా- ఎ- వా- దే [విదావం మనిషి] 9. హాస్- డా- వే- పే- ఓంట్- హా [దబ్బా కట్టేవాడు ]

ఒనీ దా తెగ- తోడేలు గణంలో

1. హో- దాస్- హా- చే (బరువు మోస్తున్న) 2 గా- నో- గ్వే- యో-దో (పిల్లితోక దొచ్చు వాళ్ళ వాడు) 3 దా- యో- గ్వెన్- దా (అడవి దారి)

తాబేలు గణంలో

4. సో- నో- సావే (పొడుగు దారం) 5. తో- నో- అ- గా- ఓ (తలనొప్పి గాడు) 6, హా- దే- అ- దున్- నెన్ట్- హా (తన్ను తానే తినేవాడు)

ఎలుగు గణంలో

7. తా- వా- తా- ఓ- ద- యో [ప్రతి ధ్వనించే ప్రదేశం] 8. గా- నె- అ- దుస్- హా- యే. [వేల వదేసిన గద] 9 హో- వుష్- హా - దా- ఓ [చెమటలు కక్కు తున్నవాడు.]

ఒనాందాగా తెగ-

1. తో- దో- దా- హా. [గందరగోళం-ఎలుగు గణం] 2. తో- నెస్- పా- అహ్. 3. దా- అట్- గా- దో పే- [కవిపెట్టి వుండే-ఎలుగు గణం] వీరిద్దరూ పారంపర్యంగా తో- దో- దా- హాకు నలహా దార్లుగా వుంటారు తో- దో- దా- హాది వాల పేరున్న శాకెమ్ పదవి.

(2) 4. గా- నియా- దా- జే- వాకే [కలువ మనిషి- ఉల్లంకి గణం] 5 అ- వా- గా- యాట్- [తాబేలు గణం] 6 దా- అ- యాట్- గ్యాయే.

(3) 7. హో- నో- వే- వా- దో [తోడేలు గణం] ఈ శాకెమ్ పారంపర్యంగా సమాఖ్య ప్రెజరర్ వామ్పుమ్[వామ్పుమ్-గణెములుగా వుపయోగించే గవ్వలు,

(4) పూసలు]8 గా-వా-నా-షాన్-దో [లేడిగణం] 9. హ-ఎ-హో. [లేడిగణం] 10 హో- యో- నే [తాబేలు గణం] 11. పా- దా- క్వాన్- పే. [ఎలుగుగణం]

(5) 12. షా- గో- గా- హా. [దొంగ చూపు- లేడి గణం] 13 హో-షా- హా-

హో- [పెద్దనోరు- తాబేలు గణం] 14. షా-కా-నో- వున్-డే. [ఏటికి అవతల- తాబేలు గణం]

కయూగాలు

(1) 1 దా- గా- ఆ- యో [పిరికి- లేడి గణం] 2 దా- జె- నోదా- నే- ఓ. [కొంగ గణం] 3. గా- దా- గ్వాస్- షా [ఎలుగు గుణం] 4. సో- యో- వా పే [ఎలుగు గణం] 5 హా- ధే- అస్- యో- నో [తాబేలు గణం]

(2) 6. దా- యో- ఓ- యో- గో [తెలియదు] 7 జో చే- హో- వే- కో- [చలి- తాబేలు గణం] 8. దే- అ- వాచే- హో. [కొంగ గణం]

(3) 9. తో-దా-ఎ-హో [తోడేలు గణం] 10 దెస్-గా-హే. [తోడేలు గణం]

సెనెకాలు

(1) 1. గా- నె- ఓ- ది- యో. [సుందర సరస్సు-తాబేలు గణం] 2. సా- దా- గా- ఓ- యా పే [స్వర్గ సమం- తోడేలు గణం]

(2) 3. గా- నో- గి- ఏ [తాబేలు గణం] 4 సా- గే- జో- వా. [పెద్ద సుదురు- డేగ గణం]

(3) 5 షా- దె- అ- నో- వుస్ [సహాయకుడు- ఎలుగు గణం] 6 విస్- హో- నె- ఆ- నెంట్ (అస్తమయం- తోడేలు గణం]

(4) 7 గా- నో- గో- ఎ- దా- వే- [బొట్టుకాలిన-తోడేలు గణం] 8 దో- నె- హో- గా- వే [నిరాటంకం- తోడేలు గణం]

[బ్రాకెట్లలో దొరికినచోట పేరుకి అర్థమూ, వారిగణమూ వ్రాయబడింది

హో- యో- వెంట్-హా (హైవాతా), దా-గా-నో- వే- దా- ఈ ఇద్దరినీ మోహాక్ తెగ నుంచి శాకెమ్‌లుగా సమాఖ్య నేర్పరచి నప్పుడు తీసుకున్నారు వారి అనంతరం వారి గౌరవార్థం నేటికీ ఆ స్థానాలు ఖాళీగానే వుంచేస్తున్నారు శాకెమ్ పదవులు స్థిర పరచేందుకు జరిగే సర్వసభ్య సమావేశాలలో అందరి పేర్లతోపాటు వారిపేర్లూ చదువుతారు అంతవరకే. కనక సమాఖ్య పభ్యులసంఖ్య వలభయ్యెనిమిది మంది మాత్రమే.

ప్రతి శాకెమ్‌కు ఒక సహాయకుడు వుంటాడు. శాకెమ్ గణం మంచే అతనూ ఎన్నికో బడతాడు. అతని పదని స్థిర పరచటానికి కూడా అవే ఆచారాలు, సంప్రదాయాలు. "సహాయకుడు" అంటారు అయన్ని ఉత్సవాలప్పుడు,సభలప్పుడు అతడు తన శాకెమ్ వెనక నిలబడతాడు. వార్తాహరుడుగా పనిచేస్తాడు. శాకెమ్ చెప్పిన పనులు

చేస్తుంటాడు సహాయకునికి నాయకహోదా ఇస్తారు శాకెమ్ మరణించి నప్పుడు ఆ స్థానానికి ఈయనను ఎన్నుకొంటారు. అలంకార యుతంగావుండే వారి భాషలో ఈ సహాయకుల్ని "పొడుగు యింటికి మోపుదార్లు" అని పిలుస్తారు. సమాఖ్యను వారు పొడుగాటి యిల్లు— (Long House) అంటారు

శాకెమ్‌లకు మొదటపెట్టిన పేర్లే తరవాతవారికి చెల్లుతాయి. గా- నె- ఓ- ది- యో- సెనెకా శాకెమ్‌లు ఎనమండుగురిలో ఒకరు— మరణించి నప్పుడు ఆయనను ఎన్నుకొన్న తాబేలు గణమే ఆయన తర్వాత దానిని ఎన్నుకొంటుంది. ఆ శాకెమ్ పదవి తాబేలు గణానికి పారంపర్యంగా వస్తుంది ఆ పదవిలో ఆయనను స్థిరపరచేటప్పుడు జనరల్ కౌన్సిలు ఆయన అసలు పేరును తీసేసి ఈ పేరు పెడుతుంది. ఒనాందాగా, సెనెకా రిజర్వేషన్లలో శాకెమ్‌లను స్థిరపరచే ఉత్సవాలకు నేను వెళ్ళేను. ఆ ఆచారాలన్నీ గమనించేను సెనుకటి సమాఖ్య ఇప్పుడు నామ మాత్రంగానే వుంది 1775 లో కెనడా వెళ్ళిపోయిన మోహాక్ తెగతప్ప మిగిలిన తెగలన్నింటి నుంచీ శాకెమ్‌లనూ, వారి సహాయకులనూ ఎన్నుకోవడం, స్థిరపరచడం, పదవిలో వుంచడం వంటి ఆచారాలన్నీ యథా విధిగా జరుపుతున్నారు ఏదన్నా శాకెమ్ పదవి ఖాళీ అయితే మళ్ళా ఎన్నికజరుగుతూంది వారినీ, వారిసహాయకుల్నీ పదవులలో స్థిరపరచడానికి సర్వసభ్య సమావేశాలూ పిలుస్తున్నారు. వెనకటి సమాఖ్య స్వరూపమూ, నియమ నిబంధనలూ గురించి ఈనాటి ఇరాక్వాలకు బాగా తెలుసు.

తెగల పాలనా వ్యవస్థకు సంబంధించినంత వరకు అయిదు తెగలూ దేనికది స్వతంత్రం. సరిహద్దులు పెట్టి ఎవరి ప్రాంతం వారికి విభజించ బడింది. వారి తెగ ప్రయోజనాలు భిన్నం. ఎనిమిది మంది సెనెకా శాకెమ్‌లూ, నాయకులూ కలిసి తెగ సమితిగా ఏర్పడతారు. వారు తెగ వ్యవహారాలను చక్కబెడతారు ఇతర తెగలను వారి వ్యవహారాలను చక్కబెట్టుకోనిస్తారు. సమాఖ్యను ఏర్పరచడం వలన తెగ నిర్మాణం బలహీనపడలేదు ప్రతి ఒక్కటీ తన రంగంలో జీవంతంగా వ్యవహరిస్తూంది. మన రిపబ్లికులో మన రాష్ట్రాల వని పోలికలు వానిలో కనిపిస్తున్నాయి మనం వలస వచ్చిన ప్రాంతాలు ఏ విధంగా ఏకమై పరిపాలన సాగించుకోవాలో మన తాతలకు 1755 నాడే వారు చూపించడం గొప్ప విషయం అనేక వలస భూముల ఉమ్మడి ప్రయోజనాలూ, ఉమ్మడి భాషలలో వారి చూపులకు అందినంత వరకు సమాఖ్య ఆవశ్యకతను గమనించేరు.

హక్కులు, బాధ్యతలు, సౌకర్యాల విషయంలో తెగలకు సమాఖ్యలో సంపూర్ణ

సమానత్వం వుంది అసమానమైన కూర్పుకుగాని, ప్రత్యేక అసమాన సౌకర్యాలు కలిగించడానికిగాని ఆలోచన లేదనడానికి ప్రతి ఒక్క దానికీ కలిగించిన రక్షణలే సాక్ష్యం కొన్ని తెగలకు సమాఖ్య నిర్మాణంలో అధిక బలం కలిగించే ఏర్పాట్లున్నాయి. ఉదాహరణకు ఒనొందాగాలకు పద్నాలుగు శాకెమ్ స్థానాలుంటే, సెనెకాలకు ఎనిమిది స్థానాలే వున్నాయి. జనరల్ కౌన్సిలులో తక్కువ మంది గల తెగకన్న ఎక్కువ మంది శాకెమ్‌లు ఉన్న తెగ మాట బాగా చెల్లుబడికావాలి. కాని ఇక్కడ అలా జరగదు. తెగలవారీగా వోటింగు ప్రతి తెగకూ వీటోహక్కు వుంది ప్రజావసర వ్యవహారాలలో ఏకగ్రీవ నియమం వుంది. ఒనొందాగాలకు "వాంపుం (ఖజానా) రక్షణ", మోహాక్‌లకు "సమితి ముద్ర" వప్పచెప్పేరు ఓడించబడిన తెగనుంచి పణరానా తీసుకోవడంకూడా మోహాక్‌లదే సమాఖ్య భవన ద్వారం తాళాలు సెనెకాలకు ఇచ్చేరు ఇవీ, ఇల్లాంటివే మరికొన్నీ సమష్టి సౌకర్యం కోసం ఒక్కొక్కరికి ఒక్కొక్కటి చొప్పున వప్పచెప్పేరు.

సమాఖ్య ఆలోచన కేవలం రక్షణ లాభాల కోసమే కలగలేదు. దానికి పునాది వారి మధ్యనున్న రక్తబాంధవ్యంలోనే వుంది. పైకి చూడ్డానికి అది తెగల సమాఖ్యయే కాని, ప్రధానంగా గణాల బంధుత్వానికి మూలం మోహాక్‌లుగానీ, ఒనిదాలూ, ఒనొందాగాలు కానీ, కయూగాలు కానీ, సెనెకాలు గానీ ఒకేవ్యక్తి సంతానంగా ఒకరికొకరు అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్ళూను వారి మధ్య పూర్తి అనుబంధం వుంది ఒకరికొకరు ఎదురైనప్పుడు వేసే మొదటి ప్రశ్న వారి గణం గురించి. రెండోది శాకెమ్ గురించి దానితో వారు తాము ఒకరికొకరు రక్తసంబంధం రీత్యా ఏమవుతారో అర్థం అవుతుంది ఈ అయిదు తెగలలోనూతోడేలు, ఎలుగు, తాబేలు గణాలు వున్నాయి. ఇవీ, మరో మూడు గణాలూ మూడు తెగలలో కలిసివున్నాయి. మొట్టమొదటి తల్లి గణం నుంచి వచ్చిన తోడేలు గణం అయిదు భాగాలయి ఇప్పుడు అయిదు తెగలలో వుంది. అలాగే ఎలుగు, తాబేలు గణాలున్నూ లేడి, ఉల్లంకి, డేగ గణాలు ఈ మూడూ కయూగాలు, సెనెకాలు, ఒనొందాగాలు ముగ్గురిలో వున్నాయి. గణాలు శాఖలయి పోయినా, వారి మాండలికాలు వేరు అయినా వారి మధ్యనున్న బాంధవ్యం అభేద్య బంధాన్ని కలిగిస్తూంది. ఈ తెగలకు చెందిన ఒక గణంలోని వాడు మరో తెగలోని, వేరే మాండలికం మాట్లాడే అదే పేరింటి గణం వారిని కలుసుకున్నప్పుడు వారు అన్నా, తమ్ముడూ అని పిలుచుకోవడం మాటవరుసకూ, మర్యాదకూ కాదు. ఒకే పారంపర్యంలో వాళ్ళం, బంధువులం, ఒకే ప్రజలం అనే బలమైన భావంతోనే.

ఇరాక్వా వారికి తన గణం పేరిటి వాడు ఏ తెగవాడయినా తన సోదరుడే. సోదరుల స్త్రీ - పురుష సంతానం ఒకరికొకరు సోదరీ - సోదరులు. వారిలో స్త్రీల సంతానం సోదరీ - సోదరులు. పురుష సంతానం సోదరీ సోదరులు. కాని ఒకరొకరి సంతానం పరస్పరం మేనబావలు, మరదళ్ళు ఈ బాంధవ్యాలు అల్లాగే అనంతంగా కొనసాగుతాయి. ఒకే గణ సభ్యుల మధ్య బంధుత్వాలు ఎన్నటికీ తప్పిపోవు ఈ బంధుత్వాలు వారిలో ఇప్పటికీ బలంగా వున్నాయి వెనకటి సమాఖ్యలోని విభాగాలు ఇప్పటికీ ఎంత దృఢంగా అంటిపెట్టుకొని వుంటున్నాయో దీనివలన గ్రహించవచ్చు ఈ అయిదింటిలో ఏ తెగ అయినా సమాఖ్య నుంచి ఉపసంహరించుకొన్నా, వారి బాంధవ్యం తెగతెంపులు కాదు. కాని వారి మధ్య ఘర్షణలు వస్తే సోదరుల మధ్యనే యుద్ధాలు జరుగుతాయి. ఇరాక్వాల చరిత్ర చూస్తే ఈ వాస్తవ పరిణామాలూ కనిపిస్తాయి. బాంధవ్యాలు పాటించడమూ చూస్తాం. సమాఖ్య కొనసాగినంత కాలమూ వారు అరాజకంగా వ్యవహరించలేదు సమాఖ్యను భగ్నం చేయలేదు

పొడుగు ఇల్లు - 'హో- దె- నో- సో-చే-' అంటారు వారు, సమాఖ్యను అది దానికి సంకేతం. తమకిని పొడుగు ఇంటి వాళ్ళం- 'హో- దె- నో- సౌ-నే-' అని చెప్పుతుంటారు. ఈ పేరు ఒక్కటే వారు తమ్ముగురించి ప్రత్యేకించి చెప్పుకొనే మాట సమాఖ్య ఏర్పడటంతో గణ సమాజం సంక్లిష్ట రూపం కలది అయింది. అయినా అది స్పష్టంగా గణ సమాజమే. జాతిగా ఏర్పడే క్రమంలో సమాఖ్య ఒక ముందడుగు. ఆ క్రమంలో సమ్మేళనం ఆఖరిమెట్టు. తెగదశలోనే జాతి ఏర్పడింది. అత్తికాలో నాలుగు అథీనియన్ తెగలు, ఒకే ప్రాంతంలో నివసిస్తున్నవి సమ్మిళితం అయి ఒక జాతిగా ఏర్పడ్డాయి వాని భౌగోళిక హద్దులు క్రమంగా చెదిరి పోయాయి. స్వతంత్రంగా దేనిది దానికి స్వంత ప్రదేశం లేకపోయినా తెగల పేర్లూ, తెగల నిర్మాణమూ యథా పూర్వంగా దృఢంగా కొనసాగేయి. పట్టణాలు పునాదిగా రాజకీయ సమాజం ఏర్పడినప్పుడు, ఏ గణం, ఏ తెగకి చెందిన వారైనా పట్టణంలోని ప్రజలంతా ఆ రాజ్య ప్రజలు అయ్యేరు. సమ్మేళనం సంపూర్ణం అయింది.

అదే విధంగా లాటిన్, సాబైన్ తెగల సమ్మేళనంతో రోమన్ ప్రజ ఏర్పడ్డారు. రోమను జాతిగా ఏర్పడ్డారు, అందరితోనూ కూడ గణం, ఫ్రాట్రీ తెగ అనేవి ప్రారంభపు మజిలీలుగానే వున్నాయి సమాఖ్య నాలుగో మజిలీ. అనాగరిక యుగంఎగువదశలోవున్న గ్రీకు, లాటిన్ తెగలలోరక్షణకు, దాడులకుద్దేశించి పదులు పదులుగా ఏకం కావడమే జరిగింది. గ్రీసు లాటిన్ తెగలలో సమాఖ్య గురించిన

సమాచారం అసమగ్రం, అసంపూర్ణంగానే వుంది వివరాలు తెలియడం లేదు.- గణ సమాజంలో సమ్మేళనం అన్నది సమాఖ్య తర్వాత వస్తుంది జాతి, రాజ్యం రాజకీయ సమాజం ఏర్పడడానికి ముందు సమ్మేళనం తప్పని సరి మజిలీ ఆ ప్రగతి కడ కలిక మయిన మజిలీ ఇరాక్వాలలో ఆ మజిలీ ఏర్పడలేదు.

ఒనాందాగా వకీలోయ కేంద్ర తెగవుండే చోటు. సమాఖ్య ముద్ర అయిన అగ్నిహోత్రం నిరంతరాయంగా మండుతూండవలసినది అక్కడే. సమాఖ్య సర్వ సభ్య సమావేశాలు సాధారణంగా జరిగేచోటు అదే పూర్వంరోజుల్లో ఆ సమావేశాన్ని సంవత్సరానికో మారు ఆకురాల కాలంలో జరిపేవారు. కాని తర్వాత అవసరంకొద్దీ సమావేశాలు తరచు జరగవలసి వచ్చింది ఆ సమావేశాన్ని పిలవడానికి, సమావేశ స్థలమూ, సమయమూ నిర్ణయించడానికీ ప్రతి తెగకూ హక్కువుంది ఒనాందాగాలో మామూలుగా సమావేశం జరిపే స్థలాన్ని మార్చవలసిన పరిస్థితులు ఏర్పడితే సమావేశాన్ని పిలిచే తెగ తన సమితి- భవనంలోనే జరిపించవచ్చు. సర్వసభ్య సమావేశాన్ని దానిలో సభ్యులయిన తెగలు పిలవాలే గాని, తమంతతామగా పిలుచు కోలేదు

పాలక సమితి సభ్యులైన శాకెమ్‌లలో ఎవరయినా చనిపోయినా, తొలగించబడినా కొత్తవారిని పదవిలో స్థిరపరచడమే సమాఖ్య సమితుల వుద్దేశం. కాని క్రమంగా సమష్టి ప్రయోజనాలకు సంబంధించిన వ్యవహారాలు అన్నిటినీ చూడ సాగింది. కాల క్రమంలో జనం పెరిగి ఇతర ప్రాంతాల వారితో వ్యవహార సంబంధాలు విస్తరించిన తరవాత సర్వసభ్య సమావేశం మీద మూడు బాధ్యతలు పడ్డాయి పౌర వ్యవహారాలు, అంత్యక్రియలు, మతకర్మకాండలు. యుద్ధాలు, శాంతి అన్యప్రాంత తెగలతో సంధులు అణచివేసిన తెగలవారితో వ్యవహారాలు చక్కబెట్టడం, తమ గణాల సంక్షేమాన్ని పెంచే చర్యలు చేపట్టడం- ఇవి మొదటి పౌర వ్యవహారాల సమితి బాధ్యతలోకి వస్తాయి రెండో బాధ్యత శాకెమ్‌లను పైకి ఎత్తడమూ, పదవిలో కూర్చో పెట్టడమూ దీనిని మైల సమితి అంటారు దాని ప్రధమ కార్యక్రమం చనిపోయిన వాని కోసం ఏడవడం. ఆ స్థానాన్ని భర్తీచేయడమూ. మూడోది సమష్టి మత ఉత్సవాల నిర్వహణ. సమష్టి మత కర్మకాండల సందర్భంగా సర్వసభ్య సమావేశం అదుపులో సభ్యులయిన తెగలన్నీ ఒకచోట కూడేందుకు ఇదో అవకాశంగా వుపయోగిస్తుంది. ఇప్పుడు ఇతర సమస్యలపై సమితి సమావేశాలు జరిగినప్పుడే మైల సమితి కార్య కలాపాలు కూడా జరిపేస్తున్నారు. పౌర వ్యవహారాల భాగం ఇప్పుడు జరగడంలేదు. రాజ్యం, ప్రభుత్వం వుండడం చేత దాని అవసరం లేదు.

పౌర, మైల సమితులు జరిపే కార్యక్రమాల వివరాలు, చదవడానికి విసువు కలిగిస్తాయో ఏమోగాని, చెప్పడం అవసరం, లేకపోతే గణ సంస్థల కాలంలో సమాజం ఎంత పురాతన స్థితిలో వుందో అర్థం చేసుకోవడం కష్టం

అన్య ప్రాంతపు తెగ సమాఖ్యతో మాట్లాడ వలసివస్తే అది ఆ అయిదు తెగలలో ఒక దాని ద్వారానే సాధ్యం ఆ విధంగా కోరినప్పుడు ఆ వ్యవహారం సమాఖ్య సమితిని పిలవ వలసినంత ముఖ్యమో కాదో నిర్ణయించే అధికారం ఆ తెగ సమితికి వుంది. జనరల్ కౌన్సిల్(సమాఖ్య సమితి) ను పిలవాలని వుంటుందనే నిర్ణయం చేస్తే, దగ్గరలోవున్న తెగలకు వార్తా హరుణ్ణి ఎంపుతారు హో- దె- ఓస్- పే- (పౌరవ్యవహారాల సమితి) ఫలానాచోట, ఫలానా సమయంలో, ఫలానా పని కోసం జరుగుతుందని కబురు పంపుతారు వాంపుం (ధనందాచుకొనే) పటకాను వార్తా హరుడు ధరిస్తాడు ఆ కబురును అందుకున్న తెగవారు తమ తరువాత నున్న వారికి అదే విధంగా కబురు అందించాలి. అల్లాగే చివరవరకూ. నిర్ణీతమైన పద్ధతిలో ఆహ్వానిస్తే తప్ప జనరల్ కౌన్సిల్ సమావేశం తనంతట జరగదు.

పౌర వ్యవహార సమితి సమావేశ పద్ధతి ఈ మాదిరిగా వుంటుంది. ఒనాందా గాలు సమితి సమావేశం జరపాలనుకున్నా రనుకుందాం. వారు తమకు తూర్పున వున్న ఒనీదాలకూ. పశ్చిమాన వున్న కయూగాలకూ, నడుం పట్టీలకు ఆహ్వానంతో వున్న సంచి తగిలించి వార్తాహరులను పంపుతారు నెలలో ఫలానా రోజున ఒనాందాగా సమితి సమావేశాల తోపులో సమావేశం జరుపు కుందాం అంటారు ఎందుకో కూడ దానిలో వుంటుంది. అప్పుడు ఆ వార్తను సెనెకాలకు పంపడం బాధ్యత కయూగాలది. మోహాక్‌లకు పంపే బాధ్యత ఒనీదాలది. సమితి సమావేశం శాంతియుత ప్రయోజనాలకైతే సమావేశానికి వచ్చే ప్రతిశాకెమ్ తనతో శాంతికి చిహ్నం అయిన తెల్ల దేవదారు పుల్లలకట్ట తెచ్చుకు రావాలి. యుద్ధావసరానికైతే యుద్ధ సంకేతంగా ఎర్ర దేవదారు కట్టెల కట్ట తీసుకు వస్తారు.

సమావేశ దినానికి ఒకటి రెండు రోజులు ముందుగానే శాకెమ్‌లు అంతా తమ సహాయకులతో వచ్చి, సమావేశ స్థలానికి దూరంగా మకాంచేస్తారు ఒనాందాగా శాకెమ్‌లు సూర్యోదయం వేళ వచ్చి వారిని మామూలుగా పలకరించి వెడతారు. సమావేశం రోజున శాకిమ్‌లు ఎవరికివారే చిన్న వూరేగింపులాగా కట్టెల కట్ట, చర్మపు దుస్తుతో సమితి తోపు వద్దకు వస్తారు. వారికి అక్కడ ఒనాందాగా శాకెమ్‌లు స్వాగతం ఇస్తారు. సమితి సభ్యులయిన శాకెమ్‌లు అంతా అక్కడ వలయాకారంలో నిలబడతారు.

సమావేశ నిర్వహణ బాధ్యత ఇవ్వబడిన ఒనాందాగా శాకెమ్ ఆ వలయంలో తూర్పు దిక్కున నిలబడతాడు ఈ వలయంలో ఉత్తర భాగాన్ని "చలిదిశ", (ఓ-టో-వా-గా) పడమటి భాగాన్ని "అస్తమయ దిశ" (హా- గా- క్వాస్- గ్వా), దక్షిణ భాగాన్ని "మధ్యాహ్నం దిశ" (ఎన్- దే- ఇహ్- క్వా), తూర్పును, "సూర్యోదయ దిశ" (టి-కా-గ్విత్-కావ్-గ్వా) అంటారు సంకేతం ఇవ్వగానే, ఉత్తరపు దిక్కు నుంచి ప్రారంభించి శాకెమ్‌లు ముమ్మారు వలయం చుట్టూ, ప్రదక్షిణం చేస్తారు మూడుమార్లు ఒకరి వెనుక నొకరుగా ప్రదక్షిణంచేసి నాక ఈ ఉత్సవనాయకుడు తూర్పువైపున తన స్థానానికి వచ్చి నిలబడతాడు నిలబడి తాను తెచ్చిన కట్టెల కట్టను వలయం లోపల తనముందు పెడతాడు తర్వాత ఉత్తరం వేపు నుంచి ప్రారంభించి ఒక్కొక్కరే వరసన వలయంలోపల తమకు ఎదురుగా కట్టలు పెడతారు తర్వాత మళ్ళీ అదే వరసలో ఒకరి తర్వాత మరొకరు తాము తెచ్చుకున్న చర్మాన్ని పరిచి, బాసెనపట్టు వేసుకుని దానిమీద కూర్చుంటారు శాకెమ్ సహాయకుడు అతని వెనుకనే నిలబడతాడు

అందరూ కూర్చున్నాక నాయకుడు లేచి, తన సంచిలోంచి రెండు ఎండుకట్టెలు, ఇంత పీచుతీసి, వానిని రాపాడించి నిప్పుచేస్తాడు. దానితో వలయంలో అడుగుపెట్టి తన కట్టకు నిప్పు ముట్టిస్తాడు. అది అంటుకున్నాక, దానిలో కట్టలు పడేసిన వరస క్రమంలో అన్నికట్టలూ అంటిస్తాడు అన్నీ అంటుకున్నాక నాయకుడు సంజ్ఞ చేయగానే శాకెమ్‌లంతా లేచి నిలబడి, మొదటి లాగనే, అదే వరసలో వలయంచుట్టూ, ముమ్మారు ప్రదక్షిణంచేసి తమ తమ కట్టెల మంట వద్దకు వచ్చి నిలబడతారు ఆ విధంగా ప్రదక్షిణ చేసేటప్పుడు ప్రతి ఒక్కరూ ఆత్మ ప్రదక్షిణం కూడా చేస్తారు. దాని వుద్దేశం మంటవేడి ఆయన శరీరం అన్నివేపులకూ తగలాలని తామంతా తమ అభిమానాల వెచ్చదనం అందరికీ అందించామనీ, సమావేశంలో తమ వ్యవహారాలను ఆత్మీయతతో, ఐక్యంగా జరుపుకుంటామనీ చెప్పడం ఈ తతంగానికి అర్థం మళ్ళీ అంతా ఎవరి చర్మంమీద వారు కూర్చుంటారు. అప్పుడు నాయకుడు మళ్ళీలేచి నిలబడి, తన చిలుం గొట్టంలో పొగాకునింపి, తన నిప్పుతో ముట్టించి, మూడుమార్లు పొగపీల్చి వదులుతాడు మొదటిది ఆకాశంకేసి, రెండోది నేలకేసి, మూడోది సూర్యుని కేసి పొగవూదుతాడు. గతసంవత్సరం అంతా తమను కాపాడి, ఈవేళ ఈ సమావేశానికి వచ్చేటట్లు చేసినందుకు దేవ దేవునికి (great spirit) కృతజ్ఞత తెలుపుతూ

మొదటిది, రెండోది తన జీవనోపాధికి వివిధ వస్తువులు ఉత్పత్తిచేసిన భూమికి అభినందనలు తెలపడం మూడోది సూర్యునికి విర్విరామంగా, సర్వులమీద వెలుగు చల్లుతున్నందుకు మాటలు ఏవీవుండవు కాని, ఆ చర్య వుద్దేశ్యం అది తరవాత ఆ గొట్టాన్ని తనకు కుడి వేపున, ఉత్తర దిశగా వున్నవానికి అందిస్తాడు అతడూ మమ్మారు పొగపీల్చి అదేవిధంగా ఊది, వానివి తర్వాత వానికి ఇస్తాడు ఆ విధంగా అది చుట్టు తిరుగుతుంది. ఆ చిలుము గొట్టాన్ని అందరూ అంచుకుని కాల్చడంలో తమ విశ్వాసాన్ని, తమ స్నేహాన్ని, తమ గౌరవాన్ని ఒక రొకరికి తెల్పుకోవడం వుంది ఈ చిలుము గొట్టం కాద రెండు - రెండున్నర అడుగుల పొడుగుంటుంది

ఈ తతంగం అంతా పూర్తి అయ్యేక సమావేశం ప్రారంభం అవుతుంది. పని ప్రారంభిద్దామని ప్రకటన చేస్తారు.

ఇప్పుడు—

వచ్చిన తెగలు రెండుగాచీలి, ఆ సమితి అగ్నిగుండానికి చెరోవేపునా కూర్చుంటారు. ఒక వరసలో మోహాక్‌లూ, ఒనాందాగాలు సెనెకా శాకెమ్‌లు కూర్చుంటారు ఈ మూడూ ఒకరి కొకరు సోదర తెగలు. వీరు తండ్రి తెగలు మిగిలిన రెండూ కయూగాలూ, ఒనీదాలూ కొడుకుతెగలు వారిలో వారు సోదరులు తర్వాత వచ్చేరు టుస్కారోరా శాకెమ్‌లు. వీరు మొదట్లోలేరు. వీరంతా గణాలు, ప్రాత్రీలుతెగలుగానే విడబడి కూర్చుంటారు ఒనీదాలు మోహాక్‌ల నుంచి విడబడ్డారు. కయూగాలు ఒనాందాగాలనుంచో, సెనెకాలనుంచో విడబడ్డారు అందుచేత వారు పిల్లతెగలు. సమితి సమావేశంలో తెగల్ని పిలిచేటప్పుడు మోహాక్‌లను ముందు పేర్కొంటారు "దాలు" "దా-గా-ఎ-ఓదా" అనేది వారిగణానికి బిరుదు. వారి తర్వాత ఒనాందాగాలది ప్రాధాన్యం. హో-దె-సాన్-నో-గె-టా-"నామ ముద్రధారి" అనేది వారి బిరుదు "హా-నాన్-నె-హో-ఓన్‌డే-" ద్వారరక్షకుడు బిరుదుతో సెనెకాలది మూడోస్థానం. "పొడుగు—ఇల్లు" పడమటి ద్వారం ఎప్పుడూ వారిరక్షణలో వుంటుంది. మహావృక్షం "నె-అర్-దె-అన్-దార్-గో-వార్" గా ఒనీదాలది నాలుగో స్థానం. "సోమస్-హో-గ్వార్-తో-వార్" 'పెద్దగొట్టం' బిరుదుతో కయూగాలది ఐదోస్థానం. సమాఖ్యలోకి తరవాత వచ్చిన టుస్కారోరాలది ఆఖరుస్థానం. వారి తెగకి బిరుదు లేదు. ప్రాచీన సమాజంలో ఈ పద్ధతులకు విశేష ప్రాముఖ్యం వుంటుంది

అన్య తెగల వారు అనుభవజ్ఞుల్ని, నాయకుల్ని రాయబార వర్గంగా పంపించడం, సమితి సమావేశంలో తమ ప్రతిపాదనలను స్వయంగా చెప్పడమూ ఆచారం.

సమితి సమావేశం ప్రారంభం అయ్యాక రాయబార వర్గాన్ని పరిచయం చేస్తారు. తర్వాత ఒక శాకెమ్‌లేచి, తమరందరినీ కాపాడి, పునస్సమావేశం కానిచ్చినందుకు దేవ దేవుడికి కృతజ్ఞతలు తెలుపుతాడు తర్వాత, రాయబారుల్ని ఉద్దేశించి, వారి పని మీదనే సమావేశం జరుగుతున్నదనీ, వారేం చెప్పదలచేరో చెప్పమనీ కోరుతాడు. రాయబార వర్గంలో ఒకరు తమ ప్రతిపాదనను వారి ముందు పెట్టి, దానికి సమర్ధనగా తన వాదనలు చెప్తాడు విషయాన్ని సరిగ్గా అవగాహన చేసుకొనేందుకు సమితి సభ్యులు చాల శ్రద్ధగా వింటారు రాయబారి తాను చెప్పవలసింది చెప్పేక, ఆ ప్రతి నిధులు సభను వదలి దూరంగా కూర్చుంటారు సమితి దానిని చర్చించి ఒక నిర్ణయా నికి వస్తుంది నిర్ణయం తీసుకున్నాక దానిని చెప్పడానికి సమితి ఒక వక్తను నిర్ణయి స్తుంది సాధారణంగా ఆ వక్త ఆ నాటి సమితి సమావేశాన్ని పిలిచిన తెగవాడే అవు తాడు దానిని తెలపడానికి రాయబారుల్ని సభకు పిలుస్తారు వక్త ఆ విషయాన్నంతనూ సమగ్రంగా వివరణలతో ప్రసంగిస్తాడు ఆ క్రమంలో ప్రతిపాదనను పూర్తిగానో, ఓ భాగాన్నో అంగీకరిస్తున్నదీ, నిరాకరిస్తున్నదీ తెలిపి అందుకు కారణాలను చెప్తాడు. ఒప్పందం కుదురుతే దానికి సాక్ష్యంగా ఒకరి (వాంపుం) బెల్టు మరొకరు మార్చు కొంటారు దానితో సమావేశం ముగుస్తుంది

"ఈ పట్టీ నామాటను కాపాడుతుంది"- అనడం, సమితి సమావేశంలో ఇరాక్వ్యా నాయకుని పరిపాటిమాట. తాను చెప్పిన మాటకు సాక్ష్యంగా అతడు తన మొలపట్టీ తీసి ఇస్తాడు సంప్రదింపుల కాలంలో ఎదుటి పక్షానికి ఆ మాదిరిగా ఎన్నో పట్టీలు ఇస్తారు. సమాధానం ఇచ్చి నప్పుడు ఆమోదించిన ప్రతి అంశానికీ పట్టీలు తిరిగి ఇచ్చేస్తారు తమ విశ్వాసాన్నీ ప్రతిష్ఠనూ పణంగాపెట్టే విధంగా ప్రతిపాదనలు చేయవలసిన అవసరాన్ని ఇరాక్వ్యాలు గుర్తించారు. అందుకు ఈ పద్ధతిని అవలం బించేరు.

ప్రజా సమస్యలమీద శాకెమ్‌లలో ఏక వాక్యత అవసరం. చేస్తున్న పనులు ప్రజామోదం పొందడానికి ఏకవాక్యత అవసరం సమాఖ్య ప్రధాన నియమం అది అమెరికను విప్లవకాలంలో సమితిలో అందరూ అంగీకరించక పోవడంచేతనే అమెరికను రాష్ట్రాల సమాఖ్యమీద ఇరాక్వ్యాలు యుద్ధ ప్రకటన చేయలేక పోయేరు. చాల మంది ఒనీదా శాకెమ్‌లు యుద్ధ ప్రతిపాదనను వ్యతిరేకించేరు మోహాక్‌లు, సెనెకాలు యుద్ధం చెయ్యాల్సిందే నన్నారు అందుచేత స్వంత బాధ్యతమీద యుద్ధం చెయ్యడమో, తటస్థంగా పూరుకోవడమో, ఎవరికివారే నిర్ణయించుకోమని వదిలేసేరు.

ఈరీలతో, నియెట్రల్ జాతితో, సస్ క్వెహన్నోక్‌లతో యుద్ధాలను, ఫ్రెంచివారితో చేసిన అనేక పోరాటాలను సమితిలోనే నిర్ధారించేరు. ఇరాక్వా సమాఖ్యలో నడిపిన అనేక రాయబారాల సమాచారం అమెరికను వలసల నాటి పత్రాలలో కనిపిస్తుంది. వోటు చెయ్యడంతో పనిలేకుండా సభ్యుల అభిప్రాయాల్ని కనుక్కొనేందుకు వారో మార్గం కనిపెట్టేరు. పైగా సమితి సమావేశాలలో అధిక సంఖ్యాకులు, అల్పసంఖ్యాకుల పద్ధతి విషయం వారెరగరు. తెగలవారీగా వోటు చెయ్యాలి. అంగీకారానికి తెగ సాకెమ్‌లంతా ఏక వాక్యం తెలపాలి. సమితిలో ఏకవాక్యత అవసరాన్ని గుర్తించి, వారు తరగతులనుగా తెగల సాకెమ్‌లను కూర్చి బెడతారు. తన తరగతి సాకెమ్‌లతో సంప్రదించేక, వారు తమ తరఫున మాట్లాడడానికి నియమిస్తే తప్ప ఏ సాకెమూ వోటు ఇస్తున్నట్లుగా మాట్లాడకూడదు. అందుచేత నాలుగు తరగతులుగా వున్న ఎనిమిది మంది సెనెకా సాకెమ్‌లకూ, అన్నే తరగతులుగా వున్న కయూగా సాకెమ్‌లు పదిమందికి కూడ నాలుగేసి వోట్లేవున్నాయి. ఈ విధంగా ఒకే తరగతి సాకెమ్‌లలో ముందు ఏకాభిప్రాయం ఏర్పడాలి. అప్పుడు నాలుగు తరగతుల సాకెమ్‌ల మధ్య ఏకాభిప్రాయం కోసం పరస్పరం చర్చలు జరుగుతాయి. వారిలో ఏకాభిప్రాయం వచ్చినప్పుడు దానిని ప్రకటించడానికి ఒకరిని నియమిస్తారు. అది తెగ అభిప్రాయం. ఈ విధంగా అనేక తెగల సాకెమ్‌లు ఎవరికి వారుగా ఏకాభిప్రాయానికి వచ్చేక, ఆ అభిప్రాయాలన్నిటినీ కలబోసుకుంటారు. వారందరూ అంగీకరిస్తే సమాఖ్య నిర్ణయించేస్తుంది. అజ్‌టెక్ సమాఖ్యలో అయిదు తెగల అభిప్రాయాలను తెలపడానికి నియమించిన అయిదుగురు సాకెమ్‌లూ ఆరుగురు ఎన్నికదార్ల నియామకాన్నీ, వారి బాధ్యతలనూ ప్రకటించవచ్చు. ఆ విషయాన్ని ముందు ముందు చెప్తా.

ఈ విధంగా అంగీకారాన్ని పొందే పద్ధతివలన అనేకంగా వుండే తెగల స్వాతంత్ర్యాన్ని గుర్తించి, పరిరక్షించడం జరుగుతూంది. ఎవరన్నా సాకెమ్ మొండిగా, తిక్కగా వుంటే అతనిమీద వొత్తిడులు తెస్తారు. పలుగురిదీ ఒకమాట అయినప్పుడు అతడు అడ్డపడలేడు. ఆ విధంగా అనుకూలతా, వ్యతిరేకతా అప్పుడప్పుడు వస్తూనే వుంటుంది. ఏకాభిప్రాయం ఏవిధంగానూ కుదరనప్పుడు, దానిపై చర్య తీసుకోవడం సాధ్యంకాదు గనక దానిని పక్కకు పెట్టేస్తారు.

కొత్త సాకెమ్‌లను ప్రవేశపెట్టే సంఘటనకు ప్రజలు ఎంతో వుత్సాహం చూపుతారు. కొత్త సభ్యులను చేర్చుకోవడంలో తమకు అధికారం వుండడం సాకెమ్‌లకూ సంతోషమే. సాకెమ్‌లను "పైకి ఎత్తే" సంబరం జరపడానికే మొదట

జనరల్ కౌన్సిల్ ఏర్పడింది దానికి "మైలసమితి" అనేపేరు ప్రారంభంలోనే పెట్టేరో, తర్వాత వచ్చిందో తెలియదు. చనిపోయిన వారికోసం ఏడవడమూ, తరవాత కొత్త వారిని నియమించడమూ రెండు బాధ్యతలు సమితికి వున్నాయి

ఒక శాకెమ్ చనిపోయినప్పుడు అతడి తెగవారు సర్వ సభ్య సమావేశాన్ని పిలుస్తారు చోటూ, తేదీ తెలుపుతారు వారి హక్కు అది చనిపోయిన వాని వాంపుం బెల్టును వార్తాహరునికి పెట్టి పంపిస్తారు చనిపోయిన వారి పేరు చెప్పి "ఫలానావారు సర్వ సభ్య సమావేశం పిలుస్తున్నారంటాడు అతడు అంటే అప్పుడేచోటు, సమయం కూడ తెలుపుతాడు కొన్ని సందర్భాలలో చనిపోయిన శాకెమ్‌ను సమాధి చేయగానే అతని పట్టీని ఒనొందాగాలో వున్న సమాఖ్య కేంద్రానికి పంపుతారు. ఆయన మరణించినట్లు చెప్పడం అదీ తరవాత సర్వ సభ్య సమావేశం ఎప్పుడు జరగాలో తెలియ పరుస్తారు.

శాకెమ్‌లను స్థిరపరిచేందుకు మైలసమితి జరిపే వుత్సవాలంటే ఇరాక్వోలకు ఎంతో ఆసక్తి వానికి ఎంతెంతో దూరంనుంచి మహోత్సాహంగా తరలివస్తారు. సాధారణంగా అవి అయిదురోజులపాటు అనేక రూపాల కర్మకాండలతో జరుగుతాయి మొట్టమొదటిది చనిపోయిన వానిని తలుచుకుని ఏడవడం దీనిని సూర్యోదయంతో ప్రారంభించి ఒక మత కర్మగా జరుపుతారు ఆ సమయంలో సమావేశం జరుపుతున్న తెగకు చెందిన శాకెమ్‌లు ముందు నడవగా వెనకన ఆ తెగ ప్రజలు వూరేగింపుగా బయలుదేరి వెళ్ళి ఆ వుత్సవాలకు వచ్చిన ఇతర తెగల శాకెమ్‌లకూ, ప్రజలకూ స్వాగతంచెప్తారు వారంతా ఆ కబురు తెలిసి, అప్పటికే వచ్చి కొంచెం దూరంలో మకాంచేసి, ఆ సమయానికి బయలుదేరి వస్తుంటారు పరస్పర అభివందనల తర్వాత ఊరేగింపు ఏర్పాటుచేస్తారు. స్వాగతస్థలం నుంచి సమావేశ స్థలం వరకూ గీతం రూపంలో ముందు నడిచేవారు ఏడుస్తూంటే, మిగిలిన తెగలవారు అందుకుంటూ, నడుస్తారు ఆ దుఃఖగీతంలో చనిపోయిన వాని గుణగణాలను వర్ణించి ప్రశంసిస్తారు ఆ దుఃఖంలో అతని గణమూ తెగా మాత్రమే కాదు సమాఖ్య మొత్తంగా పాల్గొంటుంది అనాగరిక ప్రజలలో వూహించనంత గౌరవాభిమానాలు దీనిలో ప్రకటించబడతాయి దీని తరవాత సమావేశం ప్రారంభమవుతుంది. దానితో ఆ రోజు కార్యక్రమం అయిపోతుంది. కొత్త శాకెమ్‌ను పదవిలో పెట్టే వుత్సవం రెండోరోజున ప్రారంభమై నాలుగోరోజువరకూ సాగుతుంది పౌర వ్యవహారాల సమితి సమావేశంలో లాగనే శాకెమ్‌లు అంతా విడిగా రెండు పంక్తులుగా ఎదురుబొదురుగా కూర్చుంటారు.

కొత్త శాకెమ్ తండ్రి తెగలకు చెందిన వాడైతే ఆ కర్మకాండను కొడుకు తెగలవారు జరిపి కొత్త శాకెమ్‌ను 'తండ్రిగా'గా ప్రతిష్ఠిస్తారు అతడు కొడుకుతెగల మూడింటిలో వాడైతే మూడు తండ్రి తెగలవారు కర్మకాండను సాగించి "కొడుకు"నుగా ప్రతిష్ఠిస్తారు వారి సామాజిక, పాలనా వ్యవస్థల స్వభావాన్ని, లక్షణాన్ని చూపడానికే ఇదంతా ఇంత వివరంగా రాయవలసి వచ్చింది

సమాఖ్య యొక్క స్వరూపాన్ని, నియమాల్ని గురించి చెప్పేందుకు వెవకటి వాంపుం బెల్టులనూ, ఇతర వస్తువులనూ తీసుకొచ్చి కొత్త శాకెమ్‌కు వాటిని గురించి వివరంగా చెప్తారు ఒక అనుభవజ్ఞుడు — ఆయన శాకెమ్ అయివుండనక్కర్లేదు — ఆ బెల్టులు ఒక్కొక్కటే తీసుకొని రెండు పంక్తుల మధ్య నడుస్తూ, వాటిలో నమోదు చేసిన విషయాలను చదివి చెప్తాడు. ఇండియనుల ఆచారం ప్రకారం ఆయా ఘటనల్లో నియమాలలో, వ్యవహారాలలో జరిగినప్పుడు వాటిని గురించి ఆ బెల్టులకు చెప్పినట్లు, ఆ విధంగా నమోదు అయిన వాటిని ఇప్పుడవి వ్యాఖ్యాతద్వారా వారికి చెప్పుతున్నట్లు భావన ఎరుపు తెలుపు పూసలు గుచ్చిన దారాలతోనో, వేరువేరు రంగుల పూసలు గుచ్చిన దారాలతోనో ఈ వాంపుం బెల్టులు అల్లుతారు ఒక ఘటనను, ఒక భావాన్ని ఒక వ్యవహారాన్ని చెప్పేందుకు ఆ అల్లికలో ఒకరకం చిత్రరూపాన్నిస్తారు ఆవిధంగా ఘటనలు గుర్తుచేసుకొనేందుకు అవి వుపయోగిస్తాయి ఈ బెల్టులూ, ఈ దారాలే ఇరాక్యూల చరిత్ర పత్రాలు. వాటిని వ్యాఖ్యానించేందుకు అన్నీ తెలిసిన అనుభవజ్ఞుడు కావాలి ఒనొందాగా శాకెమ్‌లలో ఒకరిని "హో-నో-వె-నా-టో-"వాంపుం రక్షకుడుగా (చరిత్ర పత్రాల వ్యాఖ్యాత) నియమిస్తారు ఆయనకు ఇద్దరు సహాయకుల్ని ఇస్తారు వారుకూడా వాంపుం వ్యాఖ్యానాలలో శాకెమ్ అంత నైపుణ్యాన్ని సంపాదించాలి. ఈ బెల్టులనూ, దారాలనూ గురించి వ్యాఖ్యానించడంలో ఆ అనుభవజ్ఞుడు సమాఖ్య ఏర్పడిన నాటినుంచీ జరిగిన విషయాలను ఆనుపూర్వికగా చెప్పగలడు ఆ బెల్టులు, దారాల్ని గుర్తుచేసుకుంటూ అన్ని సంగతులూ చెప్పడం ఒక సంప్రదాయం. శాకెమ్‌లను ప్రతిష్ఠించడానికై జరిగే సమితి ఒక బోధనా సమితిగా వ్యవహరిస్తుంది. దానిద్వారా సమాఖ్య నిర్మాణం, నియమ, నిబంధనలూ, దానిచరిత్రా ఇరాక్యూలలో సుస్థిరంగా జ్ఞాపకం వుంటుంది ఈ కార్యక్రమం ప్రతిరోజూ మధ్యాహ్నం వరకూ జరుగుతుంది. సాయంకాలం పూట ఆటలూ, వినోదాలూ వుంటాయి ప్రతిరోజూ సంధ్యవేళ వచ్చిన వారందరికీ విందు వుంటుంది సమితి భవనం వద్దనే పులుసు, మాంసం ఉడకపెడతారు కర్రమూకుళ్ళు, పళ్ళేలలో అటకలతో వడ్డిస్తారు. విందు

భోజనానికి ప్రార్థన వుంటుంది ఒకే మనిషి 'క్రైయ్' మని గట్టిగా కేక ప్రారంభించి క్రమంగా తగ్గిస్తూ ఉండిపోతాడు. ప్రజలంతా అతనితోపాటు గొంతు కలుపుతారు. అదే ప్రార్థన సాయంకాలాలప్పుడు నృత్యాల జరుగుతాయి. శాకెమ్‌లను పదవులలో స్థిర పరచేందుకు ఈ విధంగా ఎన్నో రోజుల ఉత్సవాలు, వినోదాలు జరుగుతాయి.

జనరల్ కౌన్సిల్‌లో శాకెమ్‌ల పదవులను స్థిరీకరించడం ద్వారా సమాఖ్యను ఏర్పరచిన వారు మూడు ప్రయోజనాలను ఆశించారు గణాల పారంపర్యం హక్కును శాశ్వతం చేయడం ఒకటి, గణ సభ్యులు స్వతంత్రంగా ఎన్నిక అయ్యే సౌకర్యము రెండోది పదవిలో స్థిరీకరించడం ద్వారా ఆ కార్యవిధానం మీద ప్రాధికారం నిలుపుకోడం మూడోది. చివర దానిని సమర్థవంతంగా నిర్వహించాలంటే ఎన్నుకొన్న శాకెమ్‌ను నిరాకరించే హక్కు కూడా వుండాలి పదవిలో స్థిరీకరించడం పని వట్టి నామమాత్రమేనా, సమాఖ్య సమితికి వారిని నిరాకరించే హక్కు కూడా వున్నదా అంటే నేను చెప్పలేను నిరాకరించినట్లు దాఖలా లేదు శాకెమ్‌లలో ఒక పాలక వ్యవస్థను ఏర్పరచుకోవడం ఇంత క్రితం ఎవ్వరూ చేయలేదని ఇరాక్వాలు చెప్పుకుంటారు తమ పరిస్థితికి అదే తగినదని అంటారు రూపంలో ఇది బహుజన పరిపాలన (oligarchy) అయినా అతి ప్రాచీనకాల ప్రజాతంత్రానికి నమూనా బలమైన ప్రజాభిప్రాయం దాని వెనక వుంది దాని కార్యవిధానాన్ని ప్రభావితం చేస్తూంది తమ శాకెమ్‌లను ఎన్నుకొనేందుకూ, తొలగించేందుకూ గణాలకు అధికారం వుంది సమితిలో తాము ఎంపిక చేసి పంపిన వక్తల ద్వారా తమ అభిప్రాయాలను చెప్పుకొనే హక్కు ప్రజలకు వుంది. సైనికులుగా చేరడం అనేది ఇష్టం మీద ఆధారపడి వుంది — వీటితోనే ప్రజాభిప్రాయానికున్న బలం కనబడుతూంది ఈ కాలంలోనూ, దీని తర్వాత వస్తున్న మానవ జాతి దశాకాలంలోనూ గణ సమాజంలో ప్రజాతంత్ర సూత్రాలకు ప్రాముఖ్యం వుంది

ఇరాక్వాలలో శాకెమ్‌కు పేరు "హో-యార్-నా-గో-వార్" అంటే "ప్రజలకు ఆలోచన, సలహా చెప్పేవాడు. స్వేచ్ఛాయుత ప్రజాతంత్రంలో పాలనాధికారికి ఈ పదం సరిగ్గా సరిపడుతుంది అయన పదవి ఏమిటో సరిగ్గా చెప్పడమే కాదు. గ్రీకు దేశపు నాయకుల సమితి సభ్యుల పేరుతో సరిగ్గా సరిపడుతూంది కూడా. గ్రీకులు తమ నాయకులను "ప్రజలకు సలహాదారులు" అనే పిలిచేరు ఆ పదవి స్వభావం, దాని కాలపరిమితిచూస్తే ఇరాక్వా శాకెమ్‌లకు పరిపాలనాధికారం సహజ హక్కుగా రాలేదు. గణాలు వారిని స్వేచ్ఛాయుత ఎన్నికలలో ఎన్నుకొంటారు. ఆటవిక దశలో పుట్టిన ఈ పదవి అనాగరిగ యుగం మూడు దశలలోనూ కొనసాగింది. నాగరిక దశలోకి

కొందరు చేరినాక కూడా గ్రీకుల గణ వ్యవస్థ ఈ అతి ప్రాచీన పాలనా రూపాన్ని కనబరచడం చాల గణనీయమైన విషయం గణ సంస్థల కాలంలో ప్రజాతంత్ర సూత్రం మనుష్యుల మనస్సులలో ఎంత లోతుగా పాతుకుందో చెప్పడానికి కూడా ఇదొక వుదాహరణ.

రెండో స్థాయి నాయకుని పేరు ఇరాక్వ్యూలలో "హ-న-నో-వా-నా". దాని అర్థం "పేరు తెచ్చుకున్న", వ్యక్తులలో వుండే ఔన్నత్య కాంక్షను అనాగరిక దశలోనే గుర్తించేరనడానికి ఇది నిదర్శనం అభివృద్ధి క్రమంలో పైన వున్నా, క్రిందవున్నా మనుష్య స్వభావం ఒక్క-లాగే వుంటుందనడానికి కూడా ఇది వుదాహరణే ఇరాక్వ్యూలలో పేరుపడ్డ వక్తలు, అనుభవజ్ఞులు, యుద్ధ నాయకులు అందరూ ద్వితీయ శ్రేణి నాయకులే దీనికో కారణం కూడా కనిపిస్తుంది. శాకెమ్‌లు చేయవలసిన పనులన్నీ శాంతి వ్యవహారానికి సంబంధించినవే. మంచి సమర్థులయిన వారిని పాలనా వ్యవస్థలోకి తెస్తే వారిలోని ఆశలు సమితి కార్యక్రమాలను భగ్నం చేస్తాయనే ఆలోచన కూడా వున్నదేమో. నాయకత్వం హోదా సామర్థ్యాన్ని పట్టి ఇస్తారు కనక అది సమర్థులకే దక్కు-తుంది రెడ్-జాకెట్, బ్రాంట్, గరాంగులా, కారన్ ప్లాంటర్, పార్కర్స్ బ్రదర్, ప్రాస్ట్, జాన్సన్‌లాంటి ప్రసిద్ధులు ఇరాక్వ్యూలలో ఎందరోవున్నారు. వీరు ఎవ్వరూ శాకెమ్‌లుకారు నాయకులుగా ప్రసిద్ధి పొందినవారే. లోగన్ (శయూగా), సుందర వదన్ను (సెనెకా - ఇరాక్వ్యూలలోనూ తన మత ప్రవక్త), ఇటీవలి వాడే ఎలీ ఎస్ పార్కు-ర్ (సెనెకా) లు తప్ప చిరకాలంగా ఆ శాకెమ్ పదవుల నలంకరించిన వారిలో పేరు మిగిలిన వారు లేరు వీరి పేర్లు మాత్రమే అమెరికను చరిత్ర కెక్కా-యి.

సమాఖ్య ఏర్పడిన కాలంలో ఒనొందాగా నాయకులలో "తో-దో-దా-హో" చాల ప్రసిద్ధుడు పలుకుబడిగలవాడూను తన అధికారం పోతుందనే విచారంలేకుండా, సమాఖ్య ఏర్పడడానికి ఒప్పుకోవడం చాల గొప్ప విషయం ఆయనను ఒనొందాగా శాకెమ్‌గా ఎన్నుకున్నారు వారి పేర్లలో ఆయనకు ప్రథమస్థానం ఇచ్చేరు ఇద్దరుశాకెమ్ లను ఆయనకు సహాయకులుగా, పైకి ఎత్తేరు సభలు, ఉత్సవాలలో వారు ఆయన వెనక వుండాలి ఆ మొదటి తో-దో-దా-హో చేసిన సేవకు గుర్తింపుగా వలభయ్యేనిమిది శాకెమ్ స్థానాలలో ఆ స్థానానికి నేటికీ అధిక గౌరవం ఇస్తున్నారు ఈ పరిస్థితిని చూసి ఆయనను ఇరాక్వ్యూల రాజుగా వర్ణించేరు యూరపియను వలస దారులు. కాని ఆ దురభి ప్రాయం తొలగించబడింది. ఇరాక్వ్యూల వ్యవస్థకు ఆ అసంభవ లక్షణం బాధ తప్పింది. జనరల్ కౌన్సిలులో ఆ శాకెమ్ కూడా మిగిలిన వారితో సమాన హోదా

లోనే కూర్చుంటాడు సమాఖ్యకు ప్రధాన కార్య నిర్వహణాధికారి అంటూ లేదు

సమాఖ్య ఏర్పడ్డాకనే 'హాస్-గా- ఆ-గేహ్-దా-గో-వా' సేనాధిపతి పదవి (మహా యోధుడు) మొదటి మారు ఏర్పడింది అనేక తెగలు ఇప్పుడు సమాఖ్యలో భాగాలుగా యుద్ధాలలో పాల్గొనే పరిస్థితి వచ్చింది సమైక్య సైన్య దళాలను నడపడానికి సైన్యాధ్యక్షుడు అవసరం అయ్యేడు ప్రభుత్వంలో ఈ పదవిని శాశ్వత రూపంలో ప్రతిష్ఠించడం మానవ పురోగతి చరిత్రలో ఒక ప్రధాన ఘటన పౌర వ్యవహారాల నుంచి సైన్య వ్యవహారాలను విడదీయడం దీనితో ప్రారంభం అయి, ఆ క్రమం పూర్తి అయ్యేనరికి ప్రభుత్వం బాహ్యరూపమే పూర్తిగా మారిపోతుంది ఇటుతరవాత సైన్యచర్యల యెడ ఉత్సాహం మితిమీరి వున్నప్పుడు కూడా ప్రభుత్వంయొక్క నిజ స్వరూపంలో మార్పులేదు. గణతత్వం అధికార దాహాన్ని పొగనివ్వదు సైన్యాధిపత్య పదవి వచ్చేక ఏకాధికార ప్రభుత్వం నుంచి ద్వంద్వ ప్రభుత్వంలోకి మార్పు క్రమంగా వచ్చింది కాలక్రమంలో ప్రభుత్వ వ్యవహారాలు ఈ రెండింటి మధ్యా సమన్వయం చేయబడ్డాయి దానికి ఈ కొత్త పదవి ప్రధాన కార్యనిర్వహణాధికారి పదవికి బీజం అయింది ఈ సేనాధిపతి క్రమంలో రాజు అయ్యేడు. అధ్యక్షుడు చక్రవర్తి, అయ్యేడు ఆ పరిణామాలను తరవాత వివరిస్తాను సమాజంలోని సైనికావసరాల దృష్టిలోంచి ఆ పదవి మొదట ఏర్పరచ బడింది క్రమంగా అది పరిణామం పొందింది అందుచేత అది ప్రప్రథమంగా కనబడ డాన్ని, దాని క్రమ పరిణామాన్ని ముఖ్యంగా చర్చించాలిసి వుంది. ఇరాక్వ్యాలలో ఈ మహాయోధుడు పదవి, అజ్టెక్‌ల త్యూక్ట్లీగా, గ్రీకుల 'బాసిలస్'గా, రోమనుల 'రెక్స్'గా ఎల్లా క్రమ పరిణామం పొందిందో దీనిలో చూపిస్తాను వీరందరిలోనూ మానవజాతి పరిణామ దశలోని మూడు దశలలోనూ ఆ పదవి సైనికప్రజాతంత్రంలో సైన్యాధ్యక్ష పదవిగానే వుండింది. ఇరాక్వ్యాలలో, అజ్టెక్‌లలో, రోమనులలో ఈ పదవికి ఎన్నికలు జరగడమో, ఒక నియోజక వర్గ ప్రజ స్థిరీకరించడమో జరగవలసే వుండేది సంప్రదాయక యుగంలో గ్రీకులలోనూ అదేస్థితి వుండింది అనుకోవాలి. హోమరు కాలం నాటి గ్రీకులలో 'బాసిలను' పదవి తండ్రి నుంచి కొడుక్కు వారసత్వంగా వుంది అంటారు. కాని, ఇది సందేహాస్పదం ఆ పదవికి ప్రారంభంలో వున్న కాలపరిమితికి అది పూర్తిగా వ్యతిరేకం కనక స్పష్టమైన రుజువు ఉంటే తప్ప అంగీకరించలేము. గణ నిర్మాణం కొనసాగుతున్న దశలో ఎన్నిక జరగడమో, ఒక నియోజక వర్గం యొక్క ధృవీకరణో అత్యవసరమే. తండ్రినుంచి కొడుక్కు ఆ

పదవి వారసత్వంగా సంక్రమించడానికి ఉదాహరణలు చాలా వుంటే అలా అను కోవచ్చు కాని, ఈ రూపంలో వారసత్వం అనాదులేదు సాంప్రదాయిక యుగంలో సమాజ నిర్మాణం ఎలావుండేదో, ఎటువంటి వుపయోగాలు వుండేవో బాగా తెలుసు కొనేందుకు తగిన సమాచారంలేదు అవసరమైన సందర్భాలలోనే మానవుడు పెద్ద పెద్ద ఆచరణ నియమాలను ఏర్పరచు కొంటాడు అని వూహించడం ఇటువంటి సందర్భా లలో క్షేమకరం. కుటుంబ వారసత్వాన్ని బలపూర్వకంగా అమలు జరిపివుంటారు గాని, ప్రజలు దానికిష్టపడి అంగీకరించడం జరగదు హోమరు కాలంనాడు గ్రీకు తెగలలో ఇటువంటి స్థితి వుండదు.

ఇరాక్వూ సమాఖ్య ఏర్పడినప్పుడో, కొద్దికాలం తరవాతనో శాశ్వత ప్రాతి పదిక మీద రెండు యుద్ధ నాయక పదవులు ఏర్పరచబడ్డాయి రెండింటికీ పేర్లుపెట్టేరు. రెండూ సెనెకా తెగకే ఇచ్చేరు వానిలో ఒకదానిపేరు "తా-వాన్-నే--అర్స్" అంటే "సూది విరగొట్టేవాడు" ఇది తోడేలు గణంలో పారంపర్యంగా కొనసాగు తుంది రెండో దానిపేరు "సో-నో-సో-వా-" అంటే పెద్ద ఒయ్‌స్టర్ గుల్ల ఇది తాబేలు గణంలో పారంపర్యంగా వస్తుంది సెనెకాల భూమికి పశ్చిమంవేపు నుంచి వారిమీద ఆక్రమణ జరిగే ప్రమాదం ఎక్కువగా వుండడంచేత వారికే ఆ పదవులు రెండూ నప్పచెప్పేరు. సాకెమ్‌లనులాగే వారినీ ఎన్నుకొంటారు. జనరల్ కౌన్సిలు వారిని స్థిర పరచాలి, వారిద్దరి హోదా, అధికారం సమానం. ఈ పదవులను తరవాత ఎప్పుడో సృష్టించారనే వాదం ఒకటి వుంది సమాఖ్య ఏర్పడిన వెంటనే దాని సైనిక ఆదేశాలను అమలు పరిచేందుకు మనిషి లేదని వారికి తట్టి వుంటుంది. ఈ లోపాన్ని భర్తీచేయడానికి జనరల్ కౌన్సిలును సమావేశపరిచారు అందులో ప్రధాన సైన్యాధ్యక్షులు ఇద్దరిని నిర్ణయించేరు ప్రధాన సైన్యాధ్యక్షులుగా సమాఖ్యయొక్క సైనిక వ్యవహారాలు వారిచేతుల్లో వుంటాయి సమైక్యంగా జరిపే యుద్ధచర్యలలో సమష్టి సేనపై నాయకత్వం వారిది అవుతుంది ఇటీవలనే చనిపోయిన గవర్నరు 'బ్లాక్ సర్పం' ఆ మొదటి పదవిని నిర్వహించేరు. దానిని పట్టి పారంపర్యం యధాక్రమంలో సాగిందనవచ్చు ప్రధాన సైన్యాధికారుల్ని ఇద్దరిని, సమానాధి కారాలతో నియమిం చారంటే సైన్యవ్యవహారాల్లో కూడా ఏ ఒక్కరో పెత్తనం వహించకుండేందుకు చేసినదనే రెక్స్ పదవిని రద్దుచేసేక రోమనులు కాన్సల్ పదవుల్ని రెండింటిని సృష్టించినట్లే వీరూ, అనుభవంలేక పోయినా అదే పనిచేసేరు. సైనికాధికారాన్ని ఇద్దరు కాన్సల్‌లు సమతూకంలో వుంచుతారు. ఏ ఒకరూ సర్వాధికారి కాకుండా రెండోవారు

అర్థపడతారు ఇరాక్వాలలో ఈ పదవి ఎప్పుడూ విశేష వలుకుబడిగలది కాలేదు.

ఇండియన్ మానవజాతి శాస్త్రంలో ప్రాముఖ్యంగల అంశాలు గణము, ఫ్రాట్రీ, తెగ, సమాఖ్యలు. అవి ఆ సమాజ నిర్మాణాన్ని కనబరుస్తున్నాయి శాకెమ్,నాయక పద వుల కాలపరిమితి, వానిబాధ్యతలు, నాయక సమితి బాధ్యతలు, ప్రధాన సైన్యాధికారి పదవికాల పరిమితి, బాధ్యతలు ద్వితీయ ప్రాముఖ్యం గల అంశాలు ఈ విషయాలను స్థిర పరచుకొంటే వారి ప్రభుత్వ వ్యవస్థ నిర్మాణ స్వరూపము, నియమ నిబంధనలు తెలుస్తాయి. వారి అలవాట్లు ఆచారాలు గురించి, కళలు కల్పనలు గురించి, జీవిత పద్ధ తుల పరిజ్ఞానంతో ఒక సమగ్ర చిత్రం ఏర్పడుతుంది. అమెరికను పరిశోధకులు మొదటి దానియెడ విశేష శ్రద్ధ చూపలేదు. ఇప్పటికైనా వానిని గురించి ఎంతో సమా చారం సేకరించగల అవకాశం వుంది. మన పరిజ్ఞానం స్థూల మాత్రంగా వున్నది సూక్ష్మ విషయాలను కూడా పరిశీలించాలి. పోలికలు బేరీజు వేయాలి అమెరికను ఇండియనులు అనాగరిక యుగం దిగువ, మధ్య దశలలో వున్నారు. ఆటవికత నుంచి నాగరికతకు పరిక్రమించే క్రమంలో ఇవి రెండూ రెండు ప్రధాన మజిలీలు. మన పూర్వులు కూడా ఏనాడో ఒకదాని తర్వాత ఒకటి గా ఈ మజిలీలను దాటేరు. వారిలో కూడా ఇవే మాదిరి నిర్మాణాలు చాల వరకు ఇల్లాంటివే అలవాట్లూ, ఆచారాలు వుండే వనడానికి సందేహం అక్కర్లేదు అమెరికను ఇండియన్ల యెడ మనకు ఆసక్తి వున్నా, లేకపోయినా వారి అనుభవం మనకు చాలా దగ్గరిది మన పూర్వులుకూడా అటువంటి అనుభవాలను పొందిన వారే మనలోకూడా ప్రాతిపదిక నిర్మాణాలకు మూలం గణసమాజమే. వానిలో గణాలు, ఫ్రాట్రీలు, తెగలూనే, నిర్మాణరూపాలు. నాయకుల సమితే ప్రభుత్వ పాలనా కార్యాలను నిర్వహించేది ఆ ప్రాచీన సమాజం అనేక విషయాలలో ఇరాక్వాలు మొదలైన ఇండియను తెగల సమాజాన్నే పోలి వుండేవి. ఒక దానితో మరొకదానికి పోలికలు గల నిర్మాణాల యెడ విశేష శ్రద్ధ చూపడానికి ఈ ఆలోచన సహకరిస్తుంది

ఈ నిర్మాణ రూపంగల గణ సమాజానికి ఇరాక్వాల సమాఖ్య మంచి వుదా హరణ అనాగరిక యుగం దిగువ దశలోని గణనిర్మాణం యొక్క సామర్థ్యాల నన్నింటినీ అది ఉపయోగించుకుంది అభివృద్ధికి మార్గం విడిచి పెట్టిందేగాని ముందుకు కూడా ప్రభుత్వ స్వరూపాన్ని నిర్ధారణ చేయలేదు భూభాగాలు ఆస్తులు, ప్రాతిపదికగా రాజకీయ సమాజం ఏర్పడి, గణవ్యవస్థను రద్దుచేశాకనే పాలనా వ్యవస్థకో తరువాతి, దశ ప్రారంభ మవుతుంది మధ్యలో వచ్చే అంతర్దశలు తాత్కాలికం ఎక్కడేనా

అధికారాన్ని కబళించి, దౌర్జన్యయుత అధికారాలు తాత్కాలికంగా ఏర్పడినా ఆ మధ్య కాలం అంతటా సైనిక ప్రజాస్వామ్యాలే కొనసాగేయి ఇరాక్వాలు సమాఖ్య మౌలికంగా ప్రజాతంత్రం అది గణాం తోనే ఏర్పడింది ప్రతి గణమూ ప్రజాతంత్ర సూత్రాల మీదనే ఏర్పరచబడింది ఆ ప్రజాతంత్రం కూడా అతి ప్రాచీన రూపం గలదే గాని ఆధునికంకాదు. స్థానిక స్వయం పరిపాలనాధికారం తెగల చేతులలోనే వుండడం దానిని చూపుతూంది వారు ఇతర తెగలను జయించి, వారిని తమ అధీనంలో వుంచు కుంటున్నారు డెలావేర్లు ఇందుకు వుదాహరణ అయితే ఆ డెలావేర్లు తమ నాయకుల పరిపాలన కిందనే వున్నారు కాని వారినుంచి సమాఖ్యకు చేకూరిన బలం ఏమీలేదు. సమాజం వున్న ఈ దశలో వివిధ భాషలు మాట్లాడే తెగల్ని ఒక ప్రభుత్వం క్రింద వుంచడం కాని, నజరానా పుచ్చుకోడం తప్ప ఓడించిన తెగల నుంచి ఇతర లాభాలు పొంద గలగడం కాని సాధ్యమయ్యే పనికాదు.

ఇరాక్వా సమాఖ్య గురించి ఇంతవరకు చెప్పినది సమగ్రంకాదు కాని, ప్రస్తుత ప్రయోజనానికి ఇదిచాలు. ఇరాక్వాలు తెలివిగలవాళ్ళు చురుకైనవాళ్ళు ఆర్యను తెగల సగటుమెదడు పరిమాణానికి దగ్గర దగ్గరగా వుంది వారి మెదడు ప్రమాణమున్నూ మంచివక్తలు, యుద్ధాల్లో కఠవాదులు పనిపట్టుకుంటే మరివదలరు. వారు చరిత్రలో ఒక స్థానం సంపాదించుకున్నారు యుద్ధాలలో ఆటవికుల క్రూరత్వం చూపినా, పరస్పర సంబంధాలలో ఉన్నత మానవ సద్గుణాలను ప్రదర్శించారు వారు ఏర్పరచు కొన్న సమాఖ్య వారి తెలివికీ, చాతుర్యానికీ ప్రతీక దాని లక్ష్యం శాంతి తమ తెగలను ఒకే పాలనా వ్యవస్థ కిందకు తెచ్చి వారిమధ్య ఘర్షణలు నివారించడం, తరవాత ఒకే పేరు, వంశ పారంపర్యంగల ఇతర తెగలను కూడా చేర్చుకోవడం దానిలక్ష్యాలు. ఈరీలనూ, నియోట్రాల్ నేషన్‌నూ సమాఖ్యలో చేరవలసిందిగా వారు కోరేరు. వారు నిరాకరించడంచేత వారిని తమ సరిహద్దులనుంచి తరిమేశారు తమ పాలనాధికారాన్ని అంత ఉన్నత ఆశయాలతో ఏర్పరచుకోవడం వారి తెలివితేటలకు నిదర్శనం. వారి సంఖ్య అయితే కొద్దే కాని, వారిలో ఎందరో మంచి సమర్థులు వుండేరు వారి ఉన్నత సంప్రదాయానికి అది గుర్తు

ఉత్తర అమెరికాలో ప్రాబల్యం కోసం పోటీపడుతున్న ఇంగ్లీషువారికీ ఫ్రెంచివారికీ మధ్య జరిగిన ఘటనా క్రమంమీద వారు తమ స్థానంలో సైనిక సామర్థ్యంతో మంచి ప్రభావం కలిగించేరు ఆ రెండు దేశాలూ బలంలో, వనరులలో అనాడు సరిసమానంగానేవున్నాయి. అయితే నూతన ప్రపంచంలో సామ్రాజ్యాన్ని

నెలకొల్పేందుకు ప్రైంచివారు వేసుకున్న పథకాలు భగ్నం కావడానికి ఆరాత్మ్యాలే కారణం.

గ్రీకుల, రోమనుల గణాల్ని గురించి మనకు విశేషం తెలియదు. సామాజిక వ్యవస్థ యొక్క అతి ప్రాచీన రూపంగా గణములను గురించీ దాని సామర్థ్యాలను గురించీ తెలుసుకుంటే గ్రీకు, రోమను గణాలు కూడా అర్థం అవుతాయి. పూర్తిగా రెండు మానవజాతి పరిణామదశల అనుభవం అదనంగా సంపాదించి నాగరికదశలో అడుగుపెడుతున్న నాటికి వారిలో కూడ గణసమాజం, గణాలు, ఫ్రాట్రీలు, తెగలలో ఏర్పడిన ప్రభుత్వ వ్యవస్థే వుంది వారిలో పురుష పారంపర్యం ఏర్పడింది

రక్త బంధువులకుగాక ఆస్తి కొడుకులకే సంక్రమిస్తూంది. కుటుంబం దంపత (monogomy) స్వరూపానికి చేరుతోంది ఆస్తి పెరిగి, యజమానిదశకు చేరుతూంది. నగరాలలో జనసంఖ్య పెరుగుతుంది ఆవిరాజకీడ స్థాయిలో ప్రభుత్వాన్ని ఏర్పరచవలసిన అవసరాన్ని కలిగిస్తున్నాయి ప్రభుత్వ నిర్మాణ పథకాల్లో ఇది రెండోది నాగరికతను సమీపిస్తున్న కొద్దీ సమాజం అవసరాలను పెరకటి గణవ్యవస్థ తీర్చలేకుండా వుంది భూభాగాలు, ఆస్తులు ప్రాతి పదిక ఏర్పడగల రాజ్యస్వరూపం గ్రీకుల, రోమనుల మనస్సులను విరిచేస్తూంది. దాని ముందరగణాలూ, తెగలూ అదృశ్యం అవుతాయి. రెండో ప్రభుత్వ పథకాన్ని అమలు జరపడానికి గణాలస్థానే పట్టణాలు, వార్డుల నిర్మాణాన్ని గుర్తించాలి. గణాల స్థానంలో భూభాగాలు ప్రాముఖ్యం వహించాలి గణాలు దిగజారడం పట్టణాలు ప్రాబల్యం వహించడం అనాగరిక — నాగరిక ప్రపంచాలను విడదీ పే, పురాతన —అధునాతన సమాజాలను విడదీ పే సరిహద్దు గీత అనిచెప్పవచ్చును.

## ఆరో ప్రకరణం

# గనోవానియన్ కుటుంబంలో ఇతర తెగల గణాలు

**అమెరికన్ ఆదివాసులలో విభాగాలు - ఇండియను తెగలలో గణాలు వాటి పారంపర్య వారసత్వ నిబంధనలు - హోడెనో షౌనియన్ తెగలు, 2. డాకోటియన్ తెగలు, 3. గల్ఫ్ తెగలు, 4. పావ్నీ తెగలు, 5. అల్గోంకిన్ తెగలు, 6. అథపాస్కో - అపాచీ తెగలు, 7 వాయువ్యకోస్తా తెగలు, - ఎస్కిమోలు ఒక ప్రత్యేక కుటుంబం - 8. సాలిష్, సహాప్టిన్, కూటెనే తెగలు. 9. షోషోనీ తెగలు, 10. న్యూ మెక్సికో, మెక్సికో, ఉత్తర అమెరికాల గ్రామవాసి ఇండియను తెగలు, 11. దక్షిణ అమెరికాలోని ఇండియన్ తెగలు-గణ కుటుంబాల వ్యవస్థలో గణనిర్మాణం సార్వత్రికం —**

అమెరికాను కనుక్కొన్న నాటికి వివిధ ప్రాంతాలలో నివసిస్తున్న ఆదివాసులు రెండురకాలుగా జీవిస్తున్నారు. వాళ్ళద్దరి మధ్య పోలికలు లేవు. ఒకరు— పెరళ్ళలో పెంచుకొనే మొక్కలు, చెట్లమీదనే బతుకుతున్నవారు. న్యూ మెక్సికో, మెక్సికో మధ్య అమెరికా, ఆండీస్ పర్వత పీఠభూములలో వీరు ఉంటున్నారు. రెండో వారికి మొక్కల పెంపకం తెలియదు. వీరు ప్రధానంగా చేపలు, బ్రెడ్ రూట్—కర్రపెండలం వేటమీద జీవిస్తున్నారు. కొలంబియా లోయలో, హడ్సన్ బే ప్రాంత భూములలో, కెనడాలోని కొన్ని భాగాలలో, అమెరికాలోని కొన్ని ఇతర ప్రాంతాలలో వీరు ఉంటున్నారు ఈ రెండు తరహాల వారి మధ్య అనేక అంతరువులలో కొద్దిగా మొక్కల పెంపకం తెలిసి, గ్రామ నివాసానికి పూర్తిగా అలవడి వుండని ఆదివాసి ఇండియనులు వున్నారు. ఇరాక్వోలు, న్యూ-ఇంగ్లండు, వర్జీనియాలలోని ఇండియనులు క్రీకులు, చోక్టాలు, చెరోకీలు, మిన్నిటారీలు, దకోటాలు, షానీలు ఈ తరహాకు చెందుతారు. వారి ఆయుధాలు, కళలు, అలవాట్లు, కల్పనలు, నృత్యాలు, గృహనిర్మాణ

పద్ధతులు, పాలనా వ్యవస్థ, జీవన విధానం- వీటివెనక్కాల ఒకే దశలోని సమస్థితి కనబడుతుంది. మౌలిక భావనలు వివిధ పరిణామ దశల్లో, అనేకానేక రూపాల్లో కనిపిస్తాయి. గ్రామవాసి ఇండియనులకూ, ఇతరులకూ మధ్యనున్న పరిణామ దశల అంతరాన్ని అతిగా ఊహించడం మనం చేసిన మొదటి తప్పు. మొక్కజొన్న పెంపకం ఎరగని, గ్రామజీవితానికి పూర్తిగా అలవడని ఇండియనుల పరిణామ దశను తక్కువగా ఊహించడం రెండో తప్పు. తత్ఫలితంగా వారిద్దరినీ వేరుచేసి, భిన్న జాతులవారిగా ఊహించడం మూడో తప్పు. వారు భిన్న భిన్న పరిస్థితుల్లో వుండగా చూశాం. వారి మధ్య తేడా స్పష్టంగా వుంది. మొక్కజొన్న పెంపకం తెలియని ఇండియన్లలో చాలామంది అటవికయుగం ఎగువదశలో వున్నారు. గ్రామవాసి ఇండియన్లు అనాగరికయుగం మధ్యదశలో వున్నారు. అటూ ఇటూ గాకుండా మధ్యరకంగా వున్నవారు అనాగరిక యుగం దిగువ దశలో వున్నారు. వీరందరికీ మూలం ఒకటేనని చెప్పటానికి నిర్ద్వంద్వమైన సాక్ష్యం ఇప్పటికీ దొరుకుతుంది. అయినా కొందరుదాన్ని ఒప్పుకోవడంలేదు. ఎస్కిమోలు మరో కుటుంబానికి చెందుతారు.

మరో గ్రంథంలో నేను 70 అమెరికను తెగల మధ్య వున్న రక్త బంధుత్వ వ్యవస్థనూ, సాన్నిహిత్యాన్నీ చూపించాను. ఒకే వ్యవస్థలో వారంతా ఉండడంవల్ల, వారి మూలం ఒకటేనని చూపటానికి తగినన్ని కారణాలుండడంతో, వారు మానవజాతి కుటుంబంలో ఒక నిర్దిష్టమైన దశకి చెందుతారని చూపుతూ దానికి గనోవానియన్ కుటుంబం అనే (ganowanian) పేరున పిలిచేను. విల్లు - అంబులు ఎరిగిన మానవులు వీరు.

అతి ప్రాచీన రూపంలో వున్న గణాల లక్షణాలను పరిశీలించేక గనోవానియన్ కుటుంబపు తెగల్లో అవి ఎంత విస్తృతంగా వున్నాయో పరిశీలించాలి. ఈ ప్రకరణంలో వాటిలో ఈ నిర్మాణరూపం ఎంత విస్తృతంగా వుందో పరిశీలిస్తాను. ప్రతి తెగలోని గణాలపేర్లను, ఆస్తి వరసకు సంబంధించిన పారంపర్యం, వారసత్వం నిబంధనలను నా పరిశీలనకు ఆధారం చేసుకుంటాను. వాటిలో గణ సంస్థ వుందా, లేదా అనేది స్థిరపరచడం ప్రధాన విషయం. ఈ తెగలన్నింటిలో గణం అన్నది కనబడితే, దాని ప్రధాన లక్షణాలు ఇరోక్వా గణాల వంటివే అయితే వాటిని మరింతగా పరిశీలించడం అనవసరం. దేంటికీ పోలిక లేదని చెప్తే తప్ప ఇండియను తెగలోనో, దాని మధ్య గణాలలోనో, ఆ వ్యవస్థ వున్నదని నేను ధృవ పరచుకొన్నట్లే భావించాలి. రక్త బంధుత్వ వ్యవస్థలు (System of Consanguinity) పుస్తకంలో అనుసరించిన వర్గీకరణనే ఇందులోనూ అనుసరించేను.

## 1. హెడొనో సొనియన్ తెగలు

(1) ఇరాక్యూలు ఇరాక్యూ తెగలను పరిశీలించడం జరిగింది చెప్పే పేనుకూడా:
1. తోడేలు, 2 ఎలుగు, 3. బీవర్ 4. తాబేలు, 5 లేడి, 6. ఉల్లంకిపిట్ట, 7 కొంగ, 8 డేగ

## 2. వ్యాన్‌దోతేలు

ఇది ప్రాచీన హురోన్ తెగ అవశేషం. దీనిలో ఎనిమిది గణాలున్నాయి
1 ఎముకలు నమిలే-తోడేలు 2. చెట్లమీద నివసించే ఎలుగు 3 నిగ్గరి బీవర్, 4. మంచినేల-తాంబేలు 5 తిరుగుబోతు-లేడి 6 పాకుతున్న - పాము 7 ఎత్తైన చెట్టుమీది- ముళ్ళపంది, 8 ఎగురుతున్న- డేగ

వీరిలో స్త్రీల పారంపర్యం వుంది గణాలలో అంతర్వివాహం నిషిద్ధం శాకెమ్‌ల, పౌర నాయకుల పదవులు గణంలో పారంపర్యం. సభ్యుల నుంచి ఎన్నుకో బడతాయి. వారిలో ఏడుగురు శాకెమ్‌లు, యుద్ధ నాయకులు కూడావున్నారు. డేగ గణం అంతరించి పోయింది శాకెమ్ పదవి అన్ననుంచి తమ్ముడికో, మేనమామనుంచి మేనల్లుడికో ఇస్తారు కాని యుద్ధ నాయకపదవి అర్హతనుపట్టి ఇస్తారు. దీనికి పారంపర్యంలేదు ఆస్తి వారసత్వం గణంలోనే వుంటుంది. అందుచేత తండ్రి నుంచి పిల్లలకు ఏమీరాదు తల్లి వస్తువులు వారికి చెందుతాయి. ఇక్కడి నుంచి ప్రత్యేకించి నియమంగా పేర్కొంటే తప్ప వారసత్వం వివాహితులకూ, అవివాహితులకూ కూడ చెందుతుందనే అర్థం నాయకుల్ని ఎన్నుకొనేందుకూ, తొలగించేందుకూ కూడ గణానికి హక్కుంది వ్యాన్‌దోతేలు ఇరాక్యూల నుంచి విడిపోయి కనీసం నాలుగువందల ఏళ్ళు అయింది. అయినా నేటికీ ఇద్దరిలో అయిదుగణాలు ఒకే విధంగా వున్నాయి గుర్తుపట్టడానికి వీలులేనంతగా పేరు మార్చడమో, ఏదో కొత్త విశేషణం చేర్చడమో జరిగింది.

ఈరీలు, నియోట్రాల్‌నేషన్, నొట్టోవేలు, ట్యూటెలోలు, సుస్క్వె హన్నాకలు వీరంతా అదే కుటుంబానికి చెందినా కొందరు అంతరించి పోవడమో, ఇతర తెగలలో కలిసి పోవడమో జరిగింది ట్యూటెలోలు ఇరాక్యూలలోని వాళ్ళేనని హోరేషియో హాలే వ్రాసేరు సుస్క్వె హన్నాకలూ ఇరాక్యూలలో వాళ్ళేనని ప్రొఫెసర్ పార్క్‌మన్ ఇటీవలనే నిదర్శనాలతో నిరూపించేరు, వారూ బహుశా గణాలుగా ఏర్పడే వుంటారు, కాని అందుకు నిదర్శనాలు దొరకలేదు.

## 3 డాకోటియన్ తెగలు

అమెరికన్ ఆదివాసులలో వీరిది పెద్దసంఖ్య వారిని చూసిన నాటికే వారు అనేక శాఖలుగా విడిపోయేరు అనేక మాండలికాలు వృద్ధి పొందేయి అయితే వారి నివాస భూములు పక్కపక్కనే కలిసివున్నాయి మిస్సిసిపీనది ఎగువభాగంలో, మిస్సోరీ నది రెండు ఒడ్డుల్నీ రమారమి వేయి మైళ్ళకు పైగా వ్యాపించి వుండేవారు. బహుశా ఇరాక్వ్యాలూ, వారి అనుబంధ తెగలూ ఈ మూలంనుంచి వచ్చిన శాఖలే అయి వుంటారు

(1) దకోటాలు లేక సియోక్‌లు - దకోటాలలో ప్రస్తుతం పన్నెండు తెగలున్నాయి. వీరిలో తెగ నిర్మాణం క్షీణ దశలో వుంది వారికి దగ్గర వారైన మిస్సోరీలు గణాలుగానే ఏర్పడి వుండడంచూస్తే దకోటాలలోనూ గణ నిర్మాణం వుండే వుంటుంది గణాలకి మాదిరిగా జంతువులపేర్లు పెట్టిన సమూహాలున్నాయి కాని ఇప్పుడు గణాలు లేవు. 1767లో వారితో వున్న కార్వర్ ఇల్లా వ్రాసేరు "ఇండియనుల వేరువేరు సమూహాలు ప్రతి ఒక్కటీ జట్టు లేక తెగలుగా విడబడి వుంది ఈ జట్లూ, తెగలూ తాను చెందిన జాతిలో ఒక చిన్న సమూహంగా వుంటుంది ఇతర జాతులనుంచి గుర్తించే టందుకు ప్రతిజాతికీ ఒక సంకేతం, పదకం (బాడ్జి) వున్నట్లే తెగను గుర్తించడానికీ ఒకపదకం వుంటుంది ఒక డేగ, చిరుత, పులి, దున్నపోతు - ఇల్లాగే. నౌదో విస్సీల (సియోక్స్) లో ఒకజట్టును పాముజట్టు అంటారు ఇంకో జట్టును తాబేలు, మరో దానిని ఉడత, నాలుగోది తోడేలు, దున్నపోతు, చేప ఇల్లాగేపిలుస్తారు. జాతిలో ప్రతి వారూ తమరిని ఇలాగే ప్రత్యేకించు కొంటారు. ఎంత నికృష్ట స్థితిలో వున్నవారైనా తన పారంపర్యాన్ని గుర్తుంచు కుంటాడు. తన కుటుంబం పేరు చెప్పుకుంటాడు" అని తమ Travels in North Americaలో వ్రాసేరు. ఆయన మిస్సిసిపీ నదిమీదవున్న తూర్పు దకోటాలను, చూసేరు ఈ వ్రాతను చూసేక అప్పటికి దకోటాలలో గణసంస్థ శక్తివంతంగా వుండిందని చెప్పడానికి సందేహించ నక్కరలేదు. 1861 లో తూర్పు దకోటాలను, 1882 లో పశ్చిమ దకోటాలను చూసినప్పటికి వారిలో గణం వుండడానికి ఆ అవశేషాలుకూడా కనబడలేదు ఈ మధ్య కాలంలో వారు మైదానాలలోకి గెంటివేయబడి, సంచార జీవులుగా తయారయ్యాక వారిలో ఈ మార్పు వచ్చింది వారిలో గణసంస్థ క్షీణించడానికి ఇదేకారణం.

పశ్చిమ ఇండియన్లలో రెండు తరహాల నాయకులు వుండటాన్ని కార్వర్ చూపేరు. అల్లా ఎందుకున్నారో ఇరాక్వాల గురించి చెప్పినప్పుడు రాపేను ప్రతి జట్టుకూ పెద్దనాయకుడు లేక ప్రధాన యోధుడు వున్నాడు యుద్ధంలో వున్న అనుభవం పట్టీ, ధైర్య సాహసాల్నిపట్టీ, సైనిక చర్యలను నడిపించడానికీ, దానికి సంబంధించిన వ్యవహారాలను చక్కబెట్టడానికీ ఆ నాయకుణ్ణి ఏరుకుంటారు కాని ఈ నాయకుణ్ణి రాజ్యాధికారిగా భావించరు. యోద్ధ లక్షణాలను చూసి ఏరుకున్న నాయకునికితోడు, పారంపర్యపు హక్కుతో పెద్దరికం వహించే మరొక అయన వున్నారు. తక్షణ పౌర వ్యవహారాలను అయన నిర్వహిస్తారు ఈ నాయకుణ్ణి శాకెమ్ అంటారు అయా తెగ, జాతి చేసుకొనే వ్యవహారాలు, ఒప్పందాల మీద అయన ముద్ర వేస్తే తప్ప దానికి చెల్లుబడి వుండదు."— అని ఆయన తన Travels in North America లో వ్రాసేరు.

2 మిస్సోరీ తెగలు-

(1) పుంకాలు. వీరిలో ఎనిమిది గణాలున్నాయి

1. బూడిదరంగు ఎలుగు, 2 అధికప్రజ, 3 ఎల్క్ (కణుజు) 4 స్కంక్, 5 దున్న, 6 పాము, 7 ఔషధం, 8 మంచు.

అందరికీ విరుద్ధంగా ఈ తెగలో పురుషుడినుంచి పారంపర్యం గుర్తిస్తున్నారు. అంటే పిల్లలు తండ్రిగణానికే చెందుతారు. గణంలో అంతర్వివాహం నిషిద్ధం. శాకెమ్ పదవి గణంలో పారంపర్యంగా వస్తుంది ఎన్నిక ద్వారా శాకెమ్‌ను ఏరు కుంటారు అయితే శాకెమ్ కొడుకులనుంచి ఎన్నుకొంటారు ఈ మార్పు ఈ మధ్యనే వచ్చి వుంటుంది ఏమంటే ఎనిమిది మిస్సోరీ తెగలలోనూ ఒటోయేలు, మిస్సోరీల లోనూ, మనిదన్‌లలోనూ పారంపర్యం స్త్రీలవేపుమంచే గుర్తించబడుతూంది. ఆస్తి గణంలో పారంపర్యంగా వుంటుంది

2. ఒమాహాలు- వీరిలో పన్నెండు గణాలున్నాయి

1. లేడి, 2. నలుపు, 3 పక్షి, 4. తాబేలు, 5. దున్న, 6. ఎలుగు 7 ఔషధం, 8. కా, 9 తల, 10 ఎరుపు, 11 ఉరుము, 12 అనేక ఋతువులు

పారంపర్యం, వారసత్వం, వివాహ నియమాలు పుంకాలలో మాదిరిగానే.

3 అయోవాలు వీరిలో గణాలు ఎనిమిది- 1 తోడేలు, 2 ఎలుగు, 3 గేదె, 4. కణుజు, 5 గద్ద, 6. పావురం 7. పాము, 8 గూబ

పా- కు- ధా పేరుగల బీవర్ గణం ఒకప్పుడు అయోవాలు, ఒటోయేలులో

వుండేది. కాని అదినేడు అంతరించిపోయింది పారంపర్యం, వారసత్వం, గణం వారితో అంతర్వివాహ నిషేధమూ పుంకాలలో లాగనే.

4. ఒటోయేలూ, మిస్సోరీలూ ఇవి రెండూ ఒకటిగా కలిసిపోయేయి వీరిలో ఎనిమిది గణాలున్నాయి.

1 తోడేలు, 2. ఎలుగు, 3 గేదె, 4 కణుజు, 5 గద్ద, 6. పావురం, 7 పాము, 8 గూబ.

వీరిలో స్త్రీవేపునుంచే పారంపర్యం పిల్లలు. తల్లిగణానికే చెందుతారు కాకెమ్ వదపీ, ఆ స్త్రీ గణంలోనే వారసత్వంగా వస్తాయి అంతర్వివాహం నిషిద్ధం.

5 'కా'లు (కా-జా), వీరిలో పద్నాలుగు గణాలున్నాయి 1 లేడి, 2. ఎలుగు, 3 దున్న, 4 తెల్లగద్ద, 5 నల్లగద్ద, 6 బాతు, 7 కణుజు, 8 రాకూన్, 9. ప్రయరీతోడేలు, 10 తాబేలు, 11. భూమి, 12 లేడితోక, 13 గుడారం, 14. ఉరుము.

అమెరికాలోని ఆదివాసులలోకెల్లా 'కా'లు మహా ఆటవికులు అయితే తెలివైన వాళ్ళూ, అనక్తి చూపవలసిన వాళ్ళూను పారంపర్యం, వారసత్వం వివాహ నిషేధాలూ పుంకాలలో లాగనే. వీరిలో గద్దగణాలు రెండు, లేడి గణాలు రెండు వున్నాయి గణాలు విడిపోవడానికి ఇవి మంచి వుదాహరణ గద్ద గణం విడిపోయి నలుపు, తెలుపు విశేషణాలు చేర్చుకుంది. ఇకనుంచి తాబేలు గణం కూడ ఇటువంటి దానికి నిదర్శనంగా వుండగలదు 1859 లోనూ 1860 లోనూ నేను మిస్సోరీలను చూసినప్పుడు ఒసాగేలనూ, కువప్హాలను చూడలేక పోయేను. వారిగణాలు ఎనిమిదీ డకోటా భాషనుంచి పుట్టి, ఒకదాని కొకటి దగ్గరగావుండే మాండలికాలను మాట్లాడ తాయి వీరిలో గణవిర్మాణాలు వున్నాయని గట్టిగా చెప్పవచ్చు. 1869లో 'కా'ల సంఖ్య బాగా తగ్గిపోయింది ఏడువందలమంది వున్నారు అంటే నగటున గణానికి ఏభయి మంది వున్నారు పెద్ద సియోక్సనదీ ముఖంనుంచి, మిస్సిసిపీ వరకూ మిస్సోరీ నదీ, దాని ఉపనదుల వెంబడిసీ, మిస్సిసిపీనది ఎడమగట్టు వెంబడినే, అర్కాన్సాస్ వరకూనూ ఈ తెగలవారు విస్తరించి వున్నారు.

3 విన్నెబాగోలు - వీరిని చూసిన వాటికి విస్కాన్‌సిన్‌లో విన్నెబాగో సరస్సు సమీపంలో వున్నారు. డకోటా తెగలలో ఒకశాఖ వీరు ఇరాక్వాలు వెళ్ళిన దారినే తూర్పుగా సైంట్ లారెన్స్ నదీలోయ వెంబడే పోతూంటే హ్యూరోన్, సుపీరియర్ సరస్సులమధ్య వీరిని అల్గోన్‌కిన్‌లు ఆటంకపరిచేరు. వీరి అతిసన్నిహితులు

మిసోరీ తెగలవారు వీరివి ఎనిమిదిగణాలు. 1. తోడేలు 2. ఎలుగు 3. దున్న 4 గద్ద 5 కణుజు 6 లేడి 7 పాము 8 ఉడుము

వీరిలోనూ పుంకాంలో మాదిరిగానే పారంపర్యం, వారసత్వం, వివాహ నిబంధనలున్నూ. ఈ తెగలన్నింటా పారంపర్యం స్త్రీల నుంచి పురుషులకి మారడం ఆశ్చర్యకరంగావుంది వీరిని మొదట చూసినప్పటికి వీరిలో ఆ స్త్రీవాదం బాగా ఏర్పడి వుండలేదు. ఇంచుమించు వీళ్ల ప్రాయంగానే వుంది గ్రీకులూ, రోమన్లూలో లాగ ఆ మార్పుకు కారణం కాగల స్థితిలోలేదు. అమెరికన్ల పాదిరీల ప్రభావంలో ఆ పరిణామం ఇటీవల వచ్చినది అయివుంటుంది విన్నెబాగోలలో స్త్రీపారంపర్య అవశేషాలను కార్వర్ 1787లో చూశారు "కొన్ని తెగంలో పెద్దరికం వారసత్వంగా వస్తుంది పారంపర్యం స్త్రీవేపునుంచి నాయకుడు మరణిస్తే ఆయన కొడుక్కి కన్న అక్క - చెల్లెలు కొడుక్కి పదవి చెందుతుంది అతనికి అక్క-చెల్లెళ్ళు లేకపోతే అతి సన్నిహిత బంధువు రాలికి పెద్దరికం వస్తుంది విన్నెబాగో జాతివారిలో పెద్దరికం స్త్రీకివుంటుంది వారి నియమాలు తెలియక పూర్వం నాకిది ఎంతో ఆశ్చర్యంగా వుండేది" - అని ఆయన తన పుస్తకంలో రాసేరు 1869లో విన్నెబాగోల సంఖ్య పద్నాలుగువందలు అంటే గణానికి సగటున నూటఏభయి మంది వున్నారు.

## 4 మిసోరీ ఎగువ తెగలు

మన్‌దాన్‌లు - తెలివితేటలలో, జీవిత విధానంలో మన్‌దాన్‌లు తమబంధు తెగలన్నింటిలోకి మిన్నగా వున్నారు. దీనికి బహుశా మిన్నిటారేలు కారణం అయి వుంటుంది వీరివి ఏడుగణాలు.

1 తోడేలు 2. ఎలుగు 3. ప్రయరీకోడి 4. మంచికత్తి 5 గద్ద 6 అడ్డతల 7. ఎగువవూరు

పారంపర్యం స్త్రీవేపునుంచి పదవులు, ఆస్తుల వారసత్వం గణంలో వుంటుంది గణంలో అంతర్వివాహం నిషిద్ధం వీరితో పాటు ఒకేమూలతెగకు చెందిన అనేక గణాలలో పారంపర్యం పురుషుని వేపునుంచివున్నా, వీరిలో స్త్రీవేపునుంచ వుండడం ఆశ్చర్యం అనిపిస్తుంది. దీనినిబట్టి డకోటియన్ తెగలన్నింటిలో మొదట పారంపర్యం స్త్రీవేపునుంచే వుండేది అనుకోవచ్చు. మన్‌దాన్ల గురించిన ఈ సమాచారం 1862లో మిసోరీ ఎగువనున్న పురాతన మన్‌దాన్ గ్రామంనుంచి జోసెఫ్ కిప్ పంపించేరు. ఆయన తల్లి మన్‌దాన్. తనతల్లి గణమూ, తనదీ ఒకటేనని చెప్పి ఆయన ఈ సమాచారాన్ని ధృవపరిచేరు.

2. మిన్నాటెరీలు. ఉప్-నర్-ఓ-కాస్- (కాకి)లూ, వీరూ ఒక తెగ ప్రజల కాళులు, వీరు ఈ గణకుటుంబానికి చెందినవారేనా అన్నది అనుమానం కాని. వీరి మాండలికాలలోని చాలమాటలు మిస్సోరీ, దకోటాల మాండలికాలతో సమానంగా వున్నాయి. అందువేత భాషాసామ్యంతో వీరందరినీ కలుపుతున్నారు. వీరి పూర్వానుభవాలు వేరుగా వున్నాయి కాని వాటిని గురించి విశేషం తెలియడంలేదు. మిన్నెటారీలు పెరటి వ్యవసాయం చేస్తారు కలపతో గోడలుకట్టి ఇళ్ళువేసుకుంటారు. ఈ ప్రాంతంలో లేని చిత్రమైన మతాచారాలు వారిని వానిని మన్‌దాన్‌లకు వేర్పేరు. బహుశా మౌండ్-బిల్డర్స్ (దిబ్బలు వేసినవాళ్ళు) నుంచి వచ్చి వుండవచ్చు. వీరిని ఏడు గణాలు.

*1. వాకు 2 వీరు 2 బన 4 ప్రయరీకోడి 5 కొండవాళ్ళు 6. కొత్త బంతువు 7 తలగుడ్డ*

వీరిలో పారంపర్యం స్త్రీనుంచి, గణంలో అంతర్వివాహం నిషిద్ధం. కాకెమ్ వదవీ, ఆస్తి వారసత్వం గణంలోనే ఈనాడు మిన్నాటెరీలూ, మన్‌దాన్‌లూ ఒకే గ్రామంలో వుంటున్నారు ఇప్పుడు. ఉత్తర అమెరికాలోని రెడ్ ఇండియన్లలోకెల్ల వీరు చూవరులు. 3 ఉప్పరోకాలు లేక కాకులు. ఈ తెగలో వున్న గణాలు పదమూడు.

1. ప్రయరీకుక్క 2 పనికిరాని లెగ్గిన్ 3 స్కంక్ 4 మోసకారి బనలు 5 చెడిపోయిన బనలు 6 తప్పుడు గౌరవాలు 7. కసాయిలు 8. మారే బనలు 9. ఎలుగు వంటా పర్వతం 10. వల్లకాలు బనలు 11 చేపలు పట్టే వాళ్ళు 12. దుప్పి 13 కాకి.

పారంపర్యం వారసత్వం, గణంలోపల అంతర్వివాహ నిషేధం మిన్నిటారీలలో లాగనే కాకిగణాలలో చాలవాని పేర్లు గణాల పేర్లలా గాక జట్ల పేర్లలా చిత్రంగా వున్నాయి కాని పారంపర్య నిబంధనలు, వివాహపు అలవాట్లు, ఆస్తి వారసత్వపు నిబంధనలు చూస్తే గణ నిర్మాణం స్పష్టంగా కనిపిస్తుంది. కాకి గణాలలో వుండగా రాబర్ట్ మన్‌ద్రమ్ నాకు చెబాపీ ఈయన అమెరికన్ ఫర్ కంపెనీ వుద్యోగిగా పంభయేళ్ళుగా కాకుల గణాలలో వున్నాడు వారి నాయకులలో ఒకడు కూడా ఆయన ఆ భాషలోనే ఆలోచించే టంతగా ఆ భాషలో ప్రావీణ్యం సంపాదించేడు వారసత్వం గురించిన దిగువ అలవాట్లను చెప్పింది ఆయనే. ఎవరన్నా ఒకవస్తువును ఒకరికి దానం చేస్తారు దాత, గ్రహీతకూడ చనిపోతే ఆ వస్తువు దాతగణానికి తిరిగి వస్తుంది.

భార్య పోగుచేసిన ఆస్తి ఆమె అనంతరం ఆమె పిల్లలకు చెందుతుంది ఆమె భర్త ఆస్తిఆయన అనంతరం ఆయన గణంలోని సన్నిహితులకు పోతుంది ఒక వ్యక్తి తన స్నేహితునికి ఏదో బహుమతి ఇస్తాడు చచ్చిపోతాడు. అప్పుడా స్నేహితుడు బహుమతి ఇచ్చిన వాని అంత్యకర్మలప్పుడు దుఃఖాన్ని ప్రకటించడానికి వేలను కణుపువద్దకు నరికేసుకోవాలి లేదా ఆ వస్తువును చనిపోయినవాని గణానికి తిరిగి ఇచ్చివెయ్యాలి

కాకి గణాలలో అంత్యక్రియలప్పుడు ఈ వేళ్ళు కోసుకొనే అలవాటు ఎక్కువగా వుంది వైద్య భవనంవద్ద జరిపే మతసంబంధమైన ఉత్సవాలలో కూడా ఈ విధంగా చేస్తారు మత సంబంధమైన ఉత్సవాలలో ఇందు కోసం ఒక బుట్ట వ్రేలకడతారు ఓమారు ఆ బుట్టలో కోసుకుని పడవేసినవేళ్ళు ఏభయి లెక్కకి వచ్చేయట మిస్సోరి ఎగువనున్న ఒక కాకి తెగవారి వూరికి వెళ్ళినప్పుడు వేళ్ళులేని ఆడ, మగవాళ్ళను చాల మందిని చూశాను వివాహం విషయంలో కాకితెగ వారిలో ఒక ఆచారం వుంది. అటువంటి ఆచారాన్ని కనీసం మర్లో నలభయి తెగల్లో చూశా కనక దానిని ఇక్కడ చెప్పడం అవసరం తరువాతి ప్రకరణంలో దాని వుపయోగం వస్తుంది ఒక కుటుంబం లోని ఆడపిల్లలలో పెద్ద యామెను పెళ్ళిచేసుకున్నవాడే ఆమె చెల్లెళ్ళకు వయస్సు వచ్చినాక మగడు అవుతాడు. నాకు వద్దులే అని ఆ హక్కును వదులుకోవచ్చు కాని కాదుకూడదు అంటే అతని హక్కు ప్రకారం గణం అంగీకరించవలసిందే అమెరికను ఆదివాసులలో బహుభార్యాత్వం ఆచారంవుంది కాని, ఒక భార్యను- ఒక కుటుంబాన్ని మించి పోషించగల అవకాశాలు లేకపోవడంచేత ఆ ఆచారం పరిపాటిగా లేదు ఆ ఆచారం వుందన్న విషయాన్ని మెల్ డ్రమ్ భార్యే చెప్పింది ఆమెయే దానికి వుదాహరణ. అప్పటికామెకు పాతికేళ్ళున్నాయి నల్లకాలు గణం మీద దాడిచేసినప్పుడు చిన్న పిల్లగా వున్న ఆమెను పట్టి మెల్‌డ్రమ్ తీసుకొచ్చేరు. అప్పటికే అతనికి పెళ్ళి అయింది ఈ చిన్న పిల్లను తనగణంలోకి కుటుంబంలోకి దత్తుచేసుకోమని తన అత్తగారిని ప్రోత్సహించేడు చేసుకుంది దానితో ఆమె అతని భార్యకు చెల్లెలు అయింది తెగలో వున్న ఈ ఆచారాన్ని పట్టి అతడు కావాలంటే నిరాకరించే వనిలేదు ఈ ఆచారం ప్రాచీనకాలంపు పునాలా ఆచారం అవశేషం మానవ కుటుంబంలో ఇది చాల ప్రాచీనాచారం.

3 గల్ఫ్ తెగలు

1 ముస్కోకీలు లేక క్రీక్‌లు. క్రీక్ సమాఖ్యలో ఆరు తెగలున్నాయి. క్రీక్‌లు, హిట్ చెట్‌లు, యూచీలు, అలబామాలు, కూసాట్‌లు, నాట్‌చేలు వీరంతా ఒక్క నాట్‌చేలు వ్వ ఒకేభాష తాలూకు మాండరికాలను మాట్లాడుతారు నాట్‌చేలు ఫ్రెంచి వారి చేతులలో ఓడిపోయివచ్చి ఈ సమాఖ్యలో తరవాత చేరిన వాళ్ళు.

క్రీక్‌లలో ఇరవై రెండు గణాలున్నాయి 1 తోడేలు, 2 ఎలుగు, 3 స్కంక్ 4 ఆలిగేటర్, 5 లేడి, 6 పిట్ట, 7 పులి, 8 గాలి 9 కప్ప, 10 దుంప, 11 నక్క, 12 రాకూన్, 13 చేప, 14 ధాన్యం, 15 బంగాళాదుంప, 16 హికరీగింజ 17 ఉప్పు 18 అడవి పిల్లి, 19, 20, 21, 22ల సంకేతాలు పోయినాయి.

ఈ సమాఖ్యలోని ఇతర తెగలలో కూడ గణనిర్మాణాలున్నాయని క్రీక్‌లలో మత ప్రచారకుడుగా చాలనేళ్ళు గడిపిన రివరెండ్ ఎస్ ఎమ్. లాఫ్‌రిడ్జ్ చెప్పేరు. పైన చెప్పిన గణాలపేర్లు ఇచ్చినది ఆయనే క్రీక్‌లలో పారంపర్యం స్త్రీలవేపునుంచే నని, టాటెమ్ పదవి పారంపర్యం అ వారసత్వం గణానికేనని, గణంలో అంతర్వివాహం నిషిద్ధం అనీ ఆయనే చెప్పేరు ఈనాడు క్రీక్‌లు కొంత వరకు నాగరికులయ్యారని, కొత్త జీవిత విధానం అలవరుచుకుంటున్నారనీ చెప్పేరు. వెనుకటి సామాజిక వ్యవస్థ స్థానంలో రాజకీయ వ్యవస్థ నేర్పరచుకొంటున్నారు కొద్ది ఏళ్ళలో వారిలో గణ నిర్మాణపు ఛాయలుకూడా లేకుండా పోతాయి 1869లో వారి జనాభా పదిహేనువేలు. అంటే ఒక్కొక్క గణంలో అయిదువందల పైచిలుకు మంది చొప్పున వున్నారు

2 చోక్టాలు చోక్టాలలో ఫ్రాట్రీ ఒక ప్రత్యేక రూపంలో కనిపిస్తుంది. ప్రతి ఫ్రాట్రీకి ఓపేరు వుంటుంది స్పష్టమైన రూపంలో కనిపిస్తుంది ఇంతవరకు చెప్పిన తెగలలో కూడ అది వుంది అయితే వానిని గురించిన పరిశీలన జరగలేదు. క్రీక్ తెగలలో ఎనిమిది గణాలున్నాయి అవి నాలుగేసి గణాలతో రెండు ఫ్రాట్రీలుగా వున్నాయి.

I విడబడ్డజనం, (మొదటిది)

1 జమ్మకారు, 2 లాటక్లా 3 లులాక్, 4 లినోక్లుషా

2 ప్రియజనం (రెండోది)

1 ప్రియజనం, 2 చిన్నవాళ్ళు, 3 పెద్దవాళ్ళు, 4 క్రీ చేప.

ఒకే ఫ్రాట్రీలోని గణాలలో అంతర్వివాహం నిషిద్ధం. కాని ఒక ఫ్రాట్రీలోని ఏగణంవారైనా రెండో ఫ్రాట్రీలోని ఏగణంవారినైనా పెళ్ళి చేసుకోవచ్చు. దీనిని పట్టి

ఇరాక్వోయిలలాగే చోక్టాలు కూడా రెండు గణాలతోనే ప్రారంభం అయ్యారని, తరవాత ఒక్కొక్కటి నాలుగుగా విభజన అయ్యారనీ చెప్పాలి. మొదట్లో గణాలమధ్యనున్న వివాహనిషేధం వారిశాఖలకు వర్తింప చేయబడింది చోక్టాలలో పారంపర్యం స్త్రీల వేపునుంచే ఆస్తి, శాకెమ్ పదవీ గణంలో పారంపర్యాలు 1869లో వారి సంఖ్య పన్నెండువేలు. అంటే గణానికి సగటున పదిహేనువందల మంది వున్నారు దిగువ సమాచారంనాకు డా సైరస్ బైయింగ్టన్ ఇచ్చేరు ఆయన 1820 నుంచి వారిలోనే మిషనరీగా వున్నారు అప్పటికి ఆ తెగ ఇంకా వారి అసలు చోట్లో-మిస్సిసిపీకి తూర్పుగానే వున్నారు తరవాత వారితోపాటు ఇండియన్లకు ఏర్పరచిన సెటిల్మెంటులోకి ఆయనా వెళ్ళేరు నలభయ్యయిదేళ్ళు మిషనరీగా పనిచేసి ఆయన 1868లో మరణించేరు మంచివాడు, నిజాయితీగలవాడు మానవుడు గర్వించ తగినపేరూ, జ్ఞాపకాలూ మిగిల్చిపోయేరు

ఒకమారు ఒకచోక్టా తనకు అమెరికను పౌరసత్వం సంపాదించాలని వున్నదని బైయింగ్టన్‌తో అన్నాడట గణనియమాల ప్రకారం తన ఆస్తి తన గణ బంధువులకి పోతుందనీ అలాగాక తన పిల్లలకి చెందేలా చేయాలని వున్నదనీ కారణం చెప్పేడట చోక్టాల ఆచారం ప్రకారం అతని మరణానంతరం అతని ఆస్తిని అన్న తమ్ముళ్ళు అక్క-చెల్లెళ్ళు, అక్కచెల్లెళ్ళ పిల్లల మధ్య పంచి పెడతారు అతడు బతికి వుండగా ఆ ఆస్తిని తనకొడుకులకి ఇవ్వవచ్చు దానిని వారు గణం ఆస్తిలో కలపకుండా తాముగా అనుభవించవచ్చు ఈనాడు చాల ఇండియను తెగలలో పశువులు ఇళ్ళు, వ్యక్తుల చేతుల్లోనే వున్నాయి భూముల రూపంలో మంచి ఆస్తులే ఏర్పాడ్డాయి వారు గణ సంప్రదాయాలకు భిన్నంగా ఆ ఆస్తులను తమ జీవితకాలంలోనే తమపిల్లలకే ఇస్తుండడం మామూలు అయింది. ఆస్తి మొత్తాలు పెరిగినకొద్దీ గణ ఆచారానికి వ్యతిరేకత పెరిగింది చాలమంది - వారిలో చోక్టాలు ఒకరు - వెనకటి ఆచారాన్ని రద్దుచేసి, వారసత్వం చనిపోయినవారి పిల్లలకి మాత్రమే ధృవపరిచేరు. ఇది జరిగి కొద్దికాలమే అయింది గణ వ్యవస్థ స్థానే రాజకీయ వ్యవస్థ ఏర్పడడమూ, కౌన్సిలును, చట్టాలను అమలు జరిపే మేజిస్ట్రేటును ఎన్నుకోవడమూ జరగడంతో ఈ మార్పు వచ్చింది గత ఆచారం ప్రకారం భర్తఆస్తి భార్యకుగాని, ఆమెఆస్తి భర్తకిగాని రాదు ఆమె ఆస్తిని పిల్లలకు, పిల్లలు లేకపోతే అక్క - చెల్లెళ్ళకు ఇచ్చేవారు.

3 చికాసాలు. పై విధంగానే చికాసాలుకూడా రెండు ప్రాట్రీలుగానే వున్నారు ఒకదాంట్లో నాలుగు, రెండోదాంట్లో ఎనిమిది గణాలు వున్నాయి

1. చిరుత ప్రాట్రీలో గణాలు

1 అడవిపిల్లి, 2 పిట్ట, 3 చేప, 4 లేడి

2 స్పానిష్ ప్రాట్రీలో గణాలు

1. రాకూన్, 2 స్పానిష్ 3 రాయల్, 4 హూష్-కో-నీ, 5. ఉడత, 6 అలిగేటర్, 7 తోడేలు, 8. వల్లపిట్ట

పారంపర్యం స్త్రీల వేపునుంచి, గణంలో అంతర్వివాహ నిషేధమూ, ఆస్తి, శాకెమ్ పదవీ గణానికే వారసత్వమూ వీరిలో సాగుతూంది ఆ తెగ వారిలో మిషనరీగా జీవిస్తున్న రెవరెండ్ ఛార్లెస్ సి కూప్‌లాండ్ నాకీ వివరాలు చెప్పారు. 1869లో వారి జనాభా అయిదు వేలుంది అంటే సగటున గణానికి రమారమి నాలుగు వందలు చొప్పున స్పానిష్ వారితో సంబంధాలు ఏర్పడిన తర్వాత కొత్తగణం ఏర్పడితే దానికి స్పానిష్ అని పేరుపెట్టేరో, లేక పాత గణానికే పేరు మార్చేరో తెలియదు. వారి ప్రాట్రీ ఒకే దానికి స్పానిష్ అనే పేరుకూడా పెట్టుకున్నారు

4. చెరోకీలు — ఈ తెగలో పూర్వం పది గణాలు వుండేవి వాటిలో రెండు—అకొరన్(అ-నే-ద్సు-లా), పక్షి (అ-నే-ద్సె-స్కా-వ)లు అంతరించిపోయేయి. మిగిలినవి ఇవి 1. తోడేలు, 2 ఎరుపు రంగు. 3 విశాలమైన ప్రయరీ 4 జెముడు కాకి, 5 పవిత్రము, 6 లేడి, 7 పిలి, 8 పొడుగు జుట్టు.

పారంపర్యం స్త్రీల వేపునుంచి, గణం వారిలో అంతర్వివాహ నిషేధం వున్నాయి 1869లో చెరోకీల సంఖ్య పద్నాలుగు వేలు అంటే గణానికి సగటున పది ఏడు వందల ఏభయి మంది వున్నారు అమెరికను ఆదివాసులలో ఇంతమంది వుండే గణాలు మరొకటి లేవు అమెరికాలోని ఆదివాసులలో ఒకే మాండలికం మాట్లాడే గణాలు చెరోకీలు, ఒజిబ్వాలుగా తప్ప లేరు మరొకటి కూడా చెప్పవచ్చు ఒక లక్ష మంది ఒకే మాండలికం మాట్లాడే జనం ఎప్పుడూ అమెరికాలోనే లేరు అత్యధిక సంఖ్య (లక్ష సంఖ్యలో) జనాభాగం తెగలుగా అజ్‌టెక్‌లు, తెజ్ కూకాన్‌లు త్లస్కా-లాన్‌లు అని చెప్పుకుంటారు వీరు స్పానిష్ ఆక్రమణ కాలంలో కూడా అంత మంది ఎలా వున్నారో చెప్పడం కష్టం అందుకే ఆ మాట సమ్మతగిందిగా లేదు. క్రీక్‌లు, చెరోకీలలో పశు సంపదవుంది వ్యవసాయం బాగా వృద్ధి పొందింది. ఇవి

వారి సంఖ్యలు పెరగడానికి కారణం. వారిప్పుడు కొంతవరకు నాగరికులయ్యేరు పూర్వపు గణ వ్యవస్థ స్థానే ఎన్నుకున్న చట్టబద్ధ ప్రభుత్వం వుంది దాని ప్రభావంలో గణ నిర్మాణం అతివేగంగా శిథిలం అయిపోతూంది.

5 సెమినోలెలు వీరు క్రీకుల నుంచి వచ్చేరు. వారిలో గణ నిర్మాణం వుందన్నారు కాని వివరాలు తెలియలేదు.

4 - పానీ తెగలు

పానీలలో గణ నిర్మాణం వున్నదీ, లేనిదీ స్థిరపడలేను. గతంలో వారిలో మిషనరీగా పనిచేసిన రివ శామ్యూల్ అల్లీస్ చెప్పటం వారిలో గణాలున్నాయి, కాని తాను వానిని గురించి ప్రత్యేకించి విచారించలేదని, వారిలో ఈ గణాలున్నాయని ఆయన చెప్పేరు.

1 ఎలుగు, 2 బీవర్, 3. గద్ద, 4 దున్న, 5 లేడి, 6. గూబ.

ఒకప్పుడు మిస్సోరీ వద్ద ఒక పానీ తెగవారి జట్టు నాకు కనబడ్డారు కాని దుబాసీ దొరకలేదు.

మిన్ని టారీలకు సమీపంలో అరికారీల వూరు ఒకటుంది వీరు పానీలకు దగ్గర వాళ్ళు కాని ఇక్కడా అదే సమస్య ఎదురయింది ఈ తెగలు, హ్యూకోలు, మరో రెండు మూడు చిన్న తెగలూ ఇప్పుడు కెనడా నది వొడ్డునే వుంటున్నారు కావి, వీరు ఎప్పుడూ మిస్సోరీకి పశ్చిమంగానే వుండేవారు వీరిది స్వతంత్రమైన ఒక మూల భాష పానీలలో గణాలు వుంటే వీరిలోనూ వున్నాయనుకోవచ్చు.

5. అల్గోంకిన్ తెగలు

వీరిని చూసిన నాటికి అమెరికన్ ఆదివాసులలో పెద్ద పేరున్న ఈ తెగ రాకీ పర్వతాల నుంచి హడ్సన్ బే వరకూ, సిస్కా చెవన్‌కు దక్షిణంగా తూర్పున అట్లాంటిక్ సముద్రం వరకూ. సుపీరియర్ సరస్సు ముఖ భాగంలోగాక రెండు ఒడ్ల పొడుగునా ఛాంప్లేన్ సరస్సు దిగువన మనిశాల దేశంలో వుండేవారు ఈ ప్రాంతం అట్లాంటిక్ తీరాన ఉత్తర కరోలినా వరకూ వ్యాపించి, మిస్సిసిపీ కుడి వొడ్డునే దిగువకు విస్కాన్‌సిన్, ఇల్లినాయిస్, కెంటికీలలో వుండేది ఈ మనిశాల దేశంలో తూర్పున ఇరాకూయ్‌లూ, వారి సంబంధిత తెగలూ చొరబడి, ఆ సరిహద్దులలో వారి పెద్దరికాన్ని సవాలు చేస్తున్నారు.

గిబిగా మియన్ తెగలు— 1 ఒజిబ్వాలు అంతా ఒకే మాండలికం మాట్లాడ తారు వీరిలో గణ నిర్మాణం వుంది ఇరవై మూడు గణాలపేర్లు తెలిశాయి. ఇంకా వున్నాయేమో తెలియలేదు. ఒజిబ్వాలు గణ చిహ్నాన్ని దోటైమ్ (టోటెమ్) అంటారు. ఆ విధంగా తోడేలు బొమ్మ తోడేలు గణానికి గుర్తుగా వుంటుంది దీనిని పట్టే మాక్లెలన్ క్రాఫ్టుగారు గణ వ్యవస్థకు "టోటెమిక్ వ్యవస్థ"— అని వుపయోగించేరు. గ్రీకు, లాటిన్ భాషలలో ఆ వ్యవస్థ యొక్క ప్రతి లక్షణానికి పేర్లువుంది చరిత్రకు ఎక్కి వాడుకలో వున్నాయి గనక గాని "టోటెమిక్ వ్యవస్థ" అన్నమాట గణ వ్యవస్థకు సరిపడుతుంది. ఒజిబ్వాల గణాలు ఇవి.

1 తోడేల, 2 ఎలుగు, 3 బీవర్, 4 తాబేలు (బురద) 5 తాబేలు (కరిచే) 6 తాబేలు (చిన్న), 7 రైన్‌డీర్ 8 ఉల్లంకి 9 కొంగ 10 పావురపుడేగ, 11 బోడిగద్ద 12 మూర్ఖుడు 13 బాతు 14 బాతు 15 పాము, 16 పునుగు ఎలక, 17 మార్టెన్ 18, గూడకొంగ 19 ఎద్దుకల, 20 కార్డ్ చేప, 21. కేట్ చేప, 22 స్టర్జన్ 23 పైక్ చేప.

పారంపర్యం పురుషుల ద్వారా. పిల్లలు తండ్రి గణానికి చెందుతారు గతంలో స్త్రీలద్వారా పారంపర్యం వుండేదని చెప్పడానికీ, ఈ మార్పు ఇటీవల వచ్చిందన, డానికీ ఎన్నో కారణాలు వున్నాయి అల్గోంకిన్ తెగలన్నీ డెలావరేలను తమ ప్రాచీ నులనీ, తాతలనీ చెప్పుకుంటారు ఆ డెలావరేలలో ఇప్పటికీ స్త్రీ పారంపర్యం కొన సాగుతూంది అల్గోంకిన్ తెగలు చాలావాటిలో కూడ ఇదే ఆచారం కొనసాగు తూంది రెండు మూడు తరాల క్రితం వరకూ నాయక పదవి స్త్రీ పారంపర్యంగానే వుంది ఒజిబ్వా శాకెమ్ కే-నే-కోన్స్అనే ఆయన తొంభయి ఏళ్ళ వయస్సులో 1890 లో మరణించేరు. ఆయన కథ నాకు చెప్పిన వారు ఆ శాకెమ్‌ను "మీరు పదవి విరమించుకొని మీ కొడుక్కు ఎందుకు ఇవ్వలేదు " అని అడిగేరట తన కొడుకు తనకు వారసుడు కాలేడని, వార సత్వం తన మేనల్లుడు (ఎ- క్వా- కా- మిక్) దనీ అన్నారట దీనిని పట్టి పూర్వమే కాదు ఇటీవలి వరకూ స్త్రీ పారంపర్యమే కొనసాగు తున్నదనాలి ఆ మేనల్లుడు ఎన్నుకోబడి, పదవిలో స్థిర పరచబడ్డాడు కూడా ఏదో మాటగాకాక జరుగుతున్నది అదే వనకానికి ఇది వుదాహరణ మూడో కారణం వుంది ఆ సంప్రదాయాన్ని మిషనరీలు అందరూ వ్యతిరేకించేరు వారు పెరిగినది భిన్న సంప్రదాయాలలో ఏమో వారసత్వం కొడుక్కు రాకపోవడం, అన్యాయం, అర్థరహితంగా కనిపించింది బహుశా ఒజిబ్వాలు మొదలైన తెగలలో ఈ మార్పుకు

మిషనరీలే కారణం అయివుంటారు చివరదిగా, అల్గోంకిన్ తెగలు చాలావాటిలో స్త్రీ పారంపర్యమే కొనసాగు తుండడం వలన గణకుటుంబాలన్నింటా ఆ ఆచారం వుందనీ, అదే గణ నిర్మాణంయొక్క ప్రాచీన రూపమనీ చెప్పవచ్చు.

గణంలో అంతర్వివాహం నిషిద్ధం ఆస్తి, పదవులూ కూడ గణంలోనే వుండి పోతాయి ఈనాడు ఆస్తుల్ని పిల్లలే తీసుకుంటున్నారు గణం బంధువులకు ఇవ్వడం లేదు తల్లియొక్క ఆస్తి వస్తువులూ ఆమె పిల్లలకు చెందుతున్నాయి పిల్లలులేకుంటే స్వంత అక్క- చెల్లెళ్ళకు, వేలు విడిచిన అక్క-చెల్లెళ్ళకూ, ఇస్తున్నారు అదేవిధంగా తండ్రి శాకెమ్ పదవిలోకి కొడుకు వస్తున్నాడు కొడుకులు చాలామంది వుంటే వారి నుంచి ఎన్నుకొంటున్నారు. వారిని ఎన్నుకోడానికి, తొలగించడానికి గణానికి హక్కు వుంది. ఈ నాడు ఒజిబ్వాల జనాభా పదహారువేలు. అంటే గణంలో సగటున ఏడు వందల మంది ఉన్నారు

2 పోదువట్టామీలు. ఈ తెగలో పదిహేను గణాలున్నాయి.

1. తోడేలు, 2 ఎలుగు, 3 బీవర్, 4 కణుజు, 5 మూర్ఖుడు. 6 గద్ద 7. స్టర్జన్ చేప 8 కార్ప్ చేప, 9 బోడిగద్ద 10 ఉరుము. 11. కుందేలు 12. కాకి 13 నక్క 14 టర్కీ-కోడి, 15. నల్లడేగ.

పారంపర్యం, వారసత్వం, వివాహ నియమాలు ఒజిబ్వాలలో వున్నట్లే-

3 ఒటావాలు-ఒటావాలు, ఒజిబ్వాలు, పోటవట్టామీలు ఈమూడూ ఒక మూల తెగనుంచి వచ్చిన శాఖలు. మొదట చూసిన నాటికే వారు సమాఖ్యలో చేరేరు. ఒటావాలు గణాలుగా ఏర్పడ్డారనడంలో సందేహం లేదు కానివాని పేర్లు మాత్రం సంపాదించలేదు.

4. క్రీలు వీరిని మొదట చూసినప్పుడు సుపీరియర్ సరస్సు వాయవ్య తీరాన వున్నారు అక్కడినుంచి హడ్సన్స్ బే వరకు, పశ్చిమాన ఎర్ర నదివరకు వ్యాపించి వున్నారు తరువాతి కాలంలో సస్కాచెవన్ మండలంలోనూ, దానికి దక్షిణంగానూ వ్యాపించివున్నారు డకోటాజాతిలాగే వారిలోనూ గణసంస్థ ఒకప్పుడు ఉండేదనేగాని ప్రస్తుతంలేదు భాషరీత్యా వారికి ఒజిబ్వాలవద్ద ఆచారాలు, అలవాట్లు, మనిషిపోలికలలో వారికి చాలా దగ్గరగా వుంటారు

మిస్సిసిపీ తెగలు పశ్చిమ ప్రాంతపు అల్గోంకిన్లను ఈ పేరున పిలుస్తారు మిస్సిసిపీనది తూర్పువొడ్డున విస్కాన్సిన్, ఇల్లి నాయిస్లలోనూ, దక్షిణాన కెంటకీలోకి, తూర్పున ఇండియానాలోకి వ్యాపించి వున్నారు.

1 మియామీలు వీరి సన్నిహిత జ్ఞాతులు వియాస్, పియాన్‌కెషాలు, పియో రియాలు, కస్కాస్కియాలున్నూ వీరందర్నీ పూర్వం, ఉమ్మడిగా ఇల్లినాయిలనే వారు. వారి సంఖ్యలు బాగాతగ్గిపోయాయి తమ ప్రాచీన అలవాట్లన్నీ వొదులుకుని వ్యవసాయంలో స్థిరపడ్డారు వీరిలో గణవ్యవస్థవుండి వుంటుందనుకోవచ్చునేగాని ధృవపరచుకోలేదు. మియామీలని పది గణాలున్నాయి

1. తోడేలు 2. మూర్ఖుడు 3 గద్ద బజ్జర్డ్ 5 చిరుత 6 టర్కీకోడి, 7. రాకూన్, 8 మంచు, 9 సూర్యుడు, 10 నీరు

మారిన పరిస్థితులు ఒకమూల, జనసంఖ్య తగ్గిపోతూ వుండడం రెండోవేపున వారిలో గణ నిర్మాణం త్వరితంగా అదృశ్యమయి పోవడానికి కారణం అవుతున్నాయి దానిక్షీణదశ ప్రారంభం అయ్యేనాటికే పురుష పారంపర్యం వచ్చింది గణాలలో అంతర్వివాహం నిషిద్ధం శాకెమ్ పదవి, ఆస్తి వారసత్వమూ గణానికే నిబద్ధం

2 షానీలు. వీరు బాగా పురోగమించిన ప్రజలు అల్గాంకిన్ తెగలలో ఉన్నతిని సాధించినవారు అయితే ఇప్పటికే గణనిర్మాణాలలోనే వున్నారు కాని ప్రాచీన గణ వ్యవస్థ స్థానే పౌర నిర్మాణాన్ని ప్రవేశపెట్టారు సమితినీ, ప్రథమ,ద్వితీయ నాయకున్నీ ఏటా ప్రజలు వోటింగుద్వారా ఎన్నుకుంటారు వారిలో పదమూడు గణాలున్నాయి సామాజిక, వంశ పారంపర్యావసరాలకోసం గణాలను ఇంకా కొనసాగిస్తున్నారు.

1. తోడేలు, 2 మూర్ఖుడు, 3 ఎలుగు 4 బజ్జర్డ్, 5 చిరుత, 6 గూబ, 7. టర్కీ, 8 లేడి, 9. రాకూన్, 10. తాబేలు, 11. పాము, 12, గుర్రం, 13 కుందేలు,

పారంపర్యం, వారసత్వం, గణంవెలుపలే వివాహం చేసుకోవాలనే నియమం ఇవన్నీ మియామీలలో లాగనే 1869లో షానీల సంఖ్య ఏడువందలే అంటే గణా నికి సగటున ఏభయిమందివున్నారు. ఒకప్పుడు మూడు, నాలుగు వేలమంది వుండే వారు. అమెరికను ఇండియన్లలో అది సగటుకన్న ఎక్కువే.

షానీలలో ఒక చిత్రమైన అలవాటు వుంది. మియామీలు, సౌక్‌లు, ఫాక్స్‌లలో కూడా అది కనబడుతూంది కొన్ని నియమాలకులోబడి కట్టుబడులతో పిల్లలకు తండ్రి గణం లోనిదో, తల్లిగణంలోనిదో మరే యితర గణంలోనిదో పేరు పెట్టుకోవచ్చు. ఇరాక్వాలలో ప్రతి గణానికీ దాని దాని పేర్లు వున్నాయనీ, ఒకగణంలోని పేరును ఇతరులు వుపయోగించడం నిషిద్ధం అనీ ఇదివరలోనే చెప్పేను. ప్రతితెగలోనూ పేరుచెప్పడంతో అతని గణం ఏదో తెలిసిపోతుంది సౌక్‌లలోనూ, ఫాక్స్‌లలోనూ

కొడుగు కొమ్ములు పేరు లేదిి గణానిది గద్దగణంలో పేర్లు మచ్చుకు కా- వో- నా- "గూడు కడుతున్న గద్ద" జా- కా- క్వా-పే- "తలెత్తి కూర్చున్న గద్ద" పే- అ- టా- నా- కా- హోక్- "కొమ్మపై ఎగురుతున్న గద్ద-" ఇల్లాగే వుంటాయి. ఈ ఆచారం సర్వత్రా వుండివుంటుంది షానీలలో ఈ పేర్లతో వారికి ఆ పేరులగల గణాల హక్కులు కూడా సంక్రమిస్తాయి ఆ విధంగా పేరు అతని గణాన్ని నిర్ణ యిస్తుంది శాకెమ్ ఎప్పుడూ తనను ఎన్నుకొని, పదవిలో వుంచిన గణంవాడు అయి తీరాలి కనక స్త్రీ పారంపర్యం పురుష పారంపర్యంగా మార్పడం శాకెమ్ పదవి వద్ద ప్రారంభం కావడానికి వీలులేదు వారసత్వం తండ్రినుంచి కొడుక్కు రావడానికి, తండ్రి ఆస్తి కొడుకులకు వచ్చేటట్లు చేయడానికి ఈ మార్పు వచ్చింది కొడుక్కి తండ్రి గణనామం పెడితే అతడు ఆ గణంవాడు కావచ్చు కాని శాకెమ్ పదవి కుటుంబవారసత్వం లోదికాదు గణ వారసత్వంలోది దానికి ఎన్నికలుజరగాలి. ఆ విషయంలో తండ్రి పెత్తనం లేదు ఆ సమస్యని గణం కొందరి చేతుల్లో ముఖ్యంగా ఏయస్సు మళ్ళిన పెద్దవాళ్ళ చేతుల్లో పెడుతుంది పిల్లలకి పేరుపెట్టేందుకు వాళ్ళ సలహా తీసుకోవాలి పాటించాలికూడా. ఏం ఏర్పాట్లు చేశారో, షానీగణాలలో ఈ అధికారం కొందరికిచ్చేరు. పైన చెప్పిన విధంగా పేర్లుపెడతారు ఆ పిల్లలు ఆయాగణాలకు చేతున్నారు

షానీలలో పారంపర్యం గురించి ప్రాచీన నియమం వుండినట్లు కొన్ని విష యాలలో కనబడుతూందని నాకు చెప్పేరు. ఉదాహరణకి, తోడేలు గణానికి చెందిన శాకెమ్ లా- హో- వే చనిపోతూ తనతర్వాత తన కొడుకుకుగాక చెల్లెలు కొడుక్కు వారసత్వం సంక్రమింప చేయమని కోరేరట కాని అతని మేనల్లుడు చేప గణంవాడూ, కొడుకు కుందేలు గణంవారూ అయ్యేరు కనక వారసత్వం ఇద్దరికీ లేదు వారికి పేరు మార్చి తోడేలు గణంలోకి ముందుకు తీసుకురావాలి ఏమంటే ఆ పదవి తోడేలు గణంలో పారంపర్యం గలది ఆయన కోరికను మన్నించారు ఆయన చనిపోయాక మేనల్లుడి పేరుమార్చి తోడేలు గణానికి చెందిన తెన్- ఆ- శా- గో- దే పేరుపెట్టి తరవాత శాకెమ్‌గా ఎన్నుకున్నారు ఇల్లాంటి మార్పులు గణాల క్షీణత్వాన్ని చూపు తాయి కాని రెండో వేపున షానీలలో స్త్రీ పారంపర్యం కొద్దికాలం క్రితం వరకూ కొనసాగిందనికూడా అవే సూచిస్తున్నాయి

3 సౌక్‌లు, నక్కలు

ఇవి రెండూ ఒకే తెగగా కలిసిపోయినాయి వానిలో గణాలివి.

1 తోడేలు, 2 ఎలుగు, 3. లేడి, 4 కణుజు, 5 డేగ, 6 గద్ద, 7. చేప, 8 దున్న, 9 ఉరుము, 10 ఎముక, 11. పక్షి, 12. సముద్రం, 13 స్టర్జన్ చేప 14 మహావృక్షం

పారంపర్యం, వారసత్వం, గణం వెలుపలనే వివాహం చేసుకోవాలనే నియమం-మియామీలలో లాగనే 1869లో వారిసంఖ్య ఏడువందలు అంటే గణానికి సగటున ఓ ఏభయిమంది అన్నమాట. గణాల సంఖ్యనుపట్టి చూస్తే ఈ రెండు శతాబ్దాల ఈ మధ్యలోనే వారి సంఖ్య చాలారెట్లు వుండి వుంటుందను కోవచ్చు

4 మెనోమినీలూ, కికాపూలు

ఈ రెండూ దేనికదే గణనిర్మాణం వుంది కాని వాటిపేర్లు సంపాదించలేదు మెనోమినీ తెగకు చెందిన అంటోనీ గూకీ 1869లో నాకు చెప్పిన దాన్నిపట్టి ఆ తెగలో ఇటీవలి వరకూ స్త్రీ పారంపర్యం సాగిందనుకోవాలి వారసత్వం గురించి నేనడిగిన ప్రశ్నకు ఆయన చెప్పింది ఇది "నేను చచ్చిపోతే నా ఆస్తి నా పెళ్ళానికీ, పిల్లలకీ దక్కనీకుండా నా అన్న తమ్ముళ్ళూ, మేనమామలూ కొట్టుకుపోతారు ఈవేళ నా ఆస్తి నా పిల్లలకి చెందాలనుకుంటాను కాని, నమ్మకం లేదు వెనకటి ధర్మం ప్రకారం నా ఆస్తి "నా దగ్గరజ్ఞాతులకి పోతుంది నా పిల్లలకి కాదు నా అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్ళూ, మేనమామలూ నాకు సన్నిహిత జ్ఞాతులు. నా పిల్లలుకాదు" దీనిని పట్టి ఆస్తి వారసత్వం గణానిది అయితే స్త్రీ పారంపర్యంలో తల్లితరపు నుంచి దగ్గర బంధువులది

రాకీ పర్వత తెగలు 1 బ్లడ్ బ్లాక్ ఫీట్—ఈ తెగలో అయిదు గణాలున్నాయి.

1 రక్తం, 2 చేపలు తినే వాళ్ళు, 3 స్కంక్, 4 అ-నె-పా. (అంతరించి పోయిన ఒక జంతువుపేరు.) 5. కణుజు

పారంపర్యం మగవానిద్వారా, గణంలో అంతర్వివాహం నిషిద్ధం

2 పావురం బ్లాక్ ఫీట్— ఈ తెగలో ఎనిమిది గణాలున్నాయి.

1 రక్తం, 2 స్కంక్, 3 కాళ్ళవాపు, 4 లోకొవ్వు 5. గారడివాళ్ళు, 6 మొగంమాడ్పు, 7. తిండిలేని వాళ్ళు. 8. నగంకుళ్ళిన మాంసం

మగవారి ద్వారా పారంపర్యం గణంలో వివాహం నిషిద్ధం. పైన చెప్పిన పేర్లు గణాలకు కన్నగుంపులకు తగివున్నాయి కాని నాకు చెప్పిన వారు నమ్మకస్తులు, అలగ్జాండర్ కల్బర్ట్సన్, ఆయనభార్యా చెప్పేరు. ఆమె బ్లాక్ ఫీట్ తెగకు చెందిన యామె. గణాలకు పెట్టిన ఎగతాళిపేర్లు అసలుపేర్లను మింగెయ్యడం మామూలే.

అట్లాంటిక్ తెగలు

1 డెలావరేలు, వీరు అల్గోన్‌కిన్ తెగలకు చెందిన అతిప్రాచీనులని ఇంతకు పూర్వం చెప్పేను వారి నుంచి విడబడి క్రమంగా ఒకతెగ అయ్యారు వారిని చూసిన వాటికి వారు డెలావరేబే చుట్టూనూ, దానికి వుత్తరానా వుండేవారు వారిలో మూడు గణాలున్నాయి

1. తోడేలు (గుండ్రని పంజా)
2 తాబేలు (పాకుతున్న)
3. టర్కీ-కోడి (నమిలినని)

ఈ విభజనలుచూస్తే ప్రాట్రీలవలె వున్నాయి ఏమంటే ప్రతిదాంట్లో పన్నెండేసి ఉపగణాలున్నాయి వానికి గణలక్షణాలు కొన్ని కొన్ని వున్నాయి పేర్లుకూడా వ్యక్తుల పేర్లు అందులో అధికం స్త్రీలపేర్లు ఇదేదో కొత్తగా వుండడంచేత నేను 1860 లో కన్సాస్‌లోని డెలావరే రిజర్వేషన్‌లో మకాంపెట్టి, వారిలో విద్యావంతుడైన విలియం అడమ్సనహకారంతో జాగ్రత్తగా, నిశితంగా పరిశీలించా కాని, ఈ ఉపశాఖలు ఎందుకు వచ్చేయో అంతుదొరకలేదు. చాల మంది ప్రసిద్ధ పూర్వపురుషుల సంతతుల వాళ్లం అని ఈ గణాలవారు చెప్పుకుంటారు గణాలనుంచి అతిసహజంగా ప్రాట్రీలు ఎల్లా ఏర్పడతాయో దీని వలన తెలుస్తుంది

డెలావరేలలో పారంపర్యం స్త్రీలద్వారా అల్గోన్‌కిన్ తెగలన్నింటిలో అతి ప్రాచీన కాలంలో అదిసర్వసామాన్యంగా వుండిందనవచ్చు శాకెమ్ పదవి గణంలో పారంపర్యం గణసభ్యులనే దానికి ఎన్నుకోవాలి వారిని ఎన్నుకొనేందుకూ తొలగించేందుకూ హక్కు గణసభ్యులకుంది ఆస్తికూడా గణంలోనే వుండాలి. మొదట్లో మూడుగణాల వారూ తమ తమ గణాలలో వివాహం చేసుకోకూడదు ఇప్పుడా నిషేధం ఉపగణాలకు మాత్రమే పరిమితం. తోడేలు గణం ఇప్పుడు ప్రాట్రీ అయింది తమ గణంపేరుగల వారిని వివాహం చేసుకోకూడదు. ఇతరపేర్లు గలవారిని చేసుకోవచ్చు. పిల్లలకు తండ్రిగణంపేర్లు పెట్టడం డెలావరేలలో ప్రారంభమయి, షానీలు, మియామీలలోనూ వచ్చిన విపర్యయాలే దీనిలోనూ వచ్చేయి. అమెరికను నాగరికతా, వారితోకలిసి జీవిస్తుండడంవలన ఇండియను నిర్మాణాలు తప్పక పంక్షీణంలో పడతాయి. ఆ ప్రజల సామాజిక జీవనం శిధిలం అయిపోతుంది.

పారం పర్యం గురించిన ఆదివాసి నిబంధనలు అర్థంకావడానికి పదవుల వారసత్వం మంచిపుదాహరణలను ఇవ్వగలదు. ఒక దెలావరే మహిళచెప్పిన సమాచారం ఇది ఆమె ఆమెపిల్లలు తోడేలు గణంవాళ్ళు. ఆమెభర్త తాబేలు గణం వాడు తాబేలుగణం ప్రధానశాకెమ్ కెప్టెన్ కెచుమ్ చనిపోయినప్పుడు ఆ పదవిక్కి ఆయన సోదరికొడుకు వచ్చేడు ఆయనా తాబేలుగణంవాడే కనక. చనిపోయిన కెప్టెన్ కెచుమ్‌కు ఒకకొడుకువున్నాడు కాని ఆయన గణంవేరు. కనక ఆ పదవి ఆయనకు రాదు. ఇరాక్వ్యూలలోలాగే దెలావరేలలో కూడ పదవులు సోదరుడి నించి సోదరుడికి, మేనమామనుంచి మేనల్లునికి సంక్రమిస్తాయి. దీనికి కారణం స్త్రీ పారంపర్యం వుండడం

2 మున్సీలు - వీరు దెలావరేలలోశాఖ వీరిలోనూ అవే గణాలున్నాయి తోడేలు, టర్కీ-కోడి, తాబేలు పారంపర్యం స్త్రీద్వారా గణాలలో అంతర్వివాహం నిషిద్ధం శాకెమ్ పదవీ, ఆస్తి గణంలో వారసత్వం

3 మోహెగన్‌లు - కెన్నెబెక్ నదికి దక్షిణానవున్న న్యూఇంగ్లండు ఇండియన్లలో ఈ మోహెగన్‌లు ఒకభాగం వీరందరిభాషా ఒక్కటే ఒకరినొకరు అర్థంచేసుకోగలరు. మోహెగన్‌లలో గణనిర్మాణం వుంది. కనక పెకోట్‌లు, నర్రాగన్‌సెట్‌లు, ఇతర చిల్లర మల్లర జాతుల్లోకూడ గణ నిర్మాణాలు, అవేగణాలు కూడా వున్నాయని వూహిస్తున్నాము దెలావరేలలో లాగ మోహెగాన్‌లలోకూడ అవే మూడు గణాలు- తోడేలు, తాబేలు, టర్కీ-కోడి- వున్నాయి. మళ్ళీ ప్రతిదానిలో ఉపగణాలున్నాయి వీరు దెలావరేలు, మున్సీలనుంచి వచ్చిన శాఖ మొదటి గణాలు విడబడి, శాఖోప శాఖలవుతూ ఒక ఫ్రాట్రీలో కలిసి వుండడం గురించి ఇదివరలో చెప్పేము వీరివిషయంలోనూ జరిగింది అదే గణసంస్థలనుంచి ఎంతసహజంగా ఫ్రాట్రీ ఏర్పడుతుందో దీనికూడా ఉదాహరణగా చూపవచ్చు

అమెరికన్ ఆదివాసులలో ఇతర తెగలలోకన్న మోహెగాన్‌లలో ఫ్రాట్రీలు చాల ప్రత్యేకంగా కనిపిస్తాయి. అవి ప్రతిదానిలోని గణాన్ని తమలో ఇముడ్చుకొన్నాయి. గణాల వర్గీకరణను చూపించడానికి ఫ్రాట్రీనే పేర్కొనాలి. అయితే ఇరాక్వ్యూల ఫ్రాట్రీలు తెలిసినంతగా వీనిని గురించి మనకు తెలియదు.

I తోడేలు ఫ్రాట్రీ గణాలు

1. తోడేలు 2. ఎలుగు 3 కుక్క 4 ఒపోస్సమ్.

II తాబేలు గణాలు

1 చిన్న తాబేలు, 2 బురద తాబేలు, 3 పెద్ద తాబేలు, 4 పచ్చని మలుగుచేప

III టర్కీలో గణాలు

1 టర్కీకోడి, 2 కొంగ, 3 కోడిపిల్ల.

పారంపర్యం స్త్రీలద్వారా, గణంలో అంతర్వివాహం నిషిద్ధం శాకెమ్ పదవి వారసత్వం గణానిది అది సోదరుడినుంచి సోదరుడికి, మేనమామనుంచి మేనల్లుడికి సంక్రమిస్తుంది నేను కన్సాస్‌లో కలుసుకొన్న వర్రాగన్‌పెట్ మహిళ ద్వారా తెలుసుకొన్న దేమంటే పెరోట్‌లూ, వర్రాగన్ పెట్‌లూలో, పారంపర్యం స్త్రీల ద్వారానే వుంది

4 అబెనాకీలు - ఈ గణంపేరు "వా-బె-నా-కి" అంటే "ఉదయ సూర్యుని ప్రజ" కెన్నెబెక్‌కు దక్షిణంగావున్న న్యూ ఇంగ్లాండ్ ఇండియన్లలోకన్న వీరు మిక్‌మాన్‌లతో దగ్గరగా వుంటారు వారిలో పద్నాలుగు గణాలున్నాయి

1 తోడేలు, 2 నల్లఅడవిపిల్లి, 3 ఎలుగు, 4 పాము, 5 మచ్చలజంతువు, 6 బీవర్, 7 కారిబూ, 8 స్టర్జన్, 9 పునుగుఎలుక, 10 పావురం డేగ, 11 ఉడత, 12 మచ్చలకప్ప, 13 కొంగ, 14 ముళ్ళపంది

పారంపర్యం వీరిలో పురుషులద్వారా. గణంలో అంతర్వివాహం ప్రాచీనం నుంచీ నిషిద్ధం అయితే ఆ నిషేధం ఇప్పుడంత బలంగా పాటింపడం లేదు శాకెమ్ పదవి గణంలో పారంపర్యంగా వస్తుంది పై గణాలలో అధికభాగం ఒజిబ్వాల గణాలవంటివేనని గమనించాలి

6 అతపాస్కా - అపాచే తెగలు

హడ్సన్ బే ప్రాంతవాసులైన అతపాస్కాలూ, న్యూ మెక్సికోలోని అపాచేలూ ఒక మూలతెగలోని శాఖలు వారిలో గణనిర్మాణం వున్నదీ లేనిదీ ధృవపరుచుకోలేదు 1861 లో హడ్సన్ బేలో వున్నప్పుడు కుంచేలు, ఎర్రవాకు తెగల అతపాస్కాన్ల నుంచి తెలుసుకోడానికి ప్రయత్నించాను కాని సరియైన దుబాసీ లేక సాధ్యపడలేదు. కాని, అసలు ఆ నిర్మాణం వుంటే, ఎంత చేలగాని ప్రశ్నలువేసినా, సూచనగానైనా అర్థంగాకపోదు. రాబర్ట్ కెన్నికాట్ కూడా నా కోసం బానిసల నదన్నుమీది అతపాస్కాన్లలో ప్రయత్నించేరు. కాని, ఆయనకూ సాధ్యంకాలేదు వివాహం

గురించిన ప్రత్యేక వివయాలనూ, టాకెమ్ పదవి పారంపర్యాన్నీ తెలుసుకున్నారు కాని గణసమాచారం నిర్ద్వంద్వంగా తెలుసుకోలేక పోయేరు తెలుసుకున్న దానిని పట్టి గణాలు వుండి వుంటాయను కోవచ్చు యూకోన్ నదిమీది కుచిన్‌లు (లవ్‌చోక్) అతపాస్కన్‌లే నాకురాసిన ఒక పుత్తరంలో జార్జిగిబ్స్ ఇల్లాఅన్నారు "మెకంజీనది మీది ఫోర్ట్ సింప్సన్‌నుంచి ఒక పెద్ద మనిషి తమ పుత్తరంలో-" లవ్‌చోక్స్ లేక కుచిన్‌లలో మూడు తరగతులులేక అంతరువులు వున్నాయట—బహుశా టోటెమ్‌ను ఆయన తరగతి అనుకున్నారేమో టోటెమ్‌లలో ఎక్కువ, తక్కువ లుంటాయికదా - ఎవరూ తమ తరగతిలో వివాహం చేసుకోరు మరోతరగతి వారిని చేసుకుంటారు పెద్దతరగతికి చెందిన నాయకుడు కనిష్ఠ తరగతి యువతిని పెళ్ళాడవచ్చు ఆయన కులంచెడదు. పిల్లలు తల్లితరగతి వారుగా వుంటారు వివిధ తెగలలో వున్నా ఒకే తరగతివారు తమలోతాము యుద్ధాలకు దిగరు- అని వ్రాసేరు", అన్నారు

వాయువ్య కోస్తాలోని కోలుష్‌లు భాషలో - పూర్తిగా కాకపోయినా అతపాస్కన్‌లకు దగ్గరగా వుంటారు గల్లాటిన్ తమలేఖలో "వారూ మన ఇండియన్లలో లాగే తెగలు లేక తరగతులుగా విభజించబడి వున్నారు ఆరెగాన్ ఇండియన్‌లలో ఇది సూచనగాకూడా లేదని హాలే అంటున్నారు తెగలపేర్లు జంతువులపేర్లే. ఉదాహరణకి ఎలుగు, గద్ద, కాకి, తూరమీను, తోడేలు వారసత్వం స్త్రీలద్వారా అని చెప్పాలి మేనమామనుంచి మేనల్లునికి ఒక్క ప్రధాన నాయకుని విషయంలో మినహాయింపు ఆయన చాలా వరకుబడి వున్నవాడు"

## 7 వాయవ్య కోస్తాలోని ఇండియను తెగలు

కోలుష్‌లలోలాగే ఈ తెగలు కొన్నింటిలో గణనిర్మాణాలు వున్నాయి గిబ్సే నాకోపుత్తరం వ్రాస్తూ "పుగెట్ జలసంధిని వదలి వచ్చే ముందు అదృష్టవశాత్తూ మనం ఉత్తర ఇండియన్లు అనిపిలిచే కుటుంబాల మూడింటి ప్రతి నిధుల్ని కలిశాను. వాంకువార్ దీవి ఎగువనుంచి రష్యను భూములలోకంటా ఎస్కిమోల ప్రదేశాలవరకూ వాయవ్య కోస్తా వెంబడే వీరు వ్యాపించివున్నారు కనీసం ఈ మూడు కుటుంబాల వరకైనా టోటెమ్ పద్ధతి వున్నదని వారినుంచి గట్టిగా తెలుసుకున్నాను. నేను చెప్పిన కుటుంబాలలో ఒకదానిని ట్లింకిట్‌లు అంటారు వాళ్ళలోని ఒకజట్టుపేరున సాధారణంగా స్టికీన్‌లు అనిపిలుస్తారు వారిని వేరొకరు ట్లయిదాలు, మూడోవారు చిమ్‌శ్యాన్‌లు. వీరినే గల్లాటిన్‌గారు వీన్ అని పిలిచారు

వీరిలో సర్వసామాన్యంగా నాలుగు టోటెమ్‌లు - తోడేలు, తిమింగిలం, గద్ద, కాకి - వుంటాయి. వీరెవ్వరూ తమ టోటెమ్‌వారిని వివాహమాడకూడదు ఆ టోటెమ్ మరో జాతిదీ, మరో కుటుంబంలోనిదీ అయినా సరే. ఈ జాతులన్నీ వివిధ కుటుంబాలుగా విడబడి వుండడం విశేషం అలా చెప్పడంలో నా వుద్దేశ్యం వారిభాషలే పూర్తిగా వేరువి. చూడడానికి పోలికలే కనబడవు " ఇంకా తర్వాత కొన్ని ఏళ్ళకు అలాస్కా గురించిన రచనలో 'దాల్' ఇల్లా అన్నారు " టింనెట్లులో నాలుగు టోటెమ్‌లున్నాయి కాకి, తోడేలు, తిమింగిలం, గద్ద వారు టోటెమ్‌లనుంచే వివాహమాడాలి పిల్లలు తల్లిటోటెమ్‌కే సాధారణంగా చెందుతారు

'హ్యూబర్ట్ హెచ్. బాంక్రాఫ్ట్' వారి నిర్మాణం గురించి ఇంకా పూర్తిగా చెప్పేరు రెండు ప్రాత్రీలున్నాయి ప్రతి ఒక్కదానిలో గణాలున్నాయి ట్లిన్‌కేట్‌లు "రెండు పెద్దశాఖలుగా, కుదురులుగా విడబడివున్నారు వానిలో ఒకదానివి కాకి అనీ, వేరొక దానివి తోడేలు అనీ అంటారు ఈ కాకి మొదట ఇంకా ఉప శాఖలుగా విడబడింది వాటిపేర్లు కప్ప, బాతు, నీటిసింహం, గూబ, సాల్మన్ చేప తోడేలు కుటుంబంలో ఎలుగు, గద్ద, డాల్ఫిన్, సొరచేప, అల్కా ఒకే కుదురులోని తెగలు ఒకరొకరితో యుద్ధాలుచేయరు. రెండోవేపున ఒకే కుదురులోని వారు పరస్పరం వివాహమూ చేసుకోరు ఆ విధంగా తోడేలు కుదురుకు చెందిన యువకుడు కాకి కుదురునుంచి పిల్లను చూసుకోవాలి

ఎస్కిమోలు గణకుటుంబాలకు చెందరు వారు అమెరికా ఖండంలోకి రావడము ఈ గణకుటుంబాలకన్న బాగా ఆలస్యంగా జరిగింది

## 8 శాలిష్, సొహాప్టిన్, కూటెనే తెగలు

కొలంబియా లోయలోని తెగలలో ప్రధానమైన మూలతెగలు ఈ మూడూ వీరిలో గణ నిర్మాణంలేదు సుప్రసిద్ధ భాషాశాస్త్రవేత్త అయిన హోరేషియో హేలే, జార్జి గిబ్బ్సులు ఈ విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నాకూడా వారిలో ఈ నిర్మాణం ఛాయామాత్రంగా కూడా కనుక్కోలేకపోయేరు. ఈ మండలంలోనే గణ కుటుంబం పుట్టినదనీ, వారు వలసపోయి రెండుఖండాలలో వ్యాపించేరని వూహించడానికి బలమైన కారణాలున్నాయి. వీరి పూర్వులలో గణనిర్మాణం వుండి కాలగతిలో శిథిలమై అంతరించి పోయిందనుకోవడం సబబు.

9 షోషోనే తెగలు

బెస్తాస్‌లోని కొమాన్‌చేలు, ఉటేతెగలు, బొన్నాక్‌లు, షోషోనేలు, మరికొందరు తెగలు ఈ మూలంనుంచి వచ్చినవారు వ్యాన్‌దోతే మిశ్రజాతికి చెందిన మేథ్యూ వాకర్ 1869లో నాతోమాట్లాడుతూ తాను కొమాంచేంలో జీవించేవనీ వారిలో గణాలున్నాయనీ చెప్పారు.

1 తోడేలు 2. ఎలుగు 3. కణుజు 4. లేడి 5. గోఫర్ చెట్టు 6 దుప్పి.

కొమాన్‌చేంలో గణనిర్మాణం వుంటే అదేమూలానికి చెందిన మిగిలిన వారిలోనూ వుండే వుంటుంది

న్యూ మెక్సికోకు ఉత్తరాన ఉత్తర అమెరికాలోని ఇండియను తెగల సామాజిక పరిశీలన ఇంతతో ముగిస్తున్నా పైన చెప్పిన తెగలలో అత్యధిక భాగం అనాగరిక యుగం దిగువ దశలోనే వున్నారు మిగిలినవారు ఆటవిక యుగం ఎగువదశలో వున్నారు ఇది యూరపియన్ల కంటబడిననాటి స్థితి గణనిర్మాణం వారిలో విస్తృత వ్యాప్తిలో వుండటాన్నిబట్టి, ప్రాచీన కాలంలో స్త్రీల పారంపర్యంతోనే అది సర్వత్రా వుండేదనవచ్చు అది కేవలం సామాజిక నిర్మాణం. దానికి గణం ఒక యూనిటు ఆ నిర్మాణంలో క్రమంగా ఫ్రాట్రీ, తెగ, సమాఖ్య ఏర్పాడ్డాయి ఈ వాటుగుదశల పక్వీకరణమూ, ప్రభుత్వ భావన పెరుగుదలలో వారి అనుభవాన్ని తెలుపుతూంది. అనాగరికయుగం నుంచి బయటపడే నాటికి ఆర్యను, సెమెటిక్ తెగలలో కూడ ఇదే నిర్మాణం వుండింది అంటే అతి ప్రాచీనకాలంలో ఈ వ్యవస్థ ప్రపంచవ్యాప్తంగా వుండడమే కాదు వీరందరి మూలం ఒకటని కూడా తోపింపచేస్తూంది కుటుంబ భావన పెరుగుదల గురించి చెప్పేటప్పుడు ముందు ముందు పునలాన్ కుటుంబం గురించి చెప్పాల్సివుంది ఆ కుటుంబమే గణనిర్మాణానికి మూలం అనితోస్తుంది ఆర్యను, సెమిటిక్, ఉరలియన్, తురానియన్, గనోవానియన్ మానవ కుటుంబాలన్నీ మొదట ఒకే పునలాన్ మూలం నుంచి వచ్చివుంటాయి. ఆ దశలో గణంగా ఏర్పడ్డారు. దానినుంచి ప్రతిచక్కరూ వృద్ధిపొంది చివరకు వేరు వేరు కుటుంబాలయ్యారు. ముందు ముందు ఇంకా లోతుగా పరిశీలించి, విపుల సమాచారాన్ని సేకరించిన మీదట ఈ నిర్ణయం దానంతట అదే స్థిరపడుతుంది. తరవాత ఆటవిక యుగంలో, అనాగరిక యుగం అంతటిలో, నాగరికదశ ప్రారంభంలో కూడా మానవజాతిని పట్టివుంచి నడిపించగలిగిన ఆ మహానిర్మాణం యాదృచ్ఛికంగా వచ్చిపడినది అయివుండదు.

అదివరకే వున్న పరిస్థితులనుంచి సహజక్రమంలో వచ్చినదే అయివుంటుంది గణాలుగా నిర్మాణం పొందిన మానవకుటుంబాలు అన్నింటికి మూలం ఒక్కటేనని నిరూపించడం సాధ్యమే

## 10 గ్రామవాసి—ఇండియన్లు

1 మోక్వి ప్యూబ్లో (గ్రామ) ఇండియన్లు, మోకీతెగలు ఇప్పటికీ తమ పురాతన సామూహిక గృహాలను వదలనేలేదు న్యూమెక్సికోలో భాగంగా ఒకప్పుడు వుండిన అరిజోనాలో చిన్న కొలరేడో సమీపంలో వీరివి ఏడు సామూహిక గృహాలున్నాయి తమ ప్రాచీన నిర్మాణాలలోనే వారు నివశిస్తున్నారు తెల్లవారు చూసిననాటికి జునీ నుంచి కుజ్కో వరకూ వ్యాపించివుండిన గ్రామవాసి ఇండియన్లు జీవించిన పక్కీలోనే వారు నేటికి నివసిస్తున్నారు 1540-1542లో కొరొనాడో, జునీ, అకోమా, టావోస్ లగో, ఇతర న్యూమెక్సికో ప్యూబ్లోలలో చూసిన ఇళ్ళమాదిరివే ఇక్కడున్నాయి వారు చూడడానికి అందుబాటులో వున్నట్లున్నా వారి జీవితపద్ధతుల్ని గురించిగాని వారి వ్యవస్థ నిర్మాణం గురించిగానీ తెలిసినది చాల తక్కువ తెలిసినది నలుగురూ చెప్పుకొనేదీ, యాదృచ్ఛికంగా లభ్యమయినదీను

మోకీలలో తొమ్మిది గణాలున్నాయి 1 లేడి, 2 ఇసక, 3 వాన, 4 ఎలుగు, 5 కుందేలు, 6 ప్రయరీ తోడేలు, 7 రాటిల్ పాము, 8 పొగాకు మొక్క, 9 రెల్లు

అమెరికను అసిస్టెంటు సర్జను డా॥ టెన్ బ్రాక్ మోకీల ఒక గ్రామంలో ఆ ప్రజల మూలం గురించిన కథ విని స్కూల్‌క్రాఫ్టుకు రాశారు "ఎన్నో ఏళ్ళక్రితం మహామాత (షాసీలు ఇదివరలో ఒక దేవతను ఆరాధించేవారు వారా దేవతను 'గో-గో మే-ధా-మా' 'మన అమ్మమ్మ'-అని పిలిచేవారు ) పశ్చిమానవున్న తన యింటి నుంచి తొమ్మిది జాతుల మనుష్యుల్ని ఈ వరసలో తీసుకువచ్చింది మొదట లేడిజాతి రెండు- ఇసకజాతి, మూడు- వానజాతి, నాలుగు-ఎలుగుజాతి అయిదు- కుందేలుజాతి, ఆరు- ప్రయరీ మైదానాల తోడేలు జాతి, ఏడు- రాటిల్ పాముజాతి, ఎనిమిది- పొగాకు మొక్క జాతి, తొమ్మిది- రెల్లుగడ్డిజాతి. వారిని ఇప్పుడు వారుంటున్న ఊరున్నచోట నిలబెట్టింది వారిని మనుష్యులుగా మార్చి పూళ్ళుకట్టుకోమంది ఆనాటి జాతుల ప్రత్యేకత నేటికీ కొనసాగుతూంది నేను ఇసక జాతివాడిని అని ఒకరూ, లేడిజాతి వాడిని అని ఒకరూ ఇల్లాగే చెప్తూవచ్చారు మనిషిగా మార్పు జరిగిందనే, వారికి గట్టి నమ్మకం. చచ్చిపోయినప్పుడు ఏ జాతివాళ్ళు ఆ జాతి అసలు రూపంలోకి—లేడో, ఎలుగో, పామో అయిపోతా మని నమ్ముతారు వారిలో పాలన అధికారం వంశపారం

పర్యం కాని తండ్రినుంచి కొడుక్కి రావాలనిలేదు వారికితోస్తే చనిపోయిన వాని రక్తబంధువు నెవర్నో ఎన్నుకుంటారు వీరు అనాగరికయుగం దిగువదశ నుంచి మధ్య దశకి ఎదిగేరు పరిపూర్ణంగా ఏర్పడిన గణ సంస్థలలోకి ప్రవేశించారు మారిన వారి పరిస్థితులకు అది సరిపడింది దీనినిబట్టి గ్రామవాసి ఇండియనులందరిలోనూ ఈ నిర్మాణం వుందనే అనుకోవాలి ఇక్కడినుంచి ముందుకి ఉత్తర అమెరికాలోనూ, మొత్తం దక్షిణ అమెరికాలోనూ ఒక్క లగూనాలలో తప్ప మరెక్కడా పూర్తి సమాచారం దొరకలేదు అమెరికాలో మానవజాతి శాస్త్రం గురించి సరిగ్గా పరిశీలన జరగలేదు వారి సామాజిక వ్యవస్థ యొక్క మూల యూనిటు గురించి సరిగ్గా తెలుసుకోలేదు దాని ప్రాముఖ్యాన్ని అర్థంచేసుకోలేదు అయితే, వెనుకటి స్పానిషు రచయితల రచనల్లో దానిసూచనలున్నాయి ఇటీవలి వారి రచనల్లో వాటిని గురించిన పరిజ్ఞానం కనిపిస్తుంది ఆ రెంటినీ జోడించితే ఇండియను కుటుంబాలన్నింటా వెనకటి రోజుల్లో గణనిర్మాణం సర్వత్రా వుండేదనేందుకు సందేహం వుండదు

మోకీలలోలాగే అనేక గణాలలో తమ పూర్వులు ఏ జంతువులనుంచో రూపం మారి వచ్చేరనే ఆలోచన, సంప్రదాయం వుంది అందు చేతనే ఆ చెట్టునో పుట్టనో, జంతువునో తమ గణానికి సంకేతం చేసుకున్నామనుకుంటారు అదే విధంగా ఒజిబ్వాల కొంగగణం వారు గల్ఫ్ నుంచి మహాసరస్సుల వరకూ వున్న, మిస్సిసిపీ మైదానాలనుంచి అట్లాంటిక్ వరకూ వున్న, ఆ విశాల ప్రాంతంలో రెండు కొంగలు బాగా తిండి దొరికే ప్రదేశాన్ని వెతుకుతూ ఎగిరి చివరకు సుపీరియర్ సరస్సు ముఖం వద్ద ఉరవడులున్నచోటును ఎన్నుకున్నాయి- అంటారు అక్కడ నది వొడ్డున దిగి, రెక్కలు ముడుచుకోవడంతోనే ఆ మహాదేవత ఒక మగవాడు, ఒక ఆడుదిగా మారిపోయింది వారు ఒజిబ్వాల కొంగ గణానికి మూలం అయ్యేరు అనేక తెగలలోని అనేక గణాలలో తమ గణంపేరు గల జంతువును తినరు అయితే ఇది అందరిలోనూ లేదు

2 లగూనాలు లగూనా గ్రామవాసి ఇండియన్లు గణాలుగా ఏర్పడ్డారు పారంపర్యం స్త్రీలవేపునుంచి అని 1860లో న్యూమెక్సికో హిస్టారికల్ సొసైటీలో రెవరెండు శామ్యూల్ గోర్డన్ చేసిన ప్రసంగం నుంచి అర్థం అవుతుంది "ప్రతిపూరూ తెగలు లేక కుటుంబాలుగా వర్గీకరించబడుతుంది. ఈ జన సంఘాలు ప్రతిదీ ఒక జంతువు, పక్షి, ఓషధి, చెట్టు గ్రహం, లేక నాలుగు భూతాలలో ఒకదాని పేరున పిలవబడుతుంది లగూనా ప్యూబ్లో-గ్రామంలో వెయ్యమందికి పైగా జనంవున్నారు వారిలో

ఈ మాదిరి తెగలు పదిహేడువున్నాయి కొందరుఎలుగు, కొందరు లేడి, మరి కొందరు రాటిల్ పాము, కొందరు ధాన్యం, కొందరు తోడేలు, కొందరు జలం వగైరాపేర్లతో పిలుచుకుంటారు పిల్లలు తల్లితెగకే చెందుతారు ప్రాచీన ఆచారంప్రకారం ఒకే తెగకు చెందిన వారు వివాహం చేసుకోకూడదు అయితే ఈ ఆచారం పెనకటంతగా ఆచరించ బడడంలేదు "

"వారు ఉమ్మడిగా భూమి కలిగి వుంటున్నారు అది గ్రామవుమ్మడి సొత్తు అయితే ఎవరన్నా సాగుచేసుకుంటే ఆ భూమి అతనిది దాని నాతడు ఆ గ్రామంలో ఎవరికేనా అమ్మవచ్చు అతను చనిపోయినప్పుడు అతని భార్యకూ, కూతుళ్ళకూ చెందు తుంది అతడు ఒంటివాడైతే అది అతని తండ్రి కుటుంబంలో వుంటుంది " అయితే తండ్రి నుంచి భార్యకూ కూతుళ్ళకూ చెందుతుందన్న మాట సందేహం

3 అజ్‌టెక్‌లు, టెజ్‌కుకాన్‌లు, ట్లాకోపాన్‌లు- వీరిలోనూ, మెక్సికోలోని నహూవాట్లాక్ తెగలకు చెందిన ఇతరులలోనూ గణాల విషయం దీని తరవాతి ప్రకర ణంలో చర్చిస్తాను

4 యుకటాన్ మాయాలు మెక్సికో, మధ్య, దక్షిణ అమెరికాల తెగలను గురించి చెప్పేటప్పుడు హెర్రెరా పదే పదే బంధుకూటం కింద్రెడ్ [కుదురు] అనే శబ్దాన్ని వాడతాడు రక్తసంబంధంగల సమూహాలనే అర్థంలో "ఒక వ్యక్తిని చంపి నప్పుడు అతని పిల్లలకూ, బంధుకూటానికీ జవాబుదారు అవుతాడు " ఈ మాట అన్నది నికరాగువాలోని ఆదివాసుల్ని గురించి ఇరాక్వాలు గురించి కూడా ఈ శబ్దం వాడుతారు అది అక్కడ గణం అనే అర్థం ఇస్తుంది యుకటాన్‌లోని మాయా ఇండియన్లను గురించి మాట్లాడుతూ, "ఏదన్నా నష్టపరిహారం చెల్లించవలసివస్తే, ఆ చెల్లించవలసిన అతడు దరిద్రుడై పోతే, అతని బంధు కూటం దానిని సరిచేస్తుంది " ఇందులో కూడ గణంలో వున్న మరో ఆచారం వివరించేరు మళ్ళీ అజ్‌టెక్‌లను గురించి చెప్తూ వారు తప్పుచేసివుంటే, దయగాని, బంధుకూటంగాని అతని చావును తప్పించలేదు " గణాలుగా నిర్మాణం పొందిన ఫ్లోరిడా ఇండియనుల ఆచారం మరొకటి చెప్పారు "వారికి పిల్లలంటే ఎంతో యిష్టం బాగా ముద్దుచేస్తారు ఎవరన్నా కుర్ర వాడు చనిపోతే తల్లిదండ్రులూ, బంధుకూటమూ ఓ ఏడాదిపాటు ఏడుస్తూనే వుంటారు బంధుత్వ అను బంధంలో చాలమంది జనం కలిసి వుండటాన్ని పరిశీలకులు గమనిం చేరు అందుకే బంధుకూటం అన్నారు కాని అంతకన్న నిశితంగా పరిశీలించివుంటే

నిజం అర్థమయి వుండేది బంధుకూటం అన్నది గణం తప్ప వేరేమీకాదనీ, అది సమాజంయొక్క మూల యూనిటు అని తెలిపేది

మాయాలను గురించి హెర్రారా ఇంకాఇలా అన్నారు "వంశ క్రమంగురించి చెప్పుకోవడం వారికి మహా యిష్టం అందుచేత తామంతా బంధువుల మనుకుంటారు ఒకరికొకరు సాయంగా వుంటారు వారు తమ తల్లుల్ని గాని, మరదళ్ళను గాని, తండ్రి పేరున్న ఎవరినిగాని పెళ్ళాడరు అది నేరంగా భావిస్తారు" రక్త సంబంధ వ్యవస్థలో వంశ క్రమం అంటే గణం తప్ప వేరే దేనికీ ప్రాముఖ్యం వుండదు ఈ విషయాన్ని వదిలేస్తే ఇండియను నిర్మాణాలున్న కోట,గణం ద్వారా తప్ప తండ్రులూ, కొడుకులూ ఒకే పేరుగలవాళ్ళు కావడం అసంభవం గణసభ్యులకే గణం పేరు చెల్లుతుంది తండ్రీ కొడుకులకి ఒకే పేరు వుండాలంటే గణంలో పురుష పారంపర్యం ఏర్పడి వుండాలి అంతేగాక హెర్రారా మాటల్ని పట్టి గణంలో అంతర్వివాహ నిషేధం వుందని తెలుస్తూంది అయన మాటలు సరైనవే ననుకుంటే మాయాలలో గణాలున్నాయనీ, పురుష పారంపర్యం సాగుతున్నదనీ, తెలుస్తూంది చాలా ఆధారాల నుంచి సంపాదించి, బాగా వివేచించి రాసిన Early History of Mankind లో టైలర్ హరాకరి నుంచి సేకరించిన ఇదే సమాచారాన్ని ఇలా వ్యాఖ్యానించేరు "ఆస్ట్రేలియన్లలో లాగనే ఉత్తర అమెరికను ఇండియనులలో స్త్రీ పారంపర్యంలో కుదురును గణించడం, వివాహ నిషేధాచారం వుంది కాని, ఇంకా దక్షిణానికి మధ్య అమెరికాలోకి వెడితే అక్కడి ఆచారం ఇందుకు భిన్నం. చైనాలో మాదిరి ఆచారం కనిపిస్తుంది యుర్‌టాన్ ప్రజల్ని గురించి 'దీగో దే లాండా' వ్రాస్తూ తండ్రి వేపు నుంచి తన పేరున్న భార్యను ఎవ్వరూ తెచ్చుకోరు అది వారిలో తప్పు కాని తల్లి వేపునుంచి ఆమె అక్కచెల్లెళ్ళ పిల్లల్ని చేసుకోవచ్చు

## 11 దక్షిణ అమెరికాలోని ఇండియను తెగలు

దక్షిణ అమెరికాలో అన్ని ప్రాంతాలలో గణాల సూచనలు, గణాలకు సంబంధించిన బంధుత్వ వ్యవస్థల సూచనలూ కనిపించాయి ఇన్‌కాలు ఆండీ పర్వతాలలోని అనేక తెగలను చేర్చి ఒకరకం సమాఖ్యను కూర్చేరు దానిని గురించి హెర్రారా రాస్తూ "జాతులు, తెగలు, కుదురులుగా విడబడిన జాతుల నుంచి ఇన్ని భాషలు ఏర్పడ్డాయి —" అన్నారు ఇక్కడ కుదురు అన్నది గణమే నని గుర్తించబడింది వివాహము, పారంపర్యము గురించి రాస్తూ టైలరు ఇల్లా వ్యాఖ్యానించారు " ఇంకా దక్షిణాన్న భూసంధికి దిగువన స్త్రీ వేపునుంచి కుదురులూ, వివాహ నిషేధాలూ మళ్ళా

కనిపిస్తాయి," బ్రిటిష్ గయానాలోని అరావాక్‌ల గురించి బెర్నార్ వ్రాస్తూ "తల్లి వేపునుంచి కులాన్ని గుర్తిస్తారు పిల్ల వాళ్ళు తమతండ్రి కుటుంబంనుంచి పెళ్ళి చేసుకోవచ్చు అంతేగాని తల్లి కుటుంబంలోంచి కూడదు" అన్నారు ఇక చివరగా పాదరీ మార్టిన్ దోబ్రి జోఫెర్ గౌరానీలనుగురించివ్రాస్తూ "వారుఎంత దూరపు బంధుత్వంకలిసినాపెళ్ళిచేసుకోవడం మహానేరంఅనుకుంటారు" అన్నారు అబిపోనేలనుగురించి ఇల్లా అన్నారు "ఎంతదూరపు బంధుత్వం కలిసినవారినైనా పెళ్ళిచేసుకోవడంఅన్న ఆలోచనే అబిపోనేలకు దుర్భరం" ఆదివాసుల సాంఘిక వ్యవస్థను గురించిన ఆవాక్యాలలో స్పష్టత లేదు కాని ఇప్పటికే చెప్పిన అనేక విషయాల్ని బట్టి వారిలోగణాలున్నాయని,స్త్రీ పారంపర్యం పాటించబడుతున్నదని, గణంలో అంతర్వివాహం నిషిద్ధమని స్పష్టంగా కనిపిస్తుంది గయానాలోని ఇండియన్ తెగల గురించి బ్రెట్ ఇల్లా రాసేరు "వారు కుటుంబాలుగా వున్నారు ప్రతి కుటుంబానికి ఒక పేరు వుంది నివిడి, కరా, పుడీ, ఒనిసిడీ అంటూ మన కుటుంబాల్లా కాదు వీటన్నింటిలో స్త్రీ పారంపర్యం గుర్తించబడుతుంది ఆడ మగ ఎవ్వరూ తమ కుటుంబం పేరుగల వారిని పెళ్ళాడకూడదు నివిడీ కుటుంబానికి చెందిన స్త్రీ తన తల్లి పేరుతోనే పిలవబడుతుంది ఆమె తండ్రి కాని, భర్తకాని ఆ కుటుంబంవారు కాకూడదు ఆమె పిల్లల్ని, ఆమె కూతురు పిల్లల్ని కూడ నివిడీలనే అంటారు ఆమె కూతుళ్ళూ కొడుకులూ కూడ ఆ కుటుంబ నామం గల వారిని పెళ్ళాడరాదు వారికి ఇష్టం వుంటే తండ్రి కుటుంబం వారిని చేసుకోవచ్చు ఈ ఆచారాలను వారు కఠోరంగా పాటిస్తారు వాటిని మీరడం మహాపరాధంగా భావిస్తారు" ఈ రచయిత చెప్పిన కుటుంబం అన్నది, అతి ప్రాచీన రూపంలో వున్న గణమేనని అర్థం చేసుకోవచ్చు ఒక్క ఆండీ పర్వతాలలోని వారు తప్ప పైన చెప్పిన ఇండియను తెగల వారందరూ యూరపియన్లు కనుక్కున్న నాటికి ఆటవిక యుగం ఎగువదశలోనో, అనాగరిక యుగం దిగువ దశలోనో వున్నారు ఇన్కా గ్రామవాసి ఇండియన్లు నెలకొల్పిన సమాఖ్య పరిపాలన క్రిందవున్న పెరకా దేశపు తెగలు చాల భాగం అనాగరిక యుగం దిగువ దశలోనే వున్నారు 'గార్సిల్లాసో దే లావెగా' వారి సాంఘికాచారాలను వర్ణించేరు ఆ అసమగ్ర వర్ణనల నుంచి మనకు అర్థం అయ్యేది అది

ఉత్తర, దక్షిణ అమెరికాలలోని గ్రామవాసి ఇండియన్ల సంస్కృతిని బట్టి వారు అనాగరిక యుగం మధ్యదశ చివరికంటా ప్రయాణించినట్లే గణాలలో వస్తున్న పరివర్తన మీదికి మనదృష్టిపడక తీరదు గణాలయొక్క ప్రాచీన రూపం చూపించేను

గ్రీకు, రోమనులలో వాటి అత్యున్నత రూపం కనబడింది మధ్యవచ్చిన రూపాలన్నీ వివిధదశల పారంపర్యం మార్పులు, వారసత్వం మార్పులతో వున్నాయి వానినికూడా తెలుసుకుంటే తప్ప గణాల చరిత్ర పూర్తిగా తెలియదు వీని ప్రాధమిక చరిత్రగురించీ, చివరి దశ గురించీ మన వద్ద సమాచారం దండిగానే వుంది మధ్యంతర దశగురించినదే తక్కువగా వుంది మానవజాతి యొక్క ఏ తెగలోనున్నా సరే గణం తన ఉన్నత రూపంలో కనిపించిందంటే వారి పూర్వీకులలో అది అత్యంత ప్రాధమిక రూపంలోనూ వుందనే అర్థం ఊహించడానికన్న చారిత్రక విమర్శకు ఖచ్చితమైన నిదర్శనలు కావాలి ఈ నిదర్శనలు ఒకప్పుడు గ్రామవాసి ఇండియన్లలో వుండేవి వారి పాలనా వ్యవస్థ సామాజికమైనదేగాని రాజకీయం కాదని మనకిప్పుడు స్పష్టంగా తెలుసు నిర్మాణాల వరసలో చివరిదైన సమాఖ్యా, తెగా మనకు అనేక సందర్భాలలో ఎదురవుతున్నాయి అనేక గ్రామవాసి ఇండియను తెగలలో ఆ వ్యవస్థకు మూలంలోని యూనిటు-గణం వున్నట్లు స్పష్టమైన సాక్ష్యమే వుంది అనాగరికయుగం దిగువదశలో వున్న తెగలలో గణాల సమాచారం దొరికినంత ఖచ్చితమైన రూపంలో గ్రామవాసి ఇండియన్లలో కనబడ్డంలేదు మంచి అవకాశం స్పానిష్ విజేతలకూ, ఆక్రమణ కారులకీ దొరికింది కాని జారిపోయింది. నాగరిక మానవుడు తన పురోగతి క్రమంలో తాము అధిగమించిన దశలో ఆ ఇండియనులున్నారనే అవగాహన వారికి లేకపోయింది వారి సామాజిక వ్యవస్థకు మూలంలోని యూనిటు గురించిన పరిజ్ఞానం లేక వారిపాలనా సంస్థల్ని చిత్రించడంలో స్పానిష్ చరిత్రలు పూర్తిగా విఫలం అయాయి

మధ్య అమెరికాలలోనూ, పెరూలోనూ అనాగరికయుగం నడిమి దశకు చెందిన పురాతన శిల్పావశేషాలను చూస్తే ఆ దశలో మానవుడు చాలా పురోగమించేడనీ, జ్ఞానం, విజ్ఞానం బాగా విస్తరిస్తున్న దశ అదనీ తెలుస్తుంది. పూర్వార్ధ గోళంలో ఆ దశలో ఇనుము చేయడాన్ని తెలుసుకొన్నారు అది మానవజాతిలో ఓ భాగాన్ని నాగరికతవేపు నెట్టుకుపోయింది అనాగరికయుగం ఎగువదశలో కల్పనలూ,అన్వేషణలూ అతివేగంగా పెరిగిపోయేయి గ్రామవాసి ఇండియనులున్న అనాగరికయుగపు మధ్యదశలోని స్థితులను తెలుసుకుంటే అంతవేగంగా ఎగువదశలో ఆ పరిణామాలు ఎందుకు వచ్చేయో తెలుసుకోగలుగుతాం అదృశ్యం అయిపోయిన జ్ఞాన భాండారంలో కనీసం కొంతయినా సంపాదించు కోవాలంటే ఎంతో ప్రయత్నం, ఓపికా కావాలి యూరోపియన్ల కంటబడిన నాటికే కొద్దిమినహాయింపులున్నా అమెరికను, ఇండియన్ల తెగలు సాధారణంగా గణాలుగా ఏర్పడి వున్నారని చెప్పడానికి మన వద్దనున్న సమాచారం చాలును. ఏవో కొద్ది మినహాయింపులు వున్నా అవి లెక్కలోకి రావు

# ఏడో ప్రకరణం

# అజ్‌టెక్ తెగల సమాఖ్య

**అజ్‌టెక్‌ల** సమాజం గురించిన దురభిప్రాయాలు - పురోగమనం వరి స్తితి- నాహౌటియాక్ తెగలు- మెక్సికోలో వారివలసలు- 1325లో మెక్సికో ప్యూబ్లో కనుక్కున్నారు- అధికార ప్రాంతం వైశాల్యం- జనాభా అంచనా - అజ్‌టెక్‌లు గణాలుగా, తెగలుగా నిర్మాణం అయ్యేరా- నాయకుల సమితి - దాని కార్యకలాపాల అంచనా- మోంటెజూమా పదవి- ఎన్నికతో పదవి - మోంటెజూమా పదవి తొలగింపు- ఆ పదవి కార్యకలాపాల అంచనా- అజ్‌టెక్‌ల సంస్థలు ప్రజాతంత్రయుతం- ప్రభుత్వం సైనిక ప్రజాతంత్రం

మెక్సికో ప్యూబ్లోను పట్టుకున్న స్పానిష్ దుండగీళ్ళు అజ్‌టెకులది రాజరిక ప్రభుత్వమనీ, అది యూరపులో రాజరిక ప్రభుత్వాలను పోలినదేననీ ఒక దురభిప్రాయం ఏర్పరచుకొన్నారు అజ్‌టెక్‌ల సామాజిక వ్యవస్థయొక్క నిర్మాణాన్నీ, నిబంధనల్నీ క్షుణ్ణంగా పరిశీలించకుండా ఆ ప్రారంభ దినాల నాటి స్పానిష్ రచయితలు ఈ అభిప్రాయానికి వచ్చారు ఈ పొరపాటు అభిప్రాయంవలన ఆ సమాజ వ్యవస్థకు పొసగని పదాలను వుపయోగించడంచేత చరిత్రను అసత్యంగా మార్చేసేరు బుద్ధి పూర్వకంగా అసత్యాలు రాసేరనిపించేటట్లు రాసేరు అజ్‌టెక్‌లకున్న ఒకే ఒక దృఢమైన స్థావరాన్ని స్వాధీనం చేసుకోవడంచేత వారి ప్రభుత్వ నిర్మాణ రూపమే ధ్వంసమయిపోయింది దానిస్థానంలో స్పానిష్‌వారి పరిపాలన నెలకొంది వారి ఆంతరిక నిర్మాణమూ, విధానమూ అంతర్థానమై పోయాయి

స్పానిష్ అమెరికా చరిత్రలో స్పానిష్‌వారి చర్యలకు సంబంధించి వంతవరకూ, ఇండియనులు చేసిన పనులు, వ్యక్తుల ప్రత్యేక లక్షణాల వరకూ నమ్మవచ్చు వారి ఆయుధాలు, పనిముట్లు, పాత్రలు, బట్టలు, ఉడుపులు, తిండి అల్లాంటివాని వరకు నమ్మవచ్చు ఇండియనుల సామాజిక వ్యవస్థ, ప్రభుత్వం, సామాజిక సంబంధాలు,

జీవిత విధానం గురించి వ్రాసిందంతా పట్టిచెత్త వారికేమీ తెలియదు తెలుసుకోలేదు ఈ విషయంలో వారి వ్రాతలను తోసేసి, కొత్తగా ప్రారంభించ వలసిందే ఇండియనుల సమాజం గురించి మనం తెలుసుకొన్న దానితో సరిపడే విషయాలు ఏమన్నా వుంటే తీసుకుందాం

అజ్టెక్‌లకూ, వారి సమాఖ్యలోని ఇతర తెగలకూ ఇనుము తెలియదు కనక వారికి ఇనప పని ముట్లు లేవు వారికి ధనంలేదు కనక సరుకుల మార్పిడి పద్ధతితో వ్యాపారం జరిగేది అయితే సహజ లోహాల్ని వుపయోగించేవారు నీటి పారుదలతో వ్యవసాయం చేసేవారు పత్తితో ముతక బట్టలు తయారుచేసుకున్నారు రాతి తోనూ, పచ్చి ఇటికతోనూ సామూహిక నివాస గృహాలు కట్టుకొన్నారు మంచి వేలైన మట్టి పాత్రలు చేసుకొన్నారు కనక వారు అనాగరిక యుగం మధ్యదశకు చేరుకొన్నారని చెప్పవచ్చు వారి భూములు ఉమ్మడిగానే వుండేవి బంధుత్వంవున్న అనేక కుటుంబాలు కలిసి పెద్ద పెద్ద ఇళ్ళలో కాపురం వుండేవారు ఆ యిండ్లలో కమ్యూనిజం అమలు జరిపే వారనడానికి తగినంత కారణం వుంది ప్రతి రోజూ మధ్యాన్నం మాత్రమే వండుకుని తినే వారనడానికి తగిన పరిస్థితి వుంది ఆ భోజనం పద్ధ జనం విడబడేవారు మగవాళ్ళు ముందు తినేవారు ఆడవాళ్ళూ పిల్లలూ అటు తర్వాత తినేవారు వాళ్ళు కుర్చీలూ, బల్లలూ ఎరగరు కనక నాగరిక ప్రజలు మాదిరిగా ఆ ఒక్క భోజనాన్నైనా తినడం ఎరగరు వారి ఈ సామాజిక పరిస్థితుల లక్షణాలే వారి అభివృద్ధి దశను తెలుపుతున్నాయి

మెక్సికో, మధ్య అమెరికా పెరూలలోని గ్రామవాసు ఇండియన్లు ఆనాడు భూమి మీద ఈ దశలో వున్న ప్రాచీన సమాజానికి మంచి వుదాహరణ నాగరికత దిశగా పురోగమనంలో ఒక ముఖ్య మజిలీలో వారున్నారు అంత క్రితంనాటి అభివృద్ధిదశ మంచి తెచ్చుకున్న నిర్మాణాలు ఉచ్చదశకు చేరినాయి కాలక్రమంలో గడించే అనుభవంతో అంతకన్న ఉన్నతమైన అభివృద్ధి దశకు వానిని అందచేస్తారు ఇంతకన్న ఉన్నతమైన నాగరికత పూర్వదశకు వారూ ఎదుగుతారు, కాని అమెరికను ఇండియనులకు హోమరు కాలపు గ్రీకులు అందుకున్న అనాగరిక యుగం ఎగువదశకు చేరుకొనే యోగంలేదు

మెక్సికోలోని ఇండియన్ ప్యూబ్లోలలో యూరోపియనులకు అంతరించిపోయిన పురాతన సమాజం కనబడింది కొత్తగా, చిత్రంగా కనిపించడం చేత దాని యెడ అపారమైన ఆసక్తి కనబరిచేరు. అదే అభివృద్ధి దశలో వున్న ప్రజలను గురించీ,

అంత ప్రాముఖ్యమూ వున్న మరే విషయమూ గురించీ వ్రాసినదానికన్న వదింతలు పుస్తకాలు మెక్సికను ఆదివాసుల్ని గురించీ, స్పానిష్ ఆక్రమణలు గురించీ రాసేరు. అయినా అటువంటి వ్యవస్థ అటువంటి జీవితపరిస్థితులు గల ప్రజల్ని గురించి అంత తక్కువ తెలిసినదిలేదు ఆ అసాధారణ దృశ్యం చూసి పొందిన ఉత్తేజంతో కాల్పనిక రంగంలోకి జారిపోయేరు అదే నేటికి కొనసాగుతూంది అజ్టెక్ సమాజ నిర్మాణం గురించి తెలుసుకోలేక పోవడం మానవజాతి చరిత్రకే గొప్పనష్టం దానిని గురించి విచార పడవలసిందేగాని, ఎవర్నీ నిందించలేము ఎంతో శ్రమపడి రాసిన ఆ మాత్ర మేనా అజ్టెక్ సమాఖ్యగురించి భవిష్యత్తులో రాయదలచేవారికి బాగా వుపయోగ కరంగా వుంటుంది కొన్ని వాస్తవాలు పట్టి ఇతర వాస్తవాలను ఊహించవచ్చు జాగ్రత్తగా స్వతంత్ర పరిశీలన సాగిస్తే కనీసం కొంతవరకైనా అజ్టెక్‌ల సామాజిక వ్యవస్థయొక్క ప్రధాన లక్షణాలను పునర్నిర్మించవచ్చు

మొదటి రోజులనాటి చరిత్ర గ్రంథాలలో 'మెక్సికోలోని రాజ్యం' అన్నారు తర్వాత 'మెక్సికో సామ్రాజ్యం' అన్నారు ఈ రెండూ కూడ ఊహాకల్పనలే వారి నిర్మాణం గురించిన అవగాహన సరిగ్గాలేక పోవడంచేత వారి ప్రభుత్వాన్ని రాజరిక ప్రభుత్వం అనుకోడానికి తగుకారణాలు లేక పోలేదు అయితే ఆ దురభిప్రాయమే ఇంకా కొనసాగ నక్కర్లేదు అనాడు స్పానిష్ ఆక్రమణకారులు చూసింది మూడు ఇండియను తెగల సమాఖ్యను మాత్రమే అటువంటి సమాఖ్యలు ఖండం నలువేపులా వున్నాయి. ఇంతకు మించి ఒక్క అడుగు ముందుకు వెయ్యడానికి వారి వర్ణనలలో పస ఏమీలేదు ఆ సమాఖ్యలో నాయకుల సమితి ప్రభుత్వ కార్యాలను నిర్వహిస్తుంది సైనిక జట్టుల సర్వాధికారి వారికి సహాయంగా వుంటాడు అది ద్వంద్వ ప్రభుత్వం పౌర పాలనకు సమితివుంది సైన్యాధికారం ఒక యుద్ధనాయకుని చేతిలో వుంది సమాఖ్యలో వున్న తెగలలోని నిర్మాణాలు ప్రజాతంత్రంతో నడుస్తాయి గనక దానిని సైనిక ప్రజాతంత్రం అనవచ్చు, సమాఖ్య అన్నపదం చాలదనుకొంటే

మెక్సికన్లు, తెజ్‌కుకాన్లు, త్లకోపాన్‌లు, ఇవి ఆ మూడు తెగలూ అజ్టెక్‌లు ఈ ముగ్గురూ అజ్టెక్ సమాఖ్యగా ఏర్పడ్డారు సమాజ నిర్మాణక్రమంలోని పైరెండు నిర్మాణాలూ తెగ-సమాఖ్య-గా అవి వున్నాయి. మొదటి రెండూ- అంటే గణమూ, ఫ్రాత్రీ అనేది వాటిలో వున్నాయా అన్నది స్పానిష్ రచయితలు ఎవ్వరూ స్పష్టంగా చెప్పడంలేదు అయితే వారు వర్ణించే కొన్ని ఆచార వ్యవహారాల్ని పట్టి వానిని ఛాయామాత్రంగా వూహించ వలసి వస్తూంది. ఫ్రాత్రీ వుండడం అంత ముఖ్యంకాదు.

కాని గణం విషయం అల్లాకాదు వారి సామాజిక వ్యవస్థకు మూలం అదేకదా అజ్టెక్‌లను గురించిన సమాచారం అపారంగా, కలగా పులగంగా వుంది అందుచేత అజ్టెక్ సామాజిక వ్యవస్థలోని కొన్ని విశేషాలను మాత్రమే తీసుకుంటాను అంతకు ముందు ఆ సమాఖ్యలోని వారికీ చుట్టుప్రక్కల తెగలకూ వున్న సంబంధాల్ని పరిశీలించాలి

ఉత్తరం నుంచి వలసవచ్చి మెక్సికో లోయలో స్థిర పడిన ఏడు బంధు తెగలలో అజ్టెక్‌లు ఒకరు స్పానిష్ ఆక్రమణనాటు చరిత్రకు ఎక్కిన తెగలలో వారి దొకటి వీరందరూ తమ్ము సంప్రదాయకంగా నహవుట్లాక్‌లు అని పిలుచుకుంటారు ఒకరి తర్వాత ఒకరుగా అజ్ట్లాన్ నుంచి వారు ఏ విధంగా వచ్చిందీ, వారి పేర్లూ వారి వలసలూ గురించి తెగల వారు చెప్పుకొనే విషయాలను 1885లో మెక్సికో వెళ్ళిన 'అకోస్టా' పుస్తకం వ్రాసేరు అది 1899లో సెవెల్లిలో ప్రకటించబడింది వారీ క్రమంలో వచ్చేరని ఆయన రాసేరు

1 సోచిమిల్కాలు- (పూవిత్తనాల జాతి) వీరు సోచిమిల్కో సరస్సువద్ద మకాం చేశారు ఇది మెక్సికో లోయ దక్షిణపు సొలుపులోవుంది 2 చల్కాలు, (నోటి మనుషులు) వీరూ పైవారివెంటనే వచ్చి వారి సమీపంలో చాల్కో సరస్సువొడ్డున బసచేసేరు 3 తెపానెకాన్‌లు (వంతెనమీదివాళ్ళు) లోయ పడమటి సొలుపులో తెజ్కుకో సరస్సుకు పడమరగా అజ్కో పోట్జాల్కో వద్ద స్థిర పడ్డారు 4 కుల్‌హువాలు ("కుటిలజనం") తెజ్కుకో సరస్సు తూర్పు దిక్కున స్థిరపడ్డారు తర్వాత వీరే తెజ్కుకాన్‌లు అయ్యారు 5 త్లత్లూపియన్లు- (సీర్రా జనం) సరస్సుచుట్టూ భూమిని ఇతరులు ఆక్రమించుకోవడంచూసి సీర్రా పర్వతందాటి దక్షిణం వేపున వీరు స్థిర పడ్డారు 6 త్లస్కాలాన్‌లు- (తిండి మనుష్యులు) తెపానెకాన్‌లతో కొంత కాలం కలిసి వుండి తరవాత మెక్సికో లోయ తూర్పుభాగంలో త్లస్కాలాలో స్థిరపడ్డారు 7 అజ్టెక్‌లు అందరికన్నా చివరవచ్చేరు వీరు మెక్సికో నగరం వున్న ప్రదేశంలో స్థిర పడ్డారు "వీరంతా ఎక్కడో దూరాన వున్న ఉత్తర ప్రాంతాల నుంచి వచ్చి న్యూమెక్సికో అనే రాజ్యాన్ని స్థాపించేరు"-అని అకోస్టారాశారు ఇదే సంప్రదాయిక సమాచారాన్ని హెర్రెరా తన General History of America లోనూ, క్లావీగెరో తన History of Mexico లోనూ రాశారు వీటిలో త్లాకోపాన్‌ల ప్రసక్తి రాలేదని గమనించాలి బహుశా వీరు తెపానెకాన్‌లలో ఒక శాఖ అయి వుంటారు వీరు ఆ తెగ యొక్క మొదటి నివాసస్థలంలోనే మిగిలిపోయి వుంటారు మిగిలినవారు

త్లస్కాలాన్‌లకు పక్కనే దక్షిణంగావున్న భూములలో స్థిరపడి వుంటారు వారి పక్కన తెపియాకాలు అని పిలిచేరు ఈ తెపియాకాలలో ఇదేమాదిరి ఏడు గుహలకథ వుంది వారూ నహువత్లాక్ భాష మాండలికాలలో ఒకటి మాట్లాడుతారు

ఈ సంప్రదాయక కథలోవున్న ఒకఅంశం కల్పించడానికి వీలుకానిది ఈ ఏడు తెగలూ ఒకేమూలంలోని శాఖలు వారి మాండలికాలు దానిని ధృవపరుస్తున్నాయి ముఖ్యమైన విషయం మరొకటుంది వారంతా ఉత్తరంనుంచి వచ్చేరన్నది వీటివలన వీరంతా ఒకేమూల ప్రజనుంచి వచ్చేరని, జనం పెరిగి ఏడో- అంతకన్న ఎక్కువేనో తెగలుగా పెరిగారనీ అనుకోవాలి అజ్‌టెక్ సమాఖ్య ఏర్పడడానికి అదే అవకాశం కలిగించి వుండాలి

లోయలోవున్న మంచిప్రదేశాలన్నీ అజ్‌టెక్‌లు వచ్చేనాటికే ఆక్రమించేశారు వారూ ప్రదేశాలు మారి మారి చివరికి చిత్తడినేలల మధ్యన కొద్దిపాటి పొడినేల చూసుకొని దానిలో స్థిరపడ్డారు ఆ చిత్తడినేలలో చుట్టూ ప్రకృతిసిద్ధమైన సరస్సులు వున్నాయి ఇక్కడనే వారు సుప్రసిద్ధమైన మెక్సికో ప్యూబ్లో (తెనోష్టిట్లాన్) నిర్మించేరు దానిని స్పానిష్ ఆక్రమణకు నూటతొంభయ్యారేళ్ళకు పూర్వం 1325 లో నిర్మించారని క్లవిగెరో రాస్తున్నారు అప్పటికి వారి సంఖ్య స్వల్పం చాల బీదస్థితిలో వున్నారు కాని ఖోచిమిల్కో చాలో సరస్సుల నీరూ, పడమటి కొండల్లో పుట్టిన వాగుల నీరూ వారి నివాస భూమి పక్కనుంచి తెజ్‌కుకో సరస్సులోకి ప్రవహించడం వారి అదృష్టం తమనివాస స్థలానికివున్న సౌకర్యాన్నివారు గ్రహించేరు అడ్డుకట్టలువేసీ, కాజ్‌వేలువేసీ, తమనివాసభూమి చుట్టూ పెద్దసరస్సును నిర్మించేరు తెజ్‌కుకో సరస్సులోకి పోయే నీటితో ఆ సరస్సు నిండుతుంది తెజ్‌కుకో సరస్సు మట్టం ఈనాడున్న దానికన్న ఎత్తు అందుచేత వారిసరస్సు ఎప్పుడూ నిండివుంటూండేది నిర్మాణం పూర్తి అయ్యేసరికి లోయలోని ఇతరులకన్నా వీరికి మంచిరక్షణ ఏర్పడింది అజ్‌టెక్‌లు సాధించిన వాటిలో ఈ ఇంజనీరంగు చాలాగొప్పపని. అది చేశారు గనకనే వారు చుట్టూ వున్న తెగలకన్న ఎదిగేరు స్వతంత్రులయ్యేరు సంపన్నులూ అయ్యేరు. కాలక్రమంలో చుట్టూ వున్న తెగలమీద పలుకుబడి సంపాదించుకున్నారు అజ్‌టెక్ సంప్రదాయాల ప్రకారం ప్యూబ్లో నిర్మించినది ఇటీవలనే వారిమాటనమ్మవచ్చు

స్పానిష్‌వారి ఆక్రమణకాలం నాటికి ఆ లోయలోకి వచ్చిన ఏడుతెగలలోఅయిదు మాత్రమే అజ్‌టెక్‌లు, తెజ్‌కుకాన్‌లు, త్లకోపాన్‌లు, సోచిమిల్కాలు, చల్కాన్‌లు అక్కడ వుంటున్నారు వారువుంటున్న ప్రదేశం అంత విశాలమైనది కాదు రోడ్‌దీవి

అంతవుంటుంది అదో పీఠభూమి దానిలో నీరుబయటికి పోదు ఉత్తరంనుంచి దక్షిణానికి కోడిగుడ్డు ఆకారంలో వుంటుంది చుట్టూలోతు నూటఇరవై మైళ్ళు వీరున్న భాగంగాక మెరకభూమి వైశాల్యం పదహారు వందల చదరపుమైళ్ళు ఆ లోయచుట్టూ పర్వతాల వరసలు వరసలుగా ఎరసల మధ్య వల్లపుభూములతో- ఒక గోడకట్టినట్లు వున్నాయి పైనచెప్పిన తెగలు ముప్పై ప్యూబ్లోలలో వున్నాయి వాటిలో మెక్సికో ప్యూబ్లో పెద్దది ఈ తెగలలో దేనికి చెందిన భాగమైనా పెద్దగా లోయవెలుపలగాని, చుట్టుపక్కల పర్వతాల సానువుల్లోగాని వలసలేర్పరచుకొన్నట్లు సాక్ష్యంలేదు పైగా, ఈనాడు మెక్సికో అని పిలువబడే ప్రాంతంలో నహువ్లాక్ భాషకు భిన్నమైన మాండలికాలు మాట్లాడే తెగలు ఎన్నో నివసించినట్లు గట్టి సాక్ష్యంవుంది వాటిలో స్వతంత్రమైన తెగలు ఎన్నోవున్నాయి త్లస్కాలాన్‌లు, వారిలో శాఖ అనబడే చోలులాన్‌లు, తెజ్‌కుకాన్‌లలో శాఖలు అనబడే తెపియాకాలు, హ్యూకోజింకోలు, మెజ్‌టిట్లాన్‌లు, త్లత్లూయయనులు వీరే మెక్సికో లోయ బయటవుంటున్న నహువ్లాక్ తెగలు వీరిలో త్లత్లూసియనులూ, తెపియాకాలు మాత్రం స్వతంత్రంగాలేరు అనేక ఇతరతెగలు- కొంచెం ఇంచుమించు అనేక మూలభాషలను మాట్లాడుతున్న పదిహేడు ప్రాంతాలలోని గుంపులు మిగిలిన మెక్సికోఅంతటా వ్యాపించివున్నారు ఒక శతాబ్ది అనంతరం అమెరికా సంయుక్త రాష్ట్రాలలోనూ, బ్రిటిష్ అమెరికాలోనూ తెగలు స్వతంత్రులుగావున్నా నేడు క్షీణదశలో వున్నరీతిగా వీరు ఆనాడే క్షీణదశలో వున్నారు

1426 లో అజ్‌టెక్ సమాఖ్య ఏర్పడటానికి పూర్వం లోయలోని తెగల వ్యవహారాలలో చారిత్రక ప్రాధాన్యంగల విషయం ఏదీ జరగలేదు ఒకరితో ఒకరికి పొత్తులేదు నిత్యకలహాలు తామున్న ప్రదేశాలు దాటి ఎవ్వరికీ ప్రభావం లేదు ఈ స్థితిలో అజ్‌టెక్‌ల స్థానబలం సంఖ్యలోనూ, సామర్థ్యంలోనూ ప్రతిబింబించ సాగింది వారి యుద్ధ నాయకుడు ఇజ్‌కోట్ల్ ఆయన నాయకత్వం క్రింద అంతవరకూ బలంగావున్న తెజ్‌కుకాన్‌లనూ, త్లాకోపాన్‌లనూ ఓడించేరు అంతకు పూర్వం జరిగిన యుద్ధాల పర్యవసానంగా సమాఖ్య ఏర్పడింది ఆ మూడుతెగలూ ఆత్మరక్షణకూ ఆక్రమణచర్యలకోసమూ ఏర్పరచుకొన్న మైత్రిఅది యుద్ధంలో స్వాధీన పరచుకొన్న వానినీ, తరవాత ఓడిపోయిన వారిచ్చే నజరానాలలోనూ ఏ తెగ కెంత భాగమో నిబంధన చేసుకొన్నారు వారి అధీనంలోకి వచ్చిన గ్రామాలవారు బట్టలూ, పెరటి

పంటల పుత్పత్తులూ నజరానాగా చెల్లించాలి దీనిపిచూస్తే ఒక పద్ధతి ప్రకారం బహుకరోరంగా తీసుకొనేవారని తోస్తుంది

ఈ సమాఖ్య నిర్మాణరూపం మనకు తెలియడంలేదు వివరాలు తెలియక పోవడంచేత ఈ మైత్రీకూటం అవసర మైనప్పుడు ఏర్పడుతూ, లేనప్పుడు రద్దు అవుతూ వుండేదా, లేక ఇరాక్వాల సమాఖ్యలాగ దానిలోని సభ్యుల మధ్య నిర్దిష్టమైన, శాశ్వత సంబంధాలతో ఒక స్థిరమైన సంస్థ ఏర్పరచబడిందో చెప్పలేము ఈ మూడు తెగలూ స్థానిక స్వపరిపాలనకు సంబంధించినంతవరకు స్వతంత్రం రక్షణకూ, దండయాత్రకూ సంబంధించినంతవరకూ మూడూ బయటికి ఒకే ప్రజగా వుంటారు ప్రతి తెగకూ తమతమ నాయకుల సమితి వుంటుంది తమతమ యుద్ధ నాయకుడూ వుంటాడు అజ్ టెక్ యుద్ధనాయకుడు మొత్తం సమాఖ్య దళాలకు సర్వసేనాధిపతిగా వుంటాడు దీనిని పట్టి సర్వసేనాధిపతిని ఎన్నుకోవడంలోనో, పదవిలో స్థిరపరచడంలోనో తెజ్ కుకాన్ లకూ, త్లాకోపాన్ లకూ హక్కు వుందనే అనిపిస్తుంది అజ్ టెక్ యుద్ధనాయకుడిని సర్వసేనాధిపతిగా చేయడంచూస్తే సమాఖ్య నిర్మాణంలో తెగలమధ్య షరతులువిధించడంలో అజ్ టెక్కులది పైచేయిగా వున్నట్లు తోస్తుంది

తెజ్ కుకాన్లు తమ ప్రధాన యుద్ధనాయకుడు నెజాహువాల్కోయోట్ల్ ను పుద్యోగం నుంచి తీసివేశారు అయనను అజ్ టెక్కులు తీసుకుని పదవిలో పెట్టేరు (1426) ఆ రోజునే అజ్ టెక్కులసమాఖ్య అనండి, కూటం అనండి-ఏర్పడింది అనుకోవచ్చు

సమాఖ్య స్వరూప స్వభావాలను చూపించేందుకై మనకు లభించిన కొద్దిపాటి అంశాలను చర్చించేముందు అది జీవించిన కొద్దికాలంలోనే తన పెత్తనం కిందికి తెచ్చుకున్న ప్రాంతాలను గురించి కొంచెం చెప్పవలసివుంది

ఈ సమాఖ్య జీవించినది 1426 నుంచి 1510 వరకూ మొత్తం ఎనభై నాలుగేళ్ళు ఇన్నేళ్ళూ అది ఇరుగు పొరుగులతో యుద్ధాలలో మునిగివుంది ముఖ్యంగా మెక్సికో లోయనుంచి దక్షిణంగా పసిఫిక్కు సముద్రందాకా, అక్కడినుంచి తూర్పుగా గౌతమేలా వరకూ వున్న ప్రదేశంలోని గ్రామవాసి ఇండియన్లు బలహీనంగా వుండేవారు వారితో నిరంతరం యుద్ధాలు జరిపేరు ముందు దగ్గరలోవున్నవారి మీద అధిక సైన్యబలాన్ని కేంద్రీకరించి ఓడించారు వారినుంచి కప్పం తీసుకున్నారు ఈ ప్రాంతంలో పూళ్ళు చాలనేవున్నా చిన్నవి కొన్నింటిలో ఒకే పెద్ద యిల్లు వుండెది కొన్నింటిలో కొన్నిపెద్ద యిళ్ళు గుంపుగా వుండేవి అవి పచ్చిఇటిక రాయితో

కట్టినవి ఈ పామూహిక వసతి గృహాలు అజ్ టెక్కుల దండయాత్రలకి చాల అటంకకరంగా వుండేవి కాని అజేయంకావు దోపిడి వస్తువులకోసం, కప్పంకోసం, దేవతాబలికై మనుష్యులకోసం ఈ దాడులు జరుగుతుండేవి

ఉత్తర ప్రాంతపు ఇండియన్లలాగ అజ్ టెక్కులూ యుద్ధఖైదీలను మార్చు కోవడం, వదిలిపెట్టడం వుండేదికాదు ఉత్తర ప్రాంతపు ఇండియన్లు యుద్ధఖైదీలను దత్తు చేసుకోవడమో, కొరతవేసి చంపడమో చేసేవారు అజ్ టెక్కులు తమ పూజారుల సలహాతో యుద్ధఖైదీలను తమప్రధాన దేవతకు బలియిచ్చేవారు ఖైదీగా పట్టుబడిన వాడు తన ప్రాణాన్ని పోగొట్టుకొన్నట్లే అది అటవికులలోనూ, అనాగరికులలోనూ, అనాదిగా వస్తున్న ఆచారం ఆ ప్రాణాన్ని దేవుళ్ళకోసం వినియోగించడం జరుగుతూంది పురోహితవర్గం అన్నది అమెరికను ఇండియన్లలో అనాగరిక యుగపు మధ్య దశలో వచ్చింది వాడే దేవతా విగ్రహాలనూ నరబలులనూ ప్రవేశపెట్టేరు మతసంబంధమైన దురావేశాలద్వారా మానవజాతి మీద పెత్తనం సంపాదించడానికి దానినొక సాధనంగా చేసుకున్నారు మానవజాతికి చెందిన ప్రధాన తెగలన్నింటా అది ఆ మాదిరిగానే ప్రారంభ మయివుంటుంది అనాగరిక యుగం మూడు దశలలోనూ ఖైదీలను మూడు తరహాలుగా వుపయోగించుకోవడం జరిగినట్లు కనిపిస్తూంది మొదటిది కొరత వెయ్యడం దానితరవాత దేవతలకు బలి మూడోది బానిసల్ని చెయ్యడం ఈ వినియోగాలన్నిటికీ వెనుకనున్న ఆలోచన ఖైదీగా పట్టుబడినవాని ప్రాణం పట్టుకున్నవానిది ఇది మనుష్యుల మనస్సుల నెంతగా పట్టుకున్నదంటే నాగరికతా, క్రైస్తవ మతమూ కలిసికాని, ఆ అభిప్రాయాన్ని తొలగించలేక పోయినాయి ఆ విధంగా అజ్ టెక్కుల దండయాత్రలు పైన చెప్పిన మండలంలోని ప్రధానమైన తెగలన్నీ లొంగిపోయి, కప్పం చెల్లించేవరకు సాగినాయి ఇప్పటి వెరాక్రజ్ వరకూ చెదురు మదురుగా వున్న తోతొనాక్ గ్రామాలన్నీ వారివశం అయ్యాయి

ఈ తెగలను అజ్ టెక్ సమాఖ్యలో చేర్చుకొనే ప్రయత్నం జరగలేదు అలా జరగడానికి భాషఅటంకం వారిని వారితెగ నాయకుల పాలనలో తమతమ ఆచారాలూ, అలవాట్లూ పాటించుకుంటూ వుండేటట్లు విడిచిపెట్టేరు ఒక్కొక్కచోట కప్పం వసూలు చేసేందుకు ఓ మనిషిని అక్కడ వుంచేవారు ఇష్టంలేకపోయినా కప్పం చెల్లించే టట్లుగా బలహీనమైన ఒక బలవంతుడు దబాయించడం వల్ల జాతి అనేది ఏర్పడదు గణాలుగా నిర్మాణం అయి వున్నప్పుడు గణంద్వారా తప్ప ఎవ్వరూ ఏ

ప్రభుత్వంలోనూ చేరలేదు అజ్‌టెక్, టెజ్‌కుకాన్, ట్లాకోపాన్ గణాలతో కలిసి పోతే తప్ప ఏ గణమూ ప్రభుత్వంలో చేరలేదు జయించిన లాటిన్ తెగలలోని గణ వ్యవస్థను రద్దుపరచి రోములస్ వారిని రోముకు కదిలించేడు తాము జయించిన తెగల విషయంలోకూడ అజ్‌టెక్కులు ఆ పంథాను అనుసరిస్తే జాతి అనేది ఏర్పడేది కాని అటువంటి భావన ఏర్పడేందుకు అవసరమైన పురోగతి వారిలోరాలేదు ఆ అభివృద్ధి వచ్చివుంటే భాష వేరు కావడం ఓ ఆటంకం అయ్యేదికాదు అదే కారణం చేత వారిమధ్యకు ఉద్యోగిగా వలన వచ్చిన ఎరుకూడా జయించిన తెగలను సమాఖ్యలో వచ్చిచేరేటట్లు చేయలేక పోయేరు ఆ విధంగా అజ్‌టెక్కు సమాఖ్యకు ఈ దౌర్జన్య చర్యవలన ఒరిగిందేమీలేదు పైగా పీడించి అణచివుంచిన తెగలు ఎప్పుడూ శత్రువులు గానే వుంటాయి అనువు చిక్కినప్పుడు తిరుగుబాటు చేస్తాయి అయినా కొన్ని సందర్భాలలో ఓడిపోయిన తెగలవారి యోధుల జట్లను వుపయోగించుకోవడం దోపిడి ఆస్తిని వారితో కలిసి పంచుకోవడం జరగకపోలేదు అజ్‌టెక్కులు సమాఖ్యగా ఏర్పడ్డాక దానిని మిగిలిన నహూవాట్లాక్ తెగలకు కూడా వ్యాపింప చేయవలసింది ఆ పని చేయలేక పోయేరు. మిచిమిల్కాలూ, చల్కాన్‌లూ సమాఖ్యలో సభ్యులు కాలేదు సామంతులల్లే కొంత స్వతంత్రంగావుండేవారు

అజ్‌టెక్‌ల రాజ్యమో, సామ్రాజ్యమో దాని పునాది గురించి మనం ఇప్పటికి తెలుసుకో గలిగింది ఇది పశ్చిమాన, వాయవ్యాన, ఈశాన్య దిశగా, తూర్పున, ఆగ్నేయ దిశన ఈ సమాఖ్య చుట్టూ స్వతంత్రములైన శత్రు తెగలు పరివేష్టించి వున్నాయి దీనికి సాక్షీ భూతంగా పశ్చిమాన మెచొవాకాన్‌లు, వాయవ్యాన ఒటోమీలు, (లోయ సమీపంలో కప్పం తీసుకుని ఒటోమీ జట్లను వుండనిచ్చేరు) ఒటోమీలకు వుత్తరాన చిచిమెక్ ఆటవిక తెగలు, ఈశాన్యాన మెజ్‌తిత్లాన్‌లు, తూర్పున త్లస్కాలాన్‌లు, ఆగ్నేయంగా చోలులాన్‌లు, హ్యూకోజింకోలు వారికి అవతలగా తబాస్కో తెగలు, చియాపా తెగలు, జాపొటెక్కులు వున్నారు అజ్‌టెక్కు సమాఖ్య మెక్సికో లోయలో ఏ దిశగానూ కూడ నూరు మైళ్ళు మించలేదు అందులో చుట్టూవున్న కొంతమేర తటస్థ ప్రాంతం, దాని వెలుపలనున్న వారు శాశ్వత శత్రువులు అంత పరిమిత ప్రాంత భూములలో స్పానిష్ రచనలు మెక్సికో రాజ్యాన్ని సమకూర్చేరు దానినే తర్వాత సామ్రాజ్యమూ చేశారు

ఆ లోయలోని జనాభా గురించీ, మెక్సికో ప్యూబ్లో జనాభా గురించీ రెండు మాటలు చెప్పాలి లోయలో వుండిన నహూవాట్లాక్ తెగలు అయిదింటి జనసంఖ్య ఎంత

అయివుంటుందో ఖచ్చితంగా చెప్పడం సాధ్యం కాదు అంచనాలు కూడా ఊహల మీద చేయవలసిందే వారికి జీవనాధారం పెరటి పంటలు పండించే పద్ధతులు, వారి ఆధీనం లోని భూమి వైశాల్యము, వారు తీసుకుంటున్న పజిరానాలు అన్నీ కలిపినా రెండున్నర లక్షల మంది వుంటారనడం కూడా అతిశయోక్తే నగటున చదరపు మైలుకి నూట అరవై మంది వున్నట్లవుతుంది అంటే ఇప్పుడు న్యూయార్కు రాష్ట్రంలో వున్న నగటుకి రెట్టింపు రోడ్‌దీవి జనాభాకి సమానమున్నూ ఆ లోయలో ముప్పయి పలభయి గ్రామాలున్నాయంటారు ఒక్కొక్కదాంట్లో నగటున ఎందరుండి వుంటారు? అంతకన్న ఎక్కువే గ్రామాలుండాలంటే పశు సంపదగాని, మడిచెక్కల వ్యవసాయం గాని తెలియని అనాగరిక ప్రజ, ఆ మాత్రం ప్రదేశంలో ఎన్నో సౌకర్యాలు గల నాగరిక ప్రజకన్న కూడా ఎక్కువ మందిని ఎల్లా విభాయించ గలిగి వుంటారన్న ప్రశ్న వస్తుంది అది సాధ్యం కాదు ఈ జనాభాలో ముప్పయి వేలమందిని మెక్సికో ప్యూబ్లోకి జమకట్టవచ్చు

మెక్సికో జనాభా గురించి స్పానిష్ చరిత్రలలో భిన్న భిన్న అంచనాలు కనిపిస్తున్నాయి కాని, చిత్రంగా చాలమంది ఇళ్ళ సంఖ్య విషయంలో కలుస్తున్నారు వారు అరవై వేల ఇళ్ళున్నాయంటారు 1521లో మెక్సికో దర్శించిన జాఅజో అక్కడి జనాభా అరవై వేలు అన్నారు కోర్టెస్ వెంబవెళ్ళి ఆ ప్రాంతాల్ని జయించిన (పేరు తెలియదు) యోధుడు కూడా అరవై వేల జనాభాయే అన్నాడు కాని, గొమోరా, మార్టిర్లు ఆ అరవై వేలూ ఇళ్ళు అన్నారు దీనినే క్లవీగో, హెర్రారా, ప్రెస్కాట్‌లు తీసు కున్నారు సోలిస్ అరవై వేల కుటుంబాలన్నారు ఈ అంచనా ప్రకారం జనాభా మూడు లక్షలవుతుంది ఆ రోజుల నాడు లండన్ జనాభా లక్ష పలభయ్యయిదు వేలు. ఇక ఆఖరుగా తోర్కెమాడా ధైర్యంగా లక్ష ఇరవై వేల యిళ్ళు అన్నారని క్లవీగా తమ పుస్తకంలో వుదాహరించేరు ఈ గ్రామంలో వున్న ఇళ్ళు పెద్దవి — సాముహిక గృహాలు అవడానికి సందేహం లేదు ఆ రోజుల్లో న్యూ మెక్సికోలో వున్న యిళ్ళు అటువంటివే అవి చాలా పెద్దవి ఒక్కొక్క దాంట్లో పది నుంచి ఏభయి వరకు, నూరు కుటుంబాలు కూడా వుంటాయి అందుచేత ఈ అంచనాలన్నీ అతిశయోక్తులు జాఅజో పేరు తెలియని విజేత యోధుడు కొంచెం దగ్గరగా వున్నారనవచ్చు వారి అంచనా రెట్టింపుకన్న మించదంలేదు

ఇంతకు పూర్వం చెప్పినదానికన్న విశేషించి, లోయలోని తెగల స్థానం, పరస్పర సంబంధాలు గురించి చర్చించడం అవసరం అమెరికన్ ఆదివాసుల చరిత్ర

నుంచి, అజ్‌టెక్కుల రాజరికం కథలు ఎత్తెయ్యవచ్చు అది కేవలం భ్రమాత్మకం అనే కాదు ఇండియనులలో ఆ పరిణామం రాలేదు రాజరిక వ్యవస్థ రాలేదు వచ్చిందనడం వారి చరిత్రను వక్రీకరించడం వారు ఏర్పరచుకొన్న పాలనా వ్యవస్థ తెగల సమాఖ్య అంతే అది కూడా నమూనా రీత్యానూ, సమన్వయ రీత్యానూ ఇరాక్యూల పాటి కూడా కాదు దీనిని గురించి చెప్పేటప్పుడు యుద్ధ నాయకుడు, కౌన్సిలు, నాయకులను పేర్కొంటే చాలు, అంతకన్న పైకి పోనక్కర్లేదు

మెక్సికో ప్యూబ్లో అమెరికాలోకెల్లా పెద్దది కృత్రిమ సరోవరం మధ్యలోనున్న అందమైన పూరు అందులోవున్న పెద్ద పెద్ద ఉమ్మడి ఇళ్ళకి సున్నం పూత పెట్టేవారు అవి తెల్లగా మెరిసిపోతుండేవి వానిని చేరేందుకు చిత్తడినేలగుండా కాజువేలుండేవి దూరాన్నుంచి చూసేటప్పుడు స్పానియర్డ్‌లకు అద్భుతంగా మనోహరంగా కనబడేవి యూరపియను సమాజంకన్న రెండు మానవ పరిణామ దశలు వెనకబడివున్న ప్రాచీన మానవ సమాజాన్ని అక్కడ వారు చూసేరు చక్కని పథకంతో, క్రమబద్ధంగా వుండిన వారి జీవితం ఎంతో ఆసక్తి, ఉత్సాహమూ కలిగించింది. ఆ స్థితిలో కొంత అతిశయోక్తి చేరడం సహజం

అజ్‌టెక్‌లు సాధించిన అభివృద్ధిని చూపేందుకు కొన్ని విషయాలు చెప్తేను మరికొన్ని చెప్తా ఉద్యానవనాలు కొన్ని కనబడ్డాయి ఆయుధాగారాలున్నాయి యుద్ధ దుస్తులున్న కొట్లు కనిపించేయి మంచి పనివానితనం గల మాలు ఎస్త్రీలు నేశారు పనిముట్లు, పాత్రలు మంచిరకం వున్నాయి బొమ్మలతో రాత, ముఖ్యంగా లొంగిపోయిన గ్రామాలు వస్తురూపంలో ఇవ్వవలసిన కప్పాన్ని చూపించేందుకు బొమ్మల రాత వచ్చింది ఆహారంలో వివిధ రకాలు వచ్చేయి కాలాన్ని కొలిచే సాధనాలు తయారు చేశారు సరుకుల మార్పిడికి మార్కెట్లు ఏర్పరచేరు పౌర జీవిత విస్తరణకు అనుగుణంగా పాలనా శాఖలు, ఆఫీసులు వచ్చేయి పురోహితవర్గం, దేవాలయాలు వరసభేదంతో సహా కర్మకాండ పెరిగింది ప్రధాన యుద్ధ నాయకుని పదవికి ప్రతిష్ఠ పెరిగింది ఇవీ, వారి ఇతర పరిస్థితులూ వారి ఆచార వ్యవహారాల విస్తరణను చూపిస్తున్నాయి ఇరాక్యూలలోనూ అజ్‌టెక్‌లలోనూ అనువ్యవస్థ ఒక్కటే అయినా వారివారి పరిస్థితులను చూస్తే అనాగరిక యుగం దిగువ, మధ్య దశల మధ్య అంతరం విస్పష్టంగా కనిపిస్తుంది

ఈ ప్రాథమిక పరిశీలన అనంతరం అజ్‌టెక్ సామాజిక వ్యవస్థకు సంబంధించిన ముఖ్యమైన, అపరిష్కృత ప్రశ్నలు మూడింటినీ ఎత్తుకోవలసి వుంది మొదటిది

వారిలో గణాలూ, ఫ్రాట్రీలూ వున్నాయా? రెండోది నాయకుల సమితి వుందా? ఉంటే దాని పనులేమిటి? మాంటెజూమా నిర్వహిస్తున్న సర్వ సైన్యాధికారి పదవి ఏమిటి? దాని బాధ్యతలు ఏమిటి?

## 1. గణాలు, ఫ్రాట్రీలూ వున్నాయా ?

ప్రారంభ కాలపు స్పానిష్ రచయితలు అజ్‌టెక్ గణాలను గుర్తించలేదు మనవాళ్ళు రెండువందల ఏళ్ళు ఇరాక్వాల విషయంలోనూ అంతేచేశారు జంతువుల పేర్లతో వారిలో కుదుళ్ళు వున్నాయని ఎప్పుడో చెప్పేరేగాని, వారి సామాజిక నిర్మాణంలో అవి మూల యూనిట్లు అనేవనీ, వారి మీదనే తెగలూ, సమాఖ్యా ఏర్పడ్డాయనీ ఎవ్వరూ వూహించలేదు దక్షిణ అమెరికాలోని తెగలలో స్పానిష్ రచయితలు గణ నిర్మాణం వున్నదని రాయకపోతే అది లేకుండా పోదు కాని అది వుండినట్లయితే వారి కృషి పైపైనే వుంది తప్ప లోతులకి పోలేదని అర్థం

స్పానిష్ రచయితల రచనలలో అస్పష్టమైన కొద్ది కొద్ది సమాచారం గణాలు, ఫ్రాట్రీల వునికిని సూచిస్తున్నది వుంది దానినిప్పుడు పరిశీలిద్దాం హెర్రెరా తరచుగా రక్తబంధువులు అనే శబ్దాన్ని వుపయోగించడం పైన గమనించాం రక్తబంధుత్వం కలిసిన జన సమూహాలను వుద్దేశించి ఆయన ఆ మాట రాశారు ఆయన చెప్పిన జనసమూహం ప్రమాణాన్ని పట్టి అది గణమే అయి వుండాలి అంతకంటె పెద్ద సమూహాన్ని దృష్టిలో పెట్టుకొని ఆయన వంశపరంపర (lineage) అని వాడేరు అది బహుశా ఫ్రాట్రీఅయివుండాలి

మెక్సికో ప్యూబ్లో భౌగోళికంగా నాలుగు భాగాలుగా విభజించబడింది ప్రతి ఒక భాగంలో వంశపారంపర్యం గల జనసమూహం నివసిస్తుండేవారు వీరు ఇతర భాగాలలోని వారికన్న పరస్పరం దగ్గర రక్తస్పర్శ కలవారు బహుశా ఈ వంశ పరంపర ఫ్రాట్రీ అయివుంటుంది మళ్ళీ ఈ భాగాలు ప్రతి ఒక్కటీ వేరువేరు విభాగాలు చేయబడింది ఈ విభాగం ప్రతి ఒక్క దాంట్లో బంధుసామ్యం వున్న జనం నివసిస్తున్నారంటారు హెర్రెరా బహుశా ఈబంధుసామ్యంగలజనంగణం అయివుంటుంది రక్తబంధుత్వం గల త్లస్కాలాన్‌లలో కూడా ఇదే మాదిరి విభాగాలు కనబడుతున్నాయి వారి ప్యూబ్లో కూడ నాలుగు భాగాలుగా వుంది ప్రతి భాగంలో వంశపారంపర్యం గల జనం నివసిస్తున్నారు ప్రతిభాగానికీ ఒక ట్యుక్ట్లీ ప్రధాన సైన్య నాయకుడుండేవాడు వారివారి ప్రత్యేక దుస్తులు వేరు వారి జెండా వేరు ఎవరి బిరుదావళి

వారిది వారు ఒక నాయక సమితి ప్రభుత్వంలో ఒకే ప్రజగా వున్నారు వారివి స్పానిష వారు శ్లన్కలాన్ పెనేట్‌గా పేర్కొని గౌరవించేరు చోలులాయు కూడా అదే విధంగా ఆరు విభాగాలుగా వున్నారు ఆ విభాగాలను హెర్రెరా వార్డులన్నాడు దాని తాత్పర్యం కూడా అదే అజ్‌టెక్‌లు సామాజిక విభాగాలుగా ఏర్పడి, ప్యూబ్లోలో తమతమ వాటాలలో వుంటున్నారు అలా వుండడంలోనే గ్రామం భౌగోళికంగా వేర్వేరు వార్డులు అవుతుంది అకోస్టా చెప్పిన దానిని అనుసరించి మెక్సికోను నిర్మించి నప్పుడు ఈ విభజనలు ఎలా జరిగేయో హెర్రెరావర్ణించేడు దానితోఅసలు విషయం బయటపడుతుంది "దేవతా విగ్రహం కోసం రాయీ, మన్నుమూతో ఒక మంట పాన్ని కట్టేరు తరువాత ఆ దేవతా విగ్రహం పూజారిని పిలిచి ఆదేశించింది. నాయ కులు విడబడి తమ బంధువుల్నీ అనుయాయుల్నీ నాలుగు భాగాలుగా కూర్చుకో మంది తన ఆలయాన్ని తన కోసమై మధ్యన వదిలి పెట్టి దానికి నాలుగు వేపులా ఎవరికి వారు తమకు బాగుందన్న విధంగా ఇళ్ళు కట్టుకో మంది సైంట్ జాన్ సైంట్ మేరీ రౌండ్ సైంట్ పాల్, సైంట్ సెబాస్టియన్ అంటూ ఈనాడు పిలిచే పట్టణ భాగాలివే ఆ విధంగా చేశాక దేవతా విగ్రహం మళ్ళీ ఆదేశించింది తాను చెప్పే దేవుళ్ళని వలుగురూ పంచుకుని వారి కోసం తమతమ వాటాలలో అనుకూల ప్రదేశాలలో దేవాలయాలు కట్టి పూజలు చేసుకోమంది ఆ విధంగా ప్రతి విభాగం లోనూ అనేక వార్డులు ఏర్పడ్డాయి ఆ వార్డులు దేవుని ఆదేశం ప్రకారం కొలిచే దేవతల సంఖ్యను పట్టి ఏర్పడ్డాయి మెక్సికో, తినోక్టిట్లాన్‌లు ఇల్లాగే ఏర్ప డ్డాయి పైన చెప్పిన విధంగా విభజన జరిగినాక తమకు కష్టం అనిపించినవారు తమ రక్తబంధువుల్నీ, అనుయాయుల్నీ వెంట బెట్టుకొని మరో చోటు వెతుక్కుంటూ వెళ్ళేరు," అంటూ హెర్రెరా రాసేరు వారు దాని ప్రక్కనే వున్న త్లాతెల్యూకోకు వెళ్ళేరు ఈ ప్రజ భాషల రీత్యా రక్త బంధువులు నాలుగు పెద్ద భాగాలుగా తర్వాత అనేక చిన్న భాగాలుగా విడబడ్డారని చెప్పడం న్యాయంగా వుంటుంది మామూలుగా జరుగుతున్నది ఇదే కాని, వాస్తవంలో ఇందుకు వ్యతిరేకంగా జరుగుతుంది రక్త బంధువులలో టాటెమ్‌కు తాముగా ఒకే ప్రదేశంలో వుంటారు ఆ వుండడంలో కూడ సన్నిహితులు ఒకరొకరి పక్కన వుండేటట్లు చూసుకుంటారు చిన్న విభాగాలు గణా లనీ పెద్ద భాగాలు నాలుగు ఫ్రాట్రీలనీ, అవి సన్నిహిత బంధుత్వంగల గణాలతో ఏర్పడ్డాయనీ అనుకుంటే అజ్‌టెక్కులు తమ గ్రామంలో చేసుకున్న ఏర్పాట్లు అర్థం అవుతాయి గణాలు, ఫ్రాట్రీలు తెగలుగా నిర్మాణంగల ప్రజ ఒక పట్టణంలో కలిసి

వప్పుడు వారు గణాలు, ఫ్రాత్రీలుగానే కేటాయించబడిన కాపురం వుంటారు వారి సాంఘిక నిర్మాణానికి అది ఫలితం గ్రీకు, రోమను తెగలు తమ నగరాలలో ఈ విధంగానే కాపురం వున్నారు ఉదాహరణకి రోమను తెగలు మూడూ గణాలుగానూ క్యూరియాలుగానూ ఏర్పడివున్నాయి క్యూరియా అన్నది ఫ్రాత్రీకి మరోపేరు వారు రోములో గణాలు, క్యూరియాలు, తెగలుగానే విడవిడి మకాం పెట్టేరు రామ్నేలు పాలటైన్ మిట్టను ఆక్రమించేరు టిటీలు చాలవరకు క్విరినాల్‌లో, లూసెరేలు అధిక భాగం ఎస్క్విలైన్‌లోనూ మకాంపెట్టేరు అజ్టెక్కులు ఒకే తెగగా ఫ్రాత్రీలుగణాలు, నిర్మాణం కలిగి వుంటే ఎన్ని ఫ్రాత్రీలుంటే అన్ని నగర విభాగాలూ, ఒకే ఫ్రాత్రీ లోని తెగలు ఎన్ని వుంటే ఆ విభాగాలు అన్ని వార్డులుగా చీలి ఎవరికి వారు తమకు కేటాయించిన చోట్ల వుంటారు భార్యాభర్తలు రెండు గణాలకు చెంది వుంటారు గనక, తండ్రి పారంపర్యం లోనో, తల్లి పారంపర్యంలోనో పిల్లలు తల్లి తండ్రుల గణాలకు చెంది వుంటారు గనక ప్రతి వార్డులోనూ ఒకే గణానికి చెందిన జనం ఎక్కువగా వుంటారు

వారి సైనిక వ్యవస్థ కూడా వారి సామాజిక నిర్మాణానికి అనుగుణంగానే వుంటుంది ఫ్రాత్రీలు, తెగలు లెక్కన సైన్యాలను ఏర్పరచమని అగమెమ్నాన్‌కు నెస్తోర్ సలహా యిచ్చేరు అజ్టెక్కులు గణాలు, ఫ్రాత్రీలు ఏర్పడినట్లు కనబడుతుంది మిక్‌వాకాన్ మీద దండయాత్ర ప్రయత్నాన్ని గురించి దేశీ రచయిత తెజోజోమోక్ రాసినదాన్ని 'మెక్సికన్ క్రానికల్స్'లో వుదాహరించేరు ఇల్లినాయిస్‌లోని హైలాండ్ నివాసి ఎడ్మిరల్ ఎఫ్ బండెలీర్ దానిని అనువదిస్తున్నారు మిత్రులు అందులోని ఈ విషయాన్ని నాకు పంపించేరు అక్షేకాట్ల్ "మెక్సికను కెప్టెనులైన త్లాకతెక్తల్, త్లాకోచ్‌కాల్ కాచెల్‌కతోనూ మిగిలిన వారందరితోనూ మాట్లాడేడు ప్రతివార్డులోనూ ఆహారాలూ, ఆలివాట్లూ పూర్తిచేసుకొని తమ తమ కెప్టెన్లతో మెక్సికనులంతా సంసిద్ధమయ్యారా యని తెలుసుకున్నాడు సిద్ధమయి వుంటే యాత్రకు దిగమన్నాడు అంతా మత్లా జింకో తౌలూకావద్ద మరల కలవాలన్నాడు" దీనినిపట్టి సైనిక నిర్మాణం తెగ, ఫ్రాత్రీ వారీగానే వున్నదని తెలుస్తూంది

వారి భూమి పంపకం పద్ధతిచూస్తే కూడా అజ్టెక్‌లలో గణాలు వున్నాయని తెలుస్తుంది ఈ భూముల్ని అల్టెపెట్లల్లి అంటారు (అల్టెపెటల్ ప్యూబ్లో) పట్టణంలో జిల్లాల్నిపట్టీ గ్రామాలు, పట్టణాలలో వుండే ప్రజా సమూహాల్ని పట్టీ ఇవి విడదీయబడి వున్నాయి ఏ జిల్లాభాగం దానికే స్వతంత్రంగా ఇతరులతో సంబంధం లేకుండా

వుంటాయి ఏ విధంగాను ఈ భూముల్ని పరాయత్తం చేయకూడదు" అని క్లవీగెరో తన History of Mexico లో రాసేరు ప్రజా సమూహం ప్రతిఒక్కటీ ఒక గణమని మనం గుర్తించవచ్చును వారిలో వున్న నిర్మాణాన్నిబట్టి వారు ఒకేచోట వుంటారుకదా ప్రజా సముదాయాల స్థానంలో క్లవీగెరో జిల్లాలను పెట్టేడు నిజానికి ప్రజా సముదాయం వుండేభాగం జిల్లా అవుతుంది వారందరి భూమీ ఉమ్మడిగా వుంటుంది ప్రతి ప్రజా సముదాయాన్నీ కలిపేది బంధుత్వం ఆ విషయాన్ని క్లవీగెరో వదిలేసేడు కాని ఆలోటును హెర్రెరా పూర్తిచేసేడు "పెద్దబాబులు (కాకెమ్‌లు) అని పిలిచే ఇతర ప్రభువు వున్నారు వారిఆస్తంతా వంశానిది (గణం) వారంతా ఒకే జిల్లాలో నివసిస్తారు న్యూస్పెయిన్‌లోకి జనం వచ్చి భూముల పంపకం జరిగినప్పుడు ఆ పెద్ద బాబులు చాలమందే వున్నారు ప్రతి వంశానికీ భూమియిచ్చేరు అది ఇప్పటికీ వారి అధీనంలోనేవుంది ఈ భూములేవీ ఒక్కరికీ చెందవు అవి అందరివీను భూమి స్వాధీనంలో వున్న వారు దానిని జీవితాంతం అనుభవించి తన తరవాత కొడుకులకో వారసులకో ఇచ్చినా దానిని అమ్ముకోకూడదు ఒక కుటుంబం అంతరించిపోతే అదే జిల్లాలో వుండే అదేవంశానికి చెందిన, చనిపోయినవారి దగ్గర కుటుంబానికే దానిని ఇస్తారు" అజ్‌టెక్ ఆచారాలను గురించి ఆనాటికి వున్న ఆలోచనలతో దీనిని ఎల్లా సమన్వయం చెయ్యాలో రచయితకు అర్థంకాలేదు అందుచేత కాకెమ్‌ను ఫ్యూడల్ ప్రభువును చేసి ఓ బిరుదు (లార్డ్) తగిలించేరు వాటిని ఆయన కొడుక్కు వారసత్వం చేసేరు అయితే వాస్తవాన్ని మూసిపెట్టకుండా భూములు రక్త సంబంధీకుల సమూహానికి చెందుతాయన్నారు దానికి ఆయన్ను పెద్దబాబును చేశారు నిజానికి ఆయన గణంలోని కాకెమ్ అయివుంటాడు భూములు గణానివి అయివుంటాయి వాటికి ఆయన ట్రస్టీగా వుంటాడనే మాటకు అర్థం వుండదు గణాలకు చెందిన నాయకుల్ని చూసేరు ప్రతిగణానికీ భూములు ఉమ్మడిగా వుంటాయి నాయకుడు చనిపోతే ఆ పదవి కొడుక్కి వస్తుంది- అన్నాడు హెర్రెరా స్పానిష్ భూస్వామ్యానికీ, హక్కుకూ సంబంధించినంతవరకు పోలిక అంతవరకే నాయక పదవి యొక్క స్వభావమూ వారసత్వమూ గురించిన పరిజ్ఞానం లేకపోవడం చేత తతిమ్మాది తప్పురాసేరు. కొన్ని సందర్భాలలో పదవి తండ్రి మంచి కొడుక్కు రాకపోవడం గమనించేరు ఆ పదవి వేరొకరికి పోయింది. అది చూసి ఆయన "కుటుంబం Alguna Casa- (ఇదొక ఫ్యూడల్ పదం) అంతరిస్తే దానిని (భూముల్ని) సన్నిహితమైన మరో పెద్దబాబుకు వప్పచెప్తారు" అన్నాడు

ఆ మాటను పట్టి మరో కాకెమ్‌ను ఎన్నుకుంటారు అనుకోవాలి స్పానిష్ రచయితలు ఇండియను తెగల్ని గురించీ, వారి భూమిస్వత్వం గురించీ చెప్పనదే తక్కువ దానిని కూడా ఇండియనులలోలేని ఫ్యూడల్ ఆచారాలు వాని పేర్లు తగిలించి గందరగోళం చేసి పెట్టేరు వారు ప్రయోగించిన వంశం శబ్దంలో మనం గణాన్ని చూడాలి ప్రభువు స్థానంలో అజ్‌టెక్కు కాకెమ్‌ను చదవాలి మరోచోట చెప్పినట్లు కాకెమ్ పదవి గణంలోనే వుండాలి దానికి ఎన్నిక జరగాలి పారంపర్యం మగవానివేపుగా వుందా, ఆ పదవి చనిపోయిన వాని కొడుకుల్లో ఒకరికి వస్తుంది వారు స్వంత కొడుకే కావచ్చు అన్నదమ్ముల కొడుకులు కావచ్చు తన కొడుకు కొడుక్కో, అన్న-తమ్ముని కొడుక్కో, వేలు విడిచిన అన్న - తమ్ముల కొడుకులు, మన మలకో చెందుతుంది పారంపర్యం స్త్రీ వేపు నుంచివుంటే ఇంతకు పూర్వమే రాసినట్లు తన అన్న తమ్మునికో మేనల్లునికో వేలు విడిచిన వారికో వెళుతుంది భూములతో సంబంధించి కాకెమ్‌కు ఏమీ హక్కులేదు అందుచేత వానివారసత్వం సమస్యలేదు అతనికో పదవి వుండడం, అది ఖాళీ పడకుండా శాశ్వతంగా వుంటూండడం, శాశ్వతంగా గణానికి చెందిన భూములుండడం ఆ గణానికి ఆయన కాకెమ్ కావడం చూసి ఈ తప్పుభావనకు వచ్చేరు ఈ పదవి దాని నియమ నిబంధనలు తప్పుగా అర్థంచేసుకోవడం వలన ఆదివాసి చరిత్రల్లో అసంఖ్యాకంగా తప్పులు దొర్లేయి హెర్రేరా రాసిన వంశం, క్లవిగెరో పేర్కొన్న ప్రజా సమూహాలూ ఇవి రెండూ ఒక్కటే రక్తసంబంధీకుల ఈ సమూహం ఒక గణం మాత్రమే అది వారి సామాజిక వ్యవస్థకుమూలయూనిట్ అని వారెరగరు

స్పానిష్ రచయితలు ఇండియన్ తెగల నాయకుల్ని ప్రభువులు (Lords) అన్నారు భూములమీదా, ప్రజల మీదా లేని హక్కులను వారికి అంటకట్టేరు ఇండియను నాయకుణ్ణి యూరపియన్ ఫక్కీకో లార్డ్ అనడం పొరపాటు ఆ సమాజంలో లేని పరిస్థితిని దానికి అంటుగట్టడం లార్డ్ (ప్రభువు) పదానికి హోదా, బిరుదు వున్నాయి అవి రెండూ వంశ క్రమాగతం మొత్తం ప్రజల హక్కులను దిగతొక్కి ప్రత్యేక చట్టంద్వారా, ఒకరిని లార్డ్‌ను చేశారు ఈ హోదాకూ బిరుదుకూ ప్రత్యేక బాధ్యత లేవీలేవు ఉన్నట్లయితే ఫ్యూడలిజం రద్దు అయినాక రాజో రాజ్యమో అవి నాకురావాలి అనేవారే దీనికి విరుద్ధంగా ఇండియన్ నాయకునికి వున్నదొక పదవి. అది ఆయన వారసత్వంలోది కాదు ఒక నియోజక వర్గం నుంచి ఎన్నుకుంటే వచ్చింది. కారణం వుంటే ఆయన్ని తొలగించే హక్కు ఆ నియోజకవర్గాని

కుంది ఆ నియోజక వర్గం కోసం కొన్ని బాధ్యతలు నిర్వహించేపని ఆ పదవికి వుంది గణ సభ్యులమీదగాని, గణం భూముల మీదగాని ఆయనకు పెత్తనంలేదు' లార్డు పదవికీ, ప్రభుతకూ, ఇండియను నాయకుని పదవికీ, బాధ్యతకూ ఎక్కడా పోలికలేదు ఒకటి రాజకీయ సమాజంలోది నాలమంది మీద ఒకడు దురధికారం చలాయించడానికి చిహ్నం రెండోది గణ సమాజానికి సంబంధించినది గణంలోని సభ్యుల ఉమ్మడి ప్రయోజనాల కోసం ఏర్పడింది గణంలో, ఫ్రాట్రీలో, తెగలో అసమానములైన సౌకర్యాలకు చోటులేదు

అజ్‌టెక్ గణాలను గురించిన అనుమానులింకా బయటకు వస్తాయి ఇంతవరకు వారిలో గణాలున్నాయన్నంతవరకు నిరూపించేం వారిలో తెగ, సహాళ్య అనే రెండూ వున్నాయి సమాజ నిర్మాణ క్రమంలో పైని రెండూ వున్నప్పుడు,ఇతర చోట్ల వున్నట్లు మూలంలోని కూడా వుండివుండాలనిందే ఆ కాలపు స్పానిష్ రచయితలు కొంచెం జాగ్రత్తగా పరిశీలించివుంటే ఈ విషయమై సందేహం వుండేదికాదు అజ్‌టెక్ చరిత్ర స్వరూపమూ మరొకలా వుండేది

అజ్‌టెక్‌ల ఆస్తి వారసత్వపు అలవాట్లూ ఆచారాలూ పరస్పర విరుద్ధంగా, గందరగోళంగా వ్రానుకొచ్చేరు రక్త సంబంధీకుల వ్యవస్థ వున్నదనీ, పిల్లలకు తండ్రినుంచి వారసత్వం వుందనీ చెప్పేంతవరకు తప్ప ఆస్తి వారసత్వాల అలవాట్లు గురించిన చర్చ మనకిక్కడ అనవసరం తండ్రినుంచి వారసత్వం కొడుక్కు వుందంటే తండ్రి పారంపర్యం వుందని అర్థం ఆస్తి పరిజ్ఞానం బాగా పెరిగిందనీ అర్థం తండ్రినుంచి వారసత్వం కొడుకులకు మాత్రమే వస్తుందనడం సరికాదు ఇది నాదీ అనిచెప్పి అమ్ముకొనేందుకో, తనకు తోచిన వారికి ఇచ్చుకొనేందుకో జానెడు మేర భూమిమీద కూడా అజ్‌టెక్‌లకు హక్కులేదు

## 2 నాయక సమితి వుందా ? దాని కార్యకలాపాలేమిటి ?

ఇండియను సమాజానికి అవసరమైన నిర్మాణం గనక అజ్‌టెక్కులకు కూడా సమితి వున్నదని చెప్పవచ్చు సూత్రం ప్రకారం నిరంతరాయంగా కొనసాగించబడే పదవి శాకెమ్‌లది వారు రక్త సంబంధంగల జనసమూహాలకి ప్రాతినిధ్యం వహిస్తారు ఆ శాకెమ్‌లతో సమితి ఏర్పడుతుంది ఇంతకు ముందులాగే ఇక్కడకూడా గణం వుండాలిసిన అవసరంవుంది ఉత్తరాది ప్రజలలో లాగనే వీరూ గణంలోని ప్రజలకు అంతకన్న పై నిర్మాణాలలో ప్రాతినిధ్యం వహిస్తారు అజ్‌టెక్కు తెగల నాయకులుండా

లంటే గణాలున్నాయనుకోవాలి అజ్టెక్‌లకు సమితి ఒకటి వున్నదనడంలో సందేహంలేదు కాని దాని సభ్యులెందరు, దని కార్యకలాపాలేమిటనే విషయం ఏమీ తెలియదు "ఇంచుమించు అన్ని పట్టణాలూ లేక అన్ని తెగలూ నాలుగేసి కుదుళ్ళగా లేక నాలుగేసి భాగాలుగా విభజించబడినాయి వారి నాయకులు 'మహా సమితిగా' ఏర్పడతారు"- అంటూ బ్రాస్సూర్ దే బోర్‌బోర్గ్ వ్రాసేరు. ఒక్కొక్క భాగానికి ఒక్కొక్క నాయకుడని ఆయన అభిప్రాయమూ తెలియదు కాని మరోచోట అజ్టెక్కు సమితిలో నలుగురే నాయకులున్నారని వ్రాశారు అకోస్టా, తెజోజోమాక్‌లకన్న పూర్వమే 1579-1581 లో "History of Indies "వ్రాసిన దీ గోదురాన్ వ్రాసింది ఇది "మెక్సికోలో మొదట రాజును ఎన్నుకొన్నాక, ఆ రాజుయొక్క సోదరులనో, దగ్గర బంధువులనో నలుగురు లార్డ్‌లను ఎన్నుకొని రాజకుమార బిరుదులను ఇస్తారు వారు తమనుంచి రాజును ఏరుకోవాలి ఆ నలుగురి పుద్యోగాలకు ఆయన త్లకాచ్‌కాల్‌కాట్ల్, త్లాకెటెకాల్, ఎజువా 22 జౌకాట్ల్, టిల్లాన్‌కాల్‌కే అనే పేర్లు పెట్టేరు ఈ నలుగురు లార్డులు, వారి బిరుదులతో ఎన్నుకోబడిన అనంతరం వారు రాయల్ కౌన్సిలుగా ఏర్పడతారు అధ్యక్షులు, సుప్రీం కౌన్సిలు జడ్జిల మాదిరిగా వారి అభిప్రాయం తీసుకోనిదే ఏ పనీ జరగదు" అకోస్టా అదే పదవుల్ని పేర్కొని, ఆ పదవిలోవున్న వారు ఎన్నుకోబడిన వారనిగా పేర్కొంటూ "మహాసమితి సభ్యులైన ఈ నలుగురు పెద్దల సలహా లేనిదే రాజు ముఖ్యమైన పనిఏదీ చేయడు" అన్నారు ఈ నాలుగు పదవుల్నీ తరతమ భేదాలుగల వానినిగా చెప్తూ హెర్రెరా "ఈ నలుగురు రాజకుటుంబీకులూ సభ్యులు వీరి సలహాలేనిదేరాజు ప్రధానమైన పనిఏదీ చెయ్యకూడదు ఈ నాలుగు పదవులనుంచీ తప్ప రాజును ఎన్నుకోరాదు-" అన్నారు ప్రధాన సైన్యనాయకుణ్ణి రాజు అంటేనూ, ఇండియను నాయకుల్ని రాజకుమారు లంటేనూ అంతమాత్రంచేత అవకాశం లేనిచోట రాజ్యంగాని రాజకీయ సమాజంగాని ఏర్పడదు ఈ తప్పుపేర్లు ఆదివాసి చరిత్రను వికృతం చేస్తాయి కనక వానిని విడిచి పెట్టాలి త్లస్కాలాన్‌లకు వ్యతిరేకంగా ఏకం అవుదామంటూ హ్యూకో జింకోలు రాయబారుల్ని పంపినప్పుడు మాంటేజు మా వారితో ఇల్లా అన్నాడని తెజోజోమాక్ రాసేరు "సోదరులారా, అబ్బాయిలూ, మీకు స్వాగతం కాస్సేపువిశ్రాంతి తీసుకోండి ఏమంటే నేను రాజునే అయినా పవిత్ర మెక్సికన్ రాజ్యపు నాయకు లందరితో కలిసి తప్ప, నేనొక్కడినీ మీకు సంతృప్తి కలిగించలేను" పైన చెప్పిన వుదాహరణల్ని పట్టి సుప్రీం కౌన్సిలు ఒకటి వుందని ప్రధాన సైన్యాధికారి చర్యల మీద దానికి అధికారం

వుందని, తెలుస్తూంది అసలు విషయం అది దీనిఅర్థం బాధ్యతారహితంగా నిరంకుశుడుగా వ్యవహరించకుండా అజ్‌టెక్కులు జాగ్రత్తపడ్డారు అతని చర్యలమీద నాయక సమితికి పెత్తనం ఇచ్చి,ఆయనను ఎన్నుకొనేందుకు, తొలగించేందుకు హక్కు తమచేతుల్లో వుంచుకున్నారు ఈ రచయితల అసమగ్ర సమాచారం సమితిని నలుగురు సభ్యులకు పరిమితం చేస్తూంది ఈ సమితి సరికాదని దురాన్ అభిప్రాయం ఇది అజ్‌టెక్కు సమితి అయివుండదు యుద్ధ నాయకుని ఎన్నుకోవలసిన రక్తబంధువుల చిన్నకూటం అయివుంటుంది నాయకుల సమితి స్వరూపం ఇదికాదు ఒక్కొక్క నాయకుడు ఒక వియోజకవర్గానికి ప్రతినిధి అటువంటి నాయకులంతా కలిసి తెగకి ప్రతినిధులు వారినుంచి కొందరిని ఏరి జనరల్‌కౌన్సిలును ఏర్పరచడం వుంటుంది ఒక్కొక్కప్పుడు ఆ సంఖ్యను నిర్మాణంలోనే నిర్ధారణచేస్తారు ఆ స్థానాలు శాశ్వతంగా కొనసాగించ బడతాయి తెజ్‌కుకన్ సమితిలో పన్నెండుగురు సభ్యులున్నారని చెప్తారు త్లస్కాలా సమితిలో చాలామంది సభ్యులున్నారు అజ్‌టెక్కులలో ఈ సమితి వుండాలంటే ఇండియను సమాజంలో ఒకనిర్మాణం దానికి నియమాలూ వుండాలి కనక వారిలోనూ వుండేవుంటాయి అజ్‌టెక్ చరిత్రలో కనిపించకుండిన అంశాలలో ఈ సమితి ఒకటి దాని కార్యకలాపాలను గురించి తెలుసుకోవడం అజ్‌టెక్కు సమాజాన్ని బాగా అవగాహన చేసుకోడానికి అవసరం

ఇప్పుడున్న చరిత్ర గ్రంథాలలో ఈ సమితి మాంటెజూమాకు సలహాదార్ల సంఘంగా వర్ణించబడింది అతడు ఏర్పరచుకొన్న మంత్రిమండలి అన్నారు క్లవిగేరో ఇల్లారాసేడు "స్పానిషువారి దురాక్రమణలను గురించి మాంటెజూమా తరచు తనసమితితో సంప్రదిస్తునట్లు స్పానిష్ ఆక్రమణల చరిత్రలో వుంది ఆ సమితి సభ్యులెందరో తెలియదు దానిని చెప్పగలసమాచారాన్ని చరిత్రకారులు ఇవ్వడంలేదు" ఇది ప్రప్రథమంగా పరిశీలించవలసిన విషయం వెనుకటి రచయితలు దానిలో సభ్యులెందరో, వారు బాధ్యతలు ఏమిటో ఎరుక చేసుకోకపోవడం వారి పని పద్ధతిలో ప్రాల్మాలికను చూపిస్తుంది నాయకుల సమితి గణాలతోనే వచ్చిన వ్యవస్థ అని మనకు తెలుసు వారిని ఎన్నుకొన్న వియోజక వర్గాలకు వారు ప్రతినిధులు అనాదిగా వారికొక బాధ్యతా, పాలనాధికారాలూ వున్నాయి తెజ్‌కుకాన్‌లలో, త్లకోపాన్‌లలో, త్లస్కాలాన్‌లలో, చోలులాన్‌లలో, మిచోనాకాన్‌లలో సమితులున్నాయి అవి నాయకులతో ఏర్పడ్డాయి అజ్‌టెక్కులలో కూడ సమితి వున్నట్లు సాక్ష్యం వుంది అందులో నలుగురే వున్నారని వారంతా ఒకే వంశం వారని అంటారు అధి

హొంగను మెక్సికోలోనూ, మధ్య అమెరికాలోనూ ప్రతితెగకూ నాయకుల సమితి ఉంది దానికి అనుమానంలేదు తెగలో అదిపోనా కూటం అన్ని ప్రాంతాల అమెరికను ఆదివాసులలో అది ఎప్పుడూ వుంటుంది మానవజాతిలో అతిప్రాచీన పాలన సంస్థ, ఈ నాయకులసమితి ఆటవిక యుగం ఎగువదశ నుంచి, అనాగరిక యుగం మూడు దశలగుండా నాగరికతారంభం వరకూ అది అన్నిఖండాలలో అఖండంగా, నిరంతరాయంగా కొనసాగింది నాగరికతారంభంలో ప్రజా ప్రభుత్వం వచ్చినప్పుడు ఇది దానికి ముందు సమాలోచనా సమితిగా మారింది ప్రస్తుతం వున్న శాసన, విధానసభలకు ఇది జన్మనిచ్చింది

అజ్టెక్కు సమాఖ్యలోని మూడు తెగలకూ వేర్వేరుగా నాయక సమితులు వున్నట్లే గాని ఆ తెగల ప్రధాన నాయకులతో సమాఖ్య జనరల్ కౌన్సిలు వున్నట్లు కనబడదు ఈ విషయం ఏదో తేలితేతప్ప అజ్టెక్కుల సమాఖ్య కేవలం దాడులకూ, రక్షణకూ, వుద్దేశించిన సాధారణమైన సంకలనం మాత్రమే అయి, ప్రధానంగా అజ్టెక్కు తెగవారి అధీనంలోనే వుందా లేక తెగలన్నీ కలిసి ఒక సమగ్ర వ్యవస్థగా ఏర్పడిందా అనేది తేలదు ఈ సమస్య భవిష్యత్తులో కాని తేలదు

## 3 ప్రధాన సైన్యనాయకుని పదవి నియమ నిబంధనలు-బాధ్యతలు

మనకు తెలిసిన మంచి సమాచారాన్ని పట్టి మాంటెజూమా నిర్వహించిన పదవి పేరు త్యుక్ట్లి దాని అర్థం యుద్ధనాయకుడు నాయకుల సమితి సభ్యుడుగా ఆయనను అప్పుడప్పుడు త్లాతోవానీ' అన్నారు దానిఅర్థం 'స్పీకర్' "అసలు పేరుకు ఇంటిపేరు తగిలించినట్లు పదవి హోదాను తెలిపే ఈ పేరును చేరుస్తారు చిచిమెకా - త్యుక్ట్లి పిక్ -త్యుక్ట్లిలాగ కూర్చునే క్రమంలోనూ, వోటింగ్‌లో సమితిలో ఈ త్యుక్ట్లికి అగ్రస్థానం ఇస్తారు ఆయన వెనక ఒక సేవకుడు ఉండి, అతనికి కుర్చీలో కూర్చుండటానికి అధికారం ఇస్తారు అది ఆయనకిచ్చే గొప్ప మర్యాదకు లక్షణం" — అని క్లనీగెరో వ్రాసేరు ఇరాక్వ్యులలో ప్రధాన శాకెమ్ వెనుక ఒక సహచరుడు నిలబడి వుండడం లాంటిదే ఇదీ

అజ్టెక్కులలో కనిపించే అత్యున్నత పదవి సర్వసైన్యాధికారిదే. ఇరాక్వ్యుల సమాఖ్యలో ప్రధాన సైన్య నాయక పదవికున్న నియమ నిబంధనలే అజ్టెక్‌ల దానికి వున్నాయి ఈ పదవిలో వున్నవారు సమితిలో ఎక్స్-అఫీషియో సభ్యుడుగా వుంటాడు

క్కొన్ని తెగలలో జరిగే చర్చలలోనూ, అభిప్రాయ ప్రకటనలోనూ ఈయనకు ప్రథమ స్థానం ఇస్తారు మాంటెజుమాకు గాని, ఆయన తర్వాత ఆ పదవికి వచ్చినవారు ఎవరికీగాని స్పానిష్ రచయితలు ఎవ్వరూ ఈ పేరు వాడలేదు దాని స్థానే అర్థంలేని రాజు బిరుదు వాడేరు ఇక్స్‌ట్లిల్‌ఖో చిట్ల్ ఇది టెజ్‌కుకాన్, స్పానిష్ భాషల మిశ్రమ పదం మెక్సికో, టెజ్‌కుకో, ట్లాకోపాన్ తెగల ప్రధాన సైన్య నాయకుడికి దీనిని ఉపయోగించేరు దాని పక్కన వారి తెగను సూచించే పదాన్ని కలిపేరు సమాఖ్య ఏర్పడి, మూడు తెగల ప్రధాన నాయకుల్ని సమావేశపరచి, దానిలో మూడు తెగల నాయకుల మధ్య విభజించిన బాధ్యతలను వివరిస్తూ ఆయన ఇల్లా అన్నారు "టెజ్ కుకోం రాజును అకుల్‌హువా త్యుక్‌ట్లీ అనీ, వారి పూర్వీకులు ధరించిన బిరుదుతో చిచిమెకాట్ల్ త్యుక్‌ట్లీ అని పిలవాలి ఇది సామ్రాజ్య సంకేతం ఆయన మేనమామ (అంకుల్) ఇజ్‌కో ఆటిన్‌కు కుల్‌హువా త్యుక్‌ట్లీ అన్నది బిరుదు శాల్‌టెక్స్ కుల్హాం రాజుగా వున్నారు గద అందుచేత టెక్‌పాన్క్యు టిల్ - త్యుక్‌ట్లీ అయిన తోతొక్వి హువాటిన్‌కు 'అజ్‌కాపుట్ జాల్‌కో' అనేది బిరుదు వారి పూర్వీకులు ధరించిన బిరుదు ఇది" పైన చెప్పిన ఇజ్‌కో ఆటిన్ అజ్‌టెక్ సమాఖ్య ఏర్పడినప్పుడు అజ్‌టెక్కు తెగవారి యుద్ధ నాయకుడు యుద్ధ నాయక పదవిలో ఇతరులూ వుంటారు కనక వారికి తెగ పేరు కూడా చేర్చి గౌరవిస్తారు ఇండియనుల భాషలో మాంటెజుమా నిర్వహించిన పదవి ప్రధాన సైన్య నాయక పదవి వంటిది ఇంగ్లీషు భాషలో 'జనరల్' అనవచ్చు

నాహువాట్లక్ తెగలు చాల వానిలో ఈ పదవిని గుర్తిస్తున్న క్లవీగెరో దీనిని అజ్‌టెక్కు యుద్ధ నాయకునికి ఎన్నడూ వుపయోగించడు "ట్లస్కాలా, హువా క్షోట్జింకో, చోలులా తెగల రాజవంశీకుల అత్యున్నత స్థానం త్యుక్‌ట్లీ కులీన వంశంలో పుట్టి, యుద్ధాలలో అత్యంత శౌర్య పరాక్రమాలు ప్రదర్శించి, ఒక వయస్సుకి వచ్చిన వారికే ఈ పదవినిస్తారు ఆ హోదా గల వాడు చూపవలసిన ఆడంబరాలకు రావలసినంత ధనం కూడా వుండడం ముఖ్యం"— అన్నారాయన తన History of Mexico లో మాంటెజుమాను నిరంకుశుడైన రాజ పదవికి ఎత్తే పేరు ఏ మాత్రం పరిశీలించకుండా ఆయన పదవీ బాధ్యతల స్వభావం ఎరక్కుండా పౌర, సైనిక బాధ్యతలన్నీ ఆయనకు కట్టబెట్టేరు సర్వ సైన్యాధ్యక్షుడుగా ప్రజాభి మానం, ప్రజల గౌరవం సంపాదించే అవకాశమూ ఆయనకు వున్నాయి తెగకూ, సమాఖ్యకూ కూడ అది అవసరమైన పదవి ప్రమాదాలతో కూడుకున్నదీను అనాగరిక యుగం దిగువ దశనుంచి ఈనాటి వరకూ మానవుని అనుభవంలో ఈ పదవి ఎప్పుడూ

అపాయాలతో కూడుకొన్నదే చట్టాలూ, రాజ్యాంగ చట్టాలూ నాగరిక దేశాలలో దానికి భద్రత నిస్తున్నాయి అదీ అనుమానమే అభివృద్ధి చెందిన ఇండియను తెగలలోనూ, మెక్సికో లోయలోని తెగలలోనూ ఈ పదవి యొక్క బాధ్యతలను విభజిస్తూ, అధికారాలను అదుపులో వుంచుతూ ఆచారాలూ, అలవాట్లూ ఏర్పడ్డాయి అజ్టెక్ తెగల సమితికి పౌర, సైనిక వ్యవహారాల మీదానే గాక, యుద్ధ నాయకుని మీదా, ఆయనకిచ్చే ఆదేశాల మీదా సర్వాధికారం వున్నట్లు కనిపిస్తుంది సంపదలు పెరిగి, పాదార్థిక పురోగతి రావడంతో అజ్టెక్ రాజకీయాలు సంక్లిష్టం అయాయి అనుమానం అక్కర్లేదు అందుచేత వానిని గురించి తెలుసుకోవడం ఎంతో ఉపయోగకరం వారి ప్రభుత్వ నిర్మాణం గురించిన వివరాలు సరిగ్గా తెలిస్తే, అతిశయోక్తులతో పని లేకుండా అవే ఎంతో అద్భుతం అనిపిస్తాయి.

మాంటెజూమా పదవికి ఎన్నిక జరుగుతుందనీ, అయితే అందుకు ఒకకుటుంబం వారినుంచే ఎన్నుకోవడం జరుగుతుందనీ స్పానిష్ రచయితలు ఇంచుమించు ఒకే విధంగా చెప్తున్నారు అయితే ఆ పదవి కొన్ని సందర్భాలలో తండ్రినుంచి కొడుక్కి ఎందుకు సంక్రమించడంలేదో చెప్పలేకపోయేరు ఈ వారసత్వం పద్ధతి స్పానిష్ వారికి కొత్త అందుచేత అసలు విషయంలో తప్పుచెప్పరు పైగా స్పానిష్ విజేతల కళ్ళ ముందు ఈ పదవివరసగా రెండుమార్లుమారింది మాంటెజూమా స్థానంలో కూట్లహువా వచ్చేడు ఈయన మాంటెజూమా సోదరుడు వారి రక్త సంబంధ వ్యవస్థ తెలిస్తే తప్ప వారిద్దరూ సహోదరులా, జ్ఞాతి సోదరులా చెప్పలేము ఈ కూట్లహువా మరణానంతరం గువాతెమోజిన్ ఎన్నుకోబడ్డాడు ఇక్కడ ఈ పదవి మేనమామనుంచి మేనల్లునికి వెళ్ళింది అయితే ఆయన స్వంత చెల్లెలి కొడుకా, జ్ఞాతి మేనల్లుడా తెలియదు. (మూడో భాగం, మూడో ప్రకరణం చూడండి) ఇంతకు పూర్వం సందర్భాలలో ఆ పదవి అన్ననుంచి తమ్ముడికో, మేనల్లునికో వెళ్ళడం చూశాం ఎన్నిక జరుగుతుందంటే దానికో నియోజకవర్గం వుండాలి ఇక్కడ ఎన్నుకునేది ఎవరు? ఈ ప్రశ్నకు సమాధానంగా 'దురాన్' నలుగురు నాయకులు ఎన్నుకుంటారన్నాడు వీరికి తెజ్కుకో నుంచి ఒకర్ని, త్లాకోపాన్ నుంచి ఒకర్ని కలిపి, ఈ ఆర్గురూ ఒక కుటుంబంనుంచి యుద్ధనాయకుణ్ణి ఎన్నుకుంటారన్నాడు ఇండియను నాయకుణ్ణి ఎన్నుకొనే పద్ధతి ఇదికాదు అందుచేత దీనిని అర్థరహితమని తోసివెయ్యవచ్చు

ఇంతకన్న పెద్ద నియోజకవర్గాన్ని సహాగున్ చూపిస్తున్నారు "రాజా లేక ప్రభువు చనిపోయినప్పుడు తెకుట్లాకేలు అనబడే సెనెటర్లు, అచ్కా కౌహాతీ అనబడే తెగలోని వయో వృద్ధులూ, యేతెక్యోయోకే అనబడే యుద్ధనాయకులూ, వృద్ధవీరులూ, యుద్ధాల వంటి వ్యవహారాలలో గడితేరిన ఇతర ప్రముఖనాయకులూ, తైనామాకాకే, లేక పాపాసాకే అనబడే పురోహితులూ రాజభవనంలో సమావేశం అవుతారు ఎవరు రాజుగా వుండాలనేది వారంతా చర్చిస్తారు నిర్ణయిస్తారు ఇతః పూర్వపు ప్రభువుల వంశాలలో కల్లా కులీన వంశంనుంచి, మంచి శౌర్య సాహసాలు కలవానిని, యుద్ధ వ్యవహారాలలో ఆరితేరిన వానిని ప్రభువుగా ఎన్నుకుంటారు ఎన్నుకున్నాక ఆయనకు ప్రభువు అని పేరు పెడతారు అయితే ఈ ఎన్నికకు వోట్లూ, వోట్లు లెక్కించడం వుండదు అందరూ అంగీకరించిన మనిషిని ప్రభువును చేస్తారు రాజును ఎన్నుకొన్నప్పుడే మరో నలుగురు సెనెటర్లను ఎన్నుకొంటారు వారు ఎప్పుడూ రాజుతోవుంటూ రాజ్య వ్యవహారాలు చూస్తుంటారు" ఈ ఎన్నికల విధానంలో చాలమంది ఎన్నుకొనే వాళ్ళు ఉన్నారు ప్రభుత్వానికి ప్రజాతంత్ర లక్షణం వుంది, సందేహంలేదు కాని దానిలో ఇండియన్ ఆచారాల పొందికలేదు, ఈ పదవి యొక్క నియమ నిబంధనలూ ఎన్నిక జరిగే పద్ధతి తెలియాలంటే ముందు వారిలో గణాలున్నాయా, ఆ గణాలలో స్త్రీ పారంపర్యం సాగుతూందా, పురుష పారంపర్యం సాగుతూందా తెలియాలి వారిలోని రక్త సంబంధ వ్యవస్థ స్వరూపం తెలియాలి గణకుటుంబంలోని ఇతర తెగలలో వుండే వ్యవస్థే వీరిలోనూ వుండివుంటుంది అదేగనక వుంటే వారు తమ అన్నదమ్ముల కొడుకుల్ని కొడుకా అనే పిలుస్తారు అక్క-చెల్లెళ్ళ కొడుకుల్ని మేనల్లుళ్ళు అంటారు తన తండ్రి అన్నదమ్ముళ్ని తండ్రులే అంటారు వారిపిల్లలు అన్నదమ్ములూ అక్కచెల్లెళ్ళూను తల్లి అన్నదమ్ములు మేనమామలు వారి పిల్లలు మేనబావలు మేనమరదళ్ళు అలాగే. గణాలుగా ఏర్పడి, స్త్రీ పారంపర్యం కొనసాగుతుంది వుంటే అన్నదమ్ములు తండ్రి అన్నదమ్ములు, తల్లి అక్కచెల్లెళ్ళ పిల్లలు, తాతలు, మనుమలు ఒకే గణంలో వుంటారు తన తండ్రిగాని, తనకొడుకుగాని, అతని కొడుకుగాని వుండరు తన కొడుకులూ, తన అన్నదమ్ముల కొడుకులూ మరో గణానికి చెందుతారు అజ్టెక్‌లలో గణ నిర్మాణం వున్నట్లే ఇంకా ధృవపడలేదు అయితే ప్రధాన యుద్ధనాయక పదవిని గూర్చిన వారసత్వమే దానికి గట్టి సాక్ష్యం, లేకపోతే ఆ వారసత్వం ఎందుకో స్పష్టపరచలేము. గణంలో స్త్రీ పారంపర్యం వుంటే వారసత్వం గణంలో వుంటుంది

దానిని గణంలో వారు ఎన్నుకుంటారు. అప్పుడా పదవి అన్ననుంచి తమ్మునికో మేనమామనుంచి మేనల్లునికో వెడుతుంది అజ్టెక్‌లలో అదేజరిగింది తండ్రి నుంచి కొడుక్కు ఎప్పుడూరాదు అదే కాలంలో ఇరాక్వాయిలలో శాకెమ్ పదవి వారసత్వం వారిఎన్నికను పట్టి అన్ననుంచి తమ్మునికో, మేనమామనుంచి మేనల్లునికో వుంది గాని తండ్రినుంచి కొడుక్కులేదు ఈ మాదిరి వారసత్వం గణ వ్యవస్థ స్త్రీ పారంపర్యంలో వున్నప్పుడే వీలవుతుంది మరోవిధంగా జరగదు దీనిని పట్టి అజ్టెక్‌లలో గణ నిర్మాణం వున్నదనీ ఈ పదవికి సంబంధించి వంతవరకయినా దానిలో స్త్రీ పారంపర్యం కొనసాగుతున్నదనీ అనుకోవలసి వస్తుంది

అందుచేత మాంటెజుమా అధివశించిన పదవి వారసత్వం గణంలోవున్నదనాలి (ఆయన ఇంటిమీద గుర్తు లేక్ టోటెమ్ గద్ద) ఆ గణసభ్యులు తమనుంచే ఒకరిని ఎన్నుకుంటారు ఆ ఎన్నిక ఫలితాలన్నీ అజ్టెక్ శాఖలు నాలుగింటి (అవి ఫ్రాట్రీలే అయివుంటాయి)ముందూ వేర్వేరుగా వుంచుతారు వారు అంగీకరించడమో, నిరాకరించడమో జరుగుతుంది సర్వ సైన్యాధ్యక్షుని ఎన్నుకోవడంలో ఆసక్తివున్న టెజ్‌కుకాన్లూ, త్లాకోపాన్లూ కూడ దానిని పరిశీలిస్తారు వీరంతా వేర్వేరుగా పరిశీలించి ఆ వ్యక్తి నియామకాన్ని ఆమోదించాక ప్రతి విభాగమూ తమతమ అంగీకారాన్ని తెలియపరచేందుకు ఒకరిని నియమిస్తారు బహుశా ఇదే అయివుంటుంది, ఎన్నుకోవలసినవారు ఆరుగురు అనడం చాలమంది రచయితలు ఎన్నిక దార్లుగా పేర్కొన్న నలుగురు అజ్టెక్ ప్రధాన ఉన్నత నాయకులూ వారిలోని నాలుగు విభాగాల యుద్ధనాయకులై వుండవచ్చు త్లస్కాలాన్‌లలో అల్లాగే నాలుగు వంశాల నుంచీ నలుగురు యుద్ధ నాయకులున్నారన్నారు వీరివని ఎన్నుకోవడంకాదు ఒకరొకరిని సంప్రదించుకొని, అందరికి అంగీకారమో కాదో తెలుసుకొని ఆ నిర్ణయాన్ని ప్రకటించడం వారిపని మిగిలిన కొద్ది సాక్ష్యంతో ఇల్లా జరిగివుండవచ్చునన్న వూహామాత్రమే ఇది అజ్టెక్‌లలోని ప్రధాన యుద్ధనాయకుని ఈ వారసత్వపద్ధతి ఇండియనుల అలవాట్లకూ, ఎన్నికయ్యే ఇండియను నాయకుని పదవికి సంబంధించిన ఆచారాలకూ సరిపడుతూంది

ఎన్నుకొన్న వాని జీవితాంతం ఆ పదవి వుండే సందర్భాలలో అవసరం అయితే తొలగించే హక్కు ఎన్నుకొనేవారికి తప్పని సరిగా వుంటుంది ఆ విధంగా అది సక్రమంగా వ్యవహరించినంతకాలమే వుండే వుద్యోగం అయింది ఎన్నుకొనేందుకూ, తొలగించేందుకూ హక్కు అమెరికను ఆదివాసుల సమాజ వ్యవస్థలో సర్వత్రా

కనిపిస్తుంది సర్వాధికారము ప్రజల చేతుల్లోనే వుండేవనడానికి ఇది మంచి సాక్ష్యం తొలగించే హక్కు ఎక్కడోగాని ఉపయోగించబడలేదు కాని, అది గణ నిర్మాణానికి ప్రాణంలాంటిది ఈ నియమానికి మాంటెజూమా అతీతుడేం కాదు ప్రత్యేక పరిస్థితులు ఏర్పడి, సరియైన కారణం వొకటి ఆ నిర్ణయం చేసుకోడానికి వ్యవధి కావలసి వచ్చింది మాంటెజూమాను అదిరించి, బెదిరిస్తే ఆయన తన యింటినుంచి 'కోర్టెస్' బసకు వెళ్ళేడు అక్కడ నిర్బంధింపబడ్డాడు సైన్యనాయకుడు లేక పోవడంతో అజ్టెక్‌లు స్తంభించి పోయారు మనిషి, పదవి కూడ స్పానియార్డుల అధీనం అయ్యారు పశ్చిమ ఇండియా దీవులలో ఒకతెగవారి 'కసీకేను' స్పానియార్డులు పట్టుకొని ఖైదు చేసి నప్పుడు ఇండియనులు ధృతి చెడి పోరాట నిరాకరించేరు ఈ రహస్యాన్ని గ్రహించి స్పానియార్డులు ఖండంమీదికి వచ్చేక నయానో, భయానో ప్రధాన నాయకుణ్ని చేజిక్కించుకొని తమ పని సానుకూలం అయ్యేవరకూ అతనిని విడిచిపెట్టేవారుకాదు కోర్టెస్ కూడా ఈ అనుభవాన్నే అచరణలో పెట్టేడు మాంటెజూమాను దొరికించుకొని తన బసలో ఖైదుచేసేడు పిజారో కూడా అతిహువాల్పాను పట్టుకొన్నప్పుడూ చేసింది అదే ఇండియనుల ఆచారం ప్రకారం ఖయిదీని చంపేస్తారు చంపినది నాయకుడిని అయితే ఆ పదవి ఆయన మరణానంతరం తెగకు వచ్చేస్తుంది వెంటనే కొత్తవానిని ఎన్నుకొని ఆ పదవి ఖాళీలేకుండా భర్తీ చేసేస్తారు కాని ఇక్కడ ఖయిదీ బతికే వున్నాడు. అతని అధీనంలోనే వుంది పదవి కనక దానిని భర్తీచేయలేరు ఈ నూతన పరిస్థితులలో ప్రజలు దిగ్భ్రమచెందేరు అజ్టెక్‌లను ఈ పరిస్థితికి తెచ్చినది కోర్టెస్

వారు కొన్ని వారాలపాటు వేచిచూసేరు స్పానియార్డులు లేచిపోతారేమోనని ఆశించేరు కాని వాళ్ళు కదిలేలాగ లేకపోయేసరికి తామూ సిద్ధమయ్యారు దృఢ మనస్కుడుగాక మాంటెజూమా తన పదవిని వదలలేక పోతున్నాడను కోడానికి తగిన కారణాలున్నాయని, అతని స్థానానికి తమ్ముడిని ఎన్నుకొన్నారు వెంటనే మహా కోపంతో స్పానియార్డులమీద దాడిచేసి వారిని తమ ప్యూబ్లోనుంచి తరిమివేశారు మాంటెజూమాను తొలగించేరన్నమాట హెర్రెరా వ్రాతను పట్టి ధృవపడుతూంది. అజ్టెక్‌ల దాడి ప్రారంభమయ్యాక వారు మరొక కొత్త సైన్యాధిపతి ఆదేశాలను పాటిస్తుండడం చూసి కోర్టెస్ అసలు విషయం గ్రహించేడు "ప్రభుత్వాన్ని వాని చేతిలో (కొత్త సైన్యాధిపతి) పెట్టేరేమో, మాంటెజూమా మంచి తెలుసుకోమని మరీనాను పంపేడు. "తాను బతికుండగా మెక్సికోలో వారు మరొక రాజును ఎన్ను

కోవాలనుకోరు" అని మాంటెజూమా సమాధానం ఇచ్చేడుట తరవాత అతడు తాను వున్న ఇంటికప్పు ఎక్కి తనవాళ్ళని ఎలుగెత్తి పిలిచేడు తాను నిర్బంధంలో వుండడం చేత, తనకు స్పానియార్డులంటే అభిమానం వుండడంచేతా మరో రాజును ఎన్నుకున్నారని విన్నాను నిజమా అని అడిగేడు ఒక అజ్టెక్ యోధుడు అతనికి పౌరుషంగా సమాధానం ఇచ్చేడు "నోరుముయ్యి అడంగి వెధవా ఏకులొడుక్కని బతకడానికి పుట్టేవు పిరికిపందవు ఆ కుక్కలు నిన్ను బంధీచేశారు" తిట్టి బాణాలు వేశారు రాళ్ళు పుచ్చుకు కొట్టేరు ఆ దెబ్బలకి, అవమానానికి అతడు ఆట తరవాత కొద్దిరోజులకే చచ్చిపోయేడు ఈ దాడిలో అజ్టెక్ల సైన్యనాయకుడు క్యూట్లాహువా అతడు మాంటెజూమా సోదరుడు తరవాత సైన్యాధిపతి అయ్యేడు

ఈ పదవి విషయమై స్పానిషు రచయితల నుంచి దొరుకుతున్న సమాచారం చాలకొద్ది అజ్టెక్ల పౌరవ్యవహారాల మీద మాంటెజూమాకు ఏమన్నా అధికారం వుండేదనడానికి కారణం కనబడదు. లేదనడానికి ఎక్కువ కారణాలు వున్నాయి సైన్య వ్యవహారాలలో యుద్ధ రంగంలో వున్నప్పుడు ఆయనకు జనరల్‌కువున్న అధికారాలున్నాయి అయితే సైన్య సంచలనం గురించి సమితి నిర్ణయిస్తుందని తోస్తుంది ప్రధాన సైన్యాధ్యక్ష పదవికి పురోహితుని బాధ్యతలూ, న్యాయాధీశుని బాధ్యతలూ కూడ జత పరిచేరు చిత్రంగా వుంది సైన్యాధిపతి పదవికి బాధ్యతలు సంక్రమించిన విధాన్ని బాసిలస్ గురించి చెప్పేటప్పుడు ప్రస్తావను అనాడున్నది ద్వంద్వ ప్రభుత్వం అయినా పౌర, సైనిక వ్యవహారాలమీద పెత్తనం గురించిన తగవు వస్తే నిర్ణయాధికారం సమితికి వుండేదనుకోవచ్చు నాయకుల సమితి అతి ప్రాచీనకాలం నుంచీ వస్తూంది సమాజం యొక్క అవసరాలు దాన్ని సృష్టించేయి నాయక పదవికి ప్రజా ప్రాతినిధ్య స్వభావం వుంది ఈ విషయాలను మరవకూడదు

ప్రధాన సైన్య నాయక పదవికి సంబంధించిన నియమ నిబంధనలూ, అతనిని పదవినుంచి తొలగించే అధికారం గల సమితీ వుండడం వట్టి అజ్టెక్ ఆచారాలూ అలవాట్లూ మౌలికంగా ప్రజాతంత్ర పద్ధతి గలవని తేలుతూంది యుద్ధ నాయకుణ్ణి, ఎన్నుకోవాలనే నియమమూ శాకెమ్ పదవులకూ, నాయక పదవులకూ కూడా అదే సూత్రం వర్తిస్తూందనే అనుకోవాలి— నాయకుల సమితీ వుండడం దీనికి గట్టి నిదర్శనాలు అనాగరిక యుగం దిగువ దశలో, మధ్య, ఎగువ దశలలో అధీనియను తరహా ప్రజాతంత్రం లేను వుండను కాని ఏమన్నా నియమాలు మౌలికంగా ప్రజాతంత్రం

పద్ధతివో, లేక మౌలికంగా రాజరిక పద్ధతివో తెలుసుకుంటే తప్ప ఆ ప్రజలు అర్థం కారు ప్రజాతంత్రానికీ, రాజరికానికీ వున్న అంతరం పైరెంటికీ మధ్యవుంది అజ్‌టెక్‌ల సామాజిక వ్యవస్థయొక్క మూలయూనిటు ఏమిటో, వారిలో గణ నిర్మాణం వుందేమో తెలుసుకోకుండా స్పానిష్ రచయితలు ధైర్యంగా అజ్‌టెక్‌లకు నిరంకుశ రాజరికాన్ని, అత్యున్నత స్థాయి ఫ్యూడల్ లక్షణాలు గల దాన్ని అంటగట్టేరు దానిని చరిత్రకు ఎక్కించేరు అమెరికనుల అశ్రద్ధ వలన ఈ దురభిప్రాయాలు అట్టే నిలిచిపోయేయి, చాలకాలం అజ్‌టెక్‌ల నిర్మాణం స్పష్టంగా తెగల సమాఖ్యగా, సంఘంగానే స్పానియార్డుల దృష్టికి తోచింది వారికో రాజరికాన్ని అంటగట్టడం స్పానియార్డుల అశ్రద్ధా, వికట ధోరణీ తప్ప వేరుకాదు

అజ్‌టెక్‌లు, తెట్‌కుకాన్‌లు, త్లకోపాన్‌లు మొదలైన వారిలో వారి ఆచారాలకనుగుణంగా నాయకసమితి సమావేశంలో లేనప్పుడు పౌర వ్యవహారాలు చూడడానికి ప్రధాన శాకెమ్ వుంటారు ఆ సమితి చేయవలసిన పనులకు ప్రాతిపదిక రూపం ఇచ్చే పని ఆయనది అజ్‌టెక్‌లలో అటువంటి అధికారి ఒకరున్నారనడానికి సూచనలు వున్నాయి జియాహువాకాట్ల్ ఆయనపేరు ఆయనను వారు ఒక్కొక్కప్పుడు చిన్న నాయకుడంటూ వచ్చేరు యుద్ధ నాయకుడు పెద్దనాయకుడు అనే దృష్టితో కాని ఈ పదవి గురించిన సమాచారం చాలాకొద్ది దాని ఆధారంగా ఈ విషయాన్ని చర్చించడం సులభం కాదు

ఇరాక్వోలలో యుద్ధవీరులు నాయక సమితి ముందుకు వచ్చి పౌరసమస్యల మీద తమ అభిప్రాయాలను చెప్పవచ్చునని ఇతఃపూర్వం రాసేను తమ తరపున మాట్లాడడానికి ఒక వక్తను పంపుతూ స్త్రీలుకూడా సమితి సమావేశాలలో పాల్గొనవచ్చునని రాసేను పాలనా వ్యవహారాలలో ప్రజలు పాల్గొనే ఈ పద్ధతి నుంచి కాలక్రమాన సమితి చేసిన ప్రతి పాదనలు స్వీకరించే హక్కూ నిరాకరించే హక్కుతో ప్రజా సభ వచ్చింది ప్రజల సమస్యలను పరిశీలించి అమలు జరిపేందుకై నేనెరిగినంత వరకు గ్రామ వాసి ఇండియన్లలో ప్రజాసభ అనేదిలేదు బహుశా ప్రత్యేక విషయాలకోసం నాలుగు వంశాలవారూ సమావేశం అవుతూండవచ్చు కాని, అందరికి సంబంధించిన సమస్యలకై జనరల్ అసెంబ్లీ వుండడానికి దానికి తేడావుంది అజ్‌టెక్‌ల ఆచారాల ప్రజాతంత్ర స్వభావాన్ని పట్టీ వారి పరిస్థితులలో వచ్చిన పరిణతిని పట్టే వారిలో ప్రజా సభ ఏర్పడే సమయం సమీపించిందనవచ్చు

అమెరికను ఆదివాసులలో సాగిన భావం గణాలలో పుట్టి సమాఖ్య వద్ద నిలబడిందని ఇంత క్రితం రాసేను వారివి సామాజిక సంస్థలేగాని రాజకీయ మైనవి గావు ఆస్తిభావం వారిలో వున్నదానికన్న చాలా ముందుకుపోవాలి అంతవరకూ గణ సమాజం స్థానంలో రాజకీయ సమాజం ఏర్పడదు ఆదివాసులలో ముఖ్యంగా ఉత్తర అమెరికాలో ఎవ్వరితోనూ భూభాగంమీదా, ఆస్తిమీదా. ఆధారపడే ప్రభుత్వ భావన ఆలోచనలోకూడాలేదు ప్రజలు జీవిస్తున్న పరిస్థితులకు అనుగుణంగానే వారి ప్రభుత్వ భావనలూ వుంటాయి అజ్టెక్‌లలో లాగు సైనికోత్సాహం మిక్కుటంగావుంటే సహజంగానే గణ నిర్మాణాలలోనే సైనిక ప్రజాతంత్రం తల ఎత్తుతుంది అది గణాల స్వతంత్ర స్వభావాన్నితొక్కెయ్య లేదు ప్రజాతంత్ర నియమాలను బలహీన పరచ లేదు ఆ రెంటితో సమన్వయం ఏర్పరచుకొంటుంది

## ఎనిమిదో ప్రకరణం

# గ్రీకు గణాలు

గ్రీకు తెగల వెనకటి పరిస్థితులు - గణాలుగా నిర్మాణం- గణాల స్వభావంలో మార్పు - రాజకీయ వ్యవస్థ అవసరం - పరిష్కరించవలసిన సమస్య- రాజ్యం ఏర్పాటు- గ్రీకు గణాలు గురించి గ్రోటే వర్ణన, వారి ఫ్రాట్రీలు- తెగలు-గణ సభ్యుల హక్కులు, సౌలభ్యాలు, బాధ్యతలు - ఇరాక్వా గణాల లోని వంటివే - గణనాయకుని పదవి - ఎన్నిక వుందా, వంశానుగతమా - సామాజిక వ్యవస్థకు మూల యూనిట్ గణము - గణ పారంపర్యం చాలపురాతనం - ఆస్తి వారసత్వం ప్రాచీన నియమమూ- ఆఖరు నియమమూ -గణసభ్యులమధ్య సంబంధాలూ సామాజిక, మతవిషయిక ప్రభావాలకు గణం కేంద్రం

క్రీ పూ 850 ప్రాంతాలలో హోమరు కావ్యాలు ఇలియడ్, ఒడిసిస్‌ల రచనతో ఆసియా వాసులైన గ్రీకులలో నాగరికత ఆరంభమయిందని చెప్తారు మరో వంద ఏళ్ళ తరవాత యూరపియన్ గ్రీకులలో హెసియోద్ కవితలు వచ్చేయి అంతకు పూర్వం ఎన్నో వేల సంవత్సరాలుగా హెల్లెనిక్ తెగలు అనాగరిక యుగం ఎగువదశగుండా నాగరిక జీవితంలో అడుగు పెట్టడానికై సన్నాహ పడుతున్నారు వారి అతి ప్రాచీన సంప్రదాయాల్నిపట్టి వారు అప్పటికే మధ్య ధరాసముద్రపు తూర్పు తీరాన గ్రీకు ద్వీపకల్పంలోనూ, మధ్యనా, దగ్గరలోనూ వున్న దీవులలోనూ స్థిరపడి నట్లు కనిపిస్తుంది. అదే మూలానికి చెందిన ఒక ప్రాచీన శాఖ పెలాస్గియన్లు వీరు ఈ ప్రాంతాలలో అధికభాగాల్ని అంతకుముందే ఆక్రమించి వున్నారు వారిని హెల్లెన్ తెగలు తమలో కలిపివేసుకోవడమో లేక తరిమి వేయడమో జరిగింది హెల్లెన్ తెగలయొక్క, వారికి ముందేవున్న తెగల యొక్క పరిస్థితులను అంతకుపూర్వ

కాలం నుంచి తమతో తెచ్చుకున్న కళలూ, కల్పనలు వట్టి వారి భాషా పరిణామాల నుంచీ, వారి సంప్రదాయాలు, సామాజిక అలవాట్లనుంచీ వూహించుకోవలసిందే. వాటిలో చాలభాగం నాగరికదశలో కంటా కొనసాగేయి ఇక్కడ మనచర్చ ప్రధానంగా వారి సంప్రదాయాలూ, సామాజిక అలవాట్లూ గురించిసాగుతుంది

పెలాస్గియన్లూ హెల్లెన్‌లు కుద గణాలు, ఫ్రాట్రీలు, తెగలుగా నిర్మాణం పొందేరు తరవాత జాతులుగా సమీకరించేరు కొన్ని కొన్ని చోట్ల ఈ నిర్మాణ క్రమం సమగ్రంగాలేదు దొరయన్లలో ఫ్రాట్రీలు సర్వసామాన్యంకాదని ముల్లర్ రా పేరు తెగలుగావున్నా, జాతిగా ఏర్పడ్డా వారిసమాజపు మూలయూనిటు గణమే రాజకీయ సమాజము లేక రాజ్యానికి భిన్నంగా వారు గణసమాజం లేక ప్రజగానే వున్నారు వారి పాలనా సంస్థ నాయకుల సమితి అగోరా లేక ప్రజాసభ దానికి సహ కరించేది ఒక బాసిలెస్ లేక సైన్యాధ్యక్షుడు ఉండేవాడు ప్రజలు స్వతంత్రులు వారిని, ప్రజాతంత్రాచారాలు పురోగమిస్తున్న భావాల, వాంఛల ప్రభావంలో గణాలు తమ ప్రాచీన రూపాల్ని వదలి ఉన్నత రూపాన్ని అందుకున్నాయి మెరుగుపడుతున్న సమాజంయొక్క అవసరాలు విర్నిరోధ్యమయి తప్పని సరిగా సర్దుబాట్లు చేసుకోవలసి వచ్చేయి కాని ఎన్ని సర్దుబాట్లుచేసుకుంటున్నా ఆ అవసరాలు నిరంతరం పెరుగు తూంటే ఆ గణాలు సర్దుకోలేక పోవడం కనిపిస్తూనే వుంది ప్రధానంగా జరిగిన మార్పులు మూడు 1 పురుష పారంపర్యానికి మార్పు వచ్చింది 2 అనాథస్త్రీలూ, ఆస్తివారసురాండ్రూగణంలోనే వివాహం చేసుకో దానికి అనుమతించారు 3 తండ్రి ఆస్తి కొడుకులకు మాత్రమే చెందేట్టు చేయడం ఈ మార్పులనూ, వాని కారణాలనూ క్లుప్తంగానే మరోచోట చెప్తాను

హెల్లెన్‌ప్రజ మొత్తంమీద ముక్కచెక్కలయిపోయారు సర్వ సా మా న్య రూపంలో అనాగరికయుగంలో గణాలుగా వుంటూ, అదే అభివృద్ధి దశలో వున్న తెగలన్నింటిలోలాగనే వారి పాలనా వ్యవస్థయొక్క లక్షణాలూ వుండేవి గణ ఆచారాల మధ్యవుండే పరిస్థితిలోనే వారుండేవారు కొత్త ఏమీలేదు.

క్రీ పూ 776 నాటి మొట్ట మొదటి ఒలింపియాడ్ నుంచి, క్రీ పూ 509 నాటి క్లీస్తెనిస్ చట్టం కాలందాకా గ్రీకు సమాజం ఒక మహత్తర సమస్య పరిష్కా రంలో చిక్కుకుని మొట్టమొదటి మారు చరిత్రకు ఎక్కింది ఆచారాలలో గొప్ప మార్పును తెస్తూ పాలనా వ్యవస్థ స్వరూప నిర్మాణంలోనే మూలసట్టు మార్పుతెచ్చిన ఘట్టం అది అనాదిగా తాము జీవిస్తున్న గణసమాజం నుంచి, ప్రాంతాలు, ఆస్తుల

ప్రాతిపదికమీద ఏర్పడే రాజకీయ సమాజంగా మారేందుకు ప్రజలే ప్రయత్నిస్తున్నారు నాగరిక జీవనానికి ఆ మార్పు ముఖ్యం వారు విజానికి రాజ్యాన్ని ఏర్పరచ ప్రయత్నిస్తున్నారు అది ఆర్యను తెగంలో జరుగుతున్న మొదటి ప్రయత్నం ప్రాంతాలపునాది మీద రాజ్యాన్ని ఏర్పరచాలి ఆనాటి నుంచి నేటివరకు రాజ్యం ఆ పునాది మీదనే వుంది ప్రాచీన సమాజం ప్రజలతో ఏర్పడింది గణానికీ, ప్రజలకూ వున్న సంబంధాల ద్వారా దానిలో పాలన కొనసాగేది కాని గ్రీకు తెగలు ఈ ప్రాచీన పాలనా పద్ధతిని మించి పెరుగుతున్నాయి రాజకీయ వ్యవస్థ ఏర్పాటు అవసరం అనిపిస్తుంది ఆ అవసరం తీరాలంటే ముందు డెమె లేక పురాన్ని నిర్మించడం అవసరం దాని పరిధిని నిర్ణయించాలి దానికో పేరుపెట్టాలి అందులోని ప్రజల్ని ఒక పాలక వర్గంగా నిర్మించాలి పురం తన వద్ద వున్న స్థిర ఆస్తితో, అప్పటికి అక్కడున్న ప్రజలతో నూతన ప్రభుత్వ పథకంలో ఒక యూనిటుగా వుంటుంది తరవాత గణసభ్యులు పౌరులవుతారు పౌరులకు ప్రభుత్వంతో సంబంధం ఆ ప్రదేశంతోవున్న సంబంధాన్ని పట్టే తప్ప, అంతక్రితంలాగ వ్యక్తికి గణానికి వున్న సంబంధంవట్టి వుండదు. అతడున్న పురంలో సభ్యుడుగా చేర్చుకోబడతాడు ఆ చేర్చుకోవడమే అతని పౌరసత్వానికి సాక్ష్యం ఆ డెమే - పురంలో వోటు వేస్తారు దానికి పన్ను కడతాడు దాని నుంచే అతనిని సైనికసేవకు పిలుస్తారు ఇది చాల చిన్న మార్పుగానే కనిపించినా ఆనాడున్న ప్రభుత్వభావనల నుంచి ఈ పరిణామం రావడానికి శతాబ్దాలకాలం పట్టింది అదో గొప్ప విప్లవమే కూడ అంతవరకూ సామాజిక వ్యవస్థకు మూలయూనిట్‌గా, వున్న గణం పైన చెప్పినట్లు పురోగమిస్తున్న సమాజం యొక్క అవసరాలను తీర్చలేకపోయింది ఆ గణాన్ని, ఫ్రాట్రీని, తెగను ప్రక్కకు పెట్టెయ్యడం, వాని స్థానే అక్కడ వుండే పౌరసమూహంతో కొన్ని ప్రాంతాలను నిర్ణయించడం చాలా చాలా కష్టమైనపని వ్యక్తికి గణంతో ముఖాముఖి సంబంధం వుంది దానిని పురానికి బదలాయించినప్పుడు ప్రదేశంతోనే ఆతనికి సంబంధం, పట్టణ వ్యవహారాలు చూసేవాడు (Demarch) గణనాయకుని స్థానం తీసుకుంటాడు నిర్ణీతమయిన అస్తులుండే పురం సుస్థిరమైనది దానిలోని ప్రజలూ చాలవరకు అంతే కాని గణంలో జనం హెచ్చుతూ, తగ్గుతూండేవారు కొంచెం ఇంచుమించు వారు చెదిరిపోయి వుంటారు ఒక పరిమిత ప్రదేశంలో స్థిరంగా వుండడం కష్టమైపోతున్నస్థితి అనుభవం లేనప్పుడు రాజకీయవ్యవస్థకు పురం ఒక యూనిటు అవుతుందనే ఆలోచన గ్రీకులనూ, రోమనులనూ ఎంతో గంధరగోళ పరచివుంటుంది ఆ ఆలోచన ఒక రూపం ధరించి క్రియా

రూపంలో పెట్టేవరకూ వారి తలలు బద్దలయిపోయి వుంటాయి రాజకీయసమాజానికి ఆస్తి అనేది కీలకం ఆ సమాజానికి అది పునాదికూడా గ్రీకులఆచారాలకు కొత్తరూపం ఇచ్చిదిద్దినది అదే అది ఎంతో సామాన్యంగా, ఇంతేనా అనిపించేలాగ యిప్పుడువున్నా అప్పుడు దానిని సాధించడం అంత సులభం కాలేదు అది మూలమట్టు మార్పు ఏమంటే అంతవరకు గ్రీకు తెగల అనుభవాలన్నీ గణసంస్థలతో వుండేవి ఇప్పుడో వానిని కొత్త రాజకీయ సంస్థలకు మార్చుకోవాలి

కొత్త రాజకీయ వ్యవస్థను ఏర్పరచే ప్రయత్నాలు ప్రారంభం అయ్యేక ఆ సమస్య పరిష్కారం కావడానికి ఎన్నో శతాబ్దాలే పట్టింది రాజ్యానికి గణాలు పునాదిగా వుండలేవని స్పష్టపడ్డాక వేరు వేరు చోట్ల గ్రీకు ప్రజ అనేక తరహాలుగా చట్టాలు చేయడం ప్రారంభించేరు వానిలో చాలా భాగం పరస్పరానుకరణలే వాని ఫలితాలు కూడా ఒకే విధంగా ఉండినాయి నేనిక్కడ అధీనియనులు చేసిన ప్రయత్నాలను ఉదాహరిస్తున్నాను అందరూ పేర్కొంటున్న థెసియను చట్టం ఒకటి క్రీ పూ 624 నాటి డ్రాకో చట్టం, క్రీ పూ 594 నాటి సొలోన్ చట్టం, క్రీ పూ. 509 నాటి క్లీస్థెనీస్ చట్టం వున్నాయి చివరి మూడూ చరిత్ర కాలంలోనివి పట్టణ జీవితమూ, ఆచారాలూ క్రమాభివృద్ధి పొందడం, గట్టి కోటలలోపల సంపదలు పోగుపడడం, దాని వలన జీవిత పద్ధతులలోనే గొప్పమార్పులు రావడంతో గణ సమాజాన్ని నెట్టివేసి దాని స్థానే రాజకీయ సమాజాన్ని స్థాపించేందుకు దారి ఏర్పడింది

గణ సమాజాన్ని రాజకీయ సమాజంలోకి తెచ్చిన మార్పుతో గణాల చరిత్రే ముగిసింది ఆ మార్పును పరిణామక్రమంలో పరిశీలించే ముందు గ్రీకుల గణాలనూ, వాని లక్షణాలనూ పరిశీలిద్దాం

అధీనియనుల ఆచారాలూ, అలవాట్లూ చూస్తే మొత్తం మీద గ్రీకుల ఆచారాలూ, అలవాట్లూ అర్థం అవుతాయి గణాలు, తెగల నిర్మాణం మంచి వారిలో ప్రాచీన సమాజం అంతమయ్యే వరకూ అవి అందరిలో ఒక్కలాగే వుంటాయి చరిత్రకు తెలిసిన నాటికి అత్తికాలోని ఇయోనియన్లకో నాలుగు తెగలున్నాయి గెలియోంటెస్, హోప్లెటెస్, ఎగికోరెస్, అర్గాదెస్ వీరందరికీ ఒకే మాండలికం నివాసం ఒక్క ప్రదేశంలోనే తెగల సమాఖ్యకు భిన్నంగా వారు ఒక జాతిగా సమ్మేళనం పొందేరు అయితే సమాఖ్య అన్నది అంతకు పూర్వం వుండే వుంటుంది ఎజినా, ఏథెన్స్, ప్రాసియా, నౌప్లియా మొదలైన సమాఖ్యలుండేవని హెర్మన్ పేర్కొంటున్నారు అత్తిక్ తెగ ప్రతివాండ్లోనూ మూడేసి ప్రాత్రీలు వున్నాయి ప్రతి ప్రాత్రీలో

ముప్పయ్యేసి గణాలు అంటే మొత్తం పన్నెండు ఫ్రాట్రీలూ మూడు వందల అరవై తెగలూ అన్నమాట పీటిలో తెగలూ, ఫ్రాట్రీల సంఖ్యలో మార్పుండదు ఫ్రాట్రీలలో వుండే గణాల సంఖ్య మారుతుంటుంది అలాగే దొరయన్లు మూడు తెగలుగా వున్నారు హైల్లిస్, పాంఫిలి, డైమానెస్ వీరు స్పార్టాలో, అర్గోస్‌లో, సిస్యోన్‌లో, కోరింత్, ఎపిడౌరస్, ట్రాయెజెన్‌లో, పెలోపోన్నెసెస్‌కు అవల మెగ్రావద్దా ఇతరత్రానూ చిన్న చిన్న జాతులుగా ఏర్పడివున్నారు కోరింత్, సిస్యోన్, అర్గోస్‌ల వద్ద వీటితో దొరయనేతర తెగలు ఒకటి రెండు కలిసివుండడం కనిపించింది

ప్రతిచోటా గ్రీకు తెగలలో గణాలు వున్నట్లే రక్తసంబంధం, మాండలికం వారివి ఒక తెగగా కూర్చి వుంచుతున్నాయి అయితే తెగవున్నది గనక ఫ్రాట్రీ వుండాలని లేదు మధ్యస్థ నిర్మాణంగా తెగలన్నింటా మామూలుగా వుంటున్నా లేక పోవడమూ వుంది స్పార్టాలో ఓబెలు అనే పేరున ప్రతి తెగలో పదేసి చొప్పున విభాగాలున్నాయి ఇవి ఫ్రాట్రీల వంటివే అయితే వీని కార్యకలాపాలు గురించి స్పష్టంగా తెలియదు

అథీనియను తెగలను ఇప్పుడు వాని అంతిమ రూపంలో, మంచి దృఢంగా పని చేస్తుండిన దశలో తీసుకుని ఆలోచిద్దాం అయితే అప్పటికే నాగరికత ఆరంభమయ్యే లక్షణాలు వాని నెదుర్కొంటున్నాయి అవి ఒక్కొక్క అడుగే ముందుకు వేసి చివరకు సామాజిక వ్యవస్థతోపాటుగా గణాలనూ తోసిపారేస్తాయి మానవ సమాజాన్ని ఆటవిక యుగం నుంచి బయటపడేసి అనాగరిక యుగం గుండా నాగరికతారంభ దశలోకి తీసుకువచ్చిన ఈ అద్భుత నిర్మాణం చరిత్రలోని ఈ భాగం చాల ఆసక్తి జనకంగా వుంటుంది

అథీనియనుల సామాజిక వ్యవస్థలో ఈ నిర్మాణాలు క్రమోత్తరంగా కనిపిస్తాయి ఒకటి గణం (జెనోస్) ఇది బంధుత్వ ప్రాతిపదిక మీద ఏర్పడింది రెండోది ఫ్రాట్రీ (ఫ్రాట్రా, ఫ్రాట్రియా). బహుశా ఒకే మూలగణం నుంచి శాఖలయి విడిపోయిన గణాల సోదర సంస్థ మూడు తెగ (ఫిలాన్, తర్వాత ఫైల్ అన్నారు) ఒకే మాండలికం మాట్లాడే అనేక ఫ్రాట్రీలతో ఇది ఏర్పడుతుంది నాలుగోది ప్రజ లేక జాతి ఒకే ప్రదేశంలో వుంటూ అనేక తెగలు ఒకే గణ సమాజంగా సమ్మేళనం అయి ఏర్పడుతుంది క్రమోత్తరంగా ఒక దానితో ఒకటి కలుస్తూన్న ఈ నిర్మాణాలతో వారి గణ సామాజిక వ్యవస్థ స్వరూపం ముగుస్తుంది ఒక్కొక్క చోట స్వతంత్రంగా తమ తమ భూములలోనే వుంటూ వేర్వేరు తెగలు కలిసి సమాఖ్యగా ఏర్పడడం వుంది,

ఇవి గణ నిర్మాణాల నుంచి సహజంగానే ఏర్పడ్డాయి అయితే వాని వలన ముఖ్య మయిన ఫలితాలు కలగలేదు నాలుగు అథీనియను తెగలూ సమ్మిళితం కావడానికి పూర్వం సమాఖ్యగా ఏర్పడే వుంటాయి అందులోనూ అఖరు పర్యాయం వారందరూ ఇతర తెగల ఒత్తిడికి ఒక చోటకి చేరినాక ఏర్పడింది వీరి విషయంలో ఏం జరిగిందో దొరయన్ తెగల విషయంలోనూ ఇతర తెగల విషయంలోనూ కూడ అదే జరిగి వుంటుంది ఈ కొత్త నిర్మాణాన్ని చెప్పేందుకు వారివద్ద జాతి వాచకం తప్ప వేరు మాట లేకపోయింది అటువంటి స్థితికి చేరిన రోమనులు తమరిని 'పాప్యులస్ రోమనుస్' అని పిలుచుకున్నారు అది సరైనపదం అనాడు వారు ప్రజలు అంతే గణాలు, క్యూరీ, తెగలు ఒక చోట చేరితే కలిగిన ఫలితం అది నాలుగు అథీనియను తెగలూ కలిసి ఒక ప్రజ అయ్యారు ఆ ప్రాచీన కాలంలోనే పూర్తిగా స్వతంత్రులుగా అథీనియన్లుగా ప్రసిద్ధి పొందేరు ప్రాచీన కాలంలో గ్రీకు ప్రజల సమాజ వ్యవస్థలో గణాలు, ఫ్రాట్రీలు, తెగలు అంతటా ఎప్పుడూ వున్నాయి అప్పుడప్పుడు ఫ్రాట్రీలు లేకపోవడం కూడా వుంది

ఎంతో విమర్శాత్మక దృష్టితో గ్రీకు గణాలను గురించిన వాస్తవాలను గ్రోటే సేకరించేరు. వానిని గురించి ఆయన మాటలనే వుదాహరిస్తాను గ్రీకు తెగలలోని విభాగాలనుగురించి వ్యాఖ్యానిస్తూ ఆయన ఇల్లా అన్నారు. "ఫ్రాట్రీలు, గణాల ఏర్పాటు దీనికి పూర్తిగా భిన్నం అదికాలంనాడున్న చిన్నచిన్నయూనిట్లును సమీకరించి వట్లుంటాయి అవి తెగతో సంబంధంలేకుండా స్వతంత్రంగా వుంటాయి తెగకు ముందున్నవనీ అనిపించవు సమరూపం వూహించి నిర్మించినట్లుగాకుండా అవి అక్కడి కక్కడ వేరువేరుగా ఏర్పడతాయి వానికో రాజకీయోద్దేశమూ వుండదు. శాసనంచేసే నాటికి అవి అప్పటికే వుండినట్లు కనిపిస్తాయి అందుచేత జాతిమొత్తంమీద వేసుకొనే పథకాలకు అనువుగా చట్టనిర్మాత వానిని సర్దుకోవాలి ముప్పయికుటుంబాలు ఒక గణానికి, ముప్పయిగణాలు ఓ ఫ్రాట్రీకి, మూడు ఫ్రాట్రీలు ఒకతెగకు అంటూ వర్గీకరించడం, వరిసక్రమంలో ఒకదానికొకటి అధీనంగావుండేటట్లు చేయడం జరుగు తూంది అప్పటికేవున్న సహజసిద్ధమైన నిర్మాణాలను చట్టబలంతో చక్కగా, సమ సంఖ్యలో వుండేటట్లు చేసినా ఆ పొందిక అల్లాగే స్థిరంగావుండదు అసలు అటువంటి పొందిక ఎప్పుడైనా వున్నదా అని కూడా అనిపిస్తుంది మనచేతిలో ఇప్పుడున్న దానికన్న గట్టిసాక్ష్యం వుంటేతప్ప ప్రతి ఫ్రాట్రీలో గణాలసంఖ్య సమానంగానే వుంటాయనీ, ప్రతిగణంలో కుటుంబాలు సమానసంఖ్యలో వుంటాయనీ చెప్పినా

నమ్మడం కష్టం ఈ అంకెలు సరిగ్గా వుండడం అనుమానించతగినదే అయినా అధీనియను ప్రజలలో ఫ్రాట్రీలూ, గణాలూ మాత్రం వాస్తవం అవి అతిప్రాచీన మైనవీ విలకడ అయినవిన్నూ, దీనిని గమనించడం అతిముఖ్యం దీనంతకీ పునాది ఇల్లు పొయ్యి కుటుంబం- అవి కొన్నికలిసి-వాని సంఖ్యతో నిమిత్తంలేదు- గణం- జెనోస్ అందుచేతగణం అన్నది ఒక కుదురు సెప్ట్, దానిని పెద్దది చేస్తే సోదరసంస్థ- ఫ్రాట్రీ- వీటిని కలిపివుంచేది - ఉమ్మడి మతకర్మకాండ ప్రాచీనకాలంలో తమ పూర్వీకు డనుకొనే ఒకదేవుని గౌరవార్థం తమకే నిర్దిష్టమయిన పురోహితవర్గం వారికో ఇంటిపేరు 2 ఉమ్మడిగా శ్మశానం 3 ఆస్తివిషయంలో పరస్పరహక్కులు 4 సహాయం, రక్షణ, నష్టప్రతీకారచర్యలకై పరస్పరబాధ్యతలు 5 కొన్ని నిర్దిష్ట మయిన సందర్భాలలో ప్రత్యేకించే అనాధస్త్రీలనూ, ఆస్తివారసురాలినీ అంతర్వివాహం చేసుకొనే బాధ్యతా, పరస్పరంహక్కులను 6 కనీసం కొన్నిసందర్భాలలో ఉమ్మడి ఆస్తిస్పష్ట్యా ఒక ఆర్కాన్ (మేజస్ట్రేటు)నూ, కోశాధికారినీ కలిగి వుండడమున్నూ గణంలో ఐకమత్యానికి చిహ్నాలయిన హక్కులూ, బాధ్యతలూ అవి అనేకగణాలతో ఏర్పడే ఫ్రాట్రీ ఇంత సన్నిహితంగా వుండదు ఆ మాదిరినే కొన్నిహక్కులూ, పరస్పరబాధ్యతలూ దానిలోనూ వున్నాయి ఒకసోదరుణ్ని ఎవరన్నా చంపితే అంత్య కర్మలతో కలియడమూ, ప్రతీకారచర్యకోనమూ పరస్పరసౌలభ్యాలు వుంటాయి ప్రతి ఫ్రాట్రీ నాలుగుతెగలలో ఏకోతెగకి అనుబంధించి వుంటుంది యూపాట్రిడ్స్ (కులీన కుటుంబాలు) నుంచి ఏరుకొన్న ఫిలో- బాసిలస్ (తెగకురాజు) అనే మాజిస్ట్రేటు అధ్యక్షతన నిర్దిష్టకాలాలలో జరపబడే జాతరలలో ఒకేతెగకి సంబంధించిన ఫ్రాట్రీలకు కొన్నిబాధ్యత లుంటాయి " అని ఆయన తమగ్రీసుచరిత్రలో రాసేరు

దీనినిమాస్తే గ్రీకు ఇరాక్యూగణాల మధ్యనున్న పోలికలు వెంటనే తెలుస్తూ న్నాయి గ్రీకు సమాజం బాగా పురోగమించినది కావడంవల్లనూ వారిమతవ్యవస్థ పరిణతంకావడంవల్లనూ వచ్చిన తేడాలుకూడా కనిపిస్తూనే వున్నాయి గ్రోటే పేర్కొన్న అనేకగణలక్షణాలను నిరూపించే అవసరంలేదు శాస్త్రపండితులు కవి కరతలామలకమే అయితే గ్రీకుగణాలకు మాత్రమే ప్రత్యేకమయిన లక్షణాలు కొన్ని వున్నాయి వాటన్నిటి వునికినీ ధృవపరచడం కష్టం 7 పురుషపారంపర్యం 8 ఆస్తివారసురాంద్ర విషయంలో మినహా ఇతరులకు గణంలో అంతర్వివాహం నిషిద్ధం 9 పరాయివారిని గణాలలోనికి దత్తుతెచ్చుకొనే అధికారం 10 నాయకుల ఎన్నిక, తొలగింపుహక్కు-

గ్రీకుగణసభ్యుల హక్కులు, సౌలభ్యాలు, బాధ్యతలను మరోమారు పైన పేర్కొన్న అదనపువానితోసహా వివరిస్తాను

1 ఉమ్మడి మతక్రియలు
2 ఉమ్మడి శ్మశానం
3 చనిపోయినవారి ఆస్తివారసత్వం గురించిన పరస్పరహక్కులు
4 సహాయము, రక్షణ, నష్టప్రతిక్రియల గురించి పరస్పరబాధ్యతలు
5 అనాధబాలికలు, ఆస్తివారసురాండ్ర విషయంలో గణంలో అంతర్వివాహానికి హక్కు
6 ఉమ్మడి ఆస్తి కలిగి వుండడం, ఒక మేజిస్ట్రేటు, ఒక కోశాధికారిని పెట్టుకోవడం
7 పురుష పారంపర్య నిర్ణయం
8 నిర్ణీతసందర్భాలలోతప్ప గణంలో అంతర్వివాహం చేసుకోకుండే ఒప్పదం
9 ఇతరులను గణంలోకి దత్తుచేసుకొనే హక్కు
10 నాయకుల్ని ఎన్నుకొనేందుకూ, తొలగించేందుకూ హక్కు

అవసరంగా జతపరచిన లక్షణాలను కొంచెం వివరించాలి

## పురుషపారంపర్య నిర్ణయం.

అటువంటి నిబంధన వుందనడంలో సందేహంలేదు వంశానుక్రమణికలు దాన్ని రుజువుచేస్తున్నాయి ఒకమనిషికి గణంతోవున్న సంబంధాన్ని నిరూపించగలుగుటకై గ్రీకురచయితలు గణాన్నీ, గణసభ్యుణ్ణీ నిర్వచించడం నేనుచూడలేదు పిండరో, వర్రో ప్రభృతులు రోమనుగణాలన్నీ, గణసభ్యుల్నీ నిర్వచించేరు రోమనులవానితో గ్రీకులవి సరిపోలుతూ, పూర్ణస్థితిలో వున్నాయి వానిలో పురుషపారంపర్యమే వుంది గణాలస్వభావాన్ని పట్టి స్త్రీపారంపర్యమో, పురుషపారంపర్యమో సాగుతుంది. పురుషపారంపర్యం వున్నప్పుడు ఒక పూర్వ పురుషుని సంతతివారు దానిలో వుంటారు సరిగ్గా మనకుటుంబాలలో లాగే. మగవారి సంతతివారు కుటుంబనామం తీసుకుంటారు వారేగణం కాని అంతకంతకి చెదిరిపోయే స్థితిలో వుంటారు అతి సన్నిహితుల మధ్యతప్ప వారిలో దగ్గరతనం వుండదు స్త్రీలు వివాహంతో కుటుంబ నామాన్ని కోల్పోతారు వారు సంతానంతో సహా మరోకుటుంబానికి బదలా అయిపోతారు "అరిస్టాటిలు అస్క్లెపియాద్ గణానికి చెందిన నికోమాచస్ అనే డాక్టరు కొడుకు" అని గ్రోటే రాసేరు అయితే అరిస్టాటిలు తండ్రిగణంవాడేనా

అన్న ప్రశ్నకు సమాధానం ఆ ఇద్దరూ ఐస్క్యులాపియస్ నుంచి పురుషపారంపర్యంలో వచ్చినవారేనేమో తెలుస్తేనే దొరుకుతుంది దీనిని లాయెర్టియస్ వ్రాసేరు “అరిస్టాటిలు తండ్రి నికోమాకస్ నికోమాకస్ వంశంలోవాడే ఈ నికోమాకస్ పూర్వపురుషుడు నికోమాకస్ ఆయనతండ్రి మాకియోన్ ఆయనతండ్రి ఐస్క్యులాపియస్” తెగల, సమ్మేళనల పేర్లు గొప్పయితే కావచ్చు కాని మనిషిమూలం వెతకబోతే అతనిగణమే దొరుకుతుంది ఇసాయెయస్ చెప్పినట్లు హెర్మన్ మాట అసలుసంగతిని బయట పెడుతుంది “ప్రతిపసివాడినీ తండ్రికుమరులో, ఫ్రాట్రీలో నమోదుచేసేరు” తండ్రి గణంలో పిల్లవాని పేరు నమోదుచెయ్యడం అంటే పిల్లలు తండ్రిగణంవాళ్ళే అవుతారు

## నిర్ణీతసందర్భాలలో తప్ప గణంలో అంతర్వివాహం చేసుకోకుండా ఒప్పుదల

వివాహ ఫలితాలనుబట్టి ఈ ఒప్పుదల వచ్చిందనుకోవాలి వివాహంతో భార్యకు తనగణంలోని మతకర్మలహక్కు పోయింది భర్తగణంతాలూకు మతకర్మలువచ్చేయి ఈ నిబంధనను చూస్తేనే వివాహం ప్రధానంగా గణంబయటనే జరుగుతుందని అర్థం అవుతుంది “తనతండ్రి ఇంటినుంచి వెళ్ళిపోయిన కన్యకు పైత్రుకహోమకుండంతో సంబంధం వుండదు భర్తయొక్క మతకర్మకాండలో చేరుతుంది అదేవివాహబంధాని కున్నబలం” అన్నారు వాక్స్మత్ ఆమె నమోదుకావడంగురించి హార్మన్ ఇల్లా, అన్నాడు “నూతనవధువు-ఆమె ఒకపౌరురాలు అయింది భర్తఫ్రాట్రీలో సభ్యురాలుగా చేర్చుకోబడుతుంది” గ్రీకు, లాటిన్ తెగలలో ప్రత్యేకతరహా మతకర్మలు జరపబడు తుండేవి రోమనులలోలాగే వీరిలోనూ భార్య వివాహంతో తన గణసంబంధమయిన హక్కులను కోల్పోతుందేమో తెలియదు వివాహం జరగడంతో ఆమెకు తనగణంతో సర్వసంబంధాలూ తెగిపోతా యనుకోను ఆమె ఇంకా తండ్రిగణానికి చెందినట్లే పరిగణించబడవచ్చు

ప్రాచీనకాలంలో గణంలో అంతర్వివాహం నిషిద్ధం పురుష పారంపర్యం ఏర్పడినాక కూడా అది కొనసాగి వుంటుంది ఆస్తి వారసురాళ్ళకి, అనాథలకి మినహాయింపు పెట్టేరనుకోండి రక్తసంబంధం కొంత దూరం అయ్యేక వివాహానికి స్వేచ్ఛనివ్వడం దంపతీ వివాహానికి దారితీస్తుంది సామాజికవ్యవస్థకు గణం యూనిటుగా వున్నంతకాలం గణానికి వెలుపలనే వివాహం జరగాలనే నిబంధన వుంటుంది ఆస్తి వారసత్వం సందర్భంలో మినహాయింపు పెట్టడం ఈ వూహకు

బలకరంగావుంది "అతి స్వల్పపరిమితులతో తప్ప బంధుత్వం వివాహానికి ప్రతిబంధకం పూర్వపురుషుల (anchisteia), రక్తసంబంధాల (sungneia) కలయికలు అన్నింటా, — అవి సహజంగా గణంలోపలనే కాకపోవచ్చు - వివాహాలు జరగక పోవచ్చును"—అన్నారు బెకర్

## గణంలోకి పైవారిని దత్తు చేసుకొనే హక్కు

కనీసం కుటుంబాలలోకి ఈ హక్కు చాలా ఆలస్యంగా అమలులోకి వచ్చింది. అయితే దానికి బోలెడంత తతంగంవుంది ప్రత్యేక సందర్భాలకు మాత్రమే ఇది పరిమితమని చెప్పనక్కర్లేదు 'అట్టిక' గణాలలో వంశక్రమం శుద్ధంగా వుండాలనే పట్టుదల బాగగట్టిగా వుండి ఏవన్నా ప్రత్యేక కారణాలు వుంటే తప్ప దత్తతకు ఒప్పుకొనేవారు కాదు

## నాయకుల్ని ఎన్నుకొనేందుకూ, తొలగించేందుకూ హక్కు

మొదటి రోజుల్లో గ్రీకుగణాలలో ఈ హక్కు వుండేది సందేహమేమీ లేదు అనాగరిక యుగం ఎగువదశలోకూడా వారిలో ఆ హక్కు అమలుజరుగుతున్నదను కోవచ్చు ప్రతిగణానికీ ఒక అర్కన్ వుండేవాడు నాయకుడికది సామాన్యంగా వాడే పేరు హోమరుకాలం నాటికి ఆ పదవికి ఎన్నికలు జరిగేవా, వంశపారంపర్యంగా పెద్ద కొడుక్కి సంక్రమించేదా చెప్పడంకష్టం పురాతనకాలంలో వారసత్వం సమస్య లేదు గణసభ్యులందరి స్వాతంత్ర్యానికీ, వ్యక్తిగత హక్కులకూ నష్టంకలిగించే ఇంతగొప్ప విప్లవకరమైన మార్పుజరగడమే ఆదిప్రారంభంనుంచీ లేదనడానికి సాక్ష్యం అనుచితమైన ప్రవర్తనకై తొలగించేహక్కుతో, ఒకరిని ఎన్నుకుని పదవినివ్వడానికి గణసభ్యులందరి బాధ్యతలనూ వప్పచెప్పి, వారందరిమీదా పెత్తనంచేయగల వంశపారంపర్యపు హక్కుగల పదవికి చాలతేడా వుంది సొలోన్, క్లీస్తెనెస్‌ల కాలంవరకూ అథీనియన్‌గణాలలోవుండిన స్వేచ్ఛోత్తేజం ఈవ్యూహము నిరాకరిస్తుంది గణసభ్యులందరి హక్కులకి వంశపారంపర్యపుహక్కు నష్టకరం ఈ పదవికి సంబంధించిన నియమ నిబంధనల గురించి నాకు సంతృప్తికరమైన సమాధానం దొరకలేదు వంశపారంపర్యపు హక్కుగనక వుండినట్లయితే ప్రాచీనసమాజంలో కులీనవర్గం ఒకటి వుండిందనాలి అది ఆశ్చర్యమే గణనిర్మాణంలోని ప్రజాతంత్రాన్ని అది నిరాకరిస్తుంది అది

ప్రవేశించిందంటే గణాలు శిథిలమవుతున్నాయనడానికి గుర్తు గణసభ్యులంతా సమానులు స్వతంత్రులు ధనికులకు, పేదలకు హక్కులూ, సౌకర్యాలూ సమానమే ఆ సమానతను అందరూ రెండోవారికి అంగీకరిస్తారు ఇరాక్వాగణాలలోలాగే ఎథీనియను గణాలలోకూడ స్వాతంత్ర్యం, సమానత్వం, సోదరభావం స్పష్టంగా అంగీకరించబడడం చూస్తాం సమానహక్కులు, సమానసౌకర్యాలు అనే ప్రాచీన సిద్ధాంతానికి గణంలోని ప్రధానమైన పదవికి వంశపారంపర్య వారసత్వానికి ఏ మాత్రం పొత్తు కుదరదు

అనక్స్, కాయ్‌రానోస్ బాసిలస్‌వంటి వున్నతపదవులు తండ్రినుంచి కొడుక్కు వారసత్వంగా వచ్చేవా, ఎన్నికజరగడమూ, అంతకన్నా విస్తృతమైన నియోజకవర్గం వానిని స్థిరపరచడమూ జరిగేదా అనేదికూడా ఒక ప్రశ్నే దానిని మరోచోట చర్చిస్తాను ఎన్నిక అనేది గణనియమాలను కొనసాగించడం వారసత్వం వానిని భగ్నపరచడం ఖండితమైన ఆధారాలు వుంటేతప్ప పదవి వారసత్వం ఒప్పుకోకూడదు రోమను గణాల చర్చలో దీనిగురించి అదనపుసమాచారం లభిస్తుంది ఈ పదవికి సంబంధించిన నిబంధనలను జాగ్రత్తగా పరిశీలిస్తే, ఇంతవరకు అందిన సమాచారాన్ని సవరించుకోవలసి వస్తుంది.

పైనచెప్పిన పదిలక్షణాలూ గ్రీకుగణాలకు వున్నట్లు బాగానే రుజువుఅయింది మూడుమాత్రం - పురుషపారంపర్యం, ఆస్తివారసురాండ్రను గణంలో పెళ్ళి చేసుకోనీయడం, ఉన్నతసైన్యాధ్యక్ష పదవిని వారసత్వంరీత్యా అందచేసేహక్కు - ఇవిమాత్రం ఇరాక్వాగణాలలో కొద్దిమార్పులతో కనిపిస్తున్నాయి దీనినిబట్టి ఒకటి తేలుతుంది ఇరాక్వాలలోనూ, గ్రీకులలోనూ వున్న గణాలు ఒకేమాదిరి మూలనిర్మాణాలు అయితే ఒకరిలో అది ఆద్యరూపంలో వుంటే వేరొకరిలో పరిణతరూపంలో వున్నాయి

మళ్ళీ వెనక్కి వెళదాం గ్రోటేకు ఆద్యరూపంలోని గణంతో పరిచయం వుండినా, దంపతీవివాహానికి పూర్వంవున్న అనేకరూపాల కుటుంబాలను ఎరిగివున్నా, ఆయన తిపత్రింలో కొంతభాగాన్ని తప్పకసవరించుకొని వుండేవారు గ్రీకుల సామాజిక వ్యవస్థకు పునాది "ఇల్లు, పొయ్యి, కుటుంబము" అన్న ఆయనవాక్యానికి అభ్యంతరం చెప్పాలి ఆ ప్రముఖ చరిత్రకారుని మనస్సులోవున్నది, పట్టణాలలోని కొంటీలలో ఏర్పడిన రోమనుకుటుంబం అయివుంటుంది ఆ పట్టణాలకు కుటుంబంమీద ఏమాత్రం ఆసక్తి వుండదు అదేవిధంగా జాతితెగలను, తెగలుఫ్రాట్రీలను, ఫ్రాట్రీలు గణాలను

గుర్తిస్తాయి కాని గణం కుటుంబాన్నిగుర్తించదు సమాజాన్ని గురించి పరిశీలించే టప్పుడు నిర్మాణ సంబంధాలను మాత్రమే పరిగణిస్తారు గణసమాజానికిగణం ఎటువంటిదో, రాజకీయ సమాజానికి పట్టణం అటువంటిది అవిరెండూ ఆయా సమాజాలకు మూల యూనిట్లు

గ్రీకుగణాలనుగురించి గ్రోటే చాలఅమూల్యమూలైన సంగతులుచెప్పేరు ఆ గణాలను వివరించడానికి నేను ఆయన చెప్పిన వానినే ఉపయోగించదలచాను అనాదున్న పురాణగాథలలోని, పూర్వ పురుషులకు జన్మదాతలని చెప్పే దేవతల తోడివే ఈ గణాలూను- అన్నట్లుంటాయి ఆయన మాటలు కాని, వారుచెప్పినఘటనల్ని పట్టి చూస్తేనే గణాలు పుట్టిన చాలకాలం తర్వాతనే ఈకథలు వచ్చేయని తెలుస్తూంది జూపిటరు, నెప్ట్యూను మార్సు వీనసులు మానవుని మెదడులో ప్రవేశించక పూర్వమే గణాలున్నాయి

"ఆత్తికొ ప్రజల మత పాంఘిక వ్యవస్థ ప్రాచీన రూపంనుంచి క్రమోత్తరంగా పురోగమిస్తూ వుండింది వారి రాజకీయ ఐక్యత దాని కన్న భిన్నం బహూశా అది తర్వాత తర్వాత వచ్చివుంటుంది మొదటి ట్రిట్యేలూ, నౌక్రారీలు వచ్చివుంటాయి తర్వాత ట్రిట్యేలూ, డెమోలుగా విభజింపబడి, క్లిస్తెనియన్ తెగలు పదీ వచ్చి వుంటాయి వీనిలో మత, కుటుంబ సంబంధమైన కూటమి మొదటవచ్చినది తర్వాత వచ్చినదే అయినా రాజకీయ బంధం దాని చరిత్ర అత్యధిక భాగంలో నిరంతరాయంగా క్రమాధికమైన వలకుబడిని సంపాదిస్తూ కనిపిస్తుంది మొదటి దాంట్లో ముఖాముఖి వ్యక్తుల మధ్య అనుబంధం ముఖ్యం ప్రముఖలక్షణం అది ప్రాదేశికబంధం దాని తర్వాతది రెండో దాంట్లో ఆస్తి నివాసప్రదేశాలు ప్రధమగణ్యాలు వీనిని పట్టి మాత్రమే వ్యక్తిసంబంధాలు పరిగణన పెద్దవయినా, చిన్నవే అయినా ఈ ప్రాత్రీ గణనిర్మాణాలు ఒకే విధమైన నియమనిబంధనలతో, గ్రీకుల మానసిక ధోరణుల నుంచి పుట్టినవే. దేవతలకొలుపు, పెద్దల పూజల సమ్మేళనంగా, ప్రత్యేక మతకర్మల, రక్తసంబంధాల సమ్మేళనంగా ఏర్పడినవే ఆరక్తబంధాలు నిజమైనవీ కావచ్చు ఊహాత్మకమూ కావచ్చు ఆ విధంగా చేరిన జనం నివేదనలు సమర్పించే ఆ దేవుళ్లో, వీర పురుషుడో- కుటుంబానికి మూల పురుషుడనే కఠోరనియమం ఏర్పడింది హోమరు కాలంనాటి గ్రీకు కుటుంబంమీద తండ్రికిచ్చిన పెత్తం దనం దానితో సమానమైనదే ఇతర, ప్రాచీన కుటుంబరూపాలలో ఇల్లా జరగడం సాధ్యంకాదు. మౌలికంగా, దంపతీకుటుంబం కన్న గణం ప్రాచీనం. జంటకుటుంబంకన్నా ముందుదే. బహూశా

ప్యునలాన్‌కుటుంబానికి సమకాలీనం అయివుండే అవకాశం వుంది ఇందులో ఏకుటుంబం మీదనో ఆధారపడి ఏర్పడినది కాదు గణం ఏ రూపంలో వున్నా కుటుంబాన్ని తనలో భాగాన్నిగా గుర్తించదు పైగా ప్రాచీనకాలపుకుటుంబమూ, తర్వాత కాలపుదీ కూడ కొంతగణంలోపలా, కొంత వెలుపలానే వుంటున్నాయి దాని కారణం భార్యాభర్తలిద్దరూ చెరోగణానికీ చెందినవారు కావడమే గణం స్థిరంగా వుండేదీ, సమాజ వ్యవస్థకు మూలయూనిటూను, కుటుంబం అల్లాకాదు గణంతో సంబంధం లేకుండా కుటుంబం పుడుతుంది దిగువదశనుంచి ఉన్నత రూపానికి పెరిగే స్వాతంత్రం దానికుంది. గణం తాను మొత్తంగా ఫ్రాట్రీలో చేరుతుంది ఫ్రాట్రీమొత్తంగా తెగలో, తెగ మొత్తంగా జాతిలో చేరిపోతాయి భార్యాభర్తలిద్దరూ చెరోగణానికి చెందినవారు అయివుండాలి గనక కుటుంబం మొత్తంగా గణంలో చేరలేదు

ఇది చాలముఖ్యమైన విషయం గ్రీకు రోమను వ్యవస్థలలో సమాజం పితృస్వామికకుటుంబం మాదిరి దంపతీ కుటుంబాన్ని పొదవుకొని సమ్మిళితం అయిందా అనే ప్రశ్నకు గ్రోటేయే కాదు నీబుర్, తిరల్‌వాల్, మైనే, మోమ్‌సెన్‌వంటి నితపరిశీలకులు పై అభిప్రాయానికే వచ్చేరు ఏరూపంలోవున్నా కుటుంబం గణంలో ప్రవేశించలేదు కనక దానిమీద ఆధారపడి గణం ఏకీ వుండదు గణం సమగ్రమైనది చాలవరకు సుస్థిరంగా మన్నగలది అందుచేత సమాజ వ్యవస్థకు అది సహజమైన పునాది దంపతీ తరహా కుటుంబం స్వతంత్ర స్థితిపొంది గణంలోనూ సమాజంలోనూ మంచి బలాన్ని పొందితే పొందవచ్చును కాని, గణం దాన్ని కేంద్రంగా ఎప్పుడూ గుర్తించదు దానిమీద ఆధారపడదు ఆధునిక కుటుంబమూ, రాజకీయ సమాజమూ విషయంలో కూడా ఇదేపరిస్థితి ఆస్తిహక్కులు, సౌలభ్యాలతో వ్యక్తిత్వం సంపాదించినా, చట్టంరీత్యా గుర్తించబడినప్పటికీ రాజకీయ వ్యవస్థకి కుటుంబం మూలయూనిటు కాదు కుటుంబం తనకు పూర్వపురుషుడమకొనే వానివి రాజ్యంగుర్తిస్తుంది ఇంతక్రితం తరచుగా వుదాహరించిన మిలేషియన్ హెకటేయస్ సందర్భంలో మాదిరిగా అపూర్వపురుషుడికీ ఇప్పటికీ మధ్యన అనేక పేర్లపట్టీని, ఎంత దీర్ఘమైన దానినైనా గుర్తించవచ్చు ప్రతి కుటుంబానికి వారివారిపవిత్ర కర్మకాండలుంటాయి. పితృదేవతల సంస్మరణదినా లుంటాయి ఆ గృహయజమాని వానికి కర్త కుటుంబ సభ్యులకు మాత్రమే అక్కడ ప్రవేశం పెద్దపెద్ద ప్రజాకూటాలు అయిన గణము, ఫ్రాట్రీ, తెగ ఇదే సూత్రం మీద ఏర్పడ్డాయి అయితే అక్కడ ఆ సూత్రానికి విస్తృతి వుంది. ఒకే మతానికి చెందిన సోదరసమూహంగా ఒకే దేవుణ్ణో, వీరుణ్ణో, ఆరా

దిస్తూ దానికి తగిన ఇంటిపేరుతో, తమందరి పూర్వపురుషుణ్ణిగా స్వీకరిస్తారు థియోవియా పండుగ (అట్టిక్‌గణాలది) అపటూరియా పండుగ (ఇయోనియనుజాతిఅందరిదీ) లకు ఏటా ఈ ఫ్రాట్రీల జనం ఒకచోట చేరి, పూజలుచేస్తారు. పండుగ చేసుకుంటారు. ప్రత్యేకించి తీర్థాలు ఏర్పాటుచేసుకుంటారు చిన్నవానికి నష్టంకలగకుండా ఆ విధంగా విస్తృతబంధాలను పెంచుకుంటారు ప్రథమదినాల పరిస్థితులేమిటో ఈ సాక్షులంతా చెప్పేరు గణ, ఫ్రాట్రీ కూటాలు ఆ ప్రథమదినాల నాటివి, వానివిచారణతో లోతుగా తెలుసుకోగలగడం సాధ్యంకాదు ఈ స్థితిని చరిత్రకారులు స్వీకరించవలసిందే"

"ఏథెన్సులోను, గ్రీసులోని ఇతర స్థలాలలోను వున్న గణ సభ్యులు తమ పైత్రుక నామాన్ని వుపయోగిస్తారు అది తమందరి పిత ఒకదేవని నమ్ముతునట్లు ఉత్త గ్రీసుదేశం అనేక ప్రాంతాలలో అస్క్లెపియాదోలు కనిపిస్తారు థెస్సాలీలో అలెయూదేలు, ఏజినాలో మిడిలైదేలు, పాలిచిదేలు, బ్లెప్సియాదేలు, యూఖెనిదేలు మిలెటస్‌లో బ్రాంచియాదేలు, కోస్‌లో నెబ్రియాదెలు ఒలింపియాలో, ఇయామిదే, క్లిటియాదేలు అర్గోస్‌లో అకెస్టోరిదేలు సైప్రెస్‌లో కినిరాదేలు మిటిలెనేలో పెంథిలిదెలు స్పార్టాలో టాల్తిబియాదేలు అత్తికాలో కోడ్రియాదే, యూమోల్పిదే, ఫిటాలిదే, పైకోఫైదో, బుటాదే, యూనీడే, హెసిచిదే, బ్రిటియాదే, మొదలయిన ఇంటిపేర్లు కనిపిస్తున్నాయి ఒక పురాణపురుషుడుగా కోడ్రుస్, యూమోల్పస్, బూటెస్, ఫిటాలస్, హెసిచుస్ మొదలయిన గణాలకు మొట్టమొదటి తండ్రిగా, గణానికి పేరు ఇచ్చిన వీరుడుగా వీరందరికీ పరిగణన వుంది" కాని, క్లీస్థెనెస్ తిరుగుబాటు అనంతరం ఏథెన్సులో గణనామాన్ని చేర్చుకోవడం మానివేశారు ప్రతివారికీ వారి స్వంత పేరు, తండ్రి పేరు తరువాత అతడు నివశించే గ్రామంపేరు— ఐషినెస్, అట్రోమెటస్ కొడుకు, కొథోకిద్ నివాసి లాగ- వుపయోగిస్తున్నారు . మనుష్యులను లాగే ఆస్తులను కూడా గణం దగ్గరగా పట్టి వుంచుతుంది సొలోన్ కాలంవరకూ ఎవ్వరికీ వీలునామా వ్రాసే అధికారం లేదు అతడు నిస్సంతుగా చనిపోతే అతని ఆస్తికి గణ సభ్యులు వారసులు సొలోన్‌తర్వాత కూడా వీలునామా రాయకుండా మరణించినవారి ఆస్తి విషయంలో అదే జరిగింది అనాథ బాలికను గణసభ్యులు ఎవ్వరైనా కోరి వివాహమాడే హక్కువుంటుంది అయితే దగ్గరబంధువులకి ప్రథమ గణ్యత ఇచ్చేవారు ఆ పిల్ల ఆస్తిలేని దయితే ఆ దగ్గరబంధువు ఆమెను పెళ్ళి చేసుకోడానికి ఇష్టపడకపోతే, అతడు తన ఆస్తిని పట్టి ఆమెకు కట్నం ఇచ్చి వేరొకరికి పెళ్ళి చెయ్యాలని సొలోన్ చట్టం విధిస్తుంది ఎవరన్నా హత్యకు గురి అయితే, ప్రప్రథ

మంగా అతని దగ్గిర బంధువులు, తరవాతనే గణంవారు, ఫ్రాట్రీ వారూ ఆ కేసును న్యాయస్థానంలో పెట్టాలి కాని, అతడున్న గ్రామవాసులకు కేసుపెట్టే అధికారంలేదు ప్రాచీన అధీనియన్ చట్టాలు మనకు తెలిసినంత వరకు గణాలు, ఫ్రాట్రీల విభజనలు ఆధారంగా చేయబడ్డాయి కాని పొడూగునా వాటిని కుటుంబాల విస్తరణలనుగానే పరిగణించడం కనబడుతూంది అస్తులను పట్టి, ఈ విభజనలు జరగవు ధనికుడైనా, పేద అయినా ఒకే గణంలో వారుగా గుర్తించబడతారు కాని వేరు వేరు గణాలమధ్య హోదాల్లోతేడాలున్నాయి ఆయాగణాలు పారంపర్యంగా, వారు మాత్రమే పాల్గొనే మత సంబంధమైన కర్మకాండలను పట్టి ఈ హోదాలు నిర్ణయించబడతాయి కొన్ని కర్మకాండలకు మొత్తం పట్టణంలోనే ప్రాముఖ్యం వుంటుంది ఆవిధంగా అవి జాతి మొత్తానివిగా గణించబడతాయి ఎలూస్నియన్ వ్యవసాయ దేవత అయిన డెమిటెర్ యొక్క మహాత్మ్యాలను వివరించి జోస్యాలుచెప్పే పురోహితుడిని సమకూర్చే యూమోల్పిదే, కెరికేలకు, అథెనీ పట్టణ పురోహితురాలినీ, అక్రోపొలిస్‌లో పోసిడాన్ ఎరక్తియస్‌కు పూజారినీ సమకూర్చిన బుటాదేకు ఇతరగణాలకన్న ఎక్కువ గౌరవం వుండడం కనిపిస్తూంది

కుటుంబం విస్తరించి గణం అయిందంటారు గ్రోటే అంటే గణంకన్న కుటుంబమే ముందున్నదని కుటుంబం ప్రథమం గణం తదనంతరపుది- అని అర్థం ఇంతకుముందే కారణాలు చెప్పేను ఈ వాదాన్ని అంగీకరించలేము ఈ రెండు సంస్థలకు నియమాలు వేరు. రెండూ దేనికది వేరు ఉమ్మడిపూర్వ పురుషుని పారంపర్యంలో ఒక భాగాన్ని తాను తెచ్చుకుని మిగిలిన వారిని వెలిపెడుతుంది గణం కుటుంబంలోంచి కూడా ఒక భాగాన్ని తీసుకుని రెండోభాగాన్ని వెలిపెడుతుంది కుటుంబం గణంలో భాగం కావాలంటే అది మొత్తంగా అందులో చేరగలగాలి ప్రాచీన దశలో అది అసంభవం తరవాత తరవాత ఆ విధంగా కూర్చిపెట్టేరు గణ సమాజంలో గణం ప్రారంభకం ఆ వ్యవస్థకు అది పునాది, మూలయూనిటూను కుటుంబం కూడా ప్రారంభకమే అది గణంకన్న ప్రాచీనం పునలాన్ కుటుంబమూ, రక్తసంబంధీకుల కుటుంబమూ దానికి ముందు, అదే క్రమంలో ప్రాచీనం కాని ప్రాచీన సమాజంలోగాని, ఆధునిక సమాజంలోగాని నిర్మాణక్రమ సంస్థలలో దానికి స్థానంలేదు.

ఆర్యను కుటుంబానికి చెందిన లాటిన్, గ్రీకు, సంస్కృతం మాట్లాడే ప్రజలు ఒకటిగా కలిసివున్నప్పుడే వారిలో గణంవుంది వారి మాండలికాలలో ఆ సంస్థ పేరు

ఒకే తీరుగనే వుండడం- జెన్స్, జెనోస్, గనస్- దీనికి సాక్ష్యం వారి పూర్వులయిన అనాగరికులనుంచీ, ఇంకా అంతకు పూర్వంనాటి అటవికులనుంచీ వారికది సంక్రమించింది ఆర్యను కుటుంబం అనాగరిక యుగం మధ్యదశలో చీలిపోయినట్లు తోస్తుంది అప్పటికి వారిలోవున్నది ప్రాచీన గణరూపమే అటు తర్వాతనే, ఈ తెగలు ఒకదాని నుంచి ఒకటి విడబడిన కాలానికీ, నాగరికత ఆరంభానికీ మధ్య గడచిన సుదీర్ఘ కాలంలోనే గణ నిర్మాణంలో కనిపించిన మార్పులు వచ్చేయనుకోవాలి గణం తన ప్రాచీన రూపంలో తప్ప ప్రారంభం కావడానికి అవకాశంలేదు కనక గ్రీకు గణాలు కూడా ప్రారంభంలో ఈమాదిరివే అయివుండాలి గణంలో స్త్రీ పారంపర్యంస్థానే పురుష పారంపర్యంవంటి గొప్పమార్పు ఎందుకు వచ్చిందో బలమైన కారణాలు కనక దొరికితే ఆవాదం సమగ్రం అవుతుంది ఈ గొప్పమార్పు గణంలో పాతరక్త బంధువులస్థానే కొత్తవారిని నిలబెట్టింది ఆస్తికావన వృద్ధిపొందడం, దంపతీకుటుంబ వ్యవస్థ ఏర్పడడంతో సంతానాన్ని తండ్రిగణంలోకి తీసుకురావడానికీ, వారు తండ్రి ఆస్తికి వారసులు కావడానికీ గాను ఈ మార్పును గట్టిగా కోరి అమలు జరపడానికై బలమైన కారణాలు తయారయాయి గణాలు ఏర్పడినప్పుడు పిల్లల తండ్రి ఎవరో తెలియనిస్థితి వుంది దంపతీ వివాహవ్యవస్థతో పిల్లల తండ్రి గురించిన అనుమానత తొలగింది. అందుచేత పిల్లలకు ఆస్తి దక్కకుండా దూరంగా వుంచేపని ఇంకలేదు ఈ నూతన పరిస్థితులలో గణ నిర్మాణం మారాలి లేదా అది అంతరించి పోవాలి అనాగరిక యుగం దిగువదశనాటి ఇరాక్వ్యూగణాన్నీ అనాగరిక యుగం ఎగువదశనాటి గ్రీకు గణాన్నీ పక్కపక్కన నిలబెడితే అవి రెండూ ఒకటైననీ, ఒకటి ప్రాచీన రూపంలోవుంటే, రెండోది దాని ఉన్నత రూపంలో వున్నదనీ గుర్తించలేక పోవడం అసంభవం మానవ పురోగతి ఫలితంగా గణంలో తప్పనిసరిగా వచ్చిన మార్పులే ఆ రెండింటి మధ్య వున్న తేడాలు.

గణ నిర్మాణంలో వచ్చిన ఈ మార్పులు మనకి వారసత్వనిబంధనలలో వచ్చిన మార్పులతో సునిసుంగా కనిపిస్తాయి ఆస్తికి ఎప్పుడూ గణంలోనే వారసత్వం వుండేది మొదట తర్వాత గణంలో అందరికీగాక మగవాని తరఫువారికి వెళ్ళేది అటు తర్వాత అతి దగ్గర వాళ్ళుగా కొడుకులకు వచ్చింది సొలోన్ వరకు ఆస్తిగణంలోనేవుండాలనే నియమమే వుంది దానినిబట్టి గణ సంస్థ జీవశక్తి అర్థం అవుతుంది. ఆస్తి గణం దాటి పోగూడదనే ఆస్తివారసురాలు గణంలోపలనే వివాహమాడవలెననే మార్పును తెచ్చిపెట్టింది. పిల్లలు లేనివారు తన ఆస్తిని తన ఇష్టాను సారం ఇవ్వ

వచ్చునని సోలోన్ అనుమతించేరు ఇది గణంలోని ఆస్తిహక్కులలో తెచ్చిన మొదటి మార్పు

గణ సభ్యులందరూ బంధువులేనా? ఆబంధుత్వం ఏ పాటిది అనే ప్రశ్న వచ్చింది "ఏథెన్సులో గణసభ్యుల మధ్య రక్తబంధుత్వం ఏమీ లేదని పోలక్స్ స్పష్టంగా చెప్తున్నారు—" అన్నారు గ్రోటే దీనికి పెద్ద సాక్ష్యంకూడా అక్కర్లేదు ఏనాడో అవి ఏర్పడినప్పుడు గణాలు నిజమైన బంధుత్వం మీదనే ఏర్పడ్డాయా అంటే కూడ చెప్పడానికి ఆధారాలులేవు అథీనియను గణాల విషయమూ అంతే వాటిని పోలివుండే రోమనుగణాల విషయమూ అంతే గణసభ్యత్వం అనేది ఒక అనుబంధం అంతే కుటుంబబంధాలకు అదిభిన్నం అయితే అటువంటిబంధాలకు అది ఒకసూచిక కొంత వరకు మతవిశ్వాసాలమీదా, కొంతవరకు సామూహిక దగ్గర తనంమీదా ఏర్పడి పరాయివారిని రక్తబంధువుల్నిగా వూహించుకొనేందుకై కృత్రిమమైన పోలి కల్పి తెస్తూంది గణసభ్యులూ, ఫ్రాట్రీ సభ్యులూ అందరూ తమతాతా, ముత్తాతా ఒకడేనని చెప్పుకోరు. ఒక దైవమునుంచో, వీరపురుషునుంచో వచ్చేమని మాత్రం చెప్పుకుంటారు ఈ మూల విశ్వాసం అతిసున్నితంగా గ్రీకుల మనస్సుల్ని పట్టేసింది కలిసి వుండడంతో దానిని స్వీకరించి, గణంలోనూ ఫ్రాట్రీలోనూ సమైక్యతకు ఒక సూత్రంగా మార్చబడింది ప్రాచీన రోమను గణాలను గురించి చర్చిస్తూ నీబుర్ అవన్నీ నిజంగా కుటుంబాలు కాదనీ, ఒకే చారిత్రకపూర్వపురుషుడి సంతానం కాదనీ చాలవిలువైన మాటఅన్నారు కాని, తమకందరికీ ఆదిపిత ఒకడేనన్న విశ్వాసాన్ని గణం కలిగించింది ఆ పిత ఓ దేవతా, వీరపురుషుడా అన్నది ముఖ్యంకాదు. ఆ వంశ వృక్షం మహాద్భుత మనిపిస్తుంది కాని గణ సభ్యులంతా పరమపవిత్రంగా స్వీక రిస్తారు అది వారి మధ్య అతిముఖ్యమయిన అనుబంధంగా పనిచేస్తూంది సహజమైన కుటుంబాలు తరంతరానికీ మారుతూ వచ్చేయి కొన్ని విస్తరించేయి, కొన్ని కుంచిం చుకుపోయి అంతరించేయి ఈ కుటుంబాలు విస్తరించడం, అంతరించడం, విడబడడం ద్వారా తప్ప గణంలో మార్పులు ఏమీలేవు తమతో వస్తున్న మార్పుల్నిపట్టి గణా లకీ, కుటుంబాలకీ మధ్య సంబంధాలు నిరంతరం మారుతూనే వున్నాయి గణాల ప్రారంభదినాల పరిస్థితులకు నిస్సందేహంగా సరిపడివున్నా ఆ గణ వంశవృక్షం కాల క్రమేణా కొంతవరకు పాతబడి, అనువుకాకుండా అయింది ఏవోకొన్ని సందర్భాలలో అవసరంగా గౌరవనీయంగా భావించి ఈవంశవృక్షాన్ని ప్రజలముందు గుర్తుచేస్తుంటారే

గాని దానిమాట సాధారణంగా వినిపించనే వినిపించదు చిన్నగణాలకీ పెద్దగణాలకీ లాగే అతిమానవ పురాణపురుషుడు ఒకడువుండడమూ, ఓ వంశవృక్షమూ, కర్మకాండలూ వున్నాయి అన్నింటిలో జరుగుతున్నదీ, దానికి పునాదీ కూడ ఒక్కటే ”

పోలక్స్ పీబుర్, గ్రోటే చెప్తున్నవన్నీ కొంతవరకేగాని, పూర్తిగా సరికాదు. గణంయొక్క వంశవృక్షం ఒక పూర్వపురుషునివరకూ వెనక్కి దొరుకుతుంది కాని గణం పుట్టిన నాటి మూటస్థుణ్ణో, పూర్వీకుణ్ణో పట్టుకోడం సాధ్యంకాదు వారి బంధుత్వ వ్యవస్థద్వారా వారిలో రక్తసంబంధాన్ని నిరూపించడమూ సాధ్యంకాదు కాని, గణసభ్యులు తమ పూర్వపురుషుడు ఒకడేనని నమ్మేరు, ఆ నమ్మడంలో ఆశ్చర్యంలేదు అతి ప్రాచీన రూపంలో వున్న గణంలో పాటిస్తూండిన బంధుత్వ వ్యవస్థ గణసభ్యులందరూ ఒకరికొకరు బంధువులనే పరిజ్ఞానాన్ని కలిగించింది గ్రీకులలోకూడ ఒకప్పుడది వుండేది దంపతీకుటుంబం రాకతో ఇది వాడకంలోంచి పోయింది ఈవిషయాన్ని మరోచోట చెప్తా గణనామం ఒక కులీనతను ఇచ్చింది దాని ముందర కుటుంబ నామానికి విలువలేదు ఆ పేరుగల వారంతా ఒకే పూర్వీకుడి నుంచి వచ్చేరనే అభిప్రాయాన్ని కాపాడడమే ఈ గణనామం సార్థకత కాని గణ వంశ వృక్షమూలం అతి ప్రాచీనం కావడంచేత తమమధ్యనున్న బాంధవ్యం ఎటువంటిదో గణసభ్యులు చెప్పలేరు ఇటీవలి కాలపు పూర్వపురుషుడి నుంచి వచ్చిన కొద్దిమంది ఇందుకు మినహాయింపు వారంతా ఒకేపూర్వపురుషుని సంతానం అనడానికి ఆ పేరే సాక్ష్యం మధ్య పరాయివారిని దత్తతద్వారా తెచ్చుకోవడంచేత కొంత చెదిరిపోయినా, గణ సభ్యుల మధ్య ఏ బంధుత్వమూ లేదని పోలక్స్, పీబుర్‌లు ఖండితంగా చెప్పడం సరికాదు గణంలో చాలమంది తమ ఇటీవలి పూర్వీకునుంచి తమ బంధుత్వాలను చెప్పుకోగలరు మిగిలిన వారి విషయంలో తామంతా ఒకే పూర్వ పురుషుడినుంచి వచ్చేమని చెప్పుకోడానికి గణంపేరు చాలు గ్రీకు గణాలలో సాధారణంగా సంఖ్య తక్కువ గణానికో ముప్పయి కుటుంబాలుంటాయి జనాభా లెక్కల సూత్రం ప్రకారం గణంలో మాట అరవై మంది వుంటారు కుటుంబ పెద్దల భార్యలను లెక్కలోకి తీసుకోకూడదు

సమాజ నిర్మాణ వ్యవస్థకు గణం మూలయూనిటుగనక సామాజిక జీవితానికీ, కార్యకలాపాలకూ అది కేంద్రంగా వుంటుంది అనేక సామాజిక కూటం దానినాయకుడు అర్కాన్ ఆయనే కోశాధికారి కూడా కొంతవరకు ఉమ్మడి భూములుంటాయి. ఉమ్మడిగా శ్మశానం వుంటుంది మతకర్మకాండ ఉమ్మడిది ఇవిగాక గణం తనసభ్యు

అందరికీ హక్కులు, సౌకర్యాలు, బాధ్యతలు, వచ్చిపెట్టింది. గ్రీకుల పరకార్యకలాపాలు మొదటిగణాలలోనే ప్రారంభమయ్యి, తర్వాత ఫ్రాట్రీకి పాకినాయి. తర్వాత తెగ అన్నింటికీ సంబంధించిన సంఘంగాయిగా మారేయి.

"దే కౌలాంగ్" వ్రాసిన ఏన్సెంట్ సిటీలో ఈ విషయాన్ని ఎంతో చక్కగా వివరించేరు.

రాజ్యం ఏర్పడకపూర్వం గ్రీకుల సమాజ పరిస్థితులను తెలుసుకోవాలంటే గ్రీకుగణాల నిర్మాణసూత్రాలనూ నియమాలనూ తెలుసుకోవడం ముఖ్యం. ఈయూనిట్ల యొక్క లక్షణాలే అవి అంతర్భాగంగా చేసి ఏర్పడిన ఉన్నతసంస్థల లక్షణాలను నిర్ధారణచేస్తాయి. వాటిని వివరించడానికి సాధనం అవుతాయి.

# తొమ్మిదో ప్రకరణం

# గ్రీకుల ఫ్రాట్రీ, తెగ, జాతి.

అథీనియను ఫ్రాట్రీ - ఎలా ఏర్పడింది డికెయార్కస్ వివరణ - ఉద్దేశ్యాలు ముఖ్యంగా మతసంబంధమైనవి - గృహపిత - తెగ - దానిలో మూడుతెగలు - ఫైలే - బాసిలస్ - జాతి - నాలుగు తెగలున్నాయి - బౌలే లేక నాయకసమితి - అగోరా లేక ప్రజాసభ - బాసిలస్ పదవి విలంధవాలు— సైనిక, పురోహిత బాధ్యతలు - పౌరబాధ్యతలు చూపలేదు - వీరయుగంనాటి ప్రభుత్వాలు, సైనికప్రజాతంత్రాలు - బాసిలయస్ అరిస్టాటిల్ వివరణ - తర్వాతికాలపు అథీనియన ప్రజాతంత్రం - గణాలనుంచి తీసుకొన్నది - అథీనియన పురోగతిపై బలవత్తరమైన దాని ప్రభావం.

గ్రీకుల సామాజిక నిర్మాణాలలో ఫ్రాట్రీ రెండో మెట్టు. తమకందరికీ సమానం అయిన మతసంబంధ వ్యవహారాలకై అనేకగణాలు కలిసి ఏర్పరచుకొన్న సంస్థ అది. రక్తబాంధవ్యం దానికి పునాది. అందులోని గణాలన్నీ ఒకగణం విడిపడి ఏర్పడినవనే ఆ పరిజ్ఞానం వారిలో అనూచానంగా వస్తూవుంది. "హెకాటియస్ ఫ్రాట్రీలోని గణాలన్నిటికీ పదహారుతరాలకి పూర్వంనాటి ఆద్యుడు ఒక దేవుడున్నాడు." అని గ్రోటే వ్రాసేరు. ఒకగణం శాఖోపశాఖలుగా విడిపడి అవన్నీకలిసి హెకాటియస్ ఫ్రాట్రీగా ఏర్పడితేతప్ప ఒక పురుషుడు - దేవుడు వుండటం అసంభవం. ఈ వంశవృక్షం కొంతవరకు కట్టుకథే. అయినా గణంలోవున్న ఆచారాల్ని పట్టి అలా తియ్యవచ్చు. కొన్నిగణాలు పరస్పరం భార్యలను ఇచ్చిపుచ్చుకొనే ఆచారం, కొన్ని మతసంబంధమైన కార్యకలాపాలకై ఫ్రాట్రీగా ఏర్పడేందుకై దారితీసినవని డికెయర్కస్ వ్రాసేరు. ఈ వూహ కొంతవరకు వాస్తవం కావచ్చు. అటువంటి వివాహాలతో గణాలలో రక్తం సమ్మిశ్రం అవుతుంది. అందుకు వ్యతిరేకంగా గణం విడిపడి కాలక్రమంలో శాఖ ఉపశాఖ అవుతాయి వాటికన్నిటికి మూలం ఒక్కటే, అదే

అవన్నీ తిరిగి కలిసి ఫ్రాట్రీగా ఏర్పడడానికి కారణం అవుతుంది ఆ విధంగా ఫ్రాట్రీగా ఒక సహజ పరిణామం అదీ ఒక గణనిర్మాణమే ఆ విధంగా సమైక్యమయినవి సోదరగణాలు ఆ సంస్థ సోదరసంస్థ అది ఆ పేరుతోనే వుంది

గణాలు, ఫ్రాట్రీ, తెగల మూలం గురించి దికేర్కస్ వ్రాసిన నిర్వచనాన్ని బైజాంటియమ్ నివాసియైన స్టెఫానస్ జాగ్రత్త చేసేను అదీ పూర్తిగా లేదు రెంటినుంచి నిర్వచనమూ పూర్తిగాదు కాని ప్రాచీనగ్రీకు సమాజంలో మూడుదశలుగా నిర్మాణం వున్నట్లు దానిలో చెప్తూండడం ముఖ్యం అప్పుడప్పుడు హోమరు ఉపయోగించినట్లుగా అనేక సందర్భాలలో పిండార్, గణం బదులు ఫ్రాట్రీ అని వాడేరు "దికేర్కస్ చెప్పినట్లు గ్రీకులలో సామాజిక సమైక్యత మూడు రూపాలలో వుంది వానిలో ఫ్రాట్రీ ఒకటి ఆ మూడూ ఇవి పాట్రీ, ఫ్రాట్రీ, తెగ మొదట్లో ఒక్కచోటనే వుండే బంధుత్వం రెండోదశకు చేరి (తల్లిదండ్రులకూ పిల్లలతో, అలాగే పిల్లలకు తల్లిదండ్రులతో) పాట్రీ ఏర్పడుతుంది ఐసిడస్, పెలోపిడస్‌లాగ పాట్రీలోని బహుపురాతన ప్రముఖ సభ్యుని పేరుతో అది పిలవబడుతుంది"

"కాని, పాట్రీలోని కొందరు తమకూతుళ్ళను మరోపాట్రీలోని వారికి వివాహం చేయడం వలన ఫ్రాట్రీలేక పాట్రీ అనేపేరు వచ్చింది ఏమంటే వివాహిత స్త్రీ తన పైతృకమైన పవిత్రకర్మలలో పాల్గోదు ఆమెను భర్తయొక్క పాట్రీలోకి చేర్చేసుకుంటారు అంతక్రితం సోదరీసోదరుల ఆప్యాయంమీద ఏర్పడిన ఏకీభావం స్థానే ఉమ్మడి వ్రతకర్మకాండలపై ఏర్పడిన మరొక ఏకీభావం వచ్చింది దానిని ఫ్రాట్రీ అన్నారు ఇంతక్రితం చెప్పినట్లు తల్లిదండ్రులకూ పిల్లలకూ మధ్య వున్న రక్తబంధుత్వం నుంచి పాట్రీ పుట్టినట్లే సోదరుల మధ్యనున్న బంధుత్వంనుంచి ఫ్రాట్రీ పుట్టింది"

"కాని, జనసమూహాలు సమ్మిళితం అయి తెగలు, తెగలజనం అయారు తెగలనబడేవి కలిసి జాతులయేయి" ఇక్కడ ఒకటి గుర్తించాలి గణం వెలుపల వివాహం అనేది దీనిలో ఒకఆచారంగా గణించబడింది భార్య భర్త ఫ్రాట్రీలోగాక భర్తగణంలో చేర్చుకోబడింది అరిస్టాటిల్ శిష్యుడైన దికేర్కస్ కాలంనాటికి గణాలు వ్యక్తుల వంశంగానే వున్నాయి వాని అధికారాలు కొత్తరాజకీయ సంస్థలకు దఖలు పడ్డాయి గణాలు అతిప్రాచీనకాలంలోనే పుట్టినట్లు ఆయన చెప్పేరు కాని గణాలలోని వైవాహిక అలవాట్ల నుంచి ఫ్రాట్రీ పుట్టింది - అన్నారు ఆ అలవాట్లయితే వున్నాయి కాని, ఆ నిర్మాణానికి మూలం ఆ అలవాటేనన్నది ఆయన అభిప్రాయం ఉమ్మడిగా

జరిపే మతకర్మకాండలూ అంతర్వివాహాలూ ఫ్రాట్రీలో అనుబంధాన్ని పెంచుతాయి కాని, ఫ్రాట్రీలోని గణాలన్నింటి వంశవృక్షం ఒకటే అయివుండడం దాని పుట్టుకకు కారణం అవడం సబబు గణాల చరిత్ర అనాగరిక యుగం మూడుదశల గుండా వెనక్కి ఆటవిక యుగంలోకంటా వుంది అనాటికి ఆర్యను, సెమెటిక్ తెగలనేవే లేవు అమెరికన్ ఆదివాసులలో ఫ్రాట్రీ అనాగరిక యుగం దిగువదశలో వచ్చింది. అనాగరికయుగం ఎగువదశలో కనబడినంత వరకే గ్రీకులకు తమ పూర్వయుగం చరిత్ర తెలుసు

సాధారణ రూపంలో తప్ప గ్రోటే ఫ్రాట్రీ కార్యకలాపాలను విశ్లేషించే ప్రయత్నం చెయ్యలేదు అవి ప్రధానంగా మతస్వభావం కలవిమాత్రమే సందేహం లేదు కాని, బహుశా ఇరాక్వాలలోలాగ చనిపోయినవాళ్ళ అంత్యక్రియలలో, క్రీడలలో, జాతరలలో సమితులలో గణానభలలో - నాయకులూ, ప్రజలూ ఫ్రాట్రీలుగా విడబడి పాల్గొనే అన్నింటిలో కనిపిస్తూవుండి వుంటాయి సైన్యదళాలను మోహరించడంలో సహజంగానే ఫ్రాట్రీ ప్రత్యక్షమవుతుంది అగమెమ్నాన్‌కు నెస్తోర్ ఆ విషయమై సలహాఇచ్చినట్లు హోమర్ రాసేడు "అగమెమ్నాన్! తెగలు, ఫ్రాట్రీలుగా సైన్యాలను విడదియ్యి అప్పుడు ఫ్రాట్రీకి ఫ్రాట్రీ, తెగకు తెగబాసటగా వుంటాయి ఆ విధంగాచేస్తే, గ్రీకులు నీమాట వింటారు ఏ సేనాధిపతి ఏ సైనికుడు పిరికివందో, ఎవరు ధైర్యశాలో నీకు తెలుస్తుంది వారు తమ శక్తికొద్దీ యుద్ధం చేస్తారు " ఒకే గణం నుంచి సైనికులుగా వచ్చేవారి సంఖ్య తక్కువగా వుంటుంది అందుచేత వారితో సైన్యనిర్మాణాలు ఏర్పడవు ఫ్రాట్రీలనుంచి, తెగలనుంచి వచ్చేవారు ఎక్కువగా వుంటారు సరిపడతారు నెస్తోర్ సలహాలో రెండు అంశాలు వున్నాయి ఒకటి - ఫ్రాట్రీలు తెగలువారీగా సైన్యాల్ని విభజించే అలవాటు అప్పటికే పోయింది రెండోది - పూర్వకాలం సైన్యనిర్మాణం ఆ విధంగానే వుండేవి అది ఇంకా జ్ఞాపకం వుంది. అనాగరిక యుగం మధ్యదశలో వున్న త్లస్కాలాన్‌లూ, అజ్‌టెక్‌లూ తమ సైన్యాలను ఫ్రాట్రీలవారీగా విడదీసి పంపేవారని చెప్పేను. వారున్న స్థితిలో సైన్యదళాన్ని విన్యాసం చేయాలంటే అదొక్కటే పద్ధతి అయివుంటుంది. ప్రాచీన జర్మనుతెగలు యుద్ధంలో తమ సైన్యాలను అదేసూత్రం ప్రకారం సిద్ధంచేసేవారు తమ తమ సామాజికవ్యవస్థ యొక్క నియమాలలో తెగలు ఎక్కడున్నవైనా ఒకే విధంగా వ్యవహరించడం ఆసక్తికరంగా వుంటుంది

రక్త ప్రతీకార చర్యకు బాధ్యత తరవాత తర్వాత కోర్టులలో హంతకునిమీద కేసుపెట్టడంగా మారిందికాని, ప్రథమంలో అది హతుని గణం బాధ్యతగానే వుండెది అయితే ఆ బాధ్యతలో ప్రాట్రీకూడ పాల్గొనేది చివరకు అది ప్రాట్రీబాధ్యతే అయివూరుకుంది ఐస్కిలస్ రాసిన యూమెనైడ్స్‌లో తన తల్లిని ఒరెస్టస్ చంపిన విషయం చెప్పి ఎరిన్నిస్ ఓ ప్రశ్న వేశారు వానిమీద ప్రోక్షించేందుకు లతని ప్రాట్రీ వారి వద్ద జలం సిద్ధంగా వున్నదా? నేరగాడు శిక్షను తప్పించుకుంటే అతనిచేత శుద్ధిస్నానం చేయించేది ప్రాట్రీగాని గణం కాదని దీనివలన అర్థం అవుతూంది అంతేకాదు ఈ బాధ్యత గణంనుంచి ప్రాట్రీకి బదిలీకావడం దానిలోని గణాలన్నిటి వంశవృక్షం ఒకటే అయివుంటుందన్న దానికి దాఖలా

ప్రాట్రీ అన్నది గణానికీ తెగకూ మధ్యనున్న నిర్మాణం దానికి పాలనా బాధ్యతలు ఏమీలేవు అందుచేత దానికి మిగిలిన వానికున్న ప్రాధాన్యంలేదు అయితే ఆ రెండింటి మధ్యనా సహజమైన అవసరమైన పునర్మిళనంగా దానిని చెప్పాలి గ్రీకుల ప్రథమదినాలనాటి సామాజిక జీవితం గురించి తెలుసుకోగలిగితే అది ప్రధానంగా ప్రాట్రీలలోనే కేంద్రీకరించి వుండవచ్చు ననిపిస్తుంది మనకిప్పుడు దొరుకు తున్న సమాచారం చాలస్వల్పం అథీనియన్లలో గణాల్ని తోసివేశాక, నూతన రాజకీయ వ్యవస్థలో ప్రాట్రీని అట్టేవుంచేరు పౌరులను నమోదు చెయ్యడం, వివాహాల లెక్కలు తీయడం, తమ ప్రాట్రీవానిని ఎవరన్నా హత్యచేస్తే హంతకునిమీద కేసు పెట్టడం వంటి పనులు దానికి ఇచ్చేరు

అథీనియను తెగలు నాలుగూ ఒక్కొక్కటి మూడు ప్రాట్రీలుగా, ఒక్కొక్క ప్రాట్రీ ముప్పయ్యేసి గణాలుగా విభజించబడ్డాయని చెప్తుంటారు కానిఇది కేవలం వర్ణన సౌకర్యంకోసం చెప్పిన మాట మాత్రమే గణజీవితం గడుపుతున్న ప్రజలు లెక్క ప్రకారం విభజబడడం వుండదు సహజంగా జరిగేది దీనికి భిన్నం గణాలు ప్రాట్రీలుగా, అవి తెగలుగా, అవి ప్రజగా కలుస్తాయి అదీ సహజం అథీనియను ప్రాట్రీలో ముప్పయిగణాలు వుండడం ఒక అసాధారణ విషయం సహజములైన ఏ కారణాలు అందుకు సాయపడ్డాయో చెప్పలేము ఒక క్రమంలో, ప్రాట్రీ కిన్నిగణాలు ఏర్పరచు కోవాలనే కోరిక ఏ బలమైన కారణం చేతనో కలిగితే అల్లా విభజించుకోవచ్చును ఒక వేళ తెగలో వాని సంఖ్య అధికంగా వుంటే బంధు గణాల్ని కలిపేసి ముప్పయికి తగ్గించనూ వచ్చు సంఖ్యను హెచ్చుచేయదలుస్తే పరాయిగణాలను ప్రాట్రీలోకి తీసు

కోవడం మూలకంగా సహజంగా పెరిగి గణాలూ, ఫ్రాట్రీలూ, తెగలూ అధిక సంఖ్యలో వుండే గణాల్నీ, ఫ్రాట్రీలనీ సరిసమాన సంఖ్యకు తెచ్చి నాలుగు తెగలలో సమాన సంఖ్య వుండేటట్లు చేయవచ్చు ఒకమారు తెగకు ఇన్ని ఫ్రాట్రీలు, ఫ్రాట్రీకి ఇన్ని గణాలు వుండాలని నిర్ణయించి, ఆ విధంగా చేస్తే, ఒక్క ఫ్రాట్రీలో వుండే గణసంఖ్యనుతప్ప మిగతా కూర్పును యథాతథంగా శతాబ్దాలపాటు కొనసాగించవచ్చును

గ్రీకు తెగలమత జీవితానికి ఫ్రాట్రీలూ గణాలూ, కేంద్రాలూదానికిమూలమున్నా కూడ వీని ద్వారానే అద్భుతమైన దేవ దేవతావ్యవస్థ, వారిలో హెచ్చుతగ్గులు, దానికి సంకేతాలు, పూజావిధానాలు పరిణతి పొంది చారిత్రక ప్రపంచాన్ని దిగ్భ్రమ పొందించింది పురాణ కాలంలోనూ, చరిత్రయుగంలోనూ గొప్ప విజయాలను సాధించడానికి ఈ పురాణగాథలు ఇచ్చిన ఆవేశోత్సాహాలు అపారం ఈనాడు ప్రపంచాన్ని ఆనంద పరవశం చేస్తున్న దేవాలయాలూ, దేవాలయ శిల్పాలూ ఆవుత్సాహ ఫలితాలే ఈ సామాజిక కూటాలలో పుట్టిన మత కర్మలకు గొప్ప పవిత్రతను ఆపాదించుకుని వానిని జాతిపరంచేసేరు ఆ విధంగా మతానికి పుట్టినిల్లు గణాలూ ఫ్రాట్రీలూనే అని కనబడుతుంది ఈ కాలపు ఘటనలు ఆర్యను కుటుంబ చరిత్రలో చాలా అసాధారణమైనవే అయివుంటాయి కాని అవి చాలవరకు చరిత్రకు దక్కకుండానే పోయాయి పురాణపురుష వంశావళులు, పురాణగాథలు, దేవతాగాథలు, కవితా శకలాలు, హోమరు, హెసియోదిక్ కావ్యాలు- ఇవీ ఆనాటి సాహిత్యావశేషాలు. వారి ఆచారాలు, కళలు, కల్పనలు, దేవతల ప్రసంగాలు, ఒక్కమాటలో చెప్పాలంటే వారు సృష్టించి తమతో తీసుకొచ్చిన ఈ నాగరికతను వారు తాము సృష్టించబోతున్న నూతన సమాజానికి వారసత్వంగా అందించేరు అనేక చోట్ల నుంచి పోగుచేసిన సమాచారంతో ఈ కాలపు చరిత్రను పునస్సంఘటన చేయాలి రాజకీయ సమాజం ఏర్పడడానికి కొంచెం ముందు నాటి గణ సమాజం యొక్క ప్రధాన లక్షణాలను బయటకు తియ్యాలి

గణానికి ఒక అర్కాన్ వుంటాడు గణం జరిపే మత కర్మలలో ఆయన పురోహితుడు ప్రతిఫ్రాట్రీకి దాని నాయకుడు (ఫ్రాట్రీయార్క్) వుంటాడు. దాని సమావేశాలకు ఆయన అధ్యక్షత వహిస్తాడు దాని మతక్రియలు యథావిధిగా జరిపిస్తాడు. "ఫ్రాట్రీకి దాని కూటాలున్నాయి కోర్టులున్నాయి అది శాసనాలు చేయవచ్చు దానిలోనూ, కుటుంబంలోనూ కూడ ఓదేవుడున్నాడు, పూజారి వున్నాడు న్యాయస్థానం వుంది పాలనా యంత్రాంగమూ వుంది" అన్నారు దేకౌలాంగెస్ గణాలతో ఏర్పడినదే ఫ్రాట్రీ కనక ఫ్రాట్రీ నడిపించే మత కర్మలు, గణాలలో జరిపేవాని విస్తృత

రూపాలే గ్రీకుల మత జీవితాన్ని అర్థం చేసుకోవాలంటే మన అన్వేషణ ఈ దిశగా వుండాలి

దీని తరవాత పై నిర్మాణం తెగ అనేక గణాలున్న ఫ్రాట్రీలు కొన్ని తెగలు వుంటాయి ఫ్రాట్రీలోని జనం అంతా ఒకే వంశం క్రమానికి చెందుతారు వారంతా ఒకే మాండలీకం మాట్లాడుతారు అథీనియన్లలో ప్రతి తెగలో మూడు ఫ్రాట్రీలు వున్నాయని చెప్పేను అవి తెగకు తమను పోలిన నిర్మాణాన్నే ఇచ్చేయి ఈ తెగలు లాటిన్ తెగల వంటివే అమెరికన్ ఆది వాసుల తెగల లాంటివే. ఈ పోలిక పూర్తికావాలంటే ప్రతి తెగకూ స్వతంత్రమైన మాండలికం కూడా వుండాలి సిందే ఒక చిన్న ప్రాంతంలో పరస్పరం కలిసిపోయి గ్రీకు తెగలు గ్రీకు ప్రజగా మారినప్పుడు మాండలిక భేదాల్ని అణచివేయ వలసి వచ్చింది లిపి, సాహిత్యం రావడంతో ఆ అణచివేత మరింత ఎక్కువగా జరిగింది. పూర్వపు అలవాటు కొద్దీ ఒక్కొక్క తెగజనం ఒక్కొక్క నిర్దిష్ట ప్రదేశంలో మకాం పెట్టేరు ముఖాముఖి సంబంధాలమీద ఆధారపడిన సామాజిక వ్యవస్థ అవసరాలు వారు ఒకే చోట వుండవలసిన అవసరాన్ని కలిగిస్తాయి అప్పుడు కూడా తెగకు మాత్రమే సంబంధించిన వ్యవహారాలను చక్కదిద్దేందుకు సర్వాధికారిమైన నాయకులసమితి ప్రతి తెగకూ వుండేదనుకోవచ్చు సమైక్యం అయిన తెగలకుచెందిన సర్వసాధారణ వ్యవహారాలు నిర్వహించే నాయకుల జనరల్ కౌన్సిలు, దాని కార్యకలాపాలు, అధికారాలు అన్నీ నేడు మరుగున పడిపోయాయి అటువంటి దశలో దానికన్న తక్కువదీ, దానికి అనుబంధించినదీ తెగ సమితి దాని కార్యకలాపాలూ, అధికారాలూ మనదాకా వస్తాయనుకోడం భ్రమ ఆ సామాజిక వ్యవస్థలో తెగకు ఒకసమితి అవసరం వుంటుంది అది గణాల నాయకులతో ఏర్పడి వుంటుంది

ఒక తెగలోని ఫ్రాట్రీలకలిసి తమ మతకర్మలను నిర్వహించబోతున్నప్పుడు అవి తమ ఉన్నతనిర్మాణరూపం అయిన తెగగానే జరుపుతాయి. అందుచేత అవి తెగకు ప్రధాననాయకుడైన ఫైలో - బాసిలస్ అధ్యక్షతనే జరుగుతాయి సైనిక వ్యవహారాలలో ఆయనే సేనానాయకుడుగా వ్యవహరిస్తాడా అనేది చెప్పలేను ఆయన పురోహితకర్మలు చేయించేవాడు, బాసిలస్‌పదవికి వున్నది అదే హత్య జరిగినప్పుడు నేరస్థునిపట్టుకొనే అధికారం ఆయనకు వుండేది అయితే విచారించే అధికారం వుందా, లేక కోర్టుకుతెచ్చే అధికారం మాత్రమేవుందా - అంటే చెప్పలేను బాసిలస్ పదవికి వున్న పురోహిత, న్యాయస్థాన విధులవలననే పురాణయుగంలోనూ, వీరయుగంలోనూ

ఆ పదవికి అంత ప్రాముఖ్యం వచ్చింది అయితే ఆయన పౌరవిధులు కూడా నిర్వహించేవాడవడానికి సంతృప్తికరమైన సాక్ష్యంలేదు లేదనే అనాలి అందుచేతనే చరిత్రలో తరచు బాసిలసును రాజుగా పేర్కొనడం తప్పు అథీనియన్లలో తెగకు బాసిలస్‌వున్నాడు గ్రీకులు తమ నాలుగుతెగల సర్వసైన్యాధ్యక్షుణ్ని స్పష్టంగా ఆ విధంగానే పిలిచేరు ప్రతితెగ బాసిలసునూ, ఒక్కొక్క రాజుగాచేస్తే నాలుగు తెగలకి నలుగురు రాజులవుతారు చాలవికృతంగా తయారవుతుంది అప్పుడు ఈ నాలుగుతెగలమీదా మరోరాజు ఏర్పడాలి అవసరానికి సరిపడనిది ఈ రాజరికం. పైగా అథీనియన్ల ఆచారం అనాది ప్రజాతంత్రంతో కూడినది గ్రీకు సమాజాన్ని ఎగతాళిచేసి నట్లుంటుంది వారికి రాజును అమర్చడం గ్రీకులు ఎక్కడ ఏ శబ్దాన్ని వాడేరో అదేవాడడం ఉచితం రాజు సరియైన పర్యాయపదంకాదని తోసివేయాలి గణ వ్యవస్థకి రాజరికానికి పొత్తు వుండదు గణంలో ఆచారాలన్నీ ప్రధానంగా ప్రజాతంత్ర యుతమైనవి గణం, ఫ్రాత్రీ, తెగ ప్రతిఒక్కటీ స్వయంపాలితం చాలతెగలు ఒకజాతిగా కలిసినప్పుడు దానిలోని అంతర్భాగాల ఆచారాలకు అతికేవిధమైన పాలనయే ఏర్పడుతుంది.

గణసమాజంలో నాలుగోదీ, ఆఖరుదీ మెట్టు జాతి, ప్రజ అథీనియన్లు స్పార్టనులు ఏకమై ప్రజఅయినప్పుడు సమాజం విస్తరించింది అయితే సంక్లిష్టమైనదే అయినా అది తెగకి ప్రతిరూపంలోనే వుంది తెగలో ఫ్రాత్రీలస్థానం ఏమిటో ఫ్రాత్రీలలో గణాలస్థానం ఏమిటో ఇప్పుడు జాతిలో తెగలస్థానమూ అటువంటిదే ఆ నిర్మాణానికి ఓ పేరులేదు ఉట్టినే Societas సమాజము అన్నారు దానిస్థానే ప్రజ, జాతి అనేపేర్లు పుట్టేయి ట్రాయ్‌మీద దాడికివెళ్ళిన దళాలను వర్ణిస్తూ హోమరు ఈ జాతుల్ని ప్రత్యేకమైన పేర్లతో, పిలిచేడు అథీనియన్లు, ఎటోలియన్లు లోక్రియన్లు అన్నిటికీ పేర్లులేవు లేనిచోట వారువచ్చిన పట్టణమో, ప్రదేశమో పేరును వుపయోగించేడు చివరకు తేలిందేమంటే లైకర్గస్, సోలోన్‌లకు పూర్వం గ్రీకు సమాజనిర్మాణాలు నాలుగేవుండేవి గణాలు, ఫ్రాత్రీలు, తెగలు, జాతి, వారిలోనేకాదు, పురాతనసమాజంలో అది ఇంచుమించు సర్వసామాన్యం ఆటవికయుగం కొంత భాగంలో, అనాగరికయుగం పూర్తిగా నాగరికత వచ్చేకకూడా అదే కొనసాగినట్లు చూపేను మెట్టుమెట్టుగావున్న ఈ నిర్మాణాలు మానవజాతిలో పాలనావ్యవస్థ గురించిన

ఆలోచన- రాజకీయసమాజం ఏర్పడేవరకూ ఏ విధంగా వుంటూకుందో చెప్తున్నాయి. గ్రీకు సమాజ వ్యవస్థయొక్క స్వరూపం అది క్రమోత్తరంగా అధికాధిక సంఖ్యగల వ్యక్తుల సమూహాలూ, గణంతో, ఫ్రాట్రీతో, తెగతో వారికి వ్యక్తిగతంగా వున్న సంబంధాలను సరిచూపే పాలనాంగము - ఇటువంటి సమాజం అనాటిది అదీ ఒక గణసమాజమే అది రాజకీయ సమాజంకన్న భిన్నం రెంటికీ పోలికేలేదు, రెంటినీ సులభంగా గుర్తించవచ్చును

వీరయుగంనాటి అథీనియన్ జాతివారి పాలనాంగంలో మూడు శాఖలు, అధికారాలు ఉన్నాయి మొదటిది- నాయకుల సమితి రెండు - అగోరా లేక ప్రజాసభ మూడు- బాసిలెస్ లేక సర్వసైన్యాధికారి మునిసిపల్ డిపార్టుమెంటులూ, దిగువస్థాయి సైన్యోద్యోగాలూ చాలానే సృష్టించేరు అనాటి పరిస్థితులలో అవి అవసరమే అయాయి కాని ప్రధాన పాలనాధికారం పైనచెప్పిన మూడింటిదీను సమితి, అగోరా బాసిలెస్ల వుద్యోగధర్మాలూ, అధికారాలూ వివరంగా చర్చించలేను కొద్ది సూచనలను చేస్తాను హెల్లెనిస్టుల మనసులనేవారు పునఃపరిశీలన చేయవలసివచ్చేటంత తీవ్రమైన విషయాలే అది అంతవరకే

1 నాయకుల సమితి గ్రీకు తెగలలోని సమితికన్న, ప్రజాసభకన్న బాసిలెస్ పదవికి ఎక్కువ ప్రాముఖ్యం లభించింది ఫలితంగా దానికి అవసరంలేనంత ప్రాధాన్యం ఇచ్చి, సమితినీ, అగోరా (ప్రజాసమితి) మా చిన్నచూపు చూడడమో, విస్మరించడమో చేశారు మనకు అందినంతవరకు వెనకటి కాలం నుంచి రాజకీయ సమాజం ఏర్పడేంత వరకు గ్రీకుజాతిలో నాయకులసమితి ఎప్పుడూ వుంటూనేవుంది వారి సామాజికవ్యవస్థలో శాశ్వతంగా దానికి స్థానం వుంటూండడమే దాని పనులు, బాధ్యతలు గట్టివనీ, దాని అధికారాలు నిర్ణయాత్మకములనీ అవదానికి సాక్ష్యంగా వున్నాయి గణాలలోని ఆచారాలలో మనకు తెలిసినంత వరకు సమితికున్న ప్రాచీనతను పట్టీ, బాధ్యతలనుపట్టీ, పనినిపట్టీ ఇలా వూహించగలుగుతున్నాము వీరయుగంలో దానిని ఏ విధంగా ఏర్పరిచేరో, ఆ పదవిలోని ముఖ్యుని వుద్యోగ కాలపరిమితి ఏమిటో మనకు స్పష్టంగా తెలియడంలేదు కాని, గణాల నాయకులతో సమితి ఏర్పడిందని వూహించవచ్చు కాని ఉన్నగణాల సంఖ్యకన్న నాయకసమితి సభ్యుల సంఖ్య తక్కువగా వుండేని కనక ఏ పద్ధతిననుసరించేవారో గాని గణాల నాయకుల నుంచి సమితికి సభ్యులను ఏరుకోవడం జరిగేది - అనుకోవాలి ఈ సమితిగని శాసన నిర్మాణం దానికి సభ్యులను ప్రధాన గణాల నుంచి తీసుకొనేవారు ఇది గణ వ్యవస్థలో అతిసహజంగా రూపొందింది

ఈ కారణాలచేత ఆ సమితి అంటూ వున్నంతకాలమూ అది సర్వోన్నతమైనదిగానే వుంటుంది బాసిలస్ పదవి అంతకంతకు ప్రాముఖ్యానికి రావడం, సైనిక, నగర వ్యవహారాలలో కొత్త కొత్త వుద్యోగాలు అధికంగా రావడం, సంపదలు పెరగడంతో సమితికి ప్రజావ్యవహారాలతోవున్న సంబంధం తగ్గి, క్రమంగా దాని ప్రాముఖ్యం క్షీణిస్తుంది ఆచారాలలోనే పెద్ద మార్పు వస్తేకప్ప దానిని తోసివెయ్యడం జరగదు అందుచేత పైనుండి కిందికంటా ప్రభుత్వ ఆఫీసులన్నీ తమ అధికార కార్యకలాపాలలో సమితికి జవాబుదారుగా వుండేవని భావించవచ్చును వారి సామాజిక వ్యవస్థలో సమితి మౌలికం ఆనాటి గ్రీకు ప్రజలు స్వతంత్రులు స్వయం పాలితులు వారి ఆచారాలు మౌలికంగా ప్రజాతంత్రయుతమైనవి సమితి అనేది గ్రీకుల ఆలోచనలో ఎప్పుడూ వుందని, తన బాధ్యతల నిర్వహణకు సిద్ధంగా వుండేదని చెప్పడానికి ఐస్కైలస్ రాసిన The Seven against Thebes 1005 నుంచి ఒక్క వుదాహరణ యిస్తాను ఆ గ్రంథంలో నగర సైన్యాధికారి ఎటియోక్లిస్ ఆ నగరాన్ని ముట్టడిస్తున్న ఏడుగురి నాయకులలో పోలినైసెస్ ఒకడు అతడు ఆయన సోదరుడే దానిని తిప్పికొట్టేరు అయితే నగరద్వారాలలో ఒకదానివద్ద అన్నదమ్ములిద్దరూ ద్వంద్వయుద్ధం చేసి చచ్చిపోయారు తరవాత చారణుడు ఇల్లా ప్రకటిస్తాడు "కాడ్మస్ నగర ప్రజల సలహాదారుల నిర్ణయాన్నీ, ఆమోదాన్నీ ప్రకటించవలసినపని నామీద వుంది వారి నిర్ణయం, " ఏ క్షణంలోనైనా సమితి ఒక నిర్ణయంచేసి, ప్రకటించడమూ, ప్రజలు దానిని పాటించవలసి వుండడమూ వట్టి దానికి ప్రభుత్వంలో సమున్నతాధికారం వుండనాలి ఐస్కైలస్ ఇందులో చెప్పినకథ పురాణకాలం నాటిది ప్రతి గ్రీకు ప్రజల ప్రభుత్వంలోనూ నాయకసమితిది ముఖ్యపాత్ర అని అది చూపుతూంది ప్రాచీన గ్రీకు సమాజంలోని బౌలే, ఇటీవలి రాజకీయ ప్రభుత్వ వ్యవస్థలోని సెనేట్ వంటిదే

2 అగోరా సమితి ప్రతిపాదించిన ప్రజోపయోగ చర్యలను ఆమోదించడానికీ, నిరాకరించడానికీ అధికారంగల ప్రజాసభ పురాణకాలంనుంచీ వున్నప్పటికీ, అది సమితి అంత పురాతనంకాదు సమితి, గణాలతోపాటు వచ్చింది కాని పైన చెప్పిన అధికారాలతో ప్రజాసభ అనాగరిక యుగం ఎగువ దశకు ముందు వుండడం అనుమానమే అనాగరిక యుగం దిగువ దశలోనున్న ఇరాక్వాలలో ప్రజలు తమకు వచ్చిన వక్తలచేత తమ కోరికలను నాయక సమితి ముందు వాదించేవారని ఇదివరకే చెప్పేను సమాఖ్య వ్యవహారాలలోకూడ ప్రజల పలుకుబడి వుండేది కాని ప్రజాసభ ఉండడమూ, సమితిచేసే పనులపై అంగీకార, అనంగీకార నిర్ణయాధికారం దానికి

వుండడమూ ఇరాక్యూలు బుద్ధికీ, పరిజ్ఞానానికీ అందనివి వారు అంతగా ఎదగలేదు. హోమరు వ్రాతలలోనూ, గ్రీకు విషాదాంత నాటకాలలోనూ మొట్టమొదట ఈ అగోరా-ప్రజాసభ కనబడుతుంది అటు తర్వాత కాలంలో వచ్చిన, అథీనియన్ల ఎక్లెసియాకు, రోమన్ల కమిటియాక్యూరియాటాకు వున్న లక్షణాలే దీనికీ వున్నాయి ప్రజాకార్యాలకు రూపం ఇచ్చేపని నాయకసమితిది దానిమీద అంగీకార, అనంగీకార నిర్ణయాధికారం ప్రజాసభది దీనిదే అంతిమనిర్ణయం కూడా అగోరాకున్న బాధ్యతలు ఇంతే ప్రజా కార్యాలకు రూపం ఇవ్వలేదు పాలనావ్యవహారాలలో కలగచేసుకోనూ లేదు అయినా దానికివున్న అధికారం గట్టిదే ప్రజల స్వాతంత్ర్యాన్ని కాపాడేందుకు దానివి నిర్వరచారని కనబడుతూంది వీరయుగంలో నరేసరి, పురాణయుగంలో కూడ గ్రీకు తెగలలో ప్రజాసభ నిరంతరాయంగా కొనసాగింది నాయకసమితితో పాటుగా ఇది వుండడం ఆ సుదీర్ఘకాలంలో పొడూగునా గణసమాజంలోని ప్రజాతంత్ర ఆచారాలే కొనసాగేయనడానికి సాక్షీభూతం ప్రధాన సమస్య లన్నింటిమీదా ప్రజాభిప్రాయం తీసుకోబడేది ప్రజాక్షేమం కోసం, తమ ప్రాబవం నిలుపుకొనేందుకూ ప్రజల్ని సంప్రదించడం మంచిదని నాయకసమితి అర్థంచేసుకుంది ప్రజాసభలో ఎవ్వరైనా మాట్లాడవచ్చు తమ ముందుకు వచ్చిన విషయాన్ని చర్చించినాక నిర్ణయం తీసుకోవ డానికి చేతులు ఎత్తించి లెక్కపెట్టినట్లు ఐస్కిలస్ రాసిన 'సప్లియంటెస్' వల్ల అర్థం అవుతూంది పురాతనాచారం ఇది అందరి ప్రయోజనాలకు వర్తించే ప్రజావ్యవహారా లలో కలగచేసుకొంటూ ప్రజలు స్వయంపాలనలోని మెలకువలను తెలుసుకుంటున్నా, వారిలో కొందరు అథీనియన్ల మాదిరిగా పూర్తి ప్రజాతంత్రానికి సంసిద్ధం అవుతున్నారు తరవాత తరవాత క్లీస్థెనెస్ రాజ్యాంగ చట్టాల ద్వారా అదినెలకొంది ప్రజాసమస్యల మీద చర్చలు జరిపే ప్రజాసభను రచయితలు తరుచుగా మూకలు అని నిందించేవారు నిజానికి ఈ ప్రజాతంత్ర నియమం వారికి అర్థం కాలేదు అథీనియన్ల ఎక్లెసియాకూ, అధునిక దిగువ శాసన సభలకూ మూలం అదే

3 బాసిలస్ వీరయుగంనాటి గ్రీకు సమాజంలో ఈ వుద్యోగి చాలప్రాముఖ్యం గల వ్యక్తి అయ్యేడు పురాణ యుగంలోకూడ దానికి అంత ప్రాముఖ్యం వుండేది ప్రభుత్వాన్ని గురించి చెప్పవలసినప్పుడు గ్రీకు రచయితలు ఈ పదవి పేరునే వుప యోగించి బాసిలియా అనేవారు అధునిక రచయితలంతా బాసిలస్ పదానికి రాజు అనీ, బాసిలియోకు రాజ్యంఅనీ, రెండూసమానార్థకాలయినట్లు రాస్తున్నారు ఈ నిర్వచనం తప్పు. ప్రాచీన అథీనియనుల బాసిలియాకూ, ఈనాటిరాజ్యానికీ, రాజరికానికీ పోలికలు

ఏమీలేవు రెంటికీ అనేవదాన్ని ఉపయోగించే అవకాశంలేదు మనవుద్దేశంలో రాజరిక ప్రభుత్వం అంటే దానికోరాజు వుంటాడు ఆయనకు భూములూ, వానిపై స్వత్వమూ గల ఆస్తిపరులయిన బిరుదనామధారులు పరివేష్టించి వుంటారు తనయిష్టానుసారం శాసనాలూ, చట్టాలుద్వారా ఆరాజు పరిపాలన సాగిస్తాడు పరిపాలితుల ఇష్టాన్ని అంగీకరించడు వంశపారంపర్యంగా పాలనాధికారం వుందంటాడు అటువంటి ప్రభుత్వాలను, వారు తమ వంశపారంపర్యపు హక్కును చూపించి ప్రజలనెత్తిన మోపుతారు దానికి దైవత్వం ఆపాదించి పురోహిత వర్గం బలపరుస్తుంది దీనికి ఇంగ్లండులోని ట్యూడర్ వంశపు రాజులూ, ఫ్రాన్సులోని బోర్బన్ వంశపురాజులూ వుదాహరణలు చట్టబద్ధరాజరికం అన్నది ఇటీవలి పరిణామం గ్రీకుల బాసిలియాకూ, దానికీ సంబంధంలేదు బాసిలియా నిరంకుశప్రభుత్వమూ కాదు చట్టబద్ధ రాజరికం అంతకన్నా కాదు మరేమిటి ?

"పురాతన గ్రీకు ప్రభుత్వం మౌలికంగా రాజరికం దైవదత్త హక్కుగా, వ్యక్తిగత అధికారం మీద ఆధారపడింది"— అని గ్రోటే రాశారు దీనిని దృఢపరచుకోడానికై — "ఇలియడ్‌లోని వాక్యాన్నే ఆచరణలో చూస్తాం "బహుజనపాలన మంచిదికాదు జియస్ పాలనాధికారాలతో రాజదండాన్ని ఇచ్చిన ఒక్కపాలకుణ్ణే— ఒక్కరాజునే పెట్టుకుందాం—" అన్న వాక్యాన్ని వుదాహరించేరు. ఇది ఒక్క గ్రోటే మాటేకాదు చరిత్రకారుడుగా ఆయన గొప్పతనాన్ని అంగీకరించాలి గ్రీకు సమస్యల మీద రాసిన చరిత్ర రచయితలందరూ దీనిని అదేపనిగా దృఢపరుస్తూండడంతో, చివరికది చారిత్రకసత్యంగా స్థిరపడింది రాజరిక ప్రభుత్వాలకి, ఆస్తిపరవర్గాలకి అలవాటుపడ్డ రచయితలే గ్రీకు, రోమను సమస్యలమీద మనఆలోచనలకు రూపుదిద్దుతున్నారు గ్రీకు తెగలకు కూడా ఆ ప్రాచీన కాలంలోనే ఈ మాదిరి ప్రభుత్వమే సహజమూ, అవసరమూ, అనిపించివుంటుందని వారిఆలోచన

అసలు విషయం గ్రోటే చెప్పిన దానికి భిన్నం పురాతనగ్రీకు పాలన యంత్రాంగం మౌలికంగా ప్రజాతంత్రం స్వయంపాలక నిర్మాణాలయిన గణం, ఫ్రాట్రీ, తెగలమీద అది ఏర్పడింది స్వేచ్ఛ సమానత్వం, సోదరత్వం దాని నియమాలు గణ నిర్మాణంగురించి మనకు తెలిసినది దీనిని రుజావు చేస్తూంది అదిప్రజాతంత్రసూత్రాల మీద నడుస్తుంది బాసిలస్‌పదవి పారంపర్యపు హక్కుగా తండ్రి నుంచి కొడుక్కు సంక్రమిస్తుందా అనేది ప్రశ్న అదే జరుగుతూంటే, అది పై నియమాలకు విరుద్ధం. అనాగరిక యుగం దిగువ దశలో నాయక పదవి గణంలో పారంపర్యం అంటే శాశ

పడినప్పుడు గణసభ్యుల నుంచే ఆపదవికి ఎన్నికజరుగుతుంది ఇరాక్వాలలో మాది గిగా స్త్రీ పారంపర్యం కొనసాగుతుంటే చనిపోయిన నాయకుని సోదరుడినే సాధారణంగా ఎన్నుకుంటారు ఒజిబ్వాలు, ఒమాహాలలోలాగ పురుష పారంపర్యం సాగుతుంటే పెద్దకొడుకును ఎన్నుకుంటారు ఆ మనిషి విషయంలో అభ్యంతరం లేకపోతే జరిగేది అది ఏమయినా ఎన్నిక తప్పదు అదే స్వయంపరిపాలనకు మూలం బాసిలస్ చనిపోయినప్పుడు ఆ పదవి పెద్దకొడుక్కు, వంశపారంపర్యం హక్కుగా సంక్రమించిందనడానికి గట్టిసాక్ష్యం లేదు గట్టి సాక్ష్యం కావాలి అదీ సంగతి పెద్దకొడుకో, కొడుకుల్లో ఒకరో ఆ పదవికి వచ్చినంతమాత్రాన రుజావు దొరికినట్లు కాదు ఆచారంప్రకారం ఆ వియోజక వర్గంనుంచి ఎన్నుకోబడవలసిన వారిలో తరువాతివాడు ఆయనకావచ్చు గ్రీకుల ఆచారాన్ని పట్టిచూసినా వంశపారంపర్యపు హక్కుగా బాసిలను పదవి సంక్రమించడం జరగదు ఎన్నికయినా జరుగుతుంది రోమనులలో రెక్స్‌కు జరిగినట్లు ప్రజలు తమ నిర్ణాణాలద్వారా ఎన్నికను ధృవీకరించడమైనా జరుగుతుంది పైనచెప్పిన విధంగా బాసిలస్ పదవి సంక్రమించినా, పాలనాధికారం ప్రజల చేతుల్లోనే వుంటుంది ఏమంటే ఎన్నుకోవడమూ, ఎన్నికను ధృవీకరించడమూ జరిగితేతప్ప అతను అధికారంలోకి రాలేడు ఎన్నికా, ధృవీకరణా వున్నాయంటే తొలగించే హక్కు వుందన్నమాటే.

ఇలియడ్‌నుంచి గ్రోటేఇచ్చిన వుదాహరణకు అర్థంలేదు దానిని ఆయన ఉలిసిస్‌ప్రసంగంనుంచి తీసుకున్నారు ముట్టడిలోవున్న నగరంముందువున్న ఒక సైన్యనాయకత్వంగురించి ఆయన ప్రసంగిస్తున్నాడు "ఇక్కడ గ్రీకులందరు ఏ విధంగానూ పాలించలేరు బహుజనపరిపాలన మంచిదికాదు ఒకే కైరానోస్‌ను ఒకే బాసిలస్‌ను, మనలనందరనూ పాలించడానికై జియస్‌దేవుడు దండాన్నీ దైవ ఆదేశాల్నీ ఇచ్చిన మనిషిని పెట్టుకుందాం" - అని ఆయన అనగలడు, ఇక్కడ కైరానోస్, బాసిలస్‌పదాలు ఏకార్థంలో వుపయోగించబడినాయి ఆ రెంటికీ అర్థం సైన్యాధ్యక్షుడు ఇక్కడ ప్రభుత్వరూపాన్ని చర్చించేందుకూ, నిర్ణయించేందుకూ ఉలిసిస్‌కు పనిలేదు ముట్టడిలోవున్న పట్టణంముందున్న సైన్యం ఒకసైన్యనాయకుని అధీనంలో వుండాలనే పనుందికాని

బాసిలియాను సైనిక ప్రజాతంత్రంగా నిర్వహించవచ్చు, అక్కడ ప్రజలు స్వతంత్రులు స్వభావంచేత పరిపాలన మౌలికంగా ప్రజాతంత్రం బాసిలస్ వారి సైన్యనాయకుడు వారి సామాజికవ్యవస్థలో అది అత్యున్నతము, చాలపలుకుబడీ,

ప్రాముఖ్యంగల పదవిన్నీ. ఆ ప్రభుత్వాన్ని నిర్వచించేందుకు అనుకూలమైన శబ్దం దొరక్క గ్రీకురచయితలు దానిని బాసిలియా అన్నారు. ఆనాడు పాలనాధికారానికున్న స్పష్టమైన లక్షణం సైన్యాధిపత్యం. దానిని ఆ పదం సూచిస్తుంది. ఈ బాసిలస్‌తో పాటు సమితి, ప్రజాసభకూడా వుంటాయి. ఈ మాదిరి పాలనావ్యవస్థను సరిగ్గా నిర్వచించాలంటే సైనికప్రజాతంత్రం అనవచ్చు. కాని రాజ్యం అనడంతో మనకు తోచేదివేరు. అది దానికి చెల్లదు.

వీరయుగంలో గ్రీకుతెగలు కోటలుకట్టుకుని వుంటున్నాయి. మడిచెక్కల వ్యవసాయం, చేతివృత్తులు, పశువులమందలలో వానిసంఖ్యా పెరుగుతూంది. దాని సంపదలూ పెరుగుతున్నాయి. కొత్తకొత్త వుద్యోగాలు అవసరమవుతున్నాయి కార్యకలాపాన్ని పట్టి వానిని విభజిస్తున్నారు. వారితెలివీ, అవసరాలూ పెరగడంతో పాటు కొత్తనగరపాలనావ్యవస్థ ఏర్పడుతూంది. మంచి అనుకూల్యాలున్న ప్రాంతాం కోసం వారిమధ్య నిరంతర పోరాటాలు జరుగుతుండిన కాలంఅది. ఆస్తిపెరుగుదంతో పాటు సమాజంలో కులీనవర్గం తప్పకుండా పెరుగుతుంది. థెసియస్‌కాలంనుంచి, సొలోన్ క్లిస్థనీస్‌ల నాటివరకూ అటీనియన్‌సమాజంలో చెలరేగిన కల్లోలాలకు వారే కారకులు. క్రీ.పూ. 776నాటి మొదటి ఒలింపియాడ్‌కు కొంచెంముందువరకూ ఆ మధ్య కాలంలో అంతకుపూర్వం ఎప్పుడూ, ఆ వుద్యోగంలో వుండిన ఏ వ్యక్తికన్న బాసిలస్ చాల ప్రాధాన్యత గలవాడూ చాలశక్తివంతుడూ అయ్యేడు. ఆ పదవి, ఆ కాలం అటువంటిది. పురోహితునియొక్క, న్యాయాధీశునియొక్క బాధ్యతలు ఆ పదవికి సహజంగానే వున్నాయో లేక అప్పుడు ఇచ్చేరో, ఆయన నాయకసమితిలో ఎక్స్-అఫీషియోసభ్యుడుకూడా అనితోస్తుంది. ఆ పదవి చాలాపెద్దది. చాలా అవసరమైనదీ కూడ. యుద్ధరంగంలో సైన్యాధ్యక్షుడు ఆయన. పట్టణంలోని స్కంధావారంలో వున్న సైన్యంమీద అధికారం ఆయనదే. తత్ఫలితంగా పౌరవ్యవహారాలలోకూడ పలుకుబడి సంపాదించగలిగేడు. కాని ఆ పదవికి పౌరబాధ్యతలున్నట్లు కనబడదు. చారిత్రకయుగం నాటి గ్రీకురాజుల్ని గురించి మనకు లభ్యమవుతున్న సమాచారం చాలకొంచెం. వారి కార్యకలాపాలనుగురించి వివరంగా చెప్పేందుకు అనిచాలవు." అన్నారు ప్రొ॥ మేసన్

బాసిలస్‌యొక్క సైనిక, పురోహిత కార్యకలాపాలు వివరంగానే తెలుస్తున్నాయి న్యాయశాఖ కార్యకలాపాలు అంతబాగా తెలియడంలేదు. ఇక పౌరఅధికారాలు అనలు వున్నట్లే లేవు. గణవ్యవస్థలో అటువంటి పదవియొక్క అధికారాలు ఆచారాలు అలవాట్లుతో క్రమంగా నిర్దిష్టం అవుతాయి. బాసిలస్‌పదవి క్రమంగా మాతన బాధ్యత

లను ఎత్తుకుంటుంది అవి సమాజానికి చాల ప్రమాదకరమైనవిగ తయారవుతాయి నాయకసమితి ప్రభుత్వయంత్రంలో భాగంగానే వుంది ఆ వ్యవస్థలో గణాలలోవున్న ప్రజాతంత్రనియమాలకు అది ప్రతీక ఇక బాసిలస్ త్వరలోనే కులీనతా మాత్రానికి ప్రతీక అవుతాడు ఆ పదవికి ప్రజలు వప్పచెప్తున్న అధికారాలను అదుపులో వుంచేందుకు చేసేప్రయత్నంలో నాయకసమితికీ, బాసిలస్‌పదవికీ నిరంతరసంఘర్షణ కొనసాగిందనుకోవచ్చు చివరకు అధినియన్లు, ఆ పదవిని రద్దుచేయడంచూస్తే వారా పదవిని అదుపులోవుంచడం అసాధ్యం అయివుండొచ్చు అది కొత్తకొత్త అధికారాలను చేకూర్చుకొనేందుకు చేసేప్రయత్నం గణవ్యవస్థలోని ఆచారాలకు వ్యతిరేకంగా భావించివుంటా రనుకోవచ్చు

ఇటువంటి అనుభవాలతోనే కావచ్చు స్పార్టనులు బాసిలస అధికారాలను పరిమితంచేయడానికై ఎంతో కాలంముందే ఒక పేఠిష్టేటు పదవిని (Ephorality) సృష్టించేరు హోమరుకాలంనాడుగాని పురాణకాలంనాడుగాని సమితికార్యకలాపా లేమిటో స్పష్టంగా తెలియవు కాని అది నిరంతరాయంగా సాగుతున్నట్లే కనబడుతూనే వుంటుంది దానినిపట్టి సమితి అధికారం వాస్తవమైనదీ, ముఖ్యమైనదీ నిత్యమైనదీ నని భావించవచ్చు దానితోపాటే ప్రజాసభ వుండేది వారి ఆచారాలలో మార్పేమీ కనిపించదు దానినిపట్టి గణములు ఫ్రాట్రీలమీద, తెగలు జాతిమీద సర్వోన్నతాధికారం, ఆచారాలరీత్యానే సమితికి వుండే దనుకోవచ్చు తనపదవికి సంబంధించిన కార్యకలాపాల విషయమై బాసిలస్ ఈ సమితికి బాధ్యుడయి వుండేవాడనుకోవాలి గణాలకు స్వాతంత్ర్యం వుంది దానిసభ్యులకు ప్రతినిధులే సమితిసభ్యులు అందుచేతనే సమితికి స్వాతంత్ర్యం వుందనుకోవడమున్నూ, సర్వోన్నతాధికారం వుందనుకోవడంమున్నూ

సంప్రదాయికయుగం నాటి ప్రభుత్వాలను గురించి థైసిడను ఒక సందర్భంలో ఇలాచెప్పేడు "గ్రీకులు అధికశక్తివంతులు అవుతున్నకొద్దీ, ఇదివరకటికన్న ఎక్కువ ఆస్తిని సంపాదిస్తున్నకొద్దీ, ఆదాయాలు ఎక్కువై నగరాలలో ఎక్కువగా క్రూర నిరంకుశపాలనలు ఏర్పడుతున్నాయి ఇంతకుపూర్వం అక్కడ నిర్ణీతమలైన అధికారాలతో పారంపర్యంగా బాసిలియాలు వుండేవి ఈ పదవి ఎప్పుడూ వుండెదే ఒకవ్యక్తిచనిపోతే మరొకర్ని వెంటనే నియమిస్తారు కనకనే అది పారంపర్యం గణంలో పారంపర్యం గణసభ్యుల అభీష్టానుసారం ఎన్నుకొంటారు సమితి అతనిపేరును సూచించవచ్చు కాని గణసభ్యులు ఆమోదించాలి రోమన్లు రెక్స్ విషయంలో అదేచేసేవారు

గ్రీకు రచయిత లందరికన్న అరిస్టాటిలు వీరయుగంనాటి బాసిలియా గురించీ, బాసిలస్ గురించీ చాల సంతృప్తికరమైన నిర్వచనం ఇచ్చేరు నాలుగు తరహాల బాసిలియాలు వున్నాయన్నారు, ఆయన మొదటిది వీరయుగంనాటిది స్వతంత్ర ప్రజల మీద పాలనాధికారం, కొన్ని విషయాలలో పరిమితములైన అధికారాలు వానిని బాసిలను వారిసైన్యనాయకుడు, న్యాయాధికారి, ప్రధాన పురోహితుడును రెండోది అనాగరికులది ఇది పరంపరాగతమైన నిరంకుశ ప్రభుత్వం చట్టాలు దానిని అదుపులో వుంచుతాయి మూడో దానిని అసిమ్నెటిక్ అంటారు ఇది ఎన్నుకొన్న క్రూర నిరంకుశత్వం నాల్గోది లాసిడైమోనియన్ ఇది పరంపరాగత సేనానాయకత్వం తప్ప మరేమీకాదు చివరి మూడింటి మాట ఎలావున్నా, మొదటిది కేవలం రాజరికం మాదిరిది కాదు రాజపాలన అనలేకాదు బాసిలస్‌యొక్క ప్రధాన కార్యకలాపాలను అరిస్టాటిల్ చాల స్పష్టంగా పేర్కొన్నారు అందులో పౌరఅధికారాల వూరకూడా లేదు అన్నీ కూడ ఆ పదవి ఎన్నుకోబడతుందనీ, వ్యవధి జీవిత పర్యంతమనీ చెప్తున్నాయి బాసిలను నాయక సమితికి అధీనుడై వుంటాడని చెప్తున్నాయి ఈరచయితల నిర్వచనాలు 'పరిమిత హక్కులు', 'నిర్దిష్ట అధికారాలు' పట్టిమాస్తే, ఈ పాలనా రూపం గణ ఆచారాల అధీనంలో, వానితో సమన్వయం పొంది అభివృద్ధిపొందిందను కోవాలి అరిస్టాటిల్ నిర్వచనంలోని ప్రధానాంశం ప్రజలయొక్క స్వాతంత్ర్యం ప్రాచీన సమాజం సందర్భంలో దాని అర్థం పాలనా అధికారం యావత్తూ వారిచేతిలో వున్నదనీ, బాసిలస్ పదవి యిష్టాపూర్తిగానే యిస్తారనీ, తగినంత కారణం వుంటే తొలగిస్తారనీ అరిస్టాటిల్ వర్ణించిన ప్రభుత్వాన్ని సైనిక ప్రజాతంత్రం అనవచ్చు ఇది గణాల ఆచారాలలోంచి, సైనికోత్సాహాలు బలంగా వున్నప్పుడు, సంఖ్యలూ, సంపదలూ పెరిగినప్పుడు కోటలు కట్టుకుని జీవిస్తున్నప్పుడు, పరిపూర్ణ ప్రజాతంత్రాన్ని నెలకొల్పుకోగల అనుభవాలు పరిపక్వం కానప్పుడు సహజంగానే ఉద్భవిస్తుంది

గణాలు, ఫ్రాట్రీలు, తెగలు స్వతంత్ర స్వపరిపాలనా సంస్థలుగా కొనసాగుతున్నప్పుడు వాటిలోని జనం స్వతహాగానే స్వతంత్రు లయివుంటారు అనువంశిక అధికారంతో, సరాసరి జవాబుదారీ వహించనక్కర్లేకుండా రాజు పాలించడం అటువంటి సమాజంలో అసంభవం. గణాల ఆచారాలలో రాజుకూ, రాజరికానికీ తావులేదు. ప్రాచీన గ్రీకు సమాజంయొక్క నిర్మాణాన్నీ, నియమనిబంధనలనూ తోసిపుచ్చి, పౌరకార్యక్రమాలతోసహా బాసిలను పదవి సంపూర్ణ వంశానుగత అధికారంతో వుండేది అనడానికి గట్టిసాక్ష్యాధారంకావాలి చట్టబద్ధ రాజరికం క్రింద అంగ్లేయుడు,

రిపబ్లికు ప్రభుత్వంకింద అమెరికనులు స్వతంత్రులే వారి హక్కులకూ, స్వేచ్ఛలకూ రక్షణవుంది. అయితే ఆ స్వాతంత్ర్యాన్నీ, రక్షణనూ కాపాడుతున్నది లిఖిత శాసనాలు అవి చట్టబద్ధం చేయబడి, న్యాయస్థానాలచేత అమలు జరపబడుతున్నాయి ప్రాచీన గ్రీకు సమాజంలో లిఖితశాసనాలస్థానే ఆచారాలు, అలవాట్లూ వుండేవి అతమున్న సమాజ వ్యవస్థలోని ఆచారాలూ, అలవాట్లూ మీద అతని స్వేచ్ఛా, రక్షణా ఆధారపడి వుంటాయి వాటికి హామీ పదవులకు ఎన్నిక, పరిమితులూనే

రోమనుల 'రెజే'లు కూడా సైనికాధికారులే. పురోహిత బాధ్యతలు కూడా ఆ పదవికి వుండేవి రాజరిక ప్రభుత్వం అనబడేదికూడా ఈ మాదిరి సైనిక ప్రజాతంత్రమే ఈ రెక్స్‌ను సెనేట్ నిర్వచనచేసేవని ఇంతకుపూర్వమే చెప్పేను కమిటియా క్యూరియాటా ఆ నిర్వచనము ధృవపరిచేది ఈ రెక్స్‌లతో ఆఖరు వానిని పదవి నుంచి తప్పించేరు. ఆయనను తొలగించి పదవినే రద్దుచేసేరు రోమను రాజకీయ సమాజం ఏర్పడ్డాక మిగిలిన కొద్దిపాటి ప్రజాతంత్ర నియమాలకూ ఆ పదవి ఒద్దికకాదు.

ఆ పురాతన కాలంలో గ్రీసులో అక్కడక్కడ తలఎత్తిన క్రూర నిరకుంశ ప్రభుత్వాలకూ, గ్రీకుతెగలలో వచ్చిన రాజ్యాలకూ దగ్గరపోలికలున్నాయి బలాత్పూర్వకంగా నెలకొల్పిన ప్రభుత్వాలు అవి. మధ్య యుగాలనాటి ఫ్యూడల్ రాజులకు మించిన అధికారాలు వానికిలేవు. పూర్తి పోలికలకు కావలసినంతల్లా కొన్నితరాలపాటు ఆ పదవి తండ్రి నుంచి కొడుక్కు, అతనినుంచి అతని కొడుక్కూ సంక్రమిస్తూవచ్చి, చివరకది వంశపారంపర్యపు హక్కు కావడంఒక్కటే, కాని అటువంటి ప్రభుత్వాలు గ్రీకుల ప్రజాతంత్ర ఆచారాలకు సరిపడవు అందుచేతనే అవి గ్రీకు దేశంలో స్థిరంగా నిలబడ లేకపోయాయి

"ఎవరన్నా ధూర్తతతోనో మోసంతోనో ఆచారాల్ని తోసిపుచ్చి, తనను శాశ్వత పాలకుడినిగా నియమించుకుని, ఇష్టా రాజ్యంగా పాలిస్తూంటే-ఆ పాలన మంచి గానే వున్నా- అతని యెడ ప్రజలలో సద్భావం ఏర్పడదు ప్రారంభంనుంచీ అతని రాజదండం న్యాయబద్ధంకానేకాదు. ఇతర సందర్భాలలో హత్య జరిగినప్పుడు ప్రతీకార వాంఛ రగిలినట్లుగాక, అతనిని హత్యచేయడం మంచి పనిగానే భావించబడుతుంది " -అన్నారుగ్రోటే తన గ్రీసు చరిత్రలో

ప్రాంతీయత, ఆస్తిస్వత్వం మీద ఆధారపడిన నూతన రాజకీయ వ్యవస్థను అథీనియన్లు ఏర్పరచినప్పుడే ప్రభుత్వం విశుద్ధ ప్రజాతంత్ర ప్రభుత్వం అయింది.

అదో కొత్తసిద్ధాంతంకాదు దానిని ఆథీనియన్లు కొత్తగా కనిపెట్టనూలేదు అది ప్రాచీన మైనదీ, ఎరుకవున్నదీనే గణాలంత ప్రాచీనమూ అంత మహనీయమూనూ అనాదిగా వారి తాతముత్తాతల నుంచీ ప్రజాతంత్ర భావాల నెరుగుదురు వానిని అమలూ జరిపేరు అవి ఇప్పుడు విస్తృత నరచ బడినాయి అనేక విధాలగా ప్రభుత్వం మెరుగు పరచబడింది ఆ వ్యవస్థలోకి చొరబడి, బాసిలను పదవిసాయంతో ఆ పరి వర్తన కాలంలో ఎంతో సంక్షోభాన్ని సృష్టించిన కులీనవర్గం ఆ పదవి రద్దయి నాకకూడ వుండిపోయింది అయితే నూతన వ్యవస్థ వారి అధికారాన్ని కూలదోసింది మిగతా గ్రీకు తెగలకన్న ఆథీనియన్లు ప్రభుత్వం అంటే తమకున్న భావాల్ని కొనసాగిస్తు లాగేరు. అందుచేతనే సంఖ్య ఎక్కువ లేక పోయినా మేధాశక్తిలో మానవజాతి అంతటిలో చాల ప్రజ్ఞావంతులుగా ప్రసిద్ధిపొందేరు కేవలం మేధావంతులతో మానవ జాతికి ఇప్పటికీ ఆశ్చర్యం కలిగిస్తున్నారు అంతకు పూర్వపు మానవ పరిణామయుగ కాలంలో పుట్టి, పెరుగుతూ, వారి మేధనంతనూ అలుముకొని పోయిన భావాలు ప్రజా తంత్రయుతంగా ఏర్పరచిన ప్రభుత్వం రూపంలో ఫలవంతమైనాయి ప్రాణదాయక మైన దాని ప్రభావంలో అత్యున్నత మనోవికాసం సంభవించింది

క్లీస్థనీస్ తయారుచేసిన ప్రభుత్వ పథకంలో ఎన్నుకొన్న సెనేట్ గానాయకసమితి వుంది ప్రజాసభగా అగోరావుంది కాని ప్రధాన కార్యనిర్వాహక మేజిస్ట్రేటు పదవి రద్దుచేయబడింది గణాలనాటి సమితి, అగోరా, బాసిలసులే సెనేట్ కు, ప్రజాసమితికి, ప్రధానకార్యనిర్వాహక మేజిస్ట్రేటుకు బీజరూపాలు ఆధునిక రాజకీయ సమాజంలో కనిపించే రాజా, చక్రవర్తి, అధ్యక్షులకు పూర్వరూపం అయినబాసిలస్ పైవికాసనాల కొద్దీ ఆసమాజ నిర్మాణంలో ఏర్పడింది మానవజాతి పురోగతితో పాటు దానిలో వచ్చిన అభివృద్ధి గమనించతగింది ప్రధానయుద్ధనాయకుడినుంచి మొదట ఇరాక్వో సమాఖ్యలలోలాగ మహాయుద్ధ వీరుడు ఎదిగేడు తరవాత అజ్టెక్ సమాఖ్యలోని ట్యూక్ట్లీ మాదిరిగా పురోహిత బాధ్యతలతో కూడిన తెగల సమాఖ్య సైన్యాల నాయ కుడిగా పెరుగుతాడు తరవాత పురోహితుని, న్యాయాధీశుని బాధ్యతలు జతపడి తెగలు సమ్మిళితం అయి ఏర్పడిన జాతియొక్క సైన్యాధినాయకుడయి గ్రీకులబాసిలసు అవతరించేడు ఆఖరు అవతారం ఆధునిక రాజకీయ సమాజంలోని ప్రధాన మేజి స్ట్రేటు ఆథీనియన్ల ఆర్కాన్ ఎన్నికకావలసినవాడే ఆధునిక రిపబ్లికుల అధ్యక్షుడూ అంతే గణవ్యవస్థలోంచి వచ్చిన సహజ పరిణామం ఇది ఈనాడు నాగరిక రాజ్యాల

ప్రభుత్వ పధకాలలో సర్వసాధారణంగా స్వీకరించే మూడు ప్రధానసాధన పరికరాలనూ ప్రారంభించి, పెంపొందించిన అనాగరిక ప్రజల అనుభవజ్ఞానానికి మనం ఎంతో రుణ పడి వున్నాము మానవులలోని ప్రతిజాతిలో, ప్రతి తెగలో వుండేవ్యక్తుల మెదడు ఒకేవిధమైనది దాని శక్తులపరిధి అందరిలో సమానమే అది పనిచేసే తీరూ, సమానమే కొంచెం అటూఇటూగా అది పనిచేసే పరిధీ సమానమే ఒకదాని కొకదానికి సంబంధంలేని వేరువేరు ప్రాంతాలలోని, పరిస్థితులలో వేరువేరు కాలవ్యవధులలో కనిపించే ఫలితాలు అందరిలో సమానంగా కనిపిస్తున్నాయి అవి వారి అనుభవాల పరిణామక్రమరూపాలుగా పరస్పరానుబంధంతో వున్నాయి అపారంగా కనిపించే ఈ మొత్తంలో ఇప్పటికీ ప్రాధమిక భావబీజాలను గుర్తించవచ్చు అవి ప్రాధమిక మానవావసరాలకోసం పనిచేస్తూ క్రమ పరిణామంలో, అంతటి అపారఫలితాలను ఇచ్చేయి

# పదో ప్రకరణం

# గ్రీకులలో రాజకీయ సమాజ స్థాపన

ప్రభుత్వ ప్రాతిపదికలుగా గణాల వైఫల్యం- థెసియస్ రాజ్యాంగం- వర్గాలను ప్రవేశపెట్టే ప్రయత్నం- దానివైఫల్యం- బాసిలస్ పదవి రద్దు- ఆర్కాన్ పదవి- నౌక్రరీలు, ట్రిత్యేలు,- సోలోన్ శాసనం- ఆస్తిపరవర్గాలు- గణాలనుంచి వర్గాలకు పౌరశాసనాన్ని పాక్షికంగా బదలాయింపు- ఏగణానికి సంబంధించని జనం- పౌరులు చేయబడ్డారు- సెనేట్- ఎక్లెసియా- రాజకీయ సమాజం పాక్షికంగా సాధించబడింది- క్లిస్తెనిస్ చట్టం- రాజకీయ సమాజ స్థాపన- అత్తికా ప్రజల డెమోలేక నగరం- దానినిర్మాణమూ, అధికారాలూ- దాని స్థానిక స్వయంపాలన- స్థానిక తెగ లేక జిల్లా- అత్తికా కామన్వెల్త్- అథీనియన్ ప్రజాతంత్రం

గణ సమాజం నుంచి రాజకీయ సమాజంలోకి మారడంలో అనేక గ్రీకు కూటాలు పొందిన అనుభవాలు ప్రధానంగా ఇటువంటివే అయితే అథీనియన్ల చరిత్ర నుంచి ఈ మార్పు జరిగిన పద్ధతికి వుదాహరణనిస్తాను అథీనియన్ల మార్పు ఘటనలు చాల భద్రంగా కాపాడబడినాయి ఘటనా క్రమాన్ని రేఖామాత్రంగా ఇచ్చినా మన వుద్దేశం నెరవేరుతుంది ఏమంటే నూతన రాజకీయ వ్యవస్థ ఆరంభం కావడాన్ని మించి ప్రభుత్వభావన పెరుగుదలను ముందుకు సాగించడం నావుద్దేశంకాదు

సమాజావసరాలు చాల సంక్లిష్టం అయి గణంలోని ఆచారాలు వాటిని పరిదిద్ద లేక పోవడం చేత గణాలు ప్రాట్రీలు, తెగల చేతులనుంచి పౌరఅధికారాలను తీసివేసి కొత్తసంస్థల చేతుల్లో పెట్టేరు అయితే ఈ మార్పు జరగడానికి చాలకాలం పట్టింది తలెత్తిన ఇబ్బందుల నుంచి బయటపడేందుకు ఎప్పటికప్పుడు ఓ మార్గం వెతుక్కుంటూ వచ్చేరు పాతవ్యవస్థరద్దు అయినంత నెమ్మదిగానే కొత్తవ్యవస్థ పాదు

కొంటూ వచ్చింది కొంతకాలం పాటు రెండువ్యవస్థలూ పక్కపక్కనే సాగేయి ఈ అన్వేషణల స్వభావాన్నీ, లక్ష్యన్నీ పరిశీలనగా చూస్తే సమాజావసరాలను గణనిర్మాణం తీర్చలేకపోయిందో, గణవ్యవస్థను మార్చవలసిన అవసరం ఏమిటో, అదెల్లా జరిగిందో తెలుస్తుంది

మానవజాతి పురోగతి క్రమంలో వెనక్కి చూస్తే అనాగరిక యుగం దిగువ దశనాడు తెగలు సాధారణంగా కర్రలతో కట్టిన ఆవరణల లోపల నివశించే వారిని చూస్తాం మధ్యదశలో పచ్చిఇటిక, రాయితో కట్టిన కోటలవంటి పెద్దపెద్ద యిళ్ళలో నివశించేవారు ఎగువదశలో వలయాకారంగా మట్టిగట్లు పోసి, తరవాతచెక్కినరాతితో గోడలుకట్టి నివశించేరు మానవ చరిత్రలో రాతిగోడలు మొదటిమారులేచేయి అందరికీ రక్షణ ఇచ్చేందుకూ, అందరూ రక్షణ కార్యకలాపాలలో పాల్గొనేందుకూ వీలుగా చాలమంది జనం వుండేందుకు అనువుగా, పిట్టగోడలు, బురుజులు ద్వారాలతో రాయి చెక్కి గోడలు పేర్చి కోటలు కట్టడం ఒక పెద్దముందడుగే. ఇటువంటి పట్టణాలు లేచేయి అంటే అభివృద్ధి పొందిన, స్థిరమైన మడిచెలక వ్యవసాయం సాగుతున్నదని, పశువుల మందలు పెరిగేయని, వర్తకపుసరుకు బాగాతయారవుతున్నదని, ఇళ్ళ-వాకిళ్ళు, భూములు రూపంలో ఆస్తులు బాగా పేరుకున్నాయని అర్థం పట్టణం రాకతో సమాజంలో పరిస్థితి మారింది పాలనా విధానంలో మార్పులు అవసరం అయాయి మేజిస్ట్రేట్‌లు, న్యాయాధీశులు, అనేకతరగతుల సైన్య, నగర పాలకోద్యోగులు అవసరం అయ్యారు వారిని భరించేందుకు మునిసిపల్ వసూళ్ళూ, సైనిక వసూళ్ళూ కావలసి వచ్చేయి దానికై ప్రభుత్వధనం అవసరం అయింది నగర జీవితమూ, నగరవాంఛలూ నాయకసమితి బాధ్యతలను బాగా ఎక్కువచేసింది అదిదాని పరిపాలనా శక్తిని కుంగదీసి వుంటుంది

అనాగరిక యుగం దిగువదశలో పాలనాంగంగా నాయకసమితి ఒక్కటే వుండేది మధ్యదశలో నాయకసమితీ, సైన్యాధ్యక్షుడూగా పాలనాంగాలు రెండువుండేవి ఎగువదశలో పాలనాంగాలు మూడుఅయాయి నాయకులసమితి, ప్రజాసభ, సైన్యాధ్యక్షుడు నాగరికత ఆరంభమయాక పాలనాధికారం శాఖోప శాఖలుఅయింది ముందు బాసిలస్‌మీద వుండిన సైనికాధికారాన్ని ఇప్పుడు అత్మాదిక నిబంధనల మధ్య జనరల్‌లూ, కెప్టెన్‌లూ సాగిస్తున్నారు ఇంకాకొంచెం మార్పువచ్చి ఏథేనియన్లలో ఈ దశలో న్యాయశాఖ ఒకటి ఏర్పడింది దానిని ఆర్కాన్‌లు (మేజిస్ట్రేట్),డికాస్ట్లు (ఏథేనియన్లు ఏటా ఆరువేల మందిని న్యాయాధికారులనుగా ఎన్నుకొనేవారు) సాగించే

వారు మేజిస్ట్రేటు అధికారాలు మునిసిపల్ మేజిస్ట్రేటులకు వప్పచెప్పబడుతున్నాయి అనుభవం పెరిగినకొద్దీ నాయక సమితి చేతిలో వుండిన అధికారం విభజితమై వీరందరికీ వప్పచెప్పబడింది ప్రతినిధులసభగావచ్చి నాయకసమితికి ప్రజలు వప్ప చెప్పిన అధికారమేయిది

ప్రజలసమస్యలు పెరిగి, సంక్లిష్టంకావడం ఫలితంగా ఎన్నో మునిసిపల్ వుద్యోగాలు సృష్టిఅయాయి ఈ సమస్యలభారంతో గణసంస్థలు శిధిలం అయిపోతున్నాయి అధికారంకోసం తగువులాటలు పెరిగేయి పదవుల అధికారాలను ఇంకా నిర్దిష్టం చేయనందున ఇష్టంవచ్చిన రీతిని పదవీ దుర్వినియోగం చేయడంవల్ల వచ్చే ఘర్షణలు తప్పతిప్పలుగా వుండేవి ఈ పరివర్తన దశలో గ్రీకు తెగల పరిస్థితులను థూసిడైడ్స్ అద్భుతంగా సంగ్రహంగా వ్రాసేడు ఇతరేతర రచయితల రచనలు కూడా దానిని బలపరుస్తున్నాయి పాతపద్ధతి పరిపాలన విఫలమవుతున్నదనీ, ముందుకు పోగలించే కొత్తది అవసరం అవుతున్నదనీ తేలింది ప్రభుత్వాధికారాలను అంచెలుగా పంచడమూ వానిని స్పష్టంగా నిర్వచించడమూ అధికారంలోని వ్యక్తులు నిశ్చితమైన బాధ్యత వహించేటట్లు చేయడమూ, సమాజ క్షేమానికి భద్రతకూ అవసరం ఆచారాలూ, అలవాట్ల స్థానంలో సమర్థులైన వారు రూపొందించిన లిఖిత శాసనాలను తప్పక ప్రవేశపెట్టాలి అనాగరికయుగం మధ్య ఎగువదశలలో సంపాదించిన అనుభవ జ్ఞానంతో గ్రీకుల మనస్సులలో రాజకీయ సమాజం లేక రాజ్య భావన క్రమంగా రూపుదిద్దుకుంటూంది అదొక్కరోజున జరిగినదికాదు పాలనారూపం మారవలసిన అవసరం కనబడినది మొదలు మొత్తం ఆకారం ఏర్పడేసరికి కొన్నిశతాబ్దాలే పట్టింది

గణనిర్మాణాన్ని భగ్నపరచి నూతన వ్యవస్థను ఏర్పరచేందుకు అథీనియన్లలో మొదట ప్రయత్నంచేసిన వాడు థెసియస్ అనిచెప్తారు అయితే చరిత్రకాలంనాటికి కొన్ని ఘటనలు మిగిలివుండి, ఆయన చేశాడన్న శాసనం కొంతవరకైనా వాస్తవమే ననిపిస్తుంది థెసియస్‌ను ఒకదశకు కొన్నిఘటనలకు ప్రతీకముగా భావించవచ్చు సెక్రోప్స్ కాలంనుంచి థెసియస్ కాలంవరకూ అత్తికా ప్రజలు నగరాలలో జీవిస్తున్నారనీ, స్వంతంగా ప్రిటానియమ్‌లు, ఆర్కాన్‌లు వుండేవారనీ, ప్రమాదాలు లేనప్పుడు తమ బాసిలెవ్ ప్రమేయం పెట్టుకొనేవారుకాదనీ, తమ సమితులద్వారా తమ వ్యవహారాలను చక్కబెట్టుకొనే వారనీ థూసిడైడెస్ వ్రాసేడు అయితే థెసియస్ బాసిలెస్ అయాక ఆయన వారి అనేక నగరాలలోని సమితి భవనాలనూ, న్యాయకార్యాలయాలనూ భగ్నంచేసేటట్లు వారిని ఒప్పించి, ఏథెన్సుతో సంబంధంపెట్టుకొనే టట్లుచేసి, ఒకే

సమితి భవనాన్నీ, ఒకే ప్రిటానియంను (టౌన్‌హాల్) ఏర్పరచేడనీ, అదే తమదిగా ప్రతివారూ భావించేరనీ చెప్తారు ప్లూటార్కు కొంచెం ఇంచుమించు ఇదేవిధంగా చెప్పేడు "ఈయన అట్టికా ప్రజలందరినీ ఏథెన్సుకు చేర్చేడు వారంతా ఒకేనగరంలో నివసించే ఒకే ప్రజను చేసేడు అంతక్రితంవారు తలోమూల వుండేవారు ప్రజా క్షేమంకోసం ఏ పనిమీదనైనా వారిని ఒకచోట సమావేశ పరచడం చాల కష్టంగా వుండేది అందుచేత ప్రతిపట్టణంలోనూ వున్న కూటాలను, సమితులను, కోర్టులను, రద్దుచేసి ఒకేప్రిటానియంను, న్యాయస్థానాన్ని నిర్మించేడు అదే ఇప్పటికీవుంది పేటలు, నివార్లతో కోటను, పాత కొత్త పట్టణాల్నీ కలిపి ఒకేపేరుతో ఏథెన్సుపేరున పిలుస్తున్నారు" అన్నాడు ప్లూటార్కు. ఈ వివరణలో ఎన్నో ముఖ్యమైన విషయాలు వున్నాయి అట్టికా ప్రజ అనేక స్వతంత్ర తెగలుగా వుండెవారు ఏ తెగప్రాంతం ఆ తెగది వారంతా అక్కడే నివసించేవారు ప్రతివారికీ ఒక సమితి భవనం, న్యాయ భవనం (ప్రిటానియం) వుండేది ఎవరికివారు స్వయంపాలనలో వున్నా బహూశా రక్షణకొరకై సమాఖ్యగా ఏర్పడి వుంటారు తమ అందరి ఉమ్మడి సైన్యాలకు అధిపతిగా ఒక బాసిలసును ఎన్నుకొనేవారు ప్రజాతంత్ర పద్ధతిలో జీవిస్తూండే ప్రజా కూటాల చిత్రంఇది తమపరిస్థితుల అవసరంకొద్దీ ఒక సేనానాయకుని ఎన్నుకొని, పౌర వ్యవహారాలు ఆయనకు వప్పచెప్పేవారు కాదు థెసియసుక్రింద వారు ఒక ప్రజగా సమీకృతం అయ్యేరు వారిపాలనా కేంద్రం ఏథెన్సు అయింది అంతకుపూర్వం వారు ఏర్పరచుకోగలిగిన దానికన్న ఉన్నతమైన నిర్మాణంఇది సమాఖ్యలో తెగలు ఎవరిప్రాంతంలో వారుండేవారు సమీకృతం అయిన ఏర్పడిన ఈ సమ్మేళనలో తెగలన్నీ ఒకే ప్రజగా సమ్మిళితం అయి ఒకే ప్రదేశంలో నివసిస్తారు నిర్మాణాం వరసలో ఇదిపైది గణాలలో జనం వివాహంద్వారా కలిసిపోయి వుండేవారు ఇప్పుడు తెగలు ఒకేచోట వుండడంద్వారా ఒకే సమితి భవనాన్నీ న్యాయభవనాన్నీ ఉపయోగించుకోవడంద్వారా కలిసి పోతున్నారు థెసియసు చేసినాడన్న ఈ పని దిగువ నిర్మాణం నుంచి ఉన్నత నిర్మాణానికి గణసమాజం పెరగడాన్ని సూచిస్తుంది ఏదో ఒకప్పుడు అది ఇల్లాగే జరిగివుంటుంది

అయితే థెసియసు చేసిన మరో పనిగా చెప్పేది ఇంతకన్నా మౌలికమైనదీ, ప్రభుత్వ వ్యవస్థలో పూర్తి మార్పు అవసరమని గుర్తించినదీను నిగణంలో పుట్టేదన్న దానితో నిమిత్తం లేకుండా ప్రజల్ని మూడు వర్గాలుగా విభజించేడట ఆయన ఒకవర్గం "యూపాత్రిదే" లేక కులీనులు రెండోవర్గం గియో మోరి- సేద్యగాళ్ళు

దెమూర్గి - చేతివని వారు మూడోవర్గం పౌరపాలనకు, పౌరోహిత్యానికి సంబంధించిన ముఖ్యమైన పదవులు మొదటి వర్గానికి ఇచ్చేరు ఇది ఆస్తిని గుర్తించడం సమాజ పరిపాలనలో కులీనతను ప్రవేశపెట్టడ మున్నూ రెండో వేపున ఇది గణాల పాలనా వ్యవస్థకు పూర్తి వ్యతిరేకం గణనాయకుల్నీ వారికుటుంబాల్నీ వివిధతెగలలోని ధన వంతుల్నీ ఒక వర్గంగా చేర్చే ప్రయత్నం ఇది సమాజంలోని అధికార పదవుల్ని వారికి కట్టబెట్టే ప్రయత్నమున్నూ, మిగిలిన వారందర్నీ రెండు వర్గాలుగా విభజించడం కూడా గణ వ్యవస్థకు వ్యతిరేకమే వోటింగ్ అధికారాన్ని గణాలు, ఫ్రాత్రీలు, తెగలనుంచి తప్పించడం ప్రధాన కార్యాలయాలను మొదటివర్గం చేతిలో వుండేపద్ధతి విధించి వర్గాలకు వోటింగు అధికారం ఇవ్వడం జరిగివుంటే చాలా ముఖ్యమైన ఫలితాలే కలిగి వుండేవి వర్గవిగ్రహానికి పుష్టినిచ్చే టంమకు అల్లాజరగడం అవసరమే కాని, జరిగినట్లులేదు పైగా ఇదివరలో పదవులలో వున్నవారే ఇప్పుడూ కొనసాగుతున్నారు గతంలో పదవులకు ఎన్నుకున్న వారినే ఇప్పుడూ యూపాట్రిడ్స్‌గా పిలిచివుంటారు. అయితే ఈ పథకం నిలవలేదు దానికి కారణం— వాస్తవానికి గణాల, ఫ్రాత్రీల, తెగల చేతిలోని అధికారం వర్గాల చేతికి రాకపోవడమే గణవ్యవస్థలో ఆ వర్గాలు గణాలకు చేతోపువాళ్ళు కావడమే కారణం

థెసియను ఎప్పటివాడో తెలియదు అప్పటినుంచి సొలోన్ చట్టం (క్రీ పూ. 594) వరకూ గడచినది ఎథీనియనుల అనుభవంలో చాలముఖ్యమైన కాలం అయితే ఆనాటి ఘటనా క్రమం గురించి సరిగ్గా తెలియదు మొదటి ఒలింపియాడ్‌కు (క్రీ పూ 776) ముందే బాసిలస్ పదవిని రద్దుపరచి దానిస్థానే ఆర్కాన్ పదవిని ఏర్పరచేరు. ఆర్కాన్ పదవి ఒకగణంలో, ఆ గణంలోని ఒక కుటుంబంలో పారంపర్యం అవి తోస్తూంది మొదటి పన్నెండు ఆర్కాన్‌లనూ 'మెడాన్‌టిడే' అంటారు ఇది మెడాన్ శబ్దభవం మొదటి ఆర్కాన్ తండ్రి కోడ్రస్ ఆయన అకిరిబాసిలస్ ఈ ఆర్కాన్ పదవి జీవితకాలవ్యవధి గలది ఈ పదవిని స్థిరీకరించడం అవసరం వుండిందా అన్న ప్రశ్న బాసిలస్ పదవి విషయంలో లాగనే వస్తూంది పారంపర్యపు హక్కుగా వచ్చేది కాదనే వూహించాలి క్రీ పూ 711లో ఆర్కాన్ పదవిని పదేళ్ళకు పరిమితం చేసేరు. ఆ స్థానానికి తగువన్న మంచి సమర్థుణ్ణి ఎన్నుకొని నియమించేవారు మనం ఇప్పుడు చరిత్రకాలంలోకి వచ్చాము సరిగ్గా అంతకుముందు ఈ ఉన్నత పదవిని

ఎన్నిక ద్వారా ప్రజలు బహూకరించేవారన్నది స్పష్టంగా నిరూపితమయింది అస్తులు పెరిగి కఠినత అనేది గణంలో ప్రవేశించి ఆ బలంతో పీఠయిన చోట్ల కెల్ల కుటుంబ పారంపర్యపు హక్కును ప్రవేశపెడుతున్నా, గణనియమాలు ఆచరించబడుతున్నంత కాలం జరిగేది ఇంతే తరవాత వచ్చిన ఆర్కాన్ల విషయంలో కూడా ఎన్నిక నియమం అమలు జరిగింది అధీనియన్లలో అంతకు పూర్వం కూడా బాసిలనును ఎన్నుకొనే వాడనడానికి ఇది సాక్ష్యం క్రీ పూ 683లో ఈ పదవికి ఏటా ఎన్నిక జరగాలని నిర్ణయించేరు తొమ్మిది మంది ఆర్కాన్లను నిర్ణరవారు వారికి పురో హిత, న్యాయాధిపతి బాధ్యతలను ఇచ్చేరు "ఈ తొమ్మిది మంది ఆర్కాన్ల సంఖ్య క్రీ పూ. 683 నుంచి ప్రజాతంత్రం అంతమైనంత వరకూ కొనసాగింది వారిలో ముగ్గురికి ప్రత్యేకమైన బిరుదులుండేవి ఒకరు ఆర్కాన్ ఎపోనిమస్ ఆయన పేరు నుంచే ఆ సంవత్సరానికి పేరు వచ్చింది ఆయనను "ఆర్కాన్‌గారు" అంటారు మరొకాయన ఆర్కాన్ బాసిలస్ (రాజు) ఈయనను సాధారణంగా బాసిలస్‌గా పేర్కొంటారు మూడోది పోలెమార్క్ మిగిలిన ఆరుగురినీ థెస్మోథెటాయ్ అని ఉమ్మడి పేరున పిలిచేవారు కుటుంబం, గణాలు, ఫ్రాట్రీలు, తెగల సంబంధాల తగవులను ఆర్కాన్ ఎపోనిమస్ తీరుస్తారు చట్టం రీత్యా అనాధలు, వితంతువులకు ఆయన సంరక్షకుడు ఆర్కాన్ బాసిలస్ లేక రాజు ఆర్కాన్ మతసంబంధమైన నేరాలు, హత్యానేరాలు గురించిన ఫిర్యాదులను పరిష్కరించేవాడు క్లీస్తెనెస్ కాలంవరకూ పోలెమార్క్ సైన్యబలాల నాయకుడు పౌరులకూ పైవారికీ మధ్యతగవులలో తీర్పరి" —అని గ్రోటే తన History of Greece లో వ్రాసేరు పదవీకాలానికి సంబంధించి వచ్చిన మార్పులు ఈ ఘటనల్లో చూస్తాము అధీనియన్ తెగలలో అనాదిగా గణానికి నాయకుడుగా ఆర్కాన్ వుండేవాడు అది గణంలో పారంపర్యంగా వుండేది గణసభ్యులు దాన్ని ఎన్నుకొనేవారు. పారంపర్యం పురుషునికి మారినాక చనిపోయిన వానికొడుకులు ఆ పదవికి అర్హులుగా పరిగణించబడ్డారు ఆ కొడుకులలో ఒకరిని-వ్యక్తిగత అభ్యంత రాలు లేకపోతే - ఆ పదవికి ఎన్నుకొనేవారు ఇప్పుడు తమ ఉన్నత మేజిస్ట్రేటు పదవికి మొదటిపేరే పెట్టుకున్నారు గణాలతో నిమిత్తం లేకుండా ఆ పదవికి ఎన్నిక జరిపేరు అయితే పదవీకాల పరిమితిని మొదట పదేళ్ళకు, తర్వాత ఏడాదికేడాదికి నిర్ణయించేరు ఇంతకు పూర్వం పదవీకాలం జీవితాంతం వరకు వుండేది అనాగరిక యుగం దిగువ మధ్యదశలలో నాయక పదవికి ఎన్నిక జరిగేది దానివ్యవధి జీవిత

పర్యంతం లేదా మంచిగా వ్యవహరించినంత కాలం ఈ నియమం పెట్టడంవలన ఆతనిని పదవినుంచి తొలగించే హక్కు గణానికి వున్నదని అర్థం గ్రీకు తెగలలో కూడ నాయకపదవికి ఎన్నిక, జీవితకాల వ్యవధి వుండేవనే అనుకోవచ్చు అథీనియన్ తెగలు ఇంతకు పూర్వకాలంనాడే అతిముఖ్యమైన పదవికి కాలవ్యవధిని నిర్ణయించి, దానికి అభ్యర్థులు పోటీ పడేటట్లు చేశారంటే వారు చాలా అనుభవజ్ఞానం సంపాదించే రనడానికి సాక్ష్యం ఆ విధంగా పదవికి ఎన్నిక జరిపి, దానికి ప్రా-నిధ్యపు పదవిని చెయ్యాలనే నియమాన్ని రూపొందించేరు దానికి మంచి పునాదిని ఏర్పరచేరు

సోలోన్ కాలంలో మాజీ అర్కాన్‌లతో 'అరియోపాగస్' న్యాయస్థానం ఏర్పడింది నేరగాళ్ళను విచారించే హక్కు, నీతినియమాలను కాపాడే హక్కు దీనికి ఇచ్చేరు దీనికితోడు సైన్యంలో, నౌకాబలగాలలో, పాలనా నిర్వహణశాఖలో కొత్త కొత్త పదవులు ఎన్నో ఏర్పరచేరు అయితే ఈ కాలంలో జరిగిన అతి ప్రధాన ఘటన న్యాక్రారీలను ఏర్పరచడం ప్రతి తెగకు పన్నెండు చొప్పున నలభయ్యెనిమిదింటిని ఏర్పరచేరు సైన్య, నౌక సైనికులను లేవీగా పంపేకుటుంబాలను స్థానికంగా నిర్ణయించడం ఈ వుద్యోగులపని బహుశా వారినుంచి పన్నులూ వసూలుచేస్తుండి వుంటారు ఈ న్యాక్రారీమే తరవాత డెమేలేక వార్డుగా రూపొందింది. ప్రభుత్వం ప్రాంతీయ ప్రాతిపదికకు పూర్తిగా పెరిగినాక ప్రభుత్వ పథకానికి ఈడెమోలు పునాదిగా వుంటాయి ఈ న్యాక్రారీలను ఏర్పరచిన దెవరో తెలియదు ఇవి సోలోన్‌కు ముందు నుంచీ వుండి వుంటాయి ఏమంటే ఆ ఉన చట్టం కాలానికి ముందు మంచీనాక్రారీల అధ్యక్షుల ప్రసక్తి వినబడుతూంది వారిని ఏర్పరచింది సోలోన్ అని అరిస్టాటిల్ అంటాడు కాని సోలోన్ రాజ్యాంగ చట్టం వాటిని ధ్రువపరుస్తున్నదనే దానికి అర్థం చెప్పుకోవాలి" —అన్నారు థోమ్ పన్నెండు న్యాక్రారీలు కలిపి ఒక ట్రిట్టిస్ అంటే దానికన్న పెద్ద ప్రాంతం అయితే ట్రిట్టిస్‌లోని పన్నెండు న్యాక్రారీలూ పక్కపక్కన వుండనక్కరలేదు పట్టణం కన్న పెద్దదయిన దేశానికి ఈ ట్రిట్టిస్ బీజం అనాలి

ప్రభుత్వ నిర్వహణ సాధనాలలో ఎంతటి మార్పులు వచ్చినా, ప్రజలు ఇంకా గణసమాజంలోనే, గణ ఆచారాలలోనే జీవిస్తున్నారు గణము, ఫ్రాట్రీ, తెగ బలంగానే వున్నాయి అధికారం వున్నది వానిలోనే సోలోన్‌కు ముందు గణంతోటీ, తెగతోటీ సంబంధంవుంటే తప్ప ఈ సమాజంలో సభ్యుడు కాలేడు గణంలోనూ తెగలోనూ సంబంధంలేని వారంతా ఆ ప్రభుత్వానికి పరాయివాళ్ళే ప్రాచీన కాలంనుంచీ వస్తున్న నాయకసమితే ప్రభుత్వ సాధనంగా వుంది అయితే ఇప్పుడు ప్రభుత్వాధికారం దాని

అగోరా - ప్రజాసభకీ, అరియోపాగస్ కోర్టుకీ, తొమ్మిదిమంది అర్కాన్‌లకీ మధ్య పంపిణీ అయింది ప్రజాకార్యాలను ఆలోచించి, రూపొందించి, ప్రజాసభ ముందు పెట్టే బాధ్యత నాయకసమితిది వాటిని పట్టి ప్రభుత్వ విధానం రూపొందించబడుతుంది ప్రభుత్వ ఆర్థికశాఖ దాని చేతులలోనే వుంటుంది ప్రభుత్వంయొక్క కీలకలక్షణం అది ఆదినుంచీ పాలన దాని పెత్తనంలోనే వుంది ఇప్పుడూ అంతే ప్రజా సభకు ఇప్పుడు అధిక ప్రాముఖ్యం వచ్చింది సమితి తనముందు పెట్టిన ప్రజాకార్యాలను ఆమోదించడం, నిరాకరించడం వరకే దానిబాధ్యతలుగా వున్నా ప్రభుత్వ వ్యవహారాలలో దాని పలుకుబడి విస్తరిస్తూంది ప్రభుత్వంలో ప్రజాసభ పలుకుబడి పెరిగి, బలపడడం ఆథీనియను ప్రజల పరిజ్ఞానానికి ప్రతిభకూ నిదర్శనలు దురదృష్టవశాత్తూ, ఆ ప్రారంభ దినాలలో నాయకుల సమితిపీ, ప్రజాసభపీ కార్యకలాపాలు ఏమిటో, అధికారాలు ఏమిటో స్పష్టంగా వివరించ బడలేదు వాటిని జాగ్రత్త పరచనూలేదు

క్రీ పూ 624లో డ్రాకో అనే ఆయన అథీనియన్లకుకొన్ని శాసనాలు తయారు చేశాడు అవసరంలేని కాఠిన్యం చూపుతున్న ఆ చట్టాలు క్రౌర్యానికి చాలా ప్రసిద్ధి పొందేయి అయితే దీనివలన ఒకటి స్పష్టం అయింది గ్రీకులు ఆచారాలూ, అలవాట్లూ స్థానే లిఖిత శాసనాలను రూపొందించు కోవలని వంతగా పెరిగేరు ఆథీనియన్లకు చట్టాలు చేసుకోవలసిన అవసరం ఏర్పడిందేగాని, చట్టాలు చేసుకునే నేర్పు పట్టుబడలేదు అందుకై శాసన నిర్మాణ సంస్థల విధులు, కార్యకలాపాలు గురించిన పరిజ్ఞానం రావాలి వారు అంతవరకు ఎదగలేదు న్యాయచట్టాలు రాసిపెట్టే వాళ్ళు తయారయే స్థితికి వారు ఎదిగేరు అంతే అందుచేత చట్టాలు వ్రాసిపెట్టిన వారి పేరున అవి మొత్తంగా ఒక పథకంగా పిలవబడతాయి ఆ విధంగా మానవ ప్రగతిలోని ప్రధాన ఘట్టాలు క్రమంగా విస్ఫుటమౌతాయి

594 (క్రీ పూ )లో సొలోన్ ఆర్కాన్ పదవికి వచ్చినప్పుడు సమాజంలో ప్రచలితంగా వున్న దుర్మార్గాలు దుర్భర స్థితికి చేరేయి ఆస్తులు సంపాదించడం జీవిత ధ్యేయంగా తయారయి అసాధారణ ఫలితాలు నిచ్చింది ఆథీనియన్లలో కొందరు అప్పులద్వారా బానిసలయ్యేరు - అప్పుతీర్చలేక పోయినప్పుడు రుణగ్రస్తుడు రుణదాతకు బానిసీడు అవుతున్నాడు కొందరు భూముల్ని తనఖా పెడతారు మరి విడిపించుకోలేరు. ఇవీ, ఇల్లాంటి మరికొన్ని పరిస్థితులు ఏర్పడి సమాజం తనను తానే నాశనం చేసుకొంటూంది ప్రధానమైన ఆర్థిక సమస్యలను క్రమస్థితిలో పెడుతూ సొలోన్ సరికొత్త వాటితో సహా చట్టాలను తయారుచేసేడు. థెసియను లాగా సమాజాన్ని

వర్గీకరించాడు అయితే థెసియను లాగా వృత్తుల్ని పట్టిగాక, ఆస్తి పరిమితుల్ని పట్టి ఈమార్పు వర్గీకరణం జరిగింది గణవ్యవస్థను రద్దుపరచి నూతన వ్యవస్థను ఏర్పరచే క్రమంలో జరిగిన పరిశీలనలను తెలుసుకోవడం చాల విజ్ఞానదాయకం సెర్వియస్ తుల్లియస్ కాలంలో రోమను తెగలు కూడా ఇదేఅవసరం కోసం ఇదే విధంగా ప్రయత్నాలు చెయ్యడం కనబడుతుంది వారి వారి సంపదల్ని పట్టి ప్రజల్ని సొలోన్ నాలుగు వర్గాలుగా విభజించేడు థెసియస్ చెయ్యలేనిపని - ఈ వర్గాలకు కొన్ని అధికారాలు ఇచ్చేడు దానితోపాటు కొన్ని బాధ్యతలనూ వప్పచెప్పేడు గణాలు, ఫ్రాట్రీలు తెగల అధీనంలోని పౌరబాధ్యతలు కొన్నింటిని ఆస్తిపరవర్గాల చేతిలో పెట్టేడు గణాలు, ఫ్రాట్రీల తెగలచేతి నుంచి తీసుకొని వర్గాలచేత పెట్టిన అధికారాల పరిమితిని పట్టి గణవ్యవస్థ బలహీనపడడం, క్రమంగా శిథిలమైపోవడం జరుగుతుంది వ్యక్తుల సముదాయమే గణాలు అల్లాగే వ్యక్తుల సమాహారమే వర్గాలున్నూ అందుచేత వెనకటల్లే నే పాలనాయంత్రం కేవలం వ్యక్తి సంబంధాల ప్రాతిపదికమీదనే నడుస్తుంది అందుచేత ఈ పథకంకూడా సమస్యయొక్క మూలాన్ని పట్టుకోలేకపోయింది పైగా నాయకుల సమితిని నాలుగువందలమంది సభ్యులుగల సెనేట్‌గా మార్చినా,దానిసభ్యుల్ని వర్గాలనుంచి గాక తెగకు నూరుగురిని చొప్పున నాలుగుతెగలనుంచీ నిర్ణయించేడు ఇక్కడ ఒకటి గమనించాలి సొలోన్ తయారుచేసిన ఆస్తిపరవర్గాల పథకంలో ప్రభుత్వ వ్యవస్థ మూలం ఆస్తిగావాన్ని చేసేరు అయితే ఆస్తితోపాటు ప్రాంతీయతను కూడా గణనకు తీసుకొని, ప్రాంతీయ సంబంధాలను పట్టి వ్యక్తులతో వ్యవహరించవలసిన రాజకీయ సమాజం ఏర్పడలేదు దీని లోపం అక్కడుంది ఈ వర్గాల్లో మొదటిది మాత్రమే ఉద్యోగాలకు అర్హం రెండోది అశ్వికసైన్యంలో, మూడోది కాల్బలంలో, నాలుగోది తేలిక ఆయుధాలు తీసుకొనే సైనికులుగా వుండగలరు ఈ నాలుగోవర్గం సంఖ్య అధికం వారికి ఉద్యోగార్హతలేగు పన్నులుండవు అయితే ప్రజాసభలో వారూ సభ్యులుగా వుంటారు మేజస్ట్రేట్లనూ, ఉద్యోగులనూ ఎన్నుకొనేందుకూ, తొలగించేందుకూ వారికీ వోటు వుంది ప్రజాసభ ముందు సెనేట్ ప్రవేశపెట్టిన ప్రజాకార్యక్రమాలను ఆమోదించేందుకూ, నిరాకరించేందుకూ అధికారం వారికి వుంది సొలోన్‌చట్టంప్రకారం వారికిగల అధికారం వాస్తవమైనదీ, మన్నించబడేదీను ప్రజా వ్యవహారాలమీద వారికిగల పలుకుబడి సుస్థిరమూ, పరిగణనీయమూను ఏ గణాలకో, ఏ తెగలతో సంబంధం లేకపోయినా స్వతంత్ర ప్రజలందర్నీ ఈ చట్టం ప్రభుత్వ అధీనంలోకి తీసుకువస్తుంది కొంతవరకూ వారు పౌరులుగా పరిగణించ

బడుతున్నారు పైన చెప్పిన అధికారాలతో ప్రజాసభ సభ్యులూ అవుతున్నారు సొలోన్ చట్టంలోని అతి ప్రధానవిషయం ఇది

మరొక విషయం గమనించాలి ఈ చట్టం ప్రజలందర్నీ మూడు అంగాలు గల సైన్యాన్నిగా చేస్తూంది అశ్వికబలం పదాతిబలం - భారీ ఆయుధాలు గలది కాల్బలం చిన్నతరహా ఆయుధాలుగలదిన్నీ ఈ మూడింటిలో ఎవరికి వారికే వారి ఆఫీసర్లూ, వారి తరగతులూ వుంటాయి అయితే ఈ ఏర్పాటు చివరి మూడు తరగతులకే మొదటి తరగతికి పదవులే గాని, దేశరక్షణ ప్రమేయం పెట్టలేదు దీనిని సవరించడం అవసరం సెర్వియస్ తుల్లియస్ అధికారం కింద రోమన్లలో కూడ ఇటువంటి నిర్మాణమే జరిగింది అయితే వారి వర్గాలు అయిదు ప్రజలంతా సైన్యం అన్నారు ప్రతి విభాగానికీ ఆఫీసర్లూ, ఆయుధాలు వేరువేరు గతించిన కాలపు సైనిక ప్రజాతంత్రమే సొలోన్, సెర్వియస్‌ల రాజ్యాంగ చట్టాల క్రింద పునరుద్భవించింది దాని నిర్మాణం వేరు కావచ్చు కాని సూత్రం రెండింటికీ ఒక్కటే

నూతన వ్యవస్థకు పునాదిగా ఆస్తి అంశం తీసుకున్నా, ప్రాంతీయాంశం కూడా కొంతవరకు ప్రవేశించక పోలేదు పైన చెప్పిన న్యూక్రారీలు ద్వారా ఈ అంశం చేర్చబడింది సైనికుల లెవీకోసమూ, పన్నులు వేయడానికి ఆస్తి ప్రాతిపదిక మీద న్యూక్రారీలలో పౌరులను నమోదు చేయడం జరిగేది పెనేటు, ఎక్లెసియా అని పిలిచే ప్రజాసభ, తొమ్మిదిమంది ఆర్కాన్‌లతో అరియోపాగస్ న్యాయస్థానం - దీనితో ఆధీనియన్లకు అంతకు పూర్వంలేని చాల విస్తృతమైన ప్రభుత్వయంత్రం ఏర్పడింది దాన్ని నిర్వహించాలంటే తెలివి చాల ఎక్కువగా వుండాలి అంతకు పూర్వంనాటి ఆలోచనలూ, ఆచారాలూ ప్రకారం అది మౌలికంగా ప్రజాతంత్రం నిజానికి అది వాని కొనసాగింపే అంతకన్న మరోవిధంగా చెప్పలేము అయితే అది నిశుద్ధ ప్రజాతంత్రం కావడానికి మూడు లోపాలున్నాయి మొదటిది దానికి మూలం ప్రాంతం కాదు రెండోది అన్ని ఉన్నత పదవులూ ప్రజలందరికూ చెందవు మూడోది మూల గత సంస్థలతో స్థానిక స్వపరిపాలన సూత్రం వారి ఎరుకలోనే లేదు బహుశా న్యూక్రరీలలో అసమగ్రంగా వుండడం తప్ప, గణాలు, ఫ్రాట్రీలు, తెగలు పూర్తి జీవంతో వున్నాయి అయితే అధికారాలు నన్నగిల్లేయి అదొక మధ్యంతర దశ రాజకీయ వ్యవస్థ వేపుగా అదొక ముందడుగు ఇంకా అనుభవం పెరిగితే తప్ప రాజకీయ వ్యవస్థ సిద్ధాంతం అభివృద్ధికాదు ఈ విధంగా మానవుని మేధ ఒకే రీతిలో,

నిర్ణీత మార్గాలలో పనిచేస్తూ నెమ్మదిగా, బెనగకుండా మానవుని ఆచారాలను దిగువ రూపాల నుంచి ఉన్నత రూపాలకు తీసుకుపోతుంది

గణాలను తోసేసి, నూతన ప్రభుత్వ పథకాన్ని దాని స్థానంలో ప్రవేశపెట్టడానికి చాల బలమైన కారణం వుంది థెసియస్ దానిని గ్రహించేడనుకోవచ్చు సొలోన్ అయితే నిస్సందేహంగా గ్రహించేడు సొలోన్‌కు పూర్వం నాడు గ్రీకు తెగలలో సంక్షోభం ఏర్పడి, తప్పని సరిగా జనం తమచోట్లు వదలి దూరం పోవడం జరిగింది అనేకమంది ఒక జాతినుంచి మరోజాతికి మారేరు వారికి తమ గణాలతో సంబంధాలు తెగిపోయాయి మరోదానితో సంబంధం ఏర్పడలేదు వ్యక్తులలోని సాహసోత్సాహాలు మూలంగా ఇది తరుచు సంభవిస్తూ వచ్చింది వర్తక వాణిజ్యాలూ, యుద్ధాలూతో వివిధ ప్రాంతాలకు విస్తరించేరు కొంతకాలం అయ్యేసరికి గణానికి ఏ విధమైన సంబంధంలేని జనం ప్రతి గణంలోనూ ఏర్పడ్డారు వారి సంతానం విస్తరించుతుంది ఇటువంటి వారు ప్రభుత్వం పరిధిలోకిరారు గణాలు, తెగల నిర్మాణంతో సంబంధం వుంటే తప్ప వారు ప్రభుత్వ పరిధిలోకి రారాయె ఈ విషయాన్ని గ్రోటే గమనించేరు "ఫ్రాట్రీలూ, గణాలూ ఎప్పుడూ దేశంలోని జనాన్ని అందర్నీ తమలో ఇముడ్చుకోలేదు క్లాస్థెనెస్‌కు ముందూ, అటు తర్వాతకూడ వానిలో చేరని జనం అంతకంత కెక్కువ అవుతూ వచ్చేరు లైసర్గస్ కాలం నాటికే మధ్యధరా సముద్రపు దీవుల నుంచీ, దాని తూర్పు కోస్తామీద ఇయోనియన్ నగరాలనుంచీ జనం విపరీతంగా గ్రీసులోకి వలసవచ్చేరు వారితో గణాలకు సంబంధించిన జనం ఎక్కువయ్యారు ఆ వచ్చేవారు కుటుంబాలకు కుటుంబాలే వస్తే ఒక కొత్తగణంలోని భాగాన్ని తమతో తెచ్చినట్లే ఈ కొత్త గణాన్ని ఏదన్నా తెగలోకి చేర్చక పోతే వారు పరాయివారుగానే మిగిలిపోతారు అనేక సందర్భాలలో ఇదే జరిగి వుంటుంది గ్రీసులో అసాధారణ సంఖ్యలో గణాలు వుండడానికి ఇదే కారణం అయివుండొచ్చు గణాలూ ఫ్రాట్రీలు దేనికి అదేగా వుంటాయి ఇతరుల్ని కలుపుకోవు కాని పైనుంచి వచ్చిన వారిని స్థానిక గణాలలోకి దత్తత ద్వారా చేర్చుకోవడంతో వానిలో సోదరభావం కలిగింది పేరూ, ప్రఖ్యాతీ వున్న వారిని ఏ గణంలోకన్నా చేర్చుకోవచ్చు అల్లాగే ధనవంతుల్ని ఏ తెగలోకన్నా చేర్చుకోవచ్చు కాని హీనవాళ్ళకి ఈ అవకాశం వుండదు థెసియస్ కాలం నాటికే, ముఖ్యంగా సొలోన్ కాలం నాటికి దానివలుగాక, ఏ గణానికీ చెందని జనం సంఖ్య గ్రీసులో చాలా పెరిగింది వారికో గణమూ, ఓ ఫ్రాట్రీ లేదేమో మత సంబంధమైన హక్కులు కూడా ప్రత్యక్షంగా వుండవు అవి ఆ నిర్మాణాలకు మాత్రమే సంబంధించినవీ,

వానితో సహజ సంబంధంగలవిన్నీ ఈ తరహా జనంలో సమాజ భద్రతకు ప్రమాదం తెచ్చిపెట్టే రూపంలో అసంతృప్తి పెరిగిందంటే ఆశ్చర్యంలేదు

వర్గ విభజనతోపాటు వారికి పౌరసత్వం కలిగించేందుకు థెసియసూ, సొలోనూ చేసిన ప్రయత్నాలు అసమగ్రం వారిని వరాయీవారుగా భావించి వ్యవహరించే ఫ్రాట్రీలూ, గణాలూ, మిగిలేవున్నాయి కనక వారిది అసమగ్ర పరిష్కారమే "సొలోన్ తర్వాత పురాతనగణాలు, ఫ్రాట్రీల రాజకీయస్థితి ఏమిటో స్పష్టంగా తెలుసు కోవడం మాత్రంకాదు గణాలూ, ఫ్రాట్రీలతో ఏర్పడిన నాలుగుతెగలలో ఆ గణాలూ, ఫ్రాట్రీలలో ఏదో ఒకదానికి సంబంధించని వారిని చేర్చుకోవడం సాధ్యంకాదు ఇప్పుడు ప్రాథమిక పరిశీలన జరిపే సెనేట్‌లో ప్రతితెగనుంచీ 100చొప్పున 400మంది సభ్యులున్నారు కనక ఏ గణానికీ, ఫ్రాట్రీకీ సంబంధించని వారికి అందులో ప్రవేశం వుండదు తొమ్మిది మంది ఆర్కాన్‌లకు, అరియోపాగస్ సెనేట్‌కూ కూడ అర్హులు కావాలంటే కూడ అదేపరిస్థితి ఇక మిగిలింది ప్రజాసభ దానిలో ఏ గణ సభ్యుడూ కాకపోయినా అధీనియనులు అందరూ పాల్గొవచ్చును అతడు పౌరుడేగనక ఆర్కాన్‌లకూ సెనెటర్లకూ వోటు ఇవ్వవచ్చు వారివని మంచి చెడ్డలు విచారించే వార్షిక సమావేశాలలో పాల్గొవచ్చు వ్యక్తిగా తనకు ఆర్కాన్‌ల వలన జరిగిన అన్యాయానికి పరిహారం కోరవచ్చు అయితే పరాయి వారైతే పౌరుడి నొకణ్ణి అడ్డు పెట్టుకొని మాత్రమే ఆ పనిచేయగలడు అందువేత ఈనాలుగు తెగలకూ చెందని వారు ఎంత ధనికులయినా, ఎంతప్రసిద్ధులే అయినా రాజకీయ సౌకర్యాల విషయంలో సొలోన్ చట్టంద్వారా పమోచయిన నాలుగో తరగతికి చెందిన అతిబీదవానికన్న అధి కులేం కారు సొలోన్‌కు పూర్వమే ఏ గణంలోనూ ఫ్రాట్రీలోనూ చేరివుండని అధీని యన్ల సంఖ్య చాల ఎక్కువేననేవారు ఈ నిర్మాణాలు బయటివారిని చేర్చుకోవుగనకనూ, క్రమపడి పనిచేసే వారిని గ్రీసు ఇతర ప్రాంతాలనుంచి ఏథెన్సుకు నూతన చట్టం ఆహ్వానిస్తుండడం చేతనూ వారిసంఖ్య ఇంకా ఇంకా ఎక్కువే అవుతుంది"— అని గ్రోటే తమ గ్రీసు చరిత్రలో రాసేరు సరిగ్గా ఇటువంటి కారణాల నుంచే రోమనుల ప్లెబియన్‌లు పుట్టేరు వారు ఏ గణంలోనూ సభ్యులుకారు కనక పాప్యులస్ రోమా నుస్‌లో ఏభాగంలోనూ చేరరు సమాజం యొక్క అవసరాలను తీర్చలేకపోవడం చేతనే గణ సంస్థ విఫలం అయిందనడానికి పైది ఒకవుదాహరణ సొలోన్ కాలం నాటికి గణాలూ, తెగలూపరిపాలనా శక్తిని మించి సమాజం పెరిగింది గణాల

పుట్టిన పరిస్థితులను అధిగమించేశాయి సమాజ వ్యవహారాలు ఆ ప్రజ పెరిగిన మేరకైనా అది వేసిన పునాది రాజ్యానికి చాలా ఇరుకై పోయింది

గణాల, ఫ్రాట్రీల తెగల సభ్యుల్ని వారి ప్రదేశాలలోనే నిలిపి వుంచడం అంతకంతకు కష్టం కావడం ఒకటేకాదు, పాలనావ్యవస్థలోని భాగాలయిన కారణాన వీనిసభ్యులు ఒకేచోట స్థిరంగా వుండడం అవసరం వెనకటి రోజుల్లో భూములు ఉమ్మడిగా గణం అధీనంలో వుండేవి మతకర్మల కోసం కొన్ని భూములు ఫ్రాట్రీల అధీనంలో వుండేవి మిగిలిన భూములు తెగ ఉమ్మడి అధీనంలో వుండవుంటాయి అవి ఒకపట్టణంలో స్థిరపడినప్పుడు గణాల వారీగా ఎవరి ప్రదేశాలు వారు కేటాయించుకొని నివసించేవారు అలాగే, ఫ్రాట్రీలూ, తెగలూ వుండేవి ప్రతిగణం దేనికదేగా వుండేది అయితే ప్రతికుటుంబంలో రెండు గణాల తాలూకు మనుష్యులు వుంటారు వివాహావసరాలు అవి ఒకే ఫ్రాట్రీకి చెందిన గణాలు పక్కపక్కనే వుండగోరుతాయి అలాగే తెగలోని ఫ్రాట్రీలున్నూ అయితే సొలోన్ నాటికి ఇళ్ళూ, భూములూ వ్యక్తుల అధీనంలోకి వచ్చేయి వానితో భూముల్ని అమ్ముకొనే హక్కు వచ్చింది ఇల్లు అల్లాకాదు, అది గణం బయటకు పోరాదు భూమికో వ్యక్తుల సంబంధాలు మారుతూండడమూ, గణసభ్యులు ఇతరప్రాంతాలలో ఆస్తులు సంపాదించ గలగడమూతో గణసభ్యుల్ని వారి ప్రాంతాలలోనే నిలిపివుంచడం కష్టతరం కాసాగింది ఆ సామాజిక వ్యవస్థకు మూలయూనిటు అయిన గణం ఒకేచోట స్థిరంగా వుండని స్థితి ఏర్పడింది దాని స్వభావం కూడా మారింది ఈ పరిస్థితి ఇంకా విస్తరించకుండా నిలవకపోతే, వెనకటి పాలనా వ్యవస్థ వైఫల్యానికి అదో కారణం అయివుండేది ఆస్తి అప్పటప్పటి మట్టుకైనా తాత్కాలికంగా జనమూ, ఒక పట్టణం వారుగా పరిగణించవబడడం వచ్చింది గణం చేయలేని పనిని పట్టణం చేసింది అత్యంత నిరాడంబర స్థితి నుంచి సమాజం ఎంతో ఎదిగింది పాలన వ్యవహారాలకై గణాన్ని ఏర్పరచుకున్న నాటి స్థితిలో అదిలేదు అస్థిర పరిస్థితి, సొలోన్ కాలంవరకూ అథీనియన్ తెగలు అత్తికానుంచి కొనసాగించిన నిరంతర నిత్యయుద్ధాలూ లేకపోతే ఈ వ్యవస్థ ఇంకా కొనసాగి వుండేది కోటలూ, గోడలూ మధ్య నగరాల నిర్మాణం, సంపదలు, జనాభా వేగంగా పెరగడంతో గణ వ్యవస్థకు చివరిపరీక్ష ఎదురయింది అతి వేగంగా నాగరికతకు చేరుకుంటున్న ప్రజల్ని పాలించగల శక్తి గణానికి లేదని రుజువు అయింది అయినా ఆ మార్పు జరగడానికి చాలకాలమే పట్టింది

అథీనియన్ల చరిత్రచూస్తే రాజకీయ సమాజ నిర్మాణంలో ఎదురయ్యే ఇబ్బందులు ఎంత తీవ్రమైనవో అర్థం అవుతాయి సొలోన్ కాలం నాటికే ఏథెన్సులో, మంచి సమర్థులు పుట్టేరు కళలు బాగా అభివృద్ధి పొందేయి సముద్రాంతర వాణిజ్యం జాతీయ ప్రయోజనం అయింది వ్యవసాయం, చేతిపనులు బాగా వృద్ధిపొందేయి వ్రాత రూపంలో కవితా రచన ప్రారంభమయింది అప్పటికే వారు నాగరిక ప్రజగా రెండు దశాబ్దాలుగా జీవిస్తున్నారు కాని వారి పాలనా వ్యవస్థ గణసంస్థల ద్వారానే జరుగుతూంది అది కూడా అనాగరిక యుగం ఎగువదశలో రూపొందిన తరహా నిర్మాణం సొలోన్ పథకం అథీనియన్ కామన్వెల్తుకు గొప్పవూపునిచ్చింది అయినా అథీనియన్ల మనసులలో రాజ్యభావం పూర్తిగా పరిణతి పొందేసరికి ఒకశతాబ్ది కాలమూ, ఎంతో కల్లోలిత పరిస్థితీ కావలసి వచ్చింది రాజకీయ వ్యవస్థకు మూల యూనిటుగా నగరం వుండాలనే భావం న్యూక్రారీల ద్వారా పరిణతి పొందింది అయితే దానిని కార్యరూపంలో పెట్టడానికి ఎంతో వలుకుబడి, కార్యదక్షతవున్న మహామేధావి కావలసివచ్చింది అటువంటి మనిషి క్రీ పూ 509లో పుట్టేరు ఆయనే క్లీస్తెనెస్ రెండవపాలన రూపాన్ని ప్రవేశపెట్టిన మొట్టమొదటి అథీనియను శాసనకర్త ఆయన. ఈనాడు నాగరిక దేశాలలో కొనసాగుతున్న పరిపాలనా వ్యవస్థ ఇదే

క్లీస్తెనెస్ అసలు సమస్య మూలానికి వెళ్లేరు అథీనియన్ కామన్వెల్తు స్వతంత్రంగా నిలబడడానికి ఆధారమైన పునాదికి దగ్గరగా వుండేటట్లు వారి రాజకీయ వ్యవస్థను రూపొందించేరు అతడు అత్తికాను నూరుడెమేలుగా విభజించేరు వీనికి సరిహద్దులు నిర్ణయించేరు పేర్లు పెట్టేరు ప్రతిపౌరుడు నమోదు అయివుండాలి తాను నివసిస్తున్న పట్టణంలోని తనఆస్తినికూడా నమోదు చేయించుకోవాలి ఇల్లా నమోదు చేయించుకుంటేనే అతనికి పౌరహక్కులు లభిస్తాయి పౌరహక్కులకు ఆ నమోదు సాక్షి ఇంతకు పూర్వం వున్న న్యూక్రారీ స్థానంలో ఈడెమో (పట్టణం) వచ్చింది దానిలోనివారు స్థానిక స్వపరిపాలనాధికారం వున్న రాజకీయసంస్థగా ఏర్పడతారు ఇది ఆధునిక అమెరికన్ నగరంలాగే వుండేది ఈ వ్యవస్థకు కీలకమైనదీ, గమనించ వలసినదీనూ ఈ లక్షణం దాని ప్రజాతంత్ర స్వభావం చూడగానే కనిపిస్తుంది ప్రాంతీయ సంస్థల వరసలో మొట్టమొదటిదైన డెమో యొక్క ప్రజలచేతిలో ప్రభుత్వాధికారం ఉంచబడింది డెమోప్రజాసభ (డెమోలు) ఒక డెమార్కసను ఎన్నుకొంటారు పబ్లిక్ రిజిస్టరు ఆయన అధీనంలో వుంటుంది మేజిస్ట్రేట్లనూ, న్యాయాధీశులనూ ఎన్నుకోవడంకోసమూ, పౌరుల రిజిస్టరులో మార్పులు చేయడం

కోసమూ, ఆ ఏడాది వ్యవధిలో వయస్సుకి వచ్చిన వారిని రిజిస్టరు చేయడంకోసమూ డెమోలను సమావేశ పరిచే అధికారం ఆయనకుంది వారే కోశాధిపతినీఎన్నుకొంటారు పన్నును నిర్ణయించి, వసూలుచేసేందుకూ, రాజ్యం రక్షణకోసం డెమోకూర్చవలసిన సైనికుల కోటాను సమకూర్చేందుకు విధులు నిర్ణయించబడ్డాయి వారే ముప్పయిమంది 'డెకాస్టు'లను-జడ్జీలను ఎన్నుకొంటారు ఒకపరిమితి విలువకు దిగువనుండే తగాదాలను విచారించే హక్కు వీరికివ్వబడింది ప్రజాతంత్ర వ్యవస్థకు ప్రాణంలాంటి ఈ స్థానిక స్వపరిపాలనాధికారాన్నే గాక డెమోకు ఒకదేవాలయం, ఒకపూజావిధానం, ఒక పురోహితుడు వుంటారు ఈ పురోహితుణ్ని కూడా డెమోచేయే ఎన్నుకుంటుంది చిన్న చిన్న వివరాలను పక్కకుపెడితే ప్రప్రథమంగా ఏర్పరచబడిన ఈ డెమోకు వున్న స్థానిక స్వపరిపాలనాధికారాలు ఈనాటి అమెరికన్ నగర పాలనా సంస్థకు గల అధికారాలకన్న విస్తృతమైనవీ, పరిపూర్ణమైనవీ అని గ్రహించగలం మతవిషయంలో స్వేచ్ఛ కనపడుతూంది న్యాయంగా అది వుండవలసిన చోటనే ప్రజల స్వాధీనంలోనే వుంచబడింది నమోదయిన ప్రజలందరికీ స్వతంత్రంవుంది వారిహక్కులూ, సౌకర్యాలూ సమానం అయితే ఉన్నత పదవులు పొందేందుకు సమానాధికారాలు మాత్రమేలేవు అథీనియను రాజకీయ సమాజ నిర్మాణానికి మూలంలోని యూనిటు స్వరూపం ఇది ఇది స్వతంత్ర్య రాజ్యానికి నమూనాయే కాదు అపారపరిజ్ఞానాన్నీ, బుద్ధి వికాసాన్నీ చూపిస్తూంది స్వతంత్రరాజ్యాన్ని నిర్మించుకొనకోరుతున్న ప్రజలు ప్రారంభించవలసిన తీరుగానే అథీనియను ప్రజలు ఒక ప్రజాతంత్ర నిర్మాణంతోనే ప్రారంభించేరు దాని పౌరులచేతిలో పాలనాధికారాన్ని పెట్టేరు

ప్రాదేశిక నిర్మాణాల వరసలో రెండోది పదిడెమోలతో ఏర్పరచిన జిల్లా వెనుకటి గణవ్యవస్థకు చెందిన పదాలలో ఒకదానిని వుపయోగించి దీనికి 'స్థానిక తెగ' అనిపేరుపెట్టేరు లాటిన్ భాషా పదం ట్రైబస్ (ట్రైబ్=తెగ) కు అసలు అర్థం మూడోభాగం - ఆనాడు లాటిన్ ప్రజలలో మూడువిభాగాలు వుండేవి అదే ట్రైబస్ కాలక్రమంలో లాటిన్ తెగలు కూడా రక్తసంబంధ సూచకాలుగాక ప్రాదేశిక సంబంధ సూచకాలు అయ్యాయి అథీనియన్ స్థానిక తెగల మాదిరిగానే తెగశబ్దానికి సంఖ్యా గణంపోయి, క్లీస్తెనెస్ వాడిన ఫిలాన్‌లాగే ప్రాంతీయతా సూచకంగా మిగిలింది ప్రతి జిల్లాకూ ఒకఅత్తికా వీరుని పేరు పెట్టేరు ఈనాటి దేశానికి అది ప్రతిబింబం ప్రతి జిల్లాలోని డెమోలూ పక్కపక్కనే వుంటాయి దీనితో పోలికలు సంపూర్ణం అయ్యాయి కొన్నిసందర్భాలలో జిల్లాలోని పదిడెమోలలో ఒకటో, రెండో డెమోలు విడదీయబడడం

కనిపిస్తుంది రక్త సంబంధాలుగల తెగలోని భాగాలు విడతీయ బడడంతో వారు తమ రక్తసంబంధీకులున్న జిల్లాలోనే తమనినీ చేర్చమని కోరివుండవచ్చును ప్రతిజిల్లాలోని వారు తాము ఒకరాజకీయ సంస్థగా వుంటారు వీటికి కొన్ని స్థానిక స్వపరిపాలనాధికారాలు ఇవ్వబడినాయి వారొక ఫిలార్క్‌ను ఎన్నుకొంటారు ఆయన అశ్విక సైన్య నాయకత్వం వహిస్తాడు ఒక టాక్సియార్క్‌ను ఎన్నుకొంటారు ఆయన కాల్బలానికి అధికారి ఈ రెండుబలగాలకు నాయకత్వం వహించే జనరల్‌ను ఎన్నుకుంటారు ప్రతి జిల్లా అయిదు త్రిరెమేలకు జనాన్ని సమకూర్చాలి (ఇవొక ప్రాచీనయుద్ధనావ మూడు వరుసలలో తెడ్లువుండేవి) వాటిమీద అధికారులనుగా అయిదుగురు 'త్రిరార్కే'లను ఎన్నుకొనివుండాలి క్లిస్థెనెస్ సెనేట్ సభ్యులసంఖ్యను అయిదువందలకు పెంచి ప్రతి జిల్లాకు 50 మందిని కేటాయించేడు వారిని ఆ ప్రజలే ఎన్నుకొంటారు ఈ పెద్ద రాజకీయ సంస్థకు ఇతరేతర బాధ్యతలేవో వుండి వుంటాయి కాని, అవి సరిగ్గా వివరించ బడలేదు

ఈ ప్రాదేశిక నిర్మాణాలలో చివరదీ, మూడోదీ అధీనియన్ రాజ్యం లేక కామన్వెల్తు దీనిలో పది స్థానిక తెగలు లేక జిల్లాలు వున్నాయి ఇది అధీయనిను ప్రజలందర్నీ చేర్చుకుని ఏర్పడ్డ రాజకీయ సంస్థ దీనికో ఎక్లెసియా - సెనేట్ వుంది అరియోపాగస్ కోర్టు వుంది ఆర్కాన్‌లు, జడ్జీలు వున్నారు ఎన్నొన్న సైన్యనాయకులూ, నౌకాసైన్యాధిపతులూ వున్నారు

ఆ విధంగా ఆస్తీ ప్రాంతమూమీద ఏర్పరచిన పరిపాలనా వ్యవస్థకు పథకాన్ని అధీనియనులు రూపొందించేరు మానవుడు రూపొందించుకున్న పాలనా వ్యవస్థలలో ఇదిరెండోది వ్యక్తి సమూహాల క్రమం స్థానంలో ప్రాదేశిక సమాహారాలను అది నెలకొల్పింది సుస్థిరంగా వుండే ప్రదేశం మీదనూ కొంచెం ఇంచుమించు స్థానికం చేయబడిన ఆస్తిమీదనూ ఏర్పరచబడిన ప్రభుత్వం అది తమ ప్రాంతీయతా సంబంధాలతో డెమోలలో స్థానికులయిన పౌరులను అది పాలిస్తుంది రాజ్య పౌరుడు కావాలంటే డెమో పౌరుడయివుండాలి పౌరుడు డెమోలో వోటువేస్తాడు డెమోకు పన్నుచెల్లిస్తాడు తన డెమోనుంచి సైన్యాలకు భర్తీఅవుతాడు అదే విధంగా సెనేట్‌కు ఎన్నిక అవుతాడు జిల్లా లేక స్థానిక తెగ నుంచి సైనిక డివిజనుకో, నౌకాదళానికో నాయకుడు కాగలుగుతాడు గణంతోనూ, ఫ్రాట్రీతోనూ వుండేసంబంధాలు పౌరుడుగా నిర్వర్తించవలసిన బాధ్యతలను విధించవు ఈ రెండు వ్యవస్థల మధ్య మూలమట్టుగా భేదం వుంది ప్రాదేశిక ప్రాతిపదికమీద ప్రజల్ని రాజకీయ వ్యవస్థలోకి సమ్మిళిత పరచడం దీనితో పూర్తిఅయింది.

ఈ ప్రాదేశిక నిర్మాణాలు ఆధునిక నాగరిక జాతుల ప్రభుత్వ పథకాలలో అమలు జరుగుతున్నాయి ఉదాహరణకు మనదేశం (అమెరికా)లోనే పట్టణం, దేశం, రాష్ట్రం, సంయుక్త రాష్ట్రం వున్నాయి వీటిలో ప్రతి ఒక్కదాని ప్రజలూ తమ రాజకీయ సంఘంగా వుంటారు దానికి స్థానిక స్వపరిపాలనాధికారాలు వున్నాయి. ప్రతి సంఘమూ తన సరిహద్దులలో సర్వస్వతంత్రంగా వ్యవహరిస్తుంది ఫ్రాన్సులో కూడ ఇటువంటి సంఘాల క్రమమే వుంది కమ్యూన్ ఎర్రాన్, డిస్ట్రిమెంట్, డిపార్ట్‌మెంట్, ఎంపైర్ ఇదే ఇప్పుడు రిపబ్లిక్ అయింది గ్రేట్‌బ్రిటన్‌లో - పారిష్, షైర్, కింగ్‌డమ్, మూడు కింగ్‌డమ్‌లు, యునైటెడ్ కింగ్‌డమ్ సాక్సన్‌ల కాలంలో నగరాన్ని "హండ్రెడ్"గా పేర్కొనే వారని తోస్తుంది ఒక్క 'హండ్రెడ్ కోర్టు' తప్ప స్థానిక స్వపరిపాలనాధికారాలు ఏవీ మిగలలేదు ఈ వివిధ ప్రదేశాలలో నివశించే వారు అక్కడక్కడి రాజకీయ సంఘాలుగా వుండేవారు అయితే అత్యున్నత సంఘానికి తప్ప కిందివారి కందరకూ అధికారాలు చాల పరిమితం. రాజరిక సంస్థల క్రింద కేంద్రీకరించే ధోరణి ఇంచుమించు దిగువ సంఘాలన్నింటినీ క్షీణింప చేసింది

క్లిస్తెనెస్ శాసన ఫలితంగా గణాలు, ఫ్రాట్రీలు, తెగలు పలుకుబడిని కోల్పోయాయి వాని అధికారాలను తీసుకొని డెమో, స్థానికతెగ, రాజ్యములను నవ్వచెప్పేరు అప్పటినుంచి రాజకీయాధికారాని కంతకూ అవేమూలం అయాయి అధికారం కోల్పోయినా గణనిర్మాణాలు రద్దుకాలేదు వంశాలకు, కులీనతకు మూలాలుగా, మతసంబంధిత జీవితానికి జన్మస్థానాలుగా అవి కొన్ని శతాబ్దాలపాటు కొనసాగేయి వ్యక్తిగత హక్కులు, ఆస్తిహక్కుల విషయం వచ్చినప్పుడూ, వంశాను క్రమాలూ, అంత్యక్రియల సందర్భం వచ్చినప్పుడూ డెమాస్తనీస్ తన ప్రసంగాలలో గణాలూ, ఫ్రాట్రీలు ఆ కాలంనాటికి ఇంకా సజీవంగా వున్నట్లే పేర్కొన్నారు ప్రత్యేకించి యుఖలైడెస్, మాక్కార్టస్‌లకు వ్యతిరేకంగా చేసిన ప్రసంగాలను పేర్కొనవచ్చు మత కార్యకలాపాలకు సంబంధించినంతవరకున్నూ కొన్నినేర విచారణల సందర్భంలోనూ, కొన్ని సామాజికాచారాల విషయంలోనూ, మాతనవ్యవస్థ వానిని కదిలించలేదు అదే వానిని బతికించివుంచింది అయితే, థెసియస్ ఏర్పరచినవీ సొలోన్ నిర్ణయించినవీ వర్గాలు మాత్రం, క్లిస్తెనెస్ తరవాత అదృశ్యం అయిపోయాయి

అథీనియన్ ప్రజాతంత్రాన్ని ప్రతిష్ఠించినది సొలోన్ అంటారు సాధారణంగా కొందరు రచయితలు ఆ పనిలో కొంత భాగం క్లిస్తెనెస్, థెసియసులకు జమకడతారు.

నిజానికి అధీనియను ప్రజాతంత్రం వీరందరికంటె ప్రాచీనం. దానిని స్థాపించినవారు అనడంకన్న, వారి పాలనా వ్యవస్థను గణరూపం నుంచి ఒక రాజకీయ నిర్మాణ రూపానికి తెచ్చిన మూడు మహోద్యమాలతో సంబంధం కలవారినిగా థెసియను, సొలోన్, క్లిస్థెనిస్‌లను చెప్పడం ఉచితం వారు ఎవ్వరూ కూడ గణవ్యవస్థ కాలంనుంచీ ప్రజాతంత్రంలో అమలు జరుగుతున్న సూత్రాల్ని మార్చడానికి ప్రయత్నించలేదు గణవ్యవస్థ స్థానంలో రాజకీయ వ్యవస్థ ఏర్పడడానికి అవసరమైన పాలనాంగంకోసం సాగిన మహోద్యమానికి ఆముగ్గురూ తమతమ కాలాలలో తోడ్పడ్డారు అసలు సమస్య నగర నిర్మాణం, అందులోని ప్రజలను ఒక రాజకీయ సంస్థగా రూపొందించడమూను అది చాల చిన్నపనిగా మనకు కనిపించవచ్చు కాని నగరభావన క్రియారూపం ధరించేందుకు అధీనియన్ల ముక్కులు చెమటలు పట్టేయి క్లిస్థెనెస్ సృష్టించింది ఒకే మహావేదాని మహోన్నత కల్పనం ప్రజాతంత్ర మూల లక్షణాలన్నీ వున్నాయి వానినుంచి సంపూర్ణ ప్రజాతంత్రం రూపొందడానికి నూతన రాజకీయ సమాజంకావాలి అందుకై పాలనా వ్యవస్థ రూపంలో మార్పు అవసరం అప్పుడే ప్రజాతంత్రం విస్తరిస్తుంది పరిపూర్ణం అవుతుంది ఈ విషయంలోనే గ్రోటే మనల్ని తప్పుదారి పట్టించారని నా అభిప్రాయం ఆయన గొప్ప చరిత్రకారుడు గ్రీకుల ఆచారాల్ని గురించి ఆయన వ్రాసినది నమ్మతగినదే సందేహంలేదు కాని, గ్రీకు తెగలలోని పరిపాలనా వ్యవస్థ మౌలికంగా రాజరిక రూపమైనది, అనడం సరికాదు అదే నిజమైతే వారి ఆచారాలలో గొప్ప విప్లవం వస్తేతప్ప మహామేధా వంతుల్ని సృష్టించిన అధీనియన్ ప్రజాతంత్ర వ్యవస్థ ఏర్పడదు అటువంటి విప్లవం ఏదీ జరగలేదు వారి ఆచారాలలో పెద్ద మార్పులూ రాలేదు మౌలికంగా అవి ఎప్పుడూ ప్రజాతంత్రాలే అధికారాల్ని చేతబట్టుకొని పెత్తనం చలాయించడాలూ, గత వ్యవస్థను పునరుద్ధరించేందుకై సంఘర్షణలూ జరగకపోలేదు కాని, వారు ఏనాడూ తమ స్వాతంత్ర్యాలను పోగొట్టుకోలేదు స్వేచ్ఛాభావం,స్వపరిపాలన హక్కు-యుగయుగాలుగా వారిలో వారసత్వంగా వస్తూంది వానిని పోగొట్టుకోలేదు

మరోమాటు బాసిలసుకు వద్దాం గ్రీకుల మరేవిషయం కన్న తన పదవి రీత్యా బాసిలస బహుప్రముఖంగా కనిపిస్తాడు ప్రతి చరిత్రకారుని కన్నూ మొట్టమొదట ఆయనమీద పడుతుంది దైవదత్తమైన అధికారంతో, అతిప్రాథమిక రూప ప్రజాతంత్రం మీద పాలన సాగించిన రాజుగా ఆయనను వర్ణించేరు సైనిక ప్రజాతంత్రంలో సైన్యాధిపతిగా ఆనాటి ఆచారాలు వేటినీ భంగపరచకుండా పాలన

సాగించేదంటేనే బాసిలస అర్థం అవుతాడు ఈ పదవిని సృష్టించడంతో గణాలు, ఫ్రాట్రీలు, తెగలయొక్క మూల లక్షణాలు ఏవీమారిపోలేదు గణవ్యవస్థ యొక్క లక్షణం ఆ అవసర పదవిలో వ్యక్తం అవుతూనేవుంది వ్యక్తుల హక్కుల్ని హరించకుండా కాపాడేందుకు ప్రజావాణి వున్నదనడానికి బోలెడంత సాక్ష్యం వుంది ప్రభుత్వపు అధికారాలు ఏమిటో స్పష్టంగా నిర్వచించబడని ప్రాచీనకాలంనాటి వాడు బాసిలస అయితే, ఆ వ్యవస్థకు కేంద్రంగా నాయకుల సమితి వుంది. గణాలు, ఫ్రాట్రీలు, తెగలు మంచి శక్తివంతంగా వున్నాయి. ఆ నాటి పరిపాలన స్వభావాన్ని నిర్ణయించేందుకు ఇవిచాలు

సొలోన్ కాలంనాటి పాలనావ్యవస్థకూ క్లీస్థెనెస్ ఏర్పరచిన దానికీ చాలా భేదం వుంది ప్రజలు తమ ఆలోచనలను కొనసాగా కొనసాగిస్తే ఈపరిణ్ణ రన అతి సహజంగా సంభవిస్తుంది మార్పుఅల్లా నిర్మాణంలోనే, గాని సూత్రాలలో మార్పు లేదు సహకార సాధనాలు కూడాఅవే సెనేట్ రూపంలో నాయకుల సమితి వుంది ప్రజాసభ పేరున (ecclesia)అగోరా వుంది ముగ్గురు ప్రధాన ఆర్కాన్‌లు వరుసగా రక్షణశాఖ, మతశాఖ, న్యాయశాఖలు చూస్తున్నారు వెనకటి మాదిరిగానే,దిగువ తరగతి ఆర్కాన్‌లు ఆరుగురూ కోర్టులకు సంబంధించిన న్యాయవ్యవహారాలను చూస్తున్నారు న్యాయశాఖ కార్యకలాపాలు చూడడానికే ఏటేటా ఎందరో దెకాస్ట్‌లను ఎన్నుకుంటు న్నారు ఈవ్యవస్థలో కార్యనిర్వహణోద్యోగి వుండడు ఆ వ్యవస్థలోని విశిష్టలక్షణం అదే సెనేట్ అధ్యక్షుడుగా ఆ రోజుకి మాత్రమే ఎన్నుకొనే పదవి ఒక్కటే ఆపదవి ఛాయామాత్రంగా పోలిక కలిగి వుంటుంది మళ్ళీ ఆ ఏడాదికి రెండో మారు ఎన్నిక జరగదు ఒక్కరోజు మాత్రమే ప్రజలు ఎన్నుకొన్న సభ్యుల సమావేశానికి అధ్య క్షుడుగా వుంటాడు కోశాధికారం, పాలనాధికారం ఆనాటికి మాత్రమే నూతన పాలనా వ్యవస్థలో అధికారం ప్రజాసభది ఏథేన్సు భవిష్యాన్ని నిర్ణయించేది అదే రాజ్యానికి స్థిరత్వమూ, భద్రతా సమకూర్చే మూలనాంశం దెమే- నగరం అది స్థానిక స్వపరి పాలన కలిగి సంపూర్ణ స్వతంత్రంగా వుంటుంది అదే విధంగా ఏర్పరచబడిన నూరు దెమేలు కామన్వెల్తు స్వరూపాన్ని నిర్ణయించబోతున్నాయి అందులో యూనిటు మూల అంశం ఎలావుంటే సమాహారమూ అలాగే వుంటుంది ప్రజలు స్వయం పరిపాలనా శక్తిని అలవరచు కోవాలంటే సమాన హక్కులు, సమాన సౌకర్యాలు సమాన నియమాలు పాటించాలంటే వారు ప్రారంభించ వలసినది ఇక్కడేనని ఇంత క్రితమే చెప్పేను. పరిపాలనా వ్యవస్థ సమర్థవంతంగా కొనసాగాలన్నా, పరిపాలనా

వ్యవస్థపై నియమనాధికారం వుండాలన్నా సమాజంలోని అధికారాలన్నీ వారి చేతుల్లోనే వుండాలి

నూతన రాజకీయ వ్యవస్థలో ఏథెన్సు అతివేగంగా పలుకుబడీ, ప్రాముఖ్యం సంపాదించింది మానవజాతిలో చరిత్ర ప్రసిద్ధికి వచ్చిన జాతులలో ఆథీనియన్లను ఉన్నత స్థాయికి తెచ్చిన ప్రతిభా వ్యుత్పత్తులు ప్రజాతంత్ర భావాల ఉద్దీప్తిలో పెంపొందేయి

క్లీస్తెనెస్ చేతి క్రింద రాజకీయ సమాజం నెలకొని, గణ వ్యవస్థ అనాగరిక యుగపు అనవసరపు వస్తువులలో ఒకటిగా పక్కకు నెట్టివేయబడింది వారి పూర్వీకులు అసంఖ్యాకములైన శతాబ్దాలపాటు గణ వ్యవస్థలో జీవించేరు దాని క్రింద వుంటూనే నాగరికత పొందడానికి కావలసిన హంగులన్నీ సమకూర్చుకున్నారు లిపిసమకూర్చుకున్నారు నాగరిక జీవితంలో అడుగుపెట్టేరు గణవ్యవస్థ చరిత్ర పురాతన యుగాల స్మారక చిహ్నంగా, శాశ్వతంగా మిగిలిపోయింది మానవజాతి పొందిన విస్తృత, విశిష్ట అనుభవాల మూర్తిమంతం అది మానవ కుటుంబంయొక్క అతి విశిష్ట నిర్మాణాలలో అదొకటి

సంగ్రహంగా, అసమగ్రంగా సాగిన ఈ చర్చలో ఆథీనియను చరిత్రకు సంబంధించిన ముఖ్యఘటనలకు మాత్రమే పరిమితం అయాను ఆథీనియన్ తెగలలో జరిగినవే గ్రీకు తెగలలోనూ జరిగేయి అయితే అంత విస్తృతమూ, విశాలమూగా కాక పోవచ్చు అన్ని తెగలలోనూ కూడ ప్రభుత్వ భావన వారి అభివృద్ధితో పాటు మెట్టు మెట్టుగా పెంపొందిందనే విషయాన్ని ఈ చర్చ బాగా విస్పష్టం చేస్తోంది

# పదకొండో ప్రకరణం

# రోమను గణాలు

**గణాలుగా** ఏర్పడిన రోమను తెగలు - రోము అవతరణ - సైనిక ప్రజాతంత్రంగా ఏర్పడిన తెగలు - రోమనుగణాలు - గణసమాజం గురించి నిబుర్ నిర్వచనం - ఫెస్టస్ నిర్వచనం - వార్రో నిర్వచనం - పురుష వారసం వర్గం - గణం వెలుపల వివాహం - గణసభ్యుల హక్కులు, సౌకర్యాలు, బాధ్యతలు - పురాతన లాటిన్ సమాజంయొక్క ప్రజాతంత్ర రాజ్యాంగం - గణంలో సభ్యుల సంఖ్య

లాటిన్ తెగలూ, వారి బంధువులయిన సబెల్లియనులు, ఓస్కానులు, ఉంబ్రియనులు, కలిసి ఒకే ప్రజగా ఇటలీ ద్వీపకల్పంలో అడుగుపెట్టిన నాటికి, వారి వద్ద పెంపుడు జంతువులున్నాయి బహుశా కాయధాన్యాల్ని, మొక్కల్ని సాగుచేస్తూండి వుంటారు "ఇండో-జర్మను జాతులవారు ఇప్పుడు విడిపోయారు గాని ఒకే ప్రజగా, ఒకే భాషమాట్లాడుతూ కలిసివున్న కాలంలో వారి సంస్కృతి ఒక స్థాయికి వచ్చింది. దానికి అనుగుణమైనశబ్దజాలం వారికుంది ఈ పదజాలాన్ని వాని సాంప్రదాయిక అర్థాలలోనే అనేక జాతులవారు తమతో తీసుకుపోయేరు అది వారి ఆస్తి వారి భాషలపురోగతి కవిపునాదులు ఈవిధంగా ఆ పురాతన కాలంలోనే వారు పశు సంపదలు కలిగి వున్నారనడానికి తగిన సాక్ష్యం వుంది. పెంపుడు జంతువులపేర్లలో అదికనబడుతూంది సంస్కృతంలో "గౌ", లాటిన్‌లో "బాస్", గ్రీకులో "బౌస్"; అలాగే సంస్కృతంలో "అవి". లాటిన్‌లో 'ఓవిస్', గ్రీకులో "ఓయిస్" ఇల్లాగే కాని ఆనాటికి వీటితో సాగు వున్నదనడానికి తగిన సాక్ష్యంలేదు. భాషఅయితే వ్యతిరేక సాక్ష్యాన్నే ఇస్తూంది " అన్నారు మోమ్‌సెన్ తమ History of Rome లో

"ప్రాచీన సామాజిక జీవితానికి పశువులపెంపకం పునాది అయినట్లు సాక్ష్యం వుంది కాని, వ్యవసాయారంభం గురించి అట్టే కనబడదు వారికి ఏవో కొన్ని ధాన్యాల గురించి తెలుసు కానివాటిని సాగుచెయ్యడం, పాలు, మాంసం బాగా దొరికించు కొనేందుకు చేస్తున్నట్లు అని పిస్తుంది ప్రజల బతుకు ఏ విధంగానూ వ్యవసాయం మీద ఆధారపడి వుండలేదు వ్యవసాయాన్ని గుర్తుచేసే కొద్దిపాటి ప్రాచీన పదాల్ని పట్టి ఈ సంగతి చెప్పవచ్చు" ఓక్ వ్రాసిన Primitive Unity of Indo-European Languages"లో మహా అయితే వారు అనాగరిక యుగం మధ్యదశలో బాగా పురోగమించారనవచ్చు వారు చరిత్రకు అందేనాటికి అనాగరిక యుగం ఎగువ దశలో, నాగరికత ముంగిటవున్నారు

రోములస్‌కు పూర్వంనాటి లాటిన్ తెగల సాంప్రదాయిక చరిత్ర చాలకొం చెంగా అసమగ్రంగా లభిస్తుంది గ్రీకులది అల్లాకాదు వారి సాహిత్యమూ, బలమైన సాహితీ అభిమానాలూ వారి సాంప్రదాయిక చరిత్ర ఘటనల్ని కాపాడుకొనేందుకు సాయపడ్డాయి లాటిన్ తెగలవారు అల్బాన్‌మిట్టల మీద నివసించడానికి, రోముకి తూర్పువేపు కనబడుతూండె అపినైన్ పర్వతాలలో నివసించిన నాటికి పూర్వం నాటి కథలు కనబడవు జీవితకళలలో అంత పురోగమించిన ప్రజలు తమ పూర్వ చరిత్రనంతనూ మరిచిపోయారంటే వారు ఇటలీలో ప్రవేశించి చాలా చాలా కాలమే అయివుండాలి రోములస్ కాలంనాటికే వారు ముప్పయి స్వతంత్ర తెగలుగా విడబడివున్నారు ఆత్మరక్షణకై వారు ఏర్పరచుకొన్న సమాఖ్య దృఢంగాలేదు కూడ వారి నివాస భూములుకూడ పక్కపక్కనే వున్నాయి సెబల్లియన్లు, ఓస్కాన్లు ఉంబ్రియన్లు కూడ మొత్తం మీద అదే దశలో వున్నారు వారి వారి తెగలు కూడా అటువంటి సంబంధాలు కలిగే వున్నాయి వారి వారి నివాస ప్రాంతాలు భాషాప్రాతిపదిక మీదనే విడబడి వున్నాయని వేరే చెప్పనక్కర్లేదు వారికి ఉత్తరానవున్న ఎట్రూస్కన్‌లు గణాలుగా ఏర్పడివున్నారు వారివీ గ్రీకు తెగలవారి ఆచారాలూ ఒకేవిధంగా ఉండినాయి గత కాలపు చీకటి మరుగు నుంచి బయటపడి చరిత్ర వెలుగులోకి వచ్చి నప్పటి వారి పరిస్థితి అది

క్రీ పూ 753లో రోము జన్మించింది అంతకు పూర్వంనాటి అపార అనుభవాలు ఏవీ రోమను చరిత్రకు ఎక్కలేదు అప్పటికే రోమనుతెగల సంఖ్య, ప్రజల సంఖ్య బాగా పెరిగింది వారివి పూర్తిగా వ్యవసాయదారుల అలవాట్లు పశువుల మందలు చేరేయి జీవితానందాలు బాగావిస్తరించేయి దంపతీ కుటుంబం ఏర్పడింది

వారు మనకు మొట్టమొదట తెలిసినప్పటికే ఈ దశలో వున్నారు. కాని దిగువదశ నుంచి ఎగువ దశకు చేరుకొన్న అభివృద్ధిక్రమం వివరాలు ఏమీతెలియవు. ప్రభుత్వ భావన బాగా పెంపొందలేదు. తెగల సమాఖ్య వారి పురోగతికి సరిహద్దు. వారి తెగలు ముప్పయ్యీ సమాఖ్యగా ఏర్పడినా పరస్పర రక్షణకు ఏర్పరచుకున్న కూటం మాదిరిగా వుందే తప్ప ఒక జాతిగా ఏర్పడేటట్లు సన్నిహితంగాలేవు.

ఎట్రూస్కన్ తెగలు సమాఖ్య నేర్పరచుకొన్నాయి. బహుశా పెలెస్జియన్లు, ఓస్కాన్, ఉంబ్రియన్ తెగలూ కూడ. లాటిన్ తెగలకు ఎన్నో నగర దుర్గాలు, బలమైన పల్లె కేంద్రాలూ వున్నాయి. అయితే వ్యవసాయపు పనులలోనూ, మందల పెంపకంలోనూ దేశం అంతటా విస్తరించి వున్నారు. రోములస్ మహోద్యమం కొన సాగి రోము నగరం స్థాపించబడే వరకూ చెప్పదగినంతగా వారిలో కేంద్రీకరణం, సమ్మేళనం జరగలేదు. దృఢంగా ఐక్యంకాని ఆ తెగలే నూతన నగరానికి వత్తాసు. అల్బానాయకుల పెత్తనం నాటి నుంచి సెర్వియస్ తుల్లియస్ కాలంవరకూ ఈతెగలను గురించి మనకు తెలుస్తున్నది సంప్రదాయాలూ, పిట్టకథలూ నుంచే. అయితే చరిత్ర కాలం వరకూ వారిలో కనబడిన ఆచారాలూ, సామాజిక అలవాట్లూ వారి వెనుకటి పరిస్థితులను బాగానే చూపిస్తున్నాయి. అసలు ఘటనలతో కూర్చిన రేఖామాత్రపు చరిత్ర కన్న అవే ఎంతో ముఖ్యం.

చారిత్రకదశ ప్రారంభంనాటికి లాటిన్లలో గణాలు, క్యూరియా, తెగలు వున్నాయి. రోములస్కూ, ఆయన తరువాతివారికి బలంకూర్చినవిఅవే. కొత్త ప్రభుత్వం సహజంగా ఏర్పడిందికాదు. శాసనాలద్వారా ఎగువ నిర్మాణాలలో మార్పులు తెచ్చి ఏర్పరచింది మాత్రమే. అయితే ఆ నిర్మాణానికి ప్రాతిపదిక అయిన గణాలు సహజం గానే పెరిగాయి. అవి ప్రధానంగా ఒకే వంశానికి చెందినవో అతిదగ్గర బంధుత్వాలు కలవో. అంటే లాటిన్ గణాలు ఒకే పారంపర్యంలోనివి. ఒక్క పెట్రూస్కన్లు తప్ప, సబయినులు, యితరులూ జాతిగణాలు. రోములస్ తరువాత నాలుగోవాడయిన టార్క్వినియస్ ప్రిస్కస్ కాలంలో యీ నిర్మాణాన్ని లెక్కప్రకారం సమకూర్చారు. క్యూరియాకు పదిగణాలు. తెగకు పదిక్యూరియాలు, మూడుతెగలు కలసి రోమన్లు. మొత్తం. మూడువందల గణాలు గణసమాజంలో సమకూర్చబడినాయి. వేరువేరు ప్రదేశాలలోనివసిస్తూన్న గణాలతో ఏర్పడ్డసమాఖ్యకు ఐక్యతావుండదు. స్వతంత్రంగా బ్రతకటానికిమించి ఏ పని చేయటానికి తగిన సమర్ధతావుండదూ అని రోములస్ గ్రహించాడు. సమాఖ్యనిర్మాణ సూత్రంలోవున్నశైథిల్యంను గణాల విచ్ఛిన్నత

ధోరణిభగ్నం చేస్తూంటుంది రోములస్, అతనికాలపు మేధావులూ కేంద్రీకరణము, సమ్మేళనములే దీనికివిరుగుడని గ్రహించారు ఆ కాలానికి అదిచాలా గొప్పవుద్యమం రోములస్ కాలంనుంచి సెర్వియస్ టుల్లియస్ అధీనంలో రాజకీయ సమాజం ఏర్పడే వరకు వచ్చిన అభివృద్ధి చాలాఎక్కువ ఆధీనియన్‌తెగల పంథానే అనుసరిస్తూ ఒక పట్నంమీద కేంద్రీకరించి వరు అయిదుతరాలలో గణనిర్మాణం నుంచి రాజకీయ నిర్మాణంలోకి ప్రభుత్వరూపాన్ని పూర్తిగా మార్చేపేరు

ఇక్కడ ఒకవిషయం జ్ఞాపకం వుంచుకోవాలి పాలటయిన్ మిట్టలచుట్టూవున్న నూరులాటిన్‌గణాలను, రామ్నెస్ పేరటతెగగా రోములస్ ఏకంచేశాడు అదృష్టవశాత్తు పరిస్థితు లనుకూలించి సబయినులు యీ కూటమిలో చేరారు తరువాత వారొకవంద గణాలుగాపెరిగి టైటీలు అనే రెండోతెగగా ఏర్పడ్డారు టార్క్వినియస్, ప్రిస్కస్ కాలంలో ఎట్రూస్కన్‌లతో సహా చుట్టుప్రక్కలనున్న తెగలనన్నింటిని కలుపుకుని మూడోతెగ లూసెరస్ ఏర్పడింది వీరున్నూ ఒకనూరుగణాలయ్యారు ఆ విధంగా వందఏళ్ళలో రోముచుట్టూ 300 గణాలు సమీకృతం అయ్యాయి నాయకుల సమితి అధీనంలో మంచినిర్మాణ బలంపొందాయి నాయకులసమితిని యిప్పుడు రోమన్ సెనేటు అని పిలిచారు ప్రజాసభ కమిటియా క్యూరియాటా అనే పేరుతో ఏర్పడింది రెక్సు అనిపిలువబడే ఒక సైన్యాధ్యక్షుడు ఏర్పడ్డాడు ఇటలీలో సైనికప్రాముఖ్యం సంపాదించడం దీని ఏకైక లక్ష్యం

రోములస్ రాజ్యాంగంక్రింనను, అటు తరువాత సెర్వియస్ టల్లియస్ చేసిన శాసనాల ప్రకారమూ, ఆ ప్రభుత్వం ప్రధానంగా సైనిక ప్రజాతంత్రం ప్రభుత్వంలో సైనికోత్సాహం ప్రధానస్థానం వహించింది ఇక్కడదీనికి వ్యతిరేకం నూతనము అయిన క్రొత్తఅంశం యీ సామాజిక వ్యవస్థమొక్క కేంద్రంలో ఏర్పరచబడింది. అదేరోమన్‌సెనేటు- దాని సభ్యులను వారి వంశీకులను పాట్రీషియన్ అని ఒక తరగతిగా చేశారు యీ విధంగా ప్రత్యేక సౌకర్యాలుగల ఒక తరగతి ఏర్పడింది మొదటయిది గణవ్యవస్థలోనే నిలదొక్కుకున్నా, తరువాత రాజకీయ వ్యవస్థలోకూడా బలపడి చివరికి గణాలనుంచి సంక్రమించిన ప్రజాతంత్ర సూత్రాలను తోసిపారేసింది ఈ రోమన్‌సెనేట్ సృష్టించిన పాట్రీషియన్ తరగతి రోమన్ ప్రజల ఆచారాలను, భవిష్యత్తునుకూడా మార్చివేసింది ఆదీనియన్‌లలోలాగ సహజంగా ఒక క్రమంలో ఏర్పడిన నియమాల స్థాయినుంచి వారిని మరోదశకు తిప్పినాయి

యీ నూతన నిర్మాణం సైనికావసరాలకై సృష్టించిన గొప్ప తెలివయిన పని అది మిగిలిపోయిన యిటాలియన్ తెగలకన్నా వారిని ముందుకు తీసుకుపోయి చివరకు మొత్తం యిటలీమీద నాయకత్వం సంపాదించిపెట్టింది లాటిన్ తెగలు, యితర యిటాలియన్‌తెగలలోని గణవ్యవస్థను నీభుర్, హెర్మాన్, మీమ్‌సెన్, లాంగు మొదలయినవారు పరిశీలించారు కాని వారి పరిశీలనలు ఏవీ యిటాలియన్ గణాల నిర్మాణాలను, నిర్మాణసూత్రాలను స్పష్టంగా, పూర్తిగా చెప్పలేకపోయినాయి దీనికి కారణం, ఆ విషయంలో కొంతభాగం నిగూఢంగావుండి పోవడం, లాటిన్‌రచయితలు వివరాలు యివ్వలేకపోవడమూను ఇంకొకటి కూడా వుంది, పైనచెప్పిన వారిలో కొందరు గణానికీ, కుటుంబానికీ మధ్యనున్న సంబంధాలను సరిగ అర్థంచేసుకోలేదు' వారు కుటుంబాలసమాహారంగణాలని అన్నారు నిజానికి కుటుంబాలలోభాగాలుమాత్రమే గణాలలో వుంటాయి అందుచేత సమాజవ్యవస్థకు మూలయూనిట్ గణమేకాని కుటుంబంకాదు వారు పరిశీలించిన దానికన్న లోతుకు వెళ్ళడంకష్టమే కాని గణాల యొక్క ప్రాచీన ఆచారాలనుబట్టి యిప్పుడు నిగూఢంగా వుండిపోయిన కొన్ని లక్షణాలను మనంవూహించగల్గుతాం

ఇటాలియన్ తెగలలో ప్రాచుర్యంగా గణనిర్మాణాలు వున్నాయంటూ నీభుర్ యీ విధంగా వ్యాఖ్యానిస్తున్నారు "అథీనియన్ గణాల లక్షణాలనుబట్టి రోమన్ గణాల లక్షణాలను తెలుసుకోవడం కష్టం అన్నవారు ప్రాచీన ప్రపంచం అంతటా కొనసాగిన ఒక ఆచారం యిటలీలో ఒకవిధంగాను, గ్రీసులో మరోవిధంగాను ఎందుకు వుందో చెప్పవలసివుంటుంది జాఫెరియన్‌లు, సలామిన్‌లు, అథీనియన్లు,టుస్కులానులు, రోమనులలాగె ఎక్కడెక్కడున్నా ప్రజలు యిదేవిధంగా విభజించబడ్డారు"

రోమన్‌గణాలు వుండడం గురించేకాక ఆ నిర్మాణం యొక్క స్వభావాన్ని, దాని హక్కుల్ని, సౌకర్యాలను, బాధ్యతలను, గణాలమధ్యవుండే సంబంధాలను ఆ సామాజికవ్యవస్థలోని సభ్యులపరస్పర సంబంధాలనుగురించి తెలుసుకోవడం అవసరం. వీనిని గురించి పరిశీలించిన తరువాత వానికి క్యూరియాతో, తెగలతో, వారంతా కలిసి ఏర్పడిన ప్రజలతో గల సంబంధాలను దాని తర్వాత ప్రకరణంలో పరిశీలించుదాం

ఇందుకు సంబంధించిన సమాచారాన్ని దొరికినంత వరకు అనేక ఆధారాల నుంచి పోగుచేసినప్పటికీ అనేక విషయాలలో అది అసంపూర్తిగానే వుంటుంది. గణాలయొక్క కొన్ని లక్షణాలను, కార్యకలాపాలనుబట్టి వూహించవలసిందే రోమన్‌లలో నూతన రాజకీయ వ్యవస్థ ఏర్పడి గణాలయొక్క అధికారాలు వానికే సంక్ర

మింప చేయడం రోమనుల చరిత్ర పూర్తిగా ప్రారంభం కాక పూర్వమే జరిగింది అందుచేతనే వారు ప్రక్కను పెట్టేసిన సామాజిక వ్యవస్థయొక్క ప్రత్యేక లక్షణాలను కాపాడుకోవలసిన అవసరం కలుగలేదు క్రీస్తుశకం, రెండో శతాబ్దం ప్రథమభాగంలో గయస్ 'యిన్‌షిట్యూట్సు' వ్రాశారు అందులో "గణవ్యవస్థ ఉపయోగం లేకుండా పోయింది అందుచేత దానిని గురించి వ్రాయడం అనవసరమని" అన్నారు— అయినా రోము ఏర్పడ్డప్పుడు, తరువాత కొన్ని శతాబ్దాలదాకా గణనిర్మాణం జీవంతంగానేవుంది

గణాల యొక్క లక్షణాలను చెప్పే ముందు గణాలను గురించి, గణసమాజం గురించి, గణాలలో పారంపర్యం గురించి, రోమనులే యిచ్చిన నిర్వచనాన్ని చెప్ప వలసివుంటుంది సిసిరో తన టాసికాలో గణ సమాజాన్ని గురించి యిలా వ్రాశాడు " ఒకే పేరు కలవారు గణసభ్యులు— అంతే చాలదు వారు స్వతంత్రులైన తల్లి దండ్రులకు పుట్టినవారై వుండాలి అదీ చాలదు, వారి పూర్వీకులెవ్వరూ బానిసలు కాకూడదు యింకా అదే చాలదు వారెవ్వరూ హోటులేనివారు కాగూడదు బహుశ అంతటితో చాలుననుకుంటాను స్కావలోలా, పాంటిఫ్‌లు, యింతకంటె ఎక్కువ చెప్పారని అనుకోను" ఫెస్టస్ యిలా అన్నాడు "ఒకే మూల పురుషుడినుంచి పుట్టి, ఒకే పేరుగలవారు గణ సభ్యులు" వార్రో యిలా అన్నాడు "ఎమిలియస్ నుంచి పుట్టిన వారు ఎమిలి గణ సభ్యులు యీ ఎమిలియస్ పేరు నుంచి గణానికి సంబంధించిన పేర్లు పుట్టేయి"

సిసిరో గణాన్ని నిర్వచించటానికి ప్రయత్నించలేదు గణసంబంధాన్ని నిరూపించటానికి, అదిలేకపోతే తెలుసుకోవడానికి ఏంచేయాలో చెప్పాడు ఈ రెండింటిలో ఏదీ కూడా గణంలో ఉండే వారెవరో చెప్పదు అంటే ఒక పూర్వపురుషునికి చెందిన వారందరు ఆ గణంపేరు పెటుకోటానికి అర్హులా, కొందరికి మాత్రమే ఆ అర్హత వున్నదా అన్న విషయం తెలీదు గణంలో పురుష పారంపర్యం వుంటే, కేవలం పురుషుల ద్వారా తమ పారంపర్యాన్ని ధ్రువపర్చుకోగలవారే అందులో వుంటారు స్త్రీ పారంపర్యంవుంటే స్త్రీల ద్వారా పారంపర్యాన్ని ధృవపర్చుకోగలవారేవుంటారు ఏ పారంపర్యం లేకపోతే స్త్రీ పురుషుల సంతానం అందరూ అందులో వుంటారు పురుష పారంపర్యం వున్నదని అర్థం అయినప్పుడే యీ నిర్వచనాలకు అర్థం వుంటుంది పురుషపారంపర్యం నిరూపించ గల్గిన వారే గణంలో వుంటారని యితర సూచనలను బట్టి తెలుస్తుంది రోమనుల వంశ వృక్షాలు యిందుకు సాక్ష్యం ప్రసిద్ధుడయిన పూర్వపురుషుని నుంచి తమ పారంపర్యాన్ని నిరూపించగలవారే గణంలో

వుంటారనే విషయాన్ని సిసిరో వదిలేశాడు పెష్కస్ వ్రాలు దానిని గురించి కొంతవరకే చెప్పారు ఎమిలియస్ నుంచి ఎమిలీ గణాలు పుడతాయి గణం పేరున్న మగవాడు అందులో వుంటాడు అని చెప్పాడు గణసభ్యునికి గణం పేరు వుండాలని సిసిరో నిర్వచనంలో కూడా వుంది

క్రీస్తుపూర్వం 445లో కనూలియస్ రోమన్ కోర్టు ముందు వాదిస్తూ పాట్రీషియనులు, ప్లెబియనులు మధ్య వివాహాన్ని నిషేధించే చట్టాన్ని రద్దు చేయమని ప్రతిపాదించాడు దానిలో పురుష పారంపర్యాన్ని సూచించే వాక్యం ఒకటుంది పాట్రీషియన్ మగవాడు ప్లెబియన్ మహిళను పెళ్ళిచేసుకుంటాడు ప్లెబియన్ మగవాడు పాట్రీషియన్ మహిళను పెళ్ళి చేసుకుంటాడు అందులో ఏమివుంది, ఏం పోతుంది ? పిల్లలు తండ్రితోనే వుంటారు గదా "అని అన్నాడు

గణములపేర్లు పెట్టుకోవడాన్నిబట్టి పురుష పారంపర్యమే అమలులో వున్నదని చెప్పవచ్చు కయస్, జూలియస్ సీజరు చెల్లెలు, జూలియా, మార్కస్ అట్టియస్ బల్బస్‌ను పెళ్ళి చేసుకుంది ఆమె పేరును బట్టి ఆమె జూలియస్ గణానికి చెందినదని కనపిస్తూవుంది ఆమె కూతురు అట్టియా ఆచారం ప్రకారం ఆమె తండ్రి యొక్క గణనామాన్ని పెట్టుకుంది ఆమె అట్టియన్ గణానికి చెందుతుంది యీ అట్టియాకయస్ అక్టేవియస్‌ను పెళ్ళి చేసుకుంది ఆమె కొడుకు కయస్ అక్టేవియస్, మొదటి రోమను చక్రవర్తి ఆచారం ప్రకారం ఆమెకొడుకు తన తండ్రిగణనామాన్నే పెట్టుకున్నాడు అక్టేవియస్ గణానికే చెందుతాడు చక్రవర్తి అయినాక సీజర్ అగస్టస్ అని తన పేరుకు జతపర్చుకున్నాడు—

యీ అగస్టస్ నుంచి వెనక్కి రోములస్ వరకు యింకా వెనకకే చాలాకాలం వెనకటి వరకు రోమన్ గణాలలో పురుషపారంపర్యమేవుంది గణంలోని ప్రముఖ పూర్వపురుషుడినుంచి పురుషపారంపర్యంలో తన వంశవృక్షాన్ని చెప్పుకోగల్గితే తప్ప ఎవ్వరూ గణసభ్యులుకాలేరు అయితే మరీ పూర్వపురుషుడి నుంచి వంశవృక్షాన్ని చెప్పాలంటే అసంభవం వూహాకల్పిత పూర్వపురుషుడి నుంచయితే అసలే సాధ్యం కాదు అందుచేత ఆ వంశవృక్ష గణనం అనవసరమే

పైన చెప్పిన ఉదాహరణంలో వ్యక్తులు గణంవెలుపలనే వివాహమాడినట్లు గమనించగలం ఆచారం ప్రకారం గణాలలో అలవాటు అదే యీ దిగువచెప్పిన హక్కులు, సౌకర్యాలు, బాధ్యతలను బట్టి రోమనుగణాలు దేనికదిగా వుంటాయి

1 చనిపోయిన గణసభ్యుని యొక్క ఆస్తికి వారసత్వం గురించిన పరస్పర హక్కు
2 ఒకే శ్మశానం కల్గివుండడం
3 ఒకే మత కర్మలు కల్గివుండడం
4 గణం లోపల అంతర్వివాహం కూడదు
5 భూములపై ఉమ్మడి యాజమాన్యం
6 సహాయంకోసం, రక్షణ కోసం, నష్ట పరిహారం కోసం బాధ్యత
7 గణనామం ధరించే హక్కు
8 గణంలోకి పరాయివారిని దత్తు చేసుకునే హక్కు
9 నాయకులను ఎన్నుకునేందుకు తొలగించేందుకు హక్కు

పైన చెప్పిన క్రమంలో యీ లక్షణాలన్నింటిని పరిశీలించుదాం.

## 1 చనిపోయిన గణసభ్యుల ఆస్తి వారసత్వానికై పరస్పర హక్కు

క్రీస్తు పూర్వం 451లో పన్నెండు పట్టికల చట్టం ప్రకటించబడింది అంతకు పూర్వపు నియమం ప్రకారం ఆస్తి గణసభ్యులలో పంపిణీచేయబడేది దానిని మార్చి కొత్త నిబంధనలు పెట్టారు చనిపోయిన వాని ఆస్తి యిప్పుడు మొట్టమొదట అతని పిల్లలకు వెడుతుంది పిల్లలులేక పోతే పురుష పారంపర్యంలోని అతని కుటుంబీకులకు వెళ్ళుతుంది అతని సంతానంలో సజీవులుగావున్నవారు ఆస్తిని సమంగా పంచుకుంటారు ఎవరన్నా చనిపోతే అతని సంతానం తండ్రి వాటాను సమానంగా పంచుకుంటారు యిక్కడ ఆస్తి గణంలోనే వుంటుందని గమనించాలి చనిపోయిన వాని స్త్రీ సంతానం మరొక గణానికి చెందుతారు కాబట్టి వారు యిందులో లేరు మృతునికి కొడుకులు లేకపోతే ఆస్తి దగ్గర బంధవులకు వెళుతుందనేది రెండోవిషయం దగ్గర బంధువులంటే చనిపోయిన వానితోపాటు ఒకే పూర్వపురుషణ్ణి కలిగి, తమ పురుష పారంపర్యాల్ని నిరూపించుకోగలవారు (జ్ఞాతులు) ఆ పారంపర్యంవుండడం చేత వారందరి గణనామంఒక్కటే అవుతుంది, స్త్రీలకి, పురుషులకి కూడా వీరంతా మిగిలిన గణసభ్యుల కంటే చనిపోయిన వానికి దగ్గరవారవుతారు వీరిలోను, దగ్గరతనంలోని ఎక్కువ తక్కువలకు ప్రాముఖ్యంవుంది మొదట్లో అన్న దమ్ములు, పెళ్ళికాని అక్కచెల్లెళ్ళు రెండో స్థానంలో చనిపోయిన తండ్రివేపు అన్నదమ్ములు, పెళ్ళికాని అక్కచెల్లెళ్ళు—యిలాగే ఎంత దూరమయినా వెళ్ళవచ్చు చనిపోయిన వానికి

జ్ఞాతులు కూడా లేకపోతే చట్టం ప్రకారం గణసభ్యులు వారసులు అవుతారు యిది చిత్రంగా కనుపిస్తుంది-చనిపోయిన వాని అక్కచెల్లెళ్ళ పిల్లలకు వారసత్వంలేదు బంధుత్వంకూడా సూచించలేనంత దూరపు గణసభ్యులకు ప్రాధాన్యం యివ్వబడింది. ఒకే గణం పేరు వుండడం ద్వారా ఏనాడో బంధుత్వం వుండడమే వారికి వున్న అర్హత దీనికి కారణం తెలుస్తూనే వుంది చనిపోయిన వాని చెల్లెళ్ళ సంతానం మరో గణానికి చెందుతారు ఆస్తి గణంలో వుండాలనేది ప్రధానసూత్రం రక్తబంధుత్వం దగ్గరకావడంకన్నా గణం హక్కు బలీయం పన్నెండు పట్టికల చట్టం చూస్తే వారసత్వాన్ని వెనక నుంచి లెక్క కట్టడం కనుపిస్తుంది వారసులను మూడు తరగతులుగా చేశారు వారికి వరుసక్రమంలో వారసత్వపు నియమాలు ఏర్పరచారు మొట్టమొదటి వాళ్ళ గణసభ్యులు, రెండోతరగతి జ్ఞాతులు, వీరిలో పురుషపారంపర్యం వచ్చేక చని పోయినవారి సంతానం కూడా చేర్చబడింది మూడు పిల్లలు, జ్ఞాతులు వీరిలోకిచేరరు

స్త్రీకి పెళ్ళి కాగానే తాను పుట్టిన గణంలో హక్కు పోతుంది- దానితో జ్ఞాతిత్వపు హక్కులు పోతాయి— కారణం కనిపిస్తూనే వుంది వివాహం అయిన తరువాత కూడా జ్ఞాతిగా ఆమెకు వారసత్వం వుంటే ఆ ఆస్తిని తనగణం నుంచి భర్తగణానికి తీసుకుపోగల్గుతుంది ఆ మార్పు నిషిద్ధం— వారసత్వపు హక్కు పెళ్ళికాని చెల్లెలుకు వుందిగాని పెళ్ళయిన చెల్లెలుకులేదు— గణాలలో వున్న ప్రాచీననియమాలు మనకు తెలుసు లాటిన్ గణాలలో స్త్రీపారంపర్యం అమలు జరిగిన కాలంవైపు వెనక్కి చూస్తే అప్పుడు ఆస్తిఅంత ముఖ్యంగా వుండేది గాదు దాన్ని గణసమాఖ్యలో పంచుకునేవారు కాని లాటిన్ గణాలుగా దాని జీవితకాలంలో ఇది జరిగివుండదు కారణం దానినునికి వెలుపలోకి వచ్చినప్పటినుంచి తెలుస్తూంది— గణ సభ్యులకు కొన్ని సందర్భాలలో ఆస్తి వారసత్వం వుండడం రోమనుగణాలలోని ప్రాచీన నియమాన్ని గుర్తుచేస్తుంది

"సంతానం లేకుండా చనిపోయినవారి ఆస్తికి వారసత్వపుహక్కు చాలాకాలం నుంచీవుంది అది న్యాయవేత్తల దృష్టినికూడా ఆకర్షించింది గయస్ దానిని గురించి కూడారాశాడు కాని, ఆ రాతప్రతిలో ఆ భాగం స్పష్టంగా కనిపించడం లేదని" నీబుర్ వ్యాఖ్యానించాడు—

## 2 ఉమ్మడి శ్మశానం

అనాగరిక యుగం ఎగువ దశలో గణసభ్యులమనే భావన అంతకు పూర్వం

కన్నా చాలా బలంగా వుంది సమాజనిర్మాణం బలపడడమూ, మానసిక నైతిక పురోభి వృద్ధి యిందుకు కారణాలు— ప్రతి గణానికి సాధారణంగా ఒక శ్మశానం వుంటుంది ఆ గణ సభ్యులకు మాత్రమే అది ప్రత్యేకం— యీ విషయంలో రోమనుల ఆల వాట్లను చూపించటానికి కొన్ని వుదాహరణలు యిస్తాను

క్లాడియన్ గణనాయకుడు అప్పియస్ క్లాడియన్ సబైన్ల పట్టణం రెజిలీనుంచి రోముకు— రోములస్ కాలంలో మారాడు— కొంతకాలానికి ఆయన సెనేటరయ్యారు అందుచేత ఆయన పాట్రిషియన్ తరగతికి చెందిన వాడయ్యారు ఆయన క్లాడియన్ గణాన్ని తనతో తీసుకువచ్చాడు. వారి సంఖ్య అధికంగా వుండడం చేత ఆయన రోముకి రావడం ఒక ముఖ్య ఘటనగా పరిగణించబడింది రాజ్యము నుంచి గణ సభ్యులకు అనియో వద్ద భూములు యిచ్చారని, నగరానికి దగ్గరలో వారికి శ్మశానపు ప్రదేశం యిచ్చారని స్యుటోనియస్ వ్రాశాడు దీనిని బట్టి ఆ రోజుల్లో గణానికి ఉమ్మడి శ్మశానం అనేది తప్పని సరిగ భావించబడిందని వూహించవచ్చు, క్లాడితెగ వారు సబయిన్లతో వున్న సంబంధాన్ని విడిచి పెట్టుకుని రోమన్ ప్రజలతో కలిసి పోయారు రోమన్ గణాలలో సమానమయిన స్థాయిలో పరిగణించేందుకు వారి గణాలకు భూములు, శ్మశానాలుకూడా యివ్వబడినవి యిది అనాటి ఆచారాన్ని తెలుపు తూంది

జూలియస్ సీజరు కాలంనాటికి కూడా గణ శ్మశానం స్థానే కుటుంబ సమాధి స్థలం పూర్తిగా ఏర్పడలేదు— క్వింటిలియస్ వారుస్ కధ దీనికి ఉదాహరణ ఆయన జర్మనీలో యుద్ధంలో ఓడిపోయి ఆత్మహత్య చేసుకున్నాడు ఆయన శరీరం శత్రువుల చేతికి చిక్కింది— దానిని శత్రువు నానా బీభత్సం చేశారని వలెరులోలస్ రాస్తున్నాడు ఆయన తలకోసివేసి మారోబోదుస్ దగ్గరకు తీసుకు వెళ్ళారు ఆయన ఆ తలను సీజరుకు పంపాడు చిట్ట చివరకు గౌరవాలతో దానిని గణ శ్మశానంలో సమాధి చేశారు

న్యాయ చట్టాలను గురించిన తన సిద్ధాంత వ్యాసంలో సిసిరో సమాధి చేయ డం గురించి తన కాలం నాటి ఆచారాలను వ్రాశాడు— "సమాధి స్థలాలు చాల పవి త్రంగా భావిస్తున్నారు—గణాలకు సంబంధించిన పవిత్ర కర్మలతో సంబంధం లేకుండా స్వతంత్రంగా సమాధి చేయడం చాలా తప్పుగా భావిస్తున్నారు మన పూర్వుల కాలంలో కూడా పాపిలియన్ గణాలను గురించి ఎ టాక్విటస్ అదే రాశాడు" అవ కాశం వున్నట్లయితే గణానికి సంబంధించిన భూమిలో పవిత్ర కర్మకాండతో చని

పోయినవారిని సమాధి చేయడం మత సంబంధమయిన బాధ్యత అని యీమాట యొక్క అర్థం పన్నెండు పట్టికల ప్రకటనకు పూర్వం సమాధి చేయడం, దహనం చేయడం, యీరెండూ అమలులో వున్నట్టు కనిపిస్తుంది పట్టణం మధ్యలో మృత శరీరాలను దహనం చేయడం, సమాధి చేయడం కూడా నిషిద్ధం. గణాలలో యీ అవసరం కోసం, కొలంబరియమ్ వుపయోగపడేది— అందులో వందలాది చితాభస్మ పేటికలను జాగ్రత్త చేసేవారు— సిసిరో కాలంనాటికి గణవ్యవస్థ శిధిలమయి పోయింది, కాని దాని అలవాట్లు కొన్ని మిగిలే వున్నాయి వాటిలో ఉమ్మడి సమాధి స్థలం ఒకటి గణశ్మశానం స్థానంలో కుటుంబ సమాధి స్థలం ఏర్పడింది— ప్రాచీనగణాలలో కుటుంబాలు పూర్తిగా స్వాతంత్ర్యం పొందే సమయానికి యిదే సంబంధించింది అయినా సమాధికి సంబంధించిన ప్రాచీన గణ ఆచారాలు అనేక రూపాలలో వ్యక్తం అవుతూనే వున్నాయి

## 3 ఒకే మతకర్మ

రోమనుల శాక్ర (sacra) లో మన జాతరల వంటిది అవి సార్వజనికము కావచ్చు గణానికి మాత్రమే సంబంధించినవి కావచ్చు గణం నిర్వహించిన మత కర్మకాండను "శాక్రా ప్రయివేటా," లేక "శాక్రా జెంటిలిషియా" అని అంటారు వాటిని నిర్ణీతమయిన కాలంలో ఒక పద్ధతి ప్రకారం నిర్వహిస్తారు గణం యొక్క సభ్యుల సంఖ్య తగ్గిపోయిన ఫలితంగా యీ కర్మకాండలకయ్యే ఖర్చు భరించలేని స్థితి వచ్చిన ఘటనలు వున్నాయి— సభ్యుల సంఖ్య తరగడం, పెరగడం పరిస్థితులను బట్టి వుంటుంది— ఉదా పెళ్ళిళ్ళు, దత్తతలు, "రోమను గణ సభ్యులకు వుమ్మడిగా కర్మకాండ వున్నదని అందరికి తెలుసు— నిర్ణీత ప్రదేశాలలో,నిర్ణీ దినాలలో బలులు యివ్వడం వుంది" అని నీభర్ వ్రాశాడు యీ పవిత్ర కర్మకాండ ప్రజలకు సంబంధించినదైనా గణం నిర్వహించేదయినా లేదా పూర్తిగా పురోహితుని ఆధ్వర్యంలో జరుగుతుంది— దానిమీద ప్రజల పెత్తనం లేదు

రోమనుల మత కర్మకాండకు ప్రధానంగా గణంతో సంబంధంవుంది కుటుంబంలో కాదు పాంటిఫ్ క్యూరియాసే, అవుగర్ల (పురోహితులు) సమూహమూ యీ పురోహితుల అధీనంలో విస్తృత పూజా విధానమూ కాలక్రమంలో విస్తరించి ఒక రూపం తీసుకొని స్థిరపడ్డాయి— ఆ వ్యవస్థ స్వతంత్రము సహజ శక్తిగంది మతాచార్యులను ఎన్నుకునేవారు కుటుంబపు పెద్ద తన యింటికి పురోహితుడు—

గ్రీకుల, రోమనుల గణాల నుంచి ప్రాచీనకాలపు పురాణగాథలు అపారంగా వచ్చాయి

రోము ఏర్పడిన ప్రారంభదినాలలో మతకర్మకాండలకోసం ప్రతి గణానికి ఒక వంశా (మండపం) వుండేది అనేకగణాలకు ప్రతిదానికి ప్రత్యేకమయిన బలి విధానం వుండేది అవి ఒకతరంనుంచి మరొకతరానికి సంక్రమించేవి, వాటిని నిర్వహించడం తప్పనిసరి. నౌతినుంచి మినర్వా వరకు, పాలినుంచి హెర్క్యులస్‌వరకు, హోరేషియస్ జరిపిన సోదరీ హత్యాపాపం పరిష్కారంకోసం హోరాటీలు జరిపిన కర్మకాండలు యిలాంటివే ప్రతిగణానికి దానిదాని మతకర్మకాండ వుండేదనీ, అది ఆ సంస్థయొక్క లక్షణంగా వుండేదనీ చెప్పడంవరకే నా వుద్దేశ్యం

## 4 గణంలోపల వివాహ నిషిద్ధం

గణంయొక్క నిబంధనలు, ఆచారాలు చట్టమంత బలీయమయినవి గణం లోపల వివాహనిషేధం వానిలో ఒకటి తరువాతకాలంలో కూడా దానిని ఒక చట్టంగా చేసినట్టుకనుపించదు, అయినాగణంయొక్క ఆ నియమం అనేకరూపాలలో కనుపిస్తూనే వుంటుంది రోమను వంశావళులుచూస్తే వివాహాలు గణం బయటనే జరిగినట్టు తెలుస్తుంది దీనికి ఉదాహరణలు పైనచెప్పాను రక్తసంబంధపు కారణాలచేత పూర్వకాలంనుంచీ యిదొక నియమంగావుంది వివాహమయ్యాక స్త్రీకి జ్ఞాతిత్వపు హక్కులు పోతాయి అందులో మినహాయింపులంటూ లేవు వివాహం చేసుకుని ఒక గణంనుంచి యింకోగణానికి అంటే పుట్టినగణంనుంచి మెట్టినగణానికి ఆస్తిని తీసుకుపోకుండా నిషేధించడంకోసం యిది ఏర్పడింది తల్లిపైపు మేనమామనుంచి, తాతనుంచి, ఆస్తి వారసత్వం స్త్రీ సంతానానికిలేకుండా అటు తరువాత చేశారు దానికి కారణంయిదే స్త్రీ తన గణం వెలుపల వివాహంచేసుకోవాలి పిల్లలు తండ్రిగణానికి చెందుతారు విభిన్నగణాలకు చెందిన సభ్యులమధ్య ఆస్తివారసత్వం చెల్లదు

## 5 వుమ్మడిగా భూములపై అధికారం

అనాగరిక తెగలలో భూములు వుమ్మడిగా కలిగివుండడం అతి సామాన్యం. లాటిన్ తెగలలోకూడా అదేవుంది ఆ భూములలో కొంతభాగం ఎంతోకాలం ముందు నుంచీ వ్యక్తుల అధీనంలో నిరతియబడి వున్నట్టు కనిపిస్తుంది యీ పరిస్థితిలేని కాలం ఎప్పటిదో చెప్పలేం. బహుశ మొట్టమొదట్లో అమరికలో వున్నటువంటి భూముల

మీద స్వాధీనపు హక్కు యీ విధంగానే ప్రారంభమై వుంటుంది అనాగరికయుగం దిగువదశలోనే ఇది వున్నట్టు కనబడుతూంది

గ్రామవాసులయిన లాటిన్ తెగలలో కొంతభూమి ప్రతి తెగకు వుమ్మడిగా వుండేది కొంతభూమి గణాలకు వుమ్మడిగా వుండేది మరికొంతభూమి సమష్టి గృహాల అధీనంలో వుండేది

రోములస్‌కాలంలో రోములోవ్యక్తులకు భూములను కేటాయించడం మామూలు అయింది తరువాత సర్వసాధారణం అయింది రోములస్ ప్రతిమనిషికి రెండుజాగేరాల భూమిని ($2\frac{1}{4}$ ఎకరాలు) కేటాయించినట్టు వార్రో, డయోనిసస్‌లు వ్రాశారు తరువాత నుమా, సెర్వియస్ టుల్లియస్‌లు అదేపని చేసినట్టు చెప్తారు — భూములను విడదీసి సంపూర్ణమయిన హక్కుతో వ్యక్తుల అధికారంలోకి వప్పచెప్పడందీనిలో ప్రారంభం అనిచెప్పవచ్చు — దీనిని పట్టి స్థిరజీవితాలు ఏర్పడ్డాయని, తెలిని తేటలు చాలా ఎక్కువయ్యాయని వూహించాలి ఎవరో వ్యక్తులు బలోపేతంగా భూముల్ని స్వాధీనం చేసుకోవడంవేరు యిక్కడ అలాకాదు, ప్రభుత్వమే కొలిచి వ్యక్తుల స్వాధీనంలో పెడుతూంది— అనుభవం విస్తరించి భూమిమీద వ్యక్తుల సంపూర్ణ స్వతంత్రంఅనేభావం ఏర్పడింది అదినాగరికత ఏర్పడ్డాక పూర్తిఅయింది రోమనుప్రజలు వుమ్మడిగా అనుభవిస్తూన్న భూములనుంచే యీ భూములను ఇచ్చేరు నాగరికత ప్రారంభం అయినాకకూడా వ్యక్తులచేతులలో వేరువేరుగావున్న భూములుకాక, కొన్ని భూములు గణాలు, క్యూరియాలు, తెగలవుమ్మడి అధీనంలో వుండేది

మామ్‌సెన్ యిలా వ్రాశాడు "ప్రాచీనకాలంలో రోమను భూభాగం అనేక కుదురు జిల్లాలుగా విభజించబడింది. తరువాత గ్రామీణవార్డులుగా ఏర్పరచటానికి యివి ఉపయోగపడినాయి" జిల్లాల పేర్లలాగా యీ వార్డులపేర్లు తరువాతకాలంలో పెట్టినవి కావు—స్థలాలపేర్లను పట్టికాక, కుదురుల పేర్లమబట్టి అవి ఏర్పడ్డాయి" ప్రతిగణానికి స్వతంత్రంగా ఒకజిల్లా వుంటుంది అది ఆ ప్రదేశంలో స్థిరపడుతుంది గణాలు వేరు వేరుగా తమ ప్రదేశాల్లో స్థిరపడడం గ్రామీణ జిల్లాలలోనేక దు, రోములోనూవుంది మామ్‌సెన్, దీనిని గురించి యిలావ్రాశాడు "ప్రతి యింటికి వాళ్ళవాటా భూమివున్నట్టే, కుదురు— గ్రామానికి కుదురు— భూములు వుంటాయి ఇవిఎంతో కాలంవరకు— యించు మించు యిటీవలివరకు సమష్టికుటుంబపు భూములలాగే వుమ్మడి అధీనంలో వుండేది యీ కుదురు—గ్రామాలు మొదటినుంచి స్వతంత్రమైనవిగాకాక, రాజకీయ సమాజంలో అంతర్భాగాలుగా పరిగణించబడుతూన్నాయి. ఒకేమూలంనుంచివచ్చి ఒకేభాష,ఆచారాలు

కలిగిన అనేక కుదరు– గ్రామాల సమూహం పరస్పరం శాసనాలను పాటించడం, పరస్పరంచట్టరీత్యా వారసత్వాలు చేసుకోవడం ఆక్రమణలకు, ఆత్మరక్షణకు కలసి వుండడంకోసం కలిసివున్నట్టు కనిపించ తూంది మోమ్‌సెన్, లేక ఆయన అనువాదకుడో యిక్కడగణం స్థానంలో కుదురునువాడాడు–మరో చోట తెగ స్థానంలో కాంటన్ అని వాడాడు యిది చిత్రంగా కనుపిస్తుంది యీ నిర్మాణాలకు లాటిన్ భాషలో నిర్దిష్టమయిన శబ్దాలున్నాయి వాటిచరిత్ర స్వీకరించింది రోమునగరం ఏర్పడక పూర్వమే లాటిన్ తెగలలో కుటుంబాలు, గణాలు, తెగలు భూములను కలిగి వున్నట్టు మోమ్‌సెన్ వ్రాశాడు యీ తెగలలోని సామాజిక నిర్మాణాల్ని క్రమోత్తరంగా ఒక వరసలో చూపించాడు వానిని చూస్తే యిరాక్వాలలోని గణాలు, తెగలు, సమాఖ్య మొదలయినవానితో పోలికలు స్పష్టంగా కనిపిస్తూన్నాయి

స్ట్రాట్రీ పేరు ఆయన ఎత్తలేదు బహుశ అది వుండేవుంటుంది ఇళ్ళమాట ఎత్తాడు అందులో ఒకే కుటుంబం వుండేదని అనుకోటానికి వీలులేదు ఆ వుమ్మడి వసతి గృహంలో దగ్గర బంధుత్వం వున్నకొన్ని కుటుంబాలు నివసించేవని, ఆ యింట్లో కమ్యూనిజాన్ని పాటిస్తూ జీవించే వారని అనుకోవచ్చు

## 6 పరస్పర సహాయానికి, రక్షణకు, నష్టపరిహారానికి బాధ్యత

అనాగరిక యుగంలో వైయక్తిక హక్కుల రక్షణకోసం గణసభ్యులు ఒకరి పై ఒకరు ఆధారపడి వుండేవారు కాని రాజకీయ సమాజం ఏర్పడిన తరువాత గణసభ్యుడు - యిప్పుడతడు పౌరుడు అయ్యాడు - రక్షణకై గణాన్ని కోరటానికి బదులు, చట్టాన్ని, రాజ్యాన్ని కోరుతాడు - పాతవ్యవస్థలోని యీ లక్షణం నూతన వ్యవస్థలో మొట్టమొదటిగా అంతర్ధానమవుతుంది కాని ప్రారంభ దినాలనాటి రచయితలు యీ పరస్పర బాధ్యతలను గురించి కొద్ది కొద్ది ఉదాహరణలను యిస్తూనే వచ్చారు దీని అర్థం అంతకు పూర్వకాలంలో కూడ గణసభ్యులు యీ పరస్పర బాధ్యతలను పాటించలేదనికాదు ఆ విధంగా పాటించడం గణ నిర్మాణం యొక్క ప్రధాన సూత్రాలలో ఒకటి - యీ ఆచారాలు కొన్ని ప్రత్యేక పరిస్థితులలో చారిత్రక యుగంలోకూడా పాటించినట్లు కనుస్తుంది క్రీస్తు పూర్వం 432లో అప్పియస్ క్లాడియస్ జైలులో వద్దాడు ఆనాడు అతని శత్రువుగావున్న క్లయస్ క్లాడియసూ, మొత్తం క్లాడియన్ గణంఅంతానూ దుఃఖసూచక మయినదుస్తులు ధరించారు ఆనస్థలోని ఒక సభ్యుడుకి కల్గిన ఆపదకు, అవమానము తమకు జరిగినట్టుగానేమిగిలిన వారందరు

బాధ్యతగా వుండేవారు. రెండో ప్యూనిక్ యుద్ధంలో "జైలులో వున్న తమ గణసభ్యుల్ని డబ్బు యిచ్చి విడిపించడానికి గణసభ్యులు సిద్ధమయ్యారు కాని సెనేట్ వారిని ఆటంక పరిచింది. ఈ బాధ్యత గణం యొక్క ముఖ్య లక్షణాలలో ఒకటి"— అని నీభర్ వ్రాసేరు. వియన్‌టియన్ యుద్ధంలో దొరికిన వస్తువుల గురించి కోర్టు కమిల్లను మీద నేరారోపణ చేసింది. విచారణకు ముందు రోజున ఆయన తన తెగవారిని తన యింటికి రప్పించి వారి సలహా అడిగేరు. అతనికి కోర్టు విధించే జరిమానా సొమ్మును తామంతా పోగుచేసి యిస్తామని వారు చెప్పారు. కానీ, అలాటిని బయట పడెయ్యడం అసంభవం. ఈ సందర్భాలలో గణాల ప్రధాన లక్షణాలు స్పష్టంగా కనిపిస్తాయి. దరిద్రబాధతో వున్న తమగణ సభ్యులకు సాయం చేయవలసిన బాధ్యత రోమను గణసభ్యులకు వున్నదని నీభర్ రాసేరు.

## 7. గణ నామం ధరించేందుకు హక్కు

గణంయొక్క స్వభావంలోనే ఈ హక్కు వుంది. గణానికి చెందిన పురుషుని సంతానం - ఆడ, మగ అందరూ గణసభ్యులు. వారికి గణనామం ధరించే హక్కు వుంది. కాలక్రమంలో గణసభ్యులకు తమ పురాణ పురుషునితోగల బంధుత్వాన్ని పట్టుకోవడం అసంభవం అయిపోయింది. అందుచేత గణంలోని కుటుంబాలు మధ్య బంధుత్వాన్ని తరవాత వచ్చిన ఒక పూర్వపురుషుడి నుంచి గుణించడం ప్రారంభించేరు. వంశవృక్షాన్ని ప్రాచీన కాలంనుంచీ చెప్పలేక పోయారు. గనక ఈ కుటుంబాలు అతిపురాతన కాలపు మూల పురుషుడినుంచి రాలేదనుకోనక్కర్లేదు. గణంలో పుట్టేరు. కొన్ని పురుషాంతరాల వరకూ తమ గణసంబంధాన్ని చెప్పుకోగలరు. అది చాలు. గణంలోనే పుట్టేరు. అనడానికీ, మిగిలిన గణ సభ్యులందరితో రక్తబంధుత్వం వున్నదనడానికి ఒకే పూర్వ పురుషుడి నుంచి వచ్చేరని నిరూపించాలనీ, అలాగ చూపలేక పోవడంచేత, గణంలోని కుటుంబాల మధ్య రక్త సంబంధంలేదని నీభర్ వంటి కొందరు వాదిస్తున్నారు. దీనిని పట్టి గణం అన్నది ఒక కృతక సంస్థ. అది నిలబడదు - అనాలి. సిసిరో నిర్వచనాన్నిపట్టి గణ సభ్యులమధ్య రక్తసంబంధం లేదని నీభర్ వాదించేరు. అదిసరికాదు. గణనామం పెట్టుకొనే హక్కు ఎక్కడిది - అని ప్రశ్నిస్తే గణపురుషుడి నుంచి వంశక్రమం చూపించనక్కర్లేదు. గణానికి చెందిన కొందరు ప్రముఖ సభ్యులనుంచి పారంపర్యం చూపిస్తే చాలు. లిఖితములయిన దాఖలాలు లేనప్పుడు వంశవృక్షాన్ని కొంతదూరం వెనక్కి మాత్రమే చెప్పగలం.

గణంలోని కొన్ని కుటుంబాలు తమ పూర్వపురుషుడిని చెప్పలేకపోవచ్చు అంత మాత్రంచేత పురాతనకాలపు గణపురుషుడినుంచి వారు రాలేదనలేము

పురుష పారంపర్యానికి మారేక అదివరకు జంతువులనీ, నిర్జీవపదార్థాలనీ పేర్లు వుండేవల్లాగణాలకు మనుష్యులపేర్లు పెట్టేరు గణంచరిత్రలో ప్రసిద్ధికెక్కిన ఒకరిని ఆ గణానికి పూర్వపురుషుడుగాస్వీకరించేవారు ఆయితే ఆయనపేరు స్థానే కాలక్రమంలో మరొకరిపేరు పెట్టరనేదిలేదు గణంలో ఒకభాగం విడిపోయి మరోచోటుకివెళ్ళినప్పుడు ఆ గణభాగం కొత్తపేరు పెట్టుకుంటుంది కాని ఆ పేరు మార్పు గణానికి మూలం అయినబంధుత్వాన్ని రద్దు చేయదు పేర్ల మార్పులువున్నా రోమనుగణాల పారంపర్యం వెనక్కి చూస్తే లాటినులు, గ్రీకులు, భారతదేశంలోని సంస్కృతం మాట్లాడిన ప్రజలు ఒకటిగా వున్నప్పటి కంటా వున్నది వాని ప్రాచీనత అర్థం అవుతుంది ఎవ్వరూ గణనామాన్ని పోగొట్టుకోవడం ఎన్నడూ జరగదు ఆ పేరు వుండడం తాను గణసభ్యులతోపాటు ప్రాచీన వంశంనుంచి వచ్చినందుకు దాఖలా గణంలోని పారంపర్యాన్ని కలగాపులగం చేయడానికి ఒక్కటే మార్గం రక్త సంబంధంలేని పరాయి వారిని గణంలోకి దత్తు చేసుకోవడం ఈ ఆచారం వుంది కాని చాలాచాలా స్వల్పం కాలం గడిచిన కొద్దీ గణ సభ్యులలో కొందరి మధ్య రక్తసంబంధం తగ్గిపోతుందని నీబుర్ అంటే, దానికి అభ్యంతరం చెప్పనక్కర్లేదు కాక, గణ సభ్యులమధ్య రక్తసంబంధం ఏమీ లేదనడం, కొంతమంది సమీకృతమై కృత్రిమంగా గణంగా నిర్మాణమయ్యేరనడమే అవుతుంది గణం మూడు మానవఅభివృద్ధి దశలలో విస్తరించడానికి మూలం అయినదాని లక్షణాలను నిరాకరించడమే అవుతుంది

గణము ఒక రక్తబంధుత్వవ్యవస్థతో వచ్చిందనీ, ఆ బంధుత్వాలను చాల కొద్ది సంఖ్యకు కుదించినదనీ వెనక ఒకచోట చెప్పేను ఎంతకాలమైనా తరతరాలుగా వారిలో అవే బంధుత్వాలు కొనసాగుతుంటాయి వారి పూర్వపురుషుడు ఎన్నితరాల పూర్వంవాడైనా ఒండొరుల మధ్య బాంధవ్యాన్ని అతి సులభంగానే పట్టుకుంటారు అయిదువందల మంది వుండే ఇరాక్వ్యగణంలో ప్రతి ఒక్కరూ రెండో వానితో గల బాంధవ్యాన్ని చెప్తాడు లేదా తెలుసుకోగలడు ప్రాచీనకాలపు గణాలలో బంధుత్వ సంబంధం ఎప్పుడూ వుంది దంపతీ కుటుంబం రావడంతో కొత్త తరహా బంధుత్వం ఏర్పడింది ఇందులో జ్ఞాతి బంధుత్వాలు అన్నీ అదృశ్యమైపోయాయి. చారిత్రక దశాకాలం నాటికి లాటిన్, గ్రీకు తెగల పరిస్థితి ఇది అంతకు పూర్వం-

తురావియన్ దశాకాలంలో - గణసభ్య లౌకరౌకరితోగం బాంధవ్యాలను బాగా ఎరిగివుంటారు

గణవ్యవస్థ శిథిలంకావడం ప్రారంభమయ్యేక వెనకటిలాగ గణం చీలి కొత్త గణాలు ఏర్పడే ప్రక్రియ నిలిచిపోయింది ఉన్నవి అంతరించిపోయాయి దీనితో వంశ వృక్షాలలో గణపారంపర్యం చెప్పుకోడానికి విలువ పెరిగింది రోమను సామ్రాజ్య కాలంలో విదేశాలనుంచి ఎన్నోకుటుంబాలు వచ్చి రోములో మకాంపెట్ట సాగేయి సమాజంలో ప్రతిష్ఠ పెంచుకొనేందుకు వారు గణనామాలు పెట్టుకోసాగేరు దీనిని అపచారంగా భావించేరు విదేశీయులు రోమను పేర్లను, ముఖ్యంగా ప్రాచీన గణ నామాలను పెట్టుకోరాదని క్రీ శ 40-45ల నాటి చక్రవర్తి క్లాడియస్ శాసనం చేసేరు. రిపబ్లికునాడు, సామ్రాజ్యకాలంలోనూ కూడ చరిత్ర ప్రసిద్ధికెక్కిన గణాలకు చెందిన రోమను కుటుంబాలు తమ వంశవృక్షాలకు ఎక్కువ ప్రాముఖ్యాన్ని చూపించేరు

ధనికులు, పేదలు, సామాన్యులు, ప్రఖ్యాతిగలవారు అనేతేడాలేకుండా గణ సభ్యులందరూ తమహక్కులు, సౌకర్యాల విషయంలో స్వతంత్రులూ, సమానులూను తమ జన్మహక్కుగా సంక్రమించిన గణనామం తీసుకురాగల ప్రతిష్ఠవారందరికీ సమానమే గ్రీకుగణాలలో, అమెరికను ఇండియను గణాలలో లాగనే రోమను గణాలలోకూడ స్వాతంత్ర్యం, సమానత్వం, సౌదర్యం ప్రధాన లక్షణాలు

## 8 రక్తసంబంధంలేని పరాయి వారిని గణంలో చేర్చుకొనే హక్కు.

రిపబ్లికుకాలంలోనూ, సామ్రాజ్య కాలంలోనూ కుటుంబంలోకి, దత్తత చేసుకోడం, ఆ విధంగా గణంలోకి తీసుకోవడం అలవాటు వుండేది దానికి ఎంతో తతంగం వుండడంచేత దత్తత అంతసులభంకాదు పిల్లలులేకపోతే, కలుగుతారన్న ఆశలేకపోతే, పురోహితుల అనుమతీ, క్యూరియాసమితి అనుమతీ తీసుకుని కొడుకును దత్తతచేసుకోవచ్చు పురోహితవర్గం అనుమతి ఎందుకంటే దత్తత తీసుకునే కుటుంబంవారి పవిత్ర కర్మకాండలకు నష్టం కలగవచ్చు దత్తత తరవాత అతడు గణ నామం తీసుకొంటాడు దత్తతతండ్రి ఆస్తికి వారసుడవుతాడు అందుకని క్యూరియా సమితి అనుమతికావాలి. శిరోకాలం నాటికివున్న నిబంధనలుచూస్తే, అంతకుపూర్వం నాటి గణవ్యవస్థలో ఈ నిబంధనలు ఇంకా కఠోరంగా వుండేవనుకోవచ్చు దత్తత

చాల అరుదుగా జరిగి వుంటుంది పూర్వకాలంనాడు గణమూ, దాని సభ్యత్వంవున్న క్యూరియా అనుమతిస్తే తప్ప దత్తత సాధ్యంకాదు అందుచేత దత్తు చేసుకొన్నవారి సంఖ్యాతక్కువే దత్తతకు సంబంధించిన ప్రాచీన ఆధారాల వివరాలు ఇప్పుడు అట్టే తెలియవు

## 9 నాయకుని ఎన్నుకొనేందుకూ తొలగించేందుకూ హక్కు

నాయకపదవి కాలపరిమితి గురించిన ప్రత్యక్ష సమాచారం లేకపోవడం చూస్తే రోమనుగణాలను గురించి మనకు అట్టే తెలియదనేఅనాలి రాజకీయసమాజం ఏర్పడక పూర్వం ప్రతిగణానికీ ఒకడో, అంతకన్న ఎక్కువమందో నాయకులు ఉండేవారు ఆ పదవి ఖాళీపడినప్పుడు ఇరాక్వాలలోలాగ ఎన్నికజరిపో, వారసత్వపు హక్కు ద్వారానో దానిని నింపేవారు వారసత్వపుహక్కు వున్నట్లుగా సాక్ష్యంలేక పోవడం బట్టీ, రిపబ్లికుకాలంలోనూ, అంతకుపూర్వం రెజెస్ కాలంలోనూకూడ ప్రతిపదవికీ ఎన్నికలు జరపడం అలవాటుగా వుండడంబట్టీ లాటిన్ గణాల ఆచారాలకు వారసత్వం హక్కువ్యతిరేకమని వూహించవచ్చు అత్యున్నతమైన రెక్స్ పదవికి ఎన్నిక జరిగేది సెనెటర్‌ను ఎన్నుకోవడమూ, నియమించడమూ కూడ వుండేది కాన్సలులు, ఇతర దిగువతరగతి మాజిస్ట్రేటుల పదవులూ అంతే సుమాఏర్పడిన పాంటిఫ్‌ల (పురోహితులు) వర్గం విషయంలో అటూ, ఇటూ, కూడ జరిగేది మొట్టమొదట పురోహిత పదవులు ఎన్నికలద్వారానే భర్తీఅయేవి క్రీ పూ 212లో పెద్దపురోహితుని కమిటియా (సమితి) ఎన్నుకొనడంగురించి లివీ వ్రాసేడు lex Domitia అనేక తరగతులకు చెందిన పాంటిఫ్‌లనూ, పూజారులనూ ఎన్నుకొనేహక్కు ప్రజకు వదలాయించింది కాని, తరవాత మళ్లా చట్టాన్ని మార్చేరు చరిత్రకు తెలిసే నాటికి లాటిన్ గణాలలో ఎన్నిక పద్ధతి బాగా అమలులోవుంది అప్పటినుంచి రిపబ్లికుకాలం పొడూగునా కూడ అదేవుంది అందుచేత ప్రధాన నాయకపదవికి ఎన్నికే జరిగేదని వూహించవచ్చు వారి సామాజిక వ్యవస్థలో అడుగడుగునా కనిపించే ప్రజాతంత్ర లక్షణాలు గణాలనుంచి సంక్రమించినవే నాయకపదవి అనువంశికంగా సంక్రమించేది అనడానికి నిశ్చితమైన సాక్ష్యంలేనిదే పైవూహను కాదనడానికి లేదు ఎన్నిక జరిగే హక్కు వుందంటే, — అది జీవితకాల పదవి అయినప్పుడు -- అతనిని పదవినుంచి తొలగించేహక్కూ వుంటుంది

రోము ఏర్పడక పూర్వం ఈ నాయకులేనో, వారిలో మంచి ఏరుకున్న

వారో లాటిన్ తెగల సమితిగా వుండేవారు పాలనా వ్యవహారాలు వారి ద్వారానే జరిగేవి గ్రీకు తెగలలో లాగానే లాటిన్ తెగలలో కూడ ప్రభుత్వంలో ముగ్గురి అధికారాలూ సమన్వయించి సాగివచ్చే కనబడుతుంది నాయకుల సమితి, ప్రజాసభ, సైన్య నాయకుడు ఆ ముగ్గురూను బహుశా ప్రధానమైన ప్రజాసమస్యలను ప్రజాసభ ముందుంచేవారనీ, అంగీకరించినా, నిరాకరించినా దానికా అధికారం వుందనీ అనుకోవచ్చు "ప్రాచీన కాలంలో ఈ కాన్టన్లు అన్నీ రాజకీయంగా సర్వతంత్ర స్వతంత్రాలు ప్రతి దానికి ఓరాజు పాలకుడుగా వుంటాడు పెద్దలసమితీ, యోధుల బలగమూ అయనకు సహకారంగా వుంటాయి"— అన్నారు మోమ్సెన్ ఈ వరసక్రమాన్ని తిరగవెయ్యాలి ఆ మాటలకు సవరణలూ చేర్చాలి ఆ సామాజిక వ్యవస్థలో సమితి కేంద్రస్థానంలో వుంటుంది ఏమంటే అది సమాజంలోంచే పుట్టింది అవసరంరీత్యా అది పౌరవ్యవహారాలలో సర్వాధికారాలు కలిగివుంటుంది పరిపాలనచేసేది సమితి సైన్యాధికారికాదు "మధ్యధరా సముద్రతీరాన వున్న నాగరిక నగరాలన్నింటిలో రాజ్యానికి ప్రజాసభలాగే సెనేట్ కూడా అతిముఖ్యమైన తప్పనిసరి అంగము అది పౌర వృద్ధుల మంచి ఏరి కూర్చినది కులీనులతో ఏర్పడినా ప్రజా తంత్ర పద్ధతిలో ఏర్పడినా సమితి అనేది ఎప్పుడూ వున్నదని అరిస్టాటిల్ అన్నారు కొద్ది మంది చేతులలో ప్రభుత్వంవున్న బహుజన పాలనలలో కూడా ప్రజాసమస్యలకు రూపం ఇచ్చేందుకై కొంత మంది సలహాదారులను నియమించడంవుంది" అన్నారు సీభుర్ గణసమాజంలోని నాయకుల సమితి స్థానే రాజకీయసమాజంలో సెనేట్ వచ్చింది నూరుమంది పెద్దలతో రోములస్ మొట్టమొదటి రోమన్సెనేట్ను ఏర్పరచేడు అనాడున్నవి నూరుగణాలే కనక వారు ఆ గణాలనాయకులే అయివుంటారనుకోవచ్చు ఇది జీవిత వ్యవధిగల పదవి కనక అనువంశికంకాదు అందుచేత ఆ కాలంలో నాయక పదవికి ఎన్నిక జరిగేదని వూహించాలి అలాగాకుంటే రోమను సెనేటును అనువంశిక సంస్థగా భావించాలి కాని ప్రాచీన సమాజంలో ప్రజాతంత్రం అడుగడుగునా ఎదురవుతుంది గ్రీకు, రోమను గణసమాజం గురించి వచ్చిన చారిత్రిక విశ్లేషణలలో ఈ విషయం కనబడ్డంలేదు

రోమను గణాలలో సభ్యులెందరు వుండేవారనేదానికి కొంత సమాచారం లభిస్తూంది క్రీ పూ 474లో ఫెబియన్ గణం మొత్తంగా సెనేట్కు వియన్టియన్ యుద్ధాన్ని ప్రారంభించవలసిందని ప్రతి పాదించింది. సెనేట్ అంగీకరించింది

ప్రజలహర్ష ధ్వానాల మధ్య రోమునుంచి మూడువందల ఆరుగురు సైనికులు బయలు దేరేరు వీరంతా పాట్రీషియన్లే వారు కొన్ని విజయాలు సాధించేరు గాని, చివరకు శత్రువు మాటువేసి వారందరినీ చంపివేశాడు ఆ ఫెబియన్ గణంలో వయస్సురాని ఒకే ఒక బాలుడు రోములో మిగిలి పోయాడని కథ మూడు వందల కుటుంబాలలో ఒకేఒక కుర్రవాడు, వయస్సురానివాడు మిగిలేడనడం అర్థంలేనిమాట పైన మగవాళ్ళ సంఖ్య ఇచ్చేరు కనక మరో అందరు స్త్రీలు వుంటారు ఆ మగవాళ్ళ పిల్లలుంటారు అంతా కలిసి ఆ గణంలో ఏడు వందల మంది వుంటారని చెప్పవచ్చు

రోమను గణాల హక్కుల్ని గురించి, బాధ్యతలను గురించి, కార్యకలాపాలను గురించి విశేషించి చెప్పక పోయినా, ఈ గణాలే వారి సామాజిక, పాలనాత్మక, మతసంబంధి కార్యక్రమాలకు మూలం అని చెప్పేందుకు కావలసిన ఆధారాలనిచ్చేను వారి సామాజిక వ్యవస్థకు మూలమైన యూనిటుగా గణం తనకన్న పైన వుండే నిర్మాణాలలో సభ్యురాలుగా, వానికి తనలక్షణాలను అంటకూరుస్తుంది రోమనుల ఆచారాలు ఎల్లాపుట్టేయి, ఎల్లాపెరిగేయి అనేది పూర్తిగా తెలుసుకొనేందుకు, రోమను గణాలను గురించి మనకు ఇప్పుడున్న కన్న ఎక్కువ సమగ్ర పరిజ్ఞానం సమకూర్చుకోవాలి

# పన్నెండో ప్రకరణం

# రోమను క్యూరియా, తెగ, ప్రజ.

రోమను గణ సమాజం - నిర్మాణం యొక్క నాలుగు దశలు- 1 గణం, 2 క్యూరియా, దీనిలో పది తెగలుంటాయి, 3 తెగ, దీనిలో పది క్యూరియా లుంటాయి, 4 రోమను ప్రజ మూడు తెగలతో ఏర్పడింది- సంఖ్యాక్రమం- ఎందుకు ఎల్లావచ్చింది - రోములో గణాల కేంద్రీకరణం - రోమన్ సెనేటు- దాని కార్యకలాపాలు - ప్రజా సభ - దాని అధికారాలు - ప్రజలే సర్వాధికారులు- సైన్యాధ్యక్ష పదవి (రెక్స్) - దాని అధికారాలు, కార్యకలాపాలు - రోమను గణ ఆచారాలు ప్రధానంగా ప్రజాతంత్రయుతమైనవి

రోమను గణాలను గురించి పరిశీలించాం ఇంక అనేక గణాలుచేరి ఏర్పడిన క్యూరియాను, అనేక క్యూరియాలు కలిసి ఏర్పడిన తెగను, అనేక తెగలు కలిసి ఏర్పడిన రోమను ప్రజను గురించి తెలుసుకుందాం రోములస్ కాలం నుంచి సెర్వియస్ టుల్లియస కాలం వరకు వున్న సమాజ నిర్మాణం వరకే మన పరిశీలన పరిమితమయినా, రిపబ్లికు ప్రారంభదినాలలో ఒక మూల గణ వ్యవస్థ శిథిలం అయిపోతూంటే రెండోవేపున వచ్చిన మార్పుల్ని గురించీ, నూతన రాజకీయ వ్యవస్థ ఏర్పడుతుండడాన్ని గురించీ కొంత ఆలోచించవలసివుంటుంది

అథీనియన్లలో లాగనే రెండు ప్రభుత్వ నిర్మాణాలు పక్కపక్కనే కొనసాగడం ఇక్కడా కనిపిస్తుంది వాటిలో ఒకటి క్షీణించి పోతూంటే రెండోది బలం పుంజుకుంటూంటుంది మొదటిది గణాలతో ఏర్పడిన సమాజం (Societas) రెండోది భూభాగము ఆస్తి ప్రాతిపదికగా ఏర్పడి, క్రమంగా మొదటి దానిని తొక్కివేస్తున్న రాజ్యం (Civitas) పరివర్తన దశలోవున్న ప్రభుత్వం తప్పనిసరిగా సంక్లిష్టంగా వుంటుంది కనక అర్థంచేసుకోవడం కష్టం. ఈ మార్పులు క్రమంగా వచ్చేయి. రోములస్‌తో ప్రారంభమయాయి నిర్దుష్టంకాలేదు కాని సెర్వియస్ టుల్లియస్‌తో

సంపూర్ణం అయ్యాయి ఈ యుద్ధకాలమధ్య కమారమీ రెండు వందల ఏళ్ళు గడిచే యంటారు ఈ కాలమంతా బాల్యదశలోవున్న ఆ కామన్వెల్తు జీవితం ఘటనామయం గణాల వలుకుబడి రాజ్యంలో అంతరించేవరకూ వాని చరిత్రను తెలుసుకోడానికి క్యూరియాలన, తెగలన్ను, ప్రజలను గురించి, నూతన రాజకీయ వ్యవస్థను గురించి తెలుసుకోవాలి ఈ ప్రకరణంలో మన పరిశీలనాంశం అదే

రోమనుల గణసమాజం నాలుగు అంతరువులలో కనిపిస్తుంది మొదటిది గణం ఇది రక్తసంబంధం కలవారితో ఏర్పడుతుంది ఇదే సమాజ వ్యవస్థకు మూలయూనిటు రెండోది క్యూరియా గ్రీకుల ఫ్రాట్రీవంటిది పది గణాలు కూడి ఏర్పడిన ఉన్నత సంస్థ మూడోది తెగ పది క్యూరియాలు కలిసి ఏర్పడినది గణ ఆచారాలలోనే జాతి యొక్క లక్షణాలు కొన్ని దీనిలో కనిపిస్తాయి నాలుగోది రోమను ప్రజ (Populus Romanus) టుల్లిస్ హోస్టిలియస్ కాలంలో మూడు వందల గణాలను కలుపుకొని ఒక గణ సమాజంగా ఏర్పడ్డ మూడు తెగలు దీనిలో ఒకటయాయి చారిత్రక దశ కాలం నాటికి ఇటాలియను తెగలన్నీ ఈ విధంగానే నిర్మాణం పొందినాయనడానికి సాక్ష్యం వుంది అయితే రోమనుల క్యూరియా గ్రీకుల ఫ్రాట్రీకన్న, మిగిలిన ఇటాలియను తెగలలోని ఫ్రాట్రీలకన్న బాగా పురోగమించింది రోమను తెగలు ఒక పద్ధతి ప్రకారం విస్తరింపచేయబడడంచేత మిగిలిన ఇటాలియనులలోకన్న ఇవి గట్టి నిర్మాణం పొందేయి ఇందుకు కావలసిన సాక్ష్యధారాలను క్రమంగా ఇస్తాను

రోములస్‌కు పూర్వం ఇటాలియనులు అనేక శాఖలుగా బహుసంఖ్యాకులుగా వుండేవారు. తెగలు చిన్నచిన్నవిగా విడిపోయాయి. తెగల నిర్మాణం ఆ విధంగా విశీర్ణం కావడం సహజమేనని అవి నిరూపిస్తున్నాయి అయితే లాటిన్ తెగలలోనూ, ఇతర ఇటాలియన్ తెగలలోనూ కూడ అవి అన్నీ ఐక్యం అయ్యే లక్షణం వచ్చింది కాని సమాఖ్యగా ఏర్పడి సత్ఫలితాలను సాధించడం జరగలేదు ఈ పరిస్థితులలో రోములస్ వుద్యమం వచ్చింది నూరు లాటిన్ గణాలు టైబర్ నదీతీరంలో సమీకృతం అయ్యాయి తరవాత మరో రెండువందలు సబైన్, లాటిన్, ఎట్రూస్కన్ కదితరుల గణాలు వచ్చి చేరాయి వారంతా ఒక ప్రజగా సమ్మేళనం అయారు ఆ విధంగా రోము ఏర్పడింది రోము ప్రభుత్వమూ, నాగరికతా తర్వాత వచ్చేయి. ఒకే పాలనాధికారం కింద గణాలనూ, తెగలనూ కేంద్రీకరించడం రోములస్‌తో ప్రారంభమయింది. తరువాతి వారు దానిని పూర్తిచేసేరు ఆ విధంగా నూతన రాజకీయ వ్యవస్థ

ఏర్పడడానికి - వ్యక్తులు, వ్యక్తిసంబంధాలతో ఏర్పడిన పాలనావ్యవస్థ స్థానే, భూభాగాలు, ఆస్తులపై ఏర్పడిన రాజ్యవ్యవస్థ ఏర్పడడానికి- మార్గం సరిచేయబడింది

మన పరిశీలనకు సంబంధించి అంతవరకు రోమును పరిపాలించేరన్న ఏడుగురు రాజులూ నిజంగానే వున్నారా, వారు చేసేరన్న చట్టాలు వట్టి కథలా, నిజమేనా అన్న దానితో పనిలేదు. లాటిన్ సమాజం యొక్క ప్రాచీన నియమాలు రోమనుల ఆచారాలలో అంతర్గతంగా వుండి, చరిత్ర కాలంనాటి కంటా ఆచరణలో వున్నాయి వ్యక్తులెవరు అనేదానితో నిమిత్తం లేకుండా మానవాభివృద్ధి క్రమంలో జరిగిన ఘటనలు ఆచారాలలో అలవాట్లలో నియమనిషేధాలలో, కల్పనలు అన్వేషణలలో ఘనీభావం పొంది, నమోదయి వుంటాయి చరిత్రకారులు అవసరార్థమై ఆ ఘటనలు జరగడంలో వ్యక్తులకు ప్రాధాన్యం ఇస్తారు ఆ విధంగా స్థిరంగా నిలిచిపోయే నియమ నిబంధనల స్థానంలో, క్షణభంగురులైన వ్యక్తులకు ప్రాముఖ్యం వస్తుంది సమాజం మొత్తంమీద ఆ సేవల ద్వారానే పురోభివృద్ధి కలుగుతుంది దానిలో అధిక భాగాన్ని వ్యక్తులకూ, అత్యల్ప భాగాన్ని ప్రజల తెలివికీ జమకడతారు ప్రజలు రూపొందించిన భావాలు నియమనిబంధనలలో, ఆచారాలు, అలవాట్లలో, కల్పనలు, అన్వేషణలలో వ్యక్తమవుతాయి మానవజాతి చరిత్ర సారాంశం అందులోనే వుంది

రోములస్ కాలంనాడు చట్టనిర్బంధం ద్వారా తెగకు పదిక్యూరియాలు, క్యూరియాకు పదిగణాలు వుండాలనే సంఖ్యా నిర్ణయం జరిగింది చుట్టు పక్కలమన్న తెగలను ఆహ్వానించో, అణచివేత ద్వారానో ఆ సంఖ్య సాధించబడింది ఈ విధంగా మొదట నిర్మాణం పొందినవి టిటీ, లూసెరెస్ తెగలు అయితే క్యూరియాలో ఇన్ని గణాలు వుండాలన్న నియమాన్ని శతాబ్దాల పాటు సాగించడం సాధ్యంకాదు.

గ్రీకులలో ప్రాట్రీ అన్నది మత, సామాజిక నిర్మాణమే గాని పరిపాలన కోసం కాదని ఇది వరకే చెప్పేను గణానికీ, తెగకూ మధ్యలోవుండే దీనికి ఆ రెంటి కన్న తక్కువప్రాముఖ్యమే వుండేది ప్రభుత్వ బాధ్యతలు కొన్నింటిని అంట గట్టేక పరిస్థితి మారింది ఇరాక్యూలలో ప్రాట్రీలో పాలనాత్మక లక్షణం చాల ప్రాథమిక దశలో ఛాయా మాత్రంగానే వున్నా, అది దాని సామాజిక లక్షణం నుంచి భిన్నంగా కనబడేది అంతక్రితం మాట ఎలావున్నా రోమన్ క్యూరియా గ్రీకులలో కన్న ఎక్కువగా ప్రభుత్వంలో అంతర్భాగంగా, ప్రభుత్వసంస్థగా పెరిగింది అయితే రోమను క్యూరియాను గురించి తెలిసినంత గ్రీకు ప్రాట్రీ గురించి తెలియదు. క్యూరియాలో చేర్చినవి పరస్పర బంధుత్వం వున్న గణాలే అయివుంటాయి కాని ఆ

గణాలు అంతకన్న పెద్ద నిర్మాణంలో చేరేక గణాల మధ్య అంతర్వివాహాలు జరిగి వాని బాంధవ్యం మరింతగా దృఢపడి వుంటుంది

వెనుకటి రచయితలు క్యూరియాగురించిన సమాచారం ఏమీ చెప్పలేదు అంత మాత్రం చేత రోములసే దానిని ప్రవేశ పెట్టేడనుకో కూడదు ఆయన కాలంలో చేసిన చట్టంలో రెండు తెగలలోని క్యూరియాలను పేర్కొన్నాడు ఒక నిర్మాణంగా ఫ్రాట్రీ లాటిన్ తెగలలో చిరకాలంగా వుండి వుంటుంది

సబైనే స్త్రీలు కలగజేసుకుని సబైన్, లాటిన్ తెగల మధ్య శాంతి కూర్చినందుకు చాల సంతుష్టి పొందిన రోములస్ ప్రజలను ముప్పయి క్యూరియాలుగా విభజించి, వానికి ఆ స్త్రీల పేర్లు పెట్టేడని లివీ వ్రాశాడు డియోనిసియను క్యూరియా, ఫ్రాట్రీలను ఒకటిగా చెప్తాడు రోములను క్యూరియాలను పది పది గణాలుగా విభజించేడన్నాడు అదే విధంగా ప్లూటార్క్ కూడా ప్రతితెగలో పదిక్యూరీలు వున్నాయనీ, వానికి సబైన్ స్త్రీల పేర్లు పెట్టినట్లు కొందరు చెప్తారనీ అన్నాడు లివీ, డియోనిసస్‌ల కన్న ప్లూటార్క్ సొగ్గా చెప్పేడు తెగలను పది క్యూరియాలుగా విభజించేరనడం తప్పు తెగలో పది క్యూరియాలున్నాయనడం ఒప్పు ఏ మంటే గణాలతో ఏర్పడ్డవి క్యూరియాలు గణం సమాజ వ్యవస్థకు యూనిటు అంతేగాని క్యూరియాను విభజించితే గణాలు ఏర్పడవు రోములస్ చేసిందల్లా ప్రతి క్యూరియాలో ఇన్ని గణాలుండాలనీ, ప్రతి తెగలో ఇన్ని క్యూరియాలుండాలనీ విధించడం వరకే చుట్టుపక్కలనున్న తెగలను సమీకరించి ఈ లెక్కను సరిపుచ్చేడు సిద్ధాంతరీత్యా ఒకటో రెండో గణాలనుంచి శాఖోపశాఖలుగా విడబడిన గణాలతో క్యూరియా ఏర్పడుతుంది అల్లాగే తెగకూడా సహజంగా ఒకే భాష మాట్లాడే అనేక క్యూరియాల సమాహారంగా ఏర్పడుతుంది రామ్నే తెగలోని నూరూ లాటిన్ గణాలే. వానిని పది క్యూరియాలుగా, క్యూరియాకు పదిగణాలుగానిర్ణయించి నప్పుడు రోములస్ సాధ్యమైనంత వరకు బంధుగణాలను క్యూరియాలోకి చేర్చే వుంటాడు తన లెక్క ప్రకారం పది కన్న అదనంగా వున్న వానిని తక్కువయిన క్యూరియాలలో చేర్చి వుంటాడు టిటీ తెగలోని నూరుగణాలూ ప్రధానంగా సబైన్ గణాలు అయివుంటాయి మూడోది లూసిరెస్ యుద్ధాలలో జయించిన వారితోనూ, కోరి రప్పించిన వారితోనూ దీనిని కూర్చేరు ఇవన్నీ వేరువేరుగణాలు అధికభాగం ఎట్రూస్కన్ గణాలు వారందరినీ పదేసి గణాలుగల పదిక్యూరియాలలోకి సర్దేరు ఈ పునర్నిర్మాణంలో దీనికి మూలం యూనిటు అయిన గణం యధాతధంగా, శుద్ధంగానే వుంది క్యూరియాను మాత్రం

దాని సహజ స్థాయినుంచి పైకెత్తేరు సహజంగా అయితే ప్రాట్రీలో జతపడని పరాయిగణాలను దానిలోకి చేర్చేరు అదే విధంగా తెగను కూడ దాని సహజస్థాయి నుంచి పైకి లేవనెత్తేరు సహజమైన పెరుగుదలలో చేరే వారిని గాక పరాయి వారిని కూడా తెచ్చిచేర్చేరు ఈ చట్టం ప్రకారం తెగలలో క్యూరియాలనూ, గణాలనూ సమాన సంఖ్యకు తెచ్చేరు మూడో తెగను పాస్థికుల ప్రాబల్యం చేత దానివరకు కొత్తగానే కూర్చేరు ఎట్రూస్కన్ల భాషా సంబంధాలు గురించిన చర్చ ఇంకాతేలనే లేదు వారి భాష లాటిన్ తెగలకు బొత్తిగా అర్థం కానిది అయివుండవనీ, లేకుంటే వారిని రోమను సామాజిక వ్యవస్థలోకి చేర్చుకుని వుండేవారు కాదనీ వూహిస్తున్నారు అనాటికింకా రోమనులది గణవ్యవస్థయేకదా ఈ విధంగా సంఖ్యాత్మకంగా సర్దుబాటు చేయడం వలన సమాజంమొత్తంలో పాలనా వ్యవహారాలు సులభమయాయి

ఈ కాలంనాటి రోమను ఆచారాల నిజస్వభావాన్ని నీబుర్ గ్రహించేరు ప్రజలు సర్వస్వతంత్రులు రాజులనబడేవారికి వారు అప్పచెప్పిన అధికారం మాత్రమే ప్రాతినిధ్య సూత్రంమీద సెనేట్ ఏర్పడింది ప్రతిగణానికి ఒక సెనెటరు అన్నారు "రోమను గృహాలు (గణాలు) ఈ రాజ్యాంగచట్టంకన్న ప్రాచీనం కాదనడానికి ఈ సంఖ్యా ప్రమాణాలే సాక్ష్యం తన పథకానికి అనుకూలంగా శాసనకర్త రూపొందించిన సంస్థలు మాత్రమే" అంటూ సంఖ్యాక్రమంతో మెట్టుమెట్టుగావున్న నిర్మాణాలనుగురించి చేసినవ్యాఖ్యకూ వీటికి పొసగదు రెండు,మూడు తెగల క్యూరియాల లోకి, ప్రత్యేకించి మూడోతెగ క్యూరియాలలోకి పరాయిగణాలను ప్రవేశపెట్టేరన్నది నిస్సందేహం కాని, గణ నిర్మాణాన్నే మార్చేరని, గణాన్ని పునర్నిర్మించేరని, గణాన్ని కొత్తగా నిర్మించేరని చెప్పడం అర్థరహితం శాసనకర్త ఎవ్వరూ గణాన్ని నిర్మించలేడు క్యూరియానూ నిర్మించలేడు బంధుత్వంవున్న గణాలతో ఏర్పడిన కేంద్రకంచుట్టూ అదివరకేవున్న గణాల్ని చేర్చగలడు కాని శాసనబలంతో అతడు క్యూరియాలోని గణాలసంఖ్యను హెచ్చించడం తగ్గించడం చేయగలడు అలాగే తెగలోవున్న క్యూరియాల సంఖ్యనూ హెచ్చించగలడు తగ్గించగలడు గణం అనేది గ్రీకులలోనూ, రోమనులలోనూ సర్వత్రావున్న ప్రాచీననిర్మాణం అని నీబురే సూచించేడు అందుచేతనే ఆయనరాసిన పైమాటకు అర్థంలేకుండా పోయింది ప్రాట్రీ అన్నది కనీసం ఇయోనియన్ గ్రీకులలో సామాన్యంగా కనిపించేసంస్థ బహుశా లాటిన్ తెగలలో ఈ క్యూరియాయే మరోపేరుతో ప్రాచీనకాలంలో వుండి వుంటుంది పైనవ్రాసిన సంఖ్యా ప్రమాణాలు రోములస్‌కాలంలో శాసనబలంతో సమకూర్చినవి

తప్ప వేరుకాదు ఈ ప్రమాణాలకు సరిపడా గణాలను ఎక్కడెక్కడి నుంచి పోగు చేసేరో కావలసినంత సాక్ష్యాధారాలు వున్నాయి

క్యూరియాగా కలిసిన పదిగణాల సభ్యులూ తమరిని 'క్యూరియాలే' అనిపిలుచు కొనేవారు వారొక మతాచార్యుడిని (క్యూరియో) ఎన్నుకుంటారు ఈ సోదర సంఘానికి ఆయన ముఖ్య ఉద్యోగి ప్రతి క్యూరియాకూ దాని కర్మకాండవుంటుంది. దానిని జరిపేటప్పుడు సౌదర్యం అంతా హాజరు అవుతారు. అది జరిగే మండపం ఒక పూజా స్థలం అదే గ్రామచావడిలాగ వుపయోగపడుతుంది. 'క్యూరియో' వారి మత సంబంధి వ్యవహారాలన్నీ చూస్తాడు 'క్యూరియాలే'లు ప్రధాన క్యూరియోకు తోడుగా ఒక అసిస్టెంటును flamen curialis ను ఎన్నుకుంటారు మతకర్మలకు సంబంధించి సన్నాహాల బాధ్యత ఆయనది క్యూరియానుంచే గణాల సమితికి comitia curiata అనే పేరువచ్చింది గణవ్యవస్థలో సెనేట్ కు కన్న రోములో ఈ కమిటీకి ఎక్కువ అధికారాలు వున్నాయి రోమనుల క్యూరియాలేక ఫ్రాట్రీసంస్థ కథ ఇది రోములను చేసిన పనిఅంటూ డయోనిసను ఈ విషయాన్ని వివరంగా వర్ణించేరు అయితే అందులో కొంతభాగం తరవాతి కాలపుది ఆయన తనకు బాగా తెలిసిన గ్రీకు విన్యాసాలతో పోల్చిచెప్పడంచేత చాల అసక్తి జనకంగా వుంది శాంతికాలంలోనూ, యుద్ధకాలంలోనూ కూడా ఎంతో సరిపడేలావున్న రాజకీయ వ్యవస్థను గురించి మొదట చెప్తానంటూ ఇల్లా రాసేరు మొత్తం జనాన్నంతనూ మూడుభాగాలు చేసేడు ప్రతి విభాగానికి నాయకుడుగా ఒక ప్రసిద్ధవ్యక్తిని నియమించేడు తరవాత ఆ మూడింటినీ పదేసివిభాగాలు చేసేడు. వానికి వీరపురుషుల్ని సమానాధికారాలతో నాయకుల్ని చేసేడు మొదటి మూడింటినీ ఆయన తెగలన్నాడు తరవాతవానిని క్యూరియా అన్నాడు దీనిని గ్రీకుభాషలోకి అనువదిస్తే మొదటి మూడోభాగాన్ని ఫైల్, క్యూరియాను ఫ్రాట్రీ అనాలి తెగల నాయకత్వం వహించిన వారిని గ్రీకులు ఫిలార్కులు, ట్రిట్యార్కులు అంటారు రోమనులు, ట్రిబ్యూన్లు అంటారు క్యూరియా నాయకుల్ని గ్రీకులు ఫ్రాట్రియార్కులు, లోచాగో అంటారు, కాని రోమనులు క్యూరియానో అంటారు ఈ ఫ్రాట్రీలను కూడా డికేడ్లుగా విభజించేరు. ఒక్కొక్క 'డికెడార్క్' ఒక్కొక్క డెకేడ్ కు నాయకుడు. ఇల్లాగ జనాన్ని తెగలు, ఫ్రాట్రీలుగా విభజించినాక భూమిని ముప్పయి సమభాగాలు చేసేడు ఒక్కొక్క భాగాన్ని ఒక్కో ఫ్రాట్రీకి ఇచ్చేడు. దేవాలయాలకోసమూ, మతజాతరలకోసమూ కొంతబాగాన్ని ఏర్పరచి, కొంతభాగాన్ని ఉమ్మడి ఉపయోగంకోసం వదిలేడు " అని రాసేడు.

క్యూరియాకు పైనున్న నిర్మాణం రోమనుల తెగ దీనిలో పది క్యూరియాలూ నూరుగణాలూవుంటాయి బయటి ప్రభావంలేకుండా, స్వతంత్రమైన ఎదుగుదల వుంటే తెగ అన్నది ఒక గణాల సమూహం కాలక్రమంలో విడబడుతూ ఏర్పడిన గణాలు కొన్ని కలిసి ఏర్పడాలి ఆ సందర్భంలో తెగలోని వారంతా ఒకే భాష మాట్లాడుతారు ఈ తెగలు ఎలా విడబడడం జరుగుతుందో ఇదివరకే చెప్పేను ఆ విధంగా విడబడే వరకూ తెగలోని వారందరూ ఒక జంట తెగల వారి సంతానులే అయివుంటారు కాని రోమనుల తెగ అలా ఏర్పడిందికాదు మనం చర్చించేది దానినిగురించే కొన్ని లక్ష్యాల కోసం, కొన్ని పద్ధతులలో దానిని కృత్రిమంగా పెంచేరు అయినా, దానికి ప్రాతిపదిక మాత్రం సహజం ఆయిన పెరుగుదలలో వచ్చినదే

రొములస్ కాలానికి ముందు ప్రతి తెగా ఒక నాయకుణ్ణి ఎన్ను కొనేది ఆయన మేజిస్ట్రేటుగా, సైన్య నాయకుడుగా, పురోహితుడుగా వ్యవహరించేవాడు ఆయన పట్టణంలో తెగవారి మేజిస్ట్రేట్ బాధ్యతలు నిర్వహించేవాడు సాక్రా (పవిత్ర కర్మలు) నిర్వర్తించేవాడు యుద్ధరంగంలో సైన్యాలకు నాయకత్వం వహించేవాడు ఆయనను క్యూరియాకు చెందిన ప్రజలందరూ సమావేశమయి ఎన్నుకుని వుంటారు కాని, ఈ విషయంలో స్పష్టమైన సమాచారంలేదు ప్రతి లాటిన్ తెగవారిలో ఈ పదవి ప్రాచీన కాలం నుంచీ వుంది దానికి ఎన్నిక జరిగేది అంతకన్న ఉన్నతమైన రెక్స్ పదవికి బీజంఅదే అదే సైన్యాధిపతి పదవి ఈ రెండు పదవుల బాధ్యతలు ఒకే విధమైనవి తెగ పెద్దల్ని ట్రయోబ్యునియస్ తెగనాయకులన్నారు మూడు రోమను తెగలూ ఒకే ప్రజగా, ఒకే సెనేటు, ఒకే ప్రజాసభ, ఒకే సైన్యనాయకుడు కింద సమ్మేళనం పొందినాక, తెగనాయకుని పదవికి ప్రాముఖ్యం తగ్గింది కాని, దానికి ఎన్నిక జరుగుతూనే వుండడం దానికి గల ప్రజాభిమానానికి నిదర్శనం.

తెగ సమితి కూడా అతి ప్రాచీన కాలం నుంచీ వుండే వుంటుంది రోము ఏర్పడక పూర్వం లాటిన్ తెగలు ఒక సమాఖ్యగా ఏర్పడినా, వాని తెగలు స్వతంత్రం గానే వుండేవి స్వయంపాలక సంస్థలుగా ఈ తెగలకు నాయకుల సమితి వుండేది గణాలనాయకులతో ఈ సమితి ఏర్పడి వుంటుంది ప్రతి తెగకూ వారి ప్రజాసభ వుంటుంది వారి నాయకులే సైన్యదళాలకు నాయకులుగా వుంటారు తెగకు సంబంధించిన సమితి, ప్రజాసభ సైన్యనాయకుడు పద్ధతిలోనే తర్వాత రోమను సెనేటు, రోమన్ రెక్సు, కమిటియా, క్యూరియాటాలు ఏర్పడ్డాయి రోము ఏర్పడక పూర్వం తెగ నాయకుని రెక్స్ అని పిలిచివుంటారు అదే విధంగా సెనెక్స్ (పెనెటర్లు,) కౌన్సెల్

(కమిటియా) కూడా వుండి వుంటాయి ఈ తెగల నిర్మాణాన్ని పట్టి, పరిస్థితులనుపట్టీ వారి నిర్మాణాలు సహజంగా ప్రజాతంత్ర పద్ధతులలో సాగివుంటాయని వూహించవలసి వస్తూంది మూడు రోమను తెగలూ సమ్మేళనం పొందేక, ఆ ఉన్నత సంస్థలో తెగ యొక్క స్వభావం మరుగున పడింది కాని నిర్మాణ దశాక్రమంలో అదొక అవసర మైన దశగా మిగిలేవుంది

మూడు తెగలూ సమ్మేళనం పొంది రోమను జాతి లేక ప్రజ ఏర్పడింది అది వారి నిర్మాణాలలో నాలుగోదీ చివరిదీను దీనికి ఒక సెనేట్ (Senatus), ఒక ప్రజాసభ (Comitia Curiata), ఒక సైన్యాధిపతి (Rex) వున్నారు పట్టణ మేజ స్ట్రేటు కోర్టు, సైన్య నిర్మాణం, వేరు వేరు అంతరువులలో ఉమ్మడి పురోహితవర్గము వుంది

మొదటి నుంచీ కూడ వారి పరిపాలనా వ్యవస్థకూ సైనిక వ్యవస్థకు కేంద్రంగా బలమైన నగర నిర్మాణం వుండాలనేదే అభిప్రాయం రోము పెలవలనున్నవన్నీ దాని కీవారుచూమరే రోములస్‌యొక్క సైనిక ప్రజాతంత్రంక్రింద, రిపబ్లికు అయాక సమ్మి శిత ప్రజాతంత్ర, కులీన ప్రభుత్వం క్రింద, అటు తర్వాత సామ్రాజ్య ప్రభుత్వంక్రింద ఒక పెద్ద పట్టణం కేంద్రంగానే పరిపాలన సాగింది తర్వాత జయించిన ప్రదేశాల నన్నింటినీ దానికి అనుబంధించి జతపరిచారేగాని, వానిని కూడా పట్టణంతో పాటు ప్రభుత్వానికి అనుబంధించ లేదు ఈ రోమనుల నిర్మాణం, రోమను ప్రభుత్వం రోమను జాతి వ్యవహారం తీరు వంటివి మానవజాతి అనుభవంలోనే అపూర్వం యుగయుగాలకు అది అద్భుత ఘటనగా నిలిచి పోతుంది

రోములస్ పిలిచినట్లే వారు తమ్ము రోమను ప్రజలు (Populus Ramanus) గా చెప్పుకున్నారు నిజానికదే సరియైన పదం వారొక ప్రజ ఒకే కుటుంబానికి చెందిన ప్రజ అంతే రోములస్ కాలంలోనే వారి సంఖ్య వేగంగా పెరిగింది అప్పటి నుంచి సెర్వియస్ కాలంలోపల మరీ పెరిగింది దానితో ప్రభుత్వ నిర్మాణాన్నే పూర్తిగా మార్చవలసివచ్చింది రోములను, ఆయన కాలంనాటి మేధావులూ గణ ఆచా రాలనూ, సంస్థలనూ బాగా వినియోగించుకున్నారు గణవ్యవస్థ మీద గొప్ప జాతీయ, సైనిక ప్రభుత్వాన్ని నిర్మించేందుకుగాను వారు చేసిన చట్టం ఇప్పుడెంతో ఉపయోగ కరంగా వుంది దానివలననే ఆ ఆచారాలు, నిర్మాణాల స్వభావ స్వరూపాల పరిజ్ఞానం మిగిలింది లేకపోతే అదంతా మరుగునపడి పోయేది గణ సంస్థల మీద రోమను ప్రభుత్వం ఏర్పడడం మానవజాతికే కొత్త అనుభవం ఆ వ్యవధిలో జరిగిన

ఘటనలు కథలుగా, కాకమ్మకథలుగా తయారయాయంటే ఆశ్చర్యంలేదు రోములసుకు ఒక ఆలోచనపుట్టి రోమును స్థాపించేడంటారు ఆయన తరువాతి వారు దానిని ఆమోదించేరు ఆ కొత్తపట్టణంలో సాధ్యమైనంత అధిక సంఖ్యలో గణాల్ని సమీకరించేరు వారిని ఒకే ప్రభుత్వం క్రింద, సమ్మిళిత సైన్య బలగాలను ఒకే నాయకుని క్రింద వుంచేరు వారిలక్ష్యం ఇటలీలో ఆధిపత్యం సంపాదించడం అందుచేత దాని నిర్మాణం సైనిక ప్రజాతంత్ర రూపం తీసుకున్నదంటే ఆశ్చర్యంలేదు

టైబర్ నదిపై ప్రాచీనపు కోట వున్న పాలటైన్ మిట్టమీద లాటిన్ తెగతో రోములసు ఒక మంచి ప్రదేశాన్ని ఎన్నుకున్నాడు ఆల్బానాయకుల కుటుంబానికి చెందినవాడని ఆయనను గురించి చెప్తారు కాని అదంత ముఖ్యం కాదు ఈ క్రొత్త పట్టణం అతివేగంగా పెరిగింది వార్తలు నిజమే అయితే ఆయన జీవితాంతం నాటికే అక్కడ 46,000 మంది కాల్బలము, 1000 మంది గుర్రపుదళం వుంది అంటే ఆ పట్టణంలోను, దాని రక్షణ క్రిందవున్న పేటలలోను రెండు లక్షలమంది జనాభా వున్నారనుకోవాలి పట్టణాలను స్థాపించినవారు, సాధారణ జనాన్ని పోగుచేసుకుని, పనిచేస్తారు వారి సంతానం తాము ఆ పట్టణానికి చెందిన ప్రాచీన కుటుంబానికి చెందిన వారమని చెప్పుకోవడం మామూలేనని 'లివీ' అన్నాడు రోములస్ కూడ అదే విధంగా పేలటైన్ వద్ద ఒక రక్షక స్థానాన్ని నిర్మించి ఏ విధమైన షరతులు లేకుండ చుట్టు ప్రక్కల తెగలవన్నింటిని ఆహ్వానించేడు తమ తెగతోపాటే క్రొత్త పట్టణంలో వుండే సౌకర్యాలను, దాని భవిష్యత్తును, అనుభవించవలసిందిగా వారిని కోరాడు చుట్టు ప్రక్కల ప్రదేశాల నుంచి ఎందరో బానిసలు, ఎందరో స్వతంత్రులు ఇక్కడకు వచ్చి చేరారని ఈ క్రొత్త వుద్యమానికి మొట్టమొదటి మాటు పరాయి ప్రజల బలం చేకూరిందని 'లివీ' అన్నాడు ప్లూటార్క్, డయోనిసియస్సు ఇద్దరూ కూడ ఈ ప్రదేశాన్ని పేర్కొన్నారు అనాగరిక యుగంలోవున్న ఇటలీ ప్రజల సంఖ్య అప్పటికే బాగా పెరిగింది వారి వ్యక్తిగత హక్కులకు తగినంత రక్షణ లేకపోవడం, ఇళ్ళలో బానిసలు పెరగడంతో అసంతృప్తి వ్యాపించివుంది అల్లరులు చెలరేగే భయం ఏర్పడింది అలాంటప్పుడు ఒక తెలివైనవాడు తగినంత సైనిక పరిజ్ఞానం కనుక వుంటే ఆ విధంగా ఒకచోట చేరిన జనాన్ని చక్కగా వుపయోగించుకోగలుగుతాడు దీనికి మరో ఘటన తోడ్పడింది శాబైన్ తెగవారి పడుచులను పట్టుకొని లాటిన్ తెగలవారు పెళ్ళి చేసుకున్నారు- ఆ కక్షతో శాబైన్‌లు దాడులు ప్రారంభించారు శాబైన్ స్త్రీలు కలగ చేసికొని ఇద్దరికీ సంధికుదిర్చారని ఇదివరకే చెప్పాం లాటిన్ తెగలు, శాబైన్ తెగలు

సమ్మిళితమై ఒకే సంఘంగా ఏర్పడ్డారు అయితే ఎవరికి వారు తమ సైన్య నాయకుల్ని అట్టే పెట్టుకున్నారు ఈ శాబైన్‌లు క్విరినాల్, క్యాపిటోలైన్ మిట్టల మీద మకాం పెట్టుకున్నారు ఈ రెండో తెగకు సైన్య నాయకుడు టిటియస్ టటియస్ అందుచేత వీరిని టిటీలు అన్నారు ఈ రెండో తెగలో ప్రధాన భాగం శాబైన్‌లే టిటియస్ మరణానంతరం ఈ తెగ కూడ రోములస్ సైనిక నాయకత్వం క్రిందకు వచ్చింది

రోములస్ తరువాత వచ్చిన నూమా పాంపిలియస్ రోమనుల మతాచారాలను విస్తృత రూపంలో నెలకొల్పాడు ఆయన తరువాత వాడైన తుల్లస్ హోస్టిలియస్ లాటిన్ పట్టణం ఆల్బాను పట్టుకొని ఆ జనాన్ని అందరినీ రోముకు తరలించాడు వారు కొయిలియస్ మిట్టమీద రోమన్ పౌరుల హక్కులన్నింటిని అనుభవిస్తూ నివాసం పెట్టుకున్నారు వీరితో రోమను పౌరుల సంఖ్య రెట్టింపు అయిందని 'లివీ' అన్నాడు కాని అది పూర్తిగా వీరివలననే కాదు తుల్లస్ తరువాతి వాడైన అంకుస్ మార్టియస్ లాటిన్ పట్టణం పోలిటోరియంను పట్టుకొని వారిని కూడ రోము చేర్చాడు వారు అవే హక్కులతో 'అవెంటైన్' మిట్టమీద నివసించారు తరువాత కొద్ది కాలానికే టెల్లిని, ఫికానా ప్రజలను ఓడించి వారిని రోముకు తీసుకొని వచ్చారు వారు కూడ 'అవెంటైన్' మిట్ట మీదనే నివాసం వున్నారు ఇక్కడ ఒక విషయం గమనించాలి రోముకు తీసుకు వచ్చిన గణాలూ అది వరకే అక్కడవున్న లాటిన్ శాబైన్ గణాలూ ఎక్కడి వారక్కడ విడివిగానే వున్నారు. అనాగరికయుగం నడుమ, ఎగువదశలలో తెగలు కోటలలోను ప్రాకార నగరాలలోను ఒక చోట చేరినప్పుడు గణాలు ఫ్రాట్రీలు వేరు వేరుగా నివసించడమనేది గణ సమాజంలో మామూలు న్యూ మెక్సికోలో ఉమ్మడి ఇళ్ళలో నివసించే వారంతా ఒకే తెగ వారయి వుండడం, కొన్ని సందర్భాలలో మొత్తం తెగ అంతా వుమ్మడి ఇంట్లో కాపురం వుండడం మామూలే మెక్సికోలోని ప్యూబ్లో (గ్రామం) నాలుగు పేటలుగా వుంది ఒక్కొక్క భాగంలో ఒక్కొక్క కుదురు (బహుశా ఫ్రాట్రీ) వున్నారని ఇదివరకే వ్రాశాను 6వ పేటలో 'ట్లాతెలులోల్కో'లు వుండేవారు 'ట్లస్కాలాలో' కూడ నాలుగు పేటలలో నాలుగు కుదుళ్ళ వాళ్ళు వుండేవారు అదే విధంగా రోములోనూ గణాలు నివాసం ఏర్పరుచుకున్నాయి ఈ విధంగా పైనుంచి వచ్చిన గణాలలో అధికభాగం, మూడో తెగగా ఏర్పడ్డారు వీరి పేరు లూసెరస్ దీనితో లాటిన్ గణాలకు విస్తృత ప్రాతిపదిక ఏర్పడింది అయితే రోములస్ తరువాత నాలుగో సైన్య నాయకుడు తార్క్వినస్ ప్రిస్కస్ ఎట్రూస్కన్ గణాలు కొన్నింటిని కొత్తగా తెచ్చి కలుపుతే తప్ప ఈ మూడవ తెగ పూర్తి కాలేదు

ఈ విధంగా రోములో మూడువందల గణాలు చేరి క్యూరియాలుగా తెగలుగా నిర్మాణం పొందాయి అయితే ఈ పద్ధతి తెగల అలవాట్లకి భిన్నం రామ్‌నెస్ తెగ పూర్తిగా లాటిన్‌లు, టిటీలు చాలా భాగం సెబైన్‌లు, లూసెరస్‌లు చాలా భాగం లాటిన్‌లు, పరాయి తెగల నుండి వచ్చిన వారూను ఈ విధంగా రోమను ప్రజలూ వారి నిర్మాణాలూ కొంచెం యించు మించు బలపూర్వకంగా పోగుచేసిన గణాలుగా, వారిని క్యూరియాలుగా, క్యూరియాలను తెగలుగా, తెగలను ప్రజగా కూర్చినవారే దీనిలో చిట్టచివరి ప్రజ అనేది తప్ప మిగిలిన మూడు అంతర్భాగాలు వారిలో అనాదిగా ప్రాచీనకాలం నుంచీ వున్నవే ప్రతి క్యూరియాకి పునాది రక్తబంధుత్వం గల గణాలు ఏకం కావడమే అదే విధంగా తెగలో అధిక భాగం గణాలు ఒకే మూలం నుంచి వచ్చినవై వుంటాయి ఈ క్రొత్త నిర్మాణంలోవున్న ప్రత్యేకత ఏమంటే క్యూరియాకు ఇన్ని గణాలు,తెగకు ఇన్ని క్యూరియాలు అని నిర్ణయించడము,వీరందరినీ ఒకే ప్రజగా సమ్మేళన పరచడమూను ఈ పెరుగుదల శాసన బద్ధంగా జరిగింది అని చెప్పవచ్చు ఇందులోని తెగలు పరాయి జనంతో కలిసి ఏర్పడ్డాయి అందుచేతనే తెగకు ట్రైబస్ మూడవవంతు అనిపేరు వచ్చింది. గ్రీకులు తెగను ఫిలాన్ అంటారు లాటిన్ వారికి అటువంటి పేరు ఒకటి వుండవచ్చు వారికి అటువంటి నిర్మాణం ఒకటుంది అయితే ఆ పేరు మాసిపోయింది ఈ క్రొత్త పేరును పట్టి రోమన్ తెగలలో వేరు వేరు జనం కలిశారని వూహించవచ్చు. గ్రీకు తెగల అలాకాదు అది శుద్ధముగా రక్త బంధుత్వం గల గణాల కుదురులుగానే ఏర్పడ్డాయి

లాటిన్ సమాజం పూర్వం ఎలావుండేదో తెలుసుకునేటందుకు రోములస్ చేశాడన్న చట్టం పాయపడుతుంది ఆ తెగంలో అది వరకు వున్న నిర్మాణాలకు శాలావసరమైన మార్పులు, చేర్పులు చేశాడు నాయకుల సమితిని సెనేట్‌గా ప్రజాసభను Comitia - Curiata గా సర్వ సైన్యాధ్యక్షున్ని క్యూరియాగా దానిలో చూస్తాం ప్రత్యేకించి గణాలూ, వారి హక్కులూ, బాధ్యతలూ సౌకర్యాలూ అందులో కన్పిస్తాయి అంతేకాక రోములను, ఆయన తరువాతి వారు ఏర్పరచిన ప్రభుత్వం లాంటిదానిని అతి వున్నత నిర్మాణ రూపంగల గణ సమాజాన్ని మానవ కుటుంబాలు ఎక్కడా చేరుకోలేదు ఇదంతా సెర్వియస్ తుల్లియస్ రాజకీయ సమాజాన్ని ఏర్పరచడానికి ముందువాటి మాట

శాసన నిర్మాతగా రోములస్ చేసిన మొట్టమొదటి పని రోమన్ సెనేట్‌ను ఏర్పరచడం. దీనికి గణాని కొకరు చొప్పున, లేక క్యూరియాకి పదిమందిని చొప్పున

నాయకుల మూడు వందిని సభ్యులుగా నిర్ణయించాడు నాయకుల సమితి ప్రధాన
పాలనాంగంగా వుండటం లాటిన్ తెగలకు క్రొత్తకాదు అనాదిగా వారిలో అది వుంది.
దాని పాలనాధికారంలో వారు వున్నారు బహుశా రోములస్ కాలానికి ముందు
ఆ స్థితి మారివుంటుంది అతి ప్రధానమైన ప్రజా సమస్యలను, తయారుచేసి ప్రజాసభ
ముందు పెట్టే విధాయక సభలాగ గ్రీకుతెగలలో లాగే ఇక్కడా మార్పువచ్చి
వుండవచ్చు ఆ ప్రతిపాదనలను ప్రజాసభ ఆమోదించవచ్చు, నిరాకరించవచ్చు ఇది
ఒక విధంగా నాయకుల సమితికి ఒప్పుచెప్పిన అధికారాన్ని ప్రజలు మళ్ళీ తీసుకున్నట్టే.
ప్రజాసభ ఆమోదం వుంటే తప్ప ఎంతప్రధానమైన కార్యక్రమం కూడ అమలు జరుగ
డానికివీలులేదు అంటే నాయకుల సమితిగాని సైన్యనాయకుడుగాని కాక ప్రజలే సర్వ
శక్తిమంతులు సామాజిక వ్యవస్థలో ప్రజాతంత్ర నియమాలు ఎంత లోతుగా
చొచ్చుకుపోయాయో దీనిలో కన్పిస్తుంది రోములస్ ఏర్పరచిన సెనేట్ అదివరకటి
నాయకుల సమితి వంటిదే కావచ్చు కాని అనేక విధాలుగా అది మెరుగు పరుచబడింది.
దానిలోకి నాయకులనో, గణాలలోని తెలివైనవారినో సభ్యులుగా చేరారు ప్రతి
గణమూ తన గణ పెద్దను దెకూరియన్ (పదిమంది సైనికుల నాయకుడు)గా సెనేట్‌కు
పంపిందని నీబర్ వ్రాశాడు అంటే అది ప్రారంభంలో ఎన్నికఅయిన సంస్థగానే వుంది
సామ్రాజ్యకాలం వరకు ఎన్నికయినవారితోను ఏరుకున్నవారితోను నిండివుంది సెనేటర్
పదవి జీవితకాలం పర్యంతవుది అనాడు వారిలో వున్న పదవి అదొక్కటే అందుచేత
దానికి కొత్తదనం ఏమీలేదు మొట్టమొదటి సెనేటర్లను రోములస్ ఏరుకున్నాడని 'లివీ'
అంటాడు కాని అది పొరపాటు వారిలోని ఆ సంస్థ లక్షణాలకు అది విరుద్ధం
మూడుగురు సరిపడతారు గనుకనూ, పెద్దలుగా చెప్పదగినవాళ్ళు నూరుమందే వుండటం
చేతనూ రోములను నూరుగురినే ఏరుకున్నాడు - అంటాడుఆయన ఆ పదవి యొక్క
హోదాను బట్టి వారిని పెద్దలుగానే పిలిచేవారు. వారి వంశీకులనందరిని పాట్రీషియన్లు
అనేవారు సెనేట్ ప్రతినిధి సంస్థగా వుండటం,దాని సభ్యులనుప్రజలను పెద్దగా పిలువడం
ఆ పదవి జీవితాంత వ్యవధి కలది కావటం - వీటన్నిటికంటే కూడ వారి సంతానాన్నీ
ఆ కుటుంబంలో వారినే పాట్రీషియన్లు అని పిలవడంతో ఒక్క దెబ్బతో సామాజిక
వ్యవస్థలో కులీన తరగతిని ఏర్పరచడమే అయింది ఆ తరగతి గట్టిగా నిలదొక్కు
కుందికూడాను రోమన్ సెనేట్‌కు, ఇచ్చిన బాధ్యతలు, దానికూర్పు దాని సభ్యులకు
పాట్రీషియన్ తరగతినిచ్చి వారి కుటుంబీకులకు కూడ దానిని వర్తింప చేయడంతో
తరువాత వచ్చిన రాజ్యాంగంలో చాల బలమైన స్థానం వారికి ఏర్పడింది ఈ విధంగా

గణ వ్యవస్థలో మొట్టమొదటి మారు కులీన తరగతి ఏర్పరచబడింది. ఈ విధంగా రిపబ్లిక్‌కు సంకీర్ణ లక్షణం ఏర్పడింది అది సామ్రాజ్య రూపం తీసుకుని చివరకు ఆ లాటిన్ జాతే అంతరించిపోయింది ఈ మార్పు బహుశా సైనిక ప్రతిభను పెంచి వుండవచ్చు ప్రారంభం నుంచి సైనిక విజయాలనే దృష్టిలో పెట్టుకోవడం చేత రోము ఆక్రమించిన ప్రదేశాలు విస్తరించి వుండవచ్చు కాని దానితో ఈ మహోన్నత అసాధారణ ప్రజల జీవితం ముగిసిపోయింది అవసరం కోసం ఏర్పడిన సామ్రాజ్య వాదం ఏ నాగరిక జాతినయిన నాశనం చేస్తుంది - అనేమాట ఋజువయింది రిపబ్లిక్ క్రింద సగం కులీనత సగం ప్రజాతంత్రం పాటించిన రోమనులు మంచి పేరు సంపాదించారు అసమానమైన సౌకర్యాలు, భయంకరమైన బానిసత్వం - వీనికి బదులు స్వాతంత్ర్యాన్ని సమానత్వాన్ని జాతికంతకు వర్తింప చేసినట్లయితే వారి విజయాలు ఇంకా వున్నతంగా, ఇంకా సుస్థిరంగా మనగలిగేవి. సెనేట్ ప్రతినిధులుగా వున్న కులీన వర్గాన్ని తుడిచిపెట్టి పూర్వకాలపు ప్రజాతంత్ర నియమాలను పునరుద్ధరించేటందుకై ప్లెబియనులు దీర్ఘకాలం పోరాడారు మానవజాతి జరిపిన వీరోచిత కృషిగా వాటిని పరిగణించాలి

సెబైన్లతో కలిసిన తరువాత టిటీ తెగలోని గణాల సెనేటర్లు నూరుగురితో చేరి రోమను సెనేటర్ల సంఖ్య రెండు వందలకు పెరిగింది. టార్క్వినస్ ప్రిస్కస్ కాలంలో వంద గణాలుగల లూసిరస్ తెగ చేరడంతో సెనేటర్ల సంఖ్య మూడు వందలు అయింది అన్నారు లివీ టార్క్వినస్ ప్రిస్కస్ సెనేటర్ల సంఖ్యను రెట్టింపు చేశారు అని సిసిరో వ్రాశారు దీనితో లివీ మాట అనుమానంలో పడింది. నీబూర్ ఒక సూచన చేశారు సెనేట్ సంఖ్య నూట యాభయికి పడిపోయి వుండవచ్చునని మొదటి రెండు తెగల నుండి మరో యాభయి మందిని చేర్చి దానిని రెండు వందలకు పెంచడం మూడవ తెగనుంచి మరో వంద మందిని చేర్చడం జరిగి వుంటుందని ఆయన సూచన అప్పటినుంచి రామ్నీ టిటీ తెగల నుంచి వచ్చిన సెనేటర్లను పెద్ద గణాల పెద్దలనీ, లూసిరస్ సెనేటర్లను చిన్న గణాల పెద్దలని పిలవడం మామూలయింది ఈ వాక్యాన్ని బట్టి మూడువందల మంది సెనేటర్లు మూడు వందల గణాల ప్రతినిధులు అని, ప్రతి సెనేటర్ ఒక గణానికి ప్రాతినిధ్యం వహిస్తున్నారని ఊహించవలసి యున్నది. అంతే కాదు ప్రతి గణానికి ఒక ప్రధాన

నాయకుడు వుంటాడు బహుశా ఈయననే గణం తన ప్రతినిధిగా ఎన్నుకుని వుంటుంది లేకుంటే క్యూరియా తన సభ్యులైనా పది గణాల నుంచి పది మంది పెద్దలను ఏరుకుని వుండవచ్చుకూడా రోమనుల గణ సంస్థల ఆచారాన్ని పట్టి చూస్తే ఆ విధంగా ప్రతినిధులను ఎన్నుకోవడంగాని, ఏరుకోవడంగాని జరిగి వుండవచ్చు అనిపిస్తుంది రిపబ్లిక్ ఏర్పడిన తర్వాత సెనేట్‌లో వచ్చిన ఖాళీలను సెనేట్ సభ్యుల సెన్సర్‌లనుంచి (రోమనుల ఆస్తులు, పన్నులు, ఆదాయాల లెక్కచూసే ఉద్యోగులు, ఏరుకుని భర్తీ చేసేవారు క్రమంగా అది కాన్సల్‌ల అధీనం అయింది వీరిని వున్నత తరగతి మాజీ మేజిస్ట్రేట్‌ల నుంచిఏరుకొనేవారు సెనేట్‌కు వున్న అధికారాలు వాస్తవమైనవీ, బలమైనవీ కూడాను ప్రజావసర కార్యాలను ఈ సంస్థ నిర్ణయించేది వాటిని స్వతంత్రంగా అమలు జరిపేది కొన్నింటిని ప్రజాసభ ముందు పెట్టి వారి అంగీకారము పొంది అమలు జరిపేది ప్రజాక్షేమకర చర్యలు వారిబాధ్యతలో వుండేవి. విదేశాలతో సంబంధాలు వారి ద్వారా జరిగేవి పన్నులు వేయడం, సైనిక నిర్వహణ, ఆయుధాలు - ఖర్చుల సంభాళనా వారి చేతిలో వుండేవి మత వ్యవహారాల బాధ్యత వివిధ తరగతుల పురోహితుల చేతుల్లో వున్నా, ఆ విషయంలో కూడ అంతిమ అధికారం సెనేట్‌దే దానికున్న స్థానం, అది చేసే పనులు పట్టి గణ సంస్థలలో ఎప్పుడూ దేనికీ లేని పలుకుబడి దానికి వున్నదని చెప్పవచ్చు

అతిముఖ్యమయిన ప్రజా సమస్యలను చర్చించి, వాటిని స్వీకరించడమో నిరాకరించడమో హక్కుగావున్న ప్రజాసభఅనాగరికయుగం దిగువదశలో లేదు బహుశా నడిమిదశలోనూవుండి వుండదు కాని ఎగువదశలో గ్రీకులలో అగోరా అనే పేరుతో వుంది అథీనియన్లలో ఎక్లెసియా పేరున అత్యున్నత రూపంలో వుంది లాటిన్ తెగలలో యోధుల సభపేరున వుంది రోమనులలో కమిటియా క్యూరియాటా పేరుతో అత్యుచ్ఛస్థాయికి చేరింది ఆస్తి పెరుగుదల ప్రజాసభ ఏర్పడడానికి కారణం గణ వ్యవస్థలో ఇది మూడవశక్తిగా వచ్చింది నాయకసమితి, సైన్యాధ్యక్షుడు వ్యక్తి హక్కులను హరించకుండా అది కాపాడుతుంది. అటవికదశలో గణాలు ఏర్పడినది మొదలు సొలోన్, రోములస్‌ల కాలంవరకు ప్రాచీన గణసమాజంలో ప్రజలపాత్ర హెచ్చుగావుంది మొదటిరోజులలో నాయకసమితిలో ప్రజలనుంచి వచ్చిన వక్తలు ప్రసంగించేవారు. సమాజ ఘటనలమీద ప్రజల ప్రభావం వుండేది కాని, గ్రీకు,లాటిన్ తెగలు చరిత్ర దృష్టిలోకి వచ్చేనాటికి ప్రజాసభ నాయకసమితి అంతబలంగా ముందుకు వచ్చింది ప్రజావసరచర్యలను చర్చించడం, వాటిని స్వీకరించడంగాని నిరాకరించడం

గాని దానికి, నిత్యకృత్యంగా అయింది సొలోన్ కాలంలో అథీనియన్లలో కన్న రోములస్ కాలంలో రోమన్లలో అది బాగా తీర్చిదిద్దబడింది ఆ సంస్థ పుట్టి పెరిగిన విధానంచూస్తే ప్రజాతంత్ర సూత్రం పెరిగి, అభివృద్ధి పొందిన క్రమం కనిపిస్తుంది

రోమనుల ఈ ప్రజాసభను కమిటియా క్యూరియాటా అనిపిలిచేరు గణాలలో వయసు వచ్చిన సభ్యులంతా క్యూరియాల వారీగా సమావేశం అవుతారు. అదే విధంగా వోటుచేస్తారు ప్రతి క్యూరియాకు ఒక ఉమ్మడి వోటువుంటుంది ప్రతి క్యూరియాలో అధికసంఖ్యవోట్లు అల్పసంఖ్యవోట్లవిలియా వుంటుంటుంది ఆ విధంగా ఆ క్యూరియా వోటు ఏలా వుండేదీ నిర్ణయం అవుతుంది గణసభే ప్రభుత్వంలో వుంటుంది. ప్లెబియన్లకీ, వృత్తులు చేసుకొనే వారికీ (clients)— వాళ్ళసంఖ్యే అధికంగావున్నా— దానిలో చోటులేదు గణాలు, తెగలద్వారా తప్ప వారికీ ప్రజాసభకూ (రోములస్ పాపులస్‌కూ) సంబంధంలేదు ఈ ప్రజాసభకు ప్రజావసరములపై చర్యలుప్రారంభించే హక్కుగాని వానిని సవరించే హక్కుగాని లేదని ఇదివరకే చెప్పాను ఒక స్థాయి చర్యలనే ఈ కమిటియా ఆమోదించి నప్పుడే అమలు జరుపవలసి వుంటుంది చట్టాలన్నింటిని ఈ సభ ఆమోదించగలదు నిరాకరించగలదు మేజిస్ట్రేట్‌లను రెక్సుతో సహా ఉన్నత ప్రభుత్వాధికారులనుసెనేట్ ప్రతిపాదిస్తే వీరు ఎన్నుకుంటారు నూమా పాంపిలియస్‌ను, తుల్లస హోస్టిలియస్‌ను, అంకుస్ మార్టియస్‌ను కమిటియా క్యూరియాటాయే ఎన్నుకుంది టార్క్వినియస్ ప్రిస్కస్‌ను రెక్సుగా అధిక సంఖ్య ప్రజలు ఎన్నుకున్నారని 'లివీ' వ్రాశారు అది తప్పకుండ కమిటియా క్యూరియాటాయే అయివుంటుంది సెర్వియస్ తుల్లియస్ అధికారంలోకి వచ్చాక దానిని కమిటియా ఆమోదించింది అని సిసిరో రాశారు ఆ విధంగా ఎన్నుకునేహక్కు ప్రజలదే రెక్సు ఉద్యోగంప్రజల సమ్మతితోనే ఏర్పడుతుంది ఇంపెరియమ్(సైన్యాధికార పదవి)ను వీరికి ప్రజాసభయే ఒక చట్టం ద్వారా స్థిరపరిచింది పదవిలో నియమించేటందుకు రోమనులు అనుసరించే పద్ధతి అది పదవిలో స్థిరపరిచేవరకు ఆ వ్యక్తి తాను ఎన్నుకోబడిన పదవిని స్వీకరించలేదు రోమను పౌరుల ప్రాణాలకు సంబంధించిన నేరాలలో అంతిమ నిర్ణయం కమిటియా క్యూరియాటాదే దానికే అప్పీలు చేసుకోవాలి ప్రజా ఉద్యమం ద్వారా రెక్సు పదవి రద్దుచేయబడింది ప్రజావసర చర్యలను ప్రారంభించేహక్కు, ప్రజాసభకు ఎప్పుడూ లేకపోయినా దానిదే వాస్తవమైన అధికారం, పలుకుబడిను,ఆనాడు ప్రజలదే సర్వాధి కారము

ప్రజాసభ తనంత తాను సమావేశం కాజాలదు రెక్స్ లేకపోతే PRAEFECT దానిని ఆహ్వానించాలి రిపబ్లిక్ కాలంలో కాన్సల్, వారు లేకపోతే మేజిస్ట్రేటు ప్రజాసభను పిలిచేవారు ఎప్పుడైనా సభను పిలిచినవారే అధ్యక్షత వహించి చర్చలను నడుపుతారు

మరో సందర్భంలో రెక్స్ పదవి పరిశీలించబడింది రెక్స్ సైన్యాధిపతి, ఆయనే పురోహితుడు అని ఆయనకు పౌర కార్యకలాపాలలో అధికారం లేదని కొందరు రచయితలు వ్రాశారు ఆయన సైన్యాధిపతిగా, ఆయన అధికారాలేమిటో నిర్దిష్టంగా చెప్పకపోయినా యుద్ధరంగంలోను నగరంలోను సైన్యబలాలపై ఆయనకు సర్వాధికారం ఉంది తీరుతుంది ఒకప్పుడు ఏదన్నా సందర్భంలో పౌర అధికారాలు నిర్వహిస్తే అప్పటి మట్టుకు ఆ అధికారం ఇచ్చినట్లు అనుకోవాలి అయితే ఆయననే రాజా అనడం ఆనాటి ప్రజాప్రభుత్వాన్ని నిరాకరించడమే అది తప్పు రెక్స్, బాసిలియస్‌లు గణవ్యవస్థలో పాలనాధికారాల్ని నిర్వహించారు ఆ వ్యవస్థతోనే వారు పోయారు అదొక చిత్రమైన నిర్మాణం ఆధునిక సమాజంలో అటువంటిది మరొకటి లేదు రాజరికపు వ్యవస్థ నాడు ఉపయోగించిన పదాలతో అప్పటి వానిని అర్థమయ్యేలా చెయ్యలేము పురాతన సమాజంలోనే ప్రజాతంత్ర సంస్థలపై ఆధారపడియున్న చిత్రమైన ఆ పాలనావ్యవస్థతో పూర్తిగాకాకపోయిన సెనేటు అధికారంలోని సైనిక ప్రజాతంత్రము ప్రజాసభ, వారు నియమించి ఎన్నుకొన్న సైన్యాధిపతి పదవి కొంత వరకైనా పోలివుంటాయి తానుపొందిన విజయాలతో ధైర్యం తెచ్చుకుని రోములను అదనపు అధికారాలను స్వీకరించి వుంటాడు వానిని సెనేటు ప్రజలు తమకు ప్రమాదంగా భావించివుంటారు బహుశా రోమను నాయకులు ఆయనను హత్యచేసి వుంటారు చిత్రంగా అదృశ్యమై పోయాడన్న ప్రకటనలకు అర్థమదే అయ్యుండాలి ఈ చర్యలు దురంతకము అని నిందించవచ్చు కాని గణాల నుంచి సంక్రమించిన స్వాతంత్ర్య ఉత్తేజాన్ని అవి చూపుతూవుంది వ్యక్తిగత నిరంకుశాధికారానికి అది తల ఒగ్గదు ఆ పదవిని రద్దుచేసి ఆ స్థానంలో కాన్సల్‌ల అధికారాన్ని ఏర్పరచి నప్పుడు ఒక కాన్సల్‌కు బదులు ఇద్దరిని నియమించారంటే ఆశ్చర్య పడనక్కరలేదు ఒకే మనిషి అయితే ఆ పదవిలో ప్రమాదకరస్థాయికి ఎదగవచ్చు ఇద్దరుంటే అది సాధ్యంకాదు అనుభవంలేక పోయిన ఇరాక్వాయిలు తమ సమాఖ్యకు ఇద్దరు యుద్ధ నాయకుల్ని నియమించడంలో యిదే ఆలోచన వుండి వుంటుంది సైన్యాధికార పదవి ఒకవ్యక్తి మీదనే పెడితే అతని పలుకుబడి చాలా ఎక్కువ అయిపోవచ్చు

ప్రధాన పురోహితుని హోదాలో రెక్స్ ముఖ్యమైన సందర్భాలలో అధ్వర్యం వహిస్తాడు రోమను మత వ్యవస్థలో అది వున్నతమైన క్రియ యుద్ధానికి ముందు యుద్ధరంగంలో లాగే, నగరంలో చాల ముఖ్యమైనదిగా దీనిని భావిస్తారు అతడు ఇతర మతకర్మలను కూడా కొనసాగిస్తాడు గ్రీకులలో లాగే రోమనులలో కూడ ఆ నాడు పురోహితుని పాత్ర వున్నత సైన్యాధికార పదవికి జతపరచబడింది అది దానితోడిదే సైన్యాధికార పదవిని రద్దు చేసినప్పుడు దానిని అంటి పెట్టుకొని వున్న మతకర్మల నిర్వహణకై రెక్స్ శాక్రోరం (Rex sacrorum) పదవిని కొత్తగా ఏర్పాటు చేశారు ఈ పదవిలో వున్న వాడు ఆ మతకర్మలను నిర్వహించాలి, ఆథీని యన్‌లలో కూడ ఇదే ఆలోచన వచ్చింది వారు తొమ్మిది మంది ఆర్కాన్‌లలో రెండవ వానికి మతకర్మల నిర్వహణను అప్పజెప్పారు అతనిని ఆర్కాన్ బాసిలి యస్ అన్నారు రోమనుల గ్రీకులలో రెక్స్- పదవికి బాసిలియస్ పదవికి అబ్‌జెక్ లలో వ్యక్తికి ఈ మత కర్మకాండను ఎందుకు జతపరిచారు? రెక్స్, బాసిలియస్ పదవులను రద్దుపరచినపుడు మామూలు పురోహిత వర్గం వానిని ఎందుకు నిర్వ హించలేదు- అనే విషయాలను ఎవ్వరూ సమాధానం యివ్వలేదు

రొములస్ కాలం నుంచి సెర్వియస్ తుళ్ళియస్ కాలం వరకు యించుమించు రెండు వందల ఏళ్ళు రోమనుల గణ సమాజం ఈ విధంగా నడిచింది ఆ కాలం లోనే రోమను రాజ్యానికి పునాది ఏర్పడింది ఇదివరకే చెప్పినట్టు ప్రభుత్వంలో మూడు శక్తులుపాల్గొంటున్నాయి సెనేటు, ప్రజాసభ, సైన్యాధిపతి ఆచారాలు అలవాట్ల స్థానంలో నిర్ణీతమైన శాసనాలు చేసి వానిని తామే అమలు జరపవలసిన అవసరాన్ని అనుభవం మీద గ్రహించారు ప్రధాన కార్య నిర్వాహక అధికారి వుండాలనే భావానికి మూలం రెక్స్‌లో వుంది అవసరం ఆ మార్పుకు దారి తీసింది రాజకీయ సమాజం ఏర్పడిన తర్వాత దాని పరిణతి పూర్తి అయింది అనాడు వారికి ప్రభుత్వాన్ని గురించిన భావనలు అనుభవంలో లేవు అందుచేత ఆ పదవి చాల ప్రమాద కర మైనదిగా గమనించారు రెక్స్ అధికారాలను నిర్ణయించడం కష్టం నిర్ణయించ లేదు కూడ అందుచేత ప్రజలకు తార్క్వినియస్ సుపెర్బస్‌కు తీవ్రమయిన భేదాభిప్రాయాలు ఏర్పడే వరకు ఆ పదవినుంచి ఆయనను తొలగించడమే కాదు, పదవినే రద్దు చేశారు రాజా బాధ్యతారహితమైన అధికారాన్ని చలాయించడం జరిగినప్పుడు స్వాతంత్ర్యానికీ, దానికీ పొసగదు— అని తేలింది అప్పుడు స్వాతంత్ర్యానికే విజయం లభించింది పరిమితమైన అధికారాలతో కార్య నిర్వాహకుడిని ప్రభుత్వ వ్యవస్థలోకి తీసుకోవడం

వారికిష్టమే అందుచేతనే యిద్దరు కాన్సలులతో ద్వంద్వ పదవిని సృష్టించారు రాజకీయ సమాజం ఏర్పడిన తరువాత జరిగిన పని యిది

సెర్వియస్ తుళ్ళియస్ కాలానికి ముందు భూభాగాలు, ఆస్తులు పునాదిపై రాజ్యాన్ని ఏర్పరిచేందుకు సరాసరి చర్యలేవీ తీసుకోబడలేదు అయితే పైన చెప్పిన చర్యలన్నీ దానికి సన్నాహకాలే పైన చెప్పిన సంస్థలకి తోడు వారు నగర మేజిస్ట్రేటు పదవినీ, గుర్రపు దళాలతో సహా సంపూర్ణమైన సైనిక వ్యవస్థనూ నిర్మించారు సంపూర్ణంగా గణ నిర్మాణాలలోనే వున్న రోము సెర్వియస్ తుళ్ళియస్ కాలంలో ఇటలీలో బలమైన సైనిక శక్తిగా తయారయ్యింది

వారు సృష్టించిన కొత్త మేజిస్ట్రేట్ పదవులలో నగర వార్డెన్ పదవి చాల ముఖ్యమైనది ఈ ఉద్యోగియే సెనేట్ నాయకుడుగా కూడ వుంటాడు. ఈయనను రోములస్ మొట్ట మొదట నియమించాడని డయోనియస్ చెప్తున్నాడు సెనేట్ తనంత తానుగా సమావేశం జరపలేదు దానిని సమావేశ పరచవలసింది ఈయనే సెనేటును సమావేశ పరిచే అధికారం రెక్స్‌కు కూడ వున్నదని చెప్తారు ఆయన కోరికపై దానికి సంబంధించిన అధికారి సమావేశ పరుస్తాడు అనడం ఉచితం ఈ ఉద్యోగి సెనేటు సమావేశం జరపడాన్ని తన అధికారంలో వుంచుకున్నాడనడం సరికాదు దాని కార్య కలాపాలన్నీ స్వతంత్రమైనవి దానికో హోదా వుంది ప్రతినిధి లక్షణం కల దీను డిశంవిర్‌ల (ప్రాచీనరోములు ఒక దశలో సంపూర్ణ అధికారం సాగించిన పది మంది మేజిస్ట్రేట్‌లు) కాలం తర్వాత ఈ పదవి పేరు నగర ప్రాఎఫెక్టుగా మార్చబడింది. దాని అధికారాలు విస్తరింప చేయబడ్డాయి దానిని కొత్తగా ఏర్పరిచిన కమిటియా సెంచురియాటా ఎన్నుకుంటుంది రిపబ్లిక్ కాలంలో కాన్సలులకు, వారు లేనపుడు ప్రాయటర్‌కు సెనేటును సమావేశ పరిచే అధికారం వున్నది. కమిటియాను కూడ వారే సమావేశ పరుస్తారు తర్వాత కాలంలో ఈ ప్రాయటరు పదవిలో ప్రాచీన పదవి యొక్క కార్య కలాపాలు కలిపి వేయబడ్డాయి రోమనుల ప్రాయటర్ పదవి ఈ నాటి జడ్జి పదవికి ప్రతిబింబం ఈ విధంగా ప్రభుత్వంలోని ప్రతిసంస్థకు సమాజ వ్యవహారాలను నిర్వహించే ప్రతి సంస్థకుగల బీజం అతి సామాన్యమైనది మానవుని అవసరాలను బట్టి అతిసాధారణ రూపంలో ప్రారంభమై కాలపరీక్షలకూ, అనుభవ జ్ఞానానికి నిలబడి సుస్థిర సంస్థలుగా అభివృద్ధి పొందాయి

నాయక పదవుల కాల వ్యవధి- నాయకుల సమితి కార్య కలాపాలు రోములసుకు పూర్వం ఎలా వుండేవో తెలుసుకోగలిగితే ఆయన కాలం నాడు రోమనుల గణ

సమాజం యొక్క పరిస్థితి తెలిసి యుండేది పైగా వారి మేధస్సు పెరిగిన కొద్దీ సమాజ పరిస్థితులు కూడ మారుతూ వుండడం చేత వేరువేరు కాలాలను గురించిన పరిశీలన వేరు వేరుగా జరప వలసి వుంటుంది రోములసుకు పూర్వం నాటి ఇటాలియన్ల కాలము, ఏడుగురు రెగేల కాలము, తర్వాత వచ్చిన రిపబ్లిక్ దశాకాలము, సామ్రాజ్య దశాకాలము, వీటన్నింట ప్రభుత్వ స్వరూప స్వభావాలలో చాల తేడా లున్నాయి కాని మొదటి కాలం నాటి సంస్థలు రెండవ దశలోకి రెండవ దశలోనివి మూడవ దశలోకి, అవి కొన్ని సర్దుబాట్లతో నాలుగవ దశలోకి స్వీకరించ బడినాయి. ఈ సంస్థల పెరుగుదల, అభివృద్ధి పతనాలలో రోమను ప్రజల చరిత్ర ఇమిడి వుంది ఈ సంస్థలను బీజ ప్రాయం నుంచి మెట్టు మెట్టుగా వచ్చిన పెరుగుదల దశలతో విస్తృత రూపంలో మానవ జాతి యొక్క తెగలూ జాతుల మీద పరిశీలించ గలిగితే, మానవ మేధ ఆటవిక దశనాటి బాల్యం నుంచి నేటి వున్నత అభివృద్ధి దశకు పరిణామం పొందడంలో వచ్చిన మహోద్యమాలను అర్థం చేసుకో గలుగుతాం సమాజాన్ని నిర్మించ వలసిన అవసరం కలిగి మానవజాతి గణాలను ఏర్పరచుకుంది గణాలనుంచి నాయకులు వచ్చారు నాయకుల సమితితో తెగ వచ్చింది తెగ చీలవలు వలవలై అనేక తెగలయ్యింది అవన్నీ ఒక సమాఖ్యలో మళ్ళీ కలిశాయి నాయకుల సమితితో కలిగిన అనుభవంతో ప్రజా సభ వచ్చింది పాలనాధికారాలను రెంటి మధ్య పంచారు సమైక్యమైన తెగల యొక్క సైనిక అవసరాల కొద్దీ ప్రధాన సైన్యాధికారి వచ్చాడు. ఈయన, ప్రభుత్వంలో మూడవ అధికారి అయ్యాడు కాని పై అధికారాలు రెంటికి యిది లోబడి వుండేది ఈ పదవి తరువాత వచ్చిన ప్రధాన కార్య నిర్వాహకోద్యోగి, రాజు, అధ్యక్షుడు పదవులకు బీజరూపం ఆటవిక దశలో పుట్టి అనాగరిక దశలో విస్తరించినవే ఈ నాటి నాగరిక జాతులలోని ప్రధాన సంస్థలన్నీ అవే యిప్పటికి విడబడి నాగరిక దశలో పురోగమిస్తున్నాయి.

రోములసు చనిపోయిన నాటికి వున్న రోమను ప్రభుత్వం సామాజికమైనదే, కాని రాజకీయ మైనది కాదు వ్యక్తి నిష్టమే, కాని భూభాగ నిష్టము కాదు నగరం యొక్క హద్దుల లోపలనే స్పష్టమైన వేరువేరు ప్రదేశాలలో మూడు తెగలు నివసించాయి గణ సంస్థల కాలంలో తెగలు నివసించే పద్ధతి అదే వాని మధ్యగల పరస్పర సంబంధాలూ గణాలుగా, తెగలుగా, క్యూరియాలుగా వాని మధ్యగల సంబంధాలు పూర్తిగ వ్యక్తిగతం మనుష్యుల సమూహాలుగా రోమను ప్రజలందరితోను ప్రభుత్వం వ్యవహరిస్తుంది ఈ విధంగా కోట గోడల మధ్య స్థానికంగా ఏర్పడిన పట్ట

జాము పేట అనే భావం, అవసరం వచ్చినప్పుడు పరిస్థితులు సంక్లిష్టమైన కొద్దీ ప్రభుత్వ రూపాన్ని మార్చవలసిన అవసరాన్ని కలిగిస్తాయి వాటి వలన కలిగిన గొప్ప మార్పు అది అనుభవం కొద్దీ చట్టాలను మార్చుకుంటూ దానిని తీసుకు వచ్చారు స్వెరియస్ తుళ్ళియస్ కాలానికి కొంచెం ముందు అథీనియన్‌లు ఇదే స్థితికి చేరారు రోమును స్థాపించడమూ, దాని ప్రథమ విజయాలూ, యుద్ధమైన గణ సంస్థల అధీనంలోనే సాధించబడ్డాయి కాని ఆ సాధనల ఫలితాలు చాల విస్తృత మైనవి కావడంచేత గణాలే పాలనా వ్యవస్థకు పునాదిగా వుండలేవు అని నిరూపించ బడింది అయితే ప్రభుత్వ రూపంలో రెండవ మార్పు వచ్చేటందుకు భూభాగాలు, ఆస్తి ప్రాతిపదిక మీద ప్రభుత్వాన్ని ఏర్పరిచేటందుకు రెండు శతాబ్దాలు తీవ్రంగా కృషి చేయవలసి వచ్చింది గణాలు, క్యూరియాలు, తెగలు పాలనాధికారాలను నూతన సంస్థలకు ఒప్పచెప్పేటందుకు త్యాగం చేయాల్సి వచ్చింది కొత్త పరిస్థితులలో ప్రభుత్వాన్ని ఏర్పరచగల శక్తి గణాలకు లేదనే విశ్వాసం కలిగితే తప్ప, అటువంటి మార్పు సాధ్యం కాదు అనాగరిక దశలోనే కొనసాగడమూ, నాగరిక దశలోకి పురోగ మించడమా అనేది ప్రశ్న? నూతన వ్యవస్థ ప్రారంభం గురించి ముందు ప్రకరణలో ఆలోచిద్దాం

## పదమూడవ ప్రకరణం

# రోమను రాజకీయ సమాజం ఏర్పాటు

ప్రజ— ప్లెబియనులు— వృత్తి పనులవారు— పాట్రీషియనుల తరగతుల సరిహద్దులు— సెర్వియస్ తుల్లియస్ యొక్క చట్టం— ఆస్తిపర వర్గాల ఏర్పాటు— సెంచరీల ఏర్పాటు— అసమానమైన ఓటు హక్కు— కమిటియా సెంచురియాటా— కమిటియా క్యూరియాటా రద్దు— గణాలస్థానే వర్గాలు— జనాభా— ప్లెబియనులను పౌరులుగా మార్చారు— నగరంలో పేటల ఏర్పాటు— దేశంలో చిన్న చిన్న నగరాలు— తెగలు నాలుగుగా పెరిగాయి— రక్త సంబంధాలకు బదులు స్థానిక సంబంధాలు వచ్చేయి— నూతన రాజకీయ వ్యవస్థ లక్షణం— గణ వ్యవస్థ క్షీణించి అంతర్ధానం పొందింది— దాని పని పూర్తి అయింది

రోమను సైనిక ప్రజాతంత్ర నాయకులలో ఆరవ వాడైన సెర్వియస్ తుల్లియస్ రోములస్ చనిపోయిన తరువాత నూటముప్పయి మూడు సంవత్సరాలకు అధికారంలోకి వచ్చాడని తెలుస్తుంది అంటే క్రీ పూ 578లో వచ్చాడన్నమాట ఈయన రోమనులలో రాజకీయ వ్యవస్థను నిర్మించిన మహనీయుడు ఆ వ్యవస్థ యొక్క ప్రధాన లక్షణాలను, వాటిని ఆమోదించేటందుకు గల కారణాలను చెప్తే చాలుతుంది

రోములస్ కాలంనుంచి రోమనులలో రెండు స్పష్టమైన తరగతులున్నాయి పాప్యులస్, ప్లెబియనులు ఈ రెండు తరగతులు వ్యక్తిగతంగా స్వతంత్రులే ఇద్దరూ సైన్యాలలోకి వచ్చారు కాని పాప్యులస్ మాత్రమే గణాలుగా, క్యూరియాలుగా, తెగలుగా ఏర్పడివున్నారు ప్రభుత్వాధికారం వారిదే ప్లెబియన్లలో గణాలు, క్యూరియాలు, తెగలులేవు అందుచేత ప్రభుత్వంతో సంబంధంలేదు రోమనులలో అత్యధిక సంఖ్యాకులైన స్వతంత్ర ప్లెబియనులు అంకుస్ పాలనా కాలంనుంచి

కల్పిస్తున్నారు అయితే సెర్వియస్‌కు పూర్వం పరస్పరసంబంధం లేకుండా వేరువేరు భాగాలుగా మాత్రమే వుండేవారు వారికి ఉద్యోగాలలో ప్రవేశంలేదు కమిటియా క్యూరియాటాతో సంబంధంలేదు గణాల పవిత్ర కర్మకాండలో భాగంలేదు సెర్వియస్ కాలంనాటికి వారి జనసంఖ్య యించుమించు పాప్యులస్‌తో సమానంగానే వుంది వారిదో చిత్రమైన పరిస్థితి వారు సైన్యంలో చేరాలి కుటుంబాలను పెట్టుకోవచ్చు ఆస్తి కలిగి యుండవచ్చు రోముయొక్క ప్రయోజనాలే వారివివి కాని ప్రభుత్వంతో ఏ మాత్రం సంబంధంలేదు గణాల ఆచారం ప్రకారం వారికి గుర్తించబడిన గణాల ద్వారా తప్ప ప్రభుత్వంతో సంబంధం వుండదు ప్లెబియనులకు గణాలులేవు అధిక భాగం ప్రజలు ఆ స్థితిలో వుండడం కామన్‌వెల్త్‌కే ప్రమాదం గణాల ఆచారాలలో దానికి పరిష్కారం లేదు అందుచేత గణ సమాజాన్ని రద్దుపరచి, రాజకీయ సమాజాన్ని ఏర్పరచడానికి అదొక ప్రధాన కారణం అయిందని చెప్పవచ్చు దానికి పరిష్కారం చూడక పోతే రోమను సమాజమే విచ్ఛిన్నమయి వుండేది ఈ మార్పు రోములను కాలంలోనే ప్రారంభం అయింది నూమా పాంపిలియస్ దానిని మళ్ళీ ఎత్తుకున్నాడు సెర్వియస్ తుల్లియస్ దానిని పూర్తి చేసేడు

ప్లెబియనులు పాట్రీషియనులు ఎక్కడినుంచి వచ్చారు? వారి మధ్య సంబంధాలెట్లా వుండేవి దీనిమీద ఎంతో చర్చజరిగింది ఎన్నో భిన్నాభిప్రాయాలు ఏర్పడ్డాయి ఈ ప్రశ్నలను గురించి కొంచెం చెప్పడం మంచిది ప్లెబియన్ అన్నవాడు ఒక గణం సభ్యుడు కాదు ఇతరగణాలతో కలసి ఒక క్యూరియాలోగాని తెగలోగాని సభ్యుడు కాదు రోము ఏర్పడేనాటికి ముందు పరిస్థితులు చాలా అస్థిరంగా వున్నాయి ఆ దశలో తాముపుట్టిన గణాల నుంచి విడిపోయి ఎందరెందరో చెదిరిపోవడం అనుభవం కాదు బతుకు తెరువుకోసం చుట్టుపక్కల తెగలనుంచి ఎందరో క్రొత్తనగరం చేరుకున్నారు యుద్ధాలలో పట్టుబడి తరువాత వదలివేయబడిన వారూ అక్కడ చేరారు రోముకు చేర్చిన గణాలతో పాటు ఎందరో ఇతరులూ రోము చేరారు వీరంతా ప్లెబియన్ తరగతి అయ్యారు బహుశా తెగకు నూరు గణాలచొప్పున కూర్చేక్రమంలో గణాలకు సంబంధించిన శేషభాగాలూ, చిన్న చిన్నగణాలూ మిగిలిపోయి ప్రక్కకు పెట్టబడ్డాయి ఏ గణానికి సంబంధించని జనము, ఒక గణంగా గుర్తించకుండా, క్యూరియాలో చేర్చకుండవుండిన గణభాగాలు, వారి కుటుంబాలు వారి తరువాత తరాలవారు పెద్ద తరగతి అయ్యారు వారే రోమను ప్లెబియనులు వారు రోమను గణ సమాజంలో సభ్యులు కారు రోముకి చేర్చిన మూడవతెగ లూసెరస్‌ను చిన్నగణాలని వారి పెనేట

ర్లను చిన్నగణాల నాయకులని పిలిచేవారు అంటే ప్రాచీన గణాలవారు వీరిని తమతో సమానులుగా గుర్తించడంలేదన్న మాటే ప్లెబియనులను ప్రభుత్వంలో పాల్గొనకుండా నిరోధించడానికి బలమైన కారణమే వుంది నిర్ణయించిన నూరు గణాలతో మూడవ తెగని ఏర్పరిచాక కొత్తవారిని చేర్చుకోవడం ఆగిపోయింది అటు తరువాత ప్లెబియను తరగతుల సంఖ్య మరింత వేగంగా పెరిగింది ప్లెబియను తరగతి అంకుస్ కాలంనాటికే వున్నదని నీబుర్ వ్రాశారు అంటే వారానాటికే కవబడు తున్నారన్న మాట వృత్తిపనుల వారు ప్లెబియనులలో చేరరని ఆయనే వ్రాశారు దయోనిసియస్, ప్లూటార్క్-కూడ ఈ రెండు విషయాలలో భేదిస్తున్నారు వృత్తిపనుల వారు సాధారణ ప్లెబియనులకు పూర్తిగా భిన్నులని, చాలాకాలం తరువాత వారితో చేరారని రోము చరిత్రలో చెప్తున్నారు వారిని ఆదరించిన కుటుంబాలు శిథిలం కావడమో, అంతరించడమో జరిగినపుడు వారి సేవా బంధనాలు తెగి పోయాయి జాతి మొత్తం స్వాతంత్ర్యంవైపు పురోగమించడం కూడ వారి స్వతంత్రతకు కారణం ఆ విధంగా వృత్తిపనుల వారు స్వతంత్రులై క్రమంగా ప్లెబియనులలో చేరారు వృత్తి పనుల వారికి, వారినాదరించే కుటుంబాలతో సంబంధాలను రోములను ఏర్పరిచాడని ఆయన కాలం నాడున్న శ్యాటోనియస్ చెప్పారు తమకు, తమ ఆస్తులకు రక్షణ వుండాలంటే, గణ సభ్యత్వం వుండాలి దానికి సంబంధించిన మత కర్మకాండలో భాగం వుండాలి. అవి రెండూలేని తరగతి ఒకటి వుండడంతో యజమాని, వృత్తిపని వారు మధ్య సంబంధాలను ఏర్పరచవలసి వచ్చింది గణ సభ్యులైతే దాని రక్షణ వుంటుంది దాని సౌకర్యాలు అనుభవించ గలుగుతారు తమ గణానికి చెందిన వాడు మరో గణానికి చెందినవారి అదుపు ఆజ్ఞలలోకి వెళ్ళడాన్ని గణం అప్రతిష్ఠగా భావిస్తుంది అందుచేత ఏ గణానికీ చెందని ప్లెబియనులు మాత్రమే రక్షణకు ఒకర్ని వెతుక్కుంటారు వారిక్రింద పనిచేస్తారు. పైన చెప్పిన కారణాలచేత వృత్తిపనులవారు పాప్యులములో భాగం కాజాలరు అందుచేత రోమను వమన్యలమీద గొప్ప పండితు డైన నీబుర్ ఏమి చెప్పినా వృత్తి పనులవారు ప్లెబియనులలో భాగమే

పాట్రీషియన్ తరగతికి మూలం ఏమిటి? దాని విస్తృతిఎంత? రోమను సెనేటు ఏర్పడడంతో అది ఏర్పడిందా? సెనేటర్లకు వారి సంతానానికి, తరువాత తరాలకు మాత్రమే పరిమితమా? ప్లెబియనులు కాని పాప్యులస్ అందరికి అది వర్తించిందా? అనేవి చెప్పడం చాలాకష్టం మొత్తం పాప్యులస్ అంతా పాట్రీషియనులే అని ప్రసిద్ధ చరిత్ర కారులంతా చెప్తున్నారు నీబుర్ అభిప్రాయం అదే లాంగ్,

న్యెబ్రూక్ మొదలైన వారంతా ఆయనతో ఏకీభవిస్తున్నారు. కాని వారు చెప్పే కారణాలు అంత సమగ్రంగా లేవు. పాట్రీషియన్, ప్లెబియన్ తరగతులు రోములస్ కాలం నాటికే వున్నాయి. గణాలుగా ఏర్పడిన ప్రజలంతా పాపులస్. వారు అనాడే పాట్రీషియనులే అయివుంటే, ఆ రెండింటికి మధ్య ప్రత్యేకత ఏమీ వుండేది కాదు. ప్లెబియను తరగతికి, పాట్రీషియను తరగతికి మధ్య అంతరం నామమాత్రంగానే వుండేది. పైగా సిసిరో, లివీలు చెప్పే మాటలు ఈ అభిప్రాయాన్ని బలపరచడంలేదు. డయోనిసియను సెనేటు ఏర్పడక పూర్వమే పాట్రీషియను తరగతి వున్నదనీ, కులీనత యోగ్యత, సంపదలు ఎట్టి ప్రసిద్ధులైన కొద్దిమంది మాత్రమే దానికి చెందినారని వ్రాశాడు. ఆ విధంగా చరిత్ర ప్రసిద్ధికెక్కిన గణాలకు చెందినప్పటికీ, పేదలూ, సాధారణ కుటుంబీకులూ ఆ తరగతికి చెందరు. సెనేటుతో సంబంధం లేకపోయినా పాట్రీషియన్ తరగతికి చెందినవారు కొందరున్నారని అంగీకరించినా అనేక గణాలలో పాట్రీషి యన్‌లు కాని ప్రజలు యింకా ఎందరో వుంటారు. సెనేటర్లు వారి సంతానము మాత్రమే పాట్రీషియనులు అని సిసిరో స్పష్టంగా వ్రాశాడు. వారుకాక ఇతర పాట్రీషియనులు వున్నారని ఆయన చెప్పలేదు. రోములస్ తెగలలోని శ్రేష్ఠులతో సెనేటును, ఏర్పరిచాడని వారి యందు వున్న గౌరవం కొద్దీ వారిని తండ్రులుగా వారి సంతానాన్ని పాట్రీషియన్‌లుగా పిలిచాడని సిసిరో వ్రాశాడు. తండ్రి పాత్రే (Patres) అని పిలవడాన్ని రోమనులలోనే కొందరు అంగీకరించలేదు. కాని పాట్రెస్ పదంమీద ఏర్పడిన పాట్రిషియన్ శబ్దాన్ని చూస్తే దానికీ, సెనేటర్ పదవులకూ సంబంధంవున్న శ్రద్ధ కనిపిస్తుంది. ప్రతి సెనేటరు ప్రథమంలో ఒక గణానికి ప్రతినిధి. ఆ విధంగా మూడు వందల గణాలకు మూడువందల మంది ప్రతినిధులయ్యారు. గణ సభ్యులంతా పాట్రీషియన్‌లు కారు. అనటానికి యిదొక్కటి చాలు. ఆ హోదా సెనేటర్లకు వారి సంతానానికి తరువాతి తరాలవారికి మాత్రమే పరిమితం. లివీ కూడ అంత స్పష్టంగానూ చెప్పాడు. పదవి మీద గౌరవం కొద్దీ వారిని తండ్రులు అన్నారని, వారి సంతానం పాట్రీషియనులు అయ్యారని ఆయన వ్రాశాడు. రెజ్జేలకాలంలోను, రిపబ్లిక్ కాలంలోను కొంతమందిని ప్రభుత్వమే పాట్రీయనులుగా చేసింది. సెనేటరు పదవితో సంబంధం లేకుండా, ప్రభుత్వం గుర్తింపులేకుండా ఆ హోదా ఎవరికీరాదు. కొంత మందిని సెనేట్‌లోకి తీసుకోకుండ వదలినపుడు వారికి సమానమైన స్థాయినిచ్చి కొత్తగా పాట్రీషియన్ తరగతిలోకి చేర్చుకుంటూ చట్టంచేసి వుండవచ్చు. యిటువంటి వారి సంఖ్య కొద్ది మాత్రమే వుంటుంది.

గణాల నాయకులను రోములనుకు పూర్వంనాడే తండ్రులు అని పిలిచి వుండవచ్చు ఆ పదవి హోదా అటువంటిది వారి సంతానానికి ఆ పదవి యొక్క హోదాను యిచ్చియుండవచ్చు అయితే అలాజరిగి వుంటుందని అనుకోవడానికి సాక్ష్యం లేదు కాని జరిగినది అదేననిపిస్తుంది సెనేట్ ఏర్పడినపుడు ప్రధాన నాయకులందరినీ అందులో చేర్చలేదు దానిలో ఖాళీలేర్పడినపుడు గణానికి ప్రాముఖ్యం యివ్వకుండా అర్హతను పట్టి మాత్రమే తీసుకున్నారు ఆ విధంగా సెనేట్‌తో సంబంధం లేకుండా అంతకుముందే పాట్రీషియన్ తరగతి ఒకటి ఏర్పడటానికి పునాది వున్నదని అనుకోవచ్చు లివీ వుపయోగించిన భాష యిటువంటి ఊహకు కారణమవుతూంది గణనాయకులకు తండ్రులు అనేది గౌరవనీయమైన పిలుపు కావడం చేతనే సెనేటర్లను తండ్రులు అనాలని రోములను కోరాడు — అన్నాడు లివీ ఈ విధంగా సెనేటుకు సంబంధం లేకుండానే పాట్రీషియను తరగతికి పరిమిత పునాది వుంది ఆ పరిధిలోకి గుర్తించబడిన గణాలన్నీ చేరవు కూడాను సెనేటర్లకు సంబంధించినంత వరకే వారి పిల్లలను, వారి తరువాతి తరాలను పాట్రీషియనులుగా గుర్తించడం జరిగింది పాటర్క్యులస్ ఇదే మాట అన్నాడు

కొన్ని గణాంలోని కొన్ని కుటుంబాలు పాట్రీషియనులు అయినా కొన్ని కుటుంబాలు ప్లెబియనులు అయినా పాట్రీషియన్ గణాలు ప్లెబియన్ గణాలు అంటూ వేరు వేరుగా ఎన్నడూలేవు ఈ విషయమై కొంత గందరగోళం వుంది ప్లెబియను గణాలకు చెందిన మూడువందల ఆరుమంది వయసు వచ్చిన మగవాళ్ళు పాట్రీషియనులు అని లివీ వ్రాశాడు అంటే ఈ గణంలోని కుటుంబాలన్నీ సెనేటర్ల వంశీకులుగనో, ప్రభుత్వ చట్టం రీత్యా పాట్రీషియన్లుగా గుర్తించబడో వుండాలి అనేక గణాలలో పాట్రీషియన్ కుటుంబాలు ఏర్పడి వుంటాయి కాలక్రమంలో ఒకే గణంలో పాట్రీషియన్ ప్లెబియన్ కుటుంబాలు అంటూ విడబడి వుంటాయి యింతకు పూర్వం క్లాడియన్ గణంలో క్లాడి, మార్సెల్లి కుటుంబాలను గురించి పేర్కొన్నా వాటిలో క్లాడీలు ఒకరే పాట్రీషియనులు యిక్కడ ఒకటి గుర్తుపెట్టుకోవాలి సెర్వియస్ తుల్లియస్ కాలం నాటికి రోమనులలో పాప్యులస్, ప్లెబియన్ అంటూ రెండు తరగతులు వున్నాయి కాలక్రమంలో క్రీ పూ 367 నాటి లిసినియస్ చట్టం తర్వాత మార్పులు వచ్చాయి స్వతంత్రులైన రోమను ప్రజలందరూ ప్రభుత్వ హోదాలకు అర్హులు అంటే ప్రజలంతా రెండు తరగతులు చేయబడ్డారు. కొత్త తరగతి సామాన్య ప్రజ మొదటి తరగతిలోకి సెనేటర్లు, వారి కుటుంబాల వారు, క్యూరియాలలో

మూడు ప్రధాన పదవులలో వున్నవారు (ఛీఫ్ మేజిస్ట్రేటు, మేజిస్ట్రేటు భవనాలపై అధికారి కాన్సల్, ప్రాయటర్, కురులే అడిలే) వారి కుటుంబాలవారు వస్తారు ఇతర రోమను పౌరులంతా ఇంక సాధారణులే ఈ విధంగా గణ నిర్మాణం శిధిలమయింది వెనుకటి విభజన ఇక చెల్లదు మొదటి దశలో పాప్యులస్‌గా పరిగణించబడిన ప్రజలు అందరూ యిపుడు ప్లెబియనులు కారు తరువాత కాలంలో పాట్రీషియన్‌లు కాకుండనే వారిలో కొందరు కులీన తరగతికి చెందిన వారయ్యారు ఈ విధంగానే క్లాడీ రోములస్ కాలంనాటి సెనేటర్ అయినా తాను అప్పియస్ క్లాడియస్ వంశములో వాడిని అని చెప్పుకున్నారు కాని మార్సెల్లీకి అటువంటి వంశ పురుషుల్ని చెప్పుకోవడానికి లేకపోయింది "వారు అప్పీ కుటుంబం కన్న ఎక్కువగౌరవ మర్యాదలు సంపాదించిన కామన్వెల్తుకి ఎక్కువ వుపయోగకారులు అయినా" ఆ యిద్దరిలో తేడా వున్నదని నీభుర్ వ్యాఖ్యానించాడు మార్సెల్లీ తన హోదాకు తగని వివాహం చేసుకొని పాట్రీషియను తరగతిని పోగొట్టుకొన్నాడంటూ నీభుర్ వ్రాసిన ఊహలతో నిమిత్తం లేకుండానే, మార్సెల్లీ స్థానం ఏమిటో స్పష్టంగా తెలుస్తూనే వుంది

పాట్రీషియన్ తరగతి సహజంగానే అధిక సంఖ్య కలదై వుంటుంది సెనేటర్లు ఎప్పుడోకాని మూడు వందలకు మించి వుండరు ఖాళీలేర్పడినపుడు కొత్త కుటుంబాల సందులోకి తీసుకుంటూ వుంటారు వారి అనంతరపు తరాల వారికి ఆ విధంగా పాట్రీషియన్ తరగతి లభిస్తుంది మరికొంత మందిని ప్రభుత్వం చట్ట రీత్యా పాట్రీషియన్లను చేస్తుంది ప్రారంభంలో ఈ హోదాకి విశేష ప్రాముఖ్యం వుండక పోవచ్చు కాని సంఖ్య పెరిగి సంపదలు, అధికారాలు ఎక్కువ అవడంతో దానికి ఎక్కువ ప్రాముఖ్యం వస్తుంది అది రోమను సమాజం యొక్క స్వరూపాన్నే మార్చివేసింది రోమను గణ సమాజంలో ఒక గౌరవనీయ తరగతిని ప్రవేశ పెట్టడం యొక్క ఫలితాలు ఆనాడే అర్థం అయివుండవు ఈ నూతన తరగతిని ప్రవేశ పెట్టడం వలన రోమను ప్రజల పురోగతికి నష్టం కలిగిందా, లాభం కలిగిందా అంటే చెప్పడం కష్టం

నూతన రాజకీయ వ్యవస్థకు చెందిన ప్రభుత్వ నిర్మాణంలో గణాలకు స్థానం లేక పోయాక ప్లెబియనుల కంటే పాప్యులసుకు విశిష్టత ఏమీ మిగలలేదు. కాని పాత ఏర్పాట్ల ఛాయలు, వాటి ప్రత్యేకతలు రిపబ్లిక్‌లో చాలా కాలం కొనసాగాయి ఈ నూతన వ్యవస్థలో ప్లెబియనులు రోమను పౌరులే అయ్యారు, కాని వారు సాధారణ ప్రజలే అయ్యారు గణంలో సభ్యుడా కాదా అనేదానికి యిక్కడ విలువలేదు

రోములస్ కాలం నుంచి సెర్వియస్ తుల్లియస్ కాలంవరకు రోమనులది పట్టి గణ సమాజం మాత్రమే భూభాగాలూ, ఆస్తులతో దానికి సంబంధం లేదు మనకు కన్పించేవల్లా గణాలు, క్యూరియాలు, తెగలుగా ఏర్పడ్డ ప్రజానమూహాలు మాత్రమే. ప్రభుత్వం వాని ద్వారానే వారితో వ్యవహరించేది సొలోన్‌కు పూర్వం ఏథీనియన్ల పరిస్థితే వారిదీని అయితే పెనుకటి నాయకుల సమితి స్థానే సెనేట్‌ను, పెనుకటి ప్రజానభ స్థానే కమిటియా క్యూరియాటాను ఏర్పరుచుకున్నారు పురోహితుడుగా, న్యాయాధిపతిగా కొత్త బాధ్యతలను యిచ్చి సైన్యాధిపతిని ఎన్నుకున్నారు అవసరానుగుణంగా సమన్వయం చేసుకున్న ఈ ముగ్గురితో ప్రభుత్వం ఏర్పడడం, సమాన సంఖ్యలో గణాలు క్యూరియాలు గల మూడు తెగలు సమ్మేళనం పొంది ఒకే ప్రజగా ఏర్పడడం - దీనితో వీరు లాటిన్ తెగలు ఏవీ యింతకు పూర్వం అందుకొని వుండని సమగ్రము, నూతనము అయిన ప్రభుత్వ సంస్థను సంపాదించగలిగేరు ప్రభుత్వంతో సంబంధం లేని మత సౌభాగ్యాలు లేని ప్రజలు క్రమంగా అధికమయ్యారు యిది పౌరసత్వం లేని, ప్రభుత్వంలో భాగస్వామ్యం లేని తరగతి యిది అంత ప్రమాదకరం కాకపోయినా కామన్వెల్తుకు నష్టకరంగా వుంటుంది అదివరకు ఎదగనంతగా మునిసిపాలిటీ పెరుగుతూవుంది అక్కడి వ్యవహారాలను పరిదిద్దడానికి ప్రత్యేక నిర్మాణం కావల్సివస్తుంది ప్రభుత్వ పద్ధతిని మార్చవలసిన అవసరం ఆలోచనాపరుల దృష్టిని ఆకర్షించి వుంటుంది జనాభా పెరుగుదల, సంపదల పెరుగుదల వారి వ్యవహారాల నిర్వహణలో యిబ్బందులను తెచ్చిపెట్టింది జనాభా పెరగడం, వారి ప్రయోజనాలలో భిన్నత్వం వలన గణ నిర్మాణంలో వారిని పట్టివుంచడం అసంభవమని క్రమంగా తెలియసాగింది మార్పుకోసం వారు అనేక పద్ధతులను పరిశీలించారంటే యిటువంటివే కారణాలయి వుంటాయనుకోవాలి

రోములస్ తర్వాత వచ్చిన నూమా చేసిన ప్రయత్నం గమనించతగినది గణాలు ప్రాతిపదికగా వాని పైన గొప్ప రాజ్యాధికారాన్ని నిర్మించడం కష్టమనితోచినట్లే కనిపిస్తుంది థెసియస్ లాగానే గణాలను ప్రక్కన పెట్టడానికి ఆయన ప్రయత్నించేడు కళలు, వృత్తులు పట్టి ఎనిమిది తరగతులుగా ప్రజలను విభజించేడు. ప్రజలను వారి వృత్తులను పట్టి విభజించడం నూమా చేసిన పనులలోకల్లా అభినందించ తగినదని ప్లూటార్క్ వ్రాసేడు ఈ విధంగా విభజించడం ద్వారా లాటిన్, శాబైన్ తెగల మధ్య భేదాన్ని తొలగించ ప్రయత్నించాడు. కాని గణాలకు గల అధికారాలను ఈ తరగతులకు యివ్వకపోవడంచేత ఈ ప్రయత్నం విఫలమయింది థెసియస్

కూడ యిటువంటి ప్రయత్నమే చేశాడు ఈ కారణంచేతనే అదీ విఫలమయింది ప్రతిగిల్డుకు వేరే ఒక కార్యాలయము, ఒక కోర్టు, మత కర్మకాండ వున్నాయని ప్లూటార్క్ వ్రాశాడు అత్తికాలోనూ, రోములోనూ ఇదే లక్ష్యం కోసం, యిదే కారణాలతో, యిదే పద్ధతిలో, యిదే పరిశీలన జరిగింది అని తెలుస్తూంది దానిని పట్టి యిద్దరూ కూడ ఒకే విధంగా ప్రయత్నించారని అనుకోవచ్చు

సెర్వియస్ తుళ్ళియను ఒక కొత్త పద్ధతిని ప్రారంభించాడు అది రిపబ్లిక్ కాలం వరకు కొనసాగింది తరువాత దానికి మెరుగులు పెట్టారు ఈయన కాలం క్రీ పూ 576-533 అంటే సొలోన్‌కి చాల దగ్గర కాలం వాడనాలి క్రీస్థెనెస్ (క్రీ పూ 504) ఈయన తరువాతివాడు ఈయన రిపబ్లిక్‌ను స్థాపించాడు ఈయన చేశాడనే చట్టం సొలోన్ చట్టం నమూనాలోనే వుంది అంటే కొంచెం యించు మించుగా రిపబ్లిక్ ఏర్పడే నాటికి అది అమలు జరుగుతున్నట్టే అనుకోవాలి సాధారణంగా గొప్ప గొప్ప మార్పులు ఎవరో ఒకరి పేరుకు జత పరుచడం జరుగుతుంది నూతన రాజకీయ వ్యవస్థ క్రీస్థెనెస్ తెచ్చినదే అనడం అటువంటిదే అయి వుంటుంది అది వరకే అనుభవం వలన సూచనగా తోచుతూ, తన దృష్టిని ఆకర్షించిన దానికి ఒక రూపం యివ్వడమే శాసన కర్త చేసే పని గణాలను ప్రక్కకు నెట్టి భూభాగాలు, ఆస్తి ప్రాతిపదిక మీద రాజకీయ సమాజాన్ని నిర్మించేందుకు మూడు ప్రధానమైన మార్పులు జరిగాయి మొదటిది - గణాలస్థానే, వ్యక్తుల ఆస్తుల పరిమితిని పట్టి తరగతులను ఏర్పరచడం రెండవది గణ సభకు (కమిటియా క్యూరియాటా,) ప్రత్యామ్నాయంగా కొత్త ప్రజాసభను (కమిటియా సెంచురి యాటాను) ఏర్పరచడం, గణాల అధికారాన్ని చాల వరకు దీనికి అప్పజెప్పటమూ, మూడవది నగరాన్ని విభజించి, సరిహద్దులు ఏర్పరచి, వాటికి పేర్లు పెట్టి, నాలుగు వార్డులనుగా విభజించడం ప్రతి వార్డులోని వారు అక్కడ తమ పేర్లను, తమ ఆస్తిని నమోదు చేసుకోవాలి

సెర్వియస్‌కు సొలోన్ ఏర్పరిచిన ప్రభుత్వ పథకం తెలిసే వుంటుంది ఈయన వారిఆస్తుల విలువను పట్టి ప్రజలను అయిదు తరగతులుగా విభజించాడు దీనివలన వేరు వేరు గణాలకు చెందిన అధిక ధనవంతులు ఒక వర్గంగా ఏర్పడ్డారు లక్ష గాడిదలు కలవారు మొదటి వర్గం 75వేలు వుంటే రెండవ వర్గం 50 వేలు వుంటే మూడవ వర్గం నాలుగవ వర్గానికి 25 వేలు, అయిదవ దానికి 11 వేలు గాడిదలు వుండాలని లివీ వ్రాశాడు. ప్రతి వర్గం సెంచరీలుగా విభజింప బడింది ఆ వర్గంలో వున్న సంఖ్యతో నిమిత్తం లేకుండ ఈ సెంచరీకి సంఖ్య యిష్టం వచ్చినట్టు నిర్ణయించ

బడింది కమిటియాలో ఒక సెంచరీకి ఒక వోటు వుంటుంది ఆయా వర్గాలలోవున్న సెంచరీల సంఖ్యను పట్టి ఆ వర్గానికి రాజకీయంగా అధికారం నిర్ణయించ బడుతుంది మొదటి వర్గానికి 80 సెంచరీలు వున్నాయి అంటే కమిటియా సెంచురియాటాలో వారికి 80 వోట్లు రెండవ వర్గానికి 20 సెంచరీలు చేతి పనుల వారి రెండు సెంచరీలను వీరికి కలిపారు వీరి వోట్ల మొత్తం 22 మూడవ వర్గంలో 20 సెంచరీలు కనుక 20 వోట్లు నాలుగవ వర్గానికి 20 సెంచరీలు కాని బూరలు ఊదేవారు, బాకాలు ఊదేవారు వున్న రెండు సెంచరీలను వీరికి జతపరిచారు కనుక 22 వోట్లు అయిదవ వర్గానికి 30 సెంచరీలు 30 వోట్లు వీరికి తోడు ఈక్వైట్లు (Equites) ని పద్దెనిమిది సెంచరీలు 18 వోట్లు వీరుగాక సెంచరీ, ఒక వోటు వున్న ఆరవ తరగతి వుందని డయోనిసియస్ అన్నాడు అసలు ఆస్తిలేని వారు అయిదవ వర్గానికి కావలసిన దానికన్న తక్కువ ఆస్తి కలవారు ఈ వర్గంలో వుంటారు వీరు పన్నులు చెల్లించనక్కరలేదు యుద్ధంలో పాల్గొననక్కరలేదు ఈ ఆరు వర్గాలకు చెందిన సెంచరీలు ఈక్వైట్ల సెంచరీలు కలిపి మొత్తం నూట తొంభై మూడు అని డయోనిసియస్ వ్రాశాడు అయిదు వర్గాలకు వున్న సెంచరీల సంఖ్యతో లివీ కూడ అంగీకరించాడు అయితే ఒకే సెంచరీ ఒకే వోటు కలదన్న 6వ వర్గాన్ని ఆయన మినహాయించాడు వారిని అయిదవ వర్గంలోకి జత పరిచాడు బాకాలూ బూరలూ ఊదేవారిని రెండు కాక మూడు సెంచరీలు చేశాడు అంటే మొత్తం సంఖ్య డయోనిసియస్ చెప్పిన వాటి కంటే ఒకటి ఎక్కువ 98 సెంచరీలు అల్ప సంఖ్య అని 112రో వ్యాఖ్య పై వారిద్దరూ చెప్పిన దానికి అది విరుద్ధమేమీ కాదు ప్రతి వర్గం యొక్క సెంచరీలను సీనియర్లు, జూనియర్లుగా విభజించారు 55 యేళ్ళు పైబడినవారున్నవి సీనియర్ సెంచరీలు నగర రక్షణ సైన్యాలలో పని చేయడం వీరి బాధ్యత 17 ఏళ్ళకి పైబడి, 55 ఏళ్ళకు తక్కువగల వారితో ఏర్పడ్డని జూనియర్ సెంచరీలు నగరం వెలుపల సైనిక వ్యవహారాలు వీరి బాధ్యత ప్రతి వర్గానికి వేరు వేరు ఆయుధాలు నిర్ణయించబడినాయి

ఇక్కడ ఒకటి గమనించాలి ప్రజా నభనిర్ధారణ చేయగలంత వరకుప్రభుత్వం పై పెత్తనం మొదటి వర్గమూ, ఈక్వైట్‌లూ చేతిలో వుంటుంది వీరిమొత్తం సంఖ్య 98 అంటే మొత్తం వోట్లలో మెజారిటీ కమిటియా క్యూరియాటాలో లాగనే

కమిటియా సెంచురియాటాలో కూడ ప్రతి సెంచరీ తాము ఎలావోటు చేయాలో వేరు వేరుగా నిర్ణయించుకొంటుంది ఏదన్నా ప్రజా సమస్య మీద వోటు తీసుకోవలసి వచ్చినప్పుడు మొదట ఈక్వైట్‌లను పిలిచేవారు తరువాత మొదటి వర్గాన్ని పిలిచే వారు వారిద్దరూ అంగీకరిస్తే వారివోట్లతో సమస్య తేలిపోతుంది అప్పుడు మిగిలిన సెంచరీలవోటు తీసుకోవడం వుండదు వారు భేదిస్తే అప్పుడు రెండవవర్గాన్ని పిలు స్తారు అప్పుడూ మెజారిటీ రాకపోతే వరుసక్రమంలో చివరి వర్గం వరకు పిలుస్తారు

ఇంతకు పూర్వం కమిటియా క్యూరియాటా నిర్వహించిన బాధ్యతలను ఇప్పుడు కమిటియా సెంచురియాటాకు బదలాయించారు తరువాత కాలంలో చిన్న చిన్న వివరాలు చేర్చి వివి పెంచారు సెంచురియాటా ఆఫీసర్లను మేజస్ట్రేట్లను అందరినీ ఎన్నుకునేది అయితే వారిని ప్రతిపాదించడం సెనేటు పని సెనేటు ప్రతి పాదించిన వాటిని చట్టాలుగా ఆమోదించినా, నిరాకరించినా ఆ అధికారం సెంచురి యాటాదే అలాగే సెనేటు ప్రతిపాదన పై అప్పటికున్న చట్టాలను రద్దుచేయవచ్చు కూడాను, వారికి యిష్టమైతే అలాగే సెనేటు ప్రతిపాదించిన యుద్ధ ప్రకటనను అంగీక రించవచ్చు, నిరాకరించవచ్చు కాని కమిటియా సెంచురియాటాతో సంప్రదించకుండానే సెనేటు శాంతిని కుదుర్చుకోవచ్చు యిదే రాజ్యంలోని అత్యున్నత న్యాయస్థానం ప్రాణానికి సంబంధించిన అన్ని కేసులను దీనికి అప్పీలు చేసుకోవచ్చు ఈ అధికా రాలన్నీ నిర్దిష్టము అయితే ఆర్థిక వ్యవహారాలపై దీనికి పెత్తనంలేదు. పాట్రీషియను లతో కూడిన ఈక్వైట్‌లతో సహా మొదటి వర్గానికి అధికమైన వోట్లుంటాయి వీరంతా బాగా ధనికులు అనుకోవాలి అయితే ప్రభుత్వం మీద పెత్తనం ఆస్తిదే కాని సంఖ్యది కాదు అయినప్పటికీ కాల క్రమంలో అందరికీ రక్షణసమానంగా యివ్వగల చట్టాలు చేయబడ్డాయి ఆ అసమాన వ్యవస్థలో వున్న దుర్గుణాలను కొంత వరకు సర్దుబాటు చేశారు

మేజస్ట్రేట్‌లను, ఆఫీసర్లను ఎన్నుకునేందుకు సంవత్సరానికొక మారు (యితర ప్రజావసరాలు పడినప్పుడు ఎప్పుడేనాసరే) కమిటియా సెంచురియాటా సభలు మార్టియస్ ఆవరణలో జరిగేవి ప్రజలు తమతమ వర్గాలు తమ సెంచరీల వారీగా ఒక సైన్యం లాగానే తమ ఆఫీసర్ల చేత క్రింద సమావేశమయ్యేవారు సెంచరీలు, వర్గాలు కూడ సైనికావసరాలకోసం, పౌర వ్యవహారాల కోసం వుపయోగపడేటట్లుగానే ఏర్పరచ బడ్డాయి సెర్వియస్ తుల్లియస్ అధికారంక్రింద జరిగిన మొట్టమొదటి కమిటియాసెంచురియాటాకు ప్రతివర్గము దేనికదే సెంచరీలుగా, ప్రతి సెంచరీలోదానికి

చెందిన వారు తమతమ ఆయుధాలతో 80 వేల మంది పౌర సైనికులు సమీకృత మయ్యారని లివీ వ్రాశాడు 84,700 మందిఅని డయోనిసియస్ అన్నాడు పెంచరీలోని ప్రతిఒక్క సభ్యుడు యిప్పుడు రోముపౌరుడు అదే నూతన రాజకీయవ్యవస్థ యొక్క మహత్ఫలితం రిపబ్లిక్ కాలంలో కాన్సల్‌లు (చీఫ్ మేజిస్ట్రేట్లు), వారు లేనప్పుడు ప్రాయెటర్‌లు (మేజిస్ట్రేటు) కమిటియాను సమావేశపరచగలరు సమావేశ పరిచిన వారే దానికి అధ్యక్షులు.

ఈ వేళ మనకు చాల ఎక్కువ అనుభవం వుండడంచేత ఈ ప్రభుత్వం ఎంతో మొరటుగా, అసందర్భంగా అన్పిస్తుంది దానిలో ఎన్నోలోపాలు వున్నా అది వెనుకటి గణ ప్రభుత్వం కన్న ఎంతో మెరుగు యిప్పుడిప్పుడే నిర్ణాయక అధికారంలోనికి వస్తూన్న ఆస్తి ఆ ప్రభుత్వ స్వభావాన్ని నిర్ణయించింది అది కులీన వర్గాన్ని, సౌక ర్యాలు కలవారిని ప్రాముఖ్యానికి తీసుకొచ్చింది వారు ఆ అవకాశాన్ని చూసుకొని ప్రభుత్వాధికారాన్ని చాల భాగం ప్రజల చేతుల నుంచి లాక్కొని ఆస్తిపరుల చేతికి వప్ప చెప్పారు గణాల నుంచి సంక్రమించిన ప్రజాతంత్ర సూత్రాలకు యిది వ్యతి రేకమే ప్రభుత్వ సంస్థలలో చేరిన కులీనులకూ, సౌకర్యాలు గలవారికీ వ్యతిరేకంగా రోమను ప్లెబియనులు రిపబ్లిక్ కాలంలో పొడుగునా ఘర్షిస్తూనే వచ్చేరు ఒక్కొ క్కప్పుడు కొంత కొంత విజయమూ పొందారు ప్లెబియనులు కోరే సమాన హక్కులు, సమాన సౌకర్యాలు అనేవి చాల ఉత్తమమయిన సూత్రాలే కాని ఉన్నత వర్గాల వారీ, పాట్రీషియన్ హోదా వారీ, ఆస్తి ముందు అవి నిర్వీర్యమే అయ్యాయి ఆ రోజుల్లో కూడ ప్రత్యేక సౌకర్యాలు గల ఒక వర్గం ఏర్పడడం రోమను సమా జానికి మోయరాని బరువే అయింది

శిశరో గొప్ప దేశభక్తుడు ఉదార హృదయంగలవాడూ కావచ్చు కాని ఆయన ప్రజలను వర్గాలుగా వరుసక్రమంలో ఏర్పరుచటాన్ని, అల్ప సంఖ్యాక ప్రజల మీద అధిక సంఖ్యాకులు ప్రభుత్వంలో పెత్తనం చేయడాన్ని అభినందించాడు " ప్రజా సామాన్యం నుంచి అధిక సంఖ్యలో ఈ క్వైటీలను సెర్వియస్ తుల్లియస్ సృష్టించాడు మిగిలిన వారిని అయిదు వర్గాలుగా విభజించాడు వారిని సీనియర్లూ జూనియర్లుగా విభజించాడు ఈ విధంగా వోట్లు అధికజనంచేతిలో కాకుండా ఆస్తిగలవారి చేతిలో వుండేటట్లు చేశాడు అత్యధిక సంఖ్యాకుల చేతిలో అధికబలం వుండకపోవడం ప్రతి ప్రభుత్వానికి అవసరం అటువంటిదే మనకు వుండేటట్లు ఆయన శ్రద్ధ తీసు కున్నాడు"— అన్నాడు శిశరో శిశరో తర్వాత రెండువేల సంవత్సరాలు గడిచాయి

ఆయన అభినందించిన అసమాన సౌకర్యాలు, స్వయంపాలనా హక్కును రద్దు పరచడం- యివి ప్రజలలో అజ్ఞానాన్ని, అవినీతిని పెంచి పోషించాయి చివరికి ప్రభుత్వాన్ని ప్రజలను కూడ ధ్వంసం చేశాయి సౌకర్యాలుగల వర్గం ఎంత తెలివైనది, సంస్కారం కలది అయినా, వారికన్న ప్రజలే మొత్తంమీద ప్రజాక్షేమాన్ని, దేశాభివృద్ధిని సాధించగల మేధావంతులనే సాధారణమయిన పాఠాన్ని మానవజాతి క్రమంగా నేర్చుకుంటూ వుంది ఎంతో పరిణతి చెందిన సమాజాలలో కూడ ప్రభుత్వాలు యింకా పరివర్తన దశలోనే వున్నాయి అవి యింకా అవసరానుగుణంగా, తర్కబద్ధంగా ముందుకే సాగుతున్నాయి, అన్నారు ప్రెసిడెంటు గ్రాంట్ తన చివరి ప్రారంభో పన్యాసంలో ఆ పురోగమనం ప్రజాతంత్రం వైపు సాగుతున్నదని ఆయన సూచన స్వతంత్రులు, విద్యావంతులు అయిన ప్రజల యోగ్యతా, సగటు తెలివీ వారు రూపొందించే స్వపరిపాలనా ప్రభుత్వంలో ప్రతిబింబిస్తాయి అని ఆయన అన్నారు

ప్రభుత్వ వ్యవస్థకు పునాదిగా వుంటూ వుండిన గణాలయొక్క అధికారాలను మరొక సంస్థకు ఒప్పచెప్పడం ద్వారా వానిని విచ్ఛిన్నంచేసే పనిని ఈ ఆస్తి పర వర్గాలు పూర్తిచేశాయి గణాలు ప్రజలను కలిపి పట్టివుంచిన సంస్థలు వాటినితొలగించి రోము ప్రజలందరిని (బానిసలు మినహా) కలుపుకొన్న కొత్త ప్రభుత్వాన్ని ఏర్పరచడం సెర్వియస్ ప్రధాన లక్ష్యం ఈ పని పూర్తిచేసిన తరువాత ఏథెన్స్‌లో లాగనే వర్గాలు యిక్కడా అంతరించిపోయి వుంటాయి అనుకొంటాము నగరంలోని వార్డులూ, వార్డులోవున్న ప్రజలు రాజకీయంగా సమీకృతమై ఎక్కడికక్కడ నూతన ప్రభుత్వ వ్యవస్థకు పునాది కాగలరు- అనుకుంటాము సహజంగా, న్యాయంగా జరిగేదంతే కాని రోము నగరపు మునిసిపల్ వ్యవస్థ అలా జరుగనివ్వలేదు అది ప్రారంభం నుంచి ప్రభుత్వంలో కేంద్ర స్థానాన్నే సంపాదించి కొనసాగుతూ వినుపుకుంది మిగిలిన ప్రాంతాలన్నీ ఆ కేంద్ర అధికారానికి అధీనం చేయబడినాయి అంటే ఒక కేంద్ర మునిసిపల్ ప్రభుత్వం మొత్తం ఇటలీకి, ఓపరకు మూడు ఖండాలలో జయించిన భాగాలకూ ఆధిపత్యం వహిస్తుంది వోటింగ్ విషయంలో కొద్ది సర్దుబాట్లు చేయడం తప్ప ఈ అయిదు వర్గాలు రిపబ్లిక్ చివరికంటా వున్నాయి పాత దాని స్థానంలో కొత్త ప్రజాసభను ఏర్పరచడం సెర్వియస్ రాజ్యాంగంలోని ముఖ్యాంశం క్రొత్త ప్రజాసభను ఏర్పరచి ఈ వర్గాలకు రాజ్యాధికారం యివ్వకపోతే వీటికి ప్రాణం వుండదు సంపదలూ, జనాభా పెరుగుదలతో ఈ ప్రజాసభ యొక్క బాధ్యతలు కూడ

పెరిగాయి కమిటియా క్యూరియాను అణిచేయడం, దానితోపాటు గణాల అధికారాన్ని తొక్కేయడమే, సెర్వియస్ తుల్లియస్‌యొక్క వుద్దేశ్యమని తెలుస్తూనే వుంది

ఈ శాసనకర్త ప్రతి తెగకు ప్రతివార్డుకు కమిటియా ట్రిబ్యూట అంటూ ఒక ప్రత్యేక సభను ఏర్పరచినట్లు చెప్తారు పన్నులు విధించడం, వసూలుచేయడం, సైన్య దళాలను సమకూర్చడం దీని ప్రధాన బాధ్యత తర్వాత కాలంలో ఈ సభ ప్రజల ట్రిబ్యూన్‌లను ఎన్నుకునేది వారి రాజకీయ వ్యవస్థకు మూలయూనిట్ వార్డు రోమను ప్రజలు ఒక ప్రజాతంత్ర రాజ్యాన్ని ఏర్పరచదలచి వుంటే స్థానిక స్వపరిపాలనాధి కారానికి దానినే కేంద్రంచేసి వుండేవారు కాని సెనేటూ, ఆస్తిపర వర్గాలూ ఆ పని జరుగ నివ్వలేదు జనాభా లెక్కలు తీయడాన్ని సెర్వియసే మొదట ప్రారంభించాడని చెప్తారు వ్యక్తులనుపట్టికాక వారికిగల ఆస్తుల పరిమితులను పట్టి జనాభా లెక్కలు యుద్ధము, శాంతి బాధ్యతలను నిర్వహించవలసిన ఒక మహా సామ్రాజ్యానికి చాలా ముఖ్యమని లివి అంటాడు తన ఆస్తి మొత్తం ఎంతో చెప్తూ ప్రతిమనిషి తాను నివసించే వార్డులో తన పేరు నమోదు చేసుకోవాలి సెన్సార్ వుద్యోగి ఎదుట ఈ పని జరగాలి తరగతులను విభజించడానికి ఈ పట్టిక తోడ్పడుతుంది దీనికి తోడు పట్టణాన్ని నాలుగు వార్డులుగా విభజించడం, వాటికి హద్దులు నిర్ణయించడం, వానికి తగు పేర్లు పెట్టడం ఆ కాలంనాటికి చాల గొప్ప విషయం కాలంరీత్యా, అట్టికాలో క్లిస్తెనెస్ దెమేలను ఏర్పరచడానికి ముందే యిది జరిగింది కాని ప్రభుత్వంతో వానికి గల సంబంధం రీత్యా యివి రెండూ భిన్నమే అత్తికా దెమే ఒకరాజకీయ సంస్థగా ఏర్పరచబడింది అక్కడ ఆస్తిని, పౌరులను కూడ నమోదు చేసుకున్నారు దానికి పూర్తిమైన స్థానిక స్వపరిపాలనాధికారం వుంది మేజిస్ట్రేట్‌లను, న్యాయాధిపతులను, పురోహితులను వారే ఎన్నుకున్నారు రోమనుల వార్డు ఒక భౌగోళిక ప్రాంతం అక్కడ పౌరులు వారి ఆస్తి వివరాలు నమోదు అయినాయి వారికి ఒక స్థానిక నిర్మాణము, ఎన్నుకున్న నదవుల, న్యాయస్థానం, అసెంబ్లీ వున్నాయి కొన్నిప్రత్యేక సందర్భాలలో వార్డుప్రజల వ్యవహారాలను ప్రభుత్వం ప్రాంతీయ సంస్థల ద్వారా నిర్వహిస్తుంది అయితే అత్తికాలో దెమేకున్న లక్షణాలు రోమను వార్డుకు లేవు వెనుకటి అధీనియను మ్యాక్రారీకి అది ప్రతిబింబం సెర్వియస్ తుల్లియస్ రోము చుట్టూవున్న ఏడు మిట్టలను కలిపి చుట్టూ ఒక గోడ కట్టాడు దాని మధ్యనున్న పట్టణాన్ని నాలుగు భాగాలు చేశాడు వానికి ఆ పర్వతాల పేర్లను పెట్టాడు మొదటిది పలాటినా, రెండవది సబుర్రా, మూడవది కాల్లినా, నాలుగవది ఎస్క్వలినా ఈ

విధంగాఅంతకు పూర్వం మూడు భాగాలుగావున్న పట్టణాన్ని నాలుగు భాగాలు చేశాడు ఆ నాలుగు భాగాలలో వున్న ప్రజలను ఎక్కడి వారక్కడే వుండాలని, తిమరున్న చోట తప్ప పన్నులు మరెక్కడా చెల్లించవద్దని మరొక చోట సైనికులుగా పేర్లు యివ్వవద్దని. సైనికాది అవసరాలకై యితరత్రా ఏమీ చెల్లించ వద్దని, ప్రతి ఒక్కరు సమష్టి క్షేమానికి తోడ్పడాలని శాసించాడు యిది వరకటిలాగ మూడు రక్త సంబంధీకుల తెగలను పట్టి యీ విభజన చేయలేదు నాలుగు స్థానిక తెగల ఏర్పాటు ప్రకారమే జరిగాయి ఈ నాలుగో స్థానిక తెగ అతడు ఏర్పరిచినది ప్రతి తెగకు ఫిలార్క్ లేక కోమార్క్ పేర్లతో సైన్యాధిపతులను నియమించాడు వీరు తాము ఏ యింట్లో వుండేది చెప్పమన్నాడు మోమ్‌సెన్ యిలా అంటున్నాడు "ఈ నాలుగు జిల్లాలు మొత్తానికి కావలసిన సైనికబలానికే కాదు, ఆ జిల్లాలలో ఏర్పడే సైన్య దళాలకుకూడ ఖర్చుకై ప్రతి ఒక్కటీ నాలుగోవంతు భాగం చొప్పున యివ్వాలి అప్పుడు ఆ ప్రాంతము, ఆ పెంచరీ తన ప్రాంతం నుంచి సమానసంఖ్యలో సైనికులను కూర్చ గలుగుతుంది దీనివలన గణాలకు సంబంధించిన అంతరాలన్నీ కలిపివేయ బడతాయి ఒకే ప్రజగా సమానమైన లెవీని (నిర్బంధపన్నులు) ఎక్కడికక్కడ యివ్వడానికి విధించాడు సైనికోత్సాహం ప్రభావంతో ఆ సరిహద్దుల మధ్యనున్న పట్టణ ప్రజలను ఒకే ప్రజక్రింద చేశాడు "

అదే విధంగా రోము ప్రభుత్వం క్రింద చుట్టూ వున్న దేశాన్ని పట్టణాలుగా ఏర్పరిచాడు కొందరు యివి 26 అన్నారు కొందరు 31 అన్నారు పట్టణంలోని నాలుగు వార్డులు కలిపితే అది 31 కావచ్చు, 36 కావచ్చు కాని వాటి సంఖ్య ఎప్పుడూ 35కు మించలేదు ఈ పట్టణాలకు ప్రభుత్వ నిర్వహణలో భాగంలేదు

సెర్వియస్ రాజ్యాంగం ప్రకారం ఏర్పరచిన ప్రభుత్వ రూపమే రిపబ్లిక్ వున్నంత కాలం పొడుగునా కొనసాగింది వెనుకటి సైన్యనాయకుల స్థానంలో కాన్సలులు పనిచేశారు యిది అథీనియన్ ప్రభుత్వం లాగకాని, ఆధునికమైన పద్ధతిలోకాని పూర్తిగా భూభాగాల మీదనే ఏర్పడిన ప్రభుత్వం కాదు పట్టణము, వార్డు ఆ ప్రభుత్వ నిర్మాణంలో యూనిటు దాని పైది ఎగ్రాండైజ్‌మెంటు (కొన్ని వార్డుల సమూహము) దానిపైన రాజ్యము- యిందులో ప్రతి యొక్కటి కూడ మొత్తంలో భాగంగా ప్రభుత్వ నిర్వహణాధికారాలకు వీలుగా ఏర్పరచబడి, అధికారాలు యివ్వ బడ్డాయి వీటన్నింటికి పైన కేంద్ర ప్రభుత్వం యిది భూభాగాల మీదకన్న ఆస్తిమీద ఎక్కువ ఆధారపడుతుంది ఆస్తిపర వర్గాలకు ప్రభుత్వాధికారం యివ్వడంలో

దీనిని చూస్తాము అయినా యిది ప్రాంత ప్రాతిపదికను అంగీకరించింది పౌరసత్వానికి ఆర్థిక సైనిక లక్ష్యాలకు ప్రాంత విభజననే గుర్తిస్తూ వుంది వుపయోగిస్తుంది ప్రాంతీయ సంబంధంతోనే పౌరులతో వ్యవహరిస్తుంది

ప్రాంతము, ఆస్తి ప్రాతిపదికగా ఏర్పడిన యిది ప్రభుత్వ నిర్మాణ పథ కాలంలో రెండవది రోమనుల గణ సమాజం నుంచి బయటపడి దీని క్రిందకు వచ్చి వద్దే వారు దీనితో గణ వ్యవస్థను, అనాగరికతను దిగతొక్కి నూతన నాగరిక జీవితంలోకి అడుగుపెట్టారు యిక్కడ నుంచి ఆస్తిని సంపాదించటం, రక్షించటం ప్రభుత్వం యొక్క ప్రధాన లక్ష్యాలయ్యాయి దూర ప్రాంతాల తెగల మీదా, జాతుల మీదా పెత్తనం కోసం దండ యాత్రలు చేయడం దానికి జతపడింది యిది వరలో ప్రాంతము, ఆస్తి అనే వానికి ప్రభుత్వంలో వలకు బడి మాత్రమే వుండేది యిప్పుడు ఆస్తికి ప్రభుత్వంలో అధికారమే లభించింది ఈ విధంగా గణ సమాజానికి భిన్నంగా రాజకీయ సమాజాన్ని సృష్టించడంలో ఈ సంస్థలలో వచ్చిన మార్పు బాగా తేల్పడింది వార్డులకు, గ్రామ ప్రాంతాల పట్టణాలకు పూర్తి అధికారంతో స్థానిక స్వయం పాలనాధికారాన్ని యిచ్చి వుంటేనూ, వర్గ భేదం చూడకుండా ఈ స్థానిక నియోజక వర్గాలనుంచి సెనేటును ఎన్నుకునేట్లు చేస్తేనూ అధీనియన్లలోవలే యిక్కడ కూడా ప్రజాతంత్ర ప్రభుత్వమే ఏర్పడేది స్థానిక ప్రభుత్వాల రాజ్యాన్ని తమకు ప్రతిబింబంగానే తీర్చిదిద్దేది సెనేటుసభ్యత్వానికి వంశపారంపర్యపు హోదాను సృష్టించడం, ప్రజాసభలో వోటింగ్‌కు ఆస్తిని ప్రాతిపదిక చేయడము- దీనివలన ప్రజాతంత్ర సంస్థలు వోటమి తిన్నాయి కులీనత కొంత, ప్రజాతంత్రం కొంత కలిసిన మిశ్రమ ప్రభుత్వం తయారయింది ఆ విధంగా బుద్ధి పూర్వకంగా, అనవసరంగా చట్టంద్వారా రెండు తరగతుల పౌరుల మధ్య శాశ్వత శత్రుత్వం సృష్టించడానికి ఇది వుద్దేశించ బడింది సెర్వియస్ యొక్క రాజ్యాంగము ప్రజలను ప్రక్కకు తోసి వారి పైన ఒక ప్రభుత్వాన్ని ఏర్పరిచింది దాని వలన రాగల ఫలితాలను పూర్తిగా అర్థం చేసుకుని వుండే అధిక భాగం ప్రజలు దానిని నిరాకరించే వారని నా అభిప్రాయం యింతకు పూర్వం వున్నటువంటి గణ సమాజంలోని ప్రజాతంత్ర సూత్రాలు ఆ గణాలకు సంబంధించని వారికి వర్తించక పోయినా వారిలో వారికి పూర్తిగా వర్తించాయి. ఆ విషయమై పూర్తి సాక్ష్యం వుంది ఈ స్వతంత్రతా భావం, ఆ స్వతంత్ర వ్యవస్థ నిర్ణయాత్మకంగా వుండటం చేతనే గణ వ్యవస్థకూ రాజరికానికీ పొత్తు కుదరదని పైన మరొక చోట చెప్పాను

రోమను ప్రభుత్వము చిత్రమైనది రోము నువిసి పాలిటి ప్రభుత్వానికి కేంద్రం అదే దానికున్న విశేష లక్షణాలలో ఒకటి సైని కోత్సాహము గలసైన్యంగా ప్రజలను నిర్మాణ పరచడంలోనే వారిని కలిపి వుంచే శక్తి వచ్చింది రిపబ్లిక్‌ను, తర్వాత సామ్రాజ్యాన్ని కలిపి పట్టి వుంచినది అదే జీవిత పరిమితిగల సెనేటు సభ్యత్వం ఆ వ్యక్తి హోదా వారి పిల్లలకు తర్వాతి తరాలకు కూడ సంక్రమించడం కేంద్రంలోని నగర అవసరాలకు అనుగుణంగా తరతమ భేదాలలో ఎన్నుకున్న మేజిస్ట్రేట్‌లు ఆస్తిపర వర్గాలుగా విభజించిన ప్రజల సభ అసమానమైన వోటు- హక్కు దీనికి చట్టాలను అంగీకరించడానికీ నిరాకరించడానికీ కూడ హక్కు చాల విస్తృతమైన సైనిక నిర్మాణం- యిటువంటి లక్షణాలు గల ప్రభుత్వం అంతవరకు మానవ జాతిలో ఏర్పడలేదు ఇది కృత్రిమ మైనది తర్క విరుద్ధ మైనదీను యించుమించు రాక్షసం అయితే దానికి గల సైనికావేశంతో అసాధారణ విజయాలను సంపాదించింది రోమనులకు గొప్ప నిర్మాణ శక్తి, వ్యవహార నిర్వహణ శక్తి వుండడమే దీనికి కారణం అందరి యొక్క ప్రయోజనాలను, హక్కులను గౌరవిస్తున్నామని నటిస్తూ, వాస్తవ అధికారాన్ని పట్టుకో గోరిన ధనిక వర్గం వారి కుటిల బుద్ధే ఈ ప్రభుత్వ నిర్మాణం అతుకులు బొతుకులుగా వుండడానికి కారణం

నూతన రాజకీయ వ్యవస్థ ఏర్పడగానే పాత వ్యవస్థ రద్దయి పోలేదు సెనేటు యొక్క, సైన్యాధి పతి యొక్క బాధ్యతలు వెనుకటి లాగానే వున్నాయి కాని ఆస్తిపర వర్గాలు గణపభ్యుల పాత్రను వర్గాలతో కూడిన సభ గణ ప్రజల సభస్థానాన్ని తీసుకున్నాయి ఈ మార్పులైతే చాల విశిష్టమైనవే కాని పరిమిత మైనవి ఘర్షణలు, గందరగోళాలు లేకుండ సంభవించాయి వెనుకటి కమిటియా క్యూరియాటాకు కొన్ని హక్కులు మిగిల్చారు అది గణాలు, క్యూరియాలు, రక్త సంబంధీకుల తెగల నిర్మాణాన్ని చాలా కాలంవ కు సజీవంగా వుంచింది ఉన్నతస్థాయి మేజిస్ట్రేట్‌లను ఎన్నుకున్నాక వారిని ధృవపరచే హక్కు దానికే వుంది అయితే కాలక్రమంలో అది నామ మాత్రమే అయింది కొంత మంది పురోహితులను పదవిలో స్థిర పరుచడం, క్యూరియాలు నిర్వహించే మత కర్మకాండను సరిగా జరిపించడం దాని అధీనంలోనే వున్నాయి మొదటి ప్యూనిక్ యుద్ధ కాలం వరకు ఈ పరిస్థితి కొనసాగింది తరువాత కమిటియా క్యూరియాటాకు ప్రాధాన్యం తగ్గి అంతరించింది గణ సభ, క్యూరియాలు కూడ రద్దు చేయబడ్డాయి నిర్వహించవలసిన పనీ పాటా లేక పోవడం చేత అవి అంతరించి పోయాయి గణాలు మాత్రం సామ్రాజ్య కాలంలో కంటా కొనసాగాయి.

అయితే ఒక సంస్థగాకాదు వంశ వృక్ష గణనకూ, పున్నంత వంశ పరిగణనకున్నూ మాత్రమే మిగిలాయి ఆ విధంగా గణ సమాజం నుంచి రాజకీయ సమాజంలోకి మార్పు క్రమంగా, తిరుగులేని విధంగా వచ్చేసింది అనాదిగా కొనసాగిన మొదటి ప్రభుత్వపాలనా రూపంస్థానే రెండవ ప్రభుత్వ పాలనా పద్ధతిని రోమనులు ప్రవేశ పెట్టారు ఆర్యన్ తెగల నుంచి విడిపోయిన లాటిన్ తెగలు తమ ప్రాచీన పురుషుల నుంచి అందుకున్న గణ నిర్మాణం ఎంతో కాలం కొనసాగి రోమనులలో నాగరికత అవసరాలకై ఆత్మార్పణం చేసుకుంది మానవ పురోగతి దశలు ఇన్నింటా సమాజం దాని చేతులలోనే వుంది స్వానుభవంతో నాగరిక లక్షణాలన్నింటినీ అలవర్చుకుంది. యింక సమాజాన్ని నిర్వహించడం దానికి సాధ్యం కాలేదు మానవ జాతిలో పురోగ మిస్తున్న ప్రజలను ఆటవిక యుగం నుంచి అనాగరిక యుగం విభిన్న దశలగుండా నాగరికతలోకి కొని పోగలిగిన ఒక మహత్తరమైన సంస్థను ఏర్పరచ గలిగినందుకై మానవజాతి తన ప్రాచీనులైన ఆటవికులకు కృతజ్ఞత చూపవలసి యుంది తాను ఒక సంస్థగా కొనసాగుతూనే రాజకీయ సమాజాన్ని నిర్మించడానికి అవసరమైన పరిజ్ఞానాన్ని అనుభవం ద్వారా సంపాదించింది మానవజాతి పురోగతి మార్గం మీద దానికి అనన్య సామాన్యమైన ప్రభావం వుంది దాని సాధనలు దాని చరిత్ర కూడ అసాధారణ మైనవి పాలనా పథకం విషయంలో గణ సంస్థ నాగరిక మానవుని అవసరాలకు ఏ మాత్రం తూగదు కాని ఒకటి జ్ఞాపకం వుంచుకోవాలి ఆధునిక నాగరిక రాజ్యాల లోని ప్రధాన ప్రభుత్వ నిర్మాణాల యొక్క బీజాలను అది వృద్ధి పొందించింది ప్రాచీనకాలపు నాయకుల సమితి నుంచి నేటి సెనేటు వుద్భవించిందని, ప్రాచీనకాలపు ప్రజాసభనుంచి నేటి శాసన సభ వచ్చిందని పైన చెప్పాం యివి రెండూ నేటి శాసన నిర్మాణ సభలో భాగాలు పూర్వకాలపు సైనికాధ్యక్షుడినుంచి—ఫ్యూడల్ రాజు అనండి, పట్టబద్ధుడైన రాజు కానీండి, చక్రవర్తి అయినా, అధ్యక్షుడైనా ఏ పేరు పెట్టినా నేటి ప్రధాన కార్య నిర్వహణాధికారి ఏర్పడ్డాడు పూర్వ కాలపు Custos Urbis నుంచి రోమనుల ప్రాయెటర్, నేటి జడ్జి వచ్చారు సమాన హక్కులూ, సమానసౌకర్యాలూ, వ్యక్తిగత స్వాతంత్ర్యమూ ముఖ్యమైన ప్రజాతంత్ర సూత్రాలు యివన్నీ గణాల నుంచి సంక్రమించినవే ప్రజలలో ఆస్తి అనేది సృష్టించబడి దాని ప్రభావం, పలుకు బడి సమాజంలో బలపడిన కొద్దీ బానిసత్వం ప్రవేశించింది ఇది పైన చెప్పిన సూత్రాలన్నింటిని భంగ పరిచే సంస్థే కాని రక్తం రీత్యా పరాయివాడో పట్టుబడిన శత్రువునో బానిసగా చేయ వచ్చుననే స్వార్థ పూరితమైన, భ్రమాత్మకమైన

ఆలోచన దీనిని నిలబెట్టి వుంచింది ఆస్తితో పాటు క్రమంగా కులీనత వచ్చింది. ప్రత్యేక సౌకర్యాలు గల వర్గాలను ఏర్పరచడానికి ప్రయత్నాలు జరిగాయి మానవ పరిణామ క్రమంలో నాగరిక కాలం చాల స్వల్పమే కాని ఆ కాలంలోనే ఆస్తి అనేది సమాజాన్ని చాలా వరకు అధీనంలో పెట్టుకుంది అది మానవ జాతికి నిరంకుశత్వాన్ని, సామ్రాజ్య వాదాన్ని రాజరికాన్ని, ప్రత్యేకహక్కులు గల వర్గాల్ని చివరికి ప్రాతినిధ్య ప్రజాతంత్రాన్ని యిచ్చింది నాగరిక జాతుల యొక్క జీవితాన్ని ఆస్తి సంపాదన పరం చేసింది కాని మానవుని మేధస్సు వుచ్ఛస్థాయికి చేరి ప్రభుత్వానికి ఆస్తికి గల సంబంధాలను, ప్రజలకు ఆస్తికి గల సంబంధాలను మొత్తం మీద ఆస్తికి గల హక్కులను ప్రశ్నించే స్థితికి ఎదిగినప్పుడు ప్రస్తుతం వున్న పరిస్థితులు మారవచ్చు రాబోయే మార్పులు ఎలా వుంటాయో చెప్పటం కష్టం కాని ఒకనాడు బీజరూపంలో వున్న సార్వజనిక ప్రజాతంత్రం మధ్యలో అనేక నాగరిక రాజ్యాలలో అణచివేయ బడుతున్నా, చివరకు అదే సర్వోచ్ఛముగా సర్వత్రా ఏర్పడి తీరుతుంది

ప్రజా తంత్ర సూత్రాల పరిజ్ఞానం పొంది, మానవజాతిలో స్వేచ్ఛ, సమానత్వం, సోదర భావం అనే ఉదాత్త భావాల గొప్పదనాన్ని గ్రహించిన అమెరికను స్వయం పాలనకు, స్వతంత్ర సంస్థలకు ఆమోదం తెలుపగలరు అదే సమయంలో ప్రతి ఒక్కరికి సామ్రాజ్యవాద ప్రభుత్వం కానీయండి, రాజరిక ప్రభుత్వం కానీయండి తన యిష్టం వచ్చిన దానిని ఆమోదించి స్వీకరించే హక్కు అందరికీ సమానంగా వున్నదని గుర్తించాలి

## పదునాలుగవ ప్రకరణం

# స్త్రీ నుంచి పురుషునికి పారంపర్యం మార్పు

ఈ మార్పు ఎలా వచ్చింది ? - ఆస్తి వారసత్వం దీనిని ప్రోత్సహించింది - లిసియన్లలో స్త్రీ పారంపర్యం - క్రీటాన్లలో - ఎట్రూస్కన్లలో - బహుశా సెక్రోప్స కాలంలో ఏథీనియన్లలో కూడ - లోక్రియన్లలో నూరు కుటుంబాలు - వివాహ పద్ధతుల నుంచి సాక్ష్యం - గ్రీకుతెగలలో తురానియన్ రక్త సంబంధ వ్యవస్థ - దనైదే కథ

ఇంకా ఒక అతిముఖ్యమైన విషయాన్ని పరిశీలించ వలసి యుంది గ్రీకు, లాటిన్ తెగలలో పారంపర్యం అతిపురాతన కాలంలో స్త్రీల వైపు నుంచి వున్నట్లు సాక్ష్యం ఏదన్న వున్నదా అనేది ప్రశ్న ఎప్పుడో పూర్వకాలంలో వారి పూర్వంలో ఇది వున్న దనడం సిద్ధాంతరీత్యా సరియైనదే కాని, అంత మాత్రంతో తీరుకోవ డానికి లేదు ఏమంటే పురుష పారంపర్యం ఏర్పడడంతోనే అసలు గణంలో సభ్యత్వమే పూర్తిగా మారిపోతుంది అది ఎందుకు జరిగిందో చూపించడం అవసరం ఈ మార్పు తీసుక రాక తప్పని పరిస్థితి ఏదన్నా వుంటే దానిని చూపించడం కూడ అవసరం సమాజ పరిణామక్రమంలో అటువంటి పరిస్థితి ఏర్పడినప్పుడు ఈ మార్పు తప్పనిసరి అవుతుంది అప్పటికి వారిలో స్త్రీ పారంపర్యం వుండినట్లు ప్రాచీన కాలంనాటి సాక్ష్యాధారాలు చూపించాలి

పురాతన కాలంలో గణానికి ఒక స్త్రీ పునాదిగా వుండేదనీ, ఆమెపిల్లలు ఆమె కూతుళ్ళపిల్లలు అలాగే ఆడవాళ్ళసంతానం గణంలో వుండేదని మనంయిదివరకే తెలుసుకున్నాము. ఆమె కొడుకుల పిల్లలు వారి సంతానము ఆ గణంలో వుండరు అయితే మగవాని నుంచి పారంపర్యం ఏర్పడినపుడు గణానికి ఒక పూర్వ పురుషుడు అతని పిల్లలు వారిలో మగ సంతానం ఆ వరస క్రమంలో గణ సభ్యులుగా వుంటారు.

ఆయన కూతుళ్ళకు వారి పిల్లలకు దానిలో సభ్యత్వం వుండదు అంటే ప్రథమంలో గణంలో సభ్యులు కాని వారికి రెండవ సందర్భంలో వారికే సభ్యత్వం వుంటుంది గణాలను విచ్ఛిన్నం చేయకుండ పారంపర్యాన్ని స్త్రీలనుంచి పురుషులకు ఎలా మార్చ గలిగారు ?

ఈ మార్పు సర్వత్రా అవసరం, అత్యవసరం, ముఖ్యావసరం అయినపుడు అది బహుసున్నితంగా, అతి సహజంగా వచ్చేస్తుంది ఏదో ఒక సమయంలో దృఢమైన మనస్సుతో ఒక నిర్ణయానికి రావచ్చు గణంలో వున్న వారందరు మారనక్కరలేదు ఎలా వున్నవారలాగే వుండవచ్చు కాని ఇకముందు గణంలోని పురుషుల సంతానం గణంలోనే వుంటూ, గణం పేరు పెట్టుకోవాలి స్త్రీల సంతానానికి ఆ హక్కు తీసేయాలి, అంటేచాలు దీనివలన గణ సభ్యులలో రక్తబంధుత్వం కాని, ఆ సంబంధాలు కాని తెగిపోవు, మారవు జరిగేదల్లా, యిది వరకు గణం నుంచి వెలి పెట్టిన వారిని దానిలోకి తీసుకుంటారు గణంలో వుంచుకున్న సంతానాన్ని వెలిపెడతారు దీనిని పరిష్కరించడం కష్టమేనవిపిస్తుంది కాని బలమైన కారణాలుంటే మంతమే కొద్ది తరాలు గడిచేసరికి ఆ మార్పు పూర్తి అయిపోతుంది అమెరికన్ ఆదివాసులలో అనేక సందర్భాలలో స్త్రీ పారంపర్యం నుంచి పురుష పారంపర్యానికి మార్పువచ్చింది వుదాహరణకి ఓజిబ్వాలలో పురుష పారంపర్యం వుంది వారి జ్ఞాతులైన డెలావరేలు మోహెగన్‌లలో యింకా స్త్రీ పారంపర్యమే కొనసాగుతూంది అంటే అల్గోన్‌క్విన్ కుటుంబాలన్నింటా మొదట్లో స్త్రీ పారంపర్యమే వుండేది - అనుకోవాలి

స్త్రీ పారంపర్యమే అతి ప్రాచీనము ప్రాచీన సమాజం యొక్క ఆదిమ కాల పరిస్థితులకు అది అనుగుణం అందుచేత గ్రీకు, లాటిన్ తెగలలో ప్రాచీన కాలంలో అదే కొనసాగేది - అనుకోవాలి పైగా ఒక ప్రాచీన రూపం సమాజంలో సంక్రమిస్తూ వస్తుందని తెలుసుకొని, స్పష్టం చేసుకున్నాక అదే మరో అభివృద్ధిని పొందిన రూపంలో మొదట్నించీ వుండేదనుకోవడం అసాధ్యం

స్త్రీ పారంపర్యం నుంచి పురుష పారంపర్యానికి మార్పు వచ్చింది అనేటట్లయితే చరిత్ర కాలానికి కొద్ది పూర్వమే అది జరిగి వుండాలి అనాగరిక యుగం వడిమి దశ నాటి వారి చరిత్ర బొత్తిగా తెలియకుండా పోయింది కొద్దిగా కళలు, ఆచారాలు, కల్పనలు భాషలో మెరుగులలో మాత్రమే ఆనాటి చరిత్ర కన్పిస్తూంది సంప్రదాయాన్ని నష్టి, రోమను కావ్యాల్ని వట్టి, అనాగరిక యుగం ఎగువ దశలో వారు పొందిన అనుభవాలను, అప్పుడు సాధించిన అభివృద్ధిని తెలుసుకుంటున్నాం వారి

సంప్రదాయాలను పట్టి ఆలోచిస్తే కనీసం పెలాస్గియన్, గ్రీషియన్ తెగలు అనాగరిక యుగం ఎగువ దశలో అడుగుపెట్టిన నాటికి వారిలో స్త్రీ పారంపర్యం పూర్తిగా అదృశ్యం కాలేదని తోస్తున్నది

గ్రీషియన్, లాటిన్ గణాలలో స్త్రీ పారంపర్యం కొనసాగినపుడు గణం లక్షణాలు యిలా వుండేవి (1) గణంలో వివాహం నిషిద్ధం అంటే మగవాని సంతానం మరొక గణంలో వుంటుంది (2) ఆస్తి, నాయక పదవీ గణంలో పారంపర్యంగా వుంటాయి అంటే తండ్రికి వున్న పదవిగాని, ఆస్తిగాని అతని పిల్లలకు వారసత్వంగా వుండదు పరిస్థితులు మారి పైన చెప్పిన నిషేధాలు అన్యాయమని అందరూ అంగీకరించే స్థితి ఏర్పడే వరకు ఇదే కొనసాగుతుంది

దీనికి సహజమైన పరిష్కారం పారంపర్యాన్ని స్త్రీ నుంచి పురుషుడికి మార్చడమే. ఆ మార్పుకు కావలసినదల్లా తగినంత కారణం పెంపుడు జంతువులను మందలు మందలుగా పెంచడం వచ్చాక, జీవనాధారానికి మూలమూ వ్యక్తిగత ఆస్తి విస్తరించాయి వ్యవసాయం కూడ వచ్చాక, యిళ్ళు, భూములు విభజన జరుగసాగాయి యివి గణంలో అప్పటికి అమలు జరుగుతున్న వారసత్వానికి వ్యతిరేకం ఏమంటే వాని యజమానియొక్క సంతానానికి వానిమీద హక్కు నిరాకరించ బడుతుంది అతని పిల్లలెవరో స్పష్టం అయిందికాని అతని ఆస్తి గణంలోని రక్త బంధువులకు పోతుంది ఆ విధంగా వారసత్వ నిబంధన మీద పేచీ వచ్చింది దానిలో తండ్రులు కొడుకులు కూడ ఒక పక్షాన చేరుతారు మార్పు తీసుకు రావడానికి ఇది బలమైన కారణమే ఆస్తులు పోగు పడడమూ, అవి ఒక స్థిరమైన రూపాన్ని తీసుకోవడమూ, వానిమీద వ్యక్తుల అధికారం అధికం కావడమూతో స్త్రీ పారంపర్యం తొలగి పురుష పారంపర్యాన్ని ఏర్పరచ వలసి వచ్చింది దీని వలన గణంలో వారసత్వ ఆధారం ఎప్పటిలాగే వుంటుంది కాని తండ్రి యొక్క గణంలోకి అతని పిల్లలను మారుస్తారు పురుష పారంపర్యంలో బంధువులందరికి అతడు పెద్ద తల అవుతాడు కొంత కాలం పాటు ఆస్తిని మిగిలిన జ్ఞాతులందరితో కొడుకులకూ పంచడం జరిగి వుంటుంది కాని ఇతర గణ సభ్యులను తప్పించి జ్ఞాతులకు మాత్రమే వారసత్వ సూత్రం వర్తించేటట్లు చేశాక జ్ఞాతులను తప్పించి కేవలం సంతానానికి మాత్రమే వారసత్వం లభించేటట్లు చేయడం సహజం అంతేకాదు తండ్రి యొక్క పదవికి కొడుకు వారసుడవడం కూడ ఈ వరసలోనే వస్తుంది.

సొలోను కాలంలోనో, కొద్దితరువాతనో అథీనియను గణాలలో వచ్చిన వారసత్వపు నియమం అది ఆస్తి కొడుకులందరికి సమానంగా వెడుతుంది అయితే కూతుళ్ళ పోషణ భారం, వివాహాలలో వారికి కొంత యివ్వడం ఒక బాధ్యత కొడుకులు లేకపోతే కూతుళ్ళే సమానంగా పంచుకుంటారు పిల్లలు లేకపోతే జ్ఞాతులది వారసత్వం వాళ్ళూ లేకపోతే గణ సభ్యులది పన్నెండు పట్టికల రోమను చట్టం కూడ కొంచెం యించు మించుగా యిదే

బహుశా పురుష పారంపర్యం వచ్చాకనో అంతకు ముందేనో గణాలకు వున్న జంతువుల పేర్లను తొలగించి, వాటికి బదులు వ్యక్తుల పేర్లతో పిలవడం ప్రారంభమయింది సమాజం అభివృద్ధి పొంది ఆస్తి పెరిగి వ్యక్తి యాజమాన్యంలోకి వచ్చిన కొద్దీ వ్యక్తుల ప్రత్యేకత స్థిరపడుతూ, గణాలకు ఒక వ్యక్తిని పూర్వ పురుషునిగా నిర్ణయించడం వారి పేరున గణాన్ని పిలవడం జరిగి వుంటుంది గణ సభ్యుల సంఖ్య పెరిగి అవి విడబడుతూ పెరిగి వుండవచ్చు కొన్ని శాఖలు అంతరించి పోవచ్చు అయినా గణాలలో వంశవృక్షం కనీసం కొన్ని వందల యేళ్ళ పూర్వం వరకు కనిపిస్తూనే వుంటుంది ఆ పూర్వ పురుషుణ్ణి విశ్వయించుకున్న కొంతకాలం పోయాక మరొకరి పేరుతో పిలుచుకోవటం- గణ చరిత్రలో ప్రసిద్ధి కెక్కిన వ్యక్తి ఆ స్థానానికి మార్చటం, కాలం గడిచి ఆ వ్యక్తి పేరుకూడ మరుగున పడినప్పుడు మరొకరిని నిర్ణయించడం జరుగుతూనే వుంటుంది ప్రసిద్ధి కెక్కిన గ్రీకు గణాలు ఎంతో సున్నితంగా తమ పేర్లు మార్చుకోవటం కన్పిస్తుంది ఆ పూర్వ పురుషుని తల్లిపేరు అట్టే వుంచుతారు ఆమెకు ఏదో ఒక దేముడినుంచి పుట్టిన వ్యక్తి పేరున గణాన్ని పిలుస్తారు అత్తికా తెగ యూమోల్ పిదేల గణం యొక్క పూర్వ పురుషుడు యూమోల్పస్ ఈయన నెప్ట్యూన్ దేవతకూ కిమోనెకు కలిగిన సంతానం అంటారు విటానికి నెప్ట్యూన్ దేవుడు అనే భావం ఏర్పడక పూర్వంనుంచీ గ్రీకులలో గణాలున్నాయి మరి

గ్రీకు, లాటిన్ గణాలలో పురాతన కాలంనాడు స్త్రీ పారంపర్యం వున్న దనడానికి ప్రత్యక్ష సాక్ష్యం లేక పోయినా, దానిని తోసేయడానికి వీలులేదు గ్రీకులకు అతి సన్నిహితులైన కొన్ని తెగలలో ఈ పారంపర్యం కొన సాగుతూవుంది కొన్ని గ్రీకు తెగలలో దీని ఛాయలు వున్నాయి

హెరోడోటస్ మంచి పరిశీలనా దృష్టికలవాడు జిజ్ఞాసువున్నూ లిసియనులు పెలాస్గియన్ కుదురులోని వారు కాని గ్రీషియన్‌లతో అనుబంధం వుంది తన కాలం

నాటికి (క్రీ పూ 440) వీరిలో స్త్రీ పారంపర్యం కొనసాగుతూవుంది—అని గమనించాడు లిసియనులు క్రీట్ నుంచి వచ్చారని సర్పెడాన్ నాయకత్వం క్రింద లిసియాకు వలస వచ్చారని చెప్తూ "వారి ఆచారాలు కొంతభాగం క్రీట్‌వి, కొంతభాగం రియావి కాని ప్రపంచంలో ఏ జాతిలోనూలేని ఒక చిత్రమైన ఆచారం వారిలో వుంది ఏ లిసియన్‌ను అయినా నువ్వు ఎవరివి? అంటే అతడు తన పేరు, తన తల్లి పేరు, అమ్మమ్మ పేరు అలాగే చెప్పుకుపోతాడు ఇంకా, స్వతంత్రురాలైన ఒక స్త్రీ, ఒక బానిస వానిని పెళ్ళి చేసుకుంటే వారి సంతానం స్వతంత్ర పౌరులుగానే వుంటారు కాని ఒక స్వతంత్రుడైన మగవాడు విదేశీయురాలిని పెళ్ళిచేసుకున్నా, ఉంపుడు కత్తెతో జీవించినా - అతడు ఆ రాజ్యంలోని అతిప్రధాన వ్యక్తి అయినప్పటికి అతని సంతానానికి పౌరహక్కులుండవు" దీనిని పట్టి లిసియనులు గణాలుగా ఏర్పడ్డారని, గణాలలో అంతర్వివాహము నిషిద్ధమని, స్త్రీ యొక్క సంతానం ఆమె గణానికే చెందుతారని ఊహించ వలసి వస్తుంది యిది అతిప్రాచీనమైన గణ రూపానికి వుదాహరణ లిసియన్ మగవాడు ఒక విదేశీయురాలిని పెళ్ళి చేసుకుంటేనూ, ఒక లిసియన్ స్త్రీ బానిసను పెళ్ళిచేసుకుంటేనూ కలుగుతాయి అని చెప్పిన ఫలితాలు దానినే ధృవపరుస్తున్నాయి సెనెకా – ఇరాక్వ్యూ మగవాడు ఒక విజాతీయ స్త్రీని పెళ్ళాడితే వారి పిల్లలు విజాతీయులే అవుతారు కాని, సెనెకా – యిరాక్వ్యూ స్త్రీ ఒక విదేశీయుడినో ఒనందాగా తెగ వానినో పెళ్ళాడినా వారి పిల్లలు సెనెకా తెగకు చెందిన, యిరాక్వ్యూలే అవుతారు వారు తల్లి యొక్క గణానికి, ఫ్రాట్రీకి చెందుతారు తండ్రి ఎవడైనా తల్లి యొక్క జాతి, గణమే పిల్లలకూ వస్తుంది క్రీట్ ద్వీపంలోని ఆదివాసులు పెలాస్గియన్ కుదురుకు చెందినవారు హెల్లెనిక్ గణాలవారు వారిది సెమైట్ తెగ అక్కడే స్థానికంగా వేరేవేరే నివసిస్తూవున్న వాళ్ళు సర్పెడాన్ సోదరుడైన మినోస్‌ను క్రీట్‌లోని పెలాసియనుల నాయకుడుగా చెప్తారు కాని హెరిడోటస్ కాలంనాటికే లిసియనులు హెలెన్ (గ్రీకు) వారయిపోయారు ఆసియాలోని గ్రీకులలో బాగా అభివృద్ధిపొందిన వారుగా పేరుపొందారు ఏనాడో లిసియాకు వలసపోయేనాటికి ముందే వారు క్రీట్‌లో వుండేవారు అనడానికి స్త్రీ పారంపర్యం చాలకాలం తర్వాత కూడ వారితో కొనసాగుతుండడమే సాక్ష్యమని చెప్పవచ్చు

ఎట్రూస్కన్‌లలో కూడ యిదే పారంపర్య నియమం కొనసాగుతూంది "ఆసియా మైనరులోని కొనియన్‌లలోను, లిసియన్‌లలోను హెరిడోటస్‌కు కనిపించినటు వంటివే రెండు ఆచారాలు ఎట్రూస్కన్‌లలో వున్నట్టు కొన్ని చిహ్నాలను పట్టి

తెలుస్తుంది ఎట్రూస్కన్‌లు తమ కుటుంబాన్ని గురించీ, తల్లిదండ్రులను గురించీ చెప్పేటపుడు తప్పకుండ తల్లినే పేర్కొంటారు, తండ్రి పేరెత్తరు ఇనొకటి విందులకూ, వినోదాలకూ వారి భార్యలను కూడ తీసుకొస్తారు యిది రెండవది" అన్నాడు క్రేమర్

లిసియనులలో, ఎట్రూస్కన్‌లలో, క్రీటానులలో స్త్రీ పారంపర్యం వున్నదని కర్టియస్ వ్రాశాడు "ఈ అలవాటు స్త్రీలను గౌరవించడంగా భావించడం తప్పు సమాజంలోని అతిప్రాచీన ఆచారాలలో యిది పాతుకొని వుంది సంతానాన్ని తండ్రి వైపునుంచి నిశ్చితంగా పరిగణించ గలిగేటట్లు దంపతీ వివాహవ్యవస్థ దృఢపడివుండని నాటి ఆచారమది లిసియన్ జాతివుండే ప్రదేశానికి వెలుపల కూడ ఈ అలవాటు కొనసాగుతూంది ఈ నాటికీ అది ఇండియాలో వుంది. ప్రాచీనకాలపు ఈజిప్షియన్‌ల్లో వుండినట్లు సాక్ష్యం చూపించవచ్చు స్వాతంత్ర్యం హెచ్చుగా వుండడం వలన ఈ ఆచారం వచ్చిందని శాంకోనియాథాన్ చెప్పాడు లిసియనులకు అతి సన్నిహితులయిన క్రీట్ వాసులలోను, ఎట్రూస్కన్‌లలోను ఈ ఆచారం కన్పిస్తూంది లిసియనులు క్రీటును తమ మాతృభూమిగా చెప్పుకుంటారు ఇది థీబియనులలోనూ వుంది హెరొడోటస్ ఈ ఆచారాన్ని లిసియనులకు ప్రత్యేకించి చెప్పాడంటే గ్రీకు జాతులలో కెల్ల వారిలోనే చాలకాలం కొనసాగింది అని చెప్పాలి లిసియనుల శాసనాలను పట్టి కూడ అదే రుజువవుతూంది తమ పారంపర్యాన్ని తల్లివైపు నుంచి చెప్తున్నారంటే కారణం సామాజికజీవితము, కుటుంబనియమాలు, అస్థిరంగావున్న పరిస్థితులఅవశేషాలు మాత్రమే జీవితం ఒకమార్గాన పడినకొద్దీ వెనుకటి అలవాట్లను విడిచిపెట్టి సంతానాన్ని తండ్రిపేరున పిలవడం గ్రీకులలో సర్వ సామాన్యం అయింది ఆచారాలలో వున్న ఈ భేదం ప్రాచీన నాగరికత చరిత్రకు ఎంతో ముఖ్యం ఇటీవలనే బాకోఫెన్ దీనిని చర్చించాడు" అన్నారు ఆయన. ఎటియోక్రీటుల నాయకుడు మినోస్ వీరు కూడ పెలాస్గియన్‌లలో భాగమే క్రీట్ ద్వీపంయొక్క తూర్పుకొసన వీరుండేవారు మినోస్ సోదరుడైన సర్పెడాన్ వలసపోయిన వారిని లిసియాకు తీసికెళ్ళాడు వారు అక్కడ నుంచి సోలిమీ తెగనువెట్టి వేశారు ఈ సోలిమీలు బహుశా సెమిటిక్ తెగ వారే అయి వుంటారు ఇతర పెలాస్గియన్ తెగల మాదిరిగానే లిసియన్‌లు కూడ హెరొడోటస్ కాలానికి పూర్వమే గ్రీకులతో కలిసిపోయారు గ్రీకులు, పెలాస్గియన్లు ఒకే కుదురు నుంచి వచ్చి వుంటారనటానికి ఇదొక సాక్ష్యం యూరపులోని గ్రీకుల అంతగానూ లిసియనులుకూడ హెరొడోటస్ కాలంనాటికే జీవితకళలలో పురోగమించారు వారిలో

వున్న స్త్రీ పారంపర్య ఆచారం వారి పూర్వులైన పెలాస్గియనుల నుంచే సంక్రమించి వుండాలి విభిన్నములైన ఈ ఆచారాలను పురాతన నాగరికత చరిత్రలో చాల ముఖ్యమైనవి ఇటీవలనే బాకోఫెన్ వాటిని చర్చించారు

బాకోఫెన్ అపారమైన పరిశోధన చేసి లిసియనులలో, అథీనియన్‌లలో, లెమేనీయన్‌లలో, ఈజిప్షియన్‌లలో ఆర్కొమెనియన్‌లలో, లోక్రియన్‌లలో, లెస్బియన్‌లలో, మాంటినియన్‌లలో, తూర్పుఆసియాలోని అనేక జాతులలో తల్లిహక్కు స్త్రీల యాజమాన్యమూ వున్నదని సాక్ష్యంసమీకరించారు ప్రాచీనసమాజంలో ఈ పరిస్థితికి మూలంగణం అతిప్రాచీన రూపంలో వుండడమే, అందువలన తల్లీ పిల్లలూ ఒకేగణంలో వుంటారు గణం ప్రాతిపదికమీద ఏర్పడిన సామూహిక గృహంలో పెత్తనం ఆ స్త్రీల గణానిదే అవుతుంది ఆనాటికి సిండియాస్మియన్ (జంట) కుటుంబం ఏర్పడి వుండవచ్చు కాని స్త్రీ పురుష సంబంధాలలో అంతకు పూర్వంనాటి అలవాట్లు కొనసాగుతూనే వుండి వుంటాయి అటువంటి కుటుంబంలో ఆ జంటా, వారిపిల్లలూ తమతో రక్తసంబంధం వున్న కుటుంబాల రక్షణ కోరడమూ, సామూహిక గృహాలలో అదే గణానికి చెందిన అనేకమంది తల్లులు వారి పిల్లలు వుండడమూ జరుగుతుంది ఆ పిల్లల తండ్రులు ఎవరో తెలుసును కాని వారు మరో గణంలోనే వుంటారు సమష్టి భూములూ, వుమ్మడి వ్యవసాయం వున్న చోట సమష్టి నివాస గృహాలు, కమ్యూనిజం పద్ధతిలో జీవితమూ ఏర్పడతాయి ఆ విధంగా స్త్రీల పెత్తనం (Gyneocracy) ఏర్పడాలంటే స్త్రీ పారంపర్యం కొనసాగుతూ వుండి వుండాలి పెద్ద పెద్ద నివాస గృహాలలో వుంటూ, సమష్టి సంబారాలనుంచి భక్ష్యం పొందుతూ వుండే స్త్రీలు తమ గణంలో అధిక సంఖ్యలో వుండినప్పుడు తల్లిహక్కు, స్త్రీల పెత్తనం వంటివి వస్తాయి చరిత్ర సంప్రదాయాల సాయంతో బాకోఫెన్ వీటిని కనుక్కొన్నారు స్త్రీ పారంపర్యం నుంచి పురుష పారంపర్యానికి మార్పు రావడమూ, సమష్టి గృహ నివాసాన్ని రద్దు పరచిన దంపతీ కుటుంబం ఏర్పడడమూతో స్త్రీల పరిస్థితి దిగజారిందని చెప్పాను శుద్ధ గణసమాజంలోనే భార్యను తల్లిని ఆమె గణ బంధువుల నుంచి వేరుచేసి ఒకే యింట్లో వుంచడం జరిగింది

గ్రీషియన్ తెగలు అనాగరిక యుగం ఎగువదశకు చేరుకునేంత వరకు వారిలో దంపతీ కుటుంబం ఏర్పడి వుండదు ఈ కాలంలో అథీనియను తెగలలో స్త్రీ

పురుష సంబంధాలు చాల గందరగోళంగా వున్నాయి "సెక్రోప్స్‌కి పూర్వం పిల్లలకు తల్లి మాత్రమే వుంది తండ్రి ఎవరో తెలియదు తల్లీ, పిల్లలది ఒకే పారంపర్యం ఏ ఒక్క మగవానితోను సంబంధం లేకుండ స్త్రీలు యదేచ్ఛగా పిల్లలను కనేవారు ఈ పరిస్థితిని మొట్ట మొదట తుదముట్టించనది సెక్రోప్స్ స్త్రీ పురుష సంబంధాలలో యదేచ్ఛను తొలగించి వానిని పెళ్ళికి అనుబంధించారు ఆయన పిల్లలకు తండ్రిని, తల్లిని యిచ్చారు ఆ విధంగా వారికి ఒక పారంపర్యం బదులు రెండింటిని సమకూర్చారు" అంటూ బాకోఫెన్ వ్రాశాడు యిక్కడ స్త్రీ పురుష సంబంధాలలో యదేచ్ఛ అనే మాటకు కొద్ది సర్దుబాట్లు అవసరం ఆనాటికి సిందియాస్మియన్ కుటుంబ పద్ధతి ప్రారంభమయినా, అంతకు పూర్వం వుండిన స్త్రీ పురుష వ్యవస్థ గుంపు పెళ్ళిళ్ళనుంచి వచ్చినది )అవశేషాలు కొనసాగుతూ వుండి వుంటాయి పైన చెప్పిన మానవదశను చేరుకోక పూర్వమే పునలాన్ కుటుంబ పద్ధతి రద్దు అయినట్లు పై మాటలు తెలుపుతున్నాయి కుటుంబంయొక్క అభివృద్ధిని గురించి ముందు ముందు వ్రాయబోయే ప్రకరణంలో ఈ విషయాన్ని వివరిస్తాను

ఇటలీలోని లోక్రియనుల నూరు కుటుంబాలను గురించి చాల ఆసక్తి కరమైన విషయాన్ని పోలిబియస్ వ్రాశాడు "తిమాయియెస్ చెప్పిన దానితో కన్న అరిస్టాటిల్ చెప్పిన దానితో మా సంప్రదాయాలు బాగా కలుస్తున్నాయని లోక్రియనులే నాతో చెప్పారు వారు యిందుకు చూపించిన సాక్ష్యాలు యివి (1) తమ ప్రాచీనులలో కులీనత స్త్రీల నుంచి సంక్రమించింది పురుషులనుంచి కాదు నూరు కుటుంబాలలో తమ మూలాన్ని చెప్ప గలిగిన వారే కులీనులు లోక్రియన్లు వలస పోవడానికి పూర్వం వారిలోని వున్నత కుటుంబాల వారు వీరే వీరికుటుంబాల నుంచి నూరు మంది కన్యలను లాటరీ ద్వారా ఏది దివ్యవాణి చెప్పిన విధంగా ట్రాయ్ నగరానికి పంపించారు" పైన చెప్పిన వున్నతుడు, కులీనుడు అన్న శబ్దం గణ నాయక పదవిని వుద్దేశించినదై వుంటుంది గణంలో ఒక కుటుంబంలోని ఒకరి విషయంలో ఆమాట వుపయోగంలోకి వచ్చి వుంటుంది అదే సరియైనదైతే మనుష్యులు, పదవులు కూడ స్త్రీ పారంపర్యంలోనే కొన సాగుతున్నా యనుకోవాలి ప్రాచీన కాలంలో నాయక పదవి గణానికే పారం పర్యం దానిలోని మగవాళ్ళను అందుకు ఎన్నుకునేవారు స్త్రీ పారంపర్యం వున్నచోట అది సోదరుడి నుంచి సోదరుడికి, మేనమామ నుంచి మేనల్లుడికి సంక్రమిస్తుంది ఏవిధంగా ఎవరికి సంక్రమించినా పదవి స్త్రీల ద్వారానే అందుతుంది తల్లి యొక్క గణాన్ని పట్టే అందుకు అర్హత లభిస్తుంది చనిపోయిన నాయకుని

స్థానాన్ని భర్తీచేయాలంటే ఆ గణంతో అతనికి వుండవలసిన సంబంధం తల్లి ద్వారానే ఈ విధంగా స్త్రీల ద్వారా పదవీ, హోదా సంక్రమించడం స్త్రీ పారం పర్యం వుంటేనే

సాంప్రదాయక కాలం నాటి వివాహాలను పట్టి గ్రీషియన్ తెగలలో స్త్రీ పారం పర్యం వుండినదని తెలుసుకోవచ్చు సల్మోనియను, క్రెథియస్ అన్నదమ్ములు వీరు ఎయోలస్ కొడుకులు వీరిలో సల్మోనియను తన కూతురు టైరోను, ఆమె పిన తండ్రికిచ్చి పెళ్ళి చేశాడు పురుష పారంపర్యం వుంటే క్రెథియను, టైరోయిద్దరూ ఒకే గణం వారవుతారు అందుచేత వారి మధ్య వివాహం నిషిద్ధం కాని అదే స్త్రీ పారం పర్యం అయితే వేరు వేరు గణాలకు చెందుతారు వారి మధ్య గణ బంధుత్వం వుండదు గణంలోని అలవాట్ల ప్రకారం వారి వివాహం తప్పుకాదు పైన చెప్పిన వ్యక్తులంతా పురాణ కథల్లో వారే కాని ఆ కథ గణాల అలవాట్లను స్పష్టంగా చూపి స్తుంది ఈ కథను పట్టి స్త్రీ పారంపర్యం వుంది కనుకనే ఈ వివాహం జరిగిందన గలం ఈ పారంపర్యం ఆ కథాకాలం నాటికి వుంది అనవచ్చు లేదా ప్రాచీనకాలపు వివాహపుటలవాట్లు పూర్తిగా మాసిపోలేదనవచ్చు

పురుష పారంపర్యంలోకి మార్పు వచ్చిన చారిత్రక కాలంలో కూడ ఈ ప్రాచీన పద్ధతి కొనసాగింది అది గణాలలోని హక్కులను అతిక్రమించదపే సొలోన్ కాలం నాటికి మగవాడు వేరు ఎడిచిన మారుటి చెల్లెలిని (తల్లి వేరొకరైతే) వివాహమాడ వచ్చు (స్త్రీ అలా పెళ్ళి చేసుకోకూడదు) స్త్రీ పారంపర్యం వున్న చోట వారు వేరు వేరు గణాల వారవుతారు అప్పుడు వారి వివాహం గణం యొక్క హక్కులకు వ్యతిరేకం కాదు పైన చెప్పిన సందర్భంలో పురుష పారంపర్యం వచ్చేసింది అందు చేత వారు ఒకే గణం వారవుతారు అది నిషిద్ధం సైమన్ తన వేలు విడిచిన చెల్లెలు హెల్పానికేసును పెళ్ళి చేసుకున్నాడు వారి తండ్రి ఒకడే, కాని తల్లులు మాత్రం వేరు డెమాస్తనీసు వ్రాసిన యూబులిడెలో యిలాంటిదే ఒకటుంది "మా తాత తన చెల్లెలిని పెళ్ళి చేసుకున్నాడు వారిద్దరి తల్లులు ఒకరుకాదు" అన్నాడట యూథియస్. సొలోన్ కాలం నాటికే అథీనియనులు అటువంటి వివాహాలను వ్యతిరేకిస్తున్నారు కాని జరుగుతున్నాయీ అంటే వివాహాల విషయంలో ప్రాచీనాచారం ఇంకా కొన సాగు తూందన్న మాట స్త్రీ పారంపర్యం వున్నప్పటిది ఆ ఆచారం డెమాస్తనీసు కాలం నాటికి ఆ ఆచారం పూర్తిగా అంతరించలేదు స్త్రీ పారంపర్యం వున్నప్పుడే గణం పేరున వంశక్రమం చెప్పు కుంటారు అప్టేరిలియాతో సహా అయిదు ఖండాలలో గణ

పావులర్ షా మార్టు
గ్రూపు సంస్థలు

నిర్మాణం పూర్వం ఎలా వుందో యిప్పుడెలా వుందో మనకుతెల్సు చరిత్ర కాలంనాటికి స్త్రీ పారంపర్యంఛాయలు వున్న ప్రాచీన గణ వ్యవస్థ లేక పోవచ్చు అది అలవాటులో లేక పోయినా సంప్రదాయాల్లో మిగిలే వుంటుంది అందుచేత లిసియన్‌లు, క్రీటాన్‌లు అథీనియన్‌లు, లోక్రియన్‌లు ఈ స్త్రీ పారంపర్యపు అలవాటును కల్పించారనుకో నక్కరలేదు లాటిన్ గ్రీషియన్, గ్రీకో– ఇటాలియన్ గణాలలో యిది ప్రాచీనా చారము—అంటే న్యాయంగా వుంటుంది ఆ ఘటనలకు సమాధానమూ దొరుకుతుంది ఆస్తి యొక్క ప్రభావమూ, దానిని తన సంతానానికి సంక్రమింప చేయాలనే కోరికా పురుష పారంపర్యంలోకి మార్పు రావడానికి కారణం అయ్యాయి

సొలోన్ కాలంలోనూ - తరువాతనూ కూడ వివాహమైన తరువాత స్త్రీని భర్త ఫ్రాట్రీలో నమోదు చేయడంవచ్చింది అలాగే వారి కొడుకులనూ, కూతుళ్ళనూ తండ్రియొక్క గణంలో నమోదుచేయడం వచ్చింది దీనిని పట్టి అథీనియనులు గణం వెలుపలనే వివాహ మాడటం ఒక నియమంగా వుంది అనుకోవచ్చు గణంలో సభ్యులు రక్త బంధుత్వం కలవారవుతారు కనుక వారి మధ్య వివాహం జరుగ కూడదు—అనేది గణం యొక్క ప్రధాన నియమం గణంలో సభ్యుల సంఖ్య ఎక్కువ వుండదు సొలోన్ కాలంనాడు పేర్లు నమోదు చేసుకున్న అథీనియన్ల సంఖ్య అరవయి వేలు అనుకుంటే వారిలో వున్న మూడు వందల అరవయి గణా లలో సగటున గణానికి నూట అరవయి మంది వుంటారు గణం అన్నది బంధువుల పెద్ద కుటుంబం వాగందరిదీ ఒకే రకం మత కర్మకాండ, శ్మశానం ఒక్కటే భూములు సాధారణంగా వుమ్మడిగా వుంటాయి, సిద్ధాంత రీత్యా గణంలో అంతర్వివాహాన్ని అంగీక రించరు పురుష పారంపర్యానికి మార్పు వచ్చి దంపతీ వివాహం అమలులోకి వచ్చి పిల్లలకు వారసత్వపు హక్కు ఏర్పడడం, ఆస్తులకు వారసురాళ్ళు ఏర్పడడంతో గణంతో నిమిత్తం లేకుండ యిష్టానుసారం పెళ్ళిళ్ళు చేసుకోవడం క్రమంగా ప్రారంభమయింది విషేధం మరీ దగ్గర బంధుత్వాలకు మాత్రమే పరిమితమయింది మానవ కుటుంబంలో వివాహాలు మొదట గుంపుల మధ్య ప్రారంభమయ్యాయి పిల్లలను మినహాయించి స్త్రీ పురుషులంతా వుమ్మడిగా భార్యలూ భర్తలూను అయితే వారు భిన్న గణాలకు చెందిన వారయి వుంటారు అది చివరకు ఒక స్త్రీ పురుషుడు మాత్రమే జంట కలిపే వివాహాలంలోకి వచ్చింది వచ్చే ప్రకరణాలలో వివిధ వివాహ రూపాలను ప్రారంభం నుంచి చివరి కంటూ వచ్చిన కుటుంబ రూపాలను వివరిస్తాను

గణంలోఎల రక్త సంబంధ వ్యవస్థ వుండింది దీనిని ఆసియాలో తురానియన్ వ్యవస్థ అని, అమెరికాలో గనొవానియన్ వ్యవస్థ అని అంటారు ఈ రక్తసంబంధం సోదరీ సోదరుల మధ్యనేకాక వారి దగ్గర వారివరకు అంతర్వివాహాన్ని నిషేధించింది అన్నదమ్ములకే కాక జ్ఞాతిగోత్ర బంధువుల కూడ ఈ నిషేధంలోకి వచ్చారు ఆసియా ఆఫ్రికా, ఆస్ట్రేలియాలలో కొన్ని భాగాలలోను, అమెరికాలోని ఆదివాసులలోను ఈ ఆచారమే యిప్పటికీ వుంది అతి ప్రాచీన కాలంలో ఈ ఆచారం గ్రీకు, లాటిన్ తెగలలోను వుండేది చరిత్ర దశ వరకూ దాని ఛాయలు మిగిలి వున్నాయి ఆసియా లోని తురానియన్ బంధుత్వ వ్యవస్థ యొక్క ఒక లక్షణం చూపిస్తాను అన్నదమ్ముల పిల్లలు సోదరీ సోదరులవుతారు అలాగే అక్క చెల్లెళ్ళ పిల్లలూను అందుచేత వారి మధ్య వివాహం నిషిద్ధం దనైదే గాథ చాలా ప్రసిద్ధికెక్కినదే దానిని తీసికొని ఐస్కిలస్ 'సప్లియాంట్సు' అనే విషాదాంత నాటకం వ్రాశాడు అందులో కథ ఇది

దనాయసూ ఐజిప్టసూ యిద్దరూ అన్నదమ్ములు అర్గివేయియో వంశంలోవాళ్ళు యింసులో మొదట వానికి వేరువేరు భార్యల వలన 50 మంది కూతుళ్ళు పుట్టారు రెండవ వానికి అలాగే వేరు వేరు భార్యల వలన 50 మంది కొడుకులు పుట్టారు పెద్ద వాళ్ళయ్యాక ఐజిప్టస్ కొడుకులు దనాయస్ కూతుళ్ళను పెళ్ళి చేసుకుంటామన్నారు ఏకపత్నీ దాంపత్య పద్ధతి ఏర్పడేవరకు ప్రాచీన గణ వ్యవస్థలో వున్న బంధుత్వ పద్ధతిలో వీరు సోదరీ సోదరులు అందుచేత పెళ్ళి చేసుకోకూడదు పురుష పారంపర్యమే ఆనాటికి కొనసాగుతూ వుండి వుంటే దానయాస్ ఐజిప్టసూల పిల్లలు ఒకే గణం వాళ్ళవుతారు అది వివాహానికి మరో ఆటంకం అవుతుంది కాని ఐజి ప్టస్ కొడుకులు దనాయిస్ కూతుళ్ళను పెళ్ళి చేసుకుతీరుతామన్నారు అది న్యాయం కాదని, పరనకాదని ప్రకటించి ఆ ఆడపిల్లలు సముద్రాలు దాటి ఈజిప్టు నుంచి ఆర్గో స్‌కు పారి పోయారు అదే రచయిత వ్రాసిన ప్రోమెధ్యూస్ నాటకంలో ప్రోమెధ్యూస్ ఇయోకు భవిష్యత్తు చెప్తాడు ఆమెకు కలగబోయే కొడుకు ఎపాఫస్‌కు అయిదో తరంలో 50 మంది కన్యల జట్టు ఆర్గోస్‌కు వస్తారని వాళ్ళు రావడం యిష్టాపూర్తిగా కాక ఐజిప్టస్ కొడుకులతో వారి వివాహము యిష్టంలేక పారిపోయి వస్తున్నారని చెప్తాడు పెళ్ళికి అసహ్యించుకొని వారు పారిపోయి రావడం గణ నియమంతో సంబంధం లేకపోయినా అతి ప్రాచీన కాలపు బంధుత్వ వ్యవస్థను తెలుపుతుంది లేకపోతే ఈ కథకు ప్రాముఖ్యమే లేదు మడి కట్టుకోవడం తప్ప ఈ వివాహ వ్యతిరేకతకు అర్థంలేదు,

సప్లయంట్స్ విషాదాంత నాటకంలో ఆ కన్యలు సముద్రం దాటి ఆర్గెస్ పారి పోవడం గురించినది వారు ఐజిప్టస్ కొడుకులు తలపెట్టిన దౌర్జన్యం నుంచి ఆర్గెస్‌లోని రక్త బంధువుల రక్షణ కోరారు ఆ కన్యలు తమ్ము ఈజిప్టునుంచి తరిమి వేయడం చేత రాలేదని ఒకే కుటుంబంలోని ఐజిప్టస్ కొడుకులతో వివాహాన్ని అప విత్రంగా భావించి వచ్చామని ఆర్గోస్‌లో ప్రకటిస్తారు వారి వ్యతిరేకత పూర్తిగా బంధుత్వాన్ని పట్టే అంటే అటువంటి వివాహాల యెడ నిషేధం వుందని ఆ నిషే ధాన్ని మన్నించేటట్లు వారికి శిక్షణ యివ్వబడిందని అర్థం శరణు కోరిన ఈ కన్యల కథ విన్నాక వారికి రక్షణ యివ్వడానికి ఆర్గెస్ గణాల సమితి నిర్ణయించింది అంటే అటువంటి వివాహాల నిషేధం వున్నదని, ఆ నిషేధాన్ని పాటిస్తున్నారని అర్థం. ఈ నాటకం ఆడిన కాలంలో ఆస్తికల కన్యలు, అనాథలైన కన్యలు సోదరులను పెళ్ళాడే ఆచారం అథీనియన్‌లలో వుంది యిది పరిమిత సందర్భాలలోనే అయినా అటువంటి వివాహాలు వరస అని కాని, చట్టవిరుద్ధమని కాని అథీనియన్లు భావించడం లేదు అయితే దానియస్ కన్యల ఈ సాంప్రదాయం అతి ప్రాచీన కాలం నుంచి వచ్చినది అటువంటి వివాహాలను నిషేధించే ఆచారాల బలాన్ని ఈ కథ చెప్తుంది

ఆచారాలూ, చట్టమూ నిషేధించిన ఆ వివాహాల యెడ, ఆ ఘటనల యెడ విపరీతమైన వ్యతిరేకత వుండడమే ఆ ఆచారాలలో మార్పు వచ్చింది అనడానికి సాక్ష్యం మరో కారణమూ లేదు, అక్కరనూ లేదు ఈనాడు లాగే ఆనాడు కూడ సోదరీ సోదరుల మధ్య వివాహాన్ని అంగీకరించ లేదు తురానియన్ బంధుత్వ వ్యవస్థ పెట్టిన ఆటంకాలను బద్దలు చేసేటందుకై ఐజిప్టస్ కొడుకులు చేసిన ప్రయత్నం ఆ వ్యవస్థ శిథిలమై పోతూ వుండినదని, దంపతీ వివాహంతో వచ్చిన ప్రస్తుత వ్యవస్థ నిలదొక్కుకుంటున్నదని చెప్తూవుంది అది గణ ఆచారాలను ప్రక్కకు పెట్టి ఆ నిషే ధాల పరిమితులకు హెచ్చు తగ్గులు కల్పించే తురానియన్ బంధుత్వ వ్యవస్థ ఏర్పడ బోతుంది

ఈ సాక్ష్యాన్ని పట్టి పెలాస్గియన్, హెల్లెనిక్, ఇటాలియన్ తెగలలో స్త్రీ పారంపర్యం మొదట వుండేదని, దానినుంచి ఆస్తి వారసత్వం బలంతో పురుష పారంపర్యానికి మార్పు వచ్చిందని చెప్పవచ్చు ఈ తెగలలో తురానియన్ రక్త సంబంధ వ్యవస్థ పూర్వ కాలంలోనే వుందా లేదా అనేది తెలుసుకునేటందుకు ఆ వ్యవ

స్థను గురించి నేను చెప్పబోయే విషయాలను పట్టి పాఠకుడే అర్థం చేసుకుంటాడు ప్రాచీన సమాజంలో యిది చాల విస్తృతంగా వున్నట్లు సాక్ష్యం దొరుకుతుంది

ఈ తెగల జీవితంలో సాంప్రదాయక కాలం యొక్క పరిమితి ఎంతో తెలియదు కాని అది కొన్ని వేల సంవత్సరాలకి తక్కువ వుండదు ఇనుప ఖనిజాన్ని కరిగించే పద్ధతి తెలియడానికి చాలాపూర్వమే అంటేఅనాగరిక యుగం ఎగువ దశనుంచి వెనక్కి మధ్య దశలో కంటా వ్యాపించి వుంటుంది ఆ యుగం మధ్య దశలో వుండిన అజ్టెక్‌లు, మాయాలు, పెరూవియన్‌లు తో సమమైన అభివృద్ధి ఆ మధ్య దశనాటికి వీరిలోనూ వచ్చిందను కోవచ్చు. ఎగువ దశలో వీరు పైన చెప్పిన యిండియన్ తెగల కన్న చాలా ముందుకు పోయారు అనాగరిక యుగం మధ్య- ఎగువ దశలలో ఈ యూరోపియన్ తెగలు ఎంతో అపారమైన అనుభవాన్ని గడించి నాగరికతను అందుకున్నారు సంప్రదాయాల్లోను, జీవిత కళలలోను, ఆచారాల్లోను భాషలోను వచ్చిన అభివృద్ధులు హోమర్ కవితలద్వారా తెలుస్తోందే తప్ప యితర విధంగా మనకు దొరకడం లేదు సామ్రాజ్యాలు, రాజ్యాలు ఆనాటికి తెలియవు తెగలు, ఏవో జాతులు, నగర పల్లె జీవితం, జీవిత కళల అభివృద్ధి, శారీరక మానసిక నైతిక అభివృద్ధి, యిది వారు పొందిన అభివృద్ధిలో కొన్ని అంశాలు ఈ మహా యుగాలలో జరిగిన ఘటనలు మనకు తెలియక పోవడం వలన కలిగిన నష్టాన్ని ఊహించలేము.

# పదిహేనవ ప్రకరణం

# మానవ కుటుంబం యొక్క యితర తెగలలో గణాలు

స్కాటిష్ కుదురు - ఐరిష్ సెప్ట్ - జర్మనిక్ తెగలు - అంతకు పూర్వం వున్న గణవ్యవస్థ యొక్క ఆనవాళ్ళు - దక్షిణ ఆసియా తెగలలో గణాలు - ఉత్తర ఆసియాలో - యురాలియన్ తెగలు - చైనీయుల నూరు కుటుంబాలు - హిబ్రూ తెగలు ఇవి గణాల ఫ్రాట్రీలుగా ఏర్పడినట్టే కనిపిస్తుంది - ఆఫ్రికన్ తెగలలో గణాలు - ఆస్ట్రేలియన్ తెగలలో - ఫిజీ, రేవాలలో అంతర్భాగాలు — గణ సంస్థ యొక్క విస్తృతి

తెగలు, ఫ్రాట్రీలు గణాల నిర్మాణాన్ని ప్రాచీన, తదనంతర రూపాలలో పరిశీలించాము యింకా మానవ కుటుంబంలో అది ఎంత విస్తృతంగా వున్నదీ పరిశీలించాలి ఆ వ్యవస్థకు పునాది అయిన గణాలను గురించి ఈ పరిశీలన జరగాలి

ఆర్యను కుటుంబానికి చెందిన కెల్టిక్ శాఖలోను, స్కాటిష్ కుదురులోను, ఐరిష్ సెప్ట్‌లోను మాత్రమే చాలాకాలం వరకు గణసంస్థ కొనసాగింది గత శతాబ్దపు నడిమి వరకు స్కాట్లండ్‌లోని పర్వత భూములలో స్కాటిష్ కుదురు చాలా బలంగా వుంది గణ నిర్మాణాన్ని, స్వభావాన్ని చూపించేటందుకు అది ఒక మంచి సాక్ష్యం గణ జీవితానికి దాని సభ్యులమీద ఎంత పట్టు వుందో అనేక వుదాహరణ సర్ వాల్టర్ స్కాట్ వేవర్లె నవలలో ఈ కుదురు జీవితాన్ని గురించి దానివలన కలిగిన ప్రత్యేక లక్షణాలను గురించి పాత్రల ద్వారా శాశ్వతం చేశాడు వ్యక్తుల యొక్క స్వభావాన్ని మలచడంలో గణాలకు ఎంత పట్టువుందో ధూ, టారిబ్వెల్, రాబ్రాయ్ మొదలైన వారు మన కళ్ళ ముందు చూపిస్తారు కథ యొక్క అవసరాలకై సర్ వాల్టర్ స్కాట్ కొన్ని సందర్భాలలో ఈ పాత్రలను కొంచెం అతిశయంగా చూపించినా వానికి

వాస్తవమైన పునాది వుంది కొద్ది శతాబ్దాలకి పూర్వంకుదురు జీవితంబలంగావుంది బయటి సంబంధాలు తక్కువగా వున్న పరిస్థితిలో కొన్ని కుదుళ్ళలోని జీవితం ఈ చిత్రాలకు సరిగ్గా అతుకుంది వారి మధ్య తగవులలో, రక్త ప్రతీకారాలలో, గణాలుగా వేరువేరు ప్రదేశాలలో నివసించడంలో, భూములను వుమ్మడిగా వుపయోగించడంలో నాయకుని యెడ కనబరిచే విశ్వాసంలో, ఒకరొకరి యెడ అప్యాయతలో మనకు గణ సమాజం యొక్క ప్రధాన లక్షణాలన్నీ కనిపిస్తాయి గ్రీకులు, రోమనుల గణాలలో కాని, రెండవ వైపున అమెరికన్ ఆదివాసుల గణాలలో గాని కనిపించని గాఢమైన, అప్యాయతలతో కూడిన గణ జీవితాన్ని స్కాట్ చిత్రించాడు వారిలో ఫ్రాట్రీ వుండినట్లు కనిపించదు కాని బాగా వెనుకటి కాలంలో ఫ్రాట్రీ, తెగ కూడ వుండే వుంటాయి ఈ పర్వత ప్రాంతాలలోని కుదురు నిర్మాణాలను బద్దలు చేసి ఆ ప్రజలను ఒక చట్టం క్రిందికి, రాజకీయ సమాజపు అలవాట్ల కిందకి తెచ్చేటందుకు బ్రిటిష్ ప్రభుత్వం చేసిన పని అందరికీ తెలుసు వారిలో పురుష సారం పర్యం వుంది మగవాళ్ళ సంతానం కుదురు సభ్యులుగానే వుండిపోతారు ఆడపిల్లల సంతానం వాళ్ళ వాళ్ళ తండ్రుల కుదురులకు చెందుతారు

ఇప్పుడు ఐరిష్ సెప్ట్, ఆల్బేనియన్‌ల ఫిస్ లేక ఫ్రారాలను గురించి తెలుసుకుందాం అంతకు పూర్వంనాటి గణసంస్థ యొక్క అవశేషాలు వీనిలో వున్నాయి దాల్మేటియా క్రోషియాలలో కూడ యిటువంటి సంస్థల ఛాయలున్నాయి సంస్కృతంలో గణమనే శబ్దముంది ఆర్యన్ కుటుంబం యొక్క ఈ శాఖలో పూర్వం ఈ నిర్మాణం వుండినదని దీనిబట్టి తెలుసుకోవచ్చు గతం రోజులలో ఫ్రాన్స్ భూభాగంలో విల్లీన్స్ గ్రామాలలో ప్రాచీన కెల్టిక్ గణాల అవశేషాలు కనిపిస్తున్నాయని సర్ హెన్రీ మెయిన్ యిటీవలి గ్రంథంలో వ్రాశారు "ఈ సమూహాలు ఐచ్ఛికంగా ఏర్పడినవి కావని రక్త బంధువుల సమూహాలని చెప్పటానికి కేమాత్రం సందేహంలేదు దాల్మేటియా, క్రోషియాలలో యిటీవల చూచిన సామూహిక గృహ కుటుంబంలాగ ఏర్పడిన మామూలు తరహా గ్రామ కుటుంబ సమూహం కాదు దానిలో ప్రతి ఒక్కటి హిందువులు చెప్పేటట్టు వుమ్మడి అవిభక్త కుటుంబం ఎవరో పూర్వ పురుషుని వంశంలోని వారమనుకొనే వారి సమూహం తర తరాలుగా ఒకే పొయ్యి, సమిష్టి భోజనాలు కాపాడుకుంటు వస్తున్న జనం అని ఆయన Early History of Institutionsలో వ్రాశాడు.

మొట్టమొదటి చరిత్ర దృష్టికి వచ్చిన నాటికి జర్మన్ తెగలలో గణ నిర్మాణాల ఛాయలు ఏమయినా మిగిలాయా అనే ప్రశ్నను గురించి కొంచెం ఆలోచించాలి ఆర్యన్ కుటుంబాల ప్రాచీన పూర్వ పురుషుల నుంచి యితర ఆర్యను తెగలతోపాటు వీరికి గణసంస్థ సంక్రమించిందని అనుకోవచ్చు రోమనులు వీరిని చూసిన నాటికి ఈ తెగలు అనాగరిక యుగం ఎగువ దశలో వున్నారు వీరికన్న పురోగమించిన గ్రీషియన్, లాటిన్ తెగలలో కన్న వీరిలో ప్రభుత్వ భావన అభివృద్ధి పొందిందనడానికి వీల్లేదు జర్మన్లలో భూభాగాలు, ఆస్తి ప్రాతిపదికగా రాజ్యం అనే భావం అసమగ్రంగా ఏర్పడి వుండవచ్చు కాని రెండవ ప్రభుత్వ పథకం గురించి వీరికి తెలిసి వుండదు. ఆర్యను తెగలలో మొట్ట మొదట ఆ ప్రభుత్వ పథకాన్ని రూపొందించింది ఒక్క ఎథీనియనులే సీజరు, టాసిటస్‌లు చేసిన వర్ణనలను పట్టి జర్మనులలోని అనేక గ్రూపులు వ్యక్తి గత సంబంధాల ద్వారా కలిసి వున్నట్లు కన్పిస్తుందేకాని భూభాగాల ప్రమేయం చాల తక్కువ మాత్రమే కన్పిస్తుంది ఈ వ్యక్తిగత సంబంధాలలోనే వారి పాలనా వ్యవస్థ వుంది పౌరనాయకులను, సైన్యనాయకులను ఆ పదవికి ప్రజలు ఎన్నుకునేవారు వారే సమితిగా ఏర్పడేవారు ప్రభుత్వ నిర్వహణలో ముఖ్యమైన అంగం అది చిన్న విషయాల మీద నాయకులు సంప్రదించుకుంటారని అధిక ప్రాధాన్యం గల విషయాలమీద ఊరు అంతా కలిసి సంప్రదించుకుంటారని టాసిటస్ వ్రాశాడు అన్ని ముఖ్య విషయాల మీద అంతిమ నిర్ణయం ప్రజలదే అయినా దానిని మొదట నాయకులు ఆలోచిస్తారు గ్రీషియన్, లాటిన్ తెగల అలవాట్లలో గల దగ్గర పోలికలను ఇక్కడ చూడవచ్చును ప్రభుత్వంలో మూడు అంగాలు - నాయకుల సమితి, ప్రజాసభ, సైన్యాధ్యక్షుడు కన్పిస్తున్నాయి

జర్మనులు వ్యవసాయం గురించి శ్రద్ధ చూపరని వారి ప్రధాన ఆహారం పాలు, జున్ను, మాంసాలని సీజర్ అన్నాడు సరిహద్దులలో తనది అనుకునే భూమి లేదు మేజిస్ట్రేట్‌లు, నాయకులు ప్రతి గణానికీ, బంధుకూటానికి మొత్తంగా కొంత భూమిని కేటాయిస్తారు మరునటి సంవత్సరం వారు యింకో చోటికి మారాలి అంటే కుటుంబం కన్న పెద్దదైన సమూహాలను, బంధుత్వపు ప్రాతిపదికపై చేరిన వారిని, అయన చూశాడు ఆ సమూహాలకు భూములను కేటాయిస్తారు అంటే వ్యక్తులకు కాదు అఖరికి కుటుంబానికి కాదు ఆ రెంటిని గుంపులో కలిపేశారు అంతా కలిసి వ్యవసాయం చేస్తారు జీవనాధారం సంపాదించుకుంటారు దీనిని పట్టి అనాడు జర్మనులలో జంట

కుటుంబం వుండిందని బంధుత్వం గల అనేక కుటుంబాలు ఒక యింట్లో కలిసి జీవిస్తూ కమ్యూనిజం పద్ధతిలో జీవించే వారని అనుకోవచ్చు

జర్మన్ తెగలలో యుద్ధరంగంలో బంధు కూటాలను పక్కపక్కన వుంచడం జరుగుతుందని టాసిటను వ్రాస్తున్నాడు బంధుత్వం అనేది సన్నిహిత రక్తబంధువులకే పరిమితమైతే ఈ ఏర్పాటులో ప్రత్యేకత లేదు వారు చూపే ధైర్యసాహసాలకు మూలం ఏదో యాదృచ్ఛికమేగాని ఆశ్విక బలాలనీ, కాల్బలాలనీ ఒకచోట చేర్చడం వలన కలిగినది కాదని, వారిని కుటుంబాల వారీగా బంధుత్వాల వారీగా సమీకరించడం వలన కలిగినది మాత్రమేననీ ఆయన వ్రాస్తున్నారు ఇదీ యింత క్రితం సీజర్ చెప్పినదీ కలిపి చూస్తే వారిలో యింతకు పూర్వం గణసంస్థ వుండినట్లు అది క్రమంగా మార్కు సంస్థకు దారి తీస్తువున్నట్టు అస్పష్టమైన రాజకీయ నిర్మాణంతో స్థానిక మండలాలు ఏర్పడుతున్నట్లు అర్థమవుతుంది జర్మన్ తెగలలో మార్కు వారీగా నిర్బంధ సైనిక సమీకరణ జరిగింది ఇంగ్లీషు శాక్సనులలో యింతకన్న పెద్ద సమూహమే నిర్బంధ సైనిక సమీకరణలకు మూలంగా వుండేది దానిని సీజరు గావ్ అనీ టాసిటస్ పాగస్ అని పేర్కొన్నారు ఈ మార్కు కాని గావ్ కాని ఖచ్చితంగా భౌగోళిక మండలాలా? వీనికి పట్టణాలకు జనపదాలకు పోలిక వుందా? వీనికి పరిహద్దులు నిర్ణయించారా? వీనిలోని ప్రజలను రాజకీయంగా నిర్మాణపరిచారా? అనేది స్పష్టంగా తెలియదు నిర్బంధ సైనిక సమీకరణకై ఏర్పరిచిన కొన్ని గ్రామాల సమూహమే గావ్ అయివుండవచ్చు మార్కు, గావ్‌లు భవిష్యత్తులో ఏర్పడగల పట్టణాలకు జనపదాలకు బీజ రూపం అయివుండవచ్చు క్రీస్థెనెస్ యొక్క డెమేకు స్థానిక తెగకు బీజ రూపాలుగా అథీనియన్ల నాక్రారీ, ట్రిట్టీ వున్నట్టే అయివుంటుంది యివి గణవ్యవస్థకు రాజకీయ వ్యవస్థకు మధ్యన ఏర్పడిన నిర్మాణాలయి వుంటాయి వీనిలో ప్రజలను బంధించి వుంచినది యింకా రక్త బంధుత్వాలే

ఈ విషయాన్ని ప్రత్యేకించి బాగా అధ్యయనం చేసిన డాక్టర్ ఫ్రీమన్ యిలా వ్రాస్తున్నారు

"ఈ రాజకీయ వ్యవస్థలో అట్టడుగు యూనిట్‌ను మార్కు అని, గెమీండే అని, కమ్యూన్ అని, పరిష్ అని అనేక పేర్లతో పిలుస్తున్నారు యిది గణం లేక కుదురు యొక్క అనేక రూపాలలో ఒకటి వీరు దోపిడీలు సాగిస్తూ సంచార జీవులుగా వున్న గుంపూ కాదు, నగర ప్రజలలో భాగంగా కలిసిపోయిన వారూ కాదు ఈ దశలో గణం అన్నది వ్యవసాయదారుల సమూహ రూపంలో వుంటుంది వారి భూములు

వుమ్మడిగా వుంటాయి రోములోని Ager Publicusకు ఇంగ్లండులోని Folklandకు బీజ రూపం లాంటిది యిది పశ్చిమ ప్రాంతంలోని గ్రామ ప్రజాసమూహం దాగా దిగువ స్థాయి రాజకీయ యూనిట్ అయిన దీనిలో బంధువులైన ప్రజలు కుటుంబాలుగా సమీకరించి వుంటారు ఆ బంధుత్వాలు వాస్తవమైనవే కావచ్చు కల్పితమూ కావచ్చు ప్రతి యూనిటూ ఒక తండ్రిని కలిగి యుంటుంది అది ఆయన అధీనంలో వుంటుంది రోమను చట్టానికి ప్రధాన లక్షణంగా నిలబడిన 'Patria Potestas' లాంటిదే యిది కొన్ని కుటుంబాల సమూహం గణమవుతుంది ఈ గణాల యొక్క ప్రాంతీయ రూపమే ఈ గ్రామ కుటుంబం యిలాంటి గ్రామ కుటుంబాలు చాలా కలిసి వానికి సంబంధించిన వుమ్మడి భూములతోసహా ఒక వున్నత రాజకీయ సంఘం ఏర్పడుతుంది దీనిని నూరు అంటారు ట్యూటనిక్ తెగలు వ్యాపించిన అనేక ప్రదేశాలలో ఈ పేరు ఏదో రూపంలో కన్పిస్తూంటుంది . ఈ నూరుకి పైది పాగస్ లేక గావ్ డేనిష్ వారి సిస్పెర్, ఇంగ్లీషు వారి షాయిర్ ఒక ప్రదేశాన్ని ఆక్రమించివున్న తెగను యిది సూచిస్తుంది ఈ విభాగాలు పెద్దవికాని, చిన్నవి కాని వానికి నాయకులు వుంటారు అట్టడుగు యూనిట్లు అవి మార్కులు కాని, గెమీండే కానీయండి కలిసి నూరు అవుతాయి ఈ నూరులు కలిసి షాయిర్, గావ్, పాగస్‌లు ఏర్పడతాయి "

ఆసియా ఖండంలో అధిక సంఖ్యలో అనేక తరహాల మానవ జాతులు కన్పిస్తాయి మానవుడక్కడ చాల పురాతనం నుంచి జీవిస్తున్నాడు గణ సంస్థయొక్క ఆదిమకాలపు ఆనవాళ్ళు అక్కడ కనబడుతాయి కాని యిక్కడ సమాజంలోమార్పులు చాలా విస్తృతంగా జరిగాయి తెగలు—జాతుల మధ్య ఒక దాని ప్రభావం మరొక దాని మీద నిరంతరాయంగా వుంటుంది చైనాలోను, ఇండియాలోను నాగరికతలు ముందే వచ్చాయి ఆధునిక నాగరికతయొక్క ప్రభావం ఆసియా ప్రజల పరిస్థితులమీద, ప్రాచీన ఆచారాలమీద ఎంతో ప్రభావం కలిగించి వానిని గుర్తించలేనంతగా మార్చి వేశాయి అయినా ఆటవిక దశనుంచి నాగరికత వరకు మానవుని అనుభవం ఆసియా ఖండంలో వచ్చింది అక్కడ వుండే చిన్న చిన్న తెగలలో ఆ ప్రాచీనాచారాల అవశేషాలను తెలుసుకోవాలి

ఆటవిక స్థితిలోవున్న ఆసియా తెగలలో యిప్పటికి స్త్రీ పారంపర్యం కొనసాగుతుంది పురుష పారంపర్యంవున్న తెగలుకూడ చాలానే వున్నాయి స్త్రీ పారంపర్యమో పురుష పారంపర్యమో వుండడము, రక్తబంధువుల సమూహాలు వేరు వేరు పేర్లతో వుండడము గణాలకు సూచన

నేపాల్ (Nepaul) లోని మాగార్ తెగలో "పన్నెండు థమ్స్ వున్నాయి" అని లాథామ్ వ్రాస్తున్నాడు "ఒక థమ్‌లోని వ్యక్తులందరు ఒకే పూర్వ పురుషుని సంతానంగా భావిస్తారు ఒకే తల్లినుంచి వచ్చినా రక్తానికి ప్రాధాన్యంలేదు అంటే భర్త భార్య వేరువేరు థమ్‌లకు చెందిన వారయివుంటారు ఒకే థమ్‌లోని వారి మధ్య వివాహం జరుగదు భార్య కావలసివస్తే పక్కనున్న థమ్‌లో వెదుక్కోవాలి తన థమ్‌లో మాత్రంకాదు ఈ అలవాటును మొదటి మాటు యిక్కడే చూస్తున్నాను బహుశా యిదే ఆఖరు కాకపోవచ్చు ఈ లక్షణం సర్వత్రా వున్నట్లు కన్పిస్తుంది దానిని ఆస్ట్రేలియాలో, ఉత్తర దక్షిణ అమెరికాలలో, ఆఫ్రికాలో, యూరప్‌లో కూడ చూస్తాము చాలచోట్ల అదివున్నట్లు సాక్ష్యం పూర్తిగా దొరకక పోయినా అది వున్నట్లుగా అనుమానించగలుగుతాము" అని డిస్క్రిప్టివ్ ఎథ్నాలజీలో వ్రాశారు దీనినిచూస్తే థమ్ అనేది వంశ పారంపర్యం కొనసాగుతున్న గణము అనుకోవడానికి సందేహం లేదు

"మున్నియాపోరీ చుట్టువున్న కొండలలో నివసించే మున్నియాపోరీలు, కౌపూయేలు, మౌలు మరాములు, ముర్రింగులు ఒక్కొక్కళ్ళు నాలుగేసి కుటుంబాలుగా విడబడివున్నారు వాని పేర్లు కూముల్, లూఅంగ్, అంగోం, నింగ్‌తాజా, ఈ కుదుళ్ళలో ఒకదాని సభ్యులు మిగిలిన ఏ కుదురు వారినైనా పెళ్ళి చేసుకోవచ్చును కాని కుదురులో అంతర్వివాహం నిషిద్ధం" అన్నారు మాక్లెన్నాన్ - "తన ప్రిమిటివ్ మ్యారేజ్"లో ఈ కుటుంబాల విభజనను తెగకు నాలుగు గణాలున్నట్లు ఊహించవచ్చును సర్కేషియన్లలోని తెలూష్‌లను గురించి వ్రాస్తూ బెల్ యిలా అన్నాడు "వారిలో ప్రతియొక్కదాని సభ్యులు ఒకే పునాదినుంచి, పురాణ పురుషుడి నుంచి వచ్చినట్లు చెప్తారు అది వారి సంప్రదాయం ఆ విధంగా వారు అన్ని పెద్దలు లేక కుదురులుగా వున్నట్లు భావించవచ్చు ఈ కజిన్స్ అందరూ ఒకే సోదర కుటుంబంయొక్క సభ్యులు వారు తమలోతాము వివాహమాడటం తప్పు అంతేకాదు వాళ్ళ సేవకులు కూడా మరో సోదర కుటుంబంలోని సేవకులనే పెళ్ళి చేసుకోవాలి" అని మ్యాక్లెన్నాన్ వ్రాశాడు బహుశా తెలూష్ అన్నది గణమే అయివుంటుంది

బెంగాలీలలోని ఆచారాన్ని గురించి రెవరెండ్ గోపీనాథ్ నంది ఈ రచయితకిలా వ్రాశాడు "నాలుగు కులాలు అనేక తరగతుల క్రింద విభజించబడ్డాయి వీటిలో మళ్ళీ శాఖలున్నాయి ఉదాహరణకు నేను నంది తెగవాడిని (గణాలా?) నేను మతం పుచ్చుకొని వుండకపోతే ఒకే కులం వాళ్ళమైన మా తెగలోని ఆమెను పెళ్ళి చేసుకో

కూడదు పిల్లలు తండ్రి తెగకే చెందుతారు ఆస్తి కొడుకులకు వస్తుంది వారు లేకపోతే కూతుళ్ళకి యిద్దరూ లేకపోతే దగ్గర బంధువులకి పోతుంది కులాలు అంతశ్శాఖలుగా విడబడ్డాయి అందులో షరో ఒకటి అదికూడ కౌరిల్, టిర్లీ, తమాలీ, తంతి, చోమోర్, కారి మొదలయిన శాఖలుగా విడతీయబడింది ఈ చివర చెప్పిన ఉపశాఖలకు సంబంధించిన మనిషి అదే శాఖకు చెందిన స్త్రీని పెళ్ళిచేసుకోకూడదు" ఈ చిన్న చిన్న ఉపశాఖలలో సాధారణంగా జనం నూరుకి మించి వుండరు కాని వానికి గణ లక్షణాలు చాలా మిగిలే వున్నాయి

టైలరు "ఎర్లీ హిస్టరీ ఆఫ్ మ్యాన్‌కైండ్"లో వ్రాసింది యిది "ఇండియాలోని బ్రాహ్మణుడు ఒకే కుదురు పేరుగల లేక గోత్రా (అవుల దొడ్డి) కి చెందిన స్త్రీని పెళ్ళిచేసుకోకూడదు పురుష పారంపర్యంలో ఎంత దూరమైనా అది అమలు జరుగవలసిందే మనుస్మృతి ప్రకారం ఈ నియమం మొదటి మూడు కులాలకు మాత్రమే వర్తిస్తుంది స్త్రీలవైపు నుంచి కూడ కొంత విస్తృతపరిధిలోనే వివాహాలు నిషిద్ధం" అన్నాడు తనదే ప్రిమిటివ్ కల్చర్ అన్న పుస్తకంలో "చోటా నాగపూర్‌కి సంబంధించిన కోల్ జాతివారిలో వ్రాంగ్, ముండ కుదుళ్ళలో, కుటుంబాలు జంతువుల పక్షుల పేర్లతో వున్నాయి మలుగువేవ, డేగ, కాకి కొంగ, యిలాగే. వారు తమ కుటుంబం పేరువున్న జంతువును చంపకూడదు తినకూడదు"

మంగోలియన్‌లు శరీర లక్షణాలను పట్టి అమెరికన్ ఆదివాసులకు దగ్గరగా వుంటారు వారిని గురించి లెథామ్ తన "డిస్క్రిప్టివ్ ఎథ్నాలజీ" అనే పుస్తకంలో యిలా వ్రాస్తున్నాడు "ఒక తెగలోని జనుల మధ్య రక్తసంబంధం, వంశ సంబంధము వుంటుంది ఒక తెగ కొన్ని సంబంధాలలో ఒక పూర్వ పురుషుడి పేరున చెల్లుతుంది ఈ తెగలను అయిమాక్ లేక అయిమాక్ అంటారు యిది కోఖుమ్ లేక కేతనాలు పేరున ఎన్నో విభాగాలుగా విభజించ బడింది" ఈ మాట వలన గణాలు వున్నాయనేందుకు సాక్ష్యం చాలదు వారి పొరుగు వారైన తుంగుసియన్‌లలో గుఱ్ఱం, కుక్క, రైండీర్ వంటి జంతువుల పేర్లతో శాఖలు వున్నాయి వీనిని గణాలుగా అనుకోవచ్చు కాని వానికీ సాక్ష్యం చాలదు దేహెల్ చెప్పిన దాని ప్రకారం కాల్మక్‌లు "గుంపులుగా విడబడి వుంటారనీ ఎవ్వడూ తన గుంపుకు చెందిన స్త్రీని పెళ్ళి చేసుకోకూడదని" సర్జాన్ లుబ్బాక్ వ్రాశాడు ఓస్తియాక్‌లు 'ఒకే కుటుంబానికి - ఒకే పేరు గల కుటుంబానికి చెందిన స్త్రీని పెళ్ళి చేసుకోవడం పాపంగా భావిస్తారు" అలాగే సైబీరియాకు చెందిన జాకూట్లు "పెళ్ళి చేసుకోవాలనుకుంటే మరో కుదురునించి కన్యను

పిరుకోవాలి" వీటన్నింటిలోను గణ లక్షణాలు ఉన్నాయి గణ సభ్యులలోనే అంతర్వివాహం దానిలో నిషిద్ధం యూరాక్ సామోయెద్‌లు గణాలుగా ఏర్పడి వున్నారు "తన రక్తబంధువుల నించి సామోయెద్‌లు ఎవరూ పెళ్ళాన్ని తెచ్చుకో కూడదు వారు మిగిలిన రెండు కూటాల నుంచి భార్యను ఎన్నుకోవాలి ఈ నియమాన్ని వారు చాల కఠోరంగా పాటిస్తారు" అని క్లాప్రాత్ చెప్పినట్లు లాథామ్ తన "ఆర్జిన్ ఆఫ్ సివిలిజేషన్"లో వ్రాశాడు

చిత్రంగా కనిపించే చైనీయుల కుటుంబ పద్ధతిలో ప్రాచీన గణ సంస్థ యొక్క అవశేషాలు మిగిలియున్నాయి ఈ విషయాన్ని కాంటన్ నుంచి రాబర్ట్ హార్ట్ యిలా వ్రాశాడు "కుటుంబాన్ని చైనీయులు పీ-సింగ్ అంటారు అంటే నూరు కుటుంబ నామాలు అని అర్థం యిది వట్టి మాట మాత్రమేనా లేక చైనీయుల మొత్తం కుటుంబంలో నూరు చిన్న కుటుంబాలు లేక తెగలు (గణాలా?) వున్నాయో నేను చెప్పలేను ఇవాళ చైనీయులలో నాలుగు వందల వరకు కుటుంబ నామాయిన్నాయి వానిలో కొన్ని గుఱ్ఱం, మేక, ఎద్దు, చేప, పక్షి, ఫోనిక్స్, ప్లమ్ పువ్వు, ఆకు, వరి, అడవి, నది, కొండ, నీరు, మబ్బు, బంగారం, చర్మం, వెంట్రుకలు ఈ విధంగా జంతువులు, పళ్ళు, లోహాలు, యితర వస్తువుల పేర్లు గలవి వానిలో కన్పిస్తున్నాయి దేశంలో కొన్ని ప్రాంతాలలో పెద్దపెద్ద గ్రామాలలో ఒకే కుటుంబ నామం కల వారు కన్పిస్తారు ఒక మండలంలో మూడు గ్రామాలున్నాయి ప్రతి దాంట్లోను రెండు, మూడు వేలమంది జనం వుంటారు మేక, గుఱ్ఱం, ఎద్దు కుటుంబాలకు చెందిన వారు ఒక్కొక్క వాంట్లో వున్నారు ఉత్తర అమెరికన్, ఇండియనులలో లాగనే భార్యా, భర్తలు వేరువేరు తెగలకు (గణాలు) చెంది వుండాలి, అంటే తెగలో భార్యా, భర్తలు భిన్న కుటుంబాలకు, వేరు వేరు యింటిపేర్లకు చెందినవారై వుండాలి ఒకే కుటుంబం పేరు కలవారు వివాహం చేసుకోరాదని ఆచారం, చట్టం కూడ నిషేధిస్తూంది పిల్లలు తండ్రి కుటుంబానికే చెందుతారు వారికి ఆ కుటుంబనామమే వర్తిస్తుంది చనిపోయి నప్పుడు ఆస్తి సాధారణంగా విభజనకాదు తల్లి బ్రతికివున్నంత వరకు అది పెద్ద కొడుకు చేతిలో వుంటుంది ఆమె మరణానంతరం తన తమ్ముళ్ళకు తనకు తోచినంత చొప్పున యిచ్చి మిగిలింది తాను తీసుకుంటాడు"

ఇక్కడ కుటుంబం అన్నది రోములను కాలం నాడు రోమనులలో వున్న గణాన్ని పోలివుంది అయితే ఒకే మూలపురుషుడి నుంచి వచ్చిన యితర గణాలతో కలిసి ఫ్రాట్రీగా ఏర్పడిందా అంటే తెలియడం లేదు పైగా గణ సభ్యులంతా ఒకే

ప్రదేశంలో రక్తసంబంధం కల కుటుంబం లాగ స్వతంత్రంగా వుంటున్నారు మొదటి రోజులలో రోమను గణాలు కూడ ఒక్కొక్క ప్రదేశంలోనే నివసిస్తూ వుండేవి గణాలు పేర్లుకూడ పూర్వపు తరహాగానే వున్నాయి అవి నాలుగు వందలయ్యాయంటే సంఖ్యలు పెరిగి విడబడ్డాయనుకోవాలి కాని అనాగరిక యుగం గడిచిపోయి యింత కాలం వరకు అవి అలాగే కొనసాగుతున్నాయంటే గొప్ప విషయమే ప్రజలుగా వారిలో చలనం లేదనడానికి యిదొక సాక్ష్యం దంపతీ కుటుంబ వ్యవస్థ ఈ గ్రామాలలో పూర్తిగా అభివృద్ధి పొందలేదని, భార్యల విషయంలోను, జీవిత పద్ధతులలోను కమ్యూనిజం వారిలో అమలుజరుగుతూండి వుండవచ్చునని అనుమానించవలసియుంది చైనాలోని పర్వత ప్రాంతాలలో మండారిన్ భాషకు చెందిన మాండలికాలు మాట్లాడే అటవికులైన ఆదిమ తెగల వారిలో అతి ప్రాచీన రూపంలో గణం నేటికీ దొరకవచ్చు ఎవరితో సంబంధం లేకుండ జీవిస్తూన్న ఈ తెగలలో మనకు చైనీయుల ప్రాచీన ఆచారాలు దొరకవచ్చు

ఇదే విధంగా అఫ్ఘనిస్తాన్‌లోని తెగలు కుదురులుగా ఏర్పడియున్నట్లు చెప్తున్నారు కాని ఈ కుదుళ్ళు అన్నవి సిసలైన గణాలవునో కాదో ధృవపడలేదు

ఇదే మాదిరి వివరాలతో పాఠకుణ్ణి విసిగించ బోవడంలేదు ఈనాటి ఆసియాలోని తెగలలోను జాతులలోను అతి ప్రాచీనకాలంలో గణ సంస్థ సర్వ సామాన్యంగా అతి విస్తృతంగా వుండెది అని చెప్పడానికి పైన చెప్పిన వుదాహరణలు చాలు

హీబ్రూల సంఖ్యా గ్రంథంలో చెప్పిన పన్నెండు తెగలు అన్నవి హీబ్రూ సమాజాన్ని చట్టం రీత్యా పునర్మించినప్పుడు ఏర్పడినవి అయివుంటాయి అప్పటికి నాగరిక దశ ప్రారంభమయి వుంటుంది అదివరకటి గణవ్యవస్థకోప రక్త బంధుత్వపు సముహాలు కొనసాగుతూ వుండినవనీ వానిని క్రమబద్ధం చేశారనీ అనుకోవాలి ఆనాటికి వ్యక్తిగత బంధుత్వాలతో ఏర్పడిన గణసమాజంలోని పాలనా రూపం తప్ప మరో ప్రభుత్వ పద్ధతి వారికి తెలియదు అని అర్థం తరువాత వారిని పాలెస్తయిన్‌లో రక్త సంబంధంగల కుటుంబాల వారీగా ఒక్కొక్క ప్రదేశంలో ఒక్కొక్కరిని స్థిరపరిచారు ఈ మండలాలకు జాకోబ్ యొక్క పన్నెండుగురి పేర్లు పెట్టారు యింకొకటి లెవీ తెగది అంటే వారు వంశాల వారీగానే నివాసాలు ఏర్పరుచుకున్నారు గాని, పౌర సమూహాలుగా ఏర్పడలేదు అని అర్థం సెమిటిక్ జాతి వారిలో ఎంతో పేరు ప్రఖ్యాతులు గల ఈ జాతి చరిత్ర అబ్రహాము, ఐజాక్, జాకూబ్ ఈయన పన్నెండుగురు కొడుకులు పేర్లతోనే చెలామణి అవుతుంది

హీబ్రూల చరిత్ర అబ్రహాముతో ప్రారంభమవుతుంది ఆయనకో పెద్ద వంశ మనదమేకాని వివరాలు తెలియవు వారు పొందిన అభివృద్ధి గురించి కొద్ది మాటలు కన్పిస్తాయి అబ్రహాములో వారి అభివృద్ధిస్థాయి కనబడుతుంది ఆయనకు "పశువులు, వెండి, బంగారాలతో చాల సంపద వుంది" అని వర్ణించారు మాక్పేలా గుహ కోసం "అబ్రహాము ఎఫ్రోన్‌కు వెండి తూచి యిచ్చాడు హేత్, కొడుకుల సమక్షంలో, అనాడు నాణెంగా చలామణీ అవుతున్న నాలుగు వందల శెకెల్లు వెండిని వర్తకునికి యిస్తానని చెప్పాడు" అని జెనెసిస్‌లో వుంది గృహ జీవితం జీవనోపాధి గురించి చెప్పడానికి కొన్ని వాక్యాల్ని వుదహరిస్తారు "అబ్రహాము గుడారంలో వున్న సారా వద్దకు వెళ్ళి మూడు గిన్నెల నిండ మంచి పిండిని తీసుకొని పిసుకు త్వరగా పొయ్యి మీద రొట్టెలు చేయి" మరొక చోట "అతడు వెన్న పాలు మసాలాతో కూరిన లేగ దూడమాంసాన్ని వారి ముందు పెట్టాడు" పరికరాలు బట్టలు నగలు విషయంలో "అబ్రహాము తన చేతిలోకి నిప్పు, కత్తి తీసుకున్నాడు" "సేవకుడు వెండి నగలు, బంగారు నగలు, దుస్తులు తీసుకువచ్చాడు వాటిని ఆయన రెబెకాకు యిచ్చాడు ఆమె సోదరుడికి, తల్లికి కూడ విలువైన వస్తువుల నిచ్చాడు" రెబెకా ఇసాక్‌ను కలిసినపుడు ఒక "మేలి ముసుగు తీసుకొని నిండుగా కప్పుకుంది" యిదే సందర్భంలో ఒంటె, గాడిద, ఎద్దు, గొర్రె, మేక వాటి మందలు, ధాన్యపు మర, నీటి కుండ, కర్ణభూషణాలు, మురుగులు, గుడారాలు, ఇళ్ళు, నగరాలు మొదలైనవాటిని పేర్కొన్నాడు విల్లు, అంబు, కత్తి, ధాన్యం, మద్యం, వంటచేలు పేర్కొన్నాడు అంటే అబ్రహాము, ఇస్సాక్ జాకోబులు అనాగరిక యుగం ఎగువదశలో వున్నారని అర్థం చేసుకోవచ్చు సెమిటిక్ జాతికి చెందిన ఈ శాఖ వారికి ఆనాటికి లిపి బహుశా తెలిసి వుండదు అంటే హోమరు కాలంనాటి గ్రీకులతో సమానమైన అభివృద్ధి దశలోనే వున్నారనాలి

ప్రాచీన కాలం నాటి హీబ్రూ వివాహాచారాలను చూస్తే గణాలు అతి ప్రాచీన రూపంలో వున్నట్లు తోస్తుంది అబ్రహాము తన సేవకుని ద్వారా రెబెకాను ఇసాకుకు భార్యగా కొన్నాడు అనుకోవాలి ఆమె తల్లికి, తమ్ముడికి విలువైన వస్తువు లిచ్చాడంటారే గాని తండ్రికి కాదు అంటే అవి రక్త సంబంధీకులకే చెందాయి గణమంటూ వుంటే స్త్రీ పారంపర్యం కొనసాగుతూ వుండి వుండాలి అబ్రహాము తన సవతి చెల్లెలు సారాను పెళ్ళిచేసుకున్నాడు "ఆమె నా చెల్లెలు, నా తండ్రి కూతురే కాని మా అమ్మ కూతురు కాదు, ఆమె నాభార్య అయింది" అన్నాడు

గణాలు వుండి స్త్రీ పారంపర్యం కొనసాగుతూ వుంటేనే అబ్రహామూ, సారా భిన్న గణాలకు చెందిన వారవుతారు వారు రక్త బంధువులు కావచ్చు కాని గణ బంధువులు కారు అందుచేత గణాల ఆచారం ప్రకారం పెళ్ళి చేసుకున్నారు అదే పురుష పారంపర్యం సాగుతూంటే అలా జరగడం సాధ్యంకాదు నాహోర్ తన సోదరుడు హరెన్ కూతురిని పెళ్ళి చేసుకున్నాడు (జెనిసిస్) మోసెస్ తండ్రి అమ్రామ్ తన తండ్రి చెల్లెల్ని పెళ్ళిచేసుకున్నాడు. వారి సంతానమే హిబ్రూచట్ట నిర్మాత అయిన మోసెస్ (ఎక్సోడస్) ఈ రెండు సందర్భాలలోను కూడ గణంలో స్త్రీ పారంపర్యం కొనసాగుతూ వుంది వివాహితు లిద్దరూ భిన్న గణాలకు చెంది వుంటారు పురుష పారంపర్యం వుంటే పరిస్థితి వేరు యింత మాత్రం చేత గణాలున్నట్టు నిశ్చితంగా నిరూపణ కాలేదు కాని వీనిని పట్టి అతి ప్రాచీన రూపంలో గణ సంస్థ వున్నట్లు వూహించగలుగుతాము

మోసెస్ చట్టాలు వచ్చేనరికి హీబ్రూలు నాగరికులయ్యారు కాని రాజకీయ సమాజాన్ని ఏర్పరచ గలిగి నంతగా పురోగమించలేదు గ్రీకులలోని గణాలు ఫ్రాట్రీ తెగలు మాదిరిగానే వీరిలోనూ వరుస క్రమంలో రక్త బంధుత్వపు సంస్థలు ఏర్పడినట్లు బైబిల్ పట్టి తెలుస్తూంది వీరు సినాయ్‌లో వున్నప్పుడు సమాజ నిర్మాణము సైన్య నిర్మాణము విషయంలో గణాలు, ఫ్రాట్రీ తెగలకు సమాంతరంగా రక్తబంధువుల గుంపులను వుదహరిస్తూ వచ్చారు ఆ విధంగా లెవీతెగ మూడు ఫ్రాట్రీలలో ఎనిమిది తెగలుగా వుంది

లెవీ తెగ

లెవీ కొడుకులు
(1) ఘర్షాన్ 7500 మంది మగవాళ్ళు
(2) కోహాత్ 8600 మంది మగవాళ్ళు
(3) మెరారీ 6 00 మంది మగవాళ్ళు

1) ఘర్షాన్ ఫ్రాట్రీ.

గణాలు 1) లిబ్నీ 2) షిమై

2) కోహాత్ ఫ్రాట్రీ

గణాలు 1) అమ్రామ్ 2) ఇజూర్ 3) హెబ్రాన్ 4) ఉజ్జీల్

3) మెరారీ ఫ్రాట్రీ

గణాలు 1) మాహ్లా 2) మూషి

"తమ తండ్రుల, కుటుంబాల పేర్లతో లేవీ సంతానం లేవీ కొడుకులు. వీరి పేర్లు ఘర్షాన్, కోహాత్, మెరారీ ఘర్షాన్ కొడుకులు, వారి కుటుంబాల పేర్లు యివి లిబ్నీ, షిమాయిలు కోహాతు కొడుకులు, వారి కుటుంబాలు అమ్రాన్, ఇయూర్ హెబ్రాన్, వుజీల్‌లు మెరారీ కొడుకులు వారి కుటుంబాలు మహ్లీ, ముషీలు తమతండ్రి పేరున లేవీ కొడుకులకు చెందిన కుటుంబాలు యివి "(నంబర్స్)

ఈ సమూహాలని వర్ణించేటప్పుడు ఒక్కొక్కప్పుడు నిర్మాణాలలో పైదాని నుంచి ప్రారంభం చేస్తారు ఒక్కొక్కప్పుడు దిగువ నుంచి ప్రారంభం చేస్తారు "సిమ్యోన్ సంతానం వారి తర్వాతి తరాలు, వారి కుటుంబాలు, వారి తండ్రుల యింటి పేర్లతో"-యిక్కడ సిమియాన్ సంతానం వారి తర్వాత తరాలు అన్నది తెగ కుటుంబాలు అన్నది ప్రాట్రీ తండ్రి పేరు అన్నది గణం మళ్ళీ యింకోచోట "కోహాత్ కుటుంబాలలోని తండ్రి యింటికి నాయకుడు వుజీ కొడుకయిన ఎలిజాఫాన్ అయ్యాడు" యిక్కడ మొదట్లో గణం కన్పిస్తుంది తర్వాతది ప్రాట్రీ చివరతెగ పేర్లు కన్పిస్తాయి పైన పేర్కొన్న ఎలిజాఫాన్ ప్రాట్రీకి నాయకుడు ప్రతి తండ్రి యింటి పేరు గల వారికి ఒక చిహ్నము ఒక జండా వుంటాయి యితరుల నుంచి వారిని గుర్తించడానికి అవి సహాయ పడతాయి "యిజ్రాయిల్ సంతానం ప్రతి యొక్కరు తన తండ్రి యింటి గుర్తుతో తన జెండాను పాతుతారు" ఈ పదాలు నిజానికి నిర్మాణాలను వర్ణిస్తున్నాయి వారి సైన్య నిర్మాణము, గణాలు, ప్రాట్రీలు, తెగలు వారీగా వున్నట్లు చూపుతున్నాయి.

ప్రతి ప్రాట్రీలోను వున్న సభ్యులసంఖ్య చూస్తే "తండ్రి ఇల్లు లేక గణంలో కొన్ని వందల మంది వుండి వుంటారు బేతాబ్ అనే హీబ్రూ మాటకి అర్థం తండ్రి యిల్లు కుటుంబ గృహము. హీబ్రూలలో గణమే వుంటే ఈ యింటి ప్రజలే అయి వుంటారు అయితే ఆ వుపయోగించిన పదాలు అనుమానం కలిగిస్తున్నాయి దంపతీ కుటుంబాలు విస్తారంగా ఏర్పడి వంటరి కుటుంబాలు ఎక్కువ కావడం చేత బంధుకూటాన్ని యిలా త్రిప్పి చెప్పారా? అమ్రాయ్ ఇల్లు, యిజాక్ యిల్లు, హెబ్రాన్ యిల్లు, అనే మాటలున్నాయి ఆనాడు హీబ్రూలలో ఈనాడు లాగ కుటుంబ నామంతో ఇల్లు వుండే అవకాశం లేదు అందుచేత బంధువుల ఇల్లుగా

పుపయోగించి వుంచాలి "తండ్రి ఇల్లు అన్నది ఒక సాంకేతిక పదము ఒక పూర్వ పురుషుని పేరుతో పిలుచుకొనే కొన్ని కుటుంబాల సమూహం "అంటూ ఎక్సోడస్‌మీద కీల్, డెలిజెక్‌లు వ్యాఖ్యానించారు ప్రతిశాఖకు, ఉపశాఖకు నాయకుడు మగవాడే అయి వుంటాడు వంశ పారంపర్యాన్ని కేవలం మగ వారి ద్వారానే లెక్క పెట్టడం హీబ్రూలలో వుండడంచేత వారిలో పురుష పారంపర్యమే అనాటికి వున్నదని నిస్సందేహంగా చెప్పవచ్చు కుటుంబమునకు పైన వున్న నిర్మాణం ఫ్రాట్రీ హీబ్రూ భాషలో దీనిని మిష్ పాక్ అంటారు అంటే సంఘము, కుదురు ఒక తండ్రి పేరిటి ఇల్లు రెండు మూడుగా విడబడడం, అవి కుటుంబం పేరుతో సమూహంగా ఏర్పడడం వలన యిది ఏర్పడింది యిది ఫ్రాట్రీకి చాల దగ్గరగా వున్న శబ్దము కుటుంబము లేక ఫ్రాట్రీకి ఏకేటా ఒక విందు వుంటుంది చివరదైన తెగను హీబ్రూ భాషలో మట్టె అంటారు దాని అర్థం శాఖ లేక కొమ్మ యిది గ్రీషియన్ తెగకు సరిపోతుంది

ఈ రక్త బంధువుల హక్కులు బాధ్యతలు గురించి మనకు అట్టే వివరాలు తెలియవు 'తండ్రి ఇల్లు' నుంచి తెగ వరకు వున్న ఈ నిర్మాణాలలో రక్త బంధుత్వ భావం, గ్రీకు, లాటిన్, అమెరికన్ ఇండియన్ తెగల అదే మాదిరి నిర్మాణాలలో కన్న స్పష్టంగానూ ఖచ్చితంగానూ కనిపిస్తుంది అధీనియన్ సంప్రదాయాల ప్రకారం వారి నాలుగు తెగలు ఇయాన్ నలుగురు కొడుకుల నుంచి వచ్చినట్టు చెపుతారు కాని తెగలు, ఫ్రాట్రీలు ఎలా వచ్చాయో చెప్పరు తద్భిన్నంగా జాకోబు పన్నెండుగురు కొడుకుల నుంచి పన్నెండు తెగలు వచ్చాయని వారి పిల్లలు, వారి తర్వాత తరాల నుంచి గణాలు, ఫ్రాట్రీలు ఏర్పడ్డాయని హీబ్రూలు చెప్తారు ఈ విధంగా గణాలు, ఫ్రాట్రీలు పెరిగినట్లు సమాచారం మానవుని అనుభవాలలో మరెక్కడా కన పడదు అనాటికి వున్న రక్త బంధు సమూహాలను వర్గీకరించడం, చిన్న చిన్న ఆటంకాలు వస్తే చట్టాల ద్వారా పరిష్కరించడం, ఈ నిర్మాణాలు ఏర్పడడానికి కారణం అని చెప్పవచ్చు

హీబ్రూలు తాము యిస్రాయిల్ సంతానమని "సమీకరణము" అని చెప్పుకుంటారు అంటే తమ సంఘము సామాజికమైనదే కాని రాజకీయం కాదని స్పష్టముగా చెప్పుకోవడమే

ఆఫ్రికాలో అటవిక అనాగరిక యుగాలు రెండూ కలిసి గందరగోళంగా కన్పిస్తాయి. వారి స్వంత కళలు కల్పనలు పూర్తిగా అదృశ్యమయ్యాయి వస్త్రాలు,

పాత్రలు బయట నుంచి వచ్చాయి అయితే ఖండం అధిక భాగంలో అటవిక యుగం అట్టడుగు రూపాలుఅనాగరిక యుగం అట్టడుగు రూపాలు కూడ కన్పిస్తాయి ఖండం లోపలి భాగాలలో ఆ ప్రాంతీయ సంస్కృతి కొంచెం కొంచెం దగ్గరగా కన్పిస్తుంది కాని మొత్తం మీద ఆఫ్రికా మనుష్య జాతి పరిణామరంగంలో పట్టి ఎడారి అని చెప్పచ్చు

ఆఫ్రికా నీగ్రో తెగలు పుట్టినిల్లు కాని వారి సంఖ్యా తక్కువే వుండే ప్రదేశాలూ చిన్నవే నీగ్రో ప్రధానంగా ఆఫ్రికను అన్నారు లాథామ అశిరా, అపోనో, ఇశోగో, అశాంగోలు కాంగో నదికి, నైగర్ నదికీ మధ్యలో వున్నారు వీరు అసలైన నీగ్రోలు "ప్రతిగ్రామానికి ఒక నాయకుడున్నాడు ఇంక దేశం లోపలి గ్రామాలలో పెద్దరికం పెద్దలది ప్రతి పెద్ద తన అనుచర ప్రజలతో గ్రామంలో ఒక భాగంలో ప్రత్యేకంగా నివసిస్తారు ప్రతి కుదురుకు ఇహౌమో, ఫూమో వుంటారు ఈయన ఆ కుదురుకు పెద్ద ఇహౌమో అంటే మూలము తండ్రి వారి తెగలు కుదురులుగా ఎలా విడిపోయాయో వారికి తెలియదు యిప్పుడు క్రొత్త కుదురులు ఏర్పడడం లేదు . పెద్ద యొక్క ఇల్లు చుట్టుప్రక్కల ఇళ్ళ కంటె గొప్పగా వుండదు నిరంకుశ పాలన అక్కడ లేదు . ఎవరికైన మరణశిక్ష వేయాలంటే పెద్దల సమితి నిర్ణయించాలి తెగలు, కుదురుల మధ్య పరస్పరం అంత ర్వివాహము వుంది దీనివలన ప్రజలలో మైత్రీ భావం ఏర్పడుతుంది ఒకే కుదురుకి చెందిన వారిలో అంతర్వివాహం నిషిద్ధం. ఎంత స్వల్పమైనా రక్త బంధుత్వపు కలయికను మహాపాపంగా భావిస్తారు బలాక్రైలలో తండ్రి భార్యలను (తల్లిని తప్ప) కొడుకు కట్టుకుంటాడు అలాగే వీరిలోను . నేను చూసిన ప్రతిచోట బహు భార్యాత్వం, బానిసత్వం వున్నాయి . పశ్చిమ ప్రాంతపు తెగలలో పెద్దవాని ఆస్తి (స్త్రీలు, బానిసలు, వగైరా) తరువాత తమ్ముడికి సంక్రమిస్తుంది కడగొట్టువాడు చనిపోతే ఆ ఆస్తికి వారసుడు అగ్రజుడు చనిపోయిన వారికి అన్నదమ్ములు లేకపోతే ఆస్తి మేనల్లుడికి వెడుతుంది ఆస్తి వారసత్వం లాగే కుదురు పెద్దరికం, కుటుంబ పెద్దరికం వంశ పారంపర్యం అన్నదమ్ములందరూ చనిపోతే పెద్ద సోదరి పెద్ద కొడుకుది వారసత్వం ఆ శాఖ అంతరించి పోయే వరకు ఇదే క్రమం కొనసాగు తుంది ఇక్కడ కుదురులన్నీ తల్లి పారంపర్యంలో పరిగణించబడుతున్నాయి" ఇంటూ దూ చైల్లు తన "అశాంగో భూమి"లో రాశాడు,

ఇందులో అసలు గణ లక్షణాలన్నీ కన్పిస్తున్నాయి స్త్రీ పారంపర్యం వుంది అంటే, ఆ గణం అతి ప్రాచీన రూపంలో వుంది అనాలి పైగా పదవి, ఆస్తి, గణం పేరు స్త్రీ పారంపర్యంలోనే వున్నాయి అమెరికన్ ఆదివాసులలో లాగే నాయక పదవి అన్ననుంచి తమ్ముడికో లేక మామ నుంచి ఆయన చెల్లెలి కొడుక్కో చెందుతుంది కాని కొడుకులకు చెందదు ఏమంటే వారు చనిపోయిన నాయకుని గణానికి చెందరు గణంలో వివాహం నిషిద్ధం యింత విచిత్రమైన సమాచారంలో కూడ గణాల పేర్ల విషయం చెప్పలేదు వారసత్వం గురించి మరికొంత వివరం కావాలి

జాంబసీ నది మీది బాణ్యాయి తెగలు నీగ్రోలకన్న పై స్థాయిలో వున్నారు వారి ఆచారాలను గురించి, లివింగ్‌స్టన్ యిలా వ్రాశాడు "బాణ్యాయిలలో పాలనా పద్ధతి చిత్రంగా వుంది అదొక రకమైన ఫ్యూడల్ రిపబ్లికన్ పద్ధతి నాయకుని ఎన్ను కుంటారు ఎన్నుకునేటప్పుడు చనిపోయిన వాని చెల్లెలి కొడుకును ఎన్ను కుంటారు స్వంత కొడుకును కాదు సరియైన మనిషి దొరక్కపోతే దూరపు తెగనుంచి వారసుణ్ణి తీసుకొస్తారు సాధారణంగా చనిపోయినవాని కుటుంబానికో అతని తమ్ముణ్ణో, చెల్లెలి కొడుకునో తెచ్చుకుంటారే కాని ఆయన కొడుకును కాని, కూతురును కాని తెచ్చుకోరు చని పోయిన వారి భార్యలు, వస్తువులు, పిల్లలు, ఈ క్రొత్త వానికి చెందుతారు ఒక వూరి కుర్ర వాడు మరో వూరి అమ్మాయిని యిష్టపడితే ఆ వివాహానికి తల్లితండ్రుల అభ్యంతరం లేకపోతే అతడు ఆమె వూరికి వెళ్ళి అక్కడ నివసించాలి అక్కడ అత్తగారికి కొన్ని పనులు చేస్తూ వుండాలి ఈ పరాధీనపు బతుకుకు విసిగిపోతే అతడు స్వంత కుటుంబానికి తిరిగిరావచ్చు కాని తన పిల్లలందరిని వదిలెయ్యాలి వారంతా భార్యకు చెందుతారు" అని 'దక్షిణాఫ్రికాలో ప్రయాణం'లో లివింగ్‌స్టన్ వ్రాశాడు వారి సామాజిక నిర్మాణం గురించి, లివింగ్‌స్టన్ వివరాలేమి చెప్పలేదు అయితే నాయక పదవి అన్న నుంచి తమ్ముడికి మేనమామ నుంచి మేనల్లుడికి వస్తుం దనడం చేత గణం వున్నదని స్త్రీ పారంపర్యం సాగుతున్నదని అర్థం చేసుకోవాలి

జాంబసీ నదీ పరీవాహ ప్రాంతం నుంచి దక్షిణాన కేప్‌కాలనీ వరకు ఎన్నో తెగలున్నాయి వారంతా ఒకే మూల పురుషుడి నుంచి వచ్చినట్లు వారే చెప్పుకుంటారు వారు మూడు ప్రధానమైన విభాగాలుగా వున్నారు బెకువానాలు, బసూటోలు, కాఫిర్‌లు అందులో మొదటి వారిని గురించి ఆయన యిలా వ్రాశాడు "బెకువానా తెగలు అంతు

వుల పేర్లతో వున్నాయి ప్రాచీన ఈజిప్షియనుల లాగ వీరు కూడ ప్రాచీనకాలంలో జంతు పూజకు అలవాటు పడివుంటారు 'బాకాట్ల' అంటే కోతి సంతానం 'బకువేనా' మొసలి సంతానము 'బట్లాపి' చేప సంతానము ప్రతి తెగ తమ పేరిటి జంతువు అంటే హడలి పోతారు ఏ తెగ తన పేరిటి జంతువును తినదు అంతరించి పోయిన అనేక ప్రాచీన తెగల బాపతు ఒకళ్ళు, ఇద్దరు మనుష్యులు వానికి గుర్తుగా కన్పిస్తారు బటావ్లు సింహ సంతానం, బనోగాలు సర్ప సంతానం, ప్రస్తుతం ఈ తెగలు లేనేలేవు "ఈ జంతువుల పేర్లు తెగలను కాక గణాలను సూచిస్తున్నాయి ఒక్కొక్క తెగకి ఒకళ్ళు యిద్దరు మిగిలారంటే అది గణమైవుంటుంది కాని తెగ అయి వుండదు ఉస్సాంగే లోయకు చెందిన బన్‌గాలాలు అర్గోలాలో వున్నారంటూ లివింగ్ స్టన్ యిలా వ్రాశారు "నాయకుని కొడుకుకు బదులు అతని తమ్ముడు వారసుడవుతాడు అక్కచెల్లెళ్ళ పిల్లలు అతనికి చెందుతారు తన రుణాలు తీర్చుకోవడానికి మేనళ్ళుల్ల నమ్మేయడం తరచూ జరుగుతుంది" యిక్కడ కూడ స్త్రీ పారంపర్యానికి సాక్ష్యం కనిపిస్తుంది కాని ఆయన మాటలువాలా సంగ్రహంగా, సాధారణ రూపంలో వుండడం చేత వారిలో గణాలున్నాయోలేదో స్పష్టంగా తెలియదు

ఆస్ట్రేలియనులలో కమిలారాయ్‌లలో గణాలు గుర్తించబడ్డాయి మానవ జాతి పరిణామంలో ఈ ఆదిమ వాసులు అట్టడుగు దశలో వున్నారు ప్రపంచానికి తెలిసిన నాటికి వారు అటవికులే కాదు అందులోను అట్టడుగు దశ కొందరు మనుష్య మాంసం తినేవారు. ఈ చివరి విషయంలో ఫిసన్ యిలా వ్రాశారు "ఈ తెగలలో కనీసం కొందరు మనిషి మాంసం తింటారు యిందుకు సందేహం లేదు వైర్‌బేలోని తెగలు యుద్ధంలో చనిపోయిన తమ శత్రువుల్నే కాదు,చచ్చిపోయిన తమ స్నేహితుల్ని కూడ తింటారు. చెడిపోకుండా వుంటే సహజ మరణం పొందిన వారినీ తింటారు తినే ముందు చర్మం ఒలిచి వాటిని కొవ్వు, బొగ్గుతో రుద్ది నిలువ చేస్తారు అవి మందులుగా చాల విలువగలవని ఎంతో పదిలంగా జాగ్రత్త పరుస్తారు"

ఈ మాదిరి జీవిత చిత్రాల నుంచి అటవిక దశను, అప్పటిఆహారాలను,పాదార్థిక అభివృద్ధిని,ఆ ప్రజల మానసిక నైతిక జీవితపు అధమ స్థాయినితెలుపుతాయి మనుష్య మాంసము తినే ఆచారాన్ని పట్టి ఆస్ట్రేలియనులు భూమి మీది మానవులలో అట్టడుగు స్థితిలో వున్నారనాలి అయినా ఆస్ట్రేలియన్లకి అతి విశాలమయిన ఖండం వుంది అక్కడ ఖనిజాలు ఎక్కువ సుభిక్షమైన వాతావరణం జీవనాధారం కూడ బాగానే వుంది కాని వేలసంవత్సరాలుగా అక్కడ వున్న వాళ్ళింకా ఆటవిక దశలోనే వున్నారు

పైవాళ్ళతో సంబంధం లేక పోతే మరో కొన్ని వేల యేళ్ళు గడిచినా ఏ మాత్రం మార్పులేకుండా ఆటవిక దశలోనే అలాగే వుండిపోయేవారు

ఆస్ట్రేలియనులలో సాంఘిక నిర్మాణాలు అతిమామూలుగా సన్నిహితంగానే వున్నాయి ఒక్క కమిలారాయ్‌లలోనే కాక గణ నిర్మాణం సర్వత్రా వున్నట్టు కన్పిస్తుంది లాసెపెదేవే సమీపంలోని నర్రిన్‌యెరీలలోని గణాలు జంతువులు, పురుగుల పేర్లతో వున్నాయి రెవరెండ్ జార్జి తాప్లిన్ నా మిత్రుడు ఫిసన్‌కు జాబు వ్రాస్తూ నర్రిన్‌యెరీలు తమ గణంలో వివాహం చేసుకోరని, పిల్లలు తండ్రి గణానికి చెందుతారని వ్రాశాడు "న్యూ సౌత్ వేల్స్‌లోని కమిలారాయ్ భాష మాట్లాడే తెగలలో మాదిరిగా వీరిలో కులాలూ తరగతులూలేవు ప్రతితెగ లేక కుటుంబానికి (తెగ ఒక కుటుంబం) ఒక చిహ్నం వుంటుంది దానిని నగైత్యే అంటారు కొంత మంది వ్యక్తులకు కూడ ఈ నగైత్యే వుంటుంది దానిని తమ కుటుంబపు పూర్వ పురుషునిగా భావిస్తారు అదో జంతువో, పక్షో, పురుగో అయివుంటుంది వారు తమ వివాహ విషయాలలో చాల కట్టుదిట్టంగా వుంటారు తమ తెగను (గణమును) ఒక కుటుంబంగా భా స్తారు ఎవ్వడూ తన తెగలో పెళ్ళి చేసుకోకూడదు "

ఫిసన్ యిలా వ్రాస్తున్నాడు "క్వీన్స్‌లాండ్ లోని మరనోవా జిల్లాలో తెగలు ఒక్కో మాండలికం మాట్లాడుతారు కమిలారాయ్ భాష మాట్లాడే తెగలలో లాగే తరగతుల విభజన, వాని పేర్లు చిహ్నాలు వున్నాయని ఏ ఎస్ పి కమెరాన్ నాకు వ్రాశాడు " అన్నాచార్లెస్ జీ ఎన్‌లాకేవుడ్ యిచ్చిన సమాచారాన్ని పట్టి డార్లింగ్ నది మీది ఆస్ట్రేలియన్లు "తెగలుగా (గణాలు) విడబడి యున్నారని, ఎమూ, అడవి బాతు, కంగారు, పేర్లువున్నాయని చెప్పారు యింకా ఏమైన వున్నాయా ? పిల్లలు తరగతిపేరు, తల్లి చిహ్నాన్ని పెట్టుకుంటారా ? అనేది చెప్పలేదు " అన్నాడు

పైన చెప్పిన తెగలలో గణ నిర్మాణం వుండటాన్ని పట్టి ఆస్ట్రేలియన్ ఆదివాసులలో సర్వత్రా అది వున్నదని అనుకోవచ్చు అయితే పైన నేచెప్పినట్లు అతి ప్రాథమిక అభివృద్ధి దశలోనే అది వుండింది

పాలినీషియా, మైక్రొనీషియా, పాపువా దీవుల లోని ప్రజలలో కుటుంబాల సమాచారం సమగ్రంగా లేదు హవాయి, సామోవా, మార్క్వెస్ దీవులలో కాని న్యూజిలాండ్ వాసులలోగాని గణ నిర్మాణం యొక్క ఛాయలు కూడ కన్పించడం లేదు వాటిలో బంధుత్వ వ్యవస్థ అతి ప్రాధమిక దశలో వుంది గణ నిర్మాణం ఏర్పడే టంతటి కావలసిన దశకు కూడ ఎదగలేదు మైక్రొనీషియా దీవులలో నాయక

పదవి స్త్రీ పారంపర్యంలో సంక్రమిస్తుంది ఈ ఆచారానికి గణాలు వుండనక్కర లేదు ఒకే మూల భాష యొక్క మాండలికాలు మాట్లాడే అనేక తెగలుగా ఫిజీ ద్వీప వాసులు విభజింప బడియున్నారు వీరిలో ఒకరైన రేవాలలో నాలుగు పేర్లతో నాలుగు విభాగాలున్నాయి అవి మళ్ళీ విభజించబడి యున్నాయి ఈ అట్టడుగు విభజన గణాలుగా కన్పించదు ఏమంటే యితర చోట్ల లాగే యిక్కడ కూడ వారిలో అంతర్వివాహం నిషిద్ధం కాదు వారిలో పురుష పారంపర్యము సాగుతుంది టోంగన్‌లలో అదే విధంగా విభాగాలున్నాయి అవి మళ్ళీ ఉపవిభాగాలుగా చేయబడ్డాయి రేవాలలోలాగే

వివాహము, కుటుంబం గురించి జీవనాధారము, పరిపాలనా గురించి అతి ప్రాథమిక భావాలు వాని చుట్టూ అతిప్రాథమిక సామాజిక నిర్మాణాలు ఏర్పడ్డాయి వాటినాధారం చేసుకొని, ప్రాచీన సమాజపు నిర్మాణం గురించీ, లక్షణాలను గురించీ చెప్పవలసియుంది మానవజాతి యుగ యుగాలుగా గడించిన అనుభవం ఆధారంగా క్రమాభివృద్ధి పొందుతారనే సిద్ధాంతాన్ని అంగీకరిస్తేఈ సముద్రాంతరదీవులలోజీవిస్తున్న వారు బయటిసంపర్కం లేకుండ పరిమిత ప్రదేశాలలో పరిమితమైన జీవనాధారాలతో వుండడంచేత వారి అభివృద్ధి చాలా నెమ్మదిగా జరుగుతుందని చెప్పాలి ఆసియా ఖండం మీదున్న పరిస్థితికన్న వీరి పరిస్థితి చాలా వెనుకబడివుంది ఏకాంత వాసంవల్ల వీరిలో కొన్ని వైపరీత్యాలు కనిపించినా మొత్తంమీద ఈ దీవులలోని సమాజాలు మానవాభివృద్ధిక్రమంలో అతి ప్రాథమికస్థాయిలో వున్నాయి వారి ఆచారాలను, కల్పనలను అన్వేషణలను మానసిక నైతిక ధోరణులను తెలుసుకోవడం మానవజాతి శాస్త్రానికి అతిముఖ్యావసరాలలో ఒకటి గణ సంస్థయొక్క నిర్మాణంగురించి విస్తృతి గురించి చర్చ యింతతో ముగుస్తుంది ఆ నిర్మాణం ఆస్ట్రేలియాలలోను ఆఫ్రికాలోని నీగ్రోలలోను కనిపించింది ఆఫ్రికన్ తెగలలో దాని ఛాయలు కన్పించాయి. ప్రపంచానికి తెలిసిన నాటికి అమెరికన్ ఆదివాసులు అనాగరికయుగం దిగువ దశలో వున్నారు వారిలో అది సర్వసాధారణంగా కనిపించింది అనాగరికయుగం మధ్య దశలోవున్న కొందరు గ్రామవాసి ఇండియనులలో కూడా అదివుంది అనాగరికయుగం ఎగువదశలోవున్న గ్రీకు లాటిన్ తెగలలో అది మంచి జీవంతో వుంది ఆర్యన్ కుటుంబానికి చెందిన మిగిలినశాఖలు చాలా వానిలో దాని ఛాయలున్నాయి తురానియన్ యురాలియన్, మంగోలియన్ కుటుంబాలలో ఆ సంస్థగాని దాని ఛాయలుగానివున్నాయి తుంగుసియన్, చైనా ప్రజలలో, సెమిటిక్ కుటుంబానికి చెందిన హీబ్రూలలోను అంతే, యిది సర్వత్రా ప్రాచీనకాలం నుంచి మానవజాతి కుటుంబాలలో వున్నదనీ

అటవికయుగం చివరి భాగంలోనూ, అనాగరికయుగం పొడుగునా సాధారణంగా సర్వత్రా వున్నదని చెప్పడానికి ఎన్నో వాస్తవ ఆధారాలు దొరికాయి

ఈ పరిశీలనలో గణసంస్థ ప్రాచీన సమాజానికి మూలము అని చెప్పడానికి తగినంత సాక్ష్యం దొరికింది దీనినిర్మాణ సూత్రం అతి ప్రాథమికం అనుభవంతో అది క్రమంగా అభివృద్ధిపొంది స్పష్టమైన పథకం ప్రకారం సమాజాన్ని నిర్మించ గలిగింది తగినంత అభివృద్ధిపొంది రాజకీయ సమాజంగా మార్పుపొందే వరకు సమాజాన్ని నిర్మాణయుతంగా ఐక్యపరిచి వుంచింది అన్ని అంశాలలో నేటివరకు అది కొనసాగటాన్ని పట్టి దాని ప్రాచీనతను, విస్తృతిని, జీవశక్తిని కనబరచగలిగింది ఈ వివిధయుగాలలో మానవజాతి అవసరాలకు గణసంస్థ అద్భుతంగా సర్దుకుంది దాని వ్యాప్తి, విలకడ తనను ఆ సర్దుబాటు శక్తికి సాక్ష్యం మానవజాతియొక్క అనుభవా లలో చాల ప్రధానమైన భాగం దానితో ముడిపడియుంది

సమాజంలో ఒక ప్రత్యేకమైన పరిస్థితి వున్నప్పుడు గణం ఏర్పడటం పరస్పర సంబంధంలేని ప్రదేశాలలోకూడ అలాగే ఏర్పడుతుంటుందాలేక ఒకే చోట పుట్టి క్రమంగా జనం వలసపోవటంతో భూమి అంతటా వ్యాపించిందా ? అనే ప్రశ్నలు ఆలోచించ వలసి యున్నది ఒక కేంద్రంలో పుట్టి భూమిఅంతా వ్యాపించింది అన్న అభిప్రాయాన్ని కొద్ది సర్దుబాట్లతో ఆమోదించవచ్చును అనిపిస్తుంది. అందుకు కారణాలున్నాయి. గణం ఏర్పడక పూర్వమే రెండు తరహాల వివాహ పద్ధతులు, రెండు కుటుంబరూపాలు వున్నాయని చూశాము రెండవ తరహా వివాహ పద్ధతికి— కుటుంబ రూపానికి చేరడానికై మనిషికి ఒక ప్రత్యేకమైన అనుభవం అవసరం గణాన్ని నిర్మించడంలో ఈ అనుభవంమరింత బలపడుతుంది అటవికదశలో మనిషిని బలంగా పట్టివుంచిన ఆ అసాధారణమైన స్త్రీ పురుష సంబంధాల వ్యవస్థను సంకోచ పరచడం ద్వారానూ, సహజమైన ఎన్నిక ద్వారానూ వచ్చిన ఫలితమే రెండో కుటుంబ రూపం ఈ పరిణామం ఎంతో ముఖ్యమైనది చాలా అసాధ్యమైనదీని వేరువేరు దూర ప్రదేశాలలో ఈ అనుభవమే తిరిగి తిరిగి అనేక పర్యాయాలు కలిగిందనడం ఉచితంగా తోచదు మానవ కుటుంబం పుట్టినప్పటినుంచి రక్షణకోసం జీవనోపాధి కోసం రక్త సంబంధీకుల గుంపులు వున్నాయి. కాని గణం అనేది మరోరకమైన రక్త బంధువుల నిర్మాణం కొంతమందిని అది తనలో యిముడ్చుకొంటుంది మిగిలిన వారిని ప్రక్కకుపెడుతుంది తనలో యిముడ్చుకున్న వారిని బంధుత్వపు అనుబంధంతో ఒకే పేరుతో, సమానమైన హక్కులు, సౌకర్యాలతో నిర్మాణ పరుస్తుంది సంబంధం

లేని వ్యక్తులతో వివాహాల వలని లాభాలను పొందేటందుకై గణంలో వివాహం నిషేధించబడింది ఈ నిర్మాణంలోని ప్రధాన సూత్రమిది దీనిని నెలకొల్పడం చాల కష్టం కూడాను సహజంగా కళ్ళకు కనిపించే సూత్రానికి బదులు గణం అనేది నిగూఢమైనది అది ప్రారంభమైన నాటికి ఎంతో తెలివి కనబరిచి నిర్మించినదీను ఆ ఆలోచన కలిగి కార్యరూపం ధరించి సమగ్రరూపం ధరించడానికీ, దాని ఉపయోగాలు బయట పడడానికీ, ఎంతోకాలం పట్టింది పాలినీషియన్లలో పునలూన్ కుటుంబంవుంది కాని వారు గణాల్ని నిర్మించలేక పోయారు ఆస్ట్రేలియనులలో గణాలువున్నాయి గణము పునలూన్ కుటుంబంనుంచి పుడుతుంది ఆ స్థాయికి చేరినతెగలలో గణాలు ఏర్పడడానికి కావలసిన పరిస్థితులు వున్నాయనుకోవచ్చు చెప్పిన ఊహకు చేయవలసిన సవరణయిది అంతకు పూర్వంవున్న స్త్రీ పురుష విభాగంతో ఏర్పరచిన నిర్మాణంలో కూడ గణబీజాలు వున్నాయి గణం బాగా అభివృద్ధి పొందినాక ఆ పురాతన రూపంలోనే విస్తృత ప్రాంతాలలో తనంతగానే వ్యాపిస్తుంది దానివలన మంచి బలమైన జనం కలగడం వలన ఫలితం అది భూమిమీదవున్న ఏ ఆటవికులకన్న బలమైన జనాన్ని గణం సృష్టించగలిగింది ఆ ఆటవిక జీవితంలో భయంకొద్ది పారిపోనీయండి, మంచి ప్రదేశాలు వెతుక్కుంటూ తిరగనీయండి, అటువంటి బలమైన జనం గుంపులు గుంపులుగా భూభాగంమీద బాగ వ్యాపిస్తారు ఈ సమస్యమీద యింత వరకు మనకు లభించిన వాస్తవాలను ఆలోచిస్తే గణాలు ఒక చోట పుట్టి వ్యాపించాయనే ఆలోచనకే బలం దొరుకుతూంది ఆస్ట్రేలియాలోని తరగతుల విభజన పునలూన్ కుటుంబాన్ని తీసుకొచ్చింది దాని నుంచి గణం పుట్టింది స్త్రీ పురుష తరగతులుగా సమాజాన్ని విడదీయడంలోనే గణ నిర్మాణం అంతర్భూతంగా వుంది ప్రాచీన సమాజానికి అసలు పునాది ఈ తరగతుల విభజనయే అనికూడ చెప్పవచ్చు

మానవజాతి మూలం ఒకటే అన్నట్లయితే వారు ఒక మూలకేంద్రం నుంచి వలసలుపోయి భూమినంతను ఆక్రమించారు అనుకోవలసియుంది మానవజాతుల యొక్క జన్మభూమిగా ఆసియా ఖండాన్ని చెప్పాలి యూరప్, ఆఫ్రికా, అమెరికాల కంటే అక్కడ అసలు, పసలైన మానవ తరగతులు అధిక సంఖ్యలో వున్నాయి. సమాజం స్త్రీ పురుష ప్రాతిపదికపై ఏర్పరచినపుడు, పునలూన్ కుటుంబ రూపం వుండగా, మూల మానవ కుటుంబం నుంచి నీగ్రోలు ఆస్ట్రేలియనులు విడబడ్డారని చెప్పవలసి యుంటుంది పాలినీషియనుల వలస తర్వాత జరిగింది కాని అప్పటికీ

అదే సమాజ నిర్మాణం కొనసాగుతూంది తర్వాత చాల కాలానికి గణాలు ఏర్పడ్డాక గనోవానియన్లు అమెరికాకు వలసపోయారు ఇవన్నీ ఊహలుగామాత్రమే చెప్తున్నాను

పురాతన సమాజం గురించి సరిగ్గా తెలుసుకోవాలంటే గణాలను గురించి వాటి లక్షణాలను గురించి, వ్యాప్తిని గురించి తెలుసుకోవడం చాల అవసరం యిందుకై విస్తృతమైన పరిశీలన ప్రత్యేకంగా జరుగవలసియుంది నాగరిక జాతుల పూర్వీకులు అనాగరికయుగపు ఎగువదశలోవుండగా వారిలో యిటువంటి సమాజం ఏర్పడింది కాని అదే సమాజం వివిధ అంతరువులలో అతిపురాతనకాలం నుంచీ వుంటూనే వుంది అనాగరికులలోను అటవికులలోను ఆ వెనుకటి అంతర్దశలను మనమిప్పుడు అన్వేషించాలి మానవజాతి పుట్టుక మొదలుకొని నేటి వరకు నిర్మాణయుతమైన సమాజం అనే భావన క్రమంగా అభివృద్ధి పొందింది అందులో అనేక అంతర్దశలున్నాయి వానికి పరస్పర సంబంధం వుంది ఒకదాని నుంచి ఒకటి పుట్టుకొచ్చాయి. గణాలు పుట్టడానికి కారణమైన దశను గురించి మన ఆలోచన అందుకే మానవుని యొక్క అభివృద్ధితో ముడిపడియున్న అంత ప్రాచీన ఆచారం ఇంకొకటి లేదు ఆచారాల పెరుగుదలా, అభివృద్ధీ — వీని చరిత్రలోనే మానవజాతి వాస్తవ చరిత్ర ఇమిడియుంది ఆ ఆచారాలలో గణం ఒకటి మానవ వ్యవహారాలమీద అపారమైన భౌతిక ప్రభావం కలిగించిన వానికి ఈ గణం పునాది

# మొదటి ప్రకరణం

# పురాతన కుటుంబము

**వరుసలో** అయిదు కుటుంబ రూపాలు — మొదటిది రక్తసంబంధీకుల కుటుంబము—అది మలయన్ బంధుత్వ అనుబంధాల వ్యవస్థను సృష్టించింది.— రెండవది పునాలాన్ — అది తురానియన్, గణోవానియన్ వ్యవస్థను సృష్టించింది—మూడవది — దంపతీ కుటుంబం — ఇది ఆర్యన్ సెమిటిక్ యురాళియన్ వ్యవస్థను సృష్టించింది — సింథియాస్మియన్ పేట్రియార్కల్ కుటుంబాలు మధ్యంతరంలోనివి — ఈ రెండు బంధుత్వ వ్యవస్థను కల్పించలేదు — ఈ వ్యవస్థలు సహజంగానే వచ్చాయి — రెండు చిట్టచివరి రూపాలు — ఒకటి వర్గీకరణము, రెండోది వర్ణనాత్మకము — ఈ వ్యవస్థల సాధారణ లక్షణాలు— విలకడగా అవి కొనసాగే పరిస్థితి

దంపతీ కుటుంబము అన్నదే మొదటి నుంచీ ఎప్పుడూ ఉంటూ ఉందని, మధ్య మధ్య అక్కడక్కడా బహు భార్యా కుటుంబము ఉంటూ వచ్చినదని అనుకోవడము మనకు అలవాటు అది సరికాదు కుటుంబ భావము అనేక దశలుగా పెరిగింది. ఆ రూపాలలో దంపతీ కుటుంబము చివరిది. అటవిక దశ పొడుగునా, అనాగరిక యుగం దిగువ, మధ్య దశలలోను సర్వత్రా ఇంతకన్నా ప్రాచీన రూపాలు ఉండేవని చెప్పడం నా ఉద్దేశం దంపతీ కుటుంబము కాని, బహు భార్యా కుటుంబముగాని అనాగరిక యుగం ఎగువ దశకు పూర్వము కనపడవు — అవి ఇటీవలనే అంతకు పూర్వము ఉన్న రూపాల అనుభవము మానవజాతి తెగలలో వానిని ప్రవేశపెట్టేందుకు మార్గము ఏర్పడినది ప్రాచీన సమాజములో అవి ఏర్పడటం అసంభవము

ఒకదాని తరువాత ఒకటిగా స్పష్టంగా ఐదు వేరు వేరు రూపాల కుటుంబాలను గుర్తించగలము ప్రతి దానికీ దాని దాని వేరు వేరు వివాహ పద్ధతులు ఉన్నాయి.

1) రక్త సంబంధీకుల కుటుంబము

తోడబుట్టిన సోదరీ సోదరులూ, వేలు విడిచిన సోదరీ సోదరులు గుంపులుగా వివాహమాడటం వలన ఇది ఏర్పడినది

2) పునాలాన్ కుటుంబము

తోడబుట్టిన అక్కచెల్లెళ్ళు, వేలు విడిచిన అక్కచెల్లెళ్ళు చాలమంది గుంపుగా ఒకరొకరి భర్తలతో వివాహము చేసుకోవడము దీని లక్షణము ఆ ఉమ్మడి భర్తలు ఒకరొకరికి బంధువులే అయివుండవలసిన అవసరము లేదు అనేకమంది సోదరులు, తోడబుట్టిన వాళ్ళు, వేలు విడిచిన వాళ్ళు, ఒక గుంపుగా ఒకరొకరి భార్యలతో వివాహము చేసుకోవడము కూడా ఇందులోవిదే వీరు ఒకే రక్తబంధుత్వము కలవారు కానక్కర్లేదు కాని చాలా సందర్భాలలో ఈ స్త్రీలు రక్త బంధువులే అయివుంటారు ఈ రెండు సందర్భాలలో ను కూడా ఒక మగవాళ్ళ గుంపు, ఒక ఆడవాళ్ళ గుంపును ఉమ్మడిగా వివాహము చేసుకోవడం జరుగుతుంది

3) సింధియాస్మియన్ లేక జంట కుటుంబము

ఒక ఆడ ఒక మగ జంట పెళ్ళి చేసుకోవడం దీని లక్షణము అయితే దీనిలో ఎవరూ రెండోవారికే కట్టుబడి ఉంటారనేది లేదు ఆ పెళ్ళి ఆ వ్యక్తుల మధ్య ఇష్టం కొనసాగినంత కాలం ఉంటుంది

4) బహు భార్యా కుటుంబము (PATRIARCHAL)

ఒక వ్యక్తి అనేకమందిని పెళ్ళి చేసుకోవడము దీని లక్షణము పెళ్ళి చేసుకున్నాక సాధారణముగా వారిని ఘోషాలో పెడతారు

5) దంపతీ కుటుంబము (MONOGAMIAN)

మూడో మనిషితో సంబంధం లేకుండా ఒక పురుషుడు ఒక స్త్రీ మధ్య వివాహము జరగడము దీని లక్షణము

వీనిలో ఒకటి, రెండు, ఐదు కుటుంబ పద్ధతులు తర్కబద్ధములైనవి ఏమంటే వానికి తగినంత ప్రాచుర్యము ఉంది అవి మూడు భిన్నమైన రక్తసంబంధమైన వ్యవస్థలను సృష్టించాయి ఆ మూడూ సజీవ రూపాలలో కనిపిస్తున్నాయి కుటుంబము, కుటుంబరూపాలు, వివాహ పద్ధతులు ప్రాచీన కాలం నుంచి ఉన్నాయని చెప్పడానికి ఈ వ్యవస్థలు చాలును అవి ఒక దానితో ఒకటి సంబంధము కలిగి వరుసలో

ఏర్పడ్డాయి జంట కుటుంబము, బహు భార్యా కుటుంబము మధ్యలో వచ్చాయి క్రొత్త బంధుత్వ వ్యవస్థను ఏర్పరచటానికి గాని ఉన్నవానిలో మార్పులు తేవడానికి గాని అవి శక్తి గలవు కావు మానవ వ్యవహారాలలో వానికి గల ప్రభావము తక్కువ ఈ కుటుంబ వ్యవస్థలేవీ గీతలు గీసినట్టు ఏ కాలములోనూ విడిగా కనిపించవు రెండోది ఉండగా మొదటిది, మూడోది ఉండగా రెండోది, మూడోది ఐదో దాంట్లోకి చొచ్చుకుపోయే ఉంటాయి ఇప్పుడు నిర్ణయం చేయవలసినదీ, స్థిరపరచ వలసినదీ ఈ వివాహ పద్ధతులు ఒకదాని తరువాత ఒకటి వచ్చాయని ఇవన్నీ కలసి కుటుంబ భావము అభివృద్ధిని తెలుపుతున్నాయనీను

వివిధ కుటుంబ రూపాలూ, వివాహ పద్ధతులూ ఎలా అభివృద్ధి పొందాయో చెప్పడానికి బంధుత్వ వ్యవస్థ లక్షణాన్నీ ఒక దానితో ఒక దానికి గల అనుబంధాన్నీ చెప్పవలసి ఉంటుంది ఈ వ్యవస్థలు ఏవీ పనిపెట్టుకొని ఏర్పరచినవి కావు వానికి సంబంధించిన సాక్ష్యం వాటిలోనే లభిస్తుంది అయితే బంధుత్వ వ్యవస్థను గురించి మనకు అవగతం అయ్యే వరకు అది చాలా చిక్కుగా, గందరగోళంగానే కనిపిస్తుంది దానికి సంబంధించిన సాక్ష్యం యొక్క బలాన్నీ, విలువను బాగా అర్థం చేసుకోవడం చివరికి శ్రమతో కూడిన పనే నేను "బంధుత్వ వ్యవస్థలు, మానవ కుటుంబములో అనుబంధాలు" అంటూ ఇదివరకే ఒక పుస్తకం వ్రాశాను ఇక్కడ అర్థమయ్యేటందుకు అవసరమైనవన్నీ కొద్దిపాటి ఘటనలు చూపుతాను వివరాల కోసం, పట్టికల కోసమూ ఆ పుస్తకము చదవండి కుటుంబము అన్నది ఒకదాని తరువాత ఒకటిగా అనేక రూపాలలో పెరగడమే మానవుని చరిత్రలో ప్రధాన ప్రాముఖ్యము కలది ఈ సాక్ష్యాన్ని ఒక సాధారణ రూపములో సంగ్రహంగా చెప్పడానికై తరువాత ప్రకరణాలు నాలుగు వ్రాస్తున్నాను

ఇంతవరకు దొరికిన అతి ప్రాచీన బంధుత్వ వ్యవస్థ పాలినీషియన్ల లోది అందులో హవాయి దీవులలోది గమనించతగినది దీనికి నేను మలయన్ వ్యవస్థ అని పేరు పెట్టాను దీనిలో రక్త సంబంధీకులు - దగ్గరవాళ్ళు కానీ ఎంతో దూరం వాళ్ళు గానీ- దిగువ చెప్పిన బంధుత్వాలలో ఒక దాంట్లోకి వస్తారు తండ్రి, తల్లి, బిడ్డ, తాత, మనవడు, సోదరుడు, సోదరి ఇవి తప్ప మరి ఏ రక్త బంధుత్వాలని అందులో గుర్తించరు వీనికితోడు వివాహము వలన వచ్చిన బంధుత్వాలు ఉన్నాయి మొట్ట

మొదటి రక్తసంబంధీకుల కుటుంబముతో ఈ బంధుత్వ వ్యవస్థ ఏర్పడింది ఇది అతి ప్రాచీనమైనది-అనేందుకు సాక్ష్యము దానిలోనే ఉంది కాని, ఆ సాక్ష్యం చాలదని అనిపిస్తూంది పైన చెప్పిన ప్రతి బంధుత్వము అక్కడ గుర్తించబడుతూ ఉంది దానిని కాదనడానికి వీలులేదు పాలినీషియాలో కుటుంబము రక్తసంబంధీకుల దశ నుంచి పునలాన్ దశకు మారినా ఈ వ్యవస్థ మాత్రం పాలినీషియాలో సర్వసాధారణంగా కనిపిస్తూ ఉంది ఆ బంధుత్వాలను మార్చడానికి తగినంత బలమైన తర్కబద్ధమైన మార్పులు జరగలేదు శాండ్‌విచ్ దీవులలో సోదరీ సోదరుల మధ్య అంతర్ వివాహాలు జరుగుతూనే ఉన్నాయి యాభై ఏళ్ళక్రితం అమెరికన్ మిషనరీలు వానిని చూసి, ధృవపరిచారు ఆసియా అంతటా ఈ బంధుత్వవ్యవస్థ సర్వత్రా ఉన్నదనడానికి సందేహం అవసరంలేదు ఆసియాలో ప్రచలితముగా ఉన్న తురానియన్ వ్యవస్థకు పునాది అదే చైనాలో కూడా దీని ప్రభావము ఉంది

కాలక్రమంలో బంధుత్వ వ్యవస్థలో రెండవది అయిన తురానియన్ పద్ధతి మొదటిదానిని ప్రక్కకుపెట్టి, భూమిమీద అత్యధిక భాగములో వ్యాపించింది ఉత్తర అమెరికాలోని ఆదివాసులలో అది సర్వసామాన్యము దక్షిణ అమెరికాలోకూడా అంత ప్రచలితముగా ఉంది అనడానికి తగిన సాక్ష్యం ఉంది ఆఫ్రికాలో కొన్ని భాగాలలో అది కనిపించింది కాని, ఆఫ్రికన్ తెగలలో సర్వసాధారణముగా ఉన్నవ్యవస్థ మలయన్ వ్యవస్థకు దగ్గరగా ఉంది దక్షిణ భారత దేశములో ద్రవిడియన్ భాషలు మాట్లాడే హిందువులలో అదే పద్ధతి ప్రచలితముగా ఉంది గౌడ భాషలూ, వాని మాండలికాలు మాట్లాడే ఉత్తర భారతదేశపు హిందువులలో అది కొద్ది మార్పుంతో అమలు జరుగుతూ ఉంది ఆస్ట్రేలియాలో కూడా కొద్దిగా అభివృద్ధి పొందిన రూపములో అమలులో ఉంది తరగతులుగా విభజించడం వలననూ, ఛాయా మాత్రంగాగణాలు ఏర్పడటంవలననూ వచ్చినఫలితమది తురానియన్, గనోవానియన్ కుటుంబాలకు చెందిన ప్రధానతెగలలో అది పునలాన్ గుంపు వివాహాలనుంచి పుట్టింది గణవ్యవస్థల నుంచి కూడా దానికి మూలం ఉంది అయితే గణాలు రక్తసంబంధీకుల మధ్య వివాహాలను అణిచివేయడానికి ప్రయత్నించాయి గణాలలో అంతర్వివాహాలు నిషేధించడం వలన సోదరీ సోదరుల మధ్య వివాహ సంబంధాలు శాశ్వతముగా నిలిపి వేయబడినాయి తురానియన్ రక్తసంబంధ పద్ధతి అమలు జరిగినప్పటికి పునలాన్ కుటుంబ రూపము ఉంది పునలాన్ గుంపు పెళ్ళి ఈ వ్యవస్థలోని ప్రధాన బంధుత్వాలను నిరూపిస్తోంది ఈ వివాహపద్ధతి వలన ఏర్పడే బంధుత్వాలు సరిగ్గా అవేనని

చూపిస్తోంది తురానియన్ బంధుత్వవ్యవస్థ లాగానే పునలాన్ కుటుంబ పద్ధతి కూడా ప్రపంచ పరివ్యాప్తంగా ఉండని ఘటనలు సాక్ష్యమిస్తున్నాయి. గణ వ్యవస్థకూ పునలాన్ కుటుంబానికి ఫలితమే తురానియన్ బంధుత్వవ్యవస్థ అని చెప్పాలి ఇది మలయన్ పద్ధతి నుంచి దాని తరువాయిగా ఏర్పడింది మలయన్ వ్యవస్థలో తోడ బుట్టిన, వేలు విడిచిన సోదరీసోదరుల మధ్య వివాహాల ఫలితముగా ఏర్పడిన బంధుత్వాలను అది మార్చింది నిజానికి గణాలు ఏర్పడటముతోనే అవి మారాయి ఆ విధముగా రెండింటికి మధ్యవున్న సరాసరి సంబంధము అక్కడ కనిపిస్తూ ఉంది సమాజముమీద పునలాన్ గుంపులమీద గణ సంస్థకు ఎంత ప్రభావము ఉందో ఈ వ్యవస్థలోని మార్పు చూపిస్తూంది

తురానియన్ వ్యవస్థ చాలా అద్భుతమైన అరణ్యప్ల వ్యవస్థలో కనిపించే బంధుత్వాలు అన్నింటినీ ఆ వ్యవస్థ గమనించిఉండని మరికొన్ని బంధుత్వాలను తురానియన్ పద్ధతి గుర్తిస్తూంది దగ్గర దూరపు రక్తబంధువులను తన ప్రత్యేక పద్ధతిలో అది వర్గీకరిస్తోంది అరణ్యప్ల వ్యవస్థలో సాధారణముగా అవి కనిపించవు మామూలుగా పిలుచుకొనేటప్పుడూ, గౌరవించదలచినపుడూ, ప్రజలు ఆ బంధుత్వాన్నే ఉపయోగిస్తారు పేరును ఉపయోగించరు ఆ విధముగా ఆ వ్యవస్థ విస్తృతరూపములో వ్యాపించి ఉంది ఎంతో దూరపు బంధుత్వాన్ని కూడా నిరంతరం గుర్తుచేస్తూ ఆ పద్ధతిని నిలబెట్టి ఉంచుతూంది ఏ బంధుత్వములేని సందర్భములో వారు మిత్రమా! అని మాత్రమే గౌరవిస్తారు ఇంత విస్తృతముగా వర్గీకరించి చెప్పేదీ, ఇంత ప్రత్యేక లక్షణాలు కలదీ మరో బంధుత్వవ్యవస్థ మానవులలో కనిపించదు.

అమెరికన్ ఆదివాసులు బయట ప్రపంచానికి తెలిసిననాటికి వారిలో పునలాన్ దశ దాటి కుటుంబము జంటల రూపానికి వచ్చింది అందుచేత జంట కుటుంబములో కనిపించే బంధుత్వాలకి బంధుత్వవ్యవస్థ గుర్తించిన బంధుత్వపు పిలుపులకి చాల చోట్ల సంబంధము లేకుండా ఉంది మలయన్ వ్యవస్థలో కూడా జరిగింది ఇదే అక్కడి కుటుంబరూపం రక్తసంబంధ పద్ధతి నుంచి పునలాన్ పద్ధతికి మారింది కాని బంధుత్వవ్యవస్థ అలాగే ఉండిపోయింది ఫలితముగా మలయన్ వ్యవస్థలోని బంధుత్వపు పిలుపులు రక్తసంబంధీకుల కుటుంబములోని పిలుపులుగానే ఉన్నాయి పునలాన్ కుటుంబము వచ్చేక, అందులో కొన్ని చెల్లుబాటుకావు అదే విధముగా తురానియన్ పద్ధతి పిలుపులు వాస్తవానికి పునలాన్ కుటుంబములో బంధుత్వాలని వానిలో కొన్ని జంట కుటుంబ పద్ధతిలో సరిపడవు అవసరం కొద్దీ కుటుంబరూపాలు

వేగంగా మారతాయి బంధుత్వవ్యవస్థలు అంతవేగంగా మారవు కుటుంబ బంధుత్వాలను నమోదుచేస్తూ వెనుక వెనుకనే ఉంటాయి పునలాన్ కుటుంబము ఏర్పడిన మాత్రంచేత మలయన్ పద్ధతిని మార్చడానికి తగినంత అవసరం ఏర్పడలేదు అలాగే జంట కుటుంబము ఏర్పడటంతో తురానియన్ పద్ధతిని మార్చడానికి తగిన కారణాలు ఏర్పడలేదు మలయన్ పద్ధతిని తురానియన్ పద్ధతి లోనికి మార్చు తేవడానికి గణ నిర్మాణం వంటి ఒక గొప్పసంస్థ అవసరం అయింది తురానియన్ పద్ధతి బంధుత్వ వ్యవస్థను రద్దుపరచి, ఆర్యన్‌వ్యవస్థ ఏర్పరచడానికిఆస్తి ఏర్పడటం, దానిమీదహక్కు దానికి వారసత్వమువంటి ఒక గొప్ప నిర్మాణమేఅవసరం అయింది

తరువాత కాలక్రమంలో మరో మూడో గొప్ప బంధుత్వ వ్యవస్థ వచ్చింది దానిని ఆర్యన్, సెమిటిక్ లేక యురాలియన్ వ్యవస్థ అందాము. ఇది ప్రధాన జాతులు అన్నింటా అదివరకటి తురానియన్ వ్యవస్థను రద్దు చేసింది తరువాత ఆ జాతులు నాగరికములు అయినాయి ఈ కొత్త బంధుత్వ వ్యవస్థ దంపతీ కుటుంబములోని బంధుత్వాలను నిర్వచిస్తోంది ఇది తురానియన్ పద్ధతిమీద ఏర్పడినది కాదు నాగరిక జాతులన్నింటా వెనుకటి తురానియన్ పద్ధతిని తొలగించి వచ్చింది దానికి ఎంతో సాక్ష్యం చూపించవచ్చు

చివరి నాలుగు కుటుంబరూపాలు చరిత్రకాలం నాటివే కాని మొట్టమొదటిదైన రక్త సంబంధీకుల కుటుంబము అంతరించిపోయింది మలయన్ రక్త బంధుత్వ వ్యవస్థనుబట్టి అది ఒకప్పుడు ఉండేది అనుకోవాలి మిగిలిన వానిలోని మూడు కుటుంబరూపాలు తర్కబద్ధమైనవి మూడు భిన్నములైన జీవిత పరిస్థితుల నుంచి అవి వచ్చాయి వానికి స్పష్టమైన బంధుత్వరూపాలు వేరువేరుగా ఉన్నాయి బంధుత్వ రూపాలు స్థిరముగా, క్రమం తప్పకుండా కొనసాగుతాయని చెప్పడంవలన ప్రాచీన సమాజ పరిస్థితుల విషయమై అవి తగిన సాక్ష్యం ఇస్తున్నాయి

ఈ కుటుంబరూపాలు ప్రతి ఒక్కదాని పుట్టుకను, పెరుగుదలను, క్షీణదశను ప్రదర్శిస్తూ చాలా చాలా కాలంపాటు మానవజాతి తెగలలో ఉన్నాయి దంపతీ కుటుంబానికి మూలం ఆస్తి దానికి బీజము జంట కుటుంబములో ఉంది ఆ జంట కుటుంబానికి మూలము గణము గ్రీకు తెగలు చరిత్రకు తెలిసిన నాటికే వారిలో దంపతీ కుటుంబము ఉంది అయితే దాని హోదాను, హక్కులను స్థిరపరిచే చట్టంచేసే వరకు అది పూర్తిగా స్థిరపడలేదు మానవుని మనస్సులో ఆస్తి అనే భావంపుట్టి పెరగడం, దాని వారసత్వం గురించి చట్టబద్ధంగా హక్కులను స్థిరపరచడం అనేదానికి, దంపతీ

కుటుంబం స్థిరపడటానికి దగ్గర సంబంధం ఉంది ఆస్తి అనేది కుటుంబ నిర్మాణ రూపాన్ని స్థిరపరచగలంత పలుకుబడి గలది అయినది పిల్లలకు తండ్రి ఎవరు అనే విషయం ఇది వరకటి పరిస్థితులలో అంత ప్రాముఖ్యాన్ని పొందలేదు. కాని దానికి కూడా ప్రాధాన్యము వచ్చింది అనాగరికయుగం ఎగువదశలోనే జంటలమధ్యవివాహము ఉంది అయితే అది స్థిరమైనదికాదు వారు తమ ఇష్టం వచ్చినంతకాలమే కలిసి ఉంటారు కల్పనలో, అన్వేషణలో క్రమాభివృద్ధి పొందుతూ, ఆచారాలకు మెరుగు పెడుతూ, ప్రాచీన సమాజము పురోగమించినకొలదీ ఆ కుటుంబ రూపము స్థిరపడ సాగినది కాని దంపతీకుటుంబము యొక్క ముఖ్యలక్షణం ఇద్దరికే దాంపత్య సంబం ధాలు పరిమితం కావడమనేది ఇంకా ఏర్పడలేదు అనాగరికయుగములో చాలా ముందు నుంచి మగవాడు భార్య తనదిమాత్రంగానే ఉండాలని కోరుతూనే వచ్చాడు అందుకు భయంకరమైన శిక్షలూ ఉపయోగించాడు అయితే ఆ కట్టుబాటు మగవానికి అవసరం లేదన్నాడు వివానికి ఈ బాధ్యత పరస్పరం ఉండవలసినది ఇందులో ఒకరికి ఉన్నప్పుడు రెండోవారికి అమలు జరుగుతుంది హోమర్ కాలములో గ్రీకుల కుటుంబములోని స్త్రీల పరిస్థితి నిర్బంధ ఏకాంతము, భర్త పెత్తందారీతనము, అసమాన హక్కులు- ఎంతో అసమానతఉంది హోమర్ కాలంనుంచి పెరిక్యులస్ కాలంవరకు గ్రీకు కుటుంబము క్రమాభివృద్ధిని పొందింది ఒక ఆచారముగా స్థిరపడి మెరుగుపడింది గ్రీకుల, రోమనుల కుటుంబవ్యవస్థకన్నా ఆధునిక కుటుంబము నిస్సందేహంగా ఎంతో మెరుగయింది సమాజములో స్త్రీల స్థానం ఎంతో బలపడింది గ్రీకులలోను, రోమను లలోను ఆమె మగనికి అధీనమై,కూతురు స్థాయిలో ఉండేది ఇప్పుడామెకు వ్యక్తిగత హక్కులు గుర్తించబడినాయి సమానహోదా ఇంచుమించుగా లభించింది దంపతీ కుటుంబము ఇప్పటికి మూడువేల సంవత్సరాలుగా కనిపిస్తూంది పొడుగునా అది మెరుగుపడుతూ వస్తూ ఉంది స్త్రీ, పురుషుల మధ్య సమానత్వాన్ని గుర్తించే వరకు, వివాహ సంబంధంలో బాధ్యతలను పూర్తిగా గుర్తించేవరకు వృద్ధి పొందుతూ వస్తుంది జంట కుటుంబము కూడా చాలా దిగువ రూపంతో ప్రారంభమై దంపతీ కుటుంబములో అంతరించిపోయింది మన చర్చకు ఈ విషయాలు చాలా ముఖ్యము కనుక గట్టిగా గుర్తుపెట్టుకోవాలి

గత ప్రకరణాలలో మానవజాతి అతి ప్రాథమిక దశలో ఉన్నపుడు, ఒక తరహా దాంపత్య వ్యవస్థ వారిని అతుక్కొంది అదే నాగరికత కాలం వరకు మానవుల వెంట వచ్చింది అయితే సమాజము క్రమాభివృద్ధిని పొందుతూ ఉన్నకొద్దీ అది

బలాన్ని కోల్పోతూ ఉంది ఈ పద్ధతికి వ్యతిరేకముగా సమాజంలో నైతిక నిబంధనలు ఎంత బలముగా పెరిగాయో అంత ఎక్కువగా ఆ వ్యవస్థ క్షీణించింది క్రమంగా ఏర్పడుతున్న కుటుంబ రూపాలూ, వివాహ పద్ధతులూ దాని క్షీణతను సమోదు చేస్తున్నాయి అది పూర్తిగా అదృశ్య మయ్యే వరకు నిజమైన దంపతీ కుటుంబము సాధ్యం కాదు ఈ ప్రాథమిక రూపము అనాగరిక యుగం ఎగువదశ వరకు వచ్చి సిండ్యాస్మియన్ కుటుంబంలో అంతర్ధానమయింది

ఈ రెండు కుటుంబ రూపాలు పెరిగి అభివృద్ధి పొందడంలో ఎంత కాలం గడచి ఉంటుందో వూహించవచ్చు పరస్పరము పోలిక లేని సామాజిక వ్యవస్థలలో ఒకదానికి ఒకటి పోలిక లేని ఐదుకుటుంబ రూపాలు వరుసగా ఏర్పడ్డాయి రక్త సంబంధీకుల కుటుంబ స్థాయి నుంచి మధ్య రూపాల గుండా దంపతీ కుటుంబ రూపానికి కుటుంబ భావన ఎదిగింది అందుకు ఎంత కాలం పట్టవచ్చునో ఊహించగలము మానవజాతి ఆచారాలలో దేనికీ ఇంత ఘనమైన చరిత్ర లేదు సుదీర్ఘమైన ఎంతో వైవిధ్యం కల అనుభవాల ఫలితాలు ఇంతగా మరి దేనిలోనూ కనిపించవు దానిని యుగ యుగాలు పాటు అనేక దశల గుండా ప్రస్తుత రూపము లోనికి తీసుకు వచ్చేటందుకై ఎంతో మానసిక శక్తి, నైతిక శక్తి అవసరం

వివాహమనేది పునలాన్ దశ నుంచి జంటల దశ గుండా దంపతీ కుటుంబ రూపానికి ఎదిగింది కాని తురానియన్ బంధుత్వ వ్యవస్థలో చెప్పదగిన మార్పులు రాలేదు పునలాన్ కుటుంబాల బంధుత్వాలను నమోదు చేస్తున్న ఈ వ్యవస్థ జంట కుటుంబాలు ఏర్పడే వరకు పెద్దగా మారలేదు ఆటు తరువాత అది దంపతీ కుటుంబానికి ఒక అప్రతిష్ఠగానే తయారయింది ఉదాహరణకు మలయన్ వ్యవస్థలో వ్యక్తి తన సోదరుని కొడుకును కూడా తన కొడుకే అని చెబుతాడు ఏమంటే అతని భార్య తనకు, తన సోదరునికి కూడా భార్యయే తురానియన్ వ్యవస్థలో కూడా సోదరుని కొడుకు తన కొడుకుగానే పిలవబడుతున్నాడు కారణం పైన చెప్పినదే కాని సోదరి కొడుకు అతనికి మేనల్లుడు అవుతాడు దానికి కారణము గణ వ్యవస్థలో సోదరి అతనికి భార్య కాజాలదు ఇరాక్వ్యాలలో జంట కుటుంబ వ్యవస్థ ఏర్పడింది సోదరుని భార్య ఇప్పుడు అతనికి భార్య కాదు అయినా అతడి సోదరుడి కొడుకును అతని కొడుకుగానే పిలుస్తారు ఇదే విధంగా అప్పుడున్న కుటుంబ రూపానికి అసలు జరుగుతున్న బంధుత్వ రూపానికి పొంతన ఉండదు అతి ప్రాచీనమైన ఈ బంధుత్వ వ్యవస్థను తొలగించేటందుకు మంచి గట్టి కారణము ఏర్పడలేదు ఆర్యన్ తెగలు

నాగరికత పొందుతూ ఉన్న దశలో దంపతీ కుటుంబము ఏర్పడి ఆ బంధుత్వపు పిలుపులు మార్చడానికి తగిన కారణం ఏర్పడింది ఇప్పుడు పిల్లలకు తండ్రి స్థిరపడ్డాడు వారిని వారసులుగా చట్టం స్థిరపరిచింది దంపతీ కుటుంబపు అవసరాలకు అనుగుణంగా తురానియన్ పద్ధతిని సవరించడం సాధ్యంకాదు అది దంపతీ వ్యవస్థకు పూర్తిగా వ్యతిరేకము అయితే దానికి పరిష్కారం లేకపోలేదు అది బహు సులభమైనది, సమగ్రమైనది కూడా తురానియన్ పద్ధతిని చల్లగా జారవిడిచారు తురానియన్ తెగలు ఒక బంధుత్వాన్ని విశిష్టం చేయవలసి వచ్చినపుడు వర్ణన పద్ధతిని అవలంబించేవారు దానిని ఇప్పుడు అమలు జరిపారు రక్తబంధుత్వములో గల వాస్తవస్థితిని అందుకొని వారు ప్రతి మనిషితో ఉన్న బంధుత్వాన్ని వివరిస్తున్నారు ఆ విధముగా వారు నా అన్న కొడుకు, నా అన్న మనుమడు, నాన్న తమ్ముడు, నాన్నగారి తమ్ముని కొడుకు ఇలా చెప్తున్నారు ఈ విధముగా మనిషిని వర్ణిస్తారు. వారితో గల బంధుత్వాన్ని ఊహించవలసిందే ఆర్యన్ జాతుల బంధుత్వ వ్యవస్థ ఈ రూపములోకి వచ్చినది గ్రీకు, లాటిన్, సంస్కృతము, జర్మనీ, కెల్టిక్ తెగల అన్నింటా ఇటు వంటి పద్ధతినే చూస్తాము హీబ్రూ గ్రంథాలలోని వంశక్రమాలను చూస్తే సెమిటిక్ తెగలలో కూడా ఇదే కనిపిస్తుంది పైన చెప్పిన తురానియన్ వ్యవస్థ ఛాయలు ఆర్యన్, సెమిటిక్ జాతులలో చరిత్ర కాలం వరకు కొనసాగాయి కాని మొత్తంమీద దానిని పూర్తిగా తొలగించి వివరణ పద్ధతిని ప్రారంభించారు.

పైన చెప్పిన విషయాలకు ఉదాహరణ చూపించి ధృవ పరిచేటందుకై ఈ మూడు వ్యవస్థలను, తర్కబద్ధమైన మూడు కుటుంబ రూపాలను అవి ఏర్పడిన క్రమములో వివరించవలసి ఉంది ఒక దానిని గురించి చెబితే అదే రెండవ దానికి కూడా వివరణగా ఉపయోగపడుతుంది

బంధుత్వ వ్యవస్థకు అంత ప్రాముఖ్యం లేదు దానిలో ఉన్న భావాల సంఖ్య చాల కొద్ది మామూలు సూచనలతో అది ఏర్పడింది దానినుంచి ఉపయోగకరమైన సమాచారము దొరకదు మానవుని యొక్క ప్రాథమిక పరిస్థితులను గురించి అది చెప్పగలది అట్టే ఉండదు ఆ బంధు కూటమియొక్క బంధుత్వాలను ఆలోచించబోతే మనకు అంతే తోచేది కాని అనేక తెగలలోని వ్యవస్థను పోల్చిచూసినపుడు,దానిని ఒక కుటుంబ గత ఆచారముగా చూసినపుడు యుగయుగాల పరంపరగా అది సంక్రమించిందన్నప్పుడు, దాని లక్షణం మారుతున్నది అటువంటి వ్యవస్థలు ఒక దాని తరువాత ఒకటిగా ఏర్పడుతూ రక్త సంబంధీకుల కుటుంబం నుంచి దంపతీ కుటుంబము వరకు

కుటుంబము యొక్క పెరుగుదలను చూపిస్తాయి ఒక్కొక్క కుటుంబము ఏర్పడినపుడు దాని వలన ఏర్పడిన బంధుత్వాలను అనాడు ఉన్న వివాహ పద్ధతిని,కుటుంబ రూపాన్ని ఈ బంధుత్వ వ్యవస్థ చూపకలదు అనుకుంటాము కాని అది ఎలా ఉన్నది అలానే ఉండిపోయింది

సమాజము దిగువ నుంచి ఎగువ దశకు అభివృద్ధి పొందిన కొద్దీ ఈ వ్యవస్థలు సహజంగానే ఏర్పడ్డాయని ప్రతి ఒక దశలోను ఒక ఆచారము ఏర్పడి సహజ నిర్మాణాన్నే పూర్తిగా మారుస్తుందని మనం చూడగలం తల్లికి, కొడుకుకు, అన్నకు చెల్లెలుకు, అమ్మమ్మకు, మనుమనికి, గల బంధుత్వాన్ని ఏ మాత్రం సందేహానికి తావు లేకుండా అన్ని కాలాలలోను చూడటానికి అవకాశం ఉన్నది కాని దంపతీ కుటుంబము ఏర్పడేంతవరకు తండ్రికి పిల్లలకు తాతకు, మనుమనకు,గల బంధుత్వాన్ని ఖచ్చితముగా చెప్పడానికి లేదు గుంపుల మధ్య వివాహము జరిగినంత కాలం ఈ బంధుత్వపు పిలుపులు చెల్లదగినవారు చాల మంది ఉంటారు ప్రాచీన సమాజము యొక్క అతి ప్రాధమిక పరిస్థితులలో ఈ బంధుత్వాలు వాస్తవమైనవి గాను, ఊహా కల్పితమైనవి గాను కూడా ఉంటాయి వానిని చెప్పేటందుకు కొన్ని పదాలను సృష్టించారు ఈ పదాలు ఉపయోగించి పిలిచిన వ్యక్తులు బంధుకూటములుగా ఏర్పడతారు ఆ విధముగా బంధుత్వ వ్యవస్థ ఏర్పడినది ఈ బంధుత్వ వ్యవస్థ వివాహరూపము మీద ఆధారపడి ఏర్పడుతుంది తోడబుట్టిన వాళ్ళు, వేలు విడిచిన వాళ్ళు సోదరీ సోదరులు గుంపుగా పెళ్ళి చేసుకొన్నపుడు దాన్ని రక్త సంబంధీకుల కుటుంబము అంటాము అప్పుడు ఏర్పడేది రక్త బంధుత్వ వ్యవస్థ దానికి మలయన్ అని పేరు పెట్టాము చాలమంది అక్కచెల్లెలు ఒకరొకరి భర్తలతో వివాహము చేసుకున్నపుడు అలాగే చాల మంది సోదరులు ఒకరొకరి భార్యలను గుంపుగా పెళ్ళి చేసుకొన్నపుడు దానిని పునలాన్ కుటుంబము అంటారు. అప్పుడు ఏర్పడిన బంధుత్వ వ్యవస్థను తురానియన్ బంధుత్వ వ్యవస్థ అంటాము ఆ జంటకు మాత్రమే దాంపత్య సంబంధము పరిమితం చేస్తూ ఒక స్త్రీ ఒక పురుషునికి వివాహము జరిగినపుడు దానిని దంపతీ కుటుంబము అంటాము అపుడు ఏర్పడిన బంధుత్వవ్యవస్థ ఆర్యన్ బంధుత్వ వ్యవస్థ అంటే ఈ బంధుత్వ వ్యవస్థలు మూడు, మూడు వివాహరూపాలను బట్టి ఏర్పాడ్డాయి. ఆ మూడు వివాహ రూపాలలో వ్యక్తుల మధ్య ఉన్న వాస్తవ బంధుత్వాన్ని తెలిసినంత వరకు చెప్పడానికి ఆ మూడు వ్యవస్థలు ప్రయత్నిస్తాయి అందుచేత బంధుత్వ వ్యవస్థలు ప్రకృతి సిద్ధముగా ఏర్పడినవి కావు వివాహన్ని బట్టి ఏర్పడ్డాయి. కట్టు

కథలుగా ఏర్పడినవి కావు వాస్తవ ఘటనల మీద ఏర్పడ్డాయి అందుచేత ఇవి ప్రతి ఒక్కటి తర్క బద్ధమైనవి, వాస్తవమైనవి కూడా ఇవి ఇచ్చే సాక్ష్యానికి ఎంతో విలువ ఉంది ఎన్నో విషయాలను అవి సూచిస్తాయి ప్రాచీన సమాజము యొక్క పరిస్థితిని అవి అస్పష్టముగా, మాటిగా చెబుతున్నాయి

ఈ వ్యవస్థలు రెండు రూపాలలో మనకు కనిపిస్తున్నాయి ఒకటి వర్గీకర ణాత్మకము రెండోవది వర్ణనాత్మకము ఇవి రెండు మౌలికముగానే భిన్నము. మొదటి రూపములో బంధుత్వాన్ని వర్ణించరు దగ్గర దూరాలతో నిమిత్తము లేకుండా తరగతుల క్రింద విభజిస్తారు ఒకే తరగతికి చెందినవారందరికి ఒకే బంధుత్వ పదము ఉపయోగిస్తారు నా సోదరులు, మా నాన్న అన్నదమ్ముల కొడుకులు అందరికి ఒకే శబ్దం సోదరుడు —అలాగే నా అక్కచెల్లెళ్ళు, మా అమ్మ అక్కచెల్లెళ్ళ కూతుళ్ళు వీరందరికి ఒకే పదము-అక్కచెల్లెళ్ళు మలయన్ తురానియన్ వ్యవస్థలు రెండింటా అదే వర్గీకరణ కనిపిస్తుంది ఇందులో తురానియన్ వ్యవస్థలో బంధుత్వాన్ని వర్ణిం చడం కూడా ఉంటుంది అందుకు ప్రాథమిక రూప శబ్దాలనే కలుపుతూ ఆ వ్యక్తితో బంధుత్వాన్ని నిర్దిష్టంచేస్తారు నా తమ్ముడి కొడుకు, మా నాన్న తమ్ముడు, మా నాన్న తమ్ముడి కొడుకులాంటి వర్ణనలతో నిర్దిష్ట పరుస్తారు దంపతీ కుటుంబ వ్యవస్థ ఏర్పడిన ఆర్యన్ సెమిటిక్, ఉరాలియన్ కుటుంబాలలో ఉన్న వ్యవస్థ ఇది. తరువాత తరువాత కొన్ని ఉమ్మడి శబ్దాలను సృష్టించి చిన్న చిన్న వర్గీకరణలు ప్రవేశ పెట్టారు కాని ప్రధానముగా మొదటి వ్యవస్థా రూపమే కొనసాగుతోంది ఎర్సె, స్కాండినేవియాల కుటుంబాలలో పూర్తిగా వర్ణనాత్మకముగానే ఉన్నాయి ఉదాహర ణలు పైన ఇచ్చాను గుంపు వివాహం ఫలితముగా ఏర్పడిన వ్యవస్థ ఒకటి ఒంటి జంటల మధ్య వివాహానికి ఫలితముగా ఏర్పడినది ఇంకొకటి ఈ రెండు వ్యవస్థల మధ్య మౌలికంగానే భేదం ఉంది

వర్ణనాత్మక బంధుత్వ వ్యవస్థ ఆర్యన్ సెమిటిక్ యురాలియన్ కుటుంబాలు అన్నింటా ఒక విధంగానే ఉన్నది. కాని తరగతుల విభజన పద్ధతి రెండు రూపాలుగా స్పష్టంగా కనిపిస్తుంది ఒకటి మలయన్ బంధుత్వ వ్యవస్థ ఇది అతి ప్రాచీన కాలము నాటిది రెండోది తురానియన్, గనోవానియన్ బంధుత్వ వ్యవస్థ ఇవి రెండూ ఒకే విధంగా ఉంటాయి వెనుకటి మలయన్ వ్యవస్థలో కొద్ది మార్పులతో ఇవి ఏర్పడ్డాయి

మనలో ఉన్న బంధుత్వ వ్యవస్థను సంగ్రహంగా చెబితే ఈ వ్యవస్థలన్నింటి యొక్క మూల లక్షణాలను చూపించగలుగుతాము

బంధుత్వాలు రెండు రకాలు. ఒకటి రక్త బంధుత్వము రెండోది వివాహ బంధుత్వము రక్త బంధుత్వము మరల రెండు రకాలు ఒకటి అనువంశికము రెండోది జ్ఞాతిత్వము తాతనుంచి తండ్రి, తండ్రినుంచి కొడుకు, అతనినుంచి మనుమడు, ఈ విధంగా వంశానుగతముగా వ్యక్తులమధ్య ఉండే సంబంధము ఒకటి అది అనువంశికము. రెండోది తాత తండ్రులనుంచి విడిపోయిన బంధుత్వాలు వారిని వేలు విడిచిన, జ్ఞాతి బంధుత్వాలు అంటాము వివాహ బంధుత్వాలు ఆచారము వలన ఏర్పడ్డాయి

విషయంలోనికి మరీ లోతుగా వెళ్ళకుండానే ప్రతి బంధుత్వ వ్యవస్థలో ఒకే జంటమధ్య వివాహము జరుగుతున్న పద్ధతిలో ఒక అనువంశిక క్రమము చాల జ్ఞాతిత్వ (వేలు విడిచిన) క్రమాలు ఉంటాయి ప్రతిదానిలోను బంధు కూటానికి కేంద్రం ఒక వ్యక్తి అవుతాడు అతనిని కేంద్రీకరించి ఇతర వ్యక్తులతోఉన్న బంధుత్వము యొక్క దగ్గర, దూరాలను చెప్పబడతాయి ఆ వ్యక్తికి వారి బంధుత్వము ఎటువంటిదో, వారికి ఇతని తోడి బంధుత్వము సరిగ్గా అటువంటిదే అతను అనువంశిక క్రమములో ఉంటే ఆ క్రమము నిలువునా కొనసాగుతుంది అతనికి పైన ఎన్నో తరాలు దిగువన ఎన్నో తరాలు పురుష పారంపర్యములో అతని వంశ వృక్షము రూపొందుతుంది ఈ వృక్ష కాండమునుంచి అనేక శాఖలుగా స్త్రీలు, పురుషులు వస్తారు ఈ వ్యవస్థను గురించి స్పష్టంగా తెలుసుకోవాలంటే ఒక స్త్రీ ఒక పురుషుని నుంచి వచ్చిన అనువంశిక క్రమాన్ని దానినుంచి విడిపోయిన ఒక స్త్రీ ఒక పురుషునియొక్క అనుబంధ శాఖలను తీసుకుంటే చాలును ఇందులో తల్లి తరఫునుంచి తండ్రి తరఫునుంచి కూడా కేవలం వారి వారి సంతానాలను మాత్రమే ప్రత్యేకించి లెక్కకు తీసుకోవాలి జ్ఞాతి విభాగాలన్నింటిని తీసుకొన్నట్లయితే వాని సంఖ్య జామెట్రికల్ రేషియోలో పెరిగి పరిశీలనకు అందకుండా పోతుంది

మొట్ట మొదటి వేలు విడిచిన జ్ఞాతి క్రమములో మగవాడు అయితే నా సోదరుడు ఆయన సంతానము ఆ క్రమములో వస్తారు స్త్రీ అయితే నా సోదరి ఆమె సంతానము వస్తారు రెండో వేలు విడిచిన జ్ఞాతిక్రమములో తండ్రివైపునుంచి అయితే ఆయన సోదరుడు ఆయన సంతానము, మా నాన్న చెల్లెలు ఆమె సంతానము, మా అమ్మ అన్నదమ్ములు వారి సంతానము మా అమ్మ అక్కచెల్లెళ్ళు వారి సంతానము

వస్తారు మూడో జ్ఞాతి క్రమములో తండ్రివైపునుంచి తాతగారి సోదరులు వారి సంతానాలు స్త్రీ అయితే తాతగారి అక్కచెల్లెలు వారి సంతానము అలాగే అమ్మ తరపునకూడా అదే విధంగా రెండు శాఖలు అమ్మమ్మ సోదరుడు వారి సంతానము ఇది మూడో శాఖ ముత్తాత, ముత్తమ్మల అన్నదమ్ములు, వాళ్ళ సంతానము ఆమె అక్కచెల్లెళ్ళు వారి సంతానము నాలుగో జ్ఞాతి శాఖ అవుతుంది అలాగే ముత్తాత తండ్రి అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు వాళ్ళ సంతానాలతో ఐదవ జ్ఞాతి శాఖ ఏర్పడుతుంది ఇలాగ ప్రతి వంశక్రమములోను, ప్రతి శాఖలోను భాగాలను, జ్ఞాతి శాఖలను లెక్కకడతారు పైన చెప్పిన ఐదు అనువంశిక క్రమాలలో మన బంధుగణం అంతా చేరుతుంది. వాటిని గుర్తుపట్టేందుకు అవకాశాలు ఉంటాయి

ఇక్కడ ఇంకొకటి కూడా చెప్పవలసి ఉంది నాకు చాలమంది సోదరులు, అక్కచెల్లెళ్ళు ఉంటే అందులో ప్రతి ఒక్కరూ రెండవవారితో సంబంధము లేకుండా ఒక్కొక్క జ్ఞాతి శాఖగా ఏర్పడతారు ఆడవాళ్ళ తరపునుంచి మగవాళ్ళ తరపునుంచి రెండు భాగాలుగా ఏర్పడ్డ మొదటి జ్ఞాతి శాఖలోకి వీరందరు వస్తారు అలాగే మా నాన్న అమ్మలయొక్క సోదరీ సోదరులు వారి సంతానాలు అన్ని స్వతంత్ర శాఖలుగాను ఏర్పడతారు అయితే వారందరూ రెండు విభాగాలుగా ఉన్న (తల్లి వైపు నుంచి, తండ్రివైపునుంచి) రెండవ జ్ఞాతి శాఖగా కలిపి పరిగణించబడతారు అంటే మగవాళ్ళ తరపునుంచి రెండు ఆడవాళ్ళ తరపునుంచి రెండు నాలుగు ప్రధాన శాఖలు ఏర్పడ్డాయన్నమాట అలాగే మూడో జ్ఞాతి విభాగాలని పూర్తిగా లెక్కలోనికి తీసుకుంటే నాలుగు విభాగాలు, ఎనిమిది శాఖలు వస్తాయి ఇదే విధముగా పైకి దిగువకు వెళ్ళిన కొద్దీ ఈ విభజన క్షేత్ర గణిత ప్రమాణములో రెట్టింపు, రెట్టింపు అవుతూ వస్తుంది

అసంఖ్యాకులైన రక్తసంబంధీకులలో యిన్ని శాఖలు, ఉపశాఖలు దేనికి దానిని వర్ణనాత్మకంగా ఒక పద్ధతి ప్రకారం ఏర్పాటుచెయ్యాలంటే అంత సులభమైన విషయం కాదు కాని రోమను పౌరులు దానిని అద్భుతంగా అమలుజరిపారు దీనినే ప్రధానమైన యూరపియన్ జాతులు తీసుకున్నాయి ఈ పద్ధతి చాలా సాధారణంగా, అభినందనీయంగా కనిపిస్తుంది ఆస్తి వారసత్వాన్ని క్రమబద్ధం చేయడానికై వారసత్వపు నియమాలు అవసరమయ్యాయి ఆ అవసరం యొక్క తీవ్రతలో అతి కష్టమే అయినా అవసరమయినంత దూరం వరకు బంధుత్వాలకు పేర్లను పెట్టారు

ఈ నూతన పద్ధతిని సాధించేటందుకై తండ్రి వైపున తల్లి వైపున పినతండ్రుల్ని మేనత్తల్ని నిర్దిష్టమైన పదాలలో వేరుగా నిర్ణయించవలసి వచ్చింది అనువంశీ

నిర్ణయం మానవజాతి భాషలలో కొద్ది వానిలోనే వుంది రోమనులలో తండ్రివైపు, సోదరులను, సోదరీలను పాట్రుస్, అమిత అన్నారు తల్లివైపు సోదరులనూ, సోదరీలనూ అవుంకులస్, మాతెర్తెరా అన్నారు అమిత అన్న పదం నుంచి ఆంట్ వచ్చింది అవుంకులస్ నుంచి అంకుల్ వచ్చింది అవుస్ అంటే తాత, అవుంకులస్ అంటే చిన్న తాత మాతెర్తెరాలో మాతెర్ అంటే తల్లి, అత్తెరా అంటే మరో తల్లి ఈ శబ్దాల్ని సృష్టించిన తర్వాత రక్తబంధువులను వర్ణించడంలో రోమనుల పద్ధతి ఎంతో మెరుగయింది ఎర్సే, స్కాండినేవియన్, స్లావోనిక్ భాషలు తప్ప మిగిలిన ఆర్యన్ కుటుంబ శాఖలు చాల భాగం ఈ రోమన్ పద్ధతిలోనే ప్రధాన అంశాలని, స్వీకరించాయి

ఎర్సేలో లాగానే ఆర్యన్ పద్ధతి కూడ తురానియన్ పద్ధతిని విడిచిపెట్టి వర్ణన రూపాన్నే తీసుకొంది వంశక్రమంలోనూ, మొదటి అయిదు జ్ఞాతి శాఖల వరకూనూ యించుమించు నూరుకు పైగా బంధుత్వాలను దేనికి దానిని వర్ణనాత్మక రూపంలో ఒకే రకమైన పదాలతో క్రమంగా రూపొందించారు

వర్గీకరణ రూపము,వర్ణనాత్మక రూపము అనాగరిక జాతులకు నాగరిక జాతులకు మధ్య యించుమించు ఖచ్చితమైన విభజనరేఖగా కనిపిస్తుంది విభిన్న వివాహ రూపాలూ, కుటుంబరూపాలూయొక్క గతి నిబంధనననుసట్టి ఈఫలితాన్ని ఊహించడం కష్టంకాదు

బంధుత్వ వ్యవస్థలు తెచ్చిపెట్టుకున్నవి కావు సవరించగలవీ కావు ఇష్టం లేక పోతే తోసేయ గలవి కావు సమాజం యొక్క నిర్మాణం పురోగమిస్తున్న కొద్దీ మారిన పరిస్థితులలో యివి షడుతూ వుంటాయి ఒక ప్రత్యేక రూపం ప్రచారంలోకొచ్చి దానికి అనువైన పదజాలాన్ని సృష్టించాక, ఆ పద్ధతులు స్థిరపడ్డాక,సహజంగానే దానిలో మార్పు రావడం బహు నెమ్మదిగా జరుగుతుంది ఎవరికి వారే బంధువులకు కేంద్ర బిందువు అందుచేత ప్రతి ఒక్కరు ఆ పదాలనే వుపయోగించాలి అనాదున్న పద్ధతిని అర్థం చేసుకోవాలి దానిలో మార్పు చాలా కష్టం ఈ వ్యవస్థలకు మూలం ఆచారం గాని, చట్టం కాదు సహజంగా పెరిగేయే కాని కృత్రిమంగా ఏర్పరిచినవి కావు అందుచేతనే వానికి స్థిరపడిపోయే లక్షణం వుంది ఆ ఆచారమంత విస్తృతమైనదీ, మరో కారణం, అంత విశ్వజనీనంగా వస్తే తప్ప మార్పు జరగదు ఈ వ్యవస్థలో ప్రతి వ్యక్తి ఒక భాగం అందుచేత అది అతని రక్తంలో జీర్ణించి వుంటుంది. ఒక వ్యవస్థ ఏర్పడిన పరిస్థితులు మారి పూర్తిగా అదృశ్యమైనా, అదే వ్యవస్థ కొనసాగు తూనే వుండడానికి కారణం యిదే. వాస్తవ ఘటనల నుంచి వచ్చిన నిర్ణయాలు

సరియైనవేనని ఈ సుస్థిరత ధృవపరుస్తుంది అది పురాతన సమాజంలో జరిగిన విషయాలను జాగ్రత్తచేసి మన ముందుకు తెచ్చింది లేకుంటే మానవుడికి వాటిని తెలుసుకునే అవకాశమే వుండేది కాదు

తురానియన్ పద్ధతిలాంటి విస్తృతమైన వ్యవస్థ భిన్న జాతులలో, భిన్న మానవ కుటుంబాలలో ఒకే విధంగా కొనసాగడం సాధ్యమే చిన్న చిన్న విషయాలలో మార్పులు వున్నా ప్రధాన లక్షణాలు దానిలో ఒకలాగే వున్నాయి రెండు వందల వరకు బంధుత్వపు పిలుపులు దక్షిణ భారతదేశంలోని తమిళులలోను, న్యూయార్క్‌లోని సెనెకా యిరాక్యూలలోను ఒకే మాదిరిగా వున్నాయి సహజమైన తర్కాన్ని ఉపయోగించి వాస్తవ పరిస్థితులను గురించి ఒకే విధంగా ఆలోచించడం మానవ చరిత్రలోనే అరుదు దీనికి కొన్ని సవరణలతో మరొక రూపం వుంది ఉత్తర భారతదేశంలోని హిందీ, బెంగాలీ, మరాఠీ, తదితర ప్రజలలో ఆర్యన్, తురానియన్ పద్ధతుల సమ్మిశ్రణం వచ్చింది నాగరికత పొందిన బ్రాహ్మణులు అనాగరిక జనంతో మిశ్రణం అయి పైన చెప్పిన మాండలికాలలో తమ భాషను మరిచిపోయారు ఆదిమవాస ప్రజల భాషలలోని వ్యాకరణ నిర్మాణానికి తొంభై శాతం వరకు తమ సంస్కృతం మాటలను కలిపారు దీని ఫలితంగా రెండు బంధుత్వ వ్యవస్థలు — 1 దంపతీ కుటుంబం లేక జంటకుటుంబం మీద ఏర్పడినది 2 గుంపు వివాహం మీద ఏర్పడినది—సంఘర్షించేయి ఫలితంగా ఒక మిశ్రమ వ్యవస్థ ఏర్పడింది అధిక సంఖ్యలో వున్న ఆదివాసులు దానికి తురానియన్ లక్షణాల్ని ఇస్తే, అందులో సంస్కృత భాగం కొన్ని సవరణలు తెచ్చి దంపతీ కుటుంబానికి పిందలు తప్పించింది ఈ మాదిరి జాతుల మిశ్రణమంచే స్లావ్‌ల పూర్వులు వచ్చినట్టు కన్పిస్తుంది ఆటవిక, అనాగరిక యుగాలలో బంధుత్వ వ్యవస్థలో రెండు దశలు కన్పిస్తాయి మరికొంత సవరించిన రూపంలో అదే నాగరిక యుగంలోనూ కనిపిస్తుంది ఆ విధంగా పురోగతిని నిరోధించే శాశ్వత స్థితి దానిలో కనబడుబడుతుంది

బహు భార్యాత్వంమీద ఏర్పడిన పేట్రియార్కల్ కుటుంబం గురించి పెద్దగా ఆలోచించనక్కరలేదు అదివున్నదే కొద్దిచోట్ల, మానవజాతి వ్యవహారాలమీద దాని ప్రభావం తక్కువ

ఆటవికుల, అనాగరికుల గృహజీవితం గురించి అధ్యయనం జరగలేదు ఉత్తర అమెరికాలోని ఇండియన్ తెగలలో జంట కుటుంబం వుంది కాని వారు సర్వసాధారణంగా వుమ్మడి వసతి గృహాలలో నివసిస్తారు ఇంట్లో కమ్యూనిజం పాటించు

తారు. అక్కడనుంచి పునలాన్ కుటుంబం వైపూ, రక్త సంబంధీకుల కుటుంబాల వైపూ దిగువకు వెళితే ఒకే యింట్లో వుండే జనం సంఖ్య బాగా పెరుగుతుంది వెనిజులా కోస్తామీది తెగలలో పునలాన్ కుటుంబం వుంది వారు గంట ఆకారంగా కట్టిన యిళ్ళలో ఒక్కొక్కదాంట్లో 160 మంది వరకు వుంటున్నారని చూసిన వారు చెప్పారు భార్యలు భర్తలు, ఒకే గుంపుగా ఒకే యింట్లో సామాన్యంగా ఒకే గదిలో వుంటున్నారు దీనినిబట్టి ఆటవిక దశలో ఈ మాదిరి గృహజీవితం సర్వసామాన్యమనుకోవచ్చు.

ఈ బంధుత్వ వ్యవస్థలకూ, బంధుత్వాలకూ మూలమేమిటో రాబోయే ప్రకరణాలలో చెప్తాను వివాహ పద్ధతులూ, వానివలన ఏర్పడిన కుటుంబ పద్ధతులూ మీద అవి ఏర్పడ్డాయి ఈ విధంగా ప్రతివ్యవస్థను నిరూపించేటందుకు తగిన సాక్ష్యం దొరికితే దాని తరువాత వచ్చిన వివాహ రూపాన్ని, కుటుంబరూపాన్ని ఆ వ్యవస్థ ఎలా చూపిస్తూవుందో చెప్పగలుగుతాము కుటుంబము వరుసగా వివిధ రూపాలలో పెరగడానికి తోడ్పడిన ముఖ్యమైన ఆధారాల క్రమాన్ని చివరి ప్రకరణంలో చెప్తాను మానవజాతియొక్క ప్రప్రథమ స్థితి గురించి మనకు తెలిసింది తక్కువ అందుచేత దొరికిన సాక్ష్యం నుంచి మంచి వానిని తీసుకోవాలి యిక్కడనేను చెప్తున్న వరస క్రమం కేవలం ఊహను పట్టే అయితే దొరికిన సమాచారం, సాక్ష్యంపట్టి పరిశీలనకు అది నిలబడుతుంది కాని భవిష్యత్తులో జరుపబోయే మానవజాతి శాస్త్ర పరిశీలనల ఫలితాలను పట్టి వానిని పూర్తిగా ధ్రువపరుచవలసి వుంటుంది

## రెండవ ప్రకరణం

# రక్త సంబంధీకుల కుటుంబాలు

ఈ కుటుంబం పూర్వకాలంలో వున్నట్లు మలయన్ బంధుత్వ వ్యవస్థ నిరూపిస్తుంది — దీనికి నిదర్శనంగా హవాయియన్ పద్ధతి చూపబడింది — బంధుత్వాలలో అయిదు రకాలు — ఈ వ్యవస్థయొక్క వివరాలు — దీనికి మూలం కొందరుసోదరులూ, కొందరు అక్కచెల్లెళ్ళూ ఒక గుంపుగా అంతర్వివాహం చేసుకోవడం — సాండ్విచ్ దీవులలో సమాజంయొక్క వెనుకటి స్థితి — చైనీయులలో తొమ్మిది తరగతుల బంధుత్వాలు — మౌలికంగా హవాయియన్ వ్యవస్థతో సరిసమానం — ప్లేటోయొక్క ఆదర్శ రిపబ్లిక్‌లో 5 తరగతుల బంధుత్వాల మలయన్ వ్యవస్థలోని బంధుత్వాల — అనుబంధాల పట్టిక

రక్తసంబంధీకుల కుటుంబం వున్నదని సాక్ష్యబద్ధంగా నిరూపించాలి. ఈ ఆచారంయొక్క అతిప్రాథమిక, అత్యంత పురాతన రూపం అట్టడుగు దశలోవున్న ఆటవికులలోకూడ నేడు లేదు ఏ మాత్రం పెరుగుదల చూపిన మానవజాతి ఆ దశ నుంచి అది బయట పడటమే కనిపిస్తుంది అన్నా చెల్లెళ్ళు పెళ్ళిచేసుకున్న ఘటనలు నాగరికయుగంలోను నాగరిక జాతులలోను ఒకటి అర ఉదాహరణలు అక్కడక్కడ లేకపోలేదు కాని ఒక సామాజిక వ్యవస్థకు పునాదిగ ఏర్పడి అటువంటి వివాహాలు జరగడం వేరు. ఈ పురాతన దశకు చాల సమీపంలోనే వున్న ఆటవిక తెగలు పాలినీషియా, పాపోవాదీవులలోనూ, ఆస్ట్రేలియాలోనూ వున్నాయి కాని వారు రక్త సంబంధీకుల కుటుంబ స్థితినుంచి చాల ముందుకే పురోగమించారు మానవ జాతిలో ఇటువంటి కుటుంబం వున్నదనడానికి సాక్ష్యమేమిటని అడగవచ్చు ఆ సాక్ష్యం నిర్ణయాత్మకమైనది కాకపోతే ఆ ప్రతిపాదన చెల్లదు అది చెప్పిన వివాహ ఆచారాలు మారిపోయినా అనేకవందల శతాబ్దాలు ఆ బంధుత్వ వ్యవస్థ కొనసాగుతూ అటువంటి కుటుంబం వుండేదనడానికి సాక్ష్యంగా వుంది.

ఆ బంధుత్వ వ్యవస్థను మలయన్ అంటాము యిది రక్త సంబంధీకుల కుటుంబంలో వుండే బంధుత్వాలను తెలుపుతుంది అది వుండడమే అటువంటి కుటుంబం వుండడానికి సాక్ష్యం ఈ వ్యవస్థ ఏర్పడిన నాటికి రక్త సంబంధీకుల కుటుంబం ఏర్పడి వుండాలి అని నిరూపిస్తుంది

మనకు తెలిసినంత వరకు ఈ వ్యవస్థ చాలా చాలా పురాతనమైనది దానిలోని బంధుత్వాలనూ, వాస్తవాలనూపట్టి దానిని వివరిస్తాను ఈ కుటుంబ రూపం కూడా చాలా పురాతనమైనది

బంధుత్వ వ్యవస్థలో సుస్థిరత లేకుంటే ఆ ప్రాచీనకాలపు సమాజ పరిస్థితుల సమాచారం నేటివరకు మిగిలేది కాదు ఆర్యన్ వ్యవస్థ ఇప్పటికి మూడువేల సంవత్సరాలనుంచి ఏమీ మార్పులేకుండానే వుంది దానిద్వారా బంధుత్వాలను నిర్వచించే దంపతీకుటుంబం అలాగే వుండి వుంటే మరో లక్ష సంవత్సరాలైనా దానిలో మార్పు వుండదు దంపతీ వ్యవస్థలో వాస్తవంగా వున్న బంధుత్వాలను అది వర్ణిస్తుంది అందుచేత ఆ కుటుంబం ప్రస్తుతంవున్న రూపంలో వున్నంతకాలము ఆ వ్యవస్థలో మార్పు రాజాలదు ఆర్యన్ జాతులలో ఒకకొత్త కుటుంబరూపం వచ్చినా అదిప్రపంచ వ్యాప్తంగా విస్తరిస్తే తప్ప వర్తమాన బంధుత్వ వ్యవస్థ మారదు వచ్చే కొత్త కుటుంబం దంపతీకుటుంబంకన్న పూర్తిగా మార్పుకలదైతే తప్ప ఈ వ్యవస్థకొద్దిపాటి మార్పులు రావడం మినహా అది పూర్తిగా రద్దుకావడం జరుగదు దీనికిముందున్న తురానియన్ వ్యవస్థ, దానికి వెనుకనున్న మలయన్ వ్యవస్థ విషయంలో జరిగింది అదే రక్త సంబంధీకుల కుటుంబంతోపాటు వచ్చిన మలయన్ బంధుత్వ వ్యవస్థ అతి ప్రాచీనకాలం నుంచీ కొనసాగి, పునలాన్ కుటుంబం వచ్చాక కూడా చాలాకాలం కొనసాగింది గణాలు ఏర్పడిన తెగలలో అదిరద్దయి తురానియన్ వ్యవస్థ ఏర్పడింది

పాలినీషియా ప్రజలు ఈ మలయన్ కుటుంబానికి చెందుతారు. మలయాలోని ప్రజలు కొన్ని కొన్ని విషయాలలో కొన్ని మార్పులను చేసుకున్నా ఈ బంధుత్వ వ్యవస్థను మలయన్ వ్యవస్థే అంటారు హవాయియన్‌లూ, ఇతర పాలినీషియన్ తెగలులోవున్న బంధుత్వ వ్యవస్థ మానవ జాతిలో అతి ప్రాచీనమైనది హవాయియన్, రోతుమన్ (రోతుమా దీవిలోనిది) రూపాలు ఈ వ్యవస్థకు వుదాహరణలుగా కనిపిస్తాయి రోతుమా అనేచోట వెసిలియన్ మిషనరీగా పనిచేసిన రెవరెండ్ జాన్ ఆస్బార్ ఈ బంధుత్వాలను తెలుసుకొని సిడ్నీలోని రెవరెండ్ లారిమర్ ఫిసర్‌ద్వారా ఈ రచయితకు పంపించారు వర్గీకరణల విషయంలో యిది అతి సామాన్యమైనది

అందుచేతనే అది అతి ప్రాచీనమైనది ఈ ఆదిమ రూపంనుంచే తర్వాత కాలంలో తురానియన్, గనోవానియన్ వ్యవస్థలు తలయెత్తేయి.

ఈ మలయన్ వ్యవస్థ అంతకు పూర్వం వున్న మరో వ్యవస్థనుంచి వచ్చినది కాదు అంతకు పూర్వం అటువంటిదేమీ లేదు అంతకన్న అతి సామాన్యమైన రూపాన్ని ఊహించడం కూడ సాధ్యంకాదు దానిలో గుర్తించబడే రక్త బంధుత్వాలు అయిదు అతి ప్రాథమికమైనవి అవి లింగభేదాన్నికూడ గుర్తించవు దగ్గరవాళ్ళయినా, దూరపువాళ్ళయినా రక్త బంధువులందరిని యిది అయిదు రకాల బంధుత్వాలలోకి వర్గీకరిస్తుంది నేను, నా అన్నతమ్ముళ్ళు, నా అక్కచెల్లెళ్ళు ఒకటవ, రెండవ తరం వేలు విడిచిన మగ ఆడ కజిన్స్ ఈ తరగతులలోనికి వస్తారు వీరంతా నా సోదరులు. అక్కచెల్లెళ్ళే వారిలో ఏ విధమైన ప్రత్యేకత వుండదు యిక్కడ కజిన్ అనే శబ్దాన్ని మన దృష్టినుంచి వాడాను పాలినీషియాలో ఆ బంధుత్వం ఎరగరు మా నాన్న మా అమ్మవాళ్ళ అన్నదమ్ములు అక్కచెల్లెళ్ళు వారి దగ్గర దూరపు కజిన్స్ వీరంతా రెండవ గ్రూపు వీరందరూ కూడ నాకు తల్లి తండ్రులు యిది రెండవ వర్గం మా నాన్న వైపునుంచీ, అమ్మ వైపునుంచీ తాతలు అవ్వలు వారి యిద్దరి అన్నదమ్ములు అక్కచెల్లెళ్ళు యిటూ, అటు వున్న అనేకమంది కజిన్స్ మూడోవర్గం వీరంతా మా తాతలూ అవ్వలూను నా తర్వాత నా కొడుకులు,కూతుళ్ళు వారి కజిన్స్ నాలుగో వర్గం ఎవరూ ఏమిటీ అనే తేడాలు లేకుండ వీరందరూ నా పిల్లలు నా మనుమలు మనుమరాళ్ళు వారి కజిన్స్ ఐదవ వర్గం వీళ్ళందరూ నా మనుమలు పైగా ఆయా వర్గాలలోని వారు ఒకరి కొకరు అన్నదమ్ములు అక్కచెల్లెళ్ళూను ఈ విధంగా ఏ వ్యక్తి కయినా బంధుత్వం కలిసే వారందరూ ఈ అయిదు తరగతుల లోకి కూర్చబడ్తారు ఒకే తరగతికి చెందిన ప్రతి వ్యక్తికి రెండవ వానితో యిదే బంధుత్వం చెల్లుతుంది చైనీయులలో యిదేమాదిరిగా తొమ్మిది తరగతుల బంధుత్వాలు విశదీయ బడినాయి మలయన్ వ్యవస్థలోని అయిదు తరాల అయిదు తరగతులకు తోడు, పూర్వీకులలో అదనంగా రెండు తరగతుల తర్వాత తరాలలో అదనంగా రెండు తరగతుల వారు విశదీకారు అది మరొక చోట చెప్తాను ఈ రెండు వ్యవస్థల మధ్య గల మూల సంబంధాన్ని ఈ విధంగా తెలుసుకున్నాము

హవాయియన్ బంధుత్వపు పేర్లలో 'కుప్పునా' అంటే తాత అవ్వానూ 'మాకువా' అంటే నాన్న అమ్మాను పిల్లల్ని 'కైకి' అంటారు. మనుమల్ని

'మూపునా' అంటారు లింగ విభజన చూపవలసి వచ్చినపుడు మగవానికి 'కానా అని స్త్రీకి 'వహినా' అని చేరుస్తారు కుప్పునా కానా అంటే తాత కుప్పునా వహినా అంటే అవ్వ పైన చెప్పిన బంధుత్వాలను దూరం దృష్ట్యా విర్దేశించవలసి వచ్చినపుడు అంకెల ద్వారా చూపుతారు కాని వాడకంలో 'కుప్పునా' పదాన్నే తాతలకు, వారి పై తరాలకు కూడా వుపయోగిస్తారు 'మూపునా' అన్న పదాన్ని మనుమలకి వారి తరాలకి కూడ వుపయోగిస్తారు అన్నదమ్ములు, అక్క చెల్లెళ్ళుగా తోడబుట్టిన వాళ్ళకి రెండు వేరు వేరు పదాలను వుపయోగిస్తారు అయితే అది అన్నిచోట్ల వుపయోగించడం వుండదు హవాయియన్ భాషలోంచి వుదాహరణ లిస్తున్నాను. అన్నను మగవాడు 'కైకువానా' అంటే, స్త్రీ అయితే 'కైకునానా' అంటుంది తమ్ముణ్ణి మగవాడు 'కైకైనా' అంటాడు స్త్రీ అయితే 'కైకునానా' అంటుంది అక్కను మగవాడు 'కైకువహినా' అంటాడు స్త్రీ అయితే ఆమెను 'కైకువావ' అంటుంది చెల్లెల్ని మగవాడు 'కైకువహినా' అంటాడు. స్త్రీ అయితే 'కైకైనా' అంటుంది యిందులో మగవాడు అన్నగారిని 'కైకువావ' అనడం, స్త్రీ తన అక్కను అదేపేరుతో పిలవడం గమనించవలసి యుంది మగవాడు తన తమ్ముణ్ని 'కైకైనా' అంటాడు. స్త్రీ తన చెల్లెల్ని అదే శబ్దంతో పిలుస్తుంది అంటే ఈ శబ్దాల విషయంలో లింగ భేదం లేదు. కరేన్ల పద్ధతిలో కూడ తన పై వాళ్ళని తరువాత వాళ్ళని ఒకే పేరుతో పిలవడం కనిపిస్తుంది. అక్క చెల్లెళ్ళకు మగవాడు ఒకే పదం వాడుతాడు స్త్రీలు అన్నదమ్ములకు ఒకే పదం వాడుతారు అంటే మగవాడి యొక్క అన్నదమ్ములను పెద్ద, చిన్నగా విడదీయటం వుందిగాని అక్కచెల్లెళ్ళను ఆ విధంగా విడదీయడం వుండదు అదే విధంగా స్త్రీలు అక్కచెల్లెళ్ళను పెద్ద, చిన్నగా విడదీసి చెప్తారేగాని అన్నదమ్ములను అలా చెప్పరు ఈ విధంగా మగవాళ్ళు వుపయోగించే పదాలు వేరు ఆడవాళ్ళు వుపయోగించే పదాలు వేరుగా ప్రారంభమయ్యాయి. పాలినీషియన్ తెగలలో చాలా వానిలో ఈ పద్ధతి కనిపిస్తూంటుంది. అటవిక అనాగరిక తెగలలో అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు అనే బంధుత్వాలను శుద్ధరూపంతో ఊహించడం జరగదు.

ఈ వ్యవస్థలోని కీలకం ఈ రక్త సంబధీకులను అయిదు తరగతులుగా విభజించడంలోనే వుంది అయితే వానిలో కొన్ని ప్రత్యేక లక్షణాలున్నాయి మొదటి మూడు తరాల బంధుత్వాలను వివరంగా చెప్తే అవి అర్థం అవుతాయి అప్పుడు తోడ బుట్టిన వాళ్ళు అదే తరగతికి చెందిన యితర అన్నదమ్ముల మధ్య గుంపు వివాహ పద్ధతితో సంబంధం ప్రథమంలో ఈ బంధుత్వాలలోనే కనిపిస్తుంది.

మొదటి తరంవారు పురుషుల వైపునుంచి నా పిల్లలు నా సోదరుల పిల్లలు అందరూ నా కొడుకులు కూతుళ్ళు అవుతారు వారందరూ నన్ను నాన్న అని పిలుస్తారు వాళ్ళ పిల్లలందరూ నాకు మనుమలు, వారంతా నన్ను తాతా అనిపిలుస్తారు హవాయి ద్వీప వాసుల బంధుత్వాలు యివి

స్త్రీల వైపు నుంచి నా అక్క చెల్లెళ్ళ పిల్లలు కూడ నా కొడుకు కూతుళ్ళే. వారూ నన్ను నాన్న అని పిలుస్తారు వారి సంతానం నాకు మనుమలు వాళ్ళకి నేను తాతను లింగభేదంలో మార్పుతప్ప మూడు తరాలలో యివే బంధుత్వాలు చెల్లుతాయి.

నా కొడుకులయిన వారి భార్యలు అందరు నాకు కోడళ్ళే కూతుళ్ళ భర్తలందరూ అల్లుళ్ళే అని రెండు ఉభయలింగ శబ్దాలే, స్త్రీ పురుష భేదాన్ని చూపించడానికి అదనపు పదం ఒకదానిని చేరుస్తారు

రెండవ తరం వారిలో తండ్రి వైపు అన్నదమ్ములందరు నాకు తండ్రులేకి వారందరూ నన్ను కొడుకా అనే పిలుస్తారు వారి పిల్లలందరూ నాకు అన్నలు. తమ్ములు, అక్కలు చెల్లెళ్ళును వాళ్ళ సంతానం కూడ నాకు కొడుకులు కూతుళ్ళే, వాళ్ళందరి సంతానం కూడ నాకు మనుమలు, మనుమరాళ్ళు ఆయా తరాలకు చెందిన కొడుకులు మనుమలు అందరకూ నేను నాన్ననో తాతనో మా నాన్న అక్క చెల్లెళ్ళు నాకు అమ్మలు వారి సంతానం నాకు అన్నదమ్ములు అక్క చెల్లెళ్ళు వారి సంతానం నాకు కొడుకులు కూతుళ్ళు, మరల వారి సంతానం నాకు మనుమలు అలాగే తల్లి వైపున కూడ మా అమ్మ సోదరుడు నాకు నాన్న ఆయన సంతానం నాకు సోదరీ సోదరులు వాళ్ళ సంతానం నాకు కొడుకులు కూతుళ్ళును మళ్ళీ వాళ్ళ సంతానం నాకు మనుమలు మా అమ్మ అక్క చెల్లెళ్ళు నాకు అమ్మలు వారి సంతానం నాకూ కొడుకులు కూతుళ్ళే వారి సంతానం మళ్ళీ నాకు మనుమలే యిదే విధంగా అన్ని తరగతుల వ్యక్తులు ఆయా తరాలను పట్టి స్త్రీలకు కూడ బంధుత్వాలు కలుస్తాయి

నా సోదరులందరి భార్యలు నాకు భార్యలే వాళ్ళని భార్యకు ప్రయోగించే బంధుత్వ పదంతోనే పిలుస్తాను ఆ స్త్రీలందరి భర్తలునాతో సహా వాళ్ళకీ సోదరులం (తోడల్లుళ్ళు) అదే స్త్రీ అయితే ఆమె అక్క చెల్లెళ్ళ భర్త లందరూ ఆమెకు వారికి కూడ భర్తలే వారందరినీ భర్తను పిలిచినట్లే పిలుస్తుంది. తనతో సహా ఆ భర్తలందరి భార్యలు ఆమెకు తోడి కోడళ్ళు

ఇంక మూడో వర్గం మగవారి వరుసలో నా తాతగారి సోదరులందరూ నాకు తాతలు వారందరి సంతానం నాకు అమ్మలూ నాన్నలూను వారందరి సంతానం నాకు అన్నదమ్ములు, అక్క చెల్లెళ్లూను వారి సంతానం నాకు కూతుళ్ళ కొడుకులు వారి పిల్లలు నాకు మనుమలు అలాగే మా తాత చెల్లెళ్ళు నాకు అవ్వలు వారి పిల్లలు మనుమలు అందరూ పై విధంగానే నాకు వరస బంధువులు

మా అమ్మ వైపున అమ్మమ్మ సోదరులంతా నాకు తాతలు ఆయన అక్క చెల్లెళ్ళంతా నాకు అవ్వలు వారి సంతానం మనుమలు, ఆయా తరాలలో పై రీతిగానే నాకు బంధువులు

వేరువేరు తిరాల వారిలో వివాహ సంబంధాలు యిదే విధంగా వుండడంచేత వివాహ బంధంలో కలిసినవారిసంఖ్య బాగా పెరుగుతూ వుంటుంది జ్ఞాతి బంధుత్వాలు ఎంతదూరం అయినా బంధుక్వవ్యవస్థకు సంబంధించినంతవరకు తరగతివిభజన యిదే విధంగా వుంటుంది జ్ఞాతుల వరుసలో నా నాలుగో ముత్తాత నా తాతే ఆయన కొడుకులు నా తాతలే వారి కొడుకులు నాకు తండ్రులు వారికొడుకులు నాకుసోదరులు వారి కొడుకులూ మనుమలూ నాకూ కొడుకులూ మనుమలూనే

ఎంత దూరపు తరాల జ్ఞాతులను కూడ ఒకే వంశవృక్షంలోకి చేర్చడం యిక్కడ కన్పిస్తుంది దీని ప్రకారం నా జ్ఞాతులైన సోదరీ సోదరుల పూర్వతరాల వారు తర్వాత తరాలవారూ కూడ వాళ్ళకి నాకు ఒకే బంధుక్వంలో కలుస్తారు ఈ తరగతి విభజనలో గల ప్రత్యేకత యిది యిది బంధువులను ఎవ్వరినీ విడువదు,

ఈ వ్యవస్థ చాల వివాదంబరమైనది. రక్త బంధుత్వాలను ముఖంగా చెప్తుంది. గుర్తిస్తుంది తరతరాలకు ఆ బంధుత్వాల గుర్తును కాపాడుతుంది దీనికి వుదాహరణ ఇదే సోదరుల సంతానం తమలో తాము అన్నదమ్ములూ అక్కచెల్లెళ్ళు మళ్ళీ వాళ్ళ సంతానం అన్నదమ్ములు అక్కచెల్లెళ్ళు ఎంత దిగువకు వెళ్ళినా అది అంతే అక్కచెల్లెళ్ళ అన్నదమ్ముళ్ళ పిల్లలూ మనుమలు కూడా అదే బంధుత్వంలో కలుస్తారు

ఒకే తరగతికి చెందినవారు దగ్గర దూరపు జ్ఞాతిత్వాలతో సంబంధం లేకుండ ఒకే బంధుత్వంలో వుంటారు తనకు ఏ బంధుత్వమో ఆ తరగతి వారందరికి అదే రకమైన బంధుత్వాలు చెల్లుతాయి యిక్కడ ఒకటుంది ఈ హవాయియన్ వ్యవస్థలో తరాల పరిజ్ఞానం ఇమిడి వుంది లేకపోతే ఎవరు ఏ తరగతికి చెందుతారో తెలియదు గదా ఈ వ్యవస్థ చాల వివాదంబరమైనది విస్పష్టమైనదీని. సోదరీ సోదరుల మధ్య

గుంపు వివాహాన్ని ఆదిసూటిగా చూపిస్తుంది. అందునుంచే ఈ వ్యవస్థ పుట్టింది కూడ

ఈ వ్యవస్థ ఏర్పడడానికి కారణం భాషా దారిద్ర్యం కాని బంధుత్వాల యెడ నిర్లక్ష్యంగాని కాదు ఆ విషయం ముందు ముందు తెలుస్తుంది

పైన చెప్పిన వ్యవస్థ పాలినీషియన్ తెగలలో హవాయియన్‌లు, రోతుమను లలో, మార్క్వాస్ దీవుల వారిలో న్యూజిలాండ్‌లోని మావోరీలలో, సామోవాన్‌లో, కుశైన్‌లలో మైక్రోనీషియాలోని కింగ్స్‌మిల్ ద్వీప వాసులలో కనిపిస్తోంది తురానియన్ వ్యవస్థను సమీపిస్తున్న చోట్ల తప్ప పసిఫిక్‌దీవుల వారందరిలోను యిది వుంది

ఈ వ్యవస్థను పట్టి దానికన్న ముందు రక్తసంబంధీకుల కుటుంబమూ ఆ మాదిరి వివాహ పద్ధతీ వున్నదని స్పష్టంగా తెలుస్తోంది ఈ వ్యవస్థ ఏర్పడే నాటికి వాస్తవం గానే వున్న బంధుత్వాలను తెలుపుతూ, సహజంగానే ఏర్పడిన వ్యవస్థ యిది ఆ నాడు వున్న వివాహ ఆచారాలు యిప్పుడు లేకపోవచ్చు అలాగే వుంటే తప్ప ఆ విధంగా ఊహించరాదనటానికి వీలులేదు బంధుత్వ వ్యవస్థలు అవి ఏర్పడిన నాటి కుటుంబ ఆచారాలు పూర్తిగా మారిపోయిన చాలా కాలంపాటు అలాగే మారకుండా వుంటాయి అని యింతకు పూర్వమే చెప్పాను మానవుడు కొనసాగిన యింత సుదీర్ఘకాలంలో స్వతంత్ర బంధుత్వవ్యవస్థలు చాలా కొద్దిగానే ఏర్పడడం దానికి సాక్ష్యం అభివృద్ధిలో వచ్చిన మహత్తర ఘట్టాలలో తప్ప అవి మారవు మలయన్ వ్యవస్థయొక్క పుట్టుకను చెప్పేటందుకై తోడబుట్టిన జ్ఞాతులైన సోదరీ సోదరుల మధ్య గుంపు వివాహం వున్నదని ఊహించవచ్చును ఈ వివాహ పద్ధతిలో వాస్తవంగా వుండే బంధుత్వాలను ప్రధానమైన వానిని అది వివరిస్తోంది అందుచేత అటువంటి వివాహాలు వుండేవనడానికి ఈ వ్యవస్థే సాక్ష్యం తోడబుట్టినవాళ్ళు, జ్ఞాతులు అయిన సోదరీ సోదరులను కలుపుకుని రక్తబంధువుల మధ్య గుంపు వివాహాలు ఈ వ్యవస్థకు మూలమని స్పష్టంగానే తెలుస్తోంది మొదట తోడబుట్టినవాళ్ళ మధ్య వివాహం జరిగి వుంటుంది అది అంతకంతకు విస్తరించి జ్ఞాతులయిన సోదరీ సోదరులు కూడ ఈ దాంపత్య వ్యవస్థలో కలిసివుంటారు కాలక్రమంలో ఈ మొదటి వివాహ రూపం లోని నష్టాలను గ్రహించివుంటారు అయితే వెంటనే దానిని రద్దుచేయడం జరుగదు దగ్గర బంధుత్వము వదిలి దూరంనుంచి భార్యలను తీసుకోవడం మంచిదిగా కనబడి వుంటుంది ఆస్ట్రేలియనులలో తరగతులను విభజించడంద్వారా ఆ మాదిరి వివాహ బంధాలను శాశ్వతంగా రద్దుపరచారు తురానియన్ తెగలు గణాలను ఏర్పరచడం

ద్వారా దానివి వ్యాప్తి చేశాయి మరొక పద్ధతిలో ఈ వ్యవస్థ సహజంగా ఏర్పడిందన డానికి సాధ్యంకాదు ఏమంటే దానిని సమన్వయం చేయ్యాలంటే దానికి కీలకం ఈ వివాహ రూపంలోనే వుంది ఆ వివాహంతో ఏర్పడిన రక్త సంబంధీకుల కుటుంబంలో భర్తలంతా బహు భార్యాకులుగా, భార్యలంతా బహుభర్తృకలుగా జీవి స్తారు ఇవి మానవ సమాజ మంత ప్రాచీనము కూడాను ఆ కుటుంబ రూపం అస హజం కాదు, ప్రత్యేకమూ కాదు ఆ అతిప్రాచీన కాలంలోకుటుంబం మరో విధంగా ప్రారంభించే అవకాశం లేదు అయితే మానవ తెగలలో ఆ రూపం పాక్షికంగానైన చాల దూరం వరకు కొనసాగడం మాత్రం ఆశ్చర్యకరం హవాయియన్‌లను చూసిన నాటికి వారిలో యిది పూర్తిగా మాసి పోనేలేదు

మలయన్ వ్యవస్థ ప్రాతిపదికను గురించి ఈ ప్రకరణంలోను, తురానియన్, గనోవానియన్ వ్యవస్థల ప్రాతి పదికల గురించి వచ్చే ప్రకరణలోను చెప్పిన విష యాలను "ప్రిమిటివ్ మారేజ్" రచయిత జాన్ ఎఫ్ మాక్లెన్నాన్ ఒప్పుకోవడం లేదు అయితే యిందులో కనబరచిన అభిప్రాయాలను సవరించు కోవలసిన అవసరం ఏమీలేదు "రక్తసంబంధీకుల వ్యవస్థలు" మొదలైన నారచనల్లో చెప్పిన అంశాలనే ప్రధానంగా యిక్కడ చెప్పాను ఇక్కడనేను మళ్ళీ చెప్తున్నా వివరాలనూ మాక్లెన్నాన్ అభ్యంతరాలనూ గురించి ఆరో ప్రకరణం చివర చెప్పిన వ్యాఖ్యలను శ్రద్ధగా చదవ మని పాఠకుల్ని కోరుతున్నాను

ఈ మాదిరి వివాహరూపంతో మలయన్ వ్యవస్థలో చెప్పిన బంధుత్వాలను పరీక్షకు పెడితే తోడబుట్టిన వాళ్ళు జ్ఞాతులు అయిన సోదరీ సోదరుల మధ్య గుంపు పెళ్ళి పద్ధతిమీద అవి ఆధారపడి ఏర్పడ్డాయని కనిపిస్తుంది కుటుంబం నిర్మాణంనుంచి ఏర్పడే బంధుత్వాలు రెండు తరహాలుగా వుంటాయి తరాల వరుసలో కనపడే రక్త బంధుత్వం వివాహాల వలన ఏర్పడే అనుబంధమూ రక్త సంబంధీకుల కుటుంబంలో తండ్రులది ఒక గ్రూపు తల్లులది ఒక గ్రూపుగారెండు విస్పష్టమైన గ్రూపులున్నాయి యిక్కడ రెండు గ్రూపుల వారి పిల్లల మధ్య బంధుత్వం చాలా బలంగా వుంది రక్తబంధుత్వానికి అనుబంధానికి మధ్య అంతరాన్ని ఈ వ్యవస్థలో చూడం

1 మగవాడిగా నా యొక్క, నా అనేకమంది సోదరుల యొక్క పిల్లలు నా కొడుకులూ, కూతుళ్ళూనే

కారణం హవాయియన్ ద్వీపవాసిగా నా సోదరుల భార్యలందరూ నాభార్యలూ వారిభార్యలూ కూడాను మా పిల్లలలో నా పిల్లలెవరో మా సోదరుల పిల్లలెవరో

గుర్తు పట్టడం సాధ్యంకాదు. ఒక పిల్లవాడిని నా వాడు అని పిలిస్తే మిగిలిన అందరిని కూడ అలా పిలువ వలసిందే నా కొడుకు అనుకోగల అవకాశం ఏ ఒక్కడికున్నా అందరికి వున్నట్లే

2. మా సోదరులందరి మనుమలు నామనుమలే

కారణం వారంతా నా కొడుకుల, కూతుళ్ళ పిల్లలు

3 స్త్రీగా కూడ పైన చెప్పిన బంధుత్వాలు ఇదే మాదిరిగా వర్తిస్తాయి-

కారణం ఇది వివాహ ఫలితమైన బంధుత్వాలు నా సోదరులంతా నా భర్తలే కనుకవారికి వారి యితర భార్యలవల్ల కలిగిన సంతానం నాకు సవితి పిల్లలు(step-chi-ldren) ఆ బంధుత్వానికి గుర్తింపులేదు కనుక వాళ్ళంతా నా కొడుకులూ కూతుళ్ళే. లేకపోతే వాళ్ళు ఈ వ్యవస్థలోకిరారు. ఇంకా మా విషయంలో సవతి తల్లికూడ అమ్మ అవుతుంది సవతి కొడుకుని కొడుకు అంటాము.

4 మగ వాడుగా నాతోడ బుట్టిన, జ్ఞాతులు అయిన నా అక్క- చెల్లెళ్ళ పిల్లలు నా కొడుకులూ కూతుళ్ళే.

కారణం నా అక్క- చెల్లెళ్ళంతా నాకూ మా అన్న తమ్ములందరికీ కూడ భార్యలే

5 మా అక్క- చెల్లెళ్ళందరి మనుమలు నా మనుమలే

కారణం వారందరూ నా కొడుకులు, కూతుళ్ళ పిల్లలు

6 స్త్రీగా నా అక్క- చెల్లెళ్ళందరి పిల్లలు నా కొడుకులూ కూతుళ్ళే

కారణం నాకూ, నా అక్క-చెల్లెళ్ళకూ భర్తలు ఒకళ్ళే అయితే యిక్కడ ఒక తేడా వుంది మా అక్క- చెల్లెళ్ళ పిల్లలెవరో నా పిల్లలెవరో గుర్తు పట్టగలను కనుక వాళ్ళకి నేను మారుటి తల్లిని కాని ఈబంధుత్వానికి గుర్తింపులేదు వారందరూ నా కొడుకులూ కూతుళ్ళే లేకుంటే వాళ్ళు ఈ వ్యవస్థలోకి రారు

7 మా సోదరుల పిల్లలందరు ఒకళ్ళ కొకరు అన్న దమ్ములూ అక్క-చెల్లెళ్ళూను

కారణం ఈ పిల్లలు యొక్క తల్లులకి మా సోదరులందరం భర్తలమే పిల్లలు తమ తల్లిని గుర్తు పట్టగలరు కాని తండ్రులను గుర్తు పట్టలేరు కనుక ఆ పిల్లలలో కొందరు తోబుట్టువులైన అన్నదమ్ములు, అక్క- చెల్లెళ్ళు మిగిలిన వారు సవతి అన్నదమ్ములు సవతి అక్క-చెల్లెళ్ళూను కాని వారిలో వారికి అందరూ సోదరీ సోదరులు అయి వుండవచ్చు అనుకునేటి వారంతా ఈ వరగతిలోకే వస్తారు

8 ఈ అన్నదమ్ముల, అక్కచెల్లెళ్ల పిల్లలు ఒకరికొకరు అన్నదమ్ములూ అక్కచెల్లెళ్ళూను వారి సంతానం మళ్ళీ అన్నదమ్ములూ అక్కచెల్లెళ్ళూ ఇదే బంధుత్వం తరతరాలుగా ఎంత దూరమైనా సాగుతుంది మా అక్కచెల్లెళ్ళ, అన్నదమ్ముల పిల్లల విషయంలో కూడ యిదే బంధుత్వాలు ఆ విధంగా అనంతమైన ఒక క్రమం ఏర్పరచ బడింది, అదే ఈ వ్యవస్థలో ప్రధానమైన అంశం ఈ క్రమాన్ని పట్టి ఎక్కడ అన్నదమ్ముల అక్కచెళ్ళెళ్ళ బంధుత్వం గుర్తించబడుతుందో వారందరికీ వివాహ సంబంధం అంగీకరించబడుతుందని అనుకోవాలి ఒక సోదరునికి తోడబుట్టిన వాళ్ళు జ్ఞాతులు అయిన అక్కచెల్లెళ్ళు ఎందరుంటే అంత మంది భార్యలే అలాగే ఒక సోదరికి తోడబుట్టిన వాళ్ళుజ్ఞాతులుఎందరుంటేఅందరూ భర్తలే యిక్కడ తరగతిని పట్టి వివాహము, కుటుంబ రూపము ఏర్పడుతున్నాయి అది వున్నంత కాలమూ అవి వుంటాయి పైన అనేక పర్యాయాలు ఉదహరిస్తూ వచ్చిన అసాధారణ దాంపత్య వ్యవస్థకు మూలం అది

9 నా తండ్రి సోదరులంతా నాకు తండ్రులు తల్లిఅక్కచెల్లెళ్ళంతా నాకు తల్లులు

కారణాలు ఒకటి, మూడు, ఆరులలో చూడండి

10 మా అమ్మ అన్నదమ్ములంతా నాకు తండ్రులే

కారణం వారంతా మా అమ్మకు భర్తలు

11 మా అమ్మ అక్కచెల్లెళ్ళంతా నాకు అమ్మలు

కారణం ఆరులో చూడండి

12 నా జ్ఞాతి సోదరుల అక్కచెల్లెళ్ళ పిల్లలందరూ ఏ మాత్రం భేదం లేకుండ నా కొడుకులూ కూతుళ్ళే

కారణం ఒకటి, మూడు, నాలుగు, ఆరులలో చూడండి

13 పైన చెప్పిన వారి సంతానమంతా నా మనుమలు

కారణం రెండులో చూడండి

14 మాతాత అవ్వల- తండ్రి వైపున కూడ- అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళందరూ నాకు తాతలూ, అవ్వలూనూ

కారణం వారంతా మా అమ్మకు నాన్నకు అమ్మలు నాన్నలూనూ తోడబుట్టిన జ్ఞాతులైన అన్నదమ్ములు అక్కచెల్లెళ్ళు ఒక గుంపుగా వివాహం చేసుకోవడం వలన ఏర్పడిన రక్తసంబంధీకుల కుటుంబం యొక్క స్వభావం లోనే ఈ

ప్రతి ఒకబంధుత్వము గుర్తించబడుతూంది తండ్రుల వైపున ఈ బంధుత్వాలు పిల్లల పితృత్వం తెలిసినంత వరకు అనుసరించి, తండ్రులు అయి వుండగలరు అనుకున్న వారందరినీ తండ్రులు గానే అంగీకరిస్తున్నారు కాని తల్లి వైపునుంచి అనుబంధం ఒకటే వుంది అందుచేత మారుటి పిల్లలను కూడ తన పిల్లలుగానే గుర్తిస్తూంది

| టోంగన్‌లలో | మగవానిమాట | హవాయియన్ బంధుత్వం |
|---|---|---|
| నా సోదరుని భార్య | వునో హో, నా భార్య | వహీనా, నా భార్య |
| నా భార్య సోదరి | వునోహో, నా భార్యే | వహీనా, నా భార్యే |
| | స్త్రీ మాట | |
| నా భర్త సోదరుడు | వునోహో, నా భర్త | కానే - నా భర్త |
| | మగవాని మాట | |
| నా తండ్రి సోదరుని కొడుకు భార్య | వునోహో, నా భార్య | వహీనా, నా భార్య |
| నా తల్లి అక్కచెల్లెళ్ళ కొడుకుల భార్యలు | వునోహో, నా భార్యలు | వహీనా, నా భార్యలు |
| | స్త్రీ మాట | |
| నా తండ్రి సోదరుని కూతురు మగడు | వునోహో, నా భర్త | కైకో ఎకా, నా బ్రదర్ ఇన్‌లా |
| నా తల్లి అక్కచెల్లెళ్ళ కూతురు భర్తలు | వునోహో, నా భర్తలు | కైకో ఎకా, నా బ్రదర్ ఇన్‌లా |

భార్యయొక్క బంధుత్వం జ్ఞాతిరీత్యా అయినా అది వంశక్రమంలో గుర్తించ బడుతుంది అదే భర్తది అయితే తద్వ్యతిరేకంగా అనుబంధరూపంగా వుంటుంది దక్షిణాఫ్రికాలోని కాఫిర్‌లలో నా తండ్రి సోదరుని కొడుకు భార్య, నా తండ్రి అక్క చెల్లెళ్ళ కొడుకుభార్య, నా తల్లి సోదరుని కొడుకుభార్య, నా తల్లి అక్క చెల్లెళ్ళ కొడుకు భార్య వీరంతా అతనికి మిగిలిన వారందరికీ కూడ భార్యలే. వారిరక్తబంధుత్వ వ్యవస్థ అది ఈ బంధుత్వాలా, అనుబంధాలావ్యవస్థ అమలులోకి వచ్చిన ప్రథమంలో ఉపయోగించబడిన ఈ బంధుత్వశబ్దాలు వాస్తవంగావున్న పరిస్థితిని చూపిస్తున్నాయి తర్వాతకాలంలో వివాహపుటాచారాలు మారినా అవి అలాగే కొనసాగుతున్నాయి.

ఈ బంధుత్వ వ్యవస్థలో కనిపించే సాక్ష్యాన్నిబట్టి పైన చెప్పిన విధంగా రక్త సంబంధీకుల కుటుంబం పాలినీషియన్ తెగల పూర్వులలో కూడ వుండేది అనుకోవాలి. ఆ వ్యవస్థ సాధ్యం అనుకోవడానికి అటువంటి కుటుంబ రూపం అవసరము పైగా సాధ్యమైనంత సరిగా ప్రతి బంధుత్వాన్ని నిర్వచించేటందుకు అదే తోడ్పడుతుంది.

ఓస్కార్ పెషర్ వ్రాసిన ఈ విషయాన్ని గుర్తుపెట్టుకోవాలి "ఎప్పుడైనా సరే, ఎక్కడైనా సరే, ఒకే తల్లి పిల్లలు దాంపత్యం నిర్వహించి సంతానాన్ని కనడం సుదీర్ఘ కాలంపాటు కొనసాగదు రక్తము లేనటువంటి మొక్కలలోకూడ ఒకే పితరుల సంతానం పరస్పర సంయోగంలో ఫలించడం ఎంతోకాల కొనసాగదు"

ఇక్కడ రక్త సంబంధీకుల గుంపులో దాంపత్య సంబంధాలు సోదరీ సోదరుల మధ్యమాత్రమే పరిమితం కాలేదనీ, జ్ఞాతి సోదరీ సోదరులుకూడ దానిలో చేర్చబడ్డారని మనం గుర్తుపెట్టుకోవాలి దాంపత్య బంధాన్ని గుర్తించే గుంపు పెద్దదయినకొద్దీ అతి సన్నిహితులమధ్య సంతాన ప్రాప్తి చాల తక్కువ వుంటుంది

అటువంటి కుటుంబం ప్రాచీనకాలంలో వుండడం సాధ్యమని సాధారణ రూపంలో ఒప్పుకుంటున్నాం ఈ రక్త సంబంధీకుల కుటుంబంలోని సహజమైన అవసరమైన బంధుత్వాలు పునలాన్ కుటుంబ రూపానికి, అక్కడనుంచి సింథి యాస్మియన్ రూపానికీ, దానినుంచి దంపతీ కుటుంబానికీ దారితీస్తాయి. ప్రతి ఒక్కటీ దాని పూర్వపుదశను గుర్తించవలసియుంటుంది యివన్నీ గతిక్రమంలో అటవికదశ నుండి నాగరికదశ వరకు గడిచిన అనేక మానవజాతుల దశలలో ఏర్పడ్డాయి

అదే విధంగా కుటుంబరూపాలు మూడింటితో సంబంధంవున్న మూడుబంధుత్వ వ్యవస్థలూ,వరుసక్రమంలో ఒకదానికొకటి అనుబంధించి వున్నాయి కుటుంబరూపాలతో సమంగా అవి పురోగమిస్తూ వుంటాయి అటవిక స్థితినుంచి నాగరికతకు మానవుడు పొందిన పురోగతికి సమానంగా అవీ వడుస్తాయి ఆర్యన్, సెమిటిక్, యురాలియన్ మానవ కుటుంబాల అతిప్రాచీనకాల పురుషులు కూడ అటవిక దశలో మలయన్ రక్త సంబంధ వ్యవస్థలాంటి దానిని కలిగివుండే వారనీ, గణవ్యవస్థ ఏర్పడిన తరువాత దానిని సవరించి తురానియన్ వ్యవస్థను ఏర్పరుచుకున్నారనీ, ఆటు తరువాత దంపతీ కుటుంబరూపం ఏర్పడినపుడు దానినీ తోసివేసి ఆర్యన్ బంధుత్వ వ్యవస్థను ఏర్పరుచు కున్నారనడానికి తగిన ఆధారాలున్నాయి

పైన చెప్పిన గట్టి సాక్ష్యంతో పాటు హవాయియన్‌లలో పూర్వకాలంనాడు రక్త సంబంధీకుల కుటుంబం వుండేదనడానికి యింకా ఎంతో సాక్ష్యం వుంది దానినీ చూద్దాం.

శాండ్‌విచ్ దీవులలోని సమాజ పరిస్థితి మనకు తెలిసిననాటికి అక్కడ పూర్వకాలం యిటువంటివ్యవస్థ వుండేదనడానికి అవకాశాలున్నాయి 1820లో యీ దీవులలో అమెరికన్‌మిషన్లు ఏర్పడినప్పుడు ఆ మిషనరీలు అక్కడి సమాజ పరిస్థితిని చూసి దిగ్భ్రమచెందారు వారికి ప్రధానంగా ఆశ్చర్యం కలిగించినవి వారిలోని స్త్రీ పురుష సంబంధాలూ, వివాహ ఆచారాలూను, దంపతీ కుటుంబమే కాదు, జంట కుటుంబం కూడ ఎరగని, అతిప్రాచీన సమాజంలోకి వారడుగుపెట్టారు ఆ నిర్మాణ స్వభావాన్ని వారెరుగరు తోడబుట్టిన సోదరీ సోదరులను కూడ కలుపుకొన్న పునలాన్ కుటుంబాన్ని వారు చూశారు మగవాళ్ళు బహు భార్యాకులుగా, స్త్రీలు బహు భర్తృకలుగా జీవిస్తున్న సమాజమది. దానికి అతిహీన స్థితికి దిగజారిన మానవులు కనిపించారు కాని ఆ అమాయక హవాయియన్లు చట్టాలంత బలమైన ఆచారాలూ అలవాట్లతో, ఆ అటవికదశలో గౌరవనీయము నిరాడంబరమూ అయిన జీవితాన్ని గడుపుతున్నారు. ఆ అటవిక దశనుంచి వారు ముందుకు వెళ్ళలేకపోయారు ఈ మిషనరీలు తమ కట్టుబాట్లను ఎంత శ్రద్ధా భక్తులతో అనుసరిస్తున్నారో వారూ అంతనైతిక శ్రద్ధతో జీవిస్తూండివుంటారు ఈ మిషనరీలకు అనిపించిన ఆశ్చర్యం అటవిక మానవునినుంచి నాగరిక మానవుడిని విడదీస్తున్న అగాధాన్ని తెలుపుతూంది ఎన్నోవేల సంవత్సరాలు గడిచి ఎంతో వున్నత స్థితికి పెరిగిన నైతిక భావనలూ, పరిష్కృత రూపంలోవున్న ఆలోచనలూ హఠాత్తుగా వేలసంవత్సరాల వెనుకబడియున్న అటవిక మానవుని ప్రాథమికరూపంలోవున్న నైతికదృష్టినీ,మోటు ఆలోచనలనూ ముఖాముఖిగా చూసింది ఈ రెంటికిమధ్య ఎంతో అంతరం వుంది ప్రముఖ మిషనరీలలో ఒకడైన రెవరెండ్ హిరామ్ బింఘామ్ స్వయంగా పరిశీలించి శాండివిచ్ దీవుల చరిత్రను అద్భుతంగా వివరించాడు మానవులు చేయకూడని పనులన్నింటిని వారు చేస్తున్నట్లు వర్ణించాడు "అనేక మంది భార్యలు అనేక మంది భర్తలు వుండే విధంగా బహు భార్యత్వం, జారత్వం, వ్యభిచారం, వావి,శిశుహత్య భర్తల్ని, భార్యల్ని,తల్లిదండ్రుల్ని, పిల్లల్ని వదిలేయడం, పోరు, దురాశ, పీడన చాల విస్తృతంగా వ్యాపించి వున్నాయి వారిమతం కూడ ఈ స్థితిని విరోధిస్తున్నట్లు లేదు" పునలాన్ వివాహము, పునలాన్ కుటుంబం దీనిలో చెప్పిన ప్రధానమైన నేరాలన్నింటిని తోసేసి హవాయియన్లకు నైతిక స్ఫూర్తిని అనుమతిస్తుంది అటవికులలో కూడ నీతి వుంటుంది అయితే అది చాల దిగువ తరగతిది కావచ్చు మానవుని అనుభవాలలో నీతిసూత్రాలు ఏ మాత్రం వుండని దశ ఏ కాలంలోనూ వుండదు హవాయియనలు తమపురాణ పురుషుడుగా చెప్పుకునే

వాశీయ తన పెద్దకూతురుని పెళ్ళిచేసుకున్నాడట అని బింఘాం వ్రాశాడు ఈ మిషనరీలు వెళ్ళేనాడు హవాయియన్‌లలో సోదరీ సోదరుల మధ్య వివాహం తప్పలేదు "వున్నతస్థాయి కలవాళ్ళలో సోదరీ సోదరుల వివాహం అభిలషనీయంగా వుంది భగవంతుని ప్రవచనం తెలిసే వరకు అది కొనసాగింది" అన్నాడు బింఘాం కొన్ని సందర్భాలలో పునలాన్ కుటుంబం ఏర్పడ్డాక కూడా సోదరీ సోదరులమధ్య వివాహం కొనసాగుతూనే వుండి వుంటుంది. సాండ్విచ్ దీవులలో రక్త సంబంధీకుల కుటుంబం నుంచి పునలాన్ కుటుంబం ఏర్పడలేదు అందుచేత వారిలో గణనిర్మాణం జరుగలేదు కుటుంబం ప్రధానంగా పునలాన్ రూపంలోనేవున్నా, బంధుత్వవ్యవస్థ రక్తసంబంధీకుల కుటుంబం వున్నప్పటిలాగే మారకుండా వుండిపోయింది కొన్ని కొన్ని వివాహ బంధుత్వాలలో మాత్రమే మార్పువచ్చింది

హవాయియన్‌లలో వాస్తవ కుటుంబం వివాహ సంబంధాలను ఆమోదించేటంత పెద్ద సమూహంగా వుండి వుండదు. ఆహార సేకరణకు పరస్పర రక్షణకు వారు తప్పనిసరిగా చిన్న చిన్న గుంపులుగా విడిపోవలసి వుంటుంది ఈ చిన్న కుటుంబాలు ఆ పెద్ద గుంపుయొక్క సూక్ష్మరూపాలుగానే వుంటాయి పునలాన్ కుటుంబ పద్ధతిలోను రక్త సంబంధీకుల కుటుంబ పద్ధతిలోను కూడ యిటువంటి చిన్న విభాగాలలోని వ్యక్తులు ఒకదానినుంచి మరొకదానికి తోచినప్పుడల్లా మారిపోతూవుండటం అసంభవం కాదు దానినే బింఘాం భార్యాభర్తలు ఒకళ్ళ నొకళ్ళు విడిచిపోతారనీ, తల్లిదండ్రులు పిల్లల వొదిలేస్తారనీ చెప్పడానికి కారణమయి వుంటుంది రక్త సంబంధీకుల కుటుంబదశలోను పునలాన్ కుటుంబదశలోను అవసరంకొద్దీ జీవనపద్ధతిలో కమ్యూనిజం పాటించక తప్పదు ఆ పరిస్థితులకు అది అవసరం ఇప్పటికీ అటవిక అనాగరిక ప్రజలలో అదికొనసాగుతూ వుంది

చైనీయుల తొమ్మిది తరగతుల బంధుత్వాల గురించి ఇక్కడ సంగ్రహంగా చెప్తాను ప్రాచీన కాలపు చైనా రచయిత ఒకరు యిలా వ్రాశారు "ప్రపంచంలో పుట్టిన మనుష్యులందరిలో బంధుత్వాలు తొమ్మిది అంతరువులలో వున్నాయి నా తరానిది ఒక మెట్టు, మా నాన్నది ఒకటి, మా తాతది ఒకటి, మా ముత్తాతది యింకొకటి, అలాగే ఆయన తండ్రిది యింకొక మెట్టు ఆ విధంగా నాపైన నాలుగు అంతరువులు వున్నాయి నా కొడుకు తరానిది ఒక మెట్టు నా మనుమడిది ఒక మెట్టు మునిమనుమడి తరానిది ఒకటి అతని కొడుకుదిమరొకటి ఆ విధంగా నా క్రింద నాలుగు తరగతులున్నాయి నా దానితో కలిపి మొత్తం యివి తొమ్మిది

అంతరువులు యిందులో ప్రతి తరగతిలోని వారూ మరో కుటుంబానికి మరో యింటికి చెందిన వారూ అంతా సోదరులే వారంతా నాకు బంధువులే బంధుత్వాలలోని తొమ్మిది అంతరువులు యివి

"ఒక కుటుంబంలోని బంధుత్వాల తరతమ హెచ్చు తగ్గులు ఒక వాగులోని ప్రవాహాల్లాంటివి చెట్టు యొక్క కొమ్మల్లాంటివి ఆ ప్రవాహాలు దూరంవీ, దగ్గరవీ కావచ్చు కొమ్మలు దూరం దగ్గరలో వుండవచ్చు కాని అవన్నీ ఒకే మొదలు నుంచి ఒక బుగ్గ నుంచీ వచ్చినవే"

హవాయియన్ బంధుత్వ వ్యవస్థ కూడ బంధుత్వాలలోని ఈ అంతరువులను గుర్తిస్తోంది అయితే పైనో రెండు మెట్లు దిగువనో రెండు మెట్లు కొట్టివేసి వాని సంఖ్యను అయిదు చేసింది ఈనాడు చైనీయులలో వున్న దానికంటే చాల స్పష్టంగా వుంది చైనీయుల వ్యవస్థ తురానియన్ పద్ధతుల కొన్నింటిని చేర్చుకుంది అనేక జ్ఞాతి శాఖలను గుర్తించేటందుకై ప్రత్యేక విభాగాలూ చేసింది కాని హవాయియన్లది పరిశుద్ధంగా నిరాడంబరంగా మొట్టమొదటి తరగతులకు సరిపడినట్లు కొనసాగుతూంది అటు చైనీయులలోను యిటు హవాయియన్లలోను కూడ రక్త బంధువులను తరాల వారీగా తరగతులుగా విభజించారు ఒకే తరగతికి చెందిన జ్ఞాతులందరు ఒకరి కొకరు సోదరీ సోదరులు పైగా వివాహమూ,కుటుంబమూ ఏ తరగతి కాతరగతిలోనే గుర్తించబడుతుంది దాని పరిధిలోనే భార్య భర్తలు ఏర్పడుతారు హవాయియన్ల తరగతులలో యిది స్పష్టంగా అర్థం అవుతూంది చైనీయుల అతి పురాతన పురుషులలో యిటువంటి పరిస్థితే వున్నదని మిగిలిన ఈ భాగము గుర్తు చేస్తూంది హవాయియన్లలో కూడ అదే స్థితి మరొకలా చెప్పాలంటే వీరి తరగతులు ఏర్పడిన వాటికి పునలాన్ కుటుంబం వుండిందనీ, అంతకు పూర్వం విధిగా రక్త సంబంధీకుల కుటుంబం వున్నదనీ సూచిస్తూంది

ప్లేటో వ్రాసిన 'తిమాయియస్'లో యిదే ప్రాథమిక బంధుత్వ తరగతులైదింటి సూచన వుంది ఆదర్శాత్మకమైన రిపబ్లిక్‌లో బంధువులంతా అయిదు తరగతులుగా వుంటారని స్త్రీలు పుమ్మడి భార్యలుగా వుంటారని పిల్లలు సమానంగా తల్లితండ్రు లందరి వాళ్ళు అవుతారని ఆయన వ్రాశారు సోక్రేటస్ తిమాయియస్‌తో "సంతానోత్పత్తి మాటేమిటి అని అడుగుతాడు వివాహాల కలయికలో పిల్లలు సమానంగా అందరి వాళ్ళు కావాలని ఫలానా పిల్లలు మా వాళ్ళు అని గుర్తించటానికి వీలుండరాదని సమాన వయస్కులంతా జ్ఞాతులనుగా అందరూ భావించాలని వయసులో

వున్న వాళ్ళందరూ సోదరీ సోదరులుగా వుండాలనీ, అంతకి వెనుకటి వాళ్ళందరు తండ్రులు, తాతలు, కావాలనీ తరువాతి వాళ్ళు కొడుకులు మనుమలు కావాలని ఆదేశించారు ఆ ప్రతి పాదన క్రొత్తగా వుండడం చేతను జ్ఞాపకం వుంచుకోవడం సులభం" హెల్లెనిక్ (గ్రీకు), పెలాస్గియన్ సంప్రదాయాలను గురించి మనకు తెలియక పోయినా ప్లేటోకు తెలిసి యుంటాయి ఆ సంప్రదాయాలు అనాగరిక యుగంలోకి వెనకకి వ్యాపించి గ్రీకు తెగలలో యింకా అంతకు పూర్వం వున్న పరిస్థితుల ఛాయలను చూపిస్తూండి వుంటాయి ఆయన చెప్పిన ఆదర్శవంతమైన కుటుంబానికి తాత్విక ఆలోచన మూలమనడం కంటే పైన చెప్పిన పారంపర్యాలే కారణం అయి వుంటాయనుకోవచ్చు ఆయన చెప్పిన బంధుత్వ తరగతులైదూ సరిగ్గా హవాయియన్ లలో వున్న మాదిరివే ప్రతి తరగతిలోను సోదరీ సోదరులే వుంటారు వారే కుటుంబంగా ఏర్పడుతారు ఆ గుంపులో భార్యలు భర్తలు వుమ్మడిగా వుంటారు

చివరిగా రక్త సంబంధీకుల కుటుంబం సూచిస్తూన్న సమాజం అంతకు పూర్వపు అనియమిత స్త్రీ పురుష సంబంధాలు కల సమాజ స్థితిని చూపుతూందని గ్రహించగలం డార్విన్ లాంటి మహా రచయిత యిటువంటి పరిస్థితి వుంటుందా అని తన డిసెంట్ ఆఫ్ మాన్‌లో ప్రశ్నించారు కాని తప్పదు అటువంటి స్థితి వుంది అనాలి ఈ అనియమిత స్త్రీ పురుష సంబంధాలు ఆ గుంపులలో సుదీర్ఘ కాలం కొనసాగి వుండవు ఏమంటే బతుకు తెరువు కోసం ఆ గుంపులు చిన్న చిన్న జట్లుగా విడిపోయి రక్తసంబంధీకుల కుటుంబాలుగా మారిపోతాయి రక్త సంబంధీకుల కుటుంబం మొట్ట మొదటి సమాజ నిర్మాణము అది అంతకు పూర్వం పరిస్థితి ఎలా వున్నా నిర్మాణ రహితమైన స్థితి కన్న అది మెరుగేనని చెప్పడం క్షేమం అది ఏర్పడినప్పటికి మానవ జాతి అట్టడుగు స్థితిలో వున్నది అక్కడ నుంచి మానవుని పురోగతి చరిత్రను ఎత్తుకోవచ్చు అనాగరిక యుగం నుంచి నాగరిక దశ వరకు సాగిన ఆ పురోగతి చరిత్రను కుటుంబ వ్యవస్థలు, కల్పనలు, అన్వేషణల పెరుగుదల ద్వారా గుర్తించగలం. వేరు వేరు రూపాలలో వరుసగా కుటుంబ భావన ఎలా పెరిగిందో చూపడం కన్న, ఆ చరిత్ర గతిని మరో విధంగా అంత స్పష్టంగా చూపించలేము ఇంతవరకు చెప్పిన సాక్ష్యాధారాలు రక్త సంబంధీకుల కుటుంబం వున్నదని నిరూపించడానికి చాలు. మిగిలిన కుటుంబ రూపాలను బహు సులభంగానే చూపించవచ్చు

(హవాయియన్‌ల, రోతుమన్‌ల బంధుత్వ వ్యవస్థ మీద అయిదు టేబుల్స్ నెం 1, 2, 3, 4, 5 చూడండి)

# మూడవ ప్రకరణం

# పునలాన్ కుటుంబం

రక్త సంబంధీకుల కుటుంబం తరువాత పునలాన్ కుటుంబం వచ్చింది— ఈ మార్పు ఎలా వచ్చింది? — హవాయియన్ల పునాలువా ఆచారం — ప్రాచీన కాలంలో అది విస్తృత ప్రాంతాలలో వుండి వుండవచ్చు —పునాలాన్ జట్ల నుంచే గణాలు వచ్చాయి — తురానియన్ బంధుత్వ వ్యవస్థ — దీనిని సృష్టించినది పునాలా కుటుంబం — ఈ వ్యవస్థ ఏర్పడిన నాటికే ఈ కుటుంబం వున్నదని నిరూపణ — వ్యవస్థ వివరాలు — బంధుత్వాల మూలాలు గురించిన వివరణ — బంధుత్వాల అనుబంధాల వ్యవస్థలైన తురానియన్ గనోవానియన్ వ్యవస్థల పట్టిక

చారిత్రక యుగంలో కూడ యూరపు, ఆసియా, అమెరికాలలో పునలాన్ కుటుంబం వుంది పాలినీషియాలో ఈ శతాబ్దంలో కూడ వుంది అటవిక దశలో వున్న మానవ తెగలలో చాల ప్రచలితంగా వున్న ఈ కుటుంబ రూపము అనాగరిక యుగం దిగువ దశకు చేరిన తెగంలో కొన్ని చోట్ల మిగిలింది. మధ్య దశకు చేరినా బ్రిటన్‌లోని తెగలలో కూడ వుంది

మానవ పరిణామ క్రమంలో రక్త సంబంధీకుల కుటుంబం తరువాత కొద్ది మార్పులతో దాని స్థానంలో యిది వచ్చింది తోడ బుట్టిన సోదరీ సోదరుల మధ్య వివాహం వలన కలిగే నష్టాలను మానవుడు గుర్తించ కుండా వుండడం ఎంతో కాలం జరుగదు తమత వారిని వివాహ బంధం నుంచి క్రమంగా తప్పించడం జరిగి ఈ మార్పు వచ్చింది ఈవిధమైన మార్పు ఏ క్రమంలో జరిగిందో చెప్పడం సాధ్యమయ్యే పని కాదు. అలాగని బొత్తిగా లేకనూ పోలేదు ఈ విషయాన్ని తేల్చడానికి దొరికిన ఘటనలు నిముగగానూ, చిరాకు కలిగించేవిగానూ వుంటాయి కాని ఓర్పుతో జాగ్రత్తగా పరిశీలన చేస్తే వాటిలో వున్న అసలు కథ తెలుస్తుంది

రక్త సంబంధీకుల కుటుంబాన్ని పునలాన్ కుటుంబంలోనికి మార్చడానికై దాని నుంచి తోడబుట్టిన సోదరీ సోదరులను తప్పించడం, జ్ఞాతులైన సోదరీ సోదరులను అట్టే వుంచడం చేస్తే చాలు యిందులో ఒక జట్టును వుంచడం యింకో జట్టును తొలగించడం కష్టమైన పనే ఏమంటే కుటుంబంలో వుండే మనుష్యుల కూర్పును పూర్తిగా మార్చవలసి వుంటుంది ప్రాచీన కాలం నాటి కుటుంబ జీవిత పథకాన్ని కూడ మార్చెయ్యాలి తమకున్న ప్రత్యేక అధికారాన్ని ఆ ఆటవిక ప్రజ వదలుకోవాలంటే చాలా అలస్యంగా జరుగుతుంది అందుచేత అక్కడక్కడా అది ప్రారంభమయి వుంటుంది చాల నెమ్మది మీద దాని వుపయోగాలను గ్రహించగలుగుతారు అందుచేత ఈ పరిశీలన దశలోనే కాలం అనంతంగా గడిచిపోతుంది మొదట అక్కడక్కడ ప్రారంభమై క్రమంగా విస్తరించి పురోగమిస్తూవున్న తెగలలో అది స్థిర పడుతుంది. ఆటవిక దశలో ఈ ఉద్యమం ప్రారంభమయి ఆటవిక దశలో వున్న తెగలలోనే స్థిరపడింది "సహజమైన ఎన్నిక" అనే సూత్రం ఎలా పనిచేస్తుందో యిది మంచి వుదాహరణ

ఈ సందర్భంలో ఆస్ట్రేలియాలోని తరగతి పద్ధతి యొక్క ప్రాముఖ్యంమరో మారు తెలుస్తుంది ఆ తరగతులు ఏర్పడిన విధము, వివాహం గురించి పారంపర్యం గురించి వున్న నియమాలు చూస్తే దాని ప్రధాన లక్ష్యం తోడబుట్టిన సోదరీ సోదరుల మధ్య వివాహాన్ని నిషేధించడము, జ్ఞాతులయిన సోదరీ సోదరుల మధ్య ఆ బంధుత్వాన్ని మిగల్చడమూనే అని కనిపిస్తుంది బహిరంగమైన శాసనం ద్వారా తోడబుట్టిన వారి మధ్య వివాహం నిషేధించ బడుతుంది జ్ఞాతి సోదరీ సోదరులను వివాహ బంధంలో వుంచాలనే అభిప్రాయం పైకి కనబడదు కాని పారంపర్యాన్ని చూస్తే అర్థం అవుతుంది ఇప్పైలు, కపోటాలు గుంపుగా పెళ్ళి చేసుకుంటారు ఇప్పై స్త్రీకి పుట్టిన సంతానం ముర్రీలవుతారు ముర్రీల సంతానం మళ్ళీ ఇప్పైలవుతారు అలాగే కపోటాల సంతానం మాటా అవుతారు. మాటా సంతానం మళ్ళీ కపోటాలవుతారు ఈ విధంగా ఇప్పై కపోటాల మనుమలు మళ్ళీ ఇప్పైలు, కపోటాలే అయితే వారంతా జ్ఞాతులైన సోదరీ సోదరులు. అందుచేత పుట్టుకలోనే భార్యా భర్తలు ఈ విధంగా రెండు మూడు యింకా ఎక్కువ తరాల జ్ఞాతులైన సోదరీ సోదరులు వారి బంధుత్వ వ్యవస్థలో మళ్ళీ మళ్ళీ వివాహ బంధంలో కలుస్తూనే వుంటారు తోడబుట్టిన సోదరీ సోదరులను మాత్రం వేరు చేశారు. హవాయియన్‌ల దానిలో కన్న ఆస్ట్రేలియన్ పునాల జట్టులో జన సంఖ్య హెచ్చు అందుచేత దానిలో కూర్పు కొంచెం తేడాగా వుంటుంది కాని రెండింటా కూడా అసలు విషయం ఒకటే ఒక గ్రూపులో భర్తలు

కావడానికి మూలం వారు సోదరులు కావడమే. రెండవ జట్టులో భార్యలు కావడానికి మూలం వారు సోదరులు కావడమే. ఈ తేడా హవాయియన్‌లలో వుంది కాని వారిలో వివాహాలు జరిగితీర వలసిన జట్టులంటూ వున్నట్లు కనబడదు. ఆస్ట్రేలియాలోని తరగతులు పునాల జట్లకు కారణమైనవి గణం అన్నది ఆ జట్లలో బీజరూపంగా వుంది. అందుచేత తర్వాత తర్వాత గణ నిర్మాణాలు కనబడిన తెగలలో ఒకప్పుడు స్త్రీ పురుష భేదం గల తరగతులు ఏర్పడి వుండి వుంటాయి. హవాయియన్‌లలో కూడ పూర్వం ఒకప్పుడు అటువంటి తరగతుల విభజన వుండేదంటే ఆశ్చర్య పడవక్కరలేదు.

మానవజాతియొక్క నిర్మాణాలలో పునలాన్ కుటుంబం, గణం నిర్మాణం, తురానియన్ బంధుత్వ వ్యవస్థ చాలా ప్రధానమైనవీ, విస్తృత వ్యాప్తి కలవీని. ఇవి పునలాన్ జట్టు లాంటి ఒక ప్రాచీన నిర్మాణంలో బీజ రూపంగా కనపడటం గమనించ వలసిన విషయం. పునలాన్ కుటుంబాన్ని గురించి జరిపే ఈ చర్చలో దీని యథార్థ్యం కొంత వరకు కనిపిస్తుంది.

పునలాన్ వివాహము, పునలాన్ కుటుంబాన్ని ఏర్పరిచింది. ఈ కుటుంబంలో వాస్తవంగా వున్న బంధుత్వాలను చూపించేటట్లుగా అప్పటికున్న బంధుత్వ వ్యవస్తను మార్చాక తురానియన్ వ్యవస్థ ఏర్పడుతుంది. అయితే ఈ ఫలితం రావడానికి పునలాన్ జట్టు ఏర్పడినంత మాత్రంతో చాలదు. గణాలు ఏర్పడాలి. వాటియొక్క నిర్మాణ నియమాల ప్రకారం తోడబుట్టిన సోదరీ సోదరుల మధ్య వివాహ బంధం శాశ్వతంగా రద్దు అవుతుంది. అయితే వారు అంతకు పూర్వం తరచుగా యిటువంటి సంబంధాలు కలిగి వుండే వారు. ఈ విధంగా వారిని తప్పించడంతో ఆ వివాహాల మీద ఆధారపడిన బంధుత్వాలలో మార్పు వస్తుంది. ఆ మార్పు వచ్చినపుడు మలయన్ పద్ధతిని తొలగించి తురానియన్ పద్ధతి ఏర్పడుతుంది. హవాయియన్‌లలో పునలాన్ కుటుంబం వుంది. అయితే గణాలు కాని, తురానియన్ బంధుత్వ వ్యవస్థ కానిలేవు. రక్త సంబంధీకుల కుటుంబానికి చెందిన ఈ పాత పద్ధతి వారిలో వుందీ అంటే నింఘూం చెప్పినట్టు పునలాన్ జట్లలో తోడబుట్టిన సోదరీ సోదరులు కూడ తరచు కలిసిపోతూండి వుంటారు-అనుకోవాలి. అందుచేతనే రక్త సంబంధాల ప్రాచీన వ్యవస్థను సంస్కరించడం సాధ్యం కాలేదు. హవాయియనులలో మాదిరి పునలాన్ జట్టు ఆస్ట్రేలియాలోని తరగతులంత ప్రాచీనమేనా ? అంటే చెప్పలేము. కాని సమాజ

నిర్మాణానికి సంబంధించినంత వరకు ఆస్ట్రేలియన్ తరగతులు అత్యంత ప్రాచీనము అయితే ఏదో ఒక రకమైన పునలాన్ జట్టు వుంటే తప్ప గణం పుట్టదు అదిలేనిదే తురానియన్ బంధుత్వ వ్యవస్థ ఏర్పడదు ఈ మూడింటిని వేరే వేరే పరిశీలిద్దాం

1 పునలాన్ కుటుంబం

ప్రాచీన సమాజంలోని రహస్యాలు బయట పెట్టగల ఒక విస్పష్టమైన ఆధారం కొన్ని సందర్భాలలో బయట పడుతుంది అంతవరకు అస్పష్టంగా వున్న ప్రాచీన సమాజం దానిలో స్పష్టంగా అర్థమవుతుంది హవాయియనులలోని పునాలా ఆధారం అటువంటిది 1860లో హొనలూలూలో జడ్జిగావున్న లారెన్ అండ్రూస్ హవాయియనుల బంధుత్వ వ్యవస్థను గురించి ఒక వుత్తరంలో యిలా వ్రాశారు "పునాలా బంధుత్వం రెండు రకాలుగా వుంది యిద్దరుకేక ఎక్కువ మంది సోదరులు తమ భార్యలతో, యిద్దరూలేక అంత కంటే ఎక్కువమంది అక్క చెల్లెళ్ళు తమ భర్తలతో వుమ్మడిగా జత కలిసే పద్ధతిలో యిది పుట్టింది కాని ప్రస్తుతం ఈ పదం ప్రియ మిత్రమా లేక ఆత్మీయ సహచరుడా అనే అర్థంలో వాడుతున్నారు" జడ్జి అండ్రూస్ ఆ పద్ధతిలో పుట్టిందని అనాటికి అది వ్యవహారంలో లేదని అర్థం వచ్చేలా వ్రాశారు దానిని పట్టి ఆ బంధుత్వ వ్యవస్థ ఒకప్పుడు వారిలో పరిపాటిగా వుండేది అనుకోవాలి ఈ మధ్యనే చనిపోయిన రెవరెండ్ అర్టెమస్ బిషప్ ఈ దీవులలో మిష నరీలుగా పనిచేసిన వారిలో చాల పాతవాడు ఈయన 1860లోనే నాకు జాబు వ్రాస్తూ యిదే విషయం చెప్పాడు "ఒక నాడు భార్యాభర్తలు వుమ్మడిగా జీవించే ప్రాచీన ఆచారం ఫలితంగా బంధుత్వపు పిలుపులలో ఈ గందరగోళం వచ్చింది" బహు భార్యాత్వాన్ని గురించి బింఘాం వ్రాసిన మాటలు గత ప్రకరణంలో చెప్పాను "బహుళ సంఖ్యలో భార్యాభర్తలున్నారని సూచన" యిదే విషయాన్ని డాక్టర్ బార్ట్ లెట్ కూడ చెప్పారు "యిక్కడి ఆదివాసులకి అనేక జంతువులకు లాగే సిగ్గు బిడియం లేదు భర్తలకి చాలమంది భార్యలున్నారు భార్యలకి చాలా మంది భర్త లున్నారు వాళ్ళని ఇష్టం వచ్చినట్టు మార్చుకుంటారు" పీరు చూసిన వివాహ పద్ధతి పునాలా జట్టును గూర్చినది దానిలో భార్యలు భర్తలు గుంపుగా వుమ్మడిగా వివాహ మాడుతారు ఈ వివాహాలవలన కలిగిన పిల్లలతో సహా ఈ గుంపు పునాలా కుటుంబం అవుతుంది అందులో అనేక మంది అన్న దమ్ములు, అక్కచెల్లెళ్ళు తమ భార్యలు భర్తలతో కలిసి జీవిస్తారు

పైన చెప్పిన (పట్టికలోని) హవాయియను బంధుత్వ వ్యవస్థ కేసి చూస్తే ఒక మగ వాడు తన భార్య అక్కచెల్లెళ్ళను భార్యగానే పిలవడం కనబడుతూంది. అతని భార్యయొక్క స్వంత అక్క చెల్లెళ్ళు, జ్ఞాతి అక్క చెల్లెళ్ళు అందరూ అతనికి భార్యలే. కాని వారి భర్తల్ని పునాలా అంటే ఆత్మీయసహచరుడా అని పిలుస్తారు. వారంతా ఆ జట్టుతో ఉమ్మడిగా వివాహం చేసుకున్నారు. బహుశా ఈ భర్తలు సోదరులయి వుండక పోవచ్చు. అయి వుంటే ఈ అనుబంధం కంటే రక్త బంధుత్వానికి ఎక్కువ బలం వుండేది. కాని వారి భార్యలు తోడబుట్టినవారో, జ్ఞాతులో అయిన అక్కచెల్లెళ్ళే, వారంతా అక్క చెల్లెళ్ళు కావడమే ఆ జట్టు ఏర్పడానికి మూలం. వారి భర్తలు ఆత్మీయ సంబంధంగల వారు కావడం వీళ్ళ మూలంగానే, పురుషులవైపు నుంచి ఆ భర్తలు అన్నదమ్ములు అయి వుంటే స్త్రీ తన భర్త సోదరుణ్ణి కూడ భర్తగానే పిలుస్తుంది. అన్నదమ్ములు, స్వంత అన్నదమ్ములు, జ్ఞాతి అన్నదమ్ములు కూడ ఆమెకు భర్తలే. కాని మగని అన్నదమ్ముల భార్యలను పునాలా అనిపిలుస్తుంది. వారందరికి ఈమె పునాలా, మొదటి దాంట్లో చెప్పినట్టే వీరంతా అక్కచెల్లెళ్ళు అయి వుండకపోవచ్చు రెండు. చోట్ల కూడ ఈ ఆచారంలో మినహాయింపులుంటాయి. ఈ భార్యలంతా ఒకరికొకరు పునాలాలు.

రక్త బంధుత్వాల నుంచి పునలాన్ కుటుంబం ఏర్పడిందన్నది స్పష్టం. సోదరులు తమ స్వంత చెల్లెళ్ళను వివాహమాడటం నిలిచిపోయింది. గణ నిర్మాణం యొక్క ఫలితాలు సమాజంలో పూర్తిగా ధృవపడే సరికి జ్ఞాతి అక్కచెల్లెళ్ళను కూడ వివాహ మాడటం మానేశారు. ఈ మధ్య కాలంలో మిగిలిన భార్యలనే వారుఉమ్మడిగా అనుభవించేవారు. అదేవిధంగా అక్కచెల్లెళ్ళు మొదట తమ స్వంత అన్నదమ్ములను, చాలా కాలం తర్వాత తమ జ్ఞాతి అన్న దమ్ములను వివాహమాడటం మానేశారు. మిగిలిన భర్తలను ఉమ్మడిగా అనుభవించారు. రక్త సంబంధీకుల కుటుంబం నుంచి పునలాన్ కుటుంబానికి సమాజం ఎదగడం ఒక గొప్ప ముందడుగు. అది గణ నిర్మాణానికి దారి తీసింది. గణ నిర్మాణం సింథియాస్మియన్ కుటుంబానికి, చివరిగా దంపతీ కుటుంబానికి దారి వేసింది.

తురానియన్ గనోవానియన్ బంధుత్వ వ్యవస్థలు ఏర్పడడానికి మూలమయిన కుటుంబ వ్యవస్థకు ముందు పునాలా పద్ధతి వుండవలసిన అవసరం తప్పనిసరిగా వుంది. పునాలా జట్లలోని వివాహ పద్ధతులే ఆ బంధుత్వ వ్యవస్థను చూపిస్తున్నాయి. ఈ వ్యవస్థ ఏర్పడినపుడు ఆ పద్ధతి వివాహం వుండి తీరాలి. అందుచేత ఈ పద్ధతి

వుంది అంటే అంతకు ముందు పునలాన్ వివాహ పద్ధతి, పునలాన్ కుటుంబం వున్నాయన్నమాటే నాగరిక జాతులలోకి వచ్చే నరికి గ్రీకులు, రోమనులు, జర్మనులు, కెల్ట్‌లు, హిబ్రూలు మొదలైన గణ నిర్మాణం గల వారందరిలో అతి ప్రాచీన కాలంలో పునలాన్ జట్లు వుండడం అత్యవసరమే ఏమంటే దంపతీ కుటుంబం అలవాట్లకు దారితీసిన గణ నిర్మాణం ఎక్కడయితే వుందో అక్కడ తురానియన్ రక్త నంబంధ వ్యవస్థా వుంది అది అంతకు పూర్వం వున్న పునలాన్ జట్టు నుంచే వచ్చింది ఈ జట్టు ప్రారంభం కావడంతో వచ్చిన వుద్యమం గణాలు ఏర్పాటుతో ముగిసింది దానితో తురానియన్ బంధుత్వ వ్యవస్థ వచ్చింది అటుతర్వాతనే దంపతీ వ్యవస్థ ఏర్పడింది

అనాగరిక యుగం మధ్య దశ వరకు అక్కడక్కడ యూరపియన్, ఆసియాటిక్, అమెరికన్ తెగలలో పునలాన్ ఆచారం యొక్క ఛాయలు మిగిలియున్నాయి సీజరు ప్రాచీన కాలపు బ్రిటన్‌లలోని వివాహ ఆచారాలను గురించి చెప్పిన మాట యిందుకు మంచి వుదాహరణ "పదిమంది పన్నెండుగురు భర్తలు వుమ్మడిగా భార్యలను కలిగియుంటారు ప్రత్యేకించి అన్నదమ్ములు, తండ్రులు కొడుకులు "

సీజరు వ్రాసిన ఈ వాక్యాన్ని పట్టి గుంపు పెళ్ళి ఆచారం కనబడుతుంది పునాలాయే దాని కర్థం చెప్పగలదు అనాగరిక ప్రజలలో తల్లులు పది పన్నెండు మంది పిల్లల్ని కలిగి వుండడం అసంభవం బ్రిటన్‌లలో తురానియన్ బంధుత్వ వ్యవస్థ వుంది అనుకుంటే అంతమంది అన్నదమ్ముల గుంపు— ఏమంటే దగ్గర దూరపు జ్ఞాతులైన అన్నదమ్ములు - కూడ గలరు సీజరు చెప్పిన దాన్ని పట్టి, బ్రిటన్‌లలో అనేక మంది అన్నదమ్ములు నమిష్టిగా భార్యలను కలిగి వున్నారని తెలుస్తుంది ఇది శుద్ధమైన, సామాన్యమైన పునలాన్ ఆచారం దాని కనుబంధమైన గ్రూపు మరొకటుంటుంది చాల మంది అక్కచెల్లెళ్ళు వుమ్మడి భర్తలను కలిగి వుండే గుంపు అది సీజర్ మాటల్లో ఆసూచనలేదు కాని మొదటిదివుంటే రెండోది వుంటుంది ఆ మొదటి దానినే కాక ఆయన మరొకటి కూడ చూశాడు తండ్రులు కొడుకులతో పాటు భార్యలను వుమ్మడిగా కలిగి వుంటారని ఈ భార్యలందరు అక్కచెల్లెళ్ళయి వుంటే ఆశ్చర్యం లేదు సీజరు మాట రెండవ గుంపును గురించి అయినా కాకపోయినా బ్రిటన్‌లలో గుంపులో ఎక్కువ మందితో వివాహాలు జరుగుతున్నాయన్నంత వరకు ఖండితమే ఈ మహనీయుని దృష్టిని ఆకర్షించినవదదే అనేక మంది సోదరులు ఒకరొకరి

భార్యలను వివాహమాడతారు ఆ భార్యలు ఒకరొకరి భర్తంతో వివాహం చేసుకున్నారు

మస్సాగెటేలను గురించి హెరొడోటస్ వ్రాస్తూవారిలో ప్రతి ఒకనికి ఒకభార్య వున్నదని అయినా అందరి భార్యలు వుమ్మడి భార్యలని వ్రాశాడు వీరు అనాగరిక యుగం మధ్య దశలో వున్నారు ఈ మాటను పట్టి వారిలో పునలాన్ కుటుంబం స్థానేసింథియాస్మియన్ కుటుంబం ఏర్పడుతూందని అనుకోవచ్చు ప్రతి భర్తకు ఒక భార్య వుంది ఆమె అతని ప్రధాన భార్య గుంపులో భర్తలందరికి భార్యలు వుమ్మడి వారి మధ్య యథేచ్ఛా సంబంధాలు వుంటాయి అని హెరొడోటస్ అనుకొని వుంటే అది జరగదు ఈ మెస్సాగెటేలకు ఇనుము గురించి తెలియక పోయినా పశువుల మందలున్నాయి- రాగితో చేసిన గొడ్డళ్ళు, రాగి ములుకు గల బరిసెలతో వారు గుఱ్ఱాల మీదెక్కి యుద్ధం చేసేవారు బండ్లు (అమాళ) తయారుచేసి వాడేవారు, స్త్రీ పురుష సంబంధాలలో స్వేచ్ఛా జీవనం గడుపుతున్న ప్రజలు ఆ అభివృద్ధి స్థాయిని పొందడం సాధ్యం కాదు బహుశా అదే దశలో వున్న అగాతిర్సిలను గురించి వ్రాస్తూ, వారంతా వుమ్మడిగా భార్యలను కలిగి వున్నారని, బహుశా వారంతా సోదరులే అయి వుంటారని వుమ్మడి కుటుంబంలో సభ్యులుగా జీవిస్తూ పరస్పరం ఈర్ష్యా ద్వేషాలు లేకుండ జీవిస్తున్నారని వ్రాశారు హెరొడోటస్ చెప్పిన ఈ మాదిరి తెగం అలవాట్లు పునలాన్ గుంపు పెళ్ళిళ్ళుగా చెప్తేనే సరియైన సమాధానం వస్తుంది దానిని బహు భార్యాత్వం- అనీ, ఇష్టం వచ్చినట్లు దాంపత్య సంబంధం పెట్టుకోవడం అనీ, అంటే అర్థంలేదు హెరొడోటస్ మాటలు వారిలో వున్న వాస్తవ సమాజ స్థితిని చెప్పడానికి చాలవు

దక్షిణ అమెరికన్ ఆది వాసులలో అంతగా పురోగమించి వుండని తెగలలో కూడ పునలాన్ ఆచారపు ఛాయలు కనిపించాయి కాని వివరాలు దొరకలేదు వెనిజులా తీరంలోని తెగలను మొట్ట మొదట చూసిననావికులు అక్కడి సమాజాన్ని వర్ణించారు అక్కడ పునలాన్ జట్లు వుండినట్లు అనుకోవాలి "వివాహం విషయంలో వారో నియమం నిబంధన పాటించరు చాలామంది భార్యలను కట్టుకుంటారు అంత మందీ భర్తలుంటారు వాళ్ళు ఇష్టాను సారం ఒకర్ని విడిచి ఒకరితో వుంటారు అదో తప్పుగా భావించరు వాళ్ళలో ఈర్ష్య అనేది లేదు మరొకరికి కష్టం కలగకుండ తమకు తోచిన రీతిని జీవిస్తారు వారు కాపురం వుండే ఇళ్ళు వుమ్మడిగా వుంటాయి. 160 మంది వరకు పట్టేటంత విశాలంగా వుంటాయి తాటాకు కప్పినా,

మంచి గట్టిగా గంట ఆకారంలో వుంటాయి" అన్నారు బ్రెజిల్‌లోని కోస్త్రా తెగ లను గురించి వ్రాస్తూ హెర్రారా "వారు పెద్ద పెద్ద తాటాకు పాకలలో (బోహియో) నివశిస్తారు. ప్రతి గ్రామంలోను అటువంటి ఇళ్ళు ఎనిమిది దాకా వుంటాయి వాటి నిండా జనమే మంచెలు, వుయ్యాలలు కట్టుకుని పడుకుంటారు న్యాయము, మర్యాద లేకుండా పశువుల్లా జీవిస్తున్నారు" అని వ్రాసారు పెరూలోని అట్టడుగు స్థితిలో వున్న తెగలలో వివాహ సంబంధాలను గురించి గార్సిలాసో దే లావెగా కూడ అదే మాదిరి సమాచారం యిచ్చారు. ఈ తెగలు మట్టి పాత్రలను వుపయోగిస్తారు. అందుచేత అనాగరిక యుగం దిగువ దశలో వున్నారు అనాలి కాని పైన చెప్పిన దాన్ని బట్టి అటవిక స్థితికి దగ్గరలోనే వున్నారనాలి హెరొడోటస్ చెప్పినవీ, మిగిలిన వారివీ సమాచారాలు లోతైనవికావు. వివరాలు లేవు అయితే కుటుంబము, వివాహ సంబంధాలు హీన స్థితిలో వున్నాయన్నంత వరకు తెలుస్తోంది.

ఉత్తర అమెరికాలో హెచ్చుప్రాంతాన్ని కనుక్కున్నప్పటికిపునలాన్ కుటుంబం పూర్తిగా అదృశ్యమైనట్లే కనిపిస్తోంది పునలాన్ ఆచారం ఒకప్పుడు వుండేదనేందుకు నేనెరిగినంత వరకు సంప్రదాయం కూడ మిగలలేదు కుటుంబం పునలాన్ దశ నుంచి సింధియాస్మియన్ రూపానికి వచ్చేసింది అయితే పునలాన్ తెగలనుసూచించే ప్రాచీన కాలపు దాంపత్య పద్ధతి యొక్క అవశేషాలు అక్కడక్కడా వున్నాయి ఒక ఆచారాన్ని చెప్తాను. నిస్సందేహంగా యిది పునలాన్ కుటుంబం నాటిది కనీసం 40 వరకు ఉత్తర అమెరికన్ ఇండియన్ తెగలలో ఈ ఆచారం వుంది కుటుంబంలో పెద్ద కూతుర్ని పెళ్ళి చేసుకున్న వాడికి ఆమె చెల్లెళ్ళంతా, వయసు వచ్చిన నాటినుంచి అతని భార్యలే అయితే ఈ హక్కుని వుపయోగించు కోవడం జరుగదు బహు భార్యత్వాన్ని మగవారి అధికారంగా సర్వత్రా అంగీకరించినా, అన్ని కుటుంబాల్ని పోషించటం ఒకడి వలన అయ్యే పనికాదు దీనిని బట్టి వారిలో పురాతన కాలంలో పునాలా ఆచారం వుండినట్లు తెలుసుకుంటున్నాం తోబుట్టువులైన అక్కచెల్లెళ్ళు తోబుట్టువులుగా వివాహబంధం ఏర్పరచుకున్న కాలం వారిలో ఒకప్పుడుంది. ఒకామె భర్త వారందరికీ భర్తయే, అయితే అతనొక్కడే భర్తకాదు యితర మగవాళ్ళు కూడ గుంపుగా అతనితో పాటు వుమ్మడి భర్తలుగా వుంటారు పునలాన్ కుటుంబం రద్దు అయినాక పెద్ద ఆమెభర్తకు మిగిలిన చెల్లెళ్ళందరినీ అతను యిష్ట పడితే భార్యలుగా స్వీకరించే హక్కు మిగిలింది ఇది ప్రాచీన పునలా ఆచారం యొక్క అవశేషం అనడంలో సందేహం లేదు.

మానవ జాతిలోని అనేక తెగలకు చెందిన చరిత్ర గ్రంథాల నుంచి యిటువంటి కుటుంబాల గుర్తులు దొరకుతాయి ప్రాచీన కాలంలో అనే దొక్కటే కాదు, అవి చాల విస్తృతంగా వుండేవని కూడ వీటి వలన తెలుసుకోవచ్చు తురానియన్ బంధుత్వ వ్యవస్థ వున్న తెగలన్నింటిలో పూర్వం ఒకనాడు పునలాన్ కుటుంబం వుండేదని తురానియన్ వ్యవస్థను పట్టే తేలుతుంది అందుచేత యింకా యింకా వుదాహరణ లివ్వడం అనవసరం

## 2 గణాలుగా ఏర్పడడానికి గల కారణం

ఈ నిర్మాణం ఆటవిక యుగంలో ప్రారంభమైందని పైన చెప్పాను అనాగరిక యుగం దిగువ దశ నాటికి యిది పూర్తిగా అభివృద్ధి పొంది కనిపించడం ఒక కారణం రెండోది ఆటవిక స్థితిలోనే కొంత కొంత అభివృద్ధితో కనిపించడం పైగా ఆస్ట్రేలియా లోని తరగతుల విభజనలోనూ, హవాయియనుల పునలాన్ జట్లలోనూ గణం యొక్క బీజాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి ఆస్ట్రేలియన్లలో తరగతులను ఆధారం చేసుకొని గణాలు వాని నుంచి వుద్భవిస్తున్నట్లుగా కన్పిస్తున్నాయి గణం వంటి అసాధారణమైన నిర్మాణం సంపూర్ణ రూపంలో పుట్టుతుందనుకోవటం, శూన్యం నుంచి వస్తుందనుకోవడం అర్థం లేని మాట సహజక్రమంలో పెరిగి ఏర్పడిన పునాది దానికి వుంటుంది సమాజంలో అంతకు ముందే వున్న అంశాల నుంచి దాని పుట్టుకను సేకరించాలి అది పూర్తి రూపంలో కనపడడానికి పూర్వమే అది పుట్టి వుండాలి

గణం యొక్క అతి ప్రాచీన రూపంలో రెండు మూల నియమాలున్నాయి. ఆస్ట్రేలియన్ తరగతులలో అవి కన్పిస్తున్నాయి అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళ మధ్య వివాహాన్ని నిషేధించటం ఒకటి స్త్రీ పారంపర్యం రెండోది ఈ రెండోది గణం పూర్తిగా ఏర్పడినపుడు స్పష్టంగా కన్పిస్తుంది అప్పుడు పిల్లలు, తల్లుల గణాలలో మిగిలిపోతారు. తరగతులు గణాలకు కారణం అవుతాయి అటువంటి అవకాశం వుంది కనుక ఊహించగలం పైగా యిక్కడ గణం అన్నది అంతకన్న ప్రాచీనమైన ఒక నిర్మాణంతో సంబంధం కలిగి ఏర్పడింది ఆ వెనుకటి నిర్మాణమే గణం ఏర్పడిన నాటికి సమాజ వ్యవస్థకూ యూనిట్‌గా వుంది గణం ఏర్పడడానికి తగిన స్థానం అదే.

హవాయియన్ పునలాన్ జట్టులో కూడ గణబీజాలు సూక్ష్మరూపంలో కనిపిస్తున్నాయి యిది స్త్రీల శాఖలోని ఆచారంలో వుంది యిందులో తోడబుట్టిన వాళ్ళు జ్ఞాతులు అయిన అక్కాచెల్లెళ్ళు చాలమంది వుమ్మడిగా భర్తలను కలిగి వుంటారు.

ఈ అక్కచెల్లెళ్ళు, వారి సంతానం, స్త్రీల వైపు నుంచి కలిగిన వారి తదనంతర తరాలు అందులో వుంటారు అంటే అతి ప్రాచీన రూపంలో గణంలో వుండేది వాళ్ళే పిల్లల యొక్క తండ్రి తనం గురించి స్పష్టత, నమ్మకం లేదు కనుక, పారంపర్యం తప్పని సరిగా స్త్రీల నుంచే గుర్తిస్తారు ఈ మాదిరి వివాహరూపం జట్టులో స్థిరపడింది అంటే గణానికి పునాది పడిందని అర్థం ఈ సహజమైన పునలాన్ జట్టును ఒక నిర్మాణంగా మార్చి దానిని తల్లులకు, వారి పిల్లలకు, స్త్రీల వరుసలో తదనంతర తరాలకు పరిమితం చేసేపాటి తెలివితేటలు చూపడం అటు తరువాత జరగవలసిన పని హవాయియన్ లలో ఈ మాదిరి జట్టు వుంది అయితే గణం ఆలోచన వారిలో ఏర్పడలేదు తల్లులు, అక్కచెల్లెళ్ళు వుండే యిటువంటి జట్టునుంచే, యించుమించు అటువంటి సూత్రంతో ఏర్పడిన ఆస్ట్రేలియన్ జట్టు నుంచే గణం పుట్టిందని చెప్పాలి గణం ఈ జట్టును ఎలా వున్నదాన్ని అలాగే తీసుకుంది బంధుత్వం ప్రాతిపదిక మీద దాని సభ్యులలో కొందరినీ, కొంతమంది వారి సంతానాన్నీ ఒక నిర్మాణంగా ఏర్పరచింది

గణం సరిగ్గా ఏ విధంగా ఏర్పడిందో చెప్పడం అసంభవం అది ఏనాడో జరిగిన ఘటనలు అయితే దాని జన్మకు కారణం కాగల ప్రాచీన సమాజ పరిస్థితిని పట్టుకోగలం సరిగ్గా నే చేసిన పని అదే మానవ అభివృద్ధి క్రమంలో ఒక అట్టడుగు దశలో సమాజం యొక్క అతి ప్రాచీన దశలో అది పుట్టింది పునలాన్ కుటుంబం పుట్టిన నాటికన్నా తరువాత కాలంలో వచ్చింది ఆ కుటుంబంలోంచే గణం పుట్టింది అని స్పష్టంగా కనిపిస్తూంది ఏమంటే పునలాన్ జట్టులోవున్న మనుష్యులూ చాల వరకు కలుస్తున్నారు

పురాతన సమాజం మీద గణం యొక్క ప్రభావంలో అంతకు పూర్వం వున్న దానిని కాపాడుతూ దానిని వున్నత స్థాయికి తీసుకుపోయే లక్షణం వుంది అది పూర్తిగా అభివృద్ధి పొంది దూరదూరాలకు వ్యాపించి సమాజం మీద పూర్తి ప్రభావాన్ని కలిగించ గలంత కాలం గడిచాక, అంతవరకు దండిగా దొరికిన భార్యలు కరువే కాసాగారు క్రమంగా పునలాన్ జట్టును సంకుచిత పరిచి చివరకు తోసివేయడమే అందుకు కారణం ప్రాచీన సమాజంలో గణ సంస్థకు ప్రాధాన్యం వచ్చాక పునలాన్ జట్టులో సింథియాస్మియన్ కుటుంబం క్రమంగా ఏర్పడింది ఈ మధ్యంతర దశలు బాగా స్పష్టం కాలేదు కాని ఆటవిక స్థితిలో పునలాన్ కుటుంబం వుందని అనాగరిక యుగం దిగువ దశలో సింథియాస్మియన్ కుటుంబం వున్నదని ఒప్పుకున్నాక ఇవి ఒకదాని నుంచి మరొక దానికి పరిణామం పొందినవే అని అనుకోవచ్చు పునలాన్ జట్లు అదృశ్యమై సింథియా

స్మియన్ కుటుంబం ఏర్పడ్డాకనే పెళ్ళాంని కొనుక్కోవటం, ఎత్తుకొచ్చి పెళ్ళి చేసుకోవడం వాడుకలోకి వచ్చింది మనకందుబాటులోనేవున్నా యితర సమాచారాన్ని యింకా చర్చించనక్కరలేదు పునలాన్ కుటుంబాన్ని తోసివేయటానికి, అటవిక దశలో వున్న అసాధారణమైన దాంపత్య సంబంధాలను క్రమంగా తగ్గించడానికి గణమే గట్టి కారణం అది పునలాన్ జట్టులో పుట్టింది ఆ స్థితిని మించి పై దశకు సమాజాన్ని తీసుకుపోయింది

### 3 తురానియన్ లేక గనోవానియన్ బంధుత్వ వ్యవస్థలు—

గణనిర్మాణం అతి ప్రాచీన రూపంలో వున్నప్పుడు దానితో ఈ వ్యవస్థ జత కలిసి వుండేది ఆవిరెండూ ఒకదానిమీద ఒకటి ఆధార పడ్డవేమీకాదు మానవపురోగతి క్రమంలో యించుమించు దగ్గర దగ్గరలో అవి వచ్చి వుంటాయి కాని బంధుత్వ వ్యవస్థలూ, అనేక కుటుంబ రూపాలూ సరాసరి బంధుత్వం కలిగివుంటాయి కుటుంబం అన్నది ఒక అస్థిరమైన రూపం అదెప్పుడూ ఒకేచోట వుండదు సమాజం దిగువ నుంచి ఎగువదశకు పురోగమిస్తున్న కొద్దీ కుటుంబం దిగువనుంచి వున్నత రూపానికి పురోగమిస్తుంది బంధుత్వ వ్యవస్థలు అలాకాదు వాటిలో కదలిక వుండదు సుదీర్ఘ కాలంలో కుటుంబంలో వచ్చిన అభివృద్ధిని నమోదుచేస్తూ, కుటుంబం చాల ఎక్కువగా మారినప్పుడే అదీ బాగా మారుతూ వుంటుంది

పునలాన్ వివాహాలు, పునలాన్ కుటుంబం వున్నాయి గనుకనే తురానియన్ బంధుత్వ వ్యవస్థ వచ్చింది చాలమంది అక్కచెల్లెళ్ళు గుంపుగా ఒకరొకరి భర్తల్ని చేసుకోవడం, చాలమంది సోదరులు గుంపుగా ఒకరొకరి భార్యల్ని చేసుకోవడం సాధారణ ఆచారంగా సాగుతున్న సమాజంలో తురానియన్ పద్ధతి ఏర్పడేందుకు అవకాశాలు వున్నాయి ఆ కుటుంబంలో వాస్తవంగావున్న బంధుత్వాలను తెలపడానికి ఏర్పడ్డ ఏ వ్యవస్థ అయినా తురానియన్ మాదిరిగానే వుంటుంది అది ఏర్పడిన నాటికి అటువంటి కుటుంబం వున్నదని ధృవపడుస్తుంది

తురానియన్, గనోవానియన్ ప్రజలలో కొనసాగుతున్న ఈ వ్యవస్థను చూపించి అది ఏర్పడిన నాటికి పునలాన్ కుటుంబం వుండిందని సాక్ష్యంగా చూపుతున్నాం దానికి మూలమైన వివాహాచారాలు అదృశ్యమై కుటుంబం పునలాన్ రూపం నుంచి సిండియాస్మియన్ రూపానికి మారిన తరువాత, రెండు ఖండాలలో ఈనాటి వరకు అది కొనసాగుతూంది.

ఈ సాక్ష్యాన్ని వివరించడానికి ఆ వ్యవస్థయొక్క వివరాలను పరిశీలించడం అవసరం అమెరికాలోని గనోవానియన్ తెగలకుగాను సెనెకా యిరాక్వాయిలను, ఆసియాలోని తురానియన్ తెగలకుగాను దక్షిణ భారతదేశంలోని తమిళ ప్రజలను తీసుకుందాం ఒకవ్యక్తి నుంచి ప్రారంభించి రెండు వందల బంధుత్వాలవరకు పేర్లు ఈ రెండు వ్యవస్థలలో యించుమించు ఒకేవిధంగా వుంటాయి ఈ ప్రకరణం చివర వానికొక పట్టికగా యిస్తున్నాను నేను వ్రాసిన ఒక పుస్తకంలో (Systems of consanguinity and affinity of the human family) రమారమి 70 అమెరికన్ ఇండియన్ తెగలలోని బంధుత్వ వ్యవస్థలు యిచ్చాను ఆసియన్ తెగల లోను దక్షిణ భారతదేశంలోని తమిళ, తెలుగు, కన్నడ ప్రజలలోను వున్న వ్యవస్థను పట్టికగా యిస్తున్నాను యిది యిప్పుడు నిత్యవాడుకలో వుంది వేరువేరు తెగలజాతుల బంధుత్వవ్యవస్థలలో తేడాలున్నా ప్రధానలక్షణాలొక్క విధంగానే వున్నాయి అందరూ కూడ బంధుత్వాలతోనే పలుకరిస్తారు అయితే తమిళులలో తనకంటే చిన్నవానిని పలకరించేటప్పుడు బంధుత్వపు పిలుపును వుపయోగించాలి పెద్దవానిని పలుకరించే టప్పుడు బంధుత్వం పట్టిగాని పేరుతోగాని పిలువవచ్చు తద్భిన్నంగా అమెరికన్ ఆదివాసులలో బంధుత్వంతోనే పలుకరించి తీరాలి అది బంధుత్వాలనూ, అనుబంధాలనూ తెలిపేవ్యవస్థ కనుక పిలుపులలో దానినుపయోగిస్తారు దంపతీ కుటుంబ పద్ధతి ఏర్పడి, తురానియన్ వ్యవస్థను రద్దుచేసేవరకూ ప్రాచీనకాలపు గణాలలో ఒక వ్యక్తి యితరగణసభ్యులతో తనకుకల సంబంధాన్ని గుర్తించే పద్ధతి అదొక్కటే ఆ పిలిచే వాడు స్త్రీయా పురుషుడా అనేదాన్నిపట్టి చాల సందర్భాలలో బంధుత్వం మారుతుంది అందుచేత ఒకే బంధుత్వాన్ని మగవాడు మాట్లాడేటప్పుడూ, స్త్రీ మాట్లాడేటప్పుడు రెండు రూపాలలో యివ్వవలసి వచ్చింది ఆ వ్యవస్థలో కొన్ని భేదాలున్నా ఆదినుంచి అంతంవరకు అది తర్కబద్ధంగానే వుంది దాని లక్షణాన్ని చూపించడానికి మలయన్ వ్యవస్థలో చూపినట్లే అనేక జ్ఞాతిశాఖలవాక చెప్పడం అవసరం అందుకు సెనెకా యిరాక్వాలను వుపయోగించుకుంటాను

అందులో తాతను హోక్— సోటే అంటారు అవ్వను ఓక్— సోటేఅంటారు మనుమణ్ణి హ—యా—ద అంటారు మనుమరాల్ని క— యా— ద అంటారు పైకి, కిందకి వరుసలో యింతవరకే బంధుత్వాలను వారు గుర్తిస్తారు అపైన దిగువన వుండే బంధుత్వాల్ని అదే మాటలతో గుర్తిస్తారు

సోదరీ సోదరులను వారి వయస్సునుబట్టి వేరుగా పిలుస్తారు వాటికి శబ్దాలు రెండు రూపాలుగా వున్నాయి

హా—గే అన్న, ఆ—జె అక్క

హా—గా తమ్ముడు, కా—గా చెల్లెలు

పీటిని ఆడ మగ కూడ ఒకే విధంగా ఉపయోగిస్తారు మాట్లాడేవానికన్న పెద్దలు, చిన్నలు అయిన సోదరీ సోదరులందరికి అవే పదాలు వాడుతారు తమిళంలో ఈ బంధుత్వాలకి రెండు సెట్ల పదాలుండేవి. ఇప్పుడు స్త్రీ పురుషులిద్దరూ ఒకేరకం శబ్దాన్ని వాడేస్తున్నారు

మొదటి జ్ఞాతితరం— మగవాడు మాట్లాడేటప్పుడు సెనెకా జాతివాడు సోదరుని కొడుకును హా— ఆ— ఉక్ అంటాడు కూతుర్ని కా— ఆ— ఉక్ అంటాడు వాళిద్దరూ ఆయనను హా—నీ(నాన్న)అనే పిలుస్తారు ఆ వ్యవస్థయొక్క స్వభావానికి మొట్టమొదట ఈ పదం ద్వారానే సూచన దొరుకుతుంది అది తన పిల్లల్ని సోదరుల పిల్లల్ని ఒకే స్థాయిలో నిలుపుతుంది వారు నాకూ, మా సోదరునికీ కూడా పిల్లలే మా సోదరుని మనుమలు నాకూ మనుమలు, మనుమరాళ్ళూనే (హ—యా—ద క—యా— దవికవచనం) వాళ్ళిద్దరూ నన్ను తాత అనే పిలుస్తారు ఈ బంధుత్వాలు తప్ప మరొకమాట దానిలో లేదు

మరికొన్ని బంధుత్వాలు కూడ దీనిని సూచిస్తున్నాయని చెప్పవచ్చు ఒక చిన్న పదం చేర్చి ఆ తేడా చూపిస్తారు వేరువేరు తెగలలో అదే పద్ధతి కొనసాగుతున్నప్పుడు అవన్నీ ఒకే సమాజాన్ని సూచిస్తున్నాయని చెప్పవచ్చు

అక్క-చెల్లెళ్ళ వైపునుంచి - (మగవాడుగా) ఆమె కొడుకు నాకు మేనల్లుడు (హ-యవాన్-ద), ఆమె కూతురు నాకు మేనకోడలు (క-యవాన్-ద) వాళ్ళిద్దరూ నన్ను మామ అంటారు. (హొక్-నో-సే) ఆ బంధుత్వ వ్యవస్థను చూపించే సూచనలలో యిది రెండవది ఇది మగవాడి తరపునుంచి అతని తోడబుట్టిన, జ్ఞాతి-అక్కచెల్లెళ్ళ పిల్లలందరికి వర్తిస్తుంది. వాళ్ళపిల్లలు నాకు మనుమలే వాళ్ళకు నేను తాతనే

స్త్రీ వేపు నుంచి ఈ బంధుత్వాలు తిరగబడి కనిపిస్తాయి ఆమె సోదరుని కొడుకు కూతురు ఆమెకు మేనల్లుడూ మేన కోడలూను (హ-సో-నే కా-సో-నే), వారు ఆమెను అత్త (ఆ-గా-హుక్) అంటారు యిక్కడ స్త్రీ పురుషులు తమ మేనల్లుళ్ళని, మేనకోడళ్ళని వేరు వేరు పదాలతో పిలవడం గమనించ తగినది.

వాళ్ళ పిల్లలు నాకు మనుమలే కాని ఆమె చెల్లెలికొడుకూ కూతురు, ఆమెకూ కొడుకూ కూతుళ్ళే వారికి ఆమె తల్లి (నో-యే) వాళ్ళ పిల్లలు ఆమెకు మనుమలు వారికి ఆమె అవ్వ (ఓక్-సోచే)

నా కొడుకులా, మేనల్లుళ్ళా భార్యలు అందరూ నాకు కోడళ్ళే. (కా-పా) కూతుళ్ళు, మేనకోడళ్ళ భర్తలు అల్లుళ్ళు (ఓక్-నా-ఓపే) వారు అత్త మామలను ఆయా బంధుత్వాల పేర్లతో పిలుస్తారు

రెండో జ్ఞాతితరం తండ్రివేపు నుంచి ఆయన సోదరుడు మాకు తండ్రి ఆయన మమ్మల్ని కొడుకూ, కూతురూ అనే అంటారు అది స్త్రీ పురుషులిద్దరికీ వర్తిస్తుంది యిది మూడో సూచన నాన్న సోదరులంతా నాకు తండ్రులే వారి కొడుకులూ కూతుళ్ళూ వయస్సుని పట్టి నాకు అన్నలు, తమ్ముళ్ళు, అక్కలు, చెల్లెళ్ళు ఇది నాలుగో సూచన సోదరుల సంతానం సోదరీ సోదరులే అవుతున్నారు వారిలో మగ వారి సంతానం నాకు కొడుకులూ కూతుళ్ళు వారి సంతానం నాకు మనుమలు ఆ చెల్లెళ్ళ సంతానం నా మేనల్లుళ్ళు మేనకోడళ్ళూను వాళ్ళ పిల్లలు మళ్ళీ నాకు మనుమలే స్త్రీ వేపు నుంచి, ఆమె సోదరుల పిల్లలు ఆమెకు మేనల్లుళ్ళు మేనకోడళ్ళు. ఆమె అక్క చెల్లెళ్ళ పిల్లలు ఆమెకు కొడుకులు కూతుళ్ళూ వీరందరి పిల్లలు మనుమలే ఈ విధంగా మొదటి జ్ఞాతి తరంలో చేసిన వర్గీకరణం, రెండవ జ్ఞాతి తరంలోనూ కన్పిస్తుంది మూడవ తరంలోకి నాలుగోతరంలోకి బంధుత్వం దొరికినంత మేరకు అదే వర్గీకరణం సాగుతుంది

మా నాన్న అక్క చెల్లెళ్ళు నాకు అత్తలు నేను మగ వాణ్ణయితే ఆమెకు మేనల్లుడి వరుస యిది ఐదవ సూచన మానాన్న అక్క చెల్లెళ్ళకు, వాతో ఆ బంధుత్వం వున్న యితరుల అక్క చెల్లెళ్ళకు ఈ అత్త పదం చెల్లుతుంది కాని మా అమ్మ అక్కచెల్లెళ్ళకు చెల్లదు మా నాన్న అక్కచెల్లెళ్ళ పిల్లలు నాకు బావలు-(అ-గదే-పే) వారంతా నన్ను బావా అని పిలుస్తారు నేను మగవాడినయితే నా మగబావ లందరి (Covain) సంతానం నాకు కొడుకులూ, కూతుళ్ళూనే, నా ఆడబావాల (Cousin) పిల్లలు నాకు మేనల్లుళ్ళూ, మేన కోడళ్ళు చెప్పే నేను స్త్రీ నయితే-ఈ చివరి బంధుత్వాలు తిరగబడుతాయి వీళ్ళందరి పిల్లలు నాకు మనుమలే

మా అమ్మ తరఫునుంచి మగవాడుగా నాకు ఆమె సోదరుడు మామ ఆయన నన్ను అల్లుడంటాడు, యిది ఆరో సూచన తోడ బుట్టినా జ్ఞాతులయినా మా అమ్మ సోదరులంతా (నాన్న సోదరులు కాదు) నాకు మామలు వారి పిల్లలు నాకు బావలు

(Cousin) అందులో మగ బావం సంతానం నాకు కొడుకులు కూతుళ్ళే ఆడబావం సంతానం నాకు మేనల్లుళ్ళూ, మేనకోడళ్ళు స్త్రీగా మాట్లాడే టప్పుడు యీ చివరి బంధుత్వాలు తిరుగబడతాయి మళ్ళీ వారి పిల్లంతా నాకు మనుమలే

(తెలుగు వాళ్ళలో ఈ కజిన్ (మగ)బావ అవుతాడు అదే స్త్రీ (Cousin) అయితే వయస్సు తేడాను వట్టి వదిన, మరదలు అవుతారు—అను)

అదే తరంలో మా అమ్మల చెల్లెళ్ళు నాకు అమ్మలు, యిది ఏదో సూచన తోడబుట్టినా, జ్ఞాతులయిన అక్క చెల్లెళ్ళ పిల్లలందరూ, వారందరి పిల్లలకూ అమ్మలే మా అమ్మ అక్క చెల్లెళ్ళ పిల్లలు నాకు సోదరీ (అక్క -చెల్లెలు) సోదరులు (అన్న తమ్ములు) వయసును వట్టి, పెద్ద చిన్న యిది ఎనిమిదో సూచన అక్క చెల్లెళ్ళ పిల్లలంతా వారితో వారు సోదరీ సోదరులవుతారు వీరిలో మగ వారి పిల్లలందరూ నాకు కొడుకులు కూతుళ్ళు చెల్లెళ్ళ పిల్లలు మేనళ్ళు, మేనకోడళ్ళు వీళ్ళ పిల్లలు నాకు మనుమలు మాట్లాడేది స్త్రీ అయితే పైన లాగే యిక్కడా బంధుత్వాలు తిరగబడుతాయి

నా సోదరుల భార్యలూ నా జ్ఞాతి సోదరుల భార్యలు నాకు వదిన, మరదళ్ళు (-ఆ-గే ఆ-నే-అ) వారిలో ప్రతియొక్కరికి నేను బావను- మరిదిని (హ-యా-ట) యిందులో మొదటి పదానికి సరైన అర్థం తెలియడంలేదు తోడ బుట్టినా జ్ఞాతులయినా అక్క చెల్లెళ్ళ భర్తలు నాకు బావలు అదే బంధుత్వంతో వారూ పిలుస్తారు అమెరికన్ ఆది వాసులలో మగవానికి అతని సోదరుల భార్యలకు అక్క చెల్లెళ్ళ భర్తలకు మధ్య వివాహ బంధుత్వాలలో పునలాన్ ఆచారం ఛాయలు మిగిలి వున్నాయి మందాన్‌లలో, పానీలలో, అరికారీలలో నా సోదరుడి భార్య నాకూ భార్యే కాకి గణంలో భర్త సోదరుని భార్యను సహచరురాలు (వాట్-జె-నో-పా-చె) అంటారు క్రీక్‌లలో "యిప్పుడింట్లో వున్నామె" అంటారు (చూ-హ-చో-వా) మున్సీలలో 'నానేస్తం' (నై-జో పే) విన్నేలాగో,అకోటిన్నేలలో 'నా సోదరి'అంటారు భార్య సోదరి భర్తని కొన్ని తెగలలో సోదరుడు అంటారు చాల తెగలలో 'బావ' అంటారు క్రీక్‌లలో "నన్ను ఎడతీసిన చిన్నవాడు" అంటారు (ఉన్-కా-పు-చే) దాని అర్థం ఏమైన కావచ్చు

మూడో తరం రెండవ జ్ఞాతి తరంలోని వివిధ శాఖలలో వున్న బంధుత్వాలే యిందులోనూ అవే శాఖలకు చెల్లుతాయి ఒక్కటే తేడా యిక్కడ మరో పూర్వ తరాన్ని కూడ కలుపుకుంటారు మా తాత అన్నదమ్ములు నాకు తాతలు వాళ్ళకి నేను

మనుమణ్ణి యిది తొమ్మిదో సూచన, ఇదే ఆఖరిది కూడాను యిక్కడ తాత సోదరులకు మాత్రమే ఆ బంధుత్వపు పిలుపు చెల్లుతుంది అక్కడ జ్ఞాతులకు యీ బంధుత్వాన్ని మించి వర్తింప చేయడం లేదు యిక్కడ నుంచి పైకి అదే విధంగా మనుమల నుంచి దిగువకి వంశ బంధుత్వాలూ, జ్ఞాతి బంధుత్వాలూ కలిసిపోయి వుంటున్నాయి ఈ తాత కొడుకు నాకు తండ్రి ఆయన పిల్లలు నాకు సోదరీ సోదరులు అందులో సోదరుల సంతానం నాకు కూతుళ్ళు కొడుకులూను సోదరీల సంతానం మేనల్లుళ్ళు మేనకోడళ్లూను వారి పిల్లలు మళ్ళీ మనుమలే ఈ చెప్పేది స్త్రీ అయితే యిదివరకటి లాగే యిక్కడ కూడ యీ చివరి బంధుత్వాలు తిరుగబడతాయి పైన చెప్పిన ప్రతిచోట బంధుత్వపు పిలుపుకి ఎదురు పిలుపు పైనచెప్పినదే

నాలుగో తరం పైన చెప్పిన కారణాలచేత యిందులో ఒక తరంవారిని గురించి చెప్తే చాలుతుంది మా ముత్తాత సోదరుడు నాకు తాతలు ఆయన కొడుకు కూడ నాకు తాతే ఈయన కొడుకు నాకు తండ్రి ఆయన కొడుకులు, కూతుళ్ళు నాకు సోదరీ సోదరులు వయసును బట్టి పెద్ద చిన్నానూ వాళ్ళ పిల్లలు మనుమలు వాళ్ళందరి బంధుత్వాలు పైన చెప్పిన మాదిరివే ఐదవ తరంలోని వివిధ అంతరువులలో బంధుత్వాలన్నీ రెండవ తరంలో మాదిరివే అదనంగా ఒక పూర్వీకుణ్ణి చేర్చడం తప్ప

దీన్ని బట్టి ఒకటి తెలుస్తోంది బంధువులను సరిగ్గా వర్గీకరించడానికి బంధుత్వాల తరాల సంఖ్య సరిగ్గా తెలిసి వుండాలి రోజు వాడకంలో వుంటాయి కనుక ఆ ఇండియనులకి ఈ బంధుత్వపు పిలుపులలో గందర గోళం కనిపించదు

సెనెకా - యిరాక్వ్యాలలో మిగిలిన బంధుత్వపు పిలుపులకు పదాలున్నాయి. మగవాడైతే భార్య తండ్రిని ఓక్-నా-హో-పే అంటాడు అదే స్త్రీ అయితే మగడి తండ్రిని హా-గా-సా అంటుంది అల్లుణ్ణి మామ ఓక్-నా-హో-పే అనే పిలుస్తాడు సవతి తండ్రి హోక్-నా-ఎపే సవతి తల్లి ఓక్-నా-ఎపే సవతి కొడుకు హానో, సవతి కూతురు కా-నో అని పదాలున్నాయి చాలా తెగలలో వియ్యంకులకు వియ్యపురాళ్ళకు ఆ బంధుత్వ పిలుపులు వేరు వేరుగా వున్నాయి ఈ వ్యవస్థలో వున్న అనేక అంతరువులను విడదీసి చెప్పడానికి అనేక పదాలున్నాయి నిజంగా ఆశ్చర్యకరమయిన విషయం సెనెకా - ఇరాక్వ్యాలలోను, తమిళులలోను వున్న ఈ పిలుపులను పూర్తి వివరాలతో పట్టికలో యిస్తున్నాను స్థూలంగా చూస్తేనే రెంటి మధ్య పోలికలు కన్పిస్తాయి ఏనాడో — ఈ బంధుత్వ వ్యవస్థ వారిలో ఏర్పడినప్పటికే — వారిలో పునలాన్ వివాహ పద్ధతి ప్రచారంలో వున్నదని, ఆ వివాహ రూపం ఆ ప్రాచీన

సమాజంమీద ఘనమైన ప్రభావం కలిగించిందని తెలుస్తోంది సామాజిక వ్యవస్థలోని యధార్ధాలను మానవ చేతన్య ఎంత సహజంగా ఆలోచించి, తర్క బద్ధంగా వ్యవహరిస్తుందో యిందులో మనకు కనిపిస్తుంది

ఈ చర్చలో స్పష్టమైనదేమంటే మలయన్ వ్యవస్థ మీదనో లేక అన్నివిధాల ప్రధాన విషయాలలో దానిని పోలిన వ్యవస్థ మీదనో తురానియన్, గనోవానియన్ వ్యవస్థ ఏర్పడింది అని తేలుతూంది రెండు వ్యవస్థలలోను పైన చెప్పిన బంధుత్వాలన్నింటిలో సగం వరకు కలుస్తున్నాయి ఈ రెండింటిని హవాయియన్ దానితో పోలిస్తే కనిపించే తేడాలు సోదరీ సోదరుల మధ్య వివాహం జరుగడం, జరుగకపోవడం వల్ల ఏర్పడినవే మొదటి రెంటిలోను నా చెల్లెలి కొడుకు మేనల్లుడు హవాయియన్ దాంట్లో అతడు నా కొడుకే ఈ బంధుత్వాలు, రక్త సంబంధీకుల కుటుంబానికీ, పునలాన్ కుటుంబానికీ మధ్యనున్న తేడాను చూపిస్తున్నాయి రక్త సంబంధీకుల కుటుంబం స్థానే పునలాన్ కుటుంబం ఏర్పడిందంటే బంధత్వాలు మారి మలయన్ వ్యవస్థ స్థానే తురానియన్ వ్యవస్థ ఏర్పడుతుంది అయితే హవాయియన్ లలో పునలాన్ కుటుంబం వుందికదా దానికి అనుగుణంగా బంధుత్వ వ్యవస్థ ఎందుకు మారలేదు అని అడగవచ్చు దీనికి సమాధానం పైన చెప్పాను కాని మళ్ళీ చెప్తే తప్పేం లేదు బంధుత్వ వ్యవస్థ కంటే కుటుంబ రూపం ముందడుగులో వుంటుంది పాలినీషియాలో పునలాన్ కుటుంబం వుంది కాని వ్యవస్థ మలయన్ బంధుత్వ వ్యవస్థ అమెరికాలో సింథియాస్మియన్ కుటుంబం వుంది, కాని తురానియన్ వ్యవస్థే కొనసాగింది యూరపు, పశ్చిమ ఆసియాలలో దంపతీ కుటుంబ రూపం వచ్చాక కూడ కొంతకాలం తురానియన్ వ్యవస్థ కొనసాగి క్రమంగా క్షీణించి ఆర్యన్ వ్యవస్థ ఏర్పడింది ఇంత వరకు కుటుంబం ఐదు రూపాలలో కనవడింది కాని బంధుత్వ వ్యవస్థలో మనకు తెలిసినంత వరకు మూడే ఏర్పడ్డాయి అమలులో వున్న బంధుత్వ వ్యవస్థ మారాలంటే సమాజ నిర్మాణంలో మార్పులు చాల విస్తృతంగా జరగాలి మలయన్ వ్యవస్థ నుంచి తురానియన్ వ్యవస్థకు మార్పు రావడానికి గణ నిర్మాణం తగినంత విస్తృతమైన, బలమైన ప్రభావం కలిగించింది అనుకుంటాము అదే విధంగా ఆస్తి యొక్క బలంతో బాగా పురోగమించిన మానవ కుటుంబాలలో దంపతీ కుటుంబం బాగా స్థిర పడ్డాక, తురానియన్ వ్యవస్థ రద్దయి ఆర్యన్ వ్యవస్థ ఏర్పడిందనాలి

మలయన్ బంధుత్వాలకు భిన్నంగా తురానియన్ బంధుత్వాలు ఎలా ఏర్పడ్డాయో చెప్పవలసి యుంది దీనికి గణ నిర్మాణాలు, పునలాన్ వివాహ పద్ధతులు ప్రాతిపదిక అవుతాయి

1 మగ వాడుగా నాకు నా స్వంత, జ్ఞాతి అన్నదమ్ముల పిల్లలందరు నా కొడుకులూ కూతుళ్ళూనే

కారణాలు సెనెకా జాతి వాడినిగా మా అన్నదమ్ముల భార్యలందరూ నాకూ, వారికీ భార్యలే ఇది ఈ వ్యవస్థ ఏర్పడిన నాటిమాట చెప్తున్నాను మలయన్ వ్యవస్థలో కూడ అంతే

2 స్వంత, జ్ఞాతి అక్క-చెల్లెళ్ళ పిల్లలందరూ నాకు మేనల్లుళ్ళూ మేన కోడళ్ళూనే

కారణాలు గణ వ్యవస్థలో దాని నియమాల ప్రకారం ఈ స్త్రీలు నా భార్యలు కారు అందుచేత వారిపిల్లలు నా పిల్లలుకారు అంతకన్న దూరపు బంధుత్వం మా మధ్య వుంది మేనల్లుడు మేనకోడలే యీ కొత్త బంధుత్వాలు మలయన్ వ్యవస్థ కన్న యిది భిన్నం

3 స్త్రీగా మాట్లాడే టప్పుడు స్వంత, జ్ఞాతి అన్నదమ్ములందరి పిల్లలు అందరూ నాకు మేనల్లుళ్ళు, మేనకోడళ్ళు

కారణం రెండులో చెప్పినదే ఇదికూడ మలయన్ దానికి భిన్నమే

4 స్వంత, జ్ఞాతి అక్క-చెల్లెళ్ళ పిల్లలందరు స్త్రీగా నా కొడుకులూ కూతుళ్ళే

కారణాలు వారి భర్తలు అంతా నాకూ భర్తలే ఖచ్చితంగా చెప్పాలంటే వీరు నా సవితి పిల్లలు ఒట్టివాలూ, చాలా భాగం ఆల్గోన్‌కిన్ తెగంలో వీరిని అలాగే పిలుస్తారు కాని సెనెకా-ఇరాక్వాయిలలో, తమిళులలో ప్రాచీన వర్గీకరణ ప్రకారం వీరిందరిని నాకొడుకులు కూతుళ్ళుగానే జమకడ్తారు దానికి కారణం మలయన్ వ్యవస్థలో చెప్పాను

5 ఈ పిల్లలందరి స్త్రీ పురుష సంతానాలు నా మనుమలు

కారణం వీరందరూ నాకొడుకులు కూతుళ్ళ పిల్లలు

6 నా మేనల్లుళ్ళ, మేన కోడళ్ళ పిల్లలందరూ నాకు మనుమలే

కారణం మలయన్ వ్యవస్థలో అవే బంధుత్వాలు వున్నాయి కొత్త వాటిని కల్పించలేదు దాని తర్వాత వచ్చిన తురానియన్ వ్యవస్థలో కూడ అవే కొనసాగాయి

7 మా నాన్న యొక్క స్వంత, జ్ఞాతి సోదరులందరూ నాకు నాన్నలే

కారణం వారంతా మా అమ్మకు భర్తలు మలయన్ వ్యవస్థలోను అంతే

8 మానాన్న యొక్క-స్వంత జ్ఞాతి అక్క-చెల్లెళ్ళు నాకు అత్తలు

కారణం గణ నిర్మాణంలో వారు మానాన్నకు భార్యలు కారు అందుచేత వెనుకటి అమ్మ బంధుత్వం చెలద క్రొత్త బంధుత్వం కావలసి వచ్చింది అదే అత్త

9 మా అమ్మ యొక్క- స్వంత, జ్ఞాతి సోదరులందరూ నాకు మామలు

కారణం వారు మా అమ్మకు భర్తలుకారు నాన్న కన్న దూరపు బంధుత్వం కావలసి వచ్చింది అదే మామ

10 మా అమ్మ యొక్క- స్వంత, జ్ఞాతి అక్క-చెల్లెళ్లందరూ నాకు అమ్మలే

కారణం నాలుగులో చెప్పినదే

11 మా నాన్న అన్న దమ్ముల పిల్లలు మా అమ్మ స్వంత, జ్ఞాతి అక్క-చెల్లెళ్ళ పిల్లలు అందరూ నాకు సోదరీ సోదరులే

కారణాలు మలయన్ వ్యవస్థలో వున్నవే, అక్కడే ఆ కారణాలూ చెప్పాను

12 మామామల అందరి పిల్లలు మా అత్తలఅందరి పిల్లలు నాకు మగ, ఆడబావలు (కజిన్స్)

కారణం గణనిర్మాణం ప్రకారం ఈఅత్తలు మామలు మానాన్నలు అమ్మలతో వివాహ సంబంధం పెట్టుకోరాదు అందుచేత వారు నాకు సోదరీ సోదరులుకాజాలరు అంతకంటే దూరపు బంధుత్వం కావాలి అలా వచ్చిందే బావ (కజిన్)

13 తమిళంలో మగ వాడినిగా నా మగ బావల (Cousins) పిల్లలందరూ నాకు మేనల్లుళ్ళు, మేనకోడళ్ళు ఆడబావల పిల్లలందరూ నాకు కొడుకులు కూతుళ్ళూను సెనెకా ఇరాక్వ్యాలలో యిందుకు పూర్తిగా వ్యతిరేకంగా బంధుత్వం వుంది దీనిని పట్టి తమిళులలో తురానియన్ వ్యవస్థ ఏర్పడిన నాటికి నా ఆడ బావలందరూ నాకు భార్యల బంధుత్వంతోనే వున్నారు మగ బావల భార్యలతో ఆ బంధుత్వాలు లేవు ఇంచు మించు రెండు వందల బంధుత్వాలలో ఈ రెండు వ్యవస్థలలోను ఈ తేడాకే ఏమైన కొంచెం ప్రాధాన్యం వుంటుంది

14 మా తాత అవ్వల సోదరీ సోదరులందరూ నాకు తాతలూ అవ్వలూనే

కారణం మలయన్ వ్యవస్థలోను అంతే

మలయన్ బంధుత్వ వ్యవస్థ మొదట వుండేదని దానిని తోసివేసే ఒకే తరహాకి చెందిన తురానియన్ గనోవానియన్ వ్యవస్థలా ఏర్పడ్డాయని యిప్పుడు మరింత

గట్టిగా రుజువయ్యింది మరియన్ వ్యవస్థ వసిఫిక్ దీవులకు చేరడానికి ముందు ఆసియా అంతటా అమలు జరిగి వుండాలి ఆసియా ఖండం నుంచి రక్త బంధుత్వాల ద్వారా ఆసియా, యూరప్, అమెరికాలలోని పురాతన తెగలకు ఈ వ్యవస్థ వ్యాపించిందనీ, కొద్దిపాటి మార్పులతో తురానియన్, గనోవానియన్ కుటుంబాలకు చెందిన వారి పూర్వీకులలో నెలకొందనీ నమ్మడానికి తగిన కారణాలున్నాయి

ఇప్పుడు తురానియన్ వ్యవస్థలోని ప్రధానమైన బంధుత్వాలు ఎలా వచ్చాయో చెప్పాను పునలాన్ కుటుంబంలో పిల్లలకు తండ్రి ఎవరో స్పష్టంగా తెలియడం జరిగిన నాటి నుంచీ ఆ బంధుత్వాలు కనిపిస్తున్నాయి తగిన కారణం లేనిదే తురానియన్ వ్యవస్థ పుట్టి వుండదు దాని పెరుగుదల సహజంగా వచ్చినదే అందుచేత అది పునలాన్ కుటుంబాలలోనే పుట్టిందని చెప్పడం న్యాయమూ, అవసరమూను వివాహం వల్ల ఏర్పడిన బంధుత్వాలలో చాలా భాగం మారడం యిందులో కన్పిస్తుంది

ఈ వ్యవస్థ సోదరులంతా ఒకరొకరి భార్యలకు భర్తలని చెప్తుంది అలాగే అక్కచెల్లెళ్ళు, ఒకరొకరి భర్తలకు భార్యలు వీరంతా ఒక గుంపుగా వివాహం చేసుకున్నారు ఈ వ్యవస్థ ఏర్పడినపుడు ఒకనికి తోడ బుట్టిన వాడైనా, జ్ఞాతియైనా సోదరుడంటూ వుంటే అతని భార్య కూడ తనకీ భార్యే అయింది అలాగే స్త్రీ కూడ స్వంత అక్కచెల్లెళ్ళు, జ్ఞాతి అక్కచెల్లెళ్ళు ఎంత మంది వున్నా వారి భర్తలు ప్రతి ఒక్కరూ ఆమెకూ భర్తే భర్తలు సోదరులు కావడం, భార్యలు అక్కచెల్లెళ్ళు కావడం ఈ బంధుత్వానికి పునాది హవాయియన్ల పునలా ఆచారంలో ఇది స్పష్టంగా కనిపిస్తుంది సిద్ధాంత రీత్యా ఆనాడు కుటుంబం అనేది వివాహ బంధుత్వంలో ఎంత మంది కలిసి వుంటే అంత పెద్దదిగా వుంటుంది కాని నివాస సౌకర్యం, జీవనోపాధి దృష్ట్యా వారంతా విభాగాలై చిన్న చిన్న కుటుంబాలుగా వుండడం జరుగుతుంది బ్రిటన్‌లలో పది పన్నెండు మంది సోదరులు ఒకరొకరి భార్యలను వివాహ మాడారని సీజరు చెప్పిన మాట పునలాన్ జట్టు సాధారణంగా విడిపోతే దానిలో ఎంత మంది వుండగలరో సూచిస్తూంది రక్త సంబంధీకుల కుటుంబం యొక్క అవసరాలు కొద్దీ జీవితంలో కమ్యూనిజం పద్ధతి వచ్చి వుంటుంది అది పునలాన్ కుటుంబంలోనూ కొనసాగింది అమెరికన్ ఆదివాసుల సెంథియాస్మియన్ కుటుంబానికి అది సంక్రమించింది యూరపియన్లు కంబడే వరకు వారిలో ఈ ఆచారం మిగిలివుంది ఈ వేళ ఆ కుటుంబ పద్ధతి వారిలో లేదు, కాని బంధుత్వ వ్యవస్థ, ఆచారాలు అలాగే మిగిలిపోయాయి. ఆటవిక తెగల కుటుంబ జీవన పద్ధతినీ వారి నివాస స్థలాలనూ బాగా

పరిశీలించడం జరుగలేదు ఈ విషయమై వారిలో వున్న ఆచారాలు వారి జీవనోపాధి పద్ధతులు తెలుసుకుంటే ఈ ప్రశ్నలకు సరియైన సమాధానం దొరుకుతుంది

బంధుత్వ వ్యవస్థల రెండింటిని, అవి ఏర్పడగల రెండు కుటుంబ వ్యవస్థలను యిక్కడ చెప్పాను అందుకీ సాక్ష్యం చాలు మానవజాతి అతి దిగువ దశ నుంచి బయట పడి రక్తసంబంధీకుల కుటుంబ నిర్మాణంలోకి ప్రవేశించాక మానవ సమాజం ప్రారంభమైన పైనాన్ని చెప్పాను ఈ మొదటి రూపం నుంచి రెండవరూపానికి మార్పు అతి సహజంగా వచ్చింది పరిశీలన, అనుభవమూద్వారా దిగువ సామాజిక స్థితినుంచి, ఉన్నత సామాజిక స్థితికి పెరుగుదల అది మానవ జాతికే ప్రత్యేకమైన మానసిక నైతిక లక్షణాల పెరుగుదలకు అది ఫలితం అటవిక యుగంలో చాల భాగం మానవుడు పొందిన అభివృద్ధి రక్త సంబంధీకుల కుటుంబంలోను, పునలాన్ కుటుంబాలలోను కనిపిస్తుంది వీటిలో మొదటి దానికంటే రెండవది చాలా మెరుగైనదే కాని దంపతీ కుటుంబం కంటే చాల వెనుక బడి వుంది వివిధ కుటుంబ రూపాలను పోల్చిచూస్తే అటవిక దశలో పురోగతి ఎంత నెమ్మదిగా జరిగిందో పురోగతికి అవకాశాలు ఎంత తక్కువో, ఆటంకాలు ఎంత ఎక్కువో కన్పిస్తుంది ఇంచు మించు జీవితం నిలబడిపోయి ఒక్కొక్కప్పుడు పురోగమిస్తూ మళ్ళీ వెనక్కి పోతూ యుగ యుగాలు గడిచి పోయాయి కాని మానవ సమాజం సాధారణ రూపంలో దిగువ దశ నుంచి ఎగువ దశకే ప్రయాణించింది లేకుంటే మనం యింకా అటవిక దశలోనే వుండే వాళ్ళం మహత్తరమైన ఈ పురోగతిని మానవజాతి ఎక్కడినుంచి ప్రారంభించిందో తెలుసుకోవడం చాల అవసరం కనీసం ఆ దిగువ దశకే, యించుమించు దగ్గరలో రక్త సంబంధీకుల కుటుంబ రూపానికి పరిమితమే అయినా అదే గొప్ప

---

(బంధుత్వ వ్యవస్థల పట్టికను అనుబంధం 1 లో చూడండి)

# అయిదో ప్రకరణం

# సింధియాస్మియన్ — పితృస్వామిక కుటుంబాలు

సింధియాస్మియన్ కుటుంబం - ఎలా ఏర్పడింది - దాని లక్షణాలు- దానిమీద గణసంస్థ ప్రభావము - జంటలుగా ఏర్పడడం అన్నది తరువాత వచ్చిన పరిణామము- ఇది బాగా కనపడినచోట ప్రాచీన సమాజాన్ని పరిశీలించాలి- పితృస్వామిక కుటుంబము - తండ్రి అధికారం దీని ప్రధాన లక్షణము - బహు భార్యాత్వం అనుషంగికము - రోమను కుటుంబము అటు వంటిదే - గత కుటుంబ రూపాలలో తండ్రికి పెద్దరికం లేదు

యూరపియన్లు చూసినప్పటికి అమెరికన్ ఆదివాసులలో ఒకభాగం అనాగరిక యుగం దిగువ దశలో వున్నారు వారిలో సింధియాస్మియన్ కుటుంబం లేదా జంటలు గాకూడే కుటుంబరూపం వుంది అంతకు పూర్వపుదశలో పెద పెద్ద జట్లు వివాహ సంబంధాలు కలిగివుండేవారు అవి యిప్పుడు అదృశ్యమైనాయి దానిలో యిప్పుడు పెళ్ళిచేసుకున్న జంటలు వచ్చాయి అయితే కుటుంబాలు దేనికది పూర్తిగా ఏర్పడలేదు ఈ కుటుంబరూపంలో దంపతీ కుటుంబరూపం బీజప్రాయంగా వుంది కాని ప్రధాన లక్షణాలు ఏవీ సమకూడలేదు

సింధియాస్మియన్ కుటుంబం ప్రత్యేకమైనదీ, చిత్రమైనదీను అటువంటి ఎన్నో కుటుంబాలు సమిష్టిగా ఒకేయింట్లో వుంటాయి కమ్యూనిస్టు పద్ధతిలో జీవిస్తాయి అనేక కుటుంబాలు ఒక్కయింట్లో వుండడమే, ఒంటరిగా జీవిత సమస్యలను ఎదుర్కొ గల స్థితిలో కుటుంబం లేదు అనడానికి సాక్ష్యం అయినా జంటల మధ్య వివాహం ద్వారా అది ఏర్పడింది దంపతీకుటుంబ లక్షణాలు కొన్ని దానిలో వున్నాయి భర్త యొక్క ప్రధాన భార్యగా వుండడంకన్న స్త్రీకి కొంత విశిష్టస్థానం వుంది ఆమె

అతని సహచరురాలు అతనికి వండి పెడుతుంది తనవాళ్ళే అనుకోగల పిల్లలకు ఆమె తల్లి వారిద్దరూ జంటగా పుట్టిన బిడ్డలను పెంచుకోవడంవలన వారి మధ్య అనుబంధం దృఢపడి శాశ్వతం అవుతుంది

కాని ఈ వివాహ పద్ధతికూడా కుటుంబంలాగే విచిత్రమైనది నాగరికసమాజంలో ప్రేమతో భార్యను వెతుక్కున్నట్లు యిందులో జరుగదు అటువంటి ఆలోచనేవారికి తెలియదు అందుకు వారికన్న వున్నతమైన అభివృద్ధి పొందవలసి వుంటుంది. అందుచేత ఆ నాడు వివాహానికిమూలం మానసిక ఉత్తేజంకాదు అవసరం,అలవాటూను పిల్లలకు పెళ్ళిచేసే ఏర్పాటు వాస్తవానికి తల్లుల చేతిలో వుంటుంది పిల్లల అంగీకారం తీసుకోకుండానే వాళ్ళకి తెలియకుండానే రాయబారాలు జరిగిపోతాయి ఒక్కొక్కప్పుడు మొగం ఎరుగనివాళ్ళ మధ్యవివాహం జరిగిపోతుంది జతకూర్చ వలసిన సమయంలో వాళ్ళకి చెప్తారు ఆ పని చేస్తారు ఇరాక్యూలలోను, యితర ఇండియన్ తెగలలోను వున్న అలవాటు అదే వివాహం చేసుకునేవారు ఈ ఒప్పందాలకు కట్టుబడి వుండడం వారిబాధ్యత వద్దు అనడం ఎప్పుడోకాని జరుగదు వివాహానికి ముందు వధువుయొక్క దగ్గర బంధువులకు బహుమతులివ్వడం ఈ వివాహ పద్ధతులలో ఒక లక్షణమైంది ఇదొకరకంగా కన్యాశుల్కంలాగా తయారయ్యింది ఈ బంధుత్వం ఆ జంటకి ఇష్టం వున్నంతవరకు సాగుతుంది ఎవరికిష్టం లేకపోయినా విడిపోతారు అందుకే దానిని జంటల కుటుంబం అన్నారు యిందులో మగవాడు తోచినపుడు పెళ్ళాన్ని వదిలేసి మరొకర్తెను కట్టుకుంటాడు అదో నేరంకాదు అలాగే ఆడదీని ఆమెకు సమాన హక్కుంది దానివలన గణంలోను తెగలోనువున్న ఆచారాలను భంగపరిచినట్టుకాదు కాని అటువంటి విడబాటులను వ్యతిరేకిస్తూ ప్రజాభిప్రాయం క్రమంగా బలపడసాగింది పెళ్ళిచేసుకున్నవాళ్లు పేచీలుపడివిడిపోతారు అనుకున్నప్పుడు గణబంధువులు పలుగురూ కలిసి సర్దుబాటు చేయడానికి ప్రయత్నిస్తారు తరచుగా సాధ్యం అవుతుంది కానప్పుడు విడిపోవడాన్ని అంగీకరిస్తారు అప్పుడు భార్య తనపిల్లల్ని తన వస్తువుల్ని తీసుకొని మగడియిల్లు వదిలి వచ్చేస్తుంది పిల్లలు ఆమెవాళ్ళుగానే లెక్క భర్తకు హక్కులేదు లేకపోతే ఆ సమిష్టి యింట్లో భార్యబంధువులది బలమైతే మగడు పెళ్ళాంయిల్లు వదిలి లేచిపోతాడు సాధారణంగా జరిగేదంతే ఆ విధంగా వివాహ బంధుత్వం కొనసాగడం జంటలో యిద్దరి యిష్టంమీద ఆధారపడి వుంటుంది

సెనెకాలలో చాలా ఏళ్ళపాటు మిషనరీగా పనిచేసిన రెవరెండ్ ఎ రైట్ ఈ విషయం గురించి నాకొక ఉత్తరం వ్రాశారు

"ఇంక వాళ్ళ కుటుంబ పద్ధతిని గురించి పూర్వకాలపు పెద్దపెద్ద పాకల్లోవున్న ఘట్టంలో సాధారణంగా అందులో ఒక కుదురు వాళ్ళది ప్రాధాన్యం వుంటుంది స్త్రీలు యితర కుదుర్లనుంచి భర్తలను తెచ్చుకుంటారు ఒక్కొక్కప్పుడు తల్లిని విడిచిపెట్టి పోవడానికి ధైర్యంచాలక వాళ్ళే కొడుకులకు భార్యలను తెచ్చుకోవడంకూడ వుంది సాధారణంగా యింట్లో ఆడవాళ్లదిపెద్దరికం కుదురు అభిమానం తప్పకుండ వుంటుంది స్టోర్సు (సంబారాలకొట్టు) అందరికీని మగడో, ప్రేమికుడో అతడు అంతచురుకైన వాడుకాక తనవంతు తిండి సమకూర్చలేకపోతే యింక వానిగతి చెప్పనక్కరలేదు వాడికి ఎందరు పిల్లలున్నా వాని సామాన్లు ఆ యింట్లో ఎన్నివుండనీ, ఏ క్షణంలో నయినా 'నీకంబలి భుజానేసుకు పోవోయ్' అని చెప్పవచ్చు అటువంటి మాట వచ్చాక కాదు అనడం అట్టే ఆరోగ్యకరంకాదు ఏ అవ్వో, ఏ అత్తో కలగచేసుకుని సర్దుబాటు చేస్తే తప్ప తన కుదురుకి లేచిపోవలసిందే తరచు అలాగే జరుగుతుంది. మరో కుదురులో వివాహసంబంధం ఏర్పరచుకుంటాడు అన్నిచోట్ల వున్నట్టే కుదురులలో ఆడవాళ్ళది బలం అవకాశంవస్తే కొమ్ములుకోసేసి నాయకుడినైనా సరే మామూలు యోధుల్లోకి పంపించి వేయవచ్చు ముఖ్యంగా నాయకుణ్ణి నిర్వాచన చేయడం వారిదే పని"

అనాగరికయుగం దిగువదశలోవున్న అమెరికన్ ఆదివాసులలో దంపతీ కుటుంబంలో కనబడే నైతిక పరిణామం రాలేదు అనడానికి ఈ బంధుత్వము ఒక లక్షణం ఇరాక్వ్యూలు అనాగరిక ప్రజలలోనే బాగా వున్నతస్థాయికి చేరారు వారిలోనూ, అంతగానూ పురోగమించిన ఇతర ఇండియన్ తెగలలోనూకూడ భార్య పవిత్రంగా వుండాలనే కోరుతారు మగవాడు దారితప్పినా ఆమెకుమాత్రం కఠినమైన శిక్ష విధిస్తారు ఆమెకున్నంత బాధ్యత అతనికి వుండదని ఒప్పుకోరు రెండవవారికి లేనిదే ఒకళ్ళే దీనికి శాశ్వతంగా కట్టుబడి వుండరు బహు భార్యాత్వం అన్నిచోట్ల మగవాని హక్కుగా భావించబడుతుంది ఆచరణలోలేదు అంటే పోషించలేకపోవడం కారణం దంపతీ కుటుంబాన్ని పూర్తిగా నిర్దిష్టపరిచినపుడు వుండే లక్షణాలు దీనిలోలేవు అనడానికి యితర అలవాట్లనుకూడ చూపించవచ్చు వాటిని చెప్పడం అనవసరం వీటిలో మినహాయింపులు వుంటేవుండవచ్చు అనాగరిక తెగలన్నింటిలో సాధారణంగా యిదియింతేనని నా వుద్దేశ్యం దంపతీ కుటుంబంకంటే సిండియాస్మియన్ కుటుంబాన్ని వేరుపరిచిచూపే లక్షణాలు చాలానే వున్నాయి అందులో ముఖ్యమైనది, ఆ సంబంధం కేవలం వారికే పరిమితం కాకపోవడం - పూర్వకాలపు స్త్రీ పురుష సంబంధాలు వారి బంధుత్వ

వ్యవస్థలో మిగిలివున్నాయి అయితే కొన్ని పరిమితులలో అవి అంత విస్తృతంగా లేవు

అనాగరిక యుగం మధ్యదశలో వున్న గ్రామవాసి ఇండియన్‌లలో మనకు తెలిసినంత వరకు పరిస్థితి యిదే అమెరికన్ ఆదివాసి ప్రజలలో వివాహము, విడాకులకు సంబంధించిన ఆచారాలను పోల్చిచూస్తే అందరిలోను ఒకే రకమైన ఆచారాలు వున్నట్లు కనిపిస్తుంది అజ్‌టెక్‌లలో "వివాహాలను తల్లి తండ్రులే కుదురుస్తారు వారి అంగీకారం లేనిదే వివాహాలు జరుగవు" అని క్లవీగెరో వ్రాశాడు "వధువు యొక్క యూపిల్లి (గౌను) కొనను, వరుని యొక్క తిల్మాత్లి (కండువా)కొనకు ముడివేస్తారు దానితో వివాహం ప్రధానంగా ముగిసినట్టే" అని హిస్టరీ ఆఫ్ మెక్సికో చెప్తూంది వివాహ వేడుకను గురించి చెప్తూ హెర్రెరా యిలా వ్రాశాడు "వధువు తెచ్చిన వాటినన్నింటిని బాగా గుర్తు పెట్టుకుంటారు వివాహం విడిపోవడం వారిలో మామూలు అలావిడిపోతే ఆమె వస్తువులను ఆమె తీసుకుంటుంది కూతుళ్ళను భర్త తీసుకుంటాడు కొడుకులను భార్య తీసుకుంటుంది వారు మళ్ళీ పెళ్ళి చేసుకోవడానికి అభ్యంతరం వుండదు"

అజ్‌టెక్ ఇండియన్లు కూడ ఇరాక్వాలలాగే స్వంతంగా భార్యను వెతుక్కోవడం వుండదు ఈ యిద్దరిలోను కూడ పెళ్ళి అనేది వ్యక్తిగత విషయం కాదు సమాజానికి లేక మందికి లేక గణానికి సంబంధించిన వ్యవహారం అందుచేత అది పూర్తిగా తల్లి తండ్రుల అధీనంలోనే వుంటుంది ఇండియన్ యువతీ యువకులలో పెళ్ళి కాని వారి మధ్య సామాజిక పరిచయాలు కూడ కొద్దిగానే వుంటాయి వారిద్దరి మధ్య అనుబంధం ఏర్పడదు కనుక ఈ పెళ్ళిళ్ళు వారికి నష్టం కలిగించడం ఏమీ ఉండదు అక్కడ వ్యక్తుల అభిలాషలు కనుక్కోరు అవి ముఖ్యం కాదు ఇరాక్వాలలో లాగే అజ్‌టెక్‌లలో కూడ భార్య యొక్క స్వంత వస్తువులు వేరుగానే వుంచుతారు వారిలో విడాకులు సామాన్యం విడిపోవలసి వచ్చినపుడు స్త్రీ తన వస్తువులను తాను తీసుకు పోవచ్చు అది ఇండియనుల ఆచారం ఇరాక్వాలలో విడాకుల తీసుకున్నప్పుడు స్త్రీ పిల్లలందరను తీసుకుంటుంది అజ్‌టెక్‌లలో భర్త, ఆడపిల్లల్నీ, భార్య మగ పిల్లల్నీ తీసుకోవాలి ఇది ప్రాచీన ఆచారానికి సవరణ. అంటే ఇంతకు ముందు అజ్‌టెక్‌ల పూర్వులలో ఇరాక్వాల నియమాలే వర్తించేవన్న మాట

హెర్రెరా యుకటాన్ ప్రజలను గురించి మాట్లాడుతూ ఇలా అన్నాడు. "ఇదివరలో వాళ్ళు 20 యేళ్ళ వయస్సులో పెళ్ళి చేసుకునేవారు క్రమంగా 1?, 14

యేళ్ళకు వచ్చారు భార్యలంటే ప్రేమ వుండదు కనుక ప్రతి చిన్న విషయానికి విడాకులు తీసుకుంటారు సంస్కృతిలోను, అభివృద్ధిలోను యుకిటాన్‌లకు చెందిన మాయాలు అజ్‌టెక్‌ల కన్న వున్నత స్థాయిలో వున్నారు వీరిలో కూడ వివాహాలు అవసరార్థమే వ్యక్తి గతమైన అభిరుచితో కాదు అందుచేత వారి బంధం అస్థిరం ఇద్దరిలో ఎవరు కోరినా విడిపోవచ్చు పైగా గ్రామవాసి ఇండియన్లలో బహు భార్యాత్వం మగవాడి హక్కుగా గుర్తిస్తారు అభివృద్ధి తక్కువగా వున్న తెగంలో కన్న, వీరిలో బహు భార్యాత్వం సర్వ సామాన్యం ఇండియనులలోని అనాగరిక యుగపు ఆచారాలూ, అలవాట్లనూ చూస్తే అదే పరిణామ దశలో వున్న అదివాసుల యధార్థస్థితి స్పష్టంగా కనిపిస్తుంది వివహం లాంటి వ్యక్తిగత విషయాలలో వధూ వరుల యిష్టా యిష్టాలను కనుక్కోవడం వుండదు ప్రజలలోని అనాగరికతకు ఇంత కంటే బలమైన సాక్ష్యం లేదు

పునలాన్ కుటుంబం కన్న ఈ కుటుంబ పద్ధతి కలిగించిన ప్రభావాలను యింక పరిశీలించాలి పునలాన్ కుటుంబంలో, సామాజిక స్థితిలో వున్న అవసరాల కొద్దీ ప్రతివాడు అనేక మంది భార్యలలో ఒక ప్రధాన భార్యను కలిగి వుంటాడు అలాగే ప్రతి అడది అనేక మంది భర్తలలో ఒక ప్రధాన భర్తను కలిగి వుంటుంది దీనిని పట్టి పునలాన్ కుటుంబంలో మొదటి నుంచీ సింధియాస్మియన్ కుటుంబం వైపే చూపు వున్నదని చెప్పవచ్చు

ఈ ఫలితాన్ని తెచ్చినది ప్రధానంగా గణ నిర్మాణం అయితే అది క్రమంగా సుదీర్ఘకాలంలో జరిగింది మొదటిది – అది వెంటనే అప్పటికి ఆచారంగా వున్న గుంపు పెళ్ళిని భగ్నం చేయలేదు మొదట గణం లోపల అంతర్వివాహాన్ని నిషేధించింది ఒకే గణానికి చెందియుండే సోదరీ సోదరుల మధ్య, అక్క చెల్లెళ్ళ పిల్లల మధ్య వివాహాన్ని నిషేధించింది స్వంత అన్నదమ్ములు తమ భార్యలను, అక్కచెల్లెళ్ళు తమ భర్తలను వుమ్మడిగా కలిగి వుండవచ్చు దీని అర్థం పునలాన్ కుటుంబపు విస్తృతిని తగ్గించిందే తప్ప గణం దాని విషయంలో ప్రత్యక్షంగా కలుగ చేసుకోలేదు అయితే స్త్రీ పారం పర్యంలో గణంలోని ప్రతి తరంలోని వారి మధ్య శాశ్వతంగా వివాహ బంధాలను ఆపివేయడం ఒక గొప్ప కల్పనే గణాలు విడబడి నప్పుడు ఈ నిషేధం చాలా కాలం పాటు ఆ శాఖలకికూడ వర్తింప జేశారు ఇరాక్వాలలో అది చూశాము రెండవది ఈ నిర్మాణం యొక్క స్వరూపము, నియమాలు రక్త బంధువుల మధ్య వివాహాల యెడ అయిష్టాన్ని కలిగించాయి గణం

వెలుపల పెళ్ళి చేసుకోవడంలోని లాభాలను క్రమంగా తెలుసుకోవడంతో ఈ అయిష్టం దృఢ పడింది ఇది క్రమంగా పెరిగి అమెరికన్ ఇండియన్ ఆది వాసులలో రక్త బంధువుల మధ్య వివాహాలకు పూర్తి వ్యతిరేకత ఏర్పడింది యూరపియన్లు వారిని చూసిన నాటికే ష్యాంగ్ తెగలలోని వారి నాయకులలో ఒకరు వాళ్ళలో వున్న అలవాట్లకు భిన్నంగా అన్న కూతురు (ఫస్ట్ కజిన్)ను పెళ్ళి చేసుకున్నాడు అందుకు శిక్ష ఏమీ లేదు కాని మిత్రులంతా నిరంతరం వెక్కిరించేటప్పటికి భరించలేక వారిద్దరూ యిష్టాపూర్తిగానే విడిపోయారని నాకు ఒకరు చెప్పారు రక్త బంధుత్వాల పట్టికలో పేర్కొన్న బంధువులలోంచి ఇరాక్యూలు పెళ్ళిచేసుకోరు గణం వెలుపలనే భార్యలను వెతుక్కు రావలసి వుండడంచేత రాయబారాలు జరుపడం, కొనుక్కోవడం ప్రారంభం అయింది గణ నిర్మాణాల వలనుండి మెట్టు మెట్టుగా పెరిగిన కొద్దీ అది వరకు దండిగా వున్న భార్యలు యిప్పుడు కరువయి పోయారు పునలూన్ జట్టులోని సంఖ్య క్రమంగా తగ్గిపోయింది తురానియన్ బంధుత్వ వ్యవస్థ ఏర్పడిన నాటికి అటువంటి గుంపులు వుండేవి అనుకోవచ్చు ఆ వెనుకటి బంధుత్వ వ్యవస్థ మిగిలి ఆ గుంపులు మాత్రం అదృశ్యమయ్యాయి క్రమంగా సిండియాస్మియన్ కుటుంబం సర్వత్రా ఏర్పడింది ఇది నాలుగవది భార్యలను వెతుక్కునేటప్పుడు వారు తమ తెగలతో మిత్రత్వం గల తెగలకు మాత్రమే పరిమితం కాలేదు. శత్రువుల తెగల నుండి కూడ బలవంతంగా ఎత్తుకొచ్చే వారు యుద్ధాలలో ఓడిపోయిన మగవాళ్ళని చంపివేసి వారి స్త్రీలను బందీలుగా పట్టుకోవడం అనే అలవాటు యిలాగే వచ్చి వుంటుంది. భార్యలను డబ్బులిచ్చి కొనుక్కునో, బలవంతంగా పట్టి తెచ్చుకొనో ఎంతో ప్రయత్నం, త్యాగం చేశాక వారిని యితరులతో పంచుకోవడానికి మనసొప్పదు జీవనోపాధి కోసం తప్పక సహకరించవలసిన జట్టుతో తప్ప మిగిలిన వాళ్ళతో ఆ అనుబంధం తెంపుకోవడం జరుగుతుంది.కనీసం సిద్ధాంత రూపంలో ఆవిధంగా కుటుంబంయొక్క ప్రమాణమూ తగ్గుతుంది దాంపత్య సంబంధాల పరిధి తగ్గుతుంది వాస్తవానికి తమ భార్యలను వుమ్మడిగా కలిగి వుండే సోదరులకు, వుమ్మడిగా భర్తలను కలిగి వుండే అక్క చెల్లెళ్ళకు మాత్రమే గుంపు పరిమితమవుతుంది అయినది - అది వరకులేని వున్నతమైన సామాజిక నిర్మాణాన్ని గణం సృష్టించింది నాగరికత ఏర్పడే వరకు మానవజాతి అవసరాలకు సరిపడే సామాజిక వ్యవస్థ క్రమంగా పరిణతిపొందింది గణ వ్యవస్థలో సమాజం పురోగమించి సిండియాస్మియన్ కుటుంబం ఏర్పడడానికి మార్గమేర్పడింది.

రక్తబంధుత్వంలేని వ్యక్తులను వివాహ బంధుత్వంతో కలిపే ఈ క్రొత్త అలవాటు సమాజ పురోగతికి మంచి వూపునిచ్చింది శారీరకంగాను, మానసికంగాను మంచి జీవశక్తి గల సంతానం కలిగారు వేరు వేరు కుటుంబాల కలయిక వలన కలిగిన లాభం మానవ పరిణామం మీద ఎంతో ప్రభావం కలిగించింది మంచి బలమైన శారీరక, మానసిక లక్షణాలు గల రెండు తెగలు అనాగరిక జీవితపు యాదృచ్ఛిక సందర్భాలలో ఒకచోట కలిసి ఒక ప్రజగా ఏర్పడ్డం వలన మెదడు పెరుగుతుంది యిద్దరి యొక్క సమ్మిళిత శక్తులతో క్రొత్త సంతానం ఏర్పడుతారు ఈ తరం వారు అదివరకటి రెండు తెగల మీద మెరుగు ఆ పెరుగుదల వారి తెలివితేటలను పెంచడంలో, వారి సంఖ్యలను పెంచడంలో స్పష్టమవుతుంది ఈనాడు నాగరిక జాతులలో జంటలుగా ఏర్పడడం విషయమై కనపడే మొగ్గుదల పునలాన్ ఆచారం అదృశ్యమయ్యేవరకు మానవుని మనస్సులో ఏర్పడనేలేదు అక్కడక్కడ ఒకటి రెండు జరిగి వుండవచ్చు కాని సింథియాస్మియన్ కుటుంబం ఏర్పడే వరకు అది సర్వ సామాన్యం కాలేదు అందుచేత ఈ మన స్థితి లేక మొగ్గుదల మానవజాతి యొక్క సహజమైన లక్షణం కాదని మానసిక శక్తులన్నింటిలాగా, వృత్తిజాలలాగా యిది కూడ అనుభవం వలన పెరిగిందే తప్ప వేరు కాదు

కుటుంబం యొక్క పెరుగుదలకు ఆటంకంగావున్న మరొక ప్రభావాన్ని చెప్పాలి ఆటవికులలో కన్న అనాగరికులలో ఆయుధాలు మెరుగయ్యాయి కారణాలు బలపడ్డాయి అందుచేత యుద్ధాలు ఎక్కువ జీవిత నష్టాన్ని కలిగించాయి అన్ని కాలాల్లోను, అన్ని సమాజ పరిస్థితులలోను యుద్ధ వ్యవసాయం మగవాడిది దీనికి ఫలితంగా స్త్రీ పురుషుల సంఖ్యలో సమానత్వం చెదిరిపోవడం, స్త్రీల సంఖ్య ఎక్కువగా వుండడం జరుగుతూ వుంటుంది గుంపు వివాహాల వలన ఏర్పడిన స్త్రీ పురుష సంబంధ వ్యవస్థ బలపడడానికి యిది కారణమవుతుంది సింథియాస్మియన్ కుటుంబం పురోగమించడానికి ఆటంకంగా స్త్రీ పురుషుల సంబంధాల విషయమై అగౌరవాన్నీ, స్త్రీల గౌరవ మర్యాదలకు భంగకరమైన ఆలోచనన్నీ ఈ పరిస్థితి పెంచుతుంది

ఇందుకు భిన్నంగా అమెరికన్ ఆదివాసులలో మొక్కజొన్న వ్యవసాయం, మొక్కల పెంపకము వచ్చి, జీవనోపాధి మెరుగయి, కుటుంబ పురోగతికి అనుకూలత ఏర్పడింది ఎక్కడికక్కడ స్థిర పడడం, కొత్త కొత్త కళలు, గృహ నిర్మాణం మెరుగు కావడం, ఎక్కువ తెలివితేటలూ వచ్చినాయి ఎంతో పరిమితమే అయినా కష్టపడడం, పొదుపుగా వుండడం, జీవితానికి రక్షణను ఎక్కువ చేయటంతో జంట జంటలతో

కుటుంబాలు ఏర్పడడం వచ్చివుంటుంది ఈ సౌలభ్యాలను తెలుసుకున్న కొద్దీ కుటుంబానికి నిలకడా ఏర్పడుతుంది దానికి వ్యక్తిత్వమూ పెరుగుతుంది పునలాన్ జట్టు తర్వాత ఏర్పడిన ఈ జంట కుటుంబాలు సామూహిక గృహంలోనే నివసిస్తూ ఆ భార్యాభర్తలు తమ కుటుంబం నుంచీ, తమ యింటి నుంచీ, తమ గణం నుంచీ సహాయం పొందుతూ జీవిస్తారు ఆటవిక దశ నుంచి అనాగరిక యుగం దిగువ దశకు వచ్చిన గొప్ప సామాజికమైన మార్పు తదనుగుణమైన మార్పును కుటుంబంలో కూడ తెస్తుంది ఆ అభివృద్ధి క్రమంగా దంపతీ కుటుంబం వైపు దారి తీస్తుంది సింధియాస్మియన్ కుటుంబం గురించి మనకేమీ తెలియకపోయినా ఒక వైపున పునలాన్ కుటుంబాన్ని, రెండవ వైపున దంపతీ కుటుంబాన్ని చూసినపుడు మధ్యలో యిటువంటి అంతర్దశ వుండి వుంటుందని వూహించగలం ఏమంటే ఆ రెండింటి మధ్య కాల వ్యవధి చాల ఎక్కువ ఆటవిక అనాగరిక యుగాల మధ్యకాలంలో పుట్టి అనాగరిక యుగం మధ్య దశను దాటి ఎగువ దశలో చాల దూరం వరకు సింధియాస్మియన్ కుటుంబం కొనసాగింది అనాగరిక యుగం ఎగువ దశలో దంపతీ కుటుంబ రూపం యొక్క అతి ప్రాథమిక రూపం కనబడింది అనాటి స్త్రీ పురుష సంబంధ వ్యవస్థ దానిని కనబడకుండా చేస్తున్నా సమాజం పెరుగుదలతో అది గుర్తింపు పొందింది మానవ మేధ ఎంతో తపన పొంది నాగరికతను తీసుకొచ్చే వరకు మగ వాళ్ళలో వున్న స్వార్థం, నిజమైన దంపతీ కుటుంబం ఏర్పడనీయలేదు

సింధియాస్మియన్ కుటుంబం ఏర్పడడానికి పూర్వం రెండు కుటుంబ రూపాలేర్పడ్డాయి ఆ రెండూ రెండు బంధుత్వ వ్యవస్థలను సృష్టించాయి అవి రెండూ ఒకే బంధుత్వ వ్యవస్థ యొక్క రెండు రూపాలు ఈ మూడవ కుటుంబం కొత్త వ్యవస్థను సృష్టించలేదు పాత వానిని సంపరించలేదు కొత్త కుటుంబరూపాని కనుగుణంగా కొన్ని బంధుత్వాల్ని మార్చింది నిజానికి సింధియాస్మియన్ కుటుంబం రక్త బంధుత్వ వ్యవస్థలోనే చాలకాలం నడిచింది అప్పుడున్న బంధుత్వాలకు ఆ వ్యవస్థ వ్యతిరేకమే కాని వాటిని భగ్నం చేయలేక పోయింది అదే కారణం చేత దంపతీ కుటుంబానికి దగ్గరగా అయిందేకాని దానిని అందుకోలేక పోయింది ఆ వ్యవస్థను రద్దు పరచిన శక్తి దంపతీ కుటుంబానికే వుంది ఈ జంట కుటుంబ పద్ధతికి బంధుత్వ వ్యవస్థ స్పష్టమైనది ఏదీ లేదు ఫలితంగా అది వున్నట్టు సాక్ష్యం చెప్పలేము చారిత్రక యుగంలో కంటే భూమి మీద ఎక్కువ ప్రదేశాలలో అది వుండింది ఇప్పటికీ అనాగరిక తెగలలో చాల వానిలో వుంది.

అనేక కుటుంబ రూపాలకు ఒక క్రమాన్నిచ్చి చెప్పడంలో తప్పు అర్థం చేసుకొనే ప్రమాదం వుంది సమాజం ఒక ప్రత్యేకమైన దశలో వున్నప్పుడు ఒక కుటుంబ రూపం సంపూర్ణ రూపంలో ఏర్పడుతుందని, ఎక్కడ ఏ తెగలు ఆ దశలో వున్నా అక్కడ ఆరూపం సామాన్యంగా అభివృద్ధి పొందుతుందని,అంతకంటే వున్నత దశ ఏర్పడినప్పుడు తరువాతి వున్నత కుటుంబ రూపం వచ్చేస్తుందని చెప్పడం నా వుద్దేశ్యం కాదు రక్త సంబంధీకుల కుటుంబాలే సామాన్యంగా వున్న పరిస్థితులలో అక్కడక్కడా పునలాన్ కుటుంబమూ రావచ్చు తద్వ్యతిరేకంగానూ జరగవచ్చు పునలాన్ కుటుంబాలమధ్య సింథియాస్మియన్ కుటుంబంఏర్పడవచ్చు తద్వ్యతిరేకమూ జరుగవచ్చు సింథియాస్మియన్ కుటుంబాల మధ్య దంపతీ కుటుంబం అక్కడక్కడ ఏర్పడవచ్చు తద్భిన్నమూ జరగవచ్చు పునలాన్ కుటుంబాలున్నంత దిగువ స్థితిలో కూడ అక్కడక్కడా దంపతీ కుటుంబాలూ ఏర్పడవచ్చు రక్త సంబంధీకుల కుటుంబ స్థితే కొనసాగుతున్నప్పుడు సింథియాస్మియన్ కుటుంబం ఏర్పడవచ్చు పైగా ఎంతో పురోగమించిన కుటుంబాలకన్న ముందుగానే కొన్ని తెగలలో ఒక ప్రత్యేక కుటుంబ రూపం రావచ్చు అనాగరిక యుగం మధ్య దశలో వున్న బ్రిటన్‌లలో పునలాన్ కుటుంబం వుండగా, అనాగరిక యుగం దిగువ దశలోనే ఇరాక్వ్యూలలో సింథియాస్మియన్ కుటుంబం వచ్చింది బ్రిటన్‌లోని కెల్టిక్ ప్రజలలో వారి మానసిక పరిణతికంటే మించిన కళలు, కల్పనలు బ్రిటన్‌లకు మధ్యధరా సముద్ర తీరంలో నున్న వున్నత నాగరిక జాతులనుండి వచ్చి వద్దాయి అయితే అవి వారికి బాగా పట్టుబడలేదు మానసికంగా వారు ఆటవిక స్థితిలోనే వున్నారు పురోగమించిన తెగల కళలు వారి చేతికొచ్చాయి కుటుంబము అన్నది ఆటవిక యుగంలో దిగువన ఎక్కడో రక్త సంబంధీకుల మధ్య ప్రారంభమయి, రెండు అంతస్థులను దాటి దంపతీ కుటుంబ స్థితిని చేరిందని నేను చెప్పదలిచాను అందుకు నేను చూపిన సాక్ష్యం చాలు ఈ వివాహ రూపం ప్రతి ఒక్కటి ఆయాప్రాంతానికే పరిమితమయి పుడుతుంది క్రమంగా పెరిగి విస్తరించి సర్వసామాన్య రూపం ధరిస్తుంది తరువాత అది దాని తర్వాత వచ్చే వివాహ రూపం యొక్క నీడలో మణిగిపోతుంది మళ్ళీ అది మొదట ఒక భాగంలో బయలు దేరి క్రమంగా సర్వత్రా వ్యాపించి సర్వ సాధారణ మవుతుంది ఒక దాని తర్వాత ఒకటి వచ్చిన ఈ రూపాల పరిణామం ఒకే దిశగా రక్తసంబంధీకుల నుంచి దంపతీ వ్యవస్థ వేపు సాగుతుంది ఈ వివిధ రూపాలలో మానవ జాతి పురోగమిస్తూన్నా, మధ్య మధ్య అటూ యిటూ మినహాయింపులున్నా, సాధారణ

రూపంలో రక్త సంబంధీకుల కుటుంబం, పునలాన్ కుటుంబం, ఆటవిక యుగానికి చెందినవి అందులో రక్త సంబంధీకుల కుటుంబం ఆటవిక యుగం దిగువ దశకు చెందితే, పునలాన్ కుటుంబం దాని ఎగువ దశలో పుట్టి అనాగరిక యుగం దిగువ దశలో కంటా వ్యాపించి వుంటుంది అలాగే సింథియాస్మియన్ అనాగరికయుగం దిగువ దశ, మధ్య దశగుండా ఎగువ దశలోకి కొనసాగుతుంది దంపతీ కుటుంబం అనాగరిక యుగం ఎగువ దశలో వచ్చి నాగరిక దశలో కంటా కొనసాగుతూంది

యాత్రికులు, పరిశీలకులు చెప్పిన పాక్షిక వర్ణనలతో వివిధ అనాగరిక తెగలలో సింధియాస్మియన్ కుటుంబం జాడలను పట్టుకునే ప్రయత్నం అనవసరం. ప్రతి చదువరీ పైన చెప్పిన సమాచారాన్ననుసరించి తనకు తెలిసిన విషయాలను వర్తింప చేసుకోవచ్చు అనాగరిక యుగం దిగువ దశలో వున్న అమెరికన్‌లలో, మనం చూసిన నాటికి వాళ్ళతో సింథియాస్మియన్ కుటుంబం అమలులో వుంది స్పానిష్ రచయితలు యిచ్చిన సమాచారం అనిర్దిష్టంగా, అస్పష్టంగా వున్నా అనాగరిక యుగం మధ్య దశలో వున్న గ్రామ వాసి ఇండియనులలో అప్పుడున్న వివాహ రూపం అదే వారు సామూహిక గృహాలలో నివశిస్తున్నారన్న సమాచారమే సింథియాస్మియన్ కుటుంబ రూపాన్ని దాట లేదనటానికి సాక్ష్యం దంపతీ కుటుంబం వుంది అన్నప్పుడు వూహించే వైయక్తిక స్థితికాని, మూడో వారి ప్రవేశయంలేని రూపం కాని దానికిలేదు

పూర్వార్ధ గోళంలో అక్కడక్కడ ప్రాంతీయ సంస్కృతితో వైదేశిక అంశాలు మిశ్రం అయి సమాజంలో ఒక అసాధారణస్థితి ఏర్పడింది నాగరిక జీవితానికి సంబంధించిన కళలను ఆటవికులు, అనాగరికులు తమ అవసరాలకు ఆలోచనలకు అనుగుణంగా సర్దుకున్నారు అనేక ఆఫ్రికన్ తెగలలో, హాటెన్‌టాట్‌లలో ఎంతో కాలం క్రితమే కాకిరాయిని కరిగించి యినుము తీయడం తెలుసును విదేశీయుల నుంచి సంపాదించిన జ్ఞానంతో మోటుపద్ధతులతో లోహం కరిగించి మొనదైన పనిముట్లు ఆయుధాలు తయారు చేసుకున్నారు కేవలం సంచార జీవులుగా వున్న తెగలలో కూడ కొన్ని విశిష్టతలు కనిపిస్తాయి ఆ విశిష్టతలు వారి జీవన పద్ధతిలో ఏర్పడినవి ఎలా వచ్చాయో తెలియదు ఉన్నత స్థితిలో వున్న తెగల ప్రభావంలో అనేక తెగల యొక్క స్థానిక సంస్కృతులు వెనుకబట్టటం, వారి పురోగతి సహజంగా జరుగకుండ వంకర రూపంలో విస్తరించడం కనిపిస్తుంది తత్ఫలితంగా వాళ్ళ సామాజిక స్థితి అచారాలు మార్పు పొందాయి

ఎక్కడెక్కడ ప్రజల ఆచారాలు స్వచ్ఛముగా వున్నాయో ఆ ప్రదేశాలలో వచ్చిన సమాజాభివృద్ధిని పరిశీలించడానికి మానవ శాస్త్రంలో క్రమ బద్ధమైన అభివృద్ధి అవసరం ఆటవిక సమాజాన్ని అధ్యయనం చేయడానికి పాలినీషియా, ఆస్ట్రేలియాలు తగిన ప్రదేశాలని యింతకు పూర్వం చెప్పాను వారి ఆచారాలు అలవాట్లు, సంస్థలు, కల్పనలు, అన్వేషణలు వట్టి ఆటవిక జీవితాన్ని తెలుసుకోవచ్చును ఉత్తర దక్షిణ అమెరికాలను కనుక్కున్నప్పుడు, అనాగరిక యుగం దిగువ మధ్య దశలలో సమాజం ఎలా వుంటుందో తెలుసుకోవడానికి మంచి అవకాశాలు లభించాయి ఒక్క ఎస్కిమోలు మినహా రక్త సంబంధాలు, వంశ పారంపర్యాలలో ఒకే మూలానికి చెందిన ఆదివాసులు ఒక మహా ఖండాన్ని ఆక్రమించుకున్నారు మచ్చిక చేయగల జంతువులు లేవు అనేది తప్ప ఇది ప్రాచ్య ఖండాల కన్న మానవ వికాసానికి ఎంతో తగినది యితరుల ప్రమేయం లేకుండ స్వతంత్రంగా అభివృద్ధి పొందడానికి ఎంతో అవకాశం వుంది ఆటవిక దశలో వుండగా వారు అక్కడికి వచ్చారని కనిపిస్తుంది గణ విర్మాణంతో గ్రీకులు, రోమనుల పూర్వీకులతో కనిపించిన అభివృద్ధి యొక్క బీజాలు ప్రారంభం చేశారు అమెరికాలోని ఆదివాసులు ఆసియాలో నుంచి వచ్చిన వారేనని భావిస్తున్నారు ఆ విధంగా మానవ జాతి అంతా ఒక మూలం నుంచి వచ్చిందేనని, భావిస్తున్నారు అమెరికాలోకి ఆటవికుల బుద్ధి పూర్వకముగా వలస వచ్చి వుండరేదని సముద్రపు ఆటు పోట్లూ వాయువ్య కోస్తాలోని సముద్ర ప్రవాహాలూ ఫలితంగా వారు విడబడి పోయారని చెప్పడానికి ఎంతో సాక్ష్యం లభిస్తుంది ఇక్కడ విజాతీయుల ప్రభావం ఏ మాత్రం లేని పరిస్థితులలో ఆ ఆటవికులు తమతో తెచ్చుకున్న అతి ప్రాథమిక భావాల నుంచి స్వతంత్రంగా పరిణామం పొందసాగారు ప్రభుత్వం గురించి, కుటుంబం గురించి, గృహ జీవితంగురించి, ఆస్తి గురించి, జీవనోపాధి మెలకువలను గురించిన భావాలూ అలాగే వృద్ధి పొందాయి వాని ఆచారాలు, కల్పనలు, అన్వేషణలు ఆటవికదశ నుంచి అనాగరిక యుగం దిగువ మధ్యదశల గుండా స్వతంత్రంగానే అభివృద్ధి పొందాయి ఆ ప్రాథమిక భావాల క్రమాభివృద్ధిని అక్కడ చూస్తాము

ఇరాక్వోలలోనూ మిసిసిపి నదికి తూర్పుగా వున్న అమెరికన్ తెగలలో కనిపించినంత స్పష్టంగా అనాగరిక యుగపు దిగువ దశ మరెక్కడా కనపడదు. స్థానికంగానే పుట్టి మరో సంపర్కం లేని కళలతో శుద్ధం, స్వతంత్రం అయిన ఆచారాలతో ఈ యుగపు సంస్కృతి సంపూర్ణ రూపంలో మనకు కనబడుతుంది

దానిలో వున్న వివిధ అంశాలు, దాని విస్తృతి, దానికి గల అవకాశాలు తెలుస్తాయి ఇవన్నీ అవశ్యం కాక పూర్వమే వీనిని ఒక క్రమ పద్ధతిలో బయటకు తీసుకురావాలి

న్యూమెక్సికో, మెక్సికో, మధ్య అమెరికా, గ్రెనడా, ఈక్వెడార్, పెరూలలోని గ్రామవాసి యిండియనులు అనాగరిక యుగపు మధ్య దశలో పైన చూసిన దానికన్న వున్నత స్థాయి జీవితానికి గుర్తుగా వున్నారు ఈ స్థితిలోవున్న సమాజం, దాని కళలు, కల్పనలు, గృహ నిర్మాణ వాస్తువు ప్రాథమిక దశలో వున్న చేతి పనులు, ప్రారంభ మవుతూ వున్న విజ్ఞాన శాస్త్రాలతో 16వ శతాబ్దంనాడు ప్రపంచంలో మరెక్కడా కనపడలేదు ఎంతో ఉపయోగకరమైన ఈ రంగంలో అమెరికన్ శాస్త్రవేత్తలు చేసిన పని చాల తక్కువ నిజానికి ప్రాచీన సమాజంలోని ఆ ఘట్టం కనబడకుండానే పోయింది అదృష్ట వశాత్తు అమెరికాను కనుక్కోవడంతో యూరపియన్ పరిశీలకుల ముందు అది ప్రత్యక్షమైంది కాని వారు దానర్థం చేసుకోలేదు దాని నిర్మాణాన్ని తెలుసుకోలేదు

అనాగరిక యుగం ఎగువ దశలో వున్న సమాజం యొక్క పరిస్థితి ఈనాడు మనకెక్కడా కనబడదు కానీ గ్రీకు రోమను సంప్రదాయాలలోను, చరిత్రలోను తరువాత కాలం నాటి జర్మన్ తెగలలోను దానిని కనుక్కోవచ్చు వారి ఆచారాలు, కల్పనలు, అన్వేషణలను పట్టి దానిని ఊహించాలి ఆ కాలం నాటి సంస్కృతిని తెలుపుతూ ఎంతో సమాచారం, ముఖ్యంగా హోమర్ కవితలలో దొరుకుతూంది

సమాజం యొక్క ఈ వివిధ పరిస్థితులను అవి బాగా కనిపిస్తూన్న ప్రదేశాలలో అధ్యయనం చేసి పూర్తిగా అవగాహన చేసుకుంటే అటవిక స్థితి నుంచి అనాగరిక దశ ద్వారా, నాగరిక దశకు మానవుడు పొందిన అభివృద్ధి క్రమం పరస్పర సంబంధం కల సమగ్ర రూపంలో కనిపిస్తుంది మానవుని అనుభవక్రమం కూడ యించుమించు ఒకే రకమైన పంథాలో నడిచిందని కూడ తెలుస్తుంది

సెమిటిక్ తెగలలోని పితృస్వామిక కుటుంబం గురించి కొద్దిగా చెప్పాలి దానిని నిర్వచించడం కన్న విశేషం ఏమీ వుండదు అది అనాగరిక యుగపు ఎగువ దశలో వచ్చింది నాగరికత ప్రారంభమయ్యాక కొద్ది కాలమే వుంది దీనిలో ముఖ్యంగా నాయకులు బహు భార్యాత్వం గలిగి వుండేవారు కాని పితృస్వామిక కుటుంబం యొక్క ప్రధాన లక్షణం యిదికాదు కట్టు బానిసలు, స్వతంత్రులు అయిన కొంతమంది వ్యక్తుల్ని కుటుంబ పెద్ద యొక్క ఆధిపత్యంలో వుంచుతూన్న నిర్మాణంయిది టూముల్ని

వ్యవసాయం చేయడం, పశులు, పశువుల మందల్ని కాపాడడం ఈ కుటుంబం యొక్క ప్రధాన లక్షణం కట్టు బానిసలుగా పట్టుకొన్న వాళ్ళూ, కూలి పనికివచ్చిన వాళ్ళూతో, దాంపత్య సంబంధాలతో కుటుంబ పెద్ద నాయకుడుగా ఏర్పడ్డదే పితృస్వామిక కుటుంబం కుటుంబ సభ్యుల మీద, ఆస్తుల మీద యాజమాన్యం దాని భౌతిక లక్షణం అంతకు పూర్వం దాసుల్ని తమ మీద ఆధారపడ్డ బంధువుల్ని కుటుంబంలో కలుపుకోవడం ఎఱుగరు పితృస్వామిక కుటుంబంలో బహు భార్యాత్వం కన్న దానికి స్వతంత్ర నిర్మాణ లక్షణాలను యిస్తున్నవి యివే ఈ కుటుంబాన్ని సృష్టించిన సెమెటిక్ సమాజం యొక్క పురోగతిలో గుంపు మీద పెత్తనం కోసం ఇది వచ్చింది దానితో వ్యక్తుల యొక్క పెద్దరికం వచ్చింది రోమను కుటుంబంలో తండ్రి అధికారం (ప్యాట్రియా ప్రొటెస్టాస్) ఈ కారణాలతోనే వచ్చింది ఆయన సంతానం వారి తరతరాలు, బానిసలు సేవకులు ఈ కుటుంబంలో వుంటారు కుటుంబం (Family) అన్న పేరు దాని నుంచే వచ్చింది ఆ కుటుంబ సభ్యులందరి మీద చంపేందుకు సహా అధికారం ఆ తండ్రికి వుంది కుటుంబ సభ్యులు సృష్టించిన ఆస్తి మీద పూర్తి అధికారం ఆయనది ఈ కుటుంబ పితకు (పేటర్ ఫెమిలియాస్) బహు భార్యలు లేకపోయినా ఆయన పితయే (పేట్రియార్క్) ఆయన కిందవున్న కుటుంబం పితృస్వామికమే గ్రీకు తెగలలోని ప్రాచీన కుటుంబానికి కూడ యింతగా కాకపోయినా యివే లక్షణాలు వుండేవి అంతకు పూర్వం మనిషి గణంలో యిమిడి వుండేవాడు ఇప్పుడు దానిని మించి పెరుగుతూ, స్వతంత్ర జీవితం కోసం విస్తృతమైన స్వతంత్ర కార్యరంగం కోసం పెనులాట పడుతున్న, ఒక ప్రత్యేకమైన మానవ పురోగతి దశను ఈ కుటుంబం చూపిస్తుంది ఈ దశలో అది తన నిర్దిష్టమైన లక్ష్యాలను సాధించాలంటే దంపతీ కుటుంబం ఏర్పడాలి అటువైపే ఈ నడక అంతవరకు ఏ కుటుంబంలోను కనబడని స్పష్టమైన ఈ లక్షణాలు పితృస్వామిక కుటుంబానికి వున్నత స్థానం కలిగించాయి మానవుని అనుభవాలలో హీబ్రూల, రోమనుల కుటుంబ రూపాలు ఒక ప్రత్యేకమైనవి రక్త సంబంధీకుల కుటుంబాలలోను, పునలాన్ కుటుంబాలలోను తండ్రి అధికారం అసాధ్యం ఎక్కడా చూడలేదు సింథియాస్మియన్ కుటుంబంలో దాని ప్రభావం ఛాయగా కనిపించింది అయితే అది అంతకంతకు స్వతంత్రం కాసాగిన కొద్దీ బలపడసాగింది దంపతీ కుటుంబం ఏర్పడి పిల్లల తండ్రితనం స్పష్టమైన తర్వాత, పూర్తిగా నిలదొక్కుకుంది

రోమను తరహా పితృస్వామిక కుటుంబంలో తండ్రి అధికారం హద్దులు దాటి అత్యధికమైన పెత్తనం ఏర్పడింది

హిబ్రూ పితృస్వామిక కుటుంబం క్రొత్త తరహా రక్తబంధుత్వాలను సృష్టించ లేదు తురానియన్ వ్యవస్థయే ఆ బంధుత్వాలలో కొన్నిటిని సరిదిద్దుతూంది కాని అది తర్వలోనే అంతరించి దంపతీ కుటుంబం సర్వత్రా ఏర్పడడంతో గ్రీకులలోను, రోమనులలోను ఆర్యన్ వ్యవస్థ ఏర్పడినట్లే, సెమిటిక్ బంధుత్వ వ్యవస్థను తురానియన్ వ్యవస్థ అధిగమించింది మలయన్, తురానియన్, ఆర్యన్ వ్యవస్థలు మూడు, సమాజ పురోగతిలోని మూడు సుస్థిర నిర్మాణ రూపాలను సూచిస్తున్నాయి ఈ వ్యవస్థలు మూడు, మూడు కుటుంబ రూపాలలోని బంధుత్వాలను నమోదు చేస్తూ వాటి వునికిని ధృవపరుస్తున్నాయి

ఐదవ ప్రకరణము

# దంపతీ కుటుంబం

మిగిలిన వానితో పోలిస్తే ఈ కుటుంబ రూపం ఆధునికం—ఫ్యామిలియా అంటే — ప్రాచీన జర్మనుల కుటుంబం — హోమరు కాలంనాటి గ్రీకుల కుటుంబం — నాగరికులైన గ్రీకుల కుటుంబం — భార్యలకు ఘోషా—దంపతీ కుటుంబపు బాధ్యతలను మగవాడు లెక్క చేయడు — రోమను కుటుంబము — అధీనంలో భార్యలు — ఆర్యన్ రక్త బంధుత్వ వ్యవస్థ — అది దంపతీ కుటుంబంలోనే వచ్చింది— అంతకు పూర్వం తురానియన్ వ్యవస్థ వుండాలి— తురానియన్ నుండి ఆర్యన్ వ్యవస్థకు మార్పు — రోమన్ అరబిక్ బంధుత్వ వ్యవస్థలు— రోమన్ బంధుత్వ వ్యవస్థల వివరాలు—వర్తమాన కాలపు దంపతీ కుటుంబం — రోమను అరబిక్ వ్యవస్థల పట్టిక

దంపతీ కుటుంబం వరకు సమాజ నిర్మాణాన్ని వరుసగా చూపిస్తూవచ్చాక ఈ కుటుంబం యించు మించు యిటీవలిది అనిచెప్ప వలసి వుంది దీనిలో ఒక కొత్తదనం వుంది సమాజం పుట్టుక గురించి తార్కిక దృష్టితో సమాలోచించిన రచయితలకు సమాజానికి కుటుంబమే మూలయూనిట్‌గా కనబడింది అసలు కుటుంబం అంటే దంపతీ కుటుంబమే అనిపించింది వివాహితులైన జంట చుట్టూ కొందరు వ్యక్తులు- వారిలో కొందరు సేవకులు- వారి అధికారంలో వుండడం అవసరమని వారి భావన ఆ విధంగా పితృ స్వామిక కుటుంబంతో సమాజం ప్రారంభం అయిందని అభిప్రాయ పడ్డారు వాస్తవానికి లాటిన్, గ్రీకు, హీబ్రూ తెగలలో మనకు కనిపించిన అతి ప్రాచీన నిర్మాణ రూపం అదేమరి ఆ విధంగా ఆ ప్రాచీన సమాజానికి పితృ స్వామిక కుటుంబం ఒక నిర్మాణ రూపం అనీ, అది లాటిన్‌లలోనో, హీబ్రూలలోనో పుట్టిందనీ, ఈ నిర్మాణం యొక్క ప్రధాన లక్షణం తండ్రి పెత్తనం అనీ భావించారు.

అనాగరిక యుగపు చివరిదశలో కనిపించిన గణాన్ని దంపతీ కుటుంబం తర్వాత వచ్చినట్లు తప్పుగా అర్థం చేసుకున్నారు అనాగరిక తెగలలోను అటవిక తెగం లోను వున్న ఆచారాల పరిజ్ఞానం కొంతైనా వుంటే తప్ప మన ఆచారాలను అర్థం చేసుకోలేము సామాజిక వ్యవస్థకుమూల యూనిటు దంపతీ కటుంబం అనే భావంతో గణం అన్నది కొన్ని కుటుంబాల సమూహం అనీ, తెగ అన్నది కొన్ని గణాల సమూహమనీ, కొన్ని తెగల సమూహము జాతి అని అభిప్రాయ పడ్డారు యిది ప్రారంభం లోనే తప్పు గణాలు సంపూర్ణ రూపంలో ఫ్రాట్రీలో ప్రవేశిస్తాయి ఫ్రాట్రీ తెగలోకి, తెగ జాతిలోకి చేరుతాయని యిది వరకే చెప్పాను కాని కుటుంబం మాత్రం పూర్తిగా గణంలో చేరలేదు ఏమంటే భార్యా భర్తలు విడివిడిగా వేరు వేరు గణాలకి చెందిన వారై వుండాలి ఇటీవలి వరకు భార్య తన తండ్రి గణం పేరే చెప్పుకునేది రోమను లలో కూడ ఆమె తండ్రి పేరునే ధరించేది ఒకటి మరొక దాంట్లో చేరాలంటే దాని భాగాలన్నీ చేరవలసి వుంటుంది అందుచేత గణసంస్థకు కుటుంబం యూనిట్ కాజాలదు గణమే ఒక యూనిట్ ఆటవిక దశలో,అనాగరిక యుగపుదిగువదశలో బహుశా మధ్య దశలో కూడ, ఎగువ దశలో చాల దూరం పోయాకగాని రోమను తరహాది హీబ్రూల తరహాది కూడా పితృస్వామిక కుటుంబం అపరిచితం గణం ఏర్పడ్డ తర్వాత ఎంతెంతో కాలం గడిచిపోయాక దంపతీ కుటుంబం వచ్చింది అది స్థిరపడడం కూడ నాగరికత వచ్చాకనే జరిగింది

లాటిన్ తెగలలో Familia అనే పదంనుంచి ఫామిలీ(family) కుటుంబంఅనే మాట వచ్చింది Famulus అంటే సేవకుడు ఇది ఓస్కాన్‌ల Famel=servus= బానిస అనే మాట నుంచి వచ్చిందంటారు మొదట్లో ఈ ఫామిలీ పదానికి వివాహితులైన జంటతో గాని వారి పిల్లలతో గాని సంబంధం లేదు పేటర్ ఫెమిలియా యాజమాన్యం క్రింద దాని నిర్వహణకై శ్రమ చేసే బానిసలు, సేవకుల సమూహం అంతె దాని అర్థం కొన్ని దస్తావేజుల్లో ఫామిలియా అంటే ఆస్తి వారసత్వం ఈ పదాన్ని లాటిన్ సమాజంలో ఒక నిర్మాణానికి ఉపయోగించారు భార్యను, పిల్లలను, పనివాళ్ళను తన పెత్తనం క్రింద ఒక కుటుంబం పెద్ద చేర్చి పెట్టుకున్న ఒక నిర్మాణమది- "ఫామిలియా అంటే సేవకుల సమూహము" అంటాడు మోమ్‌సెన్ అందుచేత లాటిన్ తెగంలో వ్యవసాయం వచ్చాక, బానిసత్వం ఏర్పడ్డాక గ్రీకులనుంచి విడి పోయాక, ఏర్పడ్డ ఇనుప చట్రం లాంటి నిర్మాణం వచ్చాకనే ఈ పదం వచ్చిందని

అనుకోవాలి అంతకు పూర్వం కుటుంబం అనే దానికి ఏదన్నా పేరు వున్నదేమో తెలియదు

రక్త సంబంధీకుల, పునలాన్ కుటుంబం ఈ రెండు రూపాలలోను తండ్రి పెత్తనం అసంభవం పునలాన్ జట్టు, నడుస్తూండగా గణం ఏర్పడింది అందులో, ఆ జట్టులోని అక్కచెల్లెళ్ళు, వారి పిల్లలు, స్త్రీ పారంపర్యంలో వారి సంతానం గణంలోకి చేర్చబడ్డారు అది సామాజిక వ్యవస్థకు యూనిట్ అయింది దీనిలో నుంచి క్రమంగా సిండియాస్మియన్ కుటుంబం వచ్చింది దానితో తండ్రి అధికారానికి బీజం పడింది మొదట్లో ఈ అధికారం వుండీవుండనట్లు క్షీణ రూపంలో వున్నా, ప్రారంభం అయి క్రమంగా పెరిగి, సమాజాభివృద్ధితో పాటు దంపతీ కుటుంబ లక్షణాలు బలపడిన కొద్దీ, అదీ బలపడింది ఆస్తి అనేది ఎక్కువగా ఏర్పడడం, దానిని కొడుకుల కివ్వాలనే కోరికతో గణంలో స్త్రీ పారంపర్యం స్థానంలో పురుష పారంపర్యం వచ్చింది అప్పుడే కుటుంబంలో తండ్రి పెత్తనానికి అసలు పునాది ఏర్పడింది మనకు తెలిసినంత వరకు హీబ్రూ, లాటిన్ తెగలలో - మొట్టమొదట హీబ్రూ, తరవాత హీబ్రూలలో, రోమన్ తరహా పితృస్వామిక కుటుంబము రోమనులలో ఏర్పడి కనిపిస్తుంది ఈ రెండు సందర్భాలలోను కూడ కొందరు తమ కుటుంబాలతో సహా సేవకులలాగ ఒక పెద్ద కింద వుండడం అనేది కనిపిస్తుంది తండ్రి పెత్తనం రోమను కుటుంబంలో లాగ తీవ్ర రూపం ధరించినది మరెక్కడా లేదు ప్రధానంగా వాళ్ళకే అది పరిమితం రోమను తండ్రికి అతని పిల్లల మీద గల అధికారం రోమనులలో మాత్రమే వున్నదని అటువంటి అధికారం మరెవ్వరిలోను కనపడదని గయస్ వ్రాస్తూ మిగిలిన వానితో పాటు చంపే అధికారం కూడ అతనికి వుంది అన్నాడు దంపతీ కుటుంబం యొక్క లక్షణాలను చెప్పడానికి ప్రాచీన కాలపు రచయితలు దానిని గురించి వ్రాసిన విషయాలు కొన్ని వుదహరిస్తాను అనాగరిక యుగపు ఎగువదశలో దంపతీ కుటుంబం ఒక స్పష్టమైన రూపంలో కనిపిస్తుంది అంతకు చాల కాలం పూర్వమే దాని లక్షణాలు కొన్ని అంతకు పూర్వం వున్న సిండియాస్మియన్ కుటుంబంలోనే కనపడి వుంటాయి కాని దంపతీ కుటుంబంలోని అతి ముఖ్య లక్షణమైన "నాతిచరామి" అనేది సిండియాస్మియన్ కుటుంబంలో స్పష్టంగాచెప్పడం సాధ్యంకాదు

ప్రాచీన జర్మనుల కుటుంబంలో అతి ప్రాచీనమైన కొన్ని వుదాహరణలు కనిపిస్తాయి వారి ఆచారాలు స్థానికంగా, శుద్ధంగా వున్నాయి వారు నాగరికత వైపు పురోగమిస్తున్నారు కుటుంబంలో ఎవరుంటారు, దాని లక్షణాలు ఏమిటి చెప్పకుండానే

టాసిటను వారిలోని వివాహాచారాలను గురించి కొన్ని మాటలు చెప్పారు వారిలో వివాహాలు చాల ఖండితంగా వుంటాయి అని అభినందిస్తూ అనాగరిక ప్రజలెవ్వరి లోను కనపడని విధంగా వారు ఒక్క భార్యతోనే కట్టుబడి వుంటారు అన్నారు కొద్ది మంది ఎక్కువ మంది భార్యలను పెట్టుకుంటారు కాని అది వాంఛతో కాక హోదా కోసం ఆ పని చేస్తారన్నారు భార్యలు కట్నం తీసుకురారు భర్తలే భార్యకు ఒక జీను వేసిన గుఱ్ఱాన్ని, ఒక డాలును, కత్తిని, బల్లేన్ని ఓలిగా యిస్తారు ఈ బహుమతులతో భార్యను స్థిరపరుచుకున్నట్టు గుర్తు ఇవి ఒక విధంగా కొనుక్కునేటందుకు యిచ్చిన బహుమతులు వంటివి పూర్వం రోజుల్లో వధువు యొక్క గణ బంధువుల కిచ్చి వుంటారు యిప్పుడవి వధువుకే యిస్తున్నారు

మరోచోట దంపతీ వ్యవస్థయొక్క అసలు తత్వాన్ని చూపించే రెండింటిని చెప్పారు ఒకటి మగవాడు ఒక్క భార్యకే కట్టుబడి వుంటాడు ఆడుది పాతివ్రత్యం (chastity) తో వుంటుంది వేరువేరు యుగాలలో కుటుంబంయొక్క పరిస్థితిని తెలుసుకున్న తరువాత ప్రాచీన జర్మనులలోని ఈ నిర్మాణం చాలబలహీనంగా వుందని ఒంటరిగా జీవితపు యిబ్బందులను తట్టుకోలేక బంధు కుటుంబాలు కలిసి ఏర్పడిన సామూహిక గృహంలో వుండేవారని అనుకోవచ్చు బానిసత్వము అన్నది స్థిరపడినాక ఈ సామూహిక గృహాలు అదృశ్యమవుతాయి దంపతీ కుటుంబం వున్నతరూపం ఏర్పడడానికి తగినంతగా జర్మన్ సమాజం అభివృద్ధి పొందలేదు

హోమరు కాలంనాటి గ్రీకులలో దంపతీ కుటుంబం చాలా అధమ స్థితిలో వుంది భర్తలు, తమ భార్యలు పతివ్రతలుగా వుండాలంటారు దానిని అమలు జరప డానికై కొంతవరకు రాణీవాసం ఏర్పరిచారు అయితే భార్యల పాతివ్రత్యం సుస్థిరంగా నిలువగల విధంగా తమరుకూడ ఒక భార్యకు కట్టుబడి వుండాలనే బాధ్యతను వారు పాటించలేదు మగవాడు గౌరవించగల హక్కులు కొద్దివాటిని మాత్రమే స్త్రీలకు మిగిల్చారని హోమరు కవితల నుంచి తెలుస్తూంది ట్రాయ్ ప్రయాణంలో గ్రీకు నాయకులు తమ పడవల్లోకి తెచ్చుకున్న స్త్రీల యెడ హద్దు అపులేని విధంగా వ్యవహరించారు ఆ కవితలలో చెప్పిన ఘటనలు వాస్తవమో, అవాస్తవమో కాని ఆనాటి పరిస్థితి అది ఆ స్త్రీలు పట్టుబడిన వారేకావచ్చు కాని వారి యెడచూపిన అగౌరవాన్ని అవి తెలుపుతున్నాయి ఆమె హక్కులకు రక్షణలేదు ఆమె గౌరవాన్ని గుర్తించరు అచిల్లెస్ కోపాన్ని తగ్గించడానికి మంచి అందగత్తెలయిన ఏడుగురు లెస్బియన్ స్త్రీలను అతనికి యిస్తానని గ్రీకు నాయకుల సమితిలో అగమెమ్నాన్

ప్రకటించాడు నగరం పట్టుబడిన తర్వాత తనకొచ్చే దోపిడీ వాటాలోని వాళ్ళు ఆ ఏడుగురూను ఆ ఏడుగురిలో బ్రిసీస్ కూడ ఒకతె. నగరం పట్టుకొన్న తరువాత హెలెన్ అంత అందగత్తెలయిన 0 మంది ట్రోజన్ స్త్రీలను ఏరుకునేందుకు హక్కు కూడ యిస్తానన్నాడు వీరయుగంలో సిగ్గుఅనేది లేకుండ "సుందరి—సంపద" అనేవి ఊత పదాలుగావుండేవి పట్టుబడిన స్త్రీల యెడ వారు వ్యవహరించే తీరుమబట్టి ఆనాడు స్త్రీలయెడ సర్వసాధారణంగా వ్యవహరించేతీరు అర్థం అవుతుంది తమ శత్రువుల యొక్క పైతృక, వైవాహిక, వైయక్తిక హక్కుల గురించి లెక్కచేసే వారు కాదు. ఆ విషయంలో తమ హక్కుల్ని గురించికూడ వారికి పెద్దగౌరవం వుండడానికి అవకాశంలేదు

అవివాహితుడైన అచిల్లెస్‌యొక్క, అతని స్నేహితుడు పెట్రోక్లిస్ యొక్క గుడారజీవితాన్ని గురించి వర్ణిస్తూ హోమరు నాయకుడుగా అచిల్లెస్ హోదానుప్రతిష్ఠను చూపడానికై అతడు మంచి అందంగా కట్టిన గుడారంలో, ఒకస్త్రీతో పడుకొని వున్నాడని, ఆమె లెస్బోస్‌నుంచి తీసుకొచ్చిన పాలబుగ్గల ఢయోమిదే అని వ్రాస్తాడు పెట్రోక్లిస్‌కూడ సన్నని నడుముగల ఇఫిస్‌ను ప్రక్కలో పెట్టుకొని పడుకున్నాడని వర్ణిస్తాడు ఆమెను సైరోస్‌నుంచి ఎత్తితెచ్చి అచిల్లెస్ అతనికిచ్చాడు వివాహితులలోను, అవివాహితులలోనువున్న ఈ ఆచారాలను అలవాట్లను ఆ మహాకవి మెచ్చుకోలుగానే చెప్పాడు ప్రజాభిప్రాయం కూడ దానినే బలపరిచింది దీనినిపట్టి ఏకపత్నీ, పతి (దంపతీ)వివాహం అనేదివున్నా అది భార్యలమీదనే నిర్బంధంగా వర్తింపచేస్తున్నారు అధికసంఖ్యలో భర్తలు దానికి కట్టుబడి వుండడమే లేదు అంటే అటువంటి కుటుంబంలో సిండియాస్మియన్,దంపతీ కుటుంబ లక్షణాలు రెండూ వున్నాయని అర్థం

నాగరికత ప్రారంభమయ్యే నాటికి— అటు తర్వాత బాగా అభివృద్ధి పొందిన వాడుకన్న—వీరయుగంలో స్త్రీల పరిస్థితి చాల అనుకూలంగా వుందనీ, ఇంట్లో వారికి గౌరవనీయమైన స్థానం వున్నదనీ చెప్తారు చాలాకాలంక్రితం— పురుషపారంపర్యానికి మార్పురాకపూర్వం— అది నిజమేకావచ్చు కాని వీరయుగంనాడు అటువంటి స్థితి వుందనడానికి అవకాశంలేదు జీవిత పద్ధతి,జీవిత ఆదరువుల విషయంలో పెద్ద మంచి మార్పే వచ్చింది కాని అనాగరికయుగం ఎగువదశలో స్త్రీ యొక్క నిజమైన స్థితి చాల భిన్నంగా వుంది

స్త్రీ పారంపర్యం నుంచి పురుషపారంపర్యానికి మార్పువచ్చినపుడు తల్లి, భార్యల పరిస్థితి, హక్కులూ నష్టపడ్డాయని పైన చెప్పాను ఆమె పిల్లల్ని ఆమె

స్వంతగణం నుంచి మార్చారు వివాహంతో గణంలోవున్న ఆమె హక్కులు పోయాయి దానికి సమానమైన హక్కులు మరేవీ రాలేదు ఈ మార్పు రాకపూర్వం యింట్లో ఆమెగణం వారికే ప్రాధాన్యత వుండేది అందుచేత తల్లితో అనుబంధం దృఢంగా వుండేది కుటుంబానికి కేంద్రం మగవాడుకాక ఆడదే అయివుండేది ఈ మార్పువచ్చాక మగని యింట్లో ఆమెవంటరిదై పోయింది గణబంధువుల తోడులేదు అందుచేత తల్లి అనుబంధం, బలం క్షీణించింది ఆమెస్థితిని హీనపరిచింది సమాజం యొక్క స్థాయిలో ఆమె పురోగతిని అటంకపరిచింది ధనిక వర్గాలలో ఆమెను బలవంతంగా రాణివాసాలలో వుంచేరు పెళ్ళిచేసుకోవడం అనేది, ఒకే భర్తనుంచి పిల్లల్ని కనడమే ప్రధానలక్ష్యంగా అయింది ఇవి వీరయుగంలో ఆమెకు చాలా వ్యతిరేకంగా పనిచేశాయి తర్వాతకాలంలో ఏం జరిగిందో మనవద్ద సమాచారం బాగానే వుంది

గ్రీకులలో మొదటినుంచీ మగవాళ్ళలో దురహంకారం, స్వార్థం పనిచేశాయి ఆటవికులకో కనిపించని విధంగా స్త్రీలను హీనపరచడం కనబడింది వారి గృహ జీవితంలోనే యిది కనబడుతుంది ఉన్నత తరగతులవారు బలవంతంగా పాతివ్రత్యాన్ని అమలు జరిపించేటందుకు భార్యలను రాణి వాసాలలో పెట్టారు మగవాడికి ఆ బాధ్యత లేకుండ చేశారు దీనిఅర్థం తురానియన్ పద్ధతి స్త్రీ పురుష సంబంధాలు యింతకు పూర్వం వుండేవని, వాటినుంచి రక్షించుకొనేటందుకే ఈ పద్ధతి ఉద్దేశించబడిందని చెప్పాలి శతాబ్దాల తరబడి ఈ ఆచారాలు గ్రీకు స్త్రీల మనస్సులమీద ముద్రపడి పోయాయని తాము హీనులమూ, అధములమూ అనే భావంనుంచి వారు, - గ్రీకులలో పురోగతి వచ్చినప్పుడుకూడ - బయటపడలేక పోయారని గ్రహించగలం మానవ జాతిలో ఈ విభాగాన్ని సింధియాస్మియన్ కుటుంబం నుంచి దంపతీ కుటుంబంలోకి తీసుకురావడానికై స్త్రీలు యిన్నిత్యాగాలు చేయవలసి వచ్చింది ప్రపంచాన్ని తమ మేధోజీవితంతో ఆశ్చర్యపరిచిన జాతి, తాము మంచి వున్నత నాగరికస్థితిలోవున్నప్పుడు స్త్రీల యెడ ఇంత అనాగరికంగా వ్యవహరించడం చాల ఆశ్చర్యం అనిపిస్తుంది స్త్రీలను హింసించలేదు, అగౌరవం చేయలేదు, వారికి పరిమితమైన పరిధిలో అనుకూలత కలిగించారు కాని వారికి విద్య నామమాత్రం చేశారు పురుషునితో సంబంధాలు నిరాకరించారు ఒక పద్ధతి ప్రకారం హీనులము అనే అభిప్రాయం మనస్సుకి పట్టించారు చివరికి స్త్రీలే ఆ స్థితిని అంగీకరించేటట్లు చేశారు భార్య భర్తతో సమానురాలుకాదు అతనికి తోడూ కాదు కుటుంబ ముఖ్య స్థానంలో పెద్దాయన ఆదే

దంపతీకుటుంబం మంచివున్నతరూపంలో వున్నప్పటి ప్రధాన నియమంనుంచి వాళ్ళను తప్పించారు భార్య హోదాలో, వ్యక్తిగత హక్కులలో, సామాజిక స్థితిలో తప్పని సరిగా భర్తతో సమానురాలే ఆధునిక సమాజంలోని ఈ మహా సంస్థను సాధించే టందుకై ఎంత ఓర్పు, ఎంత అనుభవము కావలసివచ్చాయో దీనినిపట్టి తెలుస్తూంది

చారిత్రకయుగంలో గ్రీకు కుటుంబము, గ్రీకు స్త్రీల పరిస్థితులను గురించి సమాచారం దండిగానే దొరుకుతుంది ఎంతో పరిశోధన చేసి ప్రధాన విషయాలను సమీకరించి వాటినిస్పష్టంగా బలంగా చెప్పాడు బెకర్, తన రచనలలో దానినిక్కడ సంగ్రహంగా నేను చెప్తున్నాను చారిత్రక యుగం నాటి స్త్రీల కన్న హోమర్ కాలంలో గృహాలలో స్త్రీల స్థానం గౌరవనీయంగా వుందంటూ, గ్రీకులలో సంస్కృతి వున్నత స్థాయికి చేరిన కాలంలో ప్రత్యేకించి ఏథెన్స్, స్పార్టాలలో స్త్రీల పరిస్థితిని గురించి ఆయన యిలా చెప్పాడు "అనుకూలుడైన బానిస స్థితికీ కుటుంబంలో స్త్రీ స్థితికీ పెద్ద తేడాలేదు ఆమెకు స్వాతంత్ర్యం అనేది పూర్తిగా లేక పోవడం చేత జీవిత కాలం మంతా వయసు రానట్లుగానే వుండి పోతుంది ఆడ పిల్లలకు స్కూళ్ళులేవు యింటి వద్ద ఉపాధ్యాయులు చెప్పరు తల్లులు దాదులది మాత్రమే ఏమన్న చెప్తే నూలు వడకడం, నేయడం, యితర ఆడ పనులు మాత్రమే నేర్పుతారు స్త్రీలలో సంస్కారం పెరగాలి అంటే సంఘంలో పురుషులతో కలిసి మెలిసి వుండడం అవసరం అది ఆమెకు లేకుండా చేశారు దగ్గర బంధువులతో కూడ కలవ నివ్వరు మగ వాళ్ళు చాల భాగం బయటే వుండడం యింటి వద్ద వున్నా తమ గదుల్లో వుండడం మూలంగా చివరకు తండ్రులు, మగళ్ళు కూడ అక్కడ కనిపించరు స్త్రీలు నివసించే యింటి భాగం జైలు అనలేం కాని, వారికి అందులోనే బతుకు ఏర్పాటు చేస్తారు పెళ్ళికాని పిల్లల విషయంలో మరీను పెళ్ళయ్యే దాక వారిని తాళంవేసి వుంచుతున్నారనవచ్చు పెళ్ళయిన తర్వాత ఆమె ఎప్పుడో గాని బయటకు రాదు వచ్చినప్పుడు మగనికి చెప్పి మరీ రావాలి ఆ విధంగా ఆమె ఆడ బానిసలతో తప్ప మరొకరితో సంబంధం కలిగి వుండదు ఇక వాళ్ళ భర్తలు ఆమెను తాళం వేసి గదిలో పెట్టినా ఎవ్వరూ కాదనలేరు కేవలం ఆడవాళ్ళకు మాత్రమే పరిమితమైన పండుగలు, వుత్సవాలలో మాత్రమే వాళ్ళు ఒకర్నొకరు చూసుకో గలరు అనందించనూ గలరు ఈ నిర్బంధం కారణంగా స్త్రీలు యింటి నుంచి కదలడమే కష్టం మగడు కుదిర్చిన బానిసదాని తోడు లేకుండ గౌరవనీయురాలెవరూ యిల్లు కదల కూడదు. ఈ విధమైన వ్యవహారం వలన ఆడపిల్లలలో సిగ్గు సంకోచం అతి

అయిపోయాయి కిటికీ వద్ద వుండగా ఏ మగవాడి కంటనయినా పడితే పెళ్ళైన ఆడదికూడ సిగ్గుపడి వెనక్కు తగ్గుతుంది గ్రీకులు పిల్లల్ని కనటానికే పెళ్ళి అన్నారు దేవతలయెడ, తమ పూర్వులయెడ, రాజ్యంయెడ అదొక కర్తవ్యం అన్నారు తర్వాత చాలా కాలం పోయాకగాని వివాహానికి మరో ప్రాముఖ్యం ఇచ్చేందుకు లేము స్త్రీ పురుషుల మధ్య వుండే బలమైన ఆకర్షణ వివాహానికి కారణముకాలేదు భార్యాభర్తల మధ్య వాంఛకుమించి ప్రేమ అనేది గుర్తించబడలేదు కామమే వారిమధ్య అనుబంధానికి కారణం ఏథెన్స్‌లో, బహుశా యితర గ్రీకు రాజ్యాలలో కూడ పెళ్ళికి ప్రధాన లక్ష్యం పిల్లల్ని కనడం అంతకు పూర్వం కనీసం పరిచయమైన లేకుండానే వధువును ఏరుతారు ఆమె కుటుంబం యొక్క హోదాకు, యిచ్చే డబ్బుకు, అంద చందాలకు మాత్రమే ప్రాధాన్యం చూపిస్తారు అటువంటి వివాహంలో నిజమైన అనుబంధం ఏర్పడదు తరచుగా నిర్లక్ష్యం, అసంతృప్తి మాత్రమే మిగులుతాయి పై వారెవరో భోజనంవద్ద వుంటే తప్ప భార్యాభర్తలు కలిసి భోజనం చేయరు తన యింట్లో కూడ నలుగురితో సంభాషణలో పాల్గొనడం, యాదృచ్ఛికంగా మగడు ఎవరన్నా స్నేహితుణ్ణి భోజనానికి తీసుకువస్తే అక్కడ వుండడం, స్త్రీలకు తగదు వ్యభిచారిణిగా లెక్కేస్తారు ఇల్లంతా విభాయించడం, పిల్లల్ని పోషించడం - అదీ భార్య పని మగ పిల్లల్ని ఒక ఉపాధ్యాయునికి అప్పజెప్పడం, ఆడ పిల్లల్ని పెళ్ళి చేసి పంపేయడం-అంత వరకూనే ఆమె బాధ్యత భార్యకు పరపురుషులతో స్నేహాన్ని చాలా తప్పుగా భావిస్తారు వాళ్ళని యింట్లో మూసి పెట్టడంచేత దారి తప్పడానికి అవకాశాలు వుండవు కాని మగవాని మోసగించడానికి తరుచుగా ఏదో మార్గం చూస్తూనే వుంటారు ఇంద్రియనిగ్రహం ఏకపక్షంగా విధిస్తుంది చట్టం మగడు తన భార్య తనకే కట్టుబడి వుండాలని కోరుతాడు ఏమాత్రం అటుయిటు అయినా చాల కఠినంగా వ్యవహరిస్తాడు కాని తను మాత్రం వుంపుడుకత్తెలతో పోతాడు ఈ పనిని ఆమోదించకపోయినా, సమాజం పెద్దగా తప్పు పట్టదు, వివాహపు హక్కులకు భంగ పరిచినట్టూ అనుకోదు బెకర్ యొక్క ఈ సమాచారం చారిత్రక యుగంనాటి కుటుంబం గురించి పూర్తిగా చెప్పకపోయినా గ్రీకుల కాలం నాటి కుటుంబానికీ ఆధునిక నాగరిక కుటుంబానికీ మధ్యనున్న ప్రధానమైన అంతరాన్ని చూపిస్తుంది దంపతీ కుటుంబం అభివృద్ధి పొందుతున్న ప్రథమ దశలలో ఎలా వుండేదో చూపిస్తుంది

బెకర్ చెప్పిన మాటల్లో గమనించ తగిన విషయాలు రెండున్నాయి వివాహం చేసుకున్న భర్తనుంచి పిల్లల్ని కనడం వివాహం యొక్క ప్రధాన లక్షణం- అని

చెప్పడం ఒకటి ఇందుకై స్త్రీలను మూసిపెట్టడం రెండవది ఈ రెంటికీ చాల దగ్గర సంబంధం వుంది ఇవి రెండూ అంతకు పూర్వంవున్న పరిస్థితులను కనబరుస్తున్నాయి అనాగరిక ప్రజలలో ప్రేమోద్రేకం తెలియదు ఇది నాగరికతతో వచ్చింది. ఇటువంటి భావం ఆనాడు లేదు గ్రీకులలో వున్న వివాహాచారాలను పట్టి వారికి వుద్వేగం తెలియదు-అని చెప్పవచ్చు అయితే ఎన్నో మినహాయింపులు లేకపోలేదు. గ్రీకుల అంచనాలో శారీరక సౌందర్యం ఆడవాళ్ళలో ప్రధానం అందుచేత వివాహము అనేది ప్రేమకోసం కాక అవసరముగా, కర్తవ్యంగా, భావించబడింది వివాహం విషయంలో ఇరాక్వ్యాలలోను, అజ్టెక్‌లలోను కూడ యిదే భావన నిజానికి అవసరం, కర్తవ్యం అనేవి అనాగరిక దశలో వచ్చాయి గ్రీకు తెగల పూర్వీకులు ఇంతకు పూర్వం అనాగరిక దశలో వుండేవారని అవి సూచిస్తున్నాయి గ్రీకు నాగరికత కాలంలో గ్రీకుల ఆదర్శకుటుంబ సంబంధాలను ఆ విధంగా చెప్పడంచూస్తే ఆశ్చర్యం వేస్తుంది ఆస్తి పెరగడం, దానిని సంతానానికి అందచేయాలనే కోరిక, నిజంచేత దంపతీ వివాహాన్ని తీసుకు రావడానికి కారణాలు. పిల్లలు అతని సంతానమే అయ్యేటట్లు చూడటం, ఆ దంపతుల సంతానానికి మాత్రమే ఆస్తిని పరిమితం చేయడం, ఈ వివాహ పద్ధతి యొక్క లక్ష్యం సిండియాస్మియన్ కుటుంబం వున్నప్పుడే పిల్లల తండ్రి తనం గుర్తు తెలుస్తూ వచ్చింది దానినుంచే గ్రీకు కుటుంబం వచ్చింది కాని వెనుకటి దాంపత్య నియమాలలో కొన్ని యింకా మిగిలి వుండడంచేత ఆ తండ్రితనానికి తగినంత స్పష్టతరాలేదు అనాగరిక యుగం ఎగువ దశలో భార్యలను మూసిపెట్టే క్రొత్త ఆచారానికి కారణం అదే ఆ కాలంనాటికి భార్యను మూసిపెట్టే అవసరం వుంది కనకనే ఆ ఆచారం వచ్చింది నాగరికులైన గ్రీకులలో స్త్రీలను నిర్బంధంగా దాచి వుంచడం కుటుంబ జీవితపు పథకంగా వుంది అంటే ఆ అవసరం ఎంత ఎక్కువగా వుందో అర్థం అవుతుంది పైన చెప్పిన వన్నీ ధనిక కుటుంబాలకు సంబంధించినవే అయినా, అవి ఆనాటి సర్వసాధారణ పరిస్థితిని చూపిస్తున్నాయి

రోమను కుటుంబం విషయం ఎత్తుకుందాం. అక్కడ కూడ పరాధీనత అదే, కానీ స్త్రీల స్థితి కొంచెం మెరుగు

స్త్రీలను ఏథెన్స్‌లో లాగనే రోములోనూ చూశారు కాని రోమను కుటుంబంలో ఆమె ప్రభావము, యాజమాన్యం ఎక్కువ కుటుంబానికి తల్లిగా ఆమె కుటుంబ యజమానురాలు మగని విషేదాలతో సంబంధం లేకుండా, స్వేచ్ఛగా వీధుల వెంట తిరిగి రాగలదు నాటకశాలలకీ, విందులకీ, మగ వాళ్ళతోపాటు వెళ్ళగలదు ఇంట్లో

ఆమెకి వేరే భాగాలుంటూ లేవు మగాళ్ళతో కలిసి భోజనానికి కూర్చోవచ్చు గ్రీకు స్త్రీలకు వున్న నిషేధాలు లేకపోవడంచేత రోమను స్త్రీలలో వ్యక్తిత్వం, స్వాతంత్ర్యం ఎక్కువ వున్నాయి శాబైన్ స్త్రీలు కలుగచేసుకున్నందు చేతనే శాబైన్లతో సంధి కుదిరిందని వారికిఎన్నో గౌరవనీయమైన సౌకర్యాలు యిచ్చారని ప్లూటార్క్ వ్రాశాడు. వీధిలో ఎదురైనపుడు మగవాడు స్త్రీకి దారియిస్తాడు స్త్రీల ఎదట మోటుగా మాట్లాడ కూడదు దిగంబరంగా కన్పించకూడదు అయితే వివాహం ఆమెను భర్త అధీనం చేస్తుంది వివాహం అవడంతో తండ్రి రక్షణ తొలగింది కనుక, భర్త రక్షణ యిస్తాడనే అవసరం చూపి ఆమెను అతని స్వాధీనంలో వుంచారు భర్త భార్యను తనతో సమానురాలిగాకాక తన రక్షణలోని కూతుర్నిలాగ చూస్తాడు ఆమెను దిద్దే అధికారం అతనికుంది దారి తప్పితే చంపివేసే అధికారం కూడ అతనికుంది అయితే ఈ చివరి దానికి గణసమితి అంగీకారం అవసరం

ఇతర ప్రజలలోలాగ కాకుండ రోమనులలో మూడు తరహాల వివాహ పద్ధతులున్నాయి Confarreatio, Coemptio, usus వీటన్నింట కూడ భార్యను భర్త చేతిలోనే పెట్టేస్తారు వివాహబంధంలో చట్టబద్ధంగా పిల్లల్ని కనడమే ఈ వివాహం ప్రధాన లక్ష్యం ఈ మూడు రూపాలూ రిపబ్లిక్ పొడుగునా కొనసాగాయి సామ్రాజ్యం వచ్చాక ఈ మూడూపోయి, నాలుగో రూపం - స్వేచ్ఛా వివాహాన్ని సాధారణ రూపంలో అంగీకరించారు ఈ నాలుగో రూపంలో భార్యను భర్త అధికారంలో పెట్టలేదు వెనుకటినుంచి కూడ విడాకులు అన్నది ఆ జంట యిష్టంమీద ఆధారపడి యున్నదే ఇది సింధియాస్మియన్ కుటుంబ లక్షణం అదే యిప్పుడు సంక్రమించి వుంటుంది అయితే అది రిపబ్లిక్ ఆఖరు వరకు అరుదుగానే అమలు జరిగింది ఈ విషయమై బెకర్ యిలా వ్రాశాడు "పూర్వం రోజుల్లో ఆరుశతాలలో ఎవరూకూడ అతిగా వ్యవహరించినది అరుదే కాని నైతిక నియమాలు క్షీణించడం ప్రారంభమయ్యాక స్త్రీ పురుషులు పోటీ పడ్డట్టు స్వేచ్ఛాచారం ప్రారంభం చేశారు. స్త్రీలలో మొదట వుండిన అణకువ క్రమంగా అదృశ్యమైంది. విలాసాలు, వినోదాలు ఎక్కువయినకొద్దీ చాలమంది రోమను మహిళలు తమ భర్తలు చూపుతున్న నిరాదరణకు ప్రతిగా తాము ప్రేమికులను సంపాదించారు. సహాయకుడనే పేరుతో ఆ ప్రియుడు ఆమెను విడిచి పెట్టకుండా కూడా తిరుగుతాడు దీనికి ఫలితంగా మగవాళ్ళలో పెళ్ళి చేసుకోకుండ వుండడం ఎక్కువయింది. విడాకులు బాగా ఎక్కువయ్యాయి "

ఒకప్పుడు నీతినియమాలు చాల వున్నతంగా వుత్తమంగా వుండేవని అవి క్షీణించి పోవడంచేతనే మంచి నాగరిక స్థితిలో వున్న గ్రీకులూ రోమనులలో స్వేచ్ఛాచారం ప్రబలిందని చెప్పడం పరిపాటి కాని వాస్తవం తద్భిన్నం స్త్రీ పురుష సంబంధాలలో పరిశుద్ధ నైతికస్థితి వారిలో ఎప్పుడూలేదు అందుచేత దిగజారుడూలేదు యుద్ధ కాలంలో జాతి బ్రతుకే క్లిష్టదశకు వచ్చినపుడు స్వేచ్ఛాచారం కొంత తగ్గి వుండవచ్చు కాని శాంతి, సంపదా సమకూరడంతో స్వేచ్ఛాచారం మరల విజృంభిస్తుంది ఏమంటే దానికి వ్యతిరేకమైన నైతికస్థితి - సమాజంలో స్వేచ్ఛాచారం ఎప్పుడూలేదు అన్నది- పూర్వకాలపు స్త్రీ పురుష సంబంధ వ్యవస్థయొక్క అవశేషమై వుంటుంది అది ఎప్పుడూ రద్దుకాలేదు అనాగరిక యుగంనుంచి అదొక సామాజికమైన మచ్చగా భావించబడుతున్నా కొనసాగుతూనే వుంది అది అతి అయినపుడు వుంపుడు కత్తెలరూపం (హెటియారిజం) ధరించింది గ్రీకులూ, రోమనులూ దంపతీ వ్యవస్థలో న్యాయాన్ని పాటించి వుంటే, గ్రీకుల భార్యలను అంతఃపురాలలో దాచడం, రోమనులలోలాగ స్వాధీనంలో వుంచడం జరిగి వుండకపోతే, వారిలో సమాజ పరిణామాలు భిన్న రూపంలో వుండేవనుకోవచ్చు వారిద్దరిలో ఎవరిలోనుకూడ, వున్నత నైతిక స్థితి పెంపొందలేదు కనుక అవి క్షీణించాయని విచారపడనక్కరలేదు నే చెప్తున్నదేమిటంటే వారిద్దరూ దంపతీ కుటుంబం యొక్క మూల సూత్రాన్ని పాటించలేదు పాటించినవుడే వారి వారి సమాజాలలో నైతికస్థితి కనిపించేది ఈ అసాధారణమైన తెగలలో గణ జీవితం అకాలంలోనే అంతరించి పోవడానికి ప్రధాన కారణం స్త్రీల యొక్క మానసిక, నైతిక సంప్రదాయాత్మక మేధాశక్తిని పెంపొందించి వుపయోగించుకోలేక పోవడమే ఆ జాతుల యొక్క అభివృద్ధికీ అవి నిలదొక్కుకోవడానికీ మగవారిలో ఈ మేధాశక్తి ఎంత ముఖ్యమో, స్త్రీల మేధాశక్తీ అంత ముఖ్యమే అనాగరిక యుగంలో సుదీర్ఘ కాలం కృషిచేసి నాగరికతకు అవసరమైన ఇతరేతర అంశాలను కూడ సంపాదించారు కాని అత్యల్పకాలంలోనే రాజకీయంగా అంతరించి పోయారు తాము సృష్టించిన ఈ నూతన జీవితంతో కలిగిన వుత్సాహం ఫలితం అయి వుంటుంది యిది

ప్రారంభపు దినాలలో హీబ్రూల నాయకులలో బహు భార్యాత్వం పరిపాటిగా వున్నా క్రమంగా అది దంపతీ రూపంలోకి మారింది ఆ రూపం మొదటినుంచీ ప్రజలలో పరిపాటిగానే వుంది అయితే ఈ దంపతీ కుటుంబంయొక్క రూపంఏమిటి? కుటుంబంలోని భార్యభర్తల సంబంధాలెట్లా వుండేవి? ఈ వివరాలు అట్టే తెలియవు

ఉదాహరణలు యింకా యింకా చెప్పడం అనవసరం చరిత్ర ప్రారంభకాలం నాడు మనం చూసిన దంపతీ కుటుంబం దిగువదశనుంచి ఎదిగి వచ్చినదేనని స్పష్టమయింది సాంప్రదాయక యుగంలో అది అత్యున్నతరూపం ధరించక పోయినా బాగానే అభివృద్ధి పొందింది దానికి పూర్వంలోవున్న సిండియాస్మియన్ కుటుంబం నుంచి అది పుట్టింది మానవ పురోగతితో పాటు అదీ అభివృద్ధి పొందింది అయితే సంప్రదాయకయుగంలో దాని లక్ష్యాన్ని చేరుకోలేదు ఆధునికకాలంవరకు అది వున్నత పరిశుద్ధ రూపం పొందనే లేదు ఆద్యకాలపు రచయితలు అనాగరికయుగం ఎగువ దశలోని సమాజ స్థితిని చిత్రిస్తూ దంపతీ వ్యవస్థ సాధారణ రూపంలో అమలు జరుగుతూందని వర్ణించారు దానితోపాటు వారు చూసిన సందర్భాలను పరిశీలిస్తే దాని చుట్టూ ప్రాచీనకాలపు స్త్రీ పురుష సంబంధాల అవశేషాలు కొనసాగుతూనేవున్నాయనీ, దానిలో ప్రాణశక్తి, హక్కులు రక్షణలూ చాల తక్కువగా వున్నాయనీ, ఈ వ్యతిరేక శక్తుల ప్రభావం క్రింద అది కాలు నిలదొక్కుకునేందుకు కొట్టుమిట్టాడుతున్నదనీ అర్థం అవుతూంది

రక్తసంబంధీకుల కుటుంబంనాడు వున్న బంధుత్వాలను మలయన్ వ్యవస్థ విర్దేశించినట్లే, పునలాన్ కుటుంబం నాటి వానిని తురానియన్ వ్యవస్థ, అలాగే దంపతీ కుటుంబం నాటి వానిని ఆర్యన్ వ్యవస్థ విర్దేశిస్తున్నాయి ఈ మూడు తరహాల కుటుంబ రూపాలు, మూడు భిన్నమైన, స్పష్టమైన వివాహ పద్ధతులనుంచి ఏర్పడ్డాయి

ఆర్యన్, సెమిటిక్, యురాలియన్ కుటుంబాలలో మొదట తురానియన్ బంధుత్వ వ్యవస్థ వుండేదనీ, దంపతీ కుటుంబం ఏర్పడ్డాక అది వాడుకలోంచి పోయిందనీ చెప్పడానికి మనవద్ద తగిన సాక్ష్యంలేదు ఇంతవరకు ధృవపడినవిషయాల నుంచే దానిని ఊహించవలసి వుంటుంది లభించిన సాక్ష్యం యావత్తూ ఈ ఊహనే బలపరుస్తూంది మొదటిది- పునలాన్ కుటుంబంనుంచి, సహజరూపంలో గణనిర్మాణం వచ్చింది ఆ కుటుంబ రూపంలో అక్కచెల్లెళ్ళు ఒకరొకరి భర్తలను గుంపుగా వివాహ మాడుతారు స్త్రీ పారంపర్యంలో వారి పిల్లలూ, వారివారి సంతానమూ ఆ కుటుంబంలో వుంటారు అతి ప్రాచీనరూపంలో గణంయొక్క పరిధి అదే చరిత్రకు మొట్టమొదట తెలిసిననాటికి ఆర్యన్ కుటుంబాలకు చెందిన ప్రధానశాఖలు గణనిర్మాణంలో వున్నాయి వారంతా ఒకే ప్రజగా కలిసివున్నపుడు ఆ రూపంలోనే వారిలో నిర్మాణం వుండేదని ఊహించవచ్చు దీనినిబట్టి అతిప్రాచీన కాలంలో వారిలో కూడ పునలాన్ పరిస్థితులే వుండి, దానినుంచే ఈ గణవ్యవస్థపుట్టి బాగా వ్యాపించిందని ఊహించవలసి వుంది.

అమెరికన్ ఆదివాసులలో ఈ తురానియన్ బంధుత్వ వ్యవస్థ ప్రాచీన గణరూపంతో సంబంధంకలిగే కనిపిస్తూంది దంపతీ వ్యవస్థ ఏర్పడి, సమాజ పరిస్థితులలో గొప్ప మార్పువచ్చి, దీనిని తొలగించేవరకు ఈ సహజ అనుబంధం అలాగే వుంటుంది రెండవది- ఆర్యన్ బంధుత్వ వ్యవస్థలోకూడ దీనిని బలపరచే సాక్ష్యం వుంది ఆర్యన్‌లలో దంపతీ కుటుంబం ఏర్పడ్డాక తురానియన్ బంధుత్వ వ్యవస్థలోని బంధుత్వాలపేర్లు చాలభాగం తొలగించబడ్డాయి కొన్ని తరగతుల ప్రజలను ఒకరినుంచి ఒకరిని విడదీసి చెప్పవలసి వచ్చినపుడు వారికి వుపయోగించిన పదాలను మార్చవలసి వుంటుంది లేకుంటే మొదట వుండిన పదాలను ఆర్యన్ బంధుత్వ వ్యవస్థలో ఎందుకు మార్చవలసి వచ్చిందో అర్థంకాదు అనేక ఆర్యన్ మాండలికాలల్లో తండ్రి, తల్లి సోదరుడు, సోదరి, కొడుకు,కూతురులకు సమానపదాలే వున్నాయి మనుమడు, నెవ్యూ, కజిన్, అనే బంధుత్వాలకు ఒకే వుమ్మడి శబ్దం సంస్కృతంలో నప్తా, లాటిన్‌లో నెపోస్, గ్రీకులలో అనెప్సియోస్‌లను వుపయోగిస్తారు బంధుత్వపు పేర్లు అంత తక్కువగా వున్నదశలో వారు దంపతీ కుటుంబం వంటి అభివృద్ధి దశను చేరివుండడం సాధ్యంకాదు. అంతకుపూర్వం తురానియన్ వ్యవస్థ లాంటిది, ఏదో వున్నప్పుడే ఈ బంధుత్వ నామాల కరువు అర్థమవుతుంది సోదరుడు, సోదరీ ఇవి అనిర్దిష్టశబ్దాలు తురానియన్ వ్యవస్థలో పెద్ద చిన్న తేడాలతో ఈ శబ్దాలు లేవు స్వంత సోదరీ సోదరులుకాని అనేక తరగతుల యితర జనానికికూడ ఒకేరకం పదాలు వుపయోగించ బడుతాయి ఆర్యన్‌వ్యవస్థలో ఈ పదాలను ప్రక్కకుపెట్టి ఈ బంధుత్వాలకు మొట్టమొదటి మారుగ పదాలను ఊహించారు దంపతీ కుటుంబం వచ్చాక పాత పదాలు పనికిరావు, జ్ఞాతులకుకూడ అవే వుపయోగిస్తున్నారు కనుక యురానియన్ కుటుంబంలో అంతకు పూర్వంనాటి తురానియన్ బంధుత్వ అవశేషాలు యింకా కనిపిస్తున్నాయి హంగరియన్‌లలోలాగ సోదరీ సోదరులకు వయోభేదాన్నిబట్టి ప్రత్యేక పదాలున్నాయి. ఫ్రెంచిలో Frere, Soeurలే కాక అన్నకు Aineఅని, తమ్మునికి pune అని, cadet అని వేరువేరు పదాలు వచ్చాయి అక్కకు Anee అని, చెల్లికి cadete అనివచ్చాయి. సంస్కృతంలో అగ్రజ, అనుజ అన్నదమ్ములకు; అగ్రజా అనుజా అక్కచెల్లెళ్ళకు, కనబడుతున్నాయి అయితే ఈ చివరి పదాలు సంస్కృతంలోనివా, ఆదివాసపదాల నుంచి వచ్చాయా? చెప్పలేను. ఆర్యమా భాషలలోని సోదరీ సోదర శబ్దాలు కొద్దిగా మారాయే కాని గ్రీకులలో ప్రాటర్ అనే శబ్దానికి Adelphos ను ఉపయోగించారు ఈ భాషలలో అన్నదమ్ములకు, అక్క చెల్లెళ్ళకు ఒకే తరహా పదాలను వాడి

వున్నట్లయితే అవి యిప్పుడు వుపయోగించడం సాధ్యంకాదు స్వంత సోదరులనూ, సోదరీలను ప్రత్యేకించి చూపవలసిన అవసరం వచ్చింది తురానియన్ వ్యవస్థలో వున్న ఈ స్పష్టమైన లక్షణం ఆర్యన్ వ్యవస్థలో పోయిందంటే ఏదో ముఖ్యమైన కారణం వుండాలి అప్పుడే తురానియన్ వ్యవస్థ ఒకప్పుడుండేదని తరువాత పోయిందని చెప్పగలుగుతాం మరోవిధంగా చెప్పలేము అటవిక, అనాగరిక తెగలలో సర్వత్రా గుర్తించబడిన తాత అనే బంధుత్వపు పిలుపు ఆర్యన్ జాతులలో వుండ కుండా వుండదు సంస్కృతంలో పితామహ, గ్రీకులో పాపోస్, లాటిన్‌లో అవుస్, రష్యన్‌లో డ్జెడ్, వెల్ష్‌లో హెండాడ్ అంటారు ఈ చివరిది జర్మనీ భాషలోని గ్రాస్ వాదెర్, ఇంగ్లీషులోని గ్రాండ్ ఫాదర్ లాంటి సంయుక్త పదం. ఈ పదాలన్నీ పూర్తిగా భిన్నమైనవి అంతక్రితపు వ్యవస్థలో వున్నశబ్దం అసలు తాతకే కాక ఆయన సోదరులకు జ్ఞాతి సోదరులకు, తన అవ్వయొక్క సోదరులకు జ్ఞాతి సోదరులకు కూడ చెల్లుతుంది దంపతీ కుటుంబం వచ్చాక ఆ వంశంలోని తాకిం పూర్వీకుడిని చెప్పడానికి ఆ శబ్దం చాలదు కాలక్రమంలో దాన్నొదిలేస్తారు. ఇటువంటి బంధుత్వ పదం లేకపోయింది అంటే కారణం మరొకటయి వుండదు ఆఖరిది అంకుల్, ఆంట్ అనే భావాన్ని చెప్పేపదాలు ప్రత్యేకించి తండ్రివేపు వారిని తల్లివేపు వారిని సూచించేవి ఆర్యన్ మాండలికాలలో కనిపించవు సంస్కృతంలో పితృవ్య గ్రీకులో పత్రోస్, లాటిన్‌లో పత్రూస్ అని, తండ్రివేపు అంకుల్‌నుచెప్పే పదాలున్నాయి స్లావనిక్ భాషలలో స్ట్రిక్, ఆంగ్లో-శాక్సన్, బెల్జియన్, జర్మన్ భాషలలో ఎయామ్, ఊమ్, ఓహిమ్ అనే వున్మడి పదాలున్నాయి కెల్టిక్ భాషలో ఏమీలేదు అనాగరిక తెగలలో గణంరీత్యా చాల స్పష్టంగా కనిపించే బంధుత్వం తల్లివేపు అంకుల్ దానికి ఆర్యన్ భాషలలో మూలపదం ఏదీలేదు వారి పూర్వపుది తురానియన్ వ్యవస్థే అయితే ఈ అంకుల్‌కి తప్పకుండ ఒకపదం వుంటుంది అది తల్లి సోదరులకి అనేక మంది జ్ఞాతి సోదరులకే మాత్రమే ఆ పదం పరిమితమై వుంటుంది ఆ తరగతికి చెందిన అనేకమంది వ్యక్తులు దంపతీ కుటుంబంలో అంకుల్స్ కాలేరు అందుచేత ఆ శబ్దాన్ని విడిచిపెట్టారు దీనిని పట్టి ఆర్యన్ వ్యవస్థకు ముందు యింకో పద్ధతి వుండేదని, అది రద్దయిపోయిందని చెప్పవలసి వుంది

ఆర్యన్, సెమిటిక్, యురాలియన్ జాతులలో అంతకు పూర్వం తురానియన్ బంధుత్వం వుండేది దానిమించి దంపతీ కుటుంబం వచ్చాక వర్ణనాత్మకమైన వ్యవస్థ రావడం బహుసులభం ఏమంటే అంతకుపూర్వం వున్న పద్ధతిలో కొత్త బంధుత్వపు

వరసలు కలవవు దంపతీ వ్యవస్థలో ప్రతి బంధుత్వము నిర్దిష్టంగా వుంటుంది ఆ పరిస్థితులలో క్రొత్త వ్యవస్థ వర్ణనతో బంధుత్వాలను కలుపుతుంది నెవ్యూ అన్నదానికి సోదరుని కొడుకు అని, అంకుల్‌కి బదులు తండ్రి తమ్ముడు అని, కజిన్‌కు బదులు తండ్రి తమ్ముడు కొడుకని యిలాగే ఆర్యన్, సెమిటిక్, యురాలియన్ కుటుంబాలలోని ప్రస్తుత వ్యవస్థకు అసలు రూపం అది యిప్పుడు ఆ వ్యవస్థలో కనిపించే సాధారణ రూపాలు తర్వాత చేర్చబడ్డాయి ఫలానావ్యక్తి ఫలానా వారికి ఏమవుతారు అని అడిగినపుడు తురానియన్ వ్యవస్థవున్న తెగలన్నింట బంధుత్వాలను చెప్పడం యిలాగే! ఆర్యన్‌లలో వున్న ఈ వర్ణన పద్ధతి తురానియన్, మలయన్ వ్యవస్థలలోకూడ పొడవునా వుంది కాని అది బంధుత్వ వ్యవస్థలా కాకుండ బంధుత్వాల అట చెప్పే పద్ధతిగా వుండేది ఆర్యన్, సెమిటిక్, యురాలియన్ జాతులు అంతక్రితంవున్న బంధుత్వ వ్యవస్థలో తమకు సరిపడే మాటలు లేకపోవడంచేత దానిని నిరాకరించారన్నది స్పష్టమే ఈ జాతులలో దంపతీ కుటుంబం సర్వ సామాన్య రూపంలో ఏర్పడ్డాక అవి తురానియన్ వ్యవస్థలో ఎప్పుడూ వుంటూ వుండిన వర్ణనాత్మక రూపాన్ని తీసుకున్నాయి బంధుత్వాలను సరిగా చెప్పలేని పాత వానిని వదిలేశాయి తురానియన్ వ్యవస్థ నుంచి ఆర్యన్ వ్యవస్థకు అతి సహజంగా మార్పు రావడం యిదేవిధంగా జరిగింది ఆర్యన్‌యొక్క మూలాన్ని దానిలోని ప్రత్యేకతను ఇది సంతృప్తికరంగా చెప్పగలుగుతుంది ఆర్యన్ బంధుత్వ వ్యవస్థకూ దంపతీ కుటుంబానికిగల సంబంధాన్ని చెప్పడానికై ఈ వ్యవస్థను కొంచెం వివరంగా చెప్పడం అవసరం

అనేక ఆర్యన్ మాండలికాలలోని బంధుత్వ రూపాలను చూస్తే ఈ వ్యవస్థ మొదట పూర్తిగా వర్ణనాత్మకంగానే వుండేదని తెలుస్తుంది ఆర్యన్ రూపాల్లో ఒకటైన ఎరిసేలోనూ, యురాలియన్ తెగలలో ఒకటైన ఎస్తోనియన్ భాషలోనూ ఇవి నేటికి వర్ణనాత్మకంగానే వున్నాయి ఎరిసే భాషలో రక్త బంధువులకు అతి ప్రాథమిక రూపాలు వాడుతున్నారు తండ్రి, తల్లి సోదరుడు, సోదరి, కొడుకు, కూతురు ఈ బంధుత్వ పదాలనుంచి యితర బంధుత్వాలన్నింటిని వర్ణిస్తారు తమ్ముడు తమ్ముడి కొడుకు, తమ్ముడి కొడుకు కొడుకు యిలాగే ఆర్యన్ వ్యవస్థ దంపతీ కుటుంబంలోని వాస్తవ బంధుత్వాలను గుర్తిస్తుంది పిల్లల తండ్రి ఎవరో స్పష్టమని స్వీకరిస్తుంది

కాలక్రమంలో కెల్టిక్ పద్ధతికి భిన్నమైన పద్ధతిని ఈ కొత్త వ్యవస్థకు జత పరిచారు అయితే దానిలోని ప్రధాన లక్షణాలను మార్చలేదు అనంతర తరాలకు వుపయోగించే బంధుత్వ పదాలను ఖచ్చిత పరిచినది రోమను పౌరులు వారికి మనం ఋణ పడి వున్నాము రోమనుల ప్రభావంలోకి వచ్చిన అనేక ఆర్యన్ జాతులు ఈ పరిష్కృత రూపాన్ని స్వీకరించాయి స్లావనిక్ పద్ధతిలో తురానియన్ వ్యవస్థ నుంచి వచ్చిన ప్రత్యేక లక్షణాలు కొన్ని వున్నాయి రోమన్ పౌరులు విస్పష్టంచేసిన మన ప్రస్తుత వ్యవస్థయొక్క చరిత్రను తెలుసుకోవడం అవసరం ఈ మార్పులు చాల చిన్నవే కాని అవి బంధువులను వర్ణించడంలో మార్పు తెచ్చాయి ముఖ్యంగా తండ్రి వేపు సోదరుల, సోదరీల సంబంధాలను, తల్లి వేపు వారి బంధుత్వాలను స్పష్టంగా నిర్వచించేటందుకై కొన్ని శబ్దాలను తీసుకొచ్చారు తాత అనే పదాన్ని సృష్టించడంలో నెపోస్‌కు ఒక పదాన్ని జత పరిచారు ఈ పదాలు ప్రాథమికపదాలు. వీనికి కొన్ని మాటలు జతపరిచి తమ వంశ క్రమంలోని మొదటి అయిదు జ్ఞాతి వంశాలకు బంధుత్వ పదాలను సక్రమించేశారు దంపతీకుటుంబంలో వుండే బంధుత్వ వ్యవస్థను, శాస్త్రీయపద్ధతిలో పూర్ణ రూపంలో నిర్వచిస్తూన్నది యింత వరకు రోమన్ పద్ధతి ఒక్కటే వివాహం ద్వారా కలిగిన బంధుత్వాలను చెప్పటానికి అనేక క్రొత్త పదాలను అది సృష్టించింది ఆంగ్లో-శాక్షన్ లేక కెల్టిక్ వ్యవస్థలలో కన్న ఈ మెరుగుదలలతో మన బంధుత్వాలను బాగా తెలుసుకోగలం ఈ ప్రకరణం చివరన ఆర్యన్ సెమిటిక్ పద్ధతులకు ప్రత్యామ్నాయంగా లాటిన్ అరబిక్ పద రూపాలను పట్టీగా యిస్తున్నాను అరబిక్ బంధుత్వ వ్యవస్థ రోమనుల లాగానే నడిచినట్లు కనిపిస్తుంది దాని ఫలితాలు కూడ అలాంటివే అందుచేత రోమనుల పద్ధతిని యిక్కడ చెప్తున్నాను

తన నుంచి వంశక్రమంలో ఎగువన ఆరోతరంవాడైన త్రిటావస్ వరకు దిగువన ఆరోతరం త్రినోపాస్ వరకు వర్ణించేటందుకు నాలుగే క్రొత్తపదాలు వుపయోగించబడినాయి ఆరోతరం పైకి చెప్పవలసి వస్తే త్రిటావస్ నుంచి త్రిటావస్ తండ్రి త్రిటావీసాటర్ అవుతాడు అలాగే ఆరోతరంవాడు త్రిటావీ త్రిటావస్ అవుతాడు ఆయన నాకు వంశ క్రమంలో పన్నెండో తరం మగవాడు ఈ బంధుత్వాన్ని మన చిన్న పదాలలో చెప్పాలంటే తాతగారి తాతగారు అని ఆరు మార్లు చెప్పవలసి వస్తుంది. అలాగే త్రినేపాప్ విషయంలో కూడ.

మొదటి జ్ఞాతి క్రమంలో సోదరుడు ఫ్రాటర్ ఫ్రాట్రిస్ ఫిలియస్ అంటే తమ్ముడి కొడుకు, ఫ్రాట్రిస్ నెపోస్ అంటే తమ్ముడి మనుమడు ఫ్రాట్రిస్ ప్రొనెపోస్ తమ్ముని మునిమనుమడు అలాగ వరుసని నా తమ్ముని ముని మనుమని మునిమనమడు ఫ్రాట్రిస్ త్రినేపాస్ అవుతాడు యింకా అంతకంటే ముందుకు బంధుత్వాన్ని పెంచి చెప్పవలసి వస్తే ఫ్రాట్రిస్ త్రినేపాస్ నుంచి ప్రారంభం చేస్తారు పన్నెండో తరం వాడు ఫ్రాట్రిస్ త్రినేపాటిస్ త్రినేపాస్ అవుతాడు ఈ సూక్ష్మమైన పద్ధతిలో దిగువకు ఫ్రాటర్ కేంద్రం అవుతాడు వర్ణనాత్మక శబ్దాన్ని ఆ శబ్దానికి కలుపుతారు ఆ విధంగా మనిషిని వర్ణించే టప్పటికి అతడు ప్రథమ జ్ఞాతి వంశంలో ఫలానా బంధుత్వం వాడు అవుతాడని స్పష్టంగా తెలుస్తుంది ఈ పద్ధతి విస్పష్టంగా కనిపిస్తుంది అదే విధంగా స్త్రీ వైపు నుంచి కూడాను చెల్లెల్ని సొరోర్ అంటారు ఆమె కూతురు సొరోరిస్ ఫిలియా ఆమె మనుమరాలు సొరోరిస్ నెప్టిస్ మునిమనుమరాలు సొరోరిస్ ప్రొనెప్టిస్ యిలాగే ఆరో తరం సొరోరిస్ త్రినెప్టిస్ అవుతుంది ఆ పైన అదే క్రమంలో పన్నెండో తరం సోరోరిస్ త్రినెప్టిస్ త్రినెప్టిస్ అవుతుంది ఈ రెండు శాఖలకు మూలం తండ్రి కాని రెండు శాఖలలో వంశ క్రమానికి తమ్ముణ్ణీ చెల్లెల్ని కేంద్రం చెయ్యటం చేత ఆ శాఖలలోని ప్రతి వ్యక్తి తోడి బంధుత్వాన్ని స్పష్టంగా చెప్తున్నారు ఈ పద్ధతిలోని గొప్పతనం అది బంధుత్వం ప్రతి ఒక్కరిని కేవలం శాస్త్రీయ పద్ధతిలో గుర్తించి వర్ణిస్తోంది రెండో జ్ఞాతి శాఖ తండ్రి తరపు పురుషుడు— సోదరుడు పాత్రూస్ ఆయన, ఆయన దిగువ తరాలూను, వీరిలో ప్రతి ఒక్కరిని వర్ణించే పదాలతో ఆక్రమంలో ఆయన స్థానాన్నీ, బంధుత్వాన్నీ విస్పష్టంగా చూపించే పదాలున్నాయి ప్యాట్రుయ్ ఫిలియస్ పిన తండ్రి (లేక పెదతండ్రి), ప్యాట్రుయ్ నెపోస్ ఆయన మనుమడు, ప్యాట్రుయ్ ప్రొనెపోస్ ఆయన మునిమనుమడు అదే విధంగా ఆయన ఆరోతరం వాడు ప్యాట్రుయ్ త్రినేపాస్ వరకూను ఆ బంధుత్వాల్ని పన్నెండో తరం వరకు చెప్పవలసి వస్తే ప్యాట్రుయ్ త్రినేపాటిస్ ఫిలియస్ నుంచి ప్యాట్రుయ్ త్రినెపాటిస్ త్రినెపాస్‌వరకు వరస క్రమంలోపదాలనుపయోగిస్తారు రోమన్ సివిల్‌చట్టంలో ఉపయోగించిన కజిన్ అనే శబ్దం యిక్కడ ఉపయోగించటంలేదు దానికి బదులు ప్యాట్రుయ్ ఫిలియస్ అని వుపయోగించారు దానిని ఫ్రాటర్ ప్యాట్రుయిలిస్ అనటం కూడ వుంది. జన సామాన్యం అదే బంధుత్వాన్ని కన్‌సోబ్రినస్ అంటారు దీనినుంచే కజిన్ పదం వచ్చింది తండ్రివైపు నుంచి రెండో జ్ఞాతిశాఖ (స్త్రీలు) ఆయన చెల్లెలితో ప్రారంభమవుతుంది తండ్రి చెల్లెలు అమిత, ఆమె వరుస తరాల్ని వెనుకటి

పద్ధతిలోనే వివరిస్తారు మేనత్త కూతురు అమిటై ఫిలియా ఆమె మనుమరాలు అమిటై నెప్టిస్ అదేక్రమంలో ఆరోతరం అమిటైత్రినెప్టిస్, పన్నెండో తరం అమిటై త్రినెప్టిస్ త్రినెప్టిస్ ఈ శాఖలో మేనత్త కూతురికి ఒక ప్రత్యేకమైన పదం అమితినా అనేది వుండేది దానిని కూడ తీసివేసి అమిటై ఫిలియా అనే వర్ణనాత్మక శబ్దమే అలాగే వుంచారు

ఇదే విధంగా మూడో జ్ఞాతి వంశం తాత తమ్మునితో ప్రారంభమవుతుంది ఆయనను పాట్రూస్ మాగ్నస్ అంటారు ఇక్కడ నుంచి ప్రత్యేకించిన శబ్దాలులేవు సమ్మిశ్రిత శబ్దాలను వాడుతారు అయితే బంధుత్వం స్పష్టంగానే తెలుస్తుంది మొన్న మొన్నటి వరకు ఈ బంధుత్వం విషయంలో తేడా చూపించినట్లు కనబడదు ఈ బంధుత్వాన్ని వర్ణించడానికి ఒక కెల్టిక్ పద్ధతిలో తప్ప మరే భాషలోను, నేను తెలుసుకున్నంత వరకు స్వతంత్రమైన పదం లేదు తాత తమ్ముడు అనే పదంమనిషిని వర్ణిస్తుంది కాని బంధుత్వాన్ని ఊహించవలసిందే ఆయనను గ్రేట్ అంకుల్ అన్నట్టయితే బంధుత్వం స్పష్టంగా కనపడుతుంది ఈ వంశ క్రమంలో మొదటి వ్యక్తిని ఆ విధంగా నిర్దిష్ట పరిచినపుడు ఆయన తరువాత తరాలను ఆయన నుంచి వర్ణిస్తూ చెప్పవచ్చు దాని వలన ఆ వ్యక్తితో బంధుత్వం ఏ వైపు నుంచి ఏశాఖదో, ఏ తరానిదో, పూర్తిగా అర్థం అవుతుంది ఈ వంశ క్రమాన్నికూడ పన్నెండో తరం వరకు దిగవకు చెప్పవచ్చు తాత తమ్ముని కొడుకు పాట్రుయ్ మాగ్నెఫిలియస్ అవుతాడు అయన కొడుకు ప్యాట్రుయ్ మాగ్నె నెపొస్ అవుతాడు ఆ క్రమంలో ఆరో తరం వాడు పాట్రుయ్ మాగ్నెత్రి నెపాస్, పన్నెండో తరం వాడు పాట్రుయ్ మాగ్నెత్రి నెపాటిస్ త్రినెపాప్ అవుతాడు. అదే వంశ క్రమం స్త్రీల వైపు నుంచి తాతగారి చెల్లెలు అమితా మాగ్నాతో ప్రారంభమయి, ఆమె తరువాత తరాలన్నింటిని పై విధంగా వర్ణిస్తారు

నాలుగు, అయిదు జ్ఞాతి తరాలను (తండ్రి వేపు పురుషుని శాఖ) ముత్తాత సోదరుని సోదరుడితో పాత్రూస్ మేజర్‌తో ప్రారంభమవుతూంది అయిదో తరం ముత్తాత తండ్రి పాట్రూస్ మాక్సిమస్‌తో ప్రారంభమవుతూంది నాలుగో శాఖలో పాట్రుయ్ మెజోరిస్ ఫిలియస్ నుంచి పాట్రుయ్ మెజోంస్ త్రినెపాస్ వరకు, అయిదో తరంలో పాట్రుయ్ మాక్సిమీ ఫిలియస్ నుంచి పాట్రుయ్ మాక్సిమీ త్రినెపాప్ వరకు చెప్తారు స్త్రీల జ్ఞాతి శాఖలో అమితా మేజర్ నాలుగో తరానికి, అమితా మాక్సిమా అయిదో తరానికి ప్రారంభాలు, తరువాత బంధుత్వాలన్నీ పైన ఎవరించిన రూపంలోనే సాగుతాయి.

ఇంత వరకు చెప్పినవి తండ్రివేపు శాఖలు. ఇప్పుడు తల్లి వైపు మేనత్తలు, పిన తల్లులు వీరి అనంతర తరాలను రోమను పద్ధతి వర్ణన రూపంలో చెప్పవలసి వుంది. తల్లి వేపునుంచి కూడ బంధువుల సంఖ్య అధికమే. ఎవరికి వారు కనబడతారు. కుపదాలన్నీ 'అవంకులస్' మేనమామ, 'మాతెర్తెరా'పిన తల్లితో ప్రారంభమవుతాయి. వారి తర్వాతి తరాలని ఈ రెండు శబ్దాలకు బంధుత్వ పదాలు చేరుస్తారు. ఆ విధంగా మేనమామ అవుంకులస్, ఆయన తర్వాత అవుంకులీ ఫిలియస్, అవుంకులి నెపోస్ ఆటు తరువాత ఆరోతరంవారు అవుంకులి త్రినెపాస్ పన్నెండో తరం అవుంకులిస్ త్రినెపాతిస్ త్రినెపాస్ దాక చెప్తారు. అదే విధంగా స్త్రీల తరఫున పినతల్లి మాతెర్తెరా ఆమె కొడుకు మాతెర్తెరా ఫిలియా. అలాగే యింతక్రితం లాగ కొనసాగుతాను. మూడో జ్ఞాతి తరంలో మగ ఆడ శాఖలు ఆ విధంగానే ప్రారంభమవుతాయి. మగ భాగం అవుంకులస్ మాగ్నస్, స్త్రీ విభాగం మాతెర్తెరా మాగ్నా. నాలుగో జ్ఞాతిశాఖ అవుంకులస్ మేజర్ (మగ), మాతెర్తెరా మేజర్ (స్త్రీ) - అదే విధంగా ఐదవజ్ఞాతి శాఖ అవుంకులస్ మాక్సిమస్ (పురుష) మాతెర్తెరా మాక్సిమా (స్త్రీ)లతో ప్రారంభమవుతాయి. వారి తర్వాత తరాలూ శాఖలూ యింత క్రితం యిచ్చిన ఆయాతరాల శాఖల పదాలతోనే వర్ణిస్తారు. రోమన్ పౌరుల బంధుత్వపు పిలుపులు ఈ అయిదు జ్ఞాతి శాఖలను మించిలేవు. వాటి ఉపయోగం వుండదు కూడా.

వివాహ బంధుత్వ శబ్దాల విషయంలో లాటిన్ భాషా పదాలు అధికంగా కన్పిస్తాయి. ఇంగ్లీషు బంధుత్వ పదాలు చాల అసందర్భంగా, ఫాదర్ ఇన్-లా, సన్‌యిన్‌లా, బ్రదర్ యిన్-లా స్టెప్-ఫాదర్, స్టెప్‌సన్ లాంటి పదాలు వున్నాయి. అతి సన్నిహితమైన అతి సాధారణమైన 20 బంధుత్వాలకు ఇంగ్లీషులో ఈ మాదిరిగా పదాల లోపం కన్పిస్తూ వుంటే లాటిన్ భాషలో వాటన్నింటికి ప్రత్యేక పదాలున్నాయి.

రోమను బంధుత్వ వ్యవస్థను యింకా లోతుకు వెళ్ళి చెప్పడం అనవసరం. దానిలోని ప్రధాన రూపాలను చెప్పాను. "వాని నుంచి మిగిలిన దంతా అర్థం చేసుకోవచ్చు. ఈ పద్ధతి చాల సామాన్యంగా కనిపిస్తుంది. వర్ణనలో సౌలభ్యం వుంది. శాఖలను, తరాలను స్పష్టంగా చెప్తుంది. వాడిన పదాలు కూడ అందంగా వున్నాయి. నిజానికి అది అద్వితీయం. మనిషి ఇంత వరకు నిర్దిష్ట పరచిన బంధుత్వ వ్యవస్థలన్నింటిలోకీ యిది వుత్తమం. రోమనుల మేధస్సు దీనికి నిర్మాణ రూపం యివ్వదలచిన దానికి దృఢమైన పునాదిని కల్పించింది అనడానికి యిది ఒక వుదాహరణ.

అరబిక్ వ్యవస్థలో వివరాలను యిక్కడ చెప్పడం లేదు. అయితే లాటిన్ అరబిక్ రూపాలు రెండింటిని పట్టికలో యిచ్చాను కనుక యింత వరకు లాటిన్ రూపం గురించి యిచ్చిన వివరణ చాలును అది దానికి సరిపడుతుంది

పరిశుద్ధ పరచిన పద్ధతి అదనంగా కూర్చిన ప్రత్యేక పదాలతో రక్తబంధువుల మధ్యగల బంధుత్వాలను కలిపినట్లే, వుమ్మడి పూర్వీకుల నుంచి ఈ దంపతులద్వారా తరాల వెంబడి వారి వారి బంధుత్వం కలుస్తూంది వారు వంశ క్రమంలోనూ, జ్ఞాతి వంశక్రమాలలోనూ, విడిపోయి ఏర్పడతారు జ్ఞాతులు మొదటి వారి నుంచి శాశ్వతంగా విడిపోయినట్టే దంపతీ వివాహం తెచ్చిపెట్టే తప్పనిసరి ఫలితమిది ఒక వ్యక్తితో యితరులకుగల బంధుత్వాలు స్పష్టంగా నిర్దేశించబడ్డాయి అటువంటి బంధుత్వం కల వారి నుంచి ఒక ప్రత్యేక శబ్దం ద్వారానో, వర్ణనాత్మక పదం ద్వారానో వారిని స్పష్టంగా వేరు పరచి వుంచుతున్నారు ఒకరి యొక్క తండ్రి ఎవరో దంపతీ కుటుంబం ద్వారా ని ష్ట మౌతూంది ఆ దంపతీ కుటుంబంలో వాస్తవంగా వున్న బంధుత్వాలను యిది వర్ణిస్తోంది. అందుచేత ఈ వివాహ పద్ధతి, ఈ కుటుంబ రూపాన్ని సృష్టించింది అదే ఈ బంధుత్వ వ్యవస్థను ఏర్పరిచింది ప్రత్యేకించి వర్ణనాత్మక పద్ధతిని అనుసరిస్తున్న చోట ఈ మూడు ఒక మొత్తంలోని భాగాలు ఇప్పుడు దంపతీ కుటుంబానికి వివాహ పద్ధతికి బంధుత్వ వ్యవస్థకు గల సరాసరి సంబంధమే పునగాన్ కుటుంబానికి ఆ వివాహ పద్ధతికి, ఆ బంధుత్వ వ్యవస్థకు వుంది అలాగే రక్తసంబంధీకుల కుటుంబానికి ఆ వివాహ పద్ధతికి, ఆ బంధుత్వ వ్యవస్థకి సంబంధం వుంది ఈ మూడు భాగాలలో ఏ ఒక్కదానిని చెప్పినా ఒకే సమయంలో మిగిలిన రెండు కూడ దానితో జతపడి వున్నాయని గట్టిగా చెప్పగలం ఈ మూడింటిలో ఒకటి వున్నత స్థాయిలోవుంది అనే టట్లయితే, అది బంధుత్వ వ్యవస్థకే వుంటుంది వివాహ చట్టాన్ని, కుటుంబ రూపాన్ని విశదీకరిస్తూ ప్రతి వ్యక్తికీ వానితో గల బంధుత్వాన్ని అది స్థిరీకరిస్తుంది ఆ విధంగా యదార్థంగా జరిగిన దానికి అది ప్రధాన సాక్షిగా వుంటుంది అంతేకాదు ఆ బంధుత్వ సంబంధంలో కలిసినవారందరి బంధుత్వాన్ని అది ఆమోదిస్తుంది గార్హస్త్య సంబంధం కల నిర్మాణాలలో అత్యుత్తమమైనదిగా ఇది పరీక్షకు నిలుస్తుంది దీనికి సత్యాన్ని దాచిపెట్టే శక్తిలేదు అందుచేత అది ఏమి చెప్తే, దానిని నమ్మవలసిందే బంధుత్వ వ్యవస్థలకు సంబంధించిన సమాచారం మనకు పూర్తిగా దొరుకుతూంది

ప్రారంభంలో చెప్పిన అయిదు కుటుంబ రూపాలను వరుసగా మీ ముందు పెట్టి వివరించాను వాటిని గురించి వాటి నిర్మాణ వివరాలను గురించి ప్రస్తుతం

మనకు తెలిసినంత వరకు సాక్ష్యం మీ ముందు పెట్టాను వాటిని గురించిన వివరణ సాధారణ రూపంలో జరిగిన యధార్థ విషయాలు, లక్షణాలు చూపించి ప్రధాన ప్రతిపాదనను ధృవ పరిచాను కుటుంబం అనేది రక్త సంబంధాలతో ప్రారంభమై క్రమంగా అనేక దశలను గడిచి, దంపతీ రూపాన్ని చేరింది. పూర్వపరిశీలనలను పట్టి తరువాత ఏం వస్తుందో ఊహించడానికి యిందులో కష్టం లేదు కాని వాని పెరుగుదలను అడ్డుకొట్టిన కష్టాలు, యిబ్బందులు వూహించినవానికన్న చాలా ఎక్కు-వగా వున్నాయి. యుగయుగాలుగా అభివృద్ధి పొందిందేమో దానిలో మానవానుభవాల ఎగుడు దిగుడులు కనిపిస్తాయి ఆదిమ కాలపు ఆటవిక దశనుంచి అనాగరిక యుగం ద్వారా నాగరికతకు చేరిన మానవ పురోగతి యొక్క క్రమానుగత స్థాయిని యింత స్పష్టంగా నిరూపించే నిర్మాణం మరొకటి లేదు అభివృద్ధి క్రమంలో వేరు వేరు దశలలో మానవ కుటుంబం గడిపిన దినసరి జీవితాన్ని, వారికి కలిగిన కష్టాలను, సంఘర్షణలను, విజయాలను చూపిస్తుంది వేరువేరు కాలాల స్థితి గతులను పోల్చి చూసినపుడు యివి మరీ స్పష్టంగా వుంటాయి. యిప్పుడున్న కుటుంబ రూపానికి ఎంతో విలువ వుంది దానిని నిర్మించేటందుకు పట్టిన కాలం అపారం కావలసి వచ్చిన మేధాశక్తి అపారం. ప్రాచీన సమాజం మనకిచ్చిన అమూల్యమైన వారసత్వంగా దానిని మనం స్వీకరించాలి ఆ సమాజం యొక్క విభిన్న సుదీర్ఘ అనుభవాలు యిచ్చిన అత్యున్నత ఫలితాలు దానిలో యిమిడి వున్నాయి వాటిని అది నమోదు చేస్తుంది

కుటుంబము అన్నది, క్రమంగా నాలుగు రూపాలను అధిగమించి అయిదో రూపంలో వున్న దన్న వాస్తవాన్ని ఒప్పుకుంటే భవిష్యత్తులో యిది మాత్రం స్థిరంగా వుంటుందా అన్న ప్రశ్న వస్తుంది గతంలో లాగనే భవిష్యత్తులో కూడ సమాజంతో పాటు పురోగమిస్తుంది, సమాజంతో పాటు మారుతుంది అని చెప్పాలి అది సామాజిక వ్యవస్థ యొక్క సృష్టి దాని సంస్కృతిని అది ప్రతిబింబిస్తుంది నాగరికత ఆరంభం నాటినుంచి దంపతీ కుటుంబం ఎంతో మెరుగయింది ఈ నాడు అది తర్క బద్ధంగానే వుంది అయితే స్త్రీ పురుషుల మధ్య సమానత్వ మనేది ఏర్పడే వరకు అది పురోగమిస్తూనే వుంటుందని నిశ్చితంగా చెప్పవచ్చు సుదూర భవిష్యత్తులో దంపతీ కుటుంబం సమాజ అవసరాలకు సరిపడక పోవచ్చు నాగరికత నిరంతరాయంగా పురోగమిస్తూండవచ్చు ఆ దశలో దీని తర్వాత ఏం వస్తుంది అనేది జోస్యం చెప్పడం కాదు.

---

(అనుబంధము Iలో పట్టికలో చూడండి)

## ఆరో ప్రకరణం

# కుటుంబ నిర్మాణాల వరుస క్రమం

ఈ వరుస క్రమం ఊహా నిర్మితం — వాటి పుట్టుక క్రమంలో ఈ నిర్మాణాలకు గల అనుబంధం — పైన చెప్పిన పద్ధతిలో అవి పుట్టినందుకు సాక్ష్యం — లభిస్తున్నాయనే ఊహ పరిశీలన—మానవజాతి యొక్క పురాతనత్వం

వేరు వేరు రూపాలలో వరుసగా కుటుంబం పురోగమించడానికి తోడ్పడిన ఆచారాలు, అలవాట్లను వరుసగా చెప్పవలసి వుంది ఈ వరుసని చెప్పటం కొంత వరకు ఊహా కల్పితం కాని వాని మధ్య సన్నిహిత సంబంధం నిస్సందేహంగా వుంది రక్త సంబంధీకుల కుటుంబం నుంచి దంపతీ కుటుంబం వృద్ధి పొందటానికి కారణమైన ప్రధాన సామాజిక గార్హస్త్య ఆచారాలు ఈ క్రమంలో కనిపిస్తాయి. చాల వరకు ఇదే క్రమంలో మానవజాతి, ఒకే విధమైన పరిస్థితులు వున్నప్పుడు యివి పుట్టాయని అర్థం చేసుకోవాలి.

ఈ వరుస క్రమంలో మొదటి దశ

1 అనియమిత (Promiscuous) స్త్రీ పురుష సంబంధాలు
2 తోడబుట్టిన జ్ఞాతులయిన సోదరీ సోదరుల మధ్యగుంపు పెళ్ళి తత్ఫలితంగా,
3 రక్త సంబంధీకుల కుటుంబం. (కుటుంబ ప్రథమ దశ), దాని వలన.
4 రక్త బంధుత్వాల అనుబంధాల మలయన్ వ్యవస్థ.

రెండవ దశ

5 సోదరీ సోదరుల మధ్య వివాహాలను నిలుపుటకు స్త్రీ పురుష ప్రాతిపదికపై వేరు వేరు నిర్మాణాలు దాని నుంచి,
6, పునలాన్ కుటుంబము (రెండవ కుటుంబ రూపం) దీనినుంచి.

7 గణాలుగా నిర్మాణం సోదరీ సోదరుల మధ్య వివాహబంధాన్ని యిది నిషేధిస్తుంది దాని నుంచి,

8 తురానియన్, గనోవానియన్ బంధుత్వాల, అనుబంధాల వ్యవస్థ

మూడవ దశ

9 గణసంస్థ యొక్క పలుకుబడి పెరుగుతుంది జీవిత కళలు మెరుగవుతాయి, మానవజాతిలో కొందరు అనాగరికయుగం దిగువదశకు పెరిగారు దానినుంచి

10 వేరు వేరు జంటల మధ్య వివాహం కాని స్త్రీ పురుష సంబంధాలు వారికే పరిమితం కాకపోవచ్చు దీని నుంచి,

11 సిండియాస్మియన్ కుటుంబం (మూడవ కుటుంబ రూపం)

వరుస క్రమంలో నాలుగో దశ

12 పరిమిత ప్రాంతాలలోని, మైదానాలలో పశుపోషక జీవితం, దాని నుంచి,

13 పితృస్వామిక కుటుంబం (ఈ నాలుగో కుటుంబ రూపం ప్రత్యేక స్థితి గలది)

వరుస క్రమంలో ఐదో దశ

14 ఆస్తి పెరుగుదల, వంశాను గతంగా ఆస్తుల వారసత్వం దాని నుంచి,

15 దంపతీ కుటుంబం (ఐదో కుటుంబ రూపం)

16 ఆర్యన్, సెమిటిక్, యురాలియన్ బంధుత్వ, అనుబంధ వ్యవస్థ, తురాని యన్ వ్యవస్థ రద్దు

పైన చెప్పిన ఆధారాల ఆవిర్భావాల క్రమాన్ని, వాని మధ్యనున్న సంబంధాలను చూపిస్తూ వివరించటంతో కుటుంబం పెరుగుదలను గురించిన చర్చ ముగుస్తుంది

ఒక వరుసలో ఏర్పడిన భూమి కొరవలవలనే మానవుల తెగలను వారి వారి పరిస్థితులనువట్టి ఒక క్రమంలో చెప్పవచ్చును ఆ విధంగా చెప్పినపుడు ఆటవిక దశ నుంచి నాగరిక దశకు మానవుడు పొందిన అభివృద్ధినంతను చాల వరకు ఖచ్చితంగానే చెప్పగలము ప్రతి క్రమాన్ని దాని అభివృద్ధి క్రమంలో పరిశీలిస్తూ దాని సంస్కృతిని, లక్షణాలను వివరించినపుడు ఆయా దశల మధ్యనున్న తేడాలు అనుబంధాలతో సహా మొత్తం పురోగతి స్పష్టంగా తెలుస్తుంది ఈ క్రమాలు ఏర్పడటానికి ప్రధానంగా కాలం కారణమయింది నిర్దిష్టమైన కొలతలో మానవజాతి దశలను కొలవలేము నాగరికతకు పూర్వం వున్న ప్రతి దశాకాలాన్ని వేల సంవత్సరాల లెక్కలో చెప్పాలి

## 1 అనియమితమైన (promiscieous) స్త్రీ, పురుషసంబంధాలు

ఇవి ఆటవిక దశలో అతి దిగువ దశ ఆరోహణ క్రమంలో, ఇది అట్టడుగు తన చుట్టూవున్న మూగ జీవాలకూ మనిషికీ ఈ దశలో తేడా చూడడం సాధ్యం కాదు పెళ్ళంటే తెలియదు గుంపులుగా నివసిస్తూంటారు మేధా శక్తి చాలా తక్కువ. నీతుల సరిగణనా అంతే అతనిలో వున్న వుద్రేకాలు, ఆవేశాల యొక్క బలం మీదనే అతను పైకి ఎదగగల ఆశ వుంది అతడు ఎప్పుడూ దీరుడుగానే వుండాలి చేతులు వుండటంతో శారీరకంగా స్వతంత్రు డయ్యాడు అతి ప్రాథమిక దశలో వున్న మానసిక, నైతిక శక్తులు వృద్ధి పొందే లక్షణం అతనిలో వుంది తలచిన్నదిగా వుండడం, జంతులక్షణాలు అధికంగా వుండడం కనిపిస్తుంది నాగరిక మానవుని నుంచి ఆటవిక మానవుని వేపు వెళ్ళిన కొద్దీ కనిపిస్తూండడం ఈ ఆలోచనకు మూలం ఆదిమ మానవుడు తప్పకుండ అధమ స్థితిలో వుంటాడనడానికి అవే సాక్ష్యం కూడాను ఈ తరగతి మనుష్యులను పట్టుకోవాలంటే భూమిమీద కొన్ని భాగాలలో కనిపిస్తున్న చాల తక్కువ స్థాయి ఆటవికుని కన్న ఎంతో క్రిందకు వెళ్ళవలసి వుంది. భూమిమీద కొన్ని చోట్ల చాల మోటైన చెకుముకి రాయి పనిముట్లు కనిపిస్తున్నాయి. ఇప్పుడు వున్న ఆటవికు లెవ్వరూ వాటిని వుపయోగించరు వాటిని పట్టి అతని స్థితి ఎంత మోటుగా వుందో తెలుస్తూంది అటు తర్వాత ఆదశ నుంచి బయటపడి తాను నివసించిన ఆద్య కాలపు ప్రదేశాలను వదిలిపెట్టి, చేపలు పట్టే వాడుగా భూఖండాల వెంట వ్యాపించాడు అనియమితమైన స్త్రీ పురుష సంబంధాలు అన్నప్పుడు అతి పురాతన కాలంనాటి ఈ మానవుని మాత్రమే ఊహించాలి

ఇటువంటి పూర్వ స్థితికి సాక్ష్యం వున్నదా అని అడగవచ్చు రక్త సంబంధీకుల కుటుంబము, మలయాన్ బంధుత్వవ్యవస్థ ఈ అనియమిత స్త్రీపురుషసంబంధాలు అంతక్రితం వుండేవని ఊహకలిగిస్తున్నాయని చెప్పవచ్చు మానవజాతి పళ్ళు, కాయలూ, తింటూ తన మొట్ట మొదటి ప్రదేశాలలో జీవిస్తున్న కాలంలో యిటువంటి సంబంధాలు వుండడం అసంభవం కాదు చేపలు పట్టడం నేర్చి, కృత్రిమంగా ఆహారాన్ని సృష్టించుకుంటూ భూమిమీద విస్తరించడం ప్రారంభమయ్యాక ఆ దశ వుండను అప్పుడు రక్త బంధువుల గుంపులు ఏర్పడతాయి అవసరం కొద్దీ గుంపు వివాహాలు జరుగుతాయి రక్తసంబంధీకుల కుటుంబాలు ఏర్పడతాయి ఈ కుటుంబంలోని బంధుత్వ వ్యవస్థల నుంచి అంతకు పూర్వం వున్న సమాజ రూపాన్ని మనం చూడగలం గుంపు పుష్టిగా ఆహారం సంపాదించుకోవడానికి తమ అందరి భార్యల రక్షణకు

అనేక మంది మగవాళ్ళు గుంపుగా ఏర్పడడం వలన ఇది వచ్చి వుండాలి రెండవది ఈ పూర్వ దశ లక్షణాలు రక్త సంబంధీకుల కుటుంబం మీద ముద్రవేసి వున్నాయి పరిమితమైన హద్దులలో అనియమిత సంబంధాలను అది గుర్తిస్తుంది ఆ పరిధి మరీ యిరుకుగా లేదు. సమాజంలో వున్న అధ్వాన్నపు పరిస్థితి నుంచి రక్షణగా ఏర్పడిన నిర్మాణమని దానిని చూస్తే అనిపిస్తుంది అనియమిత సంబంధాలుగల గుంపు నుంచి రక్త సంబంధీకుల కుటుంబంఏర్పడటానికి చాలాచాలా కాలమే పట్టి వుండవచ్చు కాని వాని మధ్య ఒక అంతర్దశ వుండనక్కర లేదు ఒక వేళ అటువంటిది వున్నా దాని అవశేషాలు ఏమీ కనిపించడంలేదు ఈప్రశ్నకు సమాధానం ప్రత్యక్షంగా దొరకదు సుదూరాన ఆటవిక దశలో రక్తసంబంధీకుల కుటుంబాన్ని ఒక నిర్దిష్టమైన స్థానంగా తీసుకోవడం ప్రస్తుతానికి సరిపడుతుంది అదే యింకా పురాతన కాలంలో మానవ జాతియొక్క అధ్యస్థితిని గురించి మనకు చెప్తుంది

అనేక ఆటవిక తెగలు, గ్రీసులకు, రోమనులకు తెలిసిన వాళ్ళే ఎందరో అనాగరికులు, అనియమిత స్త్రీ పురుష సంబంధాలలో జీవించేవారు వారిలో ఉత్తరాఫ్రికాలోని ఔసియనులను గురించి హెరిడోటస్, ఇథియోపియాలోని గరమాంటెలను గురించి ప్లినీ, ఐర్లండులోని కెల్టులను గురించి స్ట్రాబో చెప్పారు ఈ స్ట్రాబో అరబ్బులను గురించి కూడ అలాగే చెప్పారు కాని చరిత్ర కాలం నాటికి జంతువుల మాదిరిగా అనియమిత స్త్రీ పురుష సంబంధాలు కలిగిన దశలో మానవుడు వుండడం సాధ్యం కాదు మానవ జాతి పుట్టినది మొదలు యిప్పటివరకు అటువంటి ప్రజ కొనసాగడం అసంభవం పైన చెప్పిన ఉదాహరణలూ, యింకా అటువంటివి పునలూన్ కుటుంబం లోనుంచి వచ్చాయి పరిశీల నావకాశాలు తక్కువగా నున్న విదేశీ పరిశీలకునికి ఈ రచయితలు చెప్పినవే సాక్ష్యం రక్త సంబంధీకుల కుటుంబానికి పూర్వం ఇటువంటి పరిస్థితి తప్పకుండా వుంటుందని చెప్పడం తప్ప వేరుకాదు మన ఊహకు కూడ అందని అతి ప్రాచీన కాలంలో అది వుండేది

## 2. తోడ బుట్టిన జ్ఞాతులయిన సోదరీ సోదరుల మధ్య గుంపు పెళ్ళి

ఈ వివాహ పద్ధతిలో కుటుంబం అనేది పుట్టింది కుటుంబానికి యిది మూలం చాల కాలం క్రితం యిది వుండేదనడానికి మలయన్ బంధుత్వ వ్యవస్థ సాక్ష్యమిస్తోంది రక్త సంబంధీకుల కుటుంబం ఒకప్పుడుండేదని స్థిరపరిచినపుడు తరువాతి రూపాలు ఒకదాని తర్వాత ఒకటి ఏర్పడ్డాయని నిరూపించవచ్చు ఈ మాదిరి వివాహ పద్ధతి (3) రక్త సంబంధీకుల కుటుంబాన్ని ఏర్పరుస్తుంది 4 మళ

యన్ బంధుత్వ వ్యవస్థను కూడ ఏర్పరుస్తుంది. ఈ కుటుంబం ఆటవిక యుగం దిగువ దశకు సంబంధించినది

## 6 పునలాన్ ఆచారం.

వివాహదృష్ట్యా స్త్రీ పురుష తరగతులుగా విభజించ బడినఆస్ట్రేలియనులలో పునలాన్ జట్లు కనిపిస్తాయి హవాయియన్‌లలో కూడ యిటువంటి జట్టే వున్నది అదే వివాహ ఆచారాన్ని తెలుపుతూంది ఈ నాడు తురానియన్ బంధుత్వ వ్యవస్థ వున్న మానవ తెగలలో అతి ప్రాచీన కాలంలో ఈ వివాహాచారం వుండేది తురానియన్ వ్యవస్థ పునలాన్ కుటుంబ పూర్వీకుల నుంచే వచ్చి వుండాలి ఈ వ్యవస్థ ఏర్పడడానికి మరో కారణం కన్పించదు. తోడబుట్టిన సోదరీ సోదరులు తప్ప అంతక్రితపు రక్త సంబంధీకుల కుటుంబంలో వుండిన మిగిలిన వ్యక్తులే పునలాన్ కుటుంబంలో వున్నారని గ్రహించాలి పునలాన్ ఆచారంలో లాభం వుండడం చేత దానినే సర్వత్రా ఆమోదించారని చెప్పవచ్చు పునలాన్ వివాహం నుంచి పునలాన్ కుటుంబం (6) వచ్చింది దానితో ఆ వరుసలోని ఆరవది పూర్తయ్యింది ఈ కుటుంబం ఆటవిక యుగం మధ్య దశలో వచ్చియుండవచ్చు

## 7. గ ణా లు గా ని ర్మా ణ ం

ఈ వరుసలో ఈ సంస్థయొక్క స్థానాన్ని చర్చించడం ఒక్కటే మిగిలింది. ఆస్ట్రేలియన్ తరగతులలో పునలాన్ జట్టు క్రమబద్ధమైన వికాల రూపంలో కనిపిస్తుంది ఆ ప్రజలు గణాలుగా కూడ ఏర్పడే వున్నారు ఇక్కడ పునలాన్ కుటుంబం గణంకంటే ప్రాచీనం ఏమంటే గణం ముందున్న తరగతుల మీద అది ఏర్పడింది. ఆస్ట్రేలియన్ల తరగతులలో కూడ తురానియన్ బంధుత్వ వ్యవస్థ వుంది పునలాన్ పెళ్ళిగుంపు నుంచి తోడబుట్టిన సోదరీ సోదరులను వెలిబెట్టడం దానికి పునాది వారు ఆ తరగతులలోనే పుట్టారు తరగతులలో అంతర్వివాహం చేసుకోలేరు హవాయియన్‌లలో పునలాన్ కుటుంబం తురానియన్ బంధుత్వ వ్యవస్థను సృష్టించ లేకపోయింది అక్కడ పునలాన్ జట్టులోని తోడబుట్టిన సోదరీ సోదరులు తరుచు వివాహంలో కలియటమే అందుకు కారణం ఆ మాదిరిగా కలియడాన్ని నిషేధించే ధోరణి వస్తున్నా, అది ఆచారం కాలేదు ఇక్కడి వ్యవస్థ పునలాన్ కుటుంబము గణ నిర్మాణము వుంటేనే తురానియన్ బంధుత్వ వ్యవస్థను తీసుకురాగలదు దీనిని బట్టి కూడ పునలాన్ కుటుంబం తరువాతనే గణం వచ్చిందని చూపిస్తూంది గణం ఆటవికయుగం మధ్యదశలో వచ్చినట్లే దీనిని బట్టి చెప్పాలి.

8, 9 వీటిని ఇంతకు పూర్వమే బాగా చర్చించాము

10, 11 వేరు వేరు జంటలమధ్య వివాహము, సింధియాస్మియన్ కుటుంబము

మానవజాతి ఆటవికయుగాన్ని గడిచి అనాగరికయుగం దిగువ దశకు చేరేసరికి వారి పరిస్థితి బాగా మెరుగయింది నాగరికతకై సాగిస్తూన్న పోరాటం సగానికి పైగా విజయవంతంగా ముగిసినట్లే ఆటవికయుగం ముగియడానికి పూర్వమే వివాహితుల జంట్లను అంతకంతకు కుంచింపచేయడం ప్రారంభమయి వుండాలి ఏమంటే అనాగరిక యుగం దిగువదశలో సింథియాస్మియన్ కుటుంబం స్థిరంగా కనిపిస్తూంది అనేకమంది భార్యలలో ఒకామెను తన ప్రధాన భార్యగా గుర్తించడం ఒక ఆచారంగా, ఆటవిక దశలోనే బాగా పెంపొందింది క్రమంగా జంటలు ఏర్పడడం, ఆమెను సహచరురాలినిగా కుటుంబ నిర్వహణలో తోడు చేసుకోవడం పరిపక్వమయింది ఈ విధంగా జంటలు ఏర్పడడం పెరిగినకొద్దీ పిల్లల తండ్రి తనం నిశ్చితం కాసాగింది కాని భర్త భార్యను భార్య, భర్తను వదిలేసి తమయిష్టం వచ్చినట్లు కొత్త వారిని వెతుక్కోవడం జరుగుతూనే వుంది పైగా మగవాడు వివాహబంధంలోని బాధ్యతలను స్వీకరించడు అందుచేత భార్యకూడా వానిని స్వీకరించే పరిస్థితి వుండదు ఫలితంగా పునలాన్ జట్లు అదృశ్యమై ప్రాచీనకాలపు స్త్రీ పురుష సంబంధాల వ్యవస్థ పరిమితమైపోయినా, ఈ వస్తూన్న కుటుంబాన్ని పాతఅలవాట్లు చుట్టుగానే వున్నాయి ఇంచు మించు నాగరికతాకాలం వరకు వెంటాడుతూనే వున్నాయి దంపతీ కుటుంబం ఏర్పడాలంటే, అవి పూర్తిగా రద్దవ్వాలి చివరకు అది మరో క్రొత్తరూపంలో హెటెయారిజం (దేవదాసీ వ్యవస్థ)లో కలిసిపోయింది కుటుంబంమీద పెద్ద మచ్చగా నాగరిక దశలో మానవుడిని అది వెంటాడుతూనే వుంది దంపతీ కుటుంబానికి సింథియాస్మియన్ కుటుంబానికి మధ్య పునలాన్ - సింథియాస్మియన్ కుటుంబాల మధ్యకన్న చాలా పెద్ద అంతరమే వుంది దంపతీ కుటుంబం ఏర్పడానికి సింథియాస్మియన్ కుటుంబం కారణం అందుచేత దీని తర్వాతనే అది వచ్చిందనాలి పునలాన్ కుటుంబానికి దంపతీ కుటుంబానికి మధ్య సింథియాస్మియన్ కుటుంబం ఒక మధ్యంతర దశ మాత్రమే అందుచేతనే తురానియన్ బంధుత్వ వ్యవస్థను అది ఎక్కువగా మార్చలేక పోయింది. దంపతీ కుటుంబం వచ్చాక పూర్తిగా మారిపోయింది కొలంబియా నదినుంచి పెరాగ్వే వరకు ఇండియన్ కుటుంబాలు సాధారణంగా సింథియాస్మియన్ కుటుంబాలు

అక్కడక్కడ మాత్రమే ఏవలాన్ కుటుంబాలున్నాయి ఇక్కడ దంపతీ కుటుంబాలు లేవు

## 12, 13 మైదానాలలో గోపాలకుల జీవితం, పేట్రియార్కల్ కుటుంబం

ఈ కుటుంబంయొక్క ప్రధాన లక్షణం బహు భార్యాత్వం కాదు అని మరో చోట చెప్పాను వ్యక్తులయొక్క స్వయం వికాసాన్ని ధృవపరుచుకునేటట్లు సమాజం పురోగమిస్తూండడానికి ఈ కుటుంబం ఒక వుదాహరణ పశువుల, పక్షుల మందలను చూసుకోవడం, భూముల వ్యవసాయం, పరస్పర రక్షణ, జీవనోపాధి సమకూర్చడం కోసం, ఇంటిపెద్ద అధీనంలో బానిసల్ని, సేవకుల్ని పట్టివుంచే ఈ పద్ధతిని సెమిటిక్ తెగలలో పేట్రి యార్కల్ కుటుంబము అన్నారు బహుభార్యాత్వం అన్నది యాదృచ్ఛికము ఒక మగవాడు కుటుంబ పెద్దగా వుండడం, అతను ఒక భార్యతోనే కాపురం చేయడం జరిగే ఈ కుటుంబం సింథి హస్మియన్ కుటుంబంకంటే ఒక మెట్టు పైనే వుంది అది వెనుకతీతకాదు దాని ప్రభావం మానవజాతిమీద తక్కువే వుంది అయితే అది ఏర్పడడం దానికు పూర్వం వున్న సమాజ స్థితికి ఒక అడ్డుగా ఏర్పరచబడింది అని వేరే చెప్పనక్కరలేదు

## 14 ఆస్తి ఏర్పడడం ఆస్తులను వంశపారంపర్యంలో ఏర్పరుచుట

హిబ్రూ, లాటిన్ తెగలలో భిన్నరూపాలలో పేట్రియార్కల్ కుటుంబాలు ఏర్పడ్డాయి వాని గతి క్రమంతో సంబంధం లేకుండానే ఆస్తి వైవిధ్యం కలిగి పరిమాణంలో పెరిగింది పెరిగిన ఆస్తి దంపతీ వివాహానికి పుష్టిని పెంచింది మానవ జాతియొక్క నాగరికతమీద ఆస్తియొక్క ప్రభావం ఎంత వుందో చెప్పడం సాధ్యం కాదు ఆర్యన్ సెమిటిక్ జాతులను అనాగరిక దశనుంచి నాగరిక దశకు తెచ్చింది అదే మానవుని మనస్సులో ఆస్తిభావం చాలా చాలా క్షీణ రూపంలో ప్రారంభమయింది అదే చివరకు జీవితాశయంగా మారింది దానిని సృష్టించడం, రక్షించడం, అనుభవించడం ప్రధాన లక్ష్యంగా ప్రభుత్వాల చట్టాలు ఏర్పడ్డాయి దానిని వుత్పత్తి చేసే సాధనంగా మానవులలో బానిసత్వం ప్రారంభించబడింది వేలసంవత్సరాల అనుభవం తర్వాత బానిసకన్న స్వతంత్రవ్యక్తి బాగా ఆస్తిని పేర్చగలడనే భావం వచ్చింది దానితో బానిసత్వం రద్దయింది మానవుని హృదయంలో క్రౌర్యం ఒక సహజ లక్షణం దానిని నాగరికతా, క్రైస్తవమూ మెత్త బరిచాయేగాని రద్దు చేయలేదు చరిత్ర తెలిసింతర్వాత గడిచిన వేలాది సంవత్సరాల కాలం మానవ బానిసత్వం కొనసాగుతూ మానవజాతికి అటవికత మూలమని స్పష్టంగా చూపిస్తూంది. యజమాని

యొక్క పిల్లలకు ఆస్తి వారసత్వం ఏర్పడ్డాక దంపతీ కుటుంబం దృఢ పడడానికి అవకాశం చిక్కింది నెమ్మదిగా అయితేనేం, క్రమంగా ఈ వివాహ పద్ధతి — అవితర సంపర్క పద్ధతి—సమాజంలో ఒక విధిఅయింది కాని నాగరికత ప్రారంభమయ్యే వరకు అది స్థిర పడలేదు

15 దంపతీ కుటుంబం

ఈ కుటుంబ పద్ధతి ఏర్పడడంలో పిల్లలకు తండ్రి ఎవరో స్థిరపడింది ఆస్తిమీద వుమ్మడి వారసత్వంపోయి వ్యక్తి హక్కు ఏర్పడింది గణ బంధువులను వదలి, వారసత్వం పిల్లలకు వచ్చింది ఆధునిక సమాజానికి మూలం దంపతీ కుటుంబం మానవజాతి అంతవరకు పొందిన అనుభవాలూ, దాని పురోగతి మహత్తరమైన ఈ వ్యవస్థలో మూర్తిమంతం అయ్యాయి యిది చాల నెమ్మదిగా పెరిగింది ఎక్కడో ఆటవికదశలో దీనికి వేళ్ళువున్నాయి యుగయుగాల అనుభవాలు క్రమంగా పేరుకొని ఈ రూపం ఏర్పడింది యిదిఎంతో ఆధునికంఅయినా అపారమైన అనుభవానికిఫలితం

16 ఆర్యన్, సెమిటిక్, యురాలియన్ బంధుత్వ వ్యవస్థలు —

ఈ మూడూ ప్రధాన విషయంలో ఒకే విధమైనవి వీనిని సృష్టించినది దంపతీ కుటుంబం. ఆ వివాహ రూపం, ఆ కుటుంబము, రూపము కింద వాస్తవంగా వున్న బంధుత్వాలనే అది నిర్దేశిస్తుంది బంధుత్వ వ్యవస్థ అన్నది సహజంగా పెరుగుతుండేకాని తోచినట్లుగా ఏర్పరిచేదికాదు ఆ వ్యవస్థ ఏర్పడేనాడు ప్రజల మనస్సులలో కనబడే వాస్తవ బంధుత్వాలను అది చూపిస్తుంది ఆర్యను బంధుత్వ వ్యవస్థ అప్పటికే దంపతీ కుటుంబం వుండడాన్నీ, తురానియన్ వ్యవస్థ, పునలాన్ కుటుంబం వుండడాన్నీ, మలయన్ వ్యవస్థ రక్తసంబంధ కుటుంబం వుండడాన్నీ ధృవపరుస్తున్నాయి మూడుతరహాల వివాహ పద్ధతులూ, మూడు కుటుంబ రూపాలూ, మూడు బంధుత్వ వ్యవస్థలూ వుండడాన్ని స్పష్టం చేశాను దీనితో ఈ క్రమంలోని 16 విషయాలలో తొమ్మిది ధృవపరచబడినాయి మిగిలిన వాటిని ధృవపరచడానికి తగిన సాక్ష్యం కావలసి వుంది

శతాబ్దాల పాటు సాధారణంగా ఆమోదిస్తున్న విషయాలను నేను పైన చెప్పిన అభిప్రాయాలు వ్యతిరేకిస్తున్నాయి అవి నాకు తెలుసును ఆటవికులు అనాగరికులు శారీరకంగాను మానసికంగాను చాలా హీన దశలో వుండడం, అసలు మనిషి వుండాలిసిన స్థాయికి దిగువన వుండడం మానవుని పతనం వలననే అనేటువంటి ఊహ వుంది. అదెప్పుడూ శాస్త్రీయంగా ప్రతిపాదించినదీ కాదు, దానికి సాక్ష్య బలమూలేదు

పరస్పరం అనుబంధించిన కల్పనలు, అన్వేషణలు యొక్క క్రమము, సామాజిక వ్యవస్థ యొక్క క్రమాభివృద్ధి, ఒకదాని తర్వాత ఒకటి వచ్చిన కుటుంబ రూపాలు ఆ వూహలను తోసిపుచ్చుతున్నాయి ఆర్యన్, సెమిటిక్ ప్రజలు తమ పూర్వీకులయిన అనాగరిక ప్రజల నుంచి వచ్చారు మనకు కనిపించిన నాటి అనాగరిక యుగపు ఎగువ దశకు వారెలా చేరుకున్నారు - అనే ప్రశ్న వస్తుంది ఆ యుగం యొక్క దిగువ దశ గడవనిదే మధ్య దశకు ఎలా వస్తారు? ఆ మధ్య దశలో కళలు మొదలైనవి అభివృద్ధి పొందించకుండా, అనుభవాలు గడించకుండ ఎగువ దశకెలా చేరుతారు? అనే ప్రశ్న వస్తుంది దీనికి వెనకాల మరో ప్రశ్న వుంది అటవిక దశ లేకుండ అనాగరికులు ఎలా వస్తారు? మనిషి పతనం పొంది ఈ రూపంలో వున్నాడనడం వలన మరో ప్రశ్న వస్తుంది ఆర్యన్ సెమిటిక్ జాతులతో సంబంధం లేని వారంతా హీన జాతులు గానే చెప్పాలి గదా, మానవ జాతి యొక్క పురోగతిలో ప్రధాన ప్రవాహాలు ఆర్యన్ సెమిటిక్ జాతులని వారే అత్యధిక వున్నత స్థానానికి చేరారు కాని ఆర్యన్ సెమిటిక్ తెగలుగా విడిపోక పూర్వం అసంఖ్యాకులైన అనాగరిక ప్రజా సమూహాలలో వారూ ఒక భాగంగానే వుండే వారనిచెప్పడానికి గట్టి కారణాలే వున్నాయి ఈ తెగలు ఏనాడో అనాగరిక ప్రజలతో కలిసి వుండడం, యింకా పూర్వం ఏనాడో అటవిక ప్రజలతో కలిసి వుండడం జరిగినప్పుడు సాధారణ అసాధారణ తెగలంటూ వేరు చేయడం నిరర్థకం

హీబ్రూ లాటిన్ తెగలలో మాదిరి పితృస్వామిక కుటుంబం అతి పురాతన కుటుంబ రూపమనీ, దాని నుంచే సమాజం మొట్ట మొదట నిర్మాణ యుతంగా ఏర్పడిందనీ కొంతమంది ప్రముఖ విద్వాంసులు వూహిస్తున్నారు ఇంతవరకు పైన చెప్పిన క్రమం దానితో భేదిస్తుంది వారి దృష్టిలో మానవ జాతికి ప్రారంభం నుంచి పితృస్వామిక కుటుంబం గురించి తెలుసునని, ఈ విధంగా చెప్పే వారిలో సర్ హెన్రీ మెయినే ప్రముఖుడు, ఇటీవలి వాడూనూ ప్రాచీన శాసనాలను గురించి ప్రాచీన నిర్మాణాల చరిత్రను గురించి ఆయన చేసిన పరిశోధనలు చాల గొప్పవి మనకెన్నో విషయాలను చెప్తున్నాయి సంప్రదాయ వాదులూ, సెమిటిక్ విషయ విజ్ఞానులైన ప్రముఖులూ చెప్పేదాన్ని బట్టి పితృస్వామిక కుటుంబము మనకు తెలిసినంతలో అతి పురాతనమనే మాట నిజం కాని వారి పద్ధతిలో జరిగే పరిశోధనలు అనాగరిక యుగం ఎగువ దశన్ను దాటి వెనక్కు వెళ్ళలేవు. అందువలన వారు కనీసం నాలుగు మానవ దశలను ముట్టుకోరు వాని మధ్యనున్న సంబంధాన్ని గుర్తించరు అయితే పూర్వన

జాతి యొక్క ఆద్యకాల పరిస్థితులను గురించి వాస్తవాలు యిటీవలనే బయట పడ్డాయనేది నిజం ఆ విషయ పరిశోధకులు ప్రాచీన సిద్ధాంతాలను కొత్త సిద్ధాంతాలనుగా చూపేరనేది కూడ యధార్థం

కీణ దశ అనే సిద్ధాంతానికి ఆటంకంగా శిల్పనలు అన్వేషణలు ఒకదాని తర్వాత ఒకటి వస్తాయి విల్లు, అంబుకి ముందు, నారిని గురించి తెలియాలి ఛర్మార్‌కి ముందు తుపాకి మందు పరిజ్ఞానం వుండాలి రైలు మార్గాలకి, ఆవిరి ఓడలకి పూర్వమే ఆవిరి యంత్రాలుండాలి జీవనోపాధి కళలు సుదీర్ఘ కాల వ్యవధులలో ఒకదాని వెనుక నొకటి వచ్చాయి ఇనుప పని ముట్లు రావడానికి పూర్వం చెకుముకి రాయి పనిముట్లు వచ్చాయి అదే విధంగా ప్రభుత్వ సంస్థలు అతి పురాతన భావ బీజాల పరిణామాలే పెరుగుదల, అభివృద్ధి, బదలాయింపు వలననే నాగరిక జాతుల వచ్చాయని చెప్పాలి అదే విధంగా దంపతీ కుటుంబం అనుభవం ద్వారా సిండియాస్మియన్ రూపం నుంచి, పునలాన్ రూపం నుంచి ఇంకా వెనక్కి అతి ప్రాచీనమైన రక్త సంబంధీకుల కుటుంబం నుంచి వచ్చినదే ఇంక చివరిగా దంపతీ కుటుంబం యొక్క ప్రాచీన రూపాన్ని వదలి పెట్టాలి అంటే, అది ఎలా పుట్టిందో తెలుసుకోవాలి అప్పుడే అది ఎంత కష్టపడితే వచ్చిందో తెలుస్తుంది అది చాల ముఖ్యం

ఆలోచనా పరులకు భూమి మీద మానవ జాతి యొక్క ప్రాచీన స్థితిని చూపేందుకు కావలసిన సాక్ష్యం మనకు లభించింది జాతులు (Races) అనేవి యూరప్ లో హిమానీ యుగం నాటికి ఏర్పడ్డాయి యింకా అంతకి వెనక్కి కూడ వుండివుండవచ్చు యిప్పుడు యుగ యుగాలుగా అతి దీర్ఘ కాలం నుంచి మానవుడు వున్నాడు అని తెలుసుకో గలుగుతున్నాం అతని జీవితం లక్షల సంవత్సరాలుగా కొనసాగుతూంది అని తెలుసుకున్నాక, ఆ మొదటి రోజులలో అతడెలా జీవించాడో అనిపించడం సహజం ఇన్ని లక్షల యేళ్ళు వ్యర్థంగా గడిచింది అనలేము అతని యొక్క మహత్తర సాధనలే అందుకు నిదర్శనం మానవ దశలు సుదీర్ఘకాలం సాగి వుంటాయి అని కూడ దానిని పట్టి తెలుసుకుంటాము నాగరికత యిటీవలిదే కావడం చూస్తే మానవ పురోగతి మార్గం ఎంత కష్ట భరితమో, తన జీవితాన్ని ప్రారంభించిన నాటికి అతను ఎంత దిగువ దశలో వున్నాడో చెప్తూంది

ఇంతకు పూర్వం చెప్పిన వరుస క్రమంలో ఎక్కడైన సవరణ అవసరం కావచ్చు అయా స్థానాలను మార్చవలసీ రావచ్చు కాని యిప్పటికి తెలిసినంతవరకు మానవ అనుభవాల వాస్తవం గురించీ,మానవ పురోగతి క్రమం గురించీ, కుటుంబము, ప్రభుత్వము భావాల అభివృద్ధిని గురించీ, హేతుబద్ధంగా, సంతృప్తికరంగా వివరించ డానికి అవి చాలు

## నోట్

# ఎ. ఎఫ్. మాక్లెన్నాన్ యొక్క "ప్రిమిటివ్ మేరేజ్"

నా పుస్తకము అచ్చుఅవుతున్న ఘట్టంలో పై పుస్తకం అందింది అది యింత క్రితమే అచ్చు అయింది కాని కొన్ని క్రొత్త వ్యాసాలు చేర్చి క్రొత్త పేరుతో వచ్చింది ఇప్పుడు దీని పేరు "Studies in Ancient History, Comprising a reprint of primitive Marriage"

దానిలో బంధుత్వాల వర్గీకరణ పద్ధతి అంటూ వంబయి ఒక్క పేజీలున్న వ్యాసంలో ఆ వర్గీకరణ వ్యవస్థ యొక్క ప్రారంభానికి గల కారణాలంటూ నేను చెప్పిన వాటిని ఖండించడానికి ప్రయత్నం జరిగింది ఆ వ్యవస్థ ఏర్పడటానికి మూలం ఏమిటో తమ ఆలోచనను మరో ముప్పది ఆరు పేజీలలో వ్రాశారు ఈయన నా పుస్తకం "Systems of Consanguinity and affinity of the Humau family",లో నేను వ్రాసిన దానిని గురించి విమర్శించారు ఈ పుస్తకం మూడో భాగం రెండు మూడు ప్రకరణాలలో వ్రాసింది పుస్తకంలోని నేను వ్రాసిన ఘటనలు, వివరణలు యించు మించు ఒకటే నా "రక్త సంబంధ వ్యవస్థ" 1871లో ప్రచురించ బడింది ఆయన "ప్రిమిటివ్ మేరేజ్" 1865లో ప్రచురించ బడింది

తరగతుల వారీ బంధుత్వ వ్యవస్థ వున్నదనడానికి వాస్తవాలను సేకరించి వాటిని ఒక పట్టిక రూపంలో చూపించి వాటి మూలం ఏమిటో ఊహించడానికి ప్రయత్నించాను వాస్తవం తెలుసు కోవటానికి ఆ ఊహ సహాయ పడుతుంది ఈవిషయమై వాస్తవాలు వివరించేటందుకు సరిపడా సాక్ష్యాలు వున్నాయా లేదా అన్నది నారెండు పుస్తకాలలోను వ్రాసిన దానిపై ఆధారపడి వుంటుంది అంత కంటే మంచికారణాలు దొరికేవరకు నా పుస్తకంలో దానికి యిచ్చిన స్థానం న్యాయ బద్ధమైనదీ, శాస్త్రీయ విచారణకు అనుగుణమైనదే

ఈ ఊహా సిద్ధాంతాన్ని మాక్లెన్నాన్ యిష్టంవచ్చినట్లు విమర్శించారు కొంచెం యించు మించు ఆయన అభిప్రాయం యిలా వుంది "ఈ విషయం యొక్క ప్రాముఖ్యతకి తగనట్టి విస్తారంగా దాని ఎరిష్కారాన్ని వ్రాశారు అయితే దీనిని ప్రకటించింది స్మిత్ సోనియన్ ఇనిస్టిట్యూషన్ వారు దానిని రూపొందించిన వారికి యు యస్ ప్రభుత్వం సహాయం చేసింది మోర్గన్ యొక్క ఈ రచనను ప్రామాణిక గ్రంథంగా తరచూ వుదాహరిస్తున్నారు అందుచేత యిది ఎంత అశాస్త్రీయమో చూపడానికి శ్రమ తీసుకో వలసి వస్తుంది "-ఆయన ఆరోపణ నా ఊహా సిద్ధాంతం మీదనే కాదు, పుస్తకం మొత్తాన్ని విమర్శించారు

ఆ పుస్తకంలో బంధుత్వాల, అనుబంధాల పట్టికలు నూట ఎనభై ఏడు పేజీలలో యిచ్చాను నూటముప్పై తొమ్మిది జాతులు తెగలలో వున్న వ్యవస్థలను అందులో యిచ్చాను తెగలూ, జాతులూ మానవ జాతిలో అయిదింట నాలుగు వంతుల మంది, అంటే యించు మించు మొత్తం మానవజాతి అనాది బంధుత్వ శబ్దాలలో చెప్పిన, బంధుత్వాల, అనుబంధాల వాస్తవ పదాలు ఒక పట్టిక రూపంలో చెప్పడం కూడ "కేవలం అశాస్త్రీయం" అనడం చిత్రంగా వుంది ఈ వివిధ వ్యవస్థలకు సంబంధించిన వివరాలు మిగిలిన పుస్తక భాగంలో వున్నాయి 690 పుటలున్న పుస్తకంలో చివరి 43 పుటలు ఈ అనేక రక్త బంధుత్వ వ్యవస్థల పోలికలను చూపుతున్నాయి అక్కడే నాఊహా సిద్ధాంతం వివరించాను యింత క్రొత్త సమాచారాన్ని తీసుకుని చర్చించడం అదే ప్రారంభం మాక్లెన్నాన్ తన విమర్శను ఈ ప్రకరణానికే పరిమితం చేసి వుంటే నేను మళ్ళీ సమాధానం చెప్పవలసిన అగత్యం వుండేది కాదు కాని ఆయన అసలు దాడి పట్టికల మీద వాటిలో వున్న వ్యవస్థలు రక్త బంధుత్వాల, అను బంధాల వ్యవస్థలు కానే కాదని దానితో సమస్య మొదటికి వచ్చింది

నేను చెప్పిన బంధుత్వాల, అనుబంధాల వ్యవస్థలు మాక్లెన్నాన్ తన ప్రిమిటివ్ మేరేజ్‌లో చెప్పిన ప్రధాన అభిప్రాయాలను, సిద్ధాంతాలను ఖండిస్తున్నాయి ఆయన అందులో చెప్పినవి కేవలం ఊహాత్మకమైన అభిప్రాయాలు వాటిని సమర్థించుకోవలసి వుంటుంది

ఆయన బంధుత్వ వ్యవస్థలనుగా చెప్తున్నవి [1 బహిర్వివాహము, అంతర్వివాహము అవి ఆయన క్రొత్త పదాలు అవి నిరుపయోగము ప్రిమిటివ్ మేరేజ్‌లో యిచ్చిన ఘటనలకు అంతర్వివాహము అనేది ఏ మాత్రము సరిపడదు బహిర్వివాహము అన్నది గణాలలోని నియమం దానిని అలాగేచెప్పడం అవసరం

2 స్త్రీల పారంపర్యం మాత్రమే వుంది అన్న మాక్లెన్నాన్ మాటను వాస్తవాలు నిరాకరిస్తున్నాయి ఒకేప్రజ స్త్రీ పారంపర్యాన్ని గుర్తించినంతగాను పురుష పారంపర్యాన్ని కూడ గుర్తిస్తున్నట్లు చూపుతున్నాయి

3 నాయర్లలోను, టిబెటన్లలోను వున్న బహు భర్తృత్వం మానవజాతి తెగలలో సర్వ సామాన్యంకాదు, అవి చూపిస్తున్నాయి

4 ప్రిమిటివ్ మేరేజ్‌లో చెప్పిన భార్యాపహరణానికి అంత అవసరం, విస్తృతి కూడ లేదని చూపుతున్నాయి

మ్యాక్లెన్నాన్ చేసిన విమర్శకు గల మూలాన్ని పరిశీలిస్తే ఆ విమర్శలకు మూలమైన సిద్ధాంతాలు సరిమైనవికావని కనబడుతుంది ఆ విధంగా పరిశీలన ప్రారంభం చేస్తే ఆయన రచన మొత్తం తుడుచుకు పోయింది ఆయన ప్రతిపాదనలను కొన్నింటిని చర్చకు పెడితే చాలును

1 ప్రిమిటివ్ మేరేజ్‌లో వుపయోగించిన ప్రధానమైన సాంకేతిక పదాలు, సిద్ధాంతాలు మానవజాతి శాస్త్రానికి నిరుపయోగం

2 బంధుత్వాల వర్గీకరణ పద్ధతికి మూలం అంటూ మ్యాక్లెన్నాన్ చెప్పిన ఊహా సిద్ధాంతం ఆ మూలాన్ని చెప్పలేదు

3 నా రచనలో ప్రతిపాదించిన ఊహా సిద్ధాంతానికి మాక్లెన్నాన్ చూపించిన అభ్యంతరాలలో పసలేదు

ఈ వరుస క్రమంలోనే నా యీ వాదనను కొనసాగిస్తాను 1 ప్రిమిటివ్ మేరేజ్‌లో వుపయోగించిన సాంకేతిక పదాలూ, సిద్ధాంతాలు మానవజాతి శాస్త్రానికి నిరుపయోగం

మొట్టమొదట ఆ పుస్తకం వెలువడినప్పుడు మానవజాతి శాస్త్రవేత్తలు దానిని చాల మెచ్చుకొన్నారు వారంతా చిరకాలంగా పనిచేస్తున్న అనేక సమస్యలను అది పృశిస్తూంది కాని జాగ్రత్తగా చదివాక నిర్వచనాలు సరిగ్గా లేవని, వ్యూహాలు సరిగ్గా లేవని, అంచనాలు బండగా వున్నాయని, నిర్ధారణలు తప్పుగా వున్నాయని తెలుసు కున్నారు హెర్బర్ట్ స్పెన్సర్ తన 'ప్రిన్సిపుల్స్ ఆఫ్ సోషియాలజీ'లో వానిలో కొన్నింటిని చూపించారు. చంటి ఆడపిల్లల హత్యలు, భార్యాపహరణం, బహిర్వి వాహము, అంతర్వివాహము, గురించిన మాక్లెన్నాన్ సిద్ధాంతాన్ని నిరాకరించారు కొన్ని మానవజాతి శాస్త్రవిషయాల సేకరణను తప్ప మాక్లెన్నాన్ రచనలో ఆయన ఒప్పుకున్నది కనబడదు.

ఇక్కడ మూడు విషయాలను పరిశీలిద్దాం. చాలు

1 మాక్లెన్నాన్ వుపయోగించిన బహిర్వివాహము, అంతర్వివాహము అనే పదాలు

ఇవి ఈయన తయారుచేసిన పదాలు బహిర్వివాహము అంటే ఒక సమూహం గుంపుకు వెలుపల అంతర్వివాహము అంటే గుంపు లోపల అని అర్థం

మాక్లెన్నాన్ ఈ పదాలను చాల అసందర్భంగా తోచినట్లు వుపయోగించారు. ఆయన ఉదహరించిన వ్యక్తులకు, చెప్పిన గుంపులకు ఆయన ఉపయోగించిన పదాలు *నిర్ధారణలు కూడ సరిపడవు గణాలు* తెగలు మొదలైన వరుస నిర్మాణాలలో దశలను గుర్తించకపోవడం చేత యిందులో ఎక్కడ బహిర్వివాహం జరుగుతుందో, ఎక్కడ అంతర్వివాహం జరుగుతుందో తెలియకపోవడం ప్రిమిటివ్ మేరేజ్‌లోవున్న ప్రధానమైన యిబ్బంది ఉదాహరణకి ఒక తెగలోని 8 గణాలలో ప్రతి ఒక్కటి తనకు పరిమితమై బహిర్వివాహం అవలు జరుపుతాయి మిగిలిన 7 గణాలకు సంబంధించినంత వరకు అవి అంతర్వివాహం చేసుకుంటాయి వైగా *ఈ పదాలను ఆ సందర్భాలలో* సరిగ్గా వుపయోగించకపోతే తప్పు అర్థం యిస్తాయి మానవ వ్యవహారాలను నడిపించిన విస్పష్టమైన సామాజిక పరిస్థితులను చూపించే రెండు ముఖ్య నియమాలను మాక్లెన్నాన్ వివరిస్తున్నారు నిజానికి 'ప్రిమిటివ్ మేరేజ్'లో చర్చించిన సామాజిక పరిస్థితులకు అంతర్వివాహ పదం ఏ మాత్రం వర్తించదు బహిర్వివాహము అన్నది గణాలలోని నియమం గణము అన్నది సామాజిక వ్యవస్థ నిర్మాణంలో ఒక మూల యూనిట్ మానవ వ్యవహారాలను నడిపించినది గణము అందుచేత మనకు దాని లక్షణాలను, దాని కార్యకలాపాలను, దానిలోని సభ్యులకున్న హక్కులు, సౌకర్యాలు, బాధ్యతలను తెలుసుకోవడం అవసరం ఈ విషయాలను గురించి మాక్లెన్నాన్ ఏమీ చెప్పరు ప్రాచీన సమాజంలో నిర్ణాయకమైన సంస్థగా గణం వుండేది అన్న ఆలోచన కూడ ఆయనకు వున్నట్టులేదు. గణం యొక్క నియమాలు రెండు 1 గణంలో అంతర్వివాహం నిషిద్ధం మాక్లెన్నాన్‌గారి బహిర్వివాహమన్నది యిదే అది ఎప్పుడూ *గణంలోనేవున్న నియమం* కాని *ఆయన గణం విషయం* ఎత్తుకోనే ఎత్తుకోరు.

2. గణాల అతిప్రాచీన రూపంలో స్త్రీ పారంపర్యమే సాగేది మాక్లెన్నాన్ గారి "స్త్రీల ద్వారా మాత్రమే బంధుత్వం" అన్నది అదే యిక్కడ కూడ ఆయన గణం ప్రసక్తి తీసుకరారు

దీనినింకాస్త లోతుగా పరిశీలిద్దాం మాక్లెన్నాన్ తన పుస్తకంలో తెగల గురించీ, తెగల వ్యవస్థను గురించీ ఏడు నిర్వచనాలిచ్చారు (పుటలు 113-116)

"శుద్ధమైన బహిర్వివాహ పద్ధతి — 1 తెగ (లేక కుటుంబం) వ్యవస్థ — తెగలు వేరు వేరుగా వుంటాయి ప్రతి తెగలోని సభ్యులు ఒకే రక్తం వాళ్ళు అయివుంటారు లేదా ఆ విధంగా చెప్పుకుంటారు తెగ సభ్యుల మధ్య వివాహం నిషిద్ధం

"2 తెగ వ్యవస్థ — తెగ అన్నది కుటుంబాల సమూహం యొక్క కూర్పు. అవి శాఖలు, కుదురులు, తమ్ముగా విడబడి వుంటాయి ఒకే శాఖలోని సభ్యుల మధ్య దాంపత్య సంబంధాలుండవు అన్ని శాఖల మధ్య దాంపత్య సంబంధాలుంటాయి

"3 తెగల వ్యవస్థ — తెగ అన్నది కుటుంబ సమూహాలతో కూడినది ఒకే మూలం నుంచి వచ్చినట్లు చెప్పే, కుటుంబ నామం కలిసిన — వ్యక్తుల మధ్య దాంపత్య సంబంధాలు వుండవు

"4 తెగ వ్యవస్థ — తెగలోని శాఖలు ఒకే శాఖలోని సభ్యుల మధ్య దాంపత్య సంబంధాలుండవు కొన్ని శాఖల మధ్య దాంపత్య సంబంధాలుంటాయి మిగిలిన వాని మధ్య పాక్షికంగానే వుంటాయి

"5 తెగ వ్యవస్థ — శాఖలుగా వున్న తెగ ఒకే మూలంనుంచి వచ్చిన వారి మధ్య దాంపత్య సంబంధాలు లేవు ప్రతి శాఖకు మరొక దానితో దాంపత్య బంధాలు. కొన్ని శాఖల మధ్య దాంపత్య బంధాలు లేవు, కులము.

6 శుద్ధమైన అంతర్వివాహము తెగ (లేక కుటుంబ వ్యవస్థ) — తెగ వేరు వేరు ప్రతి తెగలలోని సభ్యులు రక్తసంబంధం కలిగైనా వుంటారు. లేదా అలా చెప్పుకుంటారు తెగ సభ్యుల మధ్య దాంపత్య సంబంధాలుంటాయి తెగకు బయట వివాహం నిషిద్ధం, శిక్షార్హము

"7 అస్పష్టంగా వున్న — తెగ వ్యవస్థ" తెగ వ్యవస్థను గురించిన 7 నిర్వచనాలకు ముందు తెగ అంటే ఏమిటో గుర్తించేటందుకు వీలుగా, స్పష్టంగా చెప్పాలి.

మొట్టమొదటి నిర్వచనం పట్టి గందరగోళంగా వుంది తెగల వ్యవస్థలో అనేక తెగలుంటాయి ఆ మొత్తం తెగలకి ఒక పేరుండదు అవన్నీ ఒక సంఘంగా ఏర్పడవు వేరువేరు తెగలు ఈ తెగ వ్యవస్థ అన్న దాంట్లోకి ఎలావస్తాయో, అవి అన్నీ కలిసివుండటం ఎలా శటస్థ పడుతుందో అర్థంకాదు. ప్రతి తెగలోని సభ్యులు ఒకే రక్తంవారు అయివుంటారు లేదా అలా చెప్పుకుంటారు కనుక అంతర్వివాహం

కూడదు ఇది గణంయొక్క వర్ణన, కాని గణం అనేది వంటరిగా మిగిలిన గణాల నుంచి విడిపోయి ఎప్పుడూ వుండదు గణాలు కలిసఏర్పడిన ప్రతి తెగలోను సభ్యులు అనేకమంది వివాహాలద్వారా కలిసిపోయి వుంటారు కాని యిక్కడ మాక్లెన్నాన్ తెగను గణానికి పర్యాయ పదంగా కుటుంబ సమూహాల కూర్పు అని చెప్పి వుండ కూడదు రక్త బంధుత్వంగల అనేక వేరువేరు సమూహాలను తెగల వ్యవస్థలో కలిపి చెప్పటం ఆ సమూహాలు ఏమిటో చెప్పకపోవటం, ఆ వ్యవస్థ ఎలాంటిదో వివరించక పోవటం దీనివలన ఏదో క్రొత్త అర్థమే వస్తుంది ఆరో నిర్వచనం స్థితికూడ అదే ఈ రెండు నిర్వచనాలలో దేనికి సరిపడే తెగ ఈ భూమిమీద ఎక్కడా ఎప్పుడూ లేదు ఏమంటే అదో గణంకాదు గణాలు కలిసి ఏర్పడిన తెగ కాదు తెగలు సమ్మిళితమై ఏర్పడ్డ జాతి కాదు అదేదో క్రొత్తది

2, 3, 4, 5 నిర్వచనములు కొంత తెలిపేలా వున్నాయి. వాటిని చూస్తే బంధుత్వంగల శాఖలు లేదా గణాలుకలిసి తెగ ఏర్పడుతూంది అని అవిచూపిస్తున్నాయి కాని దానిని గణవ్యవస్థ అనాలి కాని తెగల వ్యవస్థ అనకూడదు కుదురులు, థమ్స్ లేక ఒకే తెగయొక్క శాఖల మధ్య వివాహం అంగీకరించబడుతుంది రెండు సంద ర్భాలలోనుకూడ తెగలో బహిర్వివాహము అనే మాటకు చెల్లుబడి వుండదు కుదురు, థమ్ లేదా శాఖ తనకు సంబంధించినంతవరకు బహిర్వివాహ బద్ధము కాని తెగలోని మిగిలిన కుదురులు, థమ్స్, శాఖలు సంబంధించి నంతవరకు అంతర్వివాహబద్ధము. కొన్ని, కొన్నిచోట్ల ప్రత్యేకించిన కొన్ని విశేషాలున్నాయి

మాక్లెన్నాన్ తెగలో బహిర్వివాహపదాన్నో, అంతర్వివాహపదాన్నో వుపయో గించినపుడు అది ఈ తెగల వ్యవస్థలో (దాని అర్థం ఏమైనా కానీయండి)వున్న అనేక వేరు వేరు తెగలలో ఒకదానికి వర్తిస్తుందా లేక కుటుంబ సమూహాల కూర్పు అని నిర్వచించిన దానికి చెందుతుందో తెలియదు తరువాతి పుటలోనే (116) ఆయన ఇలా వ్రాశారు "వేరు వేరు అంతర్వివాహ బద్ధములైన తెగలు, వేరు వేరు బహిర్వివాహ బద్ధములైన తెగలంత అధిక సంఖ్యలో వున్నాయి కొన్ని విషయాలలో అంత మోటుగాను వున్నాయి" ఆయన కుటుంబ సమూహాల కూర్పే తెగ అనేట్లయితే తెగను బహిర్వివాహ బద్ధము అనటానికి వీలులేదు తెగ అన్నది గణాలుకూడి ఏర్పడింది భూమిమీద ఏ మూలనుకూడ గణాలతో ఏర్పడిన తెగ మొత్తంలో బహిర్వివాహమే వుండే అవకాశం ఏ మాత్రం లేదు గణవ్యవస్థ వున్నచోటల్లా, అంతర్వివాహం నిషిద్ధం మాక్లెన్నాన్ ఉపయోగించిన పదం అదే కాని ఒక గణంలోని సభ్యులకూ

ఒకే తెగలోని మిగిలిన గణాల సభ్యులకూ మధ్య వివాహం అంగీకరించబడింది అంటే గణం అన్నది బహిర్వివాహ బద్ధము తెగ అన్నది తప్పనిసరిగా అంతర్వివాహ అనుబద్ధమన్నా ఇటువంటి సందర్భాల్లో తెగ అన్న గ్రూపును నిర్వచించవలసి వుంటుంది మరోవుదాహరణ (పుట 41) తీసుకుందాం. "మొట్టమొదట బహిర్వివాహ పద్ధతిగల తెగలు వున్నాయని లేక వుండేవని చూపగలిగితే, మరి మొటుదశలో వేరువేరు తెగలమధ్య తప్పకుండ లేక యించుమించుగా శత్రుత్వ సంబంధాలు వుండేవని చూపగలిగితే— ఆ పరిస్థితులలో మనుష్యులు భార్యలను అపహరణ ద్వారానే సంపాదించగలుగుతారు" భార్యాపహరణ సిద్ధాంతానికి మాక్లెన్నాన్ చూపించే ప్రాతిపదిక యిది "కొన్ని పరిస్థితులు" (శత్రుత్వంగల అందుచేత స్వతంత్రములైన తెగలు) వున్నట్లయితే అంటే గణాలలో కూడిన పెద్దగుంపు తెగ అనే అర్థం తవబడుతుంది ఏమంటే ఒక తెగలోని అనేక గణాల సభ్యులు ప్రతి కుటుంబములోను వివాహాల రీత్యా కలిసిపోయే వుంటారు అందుచేత గణాలన్ని శత్రుత్వంగలవైనా అయివుంటాయి. లేక మిత్రత్వంగలవైనా అయివుంటాయి ఈ పదాన్ని చిన్నగుంపుకి వుపయోగించి వుంటే అది గణమై వుంటుంది గణం బహిర్వివాహబద్ధం కాని పైనచెప్పిన రూపంలో తెగ ఎనిమిదింట ఏడుభాగాలలో అంతర్వివాహ అనుబద్ధం భార్యలను అపహరించే టందుకు అవసరపడే పరిస్థితులు అంటే ఏమిటి?

'ప్రిమిటివ్ మేరేజ్' పుస్తకంలో 75-100 పుటలమధ్య బహిర్వివాహ పద్ధతిని నిరూపించేటందుకై ఆయన ఖోండులు, కాల్మకులు, సర్కేషియన్లు, యురాక్ సామోయెద్‌లు ఆస్ట్రేలియా, ఇండియాలలోని కొన్ని తెగలు, ఇరాక్యూలతో సహా కొన్ని ఇండియన్ తెగలను ఉదాహరించారు అమెరికను తెగలు సర్వసాధారణంగా గణాలతో వున్నాయి మగవాడు తన గణానికే చెందిన స్త్రీని వివాహం చేసుకోలేడు కాని అతడు తన తెగకే చెందిన మరోగణం నుంచి స్త్రీని వివాహం చేసుకోవచ్చు. ఉదాహరణకు ఇరాక్యూలలోని సెనెకా తెగకు చెందిన తోడేలు గణంలో మగవాడు తన గణంలోని స్త్రీలను పెళ్ళాడలేడు. ఒక్క సెనెకా తెగలోనే కాదు ఇరాక్యూలలోని మిగిలిన ఐదు తెగలలోవున్న తోడేలు గణాల స్త్రీలను కూడా పెళ్ళిచేసుకోకూడదు మాక్లెన్నాన్‌గారి బహిర్వివాహ పద్ధతి ఇక్కడ పరిమిత పరిధిలో చూస్తాం అదెప్పుడూ అంతే ఆ వ్యక్తియొక్క గణానికే అది పరిమితం సెనెకా తెగలోని మిగిలిన ఏడు గణాలలో నుంచి అతను వివాహమాడవచ్చు ఇక్కడ మనకు అంతర్వివాహ ఆచారం కనబడుతుంది మిగిలిన సెనెకా గణాల ఏకింటి సభ్యులకూడ ఈ అలవాటును

పాటిసారు ఒకే తెగలో ఏకకాలంలో పక్కపక్కన ఈ రెండు ఆచారాల్లు ఏనాటి నుంచో వున్నాయి అమెరికన్, ఇండియన్ తెగలన్నింటా ఇది సర్వసామాన్యం కాని ఆయన వాటిని బహిర్వివాహ పద్ధతిగల తెగలనుగా ఉదహరించి తన సిద్ధాంతాలకు మూలం చేసుకున్నాడు

పై ఉదాహరణలో మాక్లెన్నాన్ అంతర్వివాహపద్ధతిని ప్రవేశ పెట్టలేదు ఏమంటే బహిర్వివాహ, అంతర్వివాహ పద్ధతులను రెండు పరస్పర విరుద్ధ విషయాలనుగా ఊహించుకోవడం ఒకటి వాస్తవానికి గణంలో అంతర్వివాహాన్ని నిషేధించడం రెండవది అమెరికన్ ఇండియనులు ఒక్క తమగణంలో తప్ప, తమ తెగ వారిని, యితర తెగల వారిని పెళ్ళి చేసుకోవచ్చు మాక్లెన్నాన్ అంతర్వివాహ పద్ధతికి మంచూతార్తార్‌లను (116 పుట) ఉదాహరించారు "కుటుంబ నామాలు కలియని వారు పెళ్ళి చేసుకోవడం నిషిద్ధం" వారిలో ప్రస్తుతం వున్న కొన్ని తెగలలో యిటువంటి ఉదాహరణలు మనకు కొన్ని దొరికాయి

సైబీరియాలోని యురాక్-సమోయెద్‌లను (82) నేపాల్‌లోని మాగార్లను (83), ఇండియాలోని ముస్లియా పోరీలు కొవిపోయీలు, మౌలు, మురామ్‌లు, ముర్రీ తెగలు (87) వీటిని వాస్తవ సాక్ష్యంతో పరిశీలించినట్లయితే వారిలో కూడ సరిగ్గా యిరాక్యూ తెగలలో కనిపించే పద్ధతులే కాపించుతాయి ఏమంటే వారిలోని శాఖలు, థమ్స్ అన్నది గణాలే క్లాప్రోతును ఉదహరిస్తూ, లాథామ్ సామోయెద్‌లలోని యూరాక్‌లు లేక కసోవోలను గురించి యిలా వ్రాశాడు "సామోయెద్ ఎవరూ తన శాఖకు చెందిన ఎవరినీ భార్యనుగా చేసుకోడు శాఖలో ఈ ఆచారాన్ని చాల కఠోరంగా పాటిస్తారు తద్భిన్నంగా మిగిలిన రెండు శాఖలలో ఒక దాని నుంచి భార్యను ఏరుకుంటారు." మాగార్‌లను గురించి ఆయనే ఇలా వ్రాశారు "వారిలో పన్నెండు థమ్స్ వున్నాయి థమ్‌లోని వారంతా ఒకే పూర్వ పురుషుణ్ణించి వచ్చినట్లు భావన ఒకే పూర్వ మాత గురించి చెప్పడం అవసరంలేదు అందుచేత భార్యా, భర్త వేర్వేరు థమ్‌లకు చెంది వుంటారు ఒకే థమ్ వారిలో పెళ్ళి కూడదు నీకు భార్య కావాలా ? ప్రక్క థమ్‌లో వెతుక్కో, కనీసం నీథమ్‌కు బయట వెతుక్కో, ఈ విషయాన్ని చెప్పడం, నేనిదే మొదలు, ఇదే ఆఖరు కాక పోవచ్చు ఏమంటే ఈ నియమం సర్వత్రా సాధారణంగా వుంది" ఇండియాలోని ముర్రింగులు మొదలైన తెగలలో శాఖలున్నాయి వివాహ విషయంలో వారికోసూ యిదే నియమం వీటన్నింటా కూడ అంతర్వివాహం నిషేధించబడిన గణాలే వున్నాయి అనుకోవచ్చు ప్రతి గణము

కన పరిధిలో బహిర్వివాహ పద్ధతి ననుసరిస్తుంది తెగలోని గణాల విషయంలో అంతర్వివాహ పద్ధతి ననుసరిస్తాయి కాని వీటన్నింటినీ మాక్లెన్నాన్ బహిర్వివాహ పద్ధతిగల తెగలనుగా ఉదాహరించారు ఆస్ట్రేలియాలోని ప్రధాన తెగలు కూడ గణాలుగానే ఏర్పడి వున్నాయి ఆ గణాలలో అంతర్వివాహం నిషిద్ధం. ఇక్కడ కూడ గణంలో బహిర్వివాహ పద్ధతి, తెగలో అంతర్వివాహ పద్ధతీ వున్నాయి

గణంలో అంతర్వివాహ పద్ధతి అనుసరిస్తూ అదే తెగకు చెందిన మిగిలిన గణాలలో అంతర్వివాహ పద్ధతిని పాటించేటపుడు అంతర్వివాహ, బహిర్వివాహమనే మాటలను ఒకే తెగ విషయంలో వుపయోగించడంలో అర్థమేమిటి. సమాజంలోని రెండు భిన్న పరిస్థితులను చూపిస్తున్నట్లు బహిర్వివాహ, అంతర్వివాహ పద్ధతులనే పదాలను వాడి ప్రయోజనం లేదు అమెరికన్ మానవ శాస్త్రంలో అవి చెల్లవు. ఆసియా, యూరప్ మానవ శాస్త్రంలో కూడ అవి చెల్లవు బహిర్వివాహము అన్నది ఒక చిన్న గుంపుకి, గణానికి మాత్రమే వర్తిస్తుంది అమెరికాలో బహిర్వివాహ పద్ధతిని పాటించే తెగలు లేనేలేవు కాని ఆ పద్ధతిని పాటించే గణాలు దండిగా వున్నాయి గణం అనేది వున్నచోట మనం దాని నియమాలను గమనించాలి వాటిని గణ నియమాలనుగానే చెప్పాలి. మాక్లెన్నాన్ కుదరు, ఖమ్, కాళి వీటిని బహిర్వివాహ ఆచారం కలవాటినిగా చూశాడు కాని వీటన్నింటి మొత్తములో అంతర్వివాహ పద్ధతిని పాటిస్తాయని గమనించినట్లయితే ఆ మాటచెప్పేవాడు పైగాకుదురు,కాళి,ఖమ్ బహిర్వివాహపద్ధతిని అనుసరిస్తాయని చెప్పాడు ఆ అనుసరిస్తున్నది తెగ అంటాడు పోనీ ఆయన తెగ, కుదురు, ఖమ్, కాళి యివన్నీ ఒకటే అనుకుంటున్నాడా అంటే అదీ కాదు "కాళి కుదురులు, ఖమ్స్ మొదలైన వారి కుటుంబాల గుంపుల యొక్క సమూహమే తెగ" అని నిర్వచించాడు కూడాను (114) వెను వెంటనే (118) "వేరు వేరు బహిర్వివాహ పద్ధతిగల తెగలలాగానే వేరు వేరు అంతర్వివాహ పద్ధతిగల తెగలు కూడ అంత ఎక్కువగా వున్నాయి" అన్నాడు ఆయన యొక్క ప్రధాన నిర్వచనాల వరకు ఈ పుస్తకంలో బహిర్వివాహ పద్ధతేగల తెగను ఒక్క దానిని కూడ చూపలేక పోయారని నిర్భయంగా చెప్పవచ్చు

ఈ జంట పదాలకు యింకో అభ్యంతరం వుంది సమాజంలో పోలిక లేని విరుద్ధ పరిస్థితులను సూచించడానికై ఆయన వాటిని చెప్పారు ఈ రెండింటిలో మొదటైన దేది, అభివృద్ధి పొందినదేది? మాక్లెన్నాన్ ఈ విషయంలో చాల జాగ్రత్తనే తీసుకున్నాడు "అవి బహిర్వివాహం నుంచి అంతర్వివాహానికో, అంతర్వివాహం

నుంచి బహిర్వివాహానికో పురోగతిని చూడవచ్చు" (115), "ఇవి రెండూ ఒకే విధంగా పురాతనమైన పాతబడి పోయినవే" (116) "అవి రెండూ కొన్ని విషయాలలో" సమానమైన మోటువే (116 పుట) కాని చర్చపూర్తయ్యేసరికి అంతర్వివాహ పద్ధతి వున్నతమైనదిగా, నాగరికతకు దారితీస్తున్నదిగా, బహిర్వివాహము ఆటవిక దశకు చెందినదిగా తయారయ్యాయి మాక్లెన్నాన్ ఊహలలో బహిర్వివాహము అన్నది జాతి విభజనను ప్రవేశ పెట్టినట్టు, అంతర్వివాహం అన్నది దానిని తొలగించి ఏక జాతిత్వాన్ని ప్రవేశ పెట్టినట్టు ఉపయోగించారు అందుచేత బహిర్వివాహాన్ని తోసి వేసి అంతర్వివాహ పద్ధతి పురోభివృద్ధికి కారణమైనట్లు ఆయన భావించారు

ఈ రెండు పదాల యొక్క స్థానాలను తల క్రిందులు చేయడం ఆయన చేసిన మరో తప్పు మానవ పురోగతిలో అంతర్వివాహ పద్ధతి బహిర్వివాహ పద్ధతికి ముందు వున్నదని మానవ జాతి చాల దిగువదశలోవున్నప్పుడు దాని ననుసరించిందని ఆయన చెప్తారు పలయన్‌బంధుత్వ వ్యవస్థ ఏర్పడినప్పటికి, గణాలు ఏర్పడలేదు రక్త బంధువుల గుంపులు వివాహ సంబంధాలు కలిగే వుండే వారు బంధుత్వ వ్యవస్థ అన్నది ఆ గుంపుల అస్తిత్వాన్నీ, వాని లక్షణాన్నీ కూడ చెప్తుంది అంతర్వివాహ పద్ధతే బలంగా వున్నట్టు అది చూపుతుంది ఈ పరిస్థితులు మారి అంతర్వివాహ పద్ధతిలో మొట్ట మొదటి సవరణ వచ్చింది పునలాన్ జట్టు ఏర్పడింది అందులో తోడబుట్టిన సోదరీ సోదరుల మధ్య వివాహాన్ని నిషేధించారు జ్ఞాతులయిన సోదరీ సోదరులు ఎంత దూరం వారయినా వివాహమాడవచ్చునన్నారు కాని వారందరూ సోదరీ సోదరులు అనే పేరుతోనే వున్నారు స్త్రీ, పురుషులుగా విభజించిన ఆస్ట్రేలియన్ నిర్మాణంలో కూడ యిదే పరిస్థితి కనిపిస్తుంది కాల క్రమంలో గణాలు వచ్చాయి వానిలో స్త్రీ పారంపర్యం కొనసాగింది గణంలో అంతర్వివాహం నిషేధించబడింది అక్కడ మాక్లెన్నాన్‌గారి బహిర్వివాహ పద్ధతి ప్రవేశించింది అక్కడి నుంచి మానవ వ్యవహారాలలో అంతర్వివాహ పద్ధతి యొక్క పలుకుబడి అంతరించింది

మాక్లెన్నాన్ అభిప్రాయం ప్రకారం పురోగమించిన మానవ తెగలలో బహిర్వివాహ పద్ధతి ఆగిపోయింది పారంపర్యం మగవాని నుంచి ప్రవేశపెట్టాక గ్రీకు, రోము తెగలలో అది అంతరించింది (220) అసలు జరిగిందిది కానే కాదు ఆయన బహిర్వివాహము అని పిలిచేది ఆటవిక యుగంలో గణాలతోపాటు వచ్చింది అనాగరిక యుగం పొడవునా సాగింది నాగరిక యుగంలో విలీనమైంది ఈనాడు ఇరాక్వ్యా గణాలలో వున్నట్లుగానే సొలోన్ కాలంగానూ, సెర్వియస్ తుల్లియస్

కాలంలోనూ గ్రీకుల,రోమనుల గణాలలో అది వుంది ఆయన ప్రిమిటివ్ మేరేజ్‌లో ఉపయోగించిన పద్ధతిని పట్టి బహిర్వివాహము అంతర్వివాహము అనేవి పూర్తిగా అప్రతిష్ఠ పాలయ్యాయి వాటి నింక పక్కకు పెట్టడం మంచిది

## 2. "స్త్రీల ద్వారానే బంధుత్వ వ్యవస్థ" అన్న మాక్లెన్నాన్ పదం

ఈ పదాన్ని 'ప్రిమిటివ్ మేరేజ్'లో పదే పదే ఉపయోగించారు అది వున్న చోట మరో బంధుత్వాన్ని గుర్తించరు అని గట్టిగా చెప్పారు అది తప్పు అని దాని ముఖాన్నే వ్రాసి వుంది తురానియన్, గనోవానియన్,మలయన్ బంధుత్వ వ్యవస్థలలో స్త్రీల నుంచి బంధుత్వాలను గుర్తించినంతగాను, పురుషుల నుంచి గుర్తిస్తారని స్పష్టంగా తెలుస్తుంది ఒక మగవాడికి అన్నదమ్ములున్నారు అక్కచెల్లెళ్ళున్నారు తాతలుంటారు అవ్వలుంటారు మనమలుంటారు మనమరాళ్ళుంటారు వీళ్ళందర్నీ స్త్రీల వైపు నుంచి, పురుషుల వైపునుంచి కూడ గుర్తించడం వుంటుంది పిల్లల తల్లి ఎవరో స్పష్టంగా తెలుస్తుంది తండ్రి విషయంలో ఆ స్పష్టత వుండదు ఆ స్పష్టత లేదు కనుక మగవాడికి బంధుత్వాల్లేకుండ పోవు ఇంత మంది విషయంలో సందేహం వుండదు తండ్రులు అనుకోతగిన వారిని అసలు తండ్రులుగానే చెప్తారు. సోదరుడు అనుకో తగిన వారిని అసలు సోదరులనుగా, కొడుకులు అనుకో తగిన వారిని అసలు కొడుకులనుగా చెప్తారు

గణాలు వచ్చాక స్త్రీల ద్వారా బంధుత్వానికి ప్రాముఖ్యం పెరిగింది ఇప్పుడు గణ బంధుత్వం యితర బంధుత్వాలకన్న స్పష్టంగా, ప్రధానంగా కన్పిస్తుంది మాక్లెన్నాన్ ఉదహరించిన వారిలో చాల మంది చెప్పినది ఈ బంధుత్వాన్ని గురించే గణంలోని స్త్రీల సంతానం దానిలోనే వుంటారు పురుషుల సంతానాన్ని అందులో చేర్చరు స్త్రీ పారంపర్యం కొనసాగినంత కాలం గణంలోని స్త్రీ పురుషులంతా తాము ఒక ప్రాచీన మాత నుంచి వచ్చినట్టు చెప్పుకునేవారు పురుష పారం పర్యం వచ్చాక ఒక ప్రాచీన పురుషుడి నుంచి వచ్చినట్టు చెప్పుకున్నారు దానిలోని సభ్యులంతా ఒకే గణ నామాన్ని వుపయోగిస్తూ సంఘటితపడి వుంటున్నారు రక్త అనుబంధాలు, పరస్పర హక్కులు, బాధ్యతలు, సౌకర్యాల బంధాలు వారిని కలిపి పట్టివుంచుతున్నాయి రెండు సందర్భాలలోను కూడ యితర బంధుత్వాల కన్న గణ బంధుత్వం బలీయమైనదయింది దానికి కారణం మరో బంధుత్వాన్ని గుర్తించక పోవడంకాదు. గణ బంధుత్వం వారికి హక్కులు, సౌకర్యాలను కలిగిస్తుంది కనుక తాను వహిస్తున్న

విషయాన్ని సరిగ్గా పరిశోధించక పోవడం చేత మాక్లెన్నాన్‌కు ఈ భేదం అర్థం కాలేదు స్త్రీ పారంపర్యం కొనసాగుతూ వుంటే ఒక మగవాడికి తాతలు, అవ్వలు, అమ్మలు, సోదరీ సోదరులు, పిన తండ్రి, పెద తండ్రులు, మేనల్లుళ్ళు, మేనకోడళ్ళు, మనుమలు, మనుమరాళ్ళు అతని గణంలోనే వుంటారు వారిలో కొందరు స్వంత వాళ్ళు, కొందరు జ్ఞాతులు ఒక్క పినతండ్రులు పెదతండ్రులు తప్ప ఇదే బంధువులు అతనికి గణం వెలుపలా వుంటారు ఇంకా అదనంగా నాన్నలు, పినతల్లి పెద తల్లుల కొడుకులు కూతుళ్ళు, కజిన్స్ వీళ్ళు కూడ వుంటారు అలాగే స్త్రీకి కూడ మగవాడికున్న బంధువులే గణంలో వుంటారు అదనంగా కొడుకులు,కూతుళ్ళు వుంటారు మగవానికున్న బంధువులే ఆమెకూ గణం వెలుపల వుంటారు గణం *లోపల వుండనీ, బయట వుండనీ తండ్రి తండ్రే సోదరుడు* సోదరుడే కొడుకు కొడుకే అందరికీ ఆ బంధుత్వ పదాన్ని తేడా లేకుండా వుపయోగిస్తారు "స్త్రీ ద్వారానే బంధుత్వము" అనేది స్త్రీ పారంపర్యాన్ని సూచిస్తుంది అది గణంలో ఒక నియమం తప్ప మరేమీ కాదు గణము అన్నది మూల విషయం గణ బంధుత్వము అన్నది దాని లక్షణాలలో ఒకటి అందుచేత దాన్ని అలాగే చెప్పాలి

గణ నిర్మాణానికి పూర్వం మగవాడి ద్వారా బంధుత్వం కన్న స్త్రీ ద్వారా బంధుత్వం దృఢమైనది దిగువ స్థాయిలో వున్న తెగల నిర్మాణానికి ప్రధానమైన ప్రాతిపదిక నిస్సందేహంగా అదే కాని గణ వ్యవస్థకి పూర్వం వుండిన మానవజాతి *పరిస్థితులతో సంబంధం ఏ మాత్రం లేని ఘటనలనే 'ప్రిమిటివ్ మేరేజ్'లో* ఆయన ఎత్తుకున్నారు

### 3. నాయర్, టిబెటన్ బహుభర్తృత్వం పరిపాటిగా వుండేదనడానికి సాక్ష్యం లేదు

ఈ బహు భార్యాత్వ రూపాలు ప్రపంచ మంతటా పాటించబడుతున్నట్లే మాక్లెన్నాన్ ఆలోచన బంధుత్వాల వర్గీకరణ వ్యవస్థకు వీటిని మూలముగా చూపడానికి ఆయన ప్రయత్నించారు పరస్పర సంబంధం లేని అనేకమంది పురుషులు *ఉమ్మడిగా ఒకే భార్యను కలిగి యుండడం నాయర్లలోని బహు భర్తృత్వం*(146 పుట). దానిని నిహీనమైన రూపం అన్నారు అనేక మంది సోదరులు ఉమ్మడిగా ఒక భార్యను కలిగి వుండడం టిబెటన్ బహుభర్తృత్వం అక్కడి నుంచి మానవజాతి తెగల గుండా వేగంగా ముందుకు సాగి ఈ రెండు రూపాలలో ఏదో ఒకటి పరిపాటిగా

వున్నట్టు చూపబోయాడు చివరకు చూపలేకనే పోయాడు ఆయనకు ఈ భర్తృత్వ రూపాలు మినహాయింపులు మాత్రమే గాని సామాన్య రూపాలు కావని, యింత కంటే గట్టి సాక్ష్యం వుంటే తప్ప నీలగిరి కొండలలోనూ, టిబెట్‌లోను వున్నాయనడానికి వీలు కాదని గట్టిగా చెప్పవచ్చు మమ్మోన్‌లలో నగటున ముగ్గురికి ఒక భార్య వుంటే, (నాయర్లలో 12 గురికి ఒక భార్యగా పరిమితి - పుట 147), ఇది ఒక తెగలో సర్వ సామాన్య ఆచారం అయితే వివాహార్హతగల వయస్సున్న స్త్రీలలో మూడింట రెండు వంతుల మందికి మగళ్లే వుండరు అటువంటి పరిస్థితి మానవ జాతి తెగలు వేటిలోనూ వుండదని, నీలగిరులు, టిబెటులలో వున్నాయనడానికి ఇప్పటి కన్న మంచి సాక్ష్యం లేనిదే నమ్మరాదని నిశ్చితంగా చెప్పవచ్చు నాయర్లలోని బహుభర్తృత్వం గురించిన వాస్తవాలు యింకా పూర్తిగా తెలియవు అయినే (148), ఇలా వ్రాశారు "అనేక మంది భర్తలలో నాయరు ఒకడు కావచ్చు అంటే అతనికి అనేక మంది భార్యలు వుండవచ్చు" దీని వలన ఒక భార్యకు భర్తల సంఖ్య పెరగవచ్చు ఆ భర్తకు అవివాహితులైన స్త్రీలు అధిక సంఖ్యలో వుండడం జరగదు పైగా ఈ బహుభర్తృత్వ రూపాలు సాధారణంగా వున్నాయని చెప్పడానికి స్త్రీ శిశువులను చంపి వేయడం అనేది సెంచినట్టు కనిపిస్తుంది కాని ఈ రెండింటిలో ఏ ఒక్కటీ కూడ మానవ వ్యవహారాల మీద తమ ప్రభావాన్ని కలిగించేవిగా లేవు

మలయన్, తురానియన్, గనోవానియన్, బంధుత్వ వ్యవస్థలు మానవ వ్యవహారాల మీద వలుకుబడి చూపగలంత బహుభార్యాత్వ బహుభర్తృత్వ రూపాలను మనకు చూపుతాయి ఈ వ్యవస్థలు ఆచరణలో వున్నప్పుడు ఆ రూపాలు సర్వత్రా పరిపాటిగానే వుండేవి రక్తబంధువుల జట్లలో సోదరీ సోదరుల మధ్య వివాహాలుండేవి జ్ఞాతి సోదరీ సోదరులంతా ఆ జట్టులోని వారే యిక్కడ మగ వాళ్ళంతా బహుభార్యాత్వాన్ని, ఆడ వాళ్ళంతా బహు భర్తృత్వాన్ని పాటించారు తురానియన్, గనోవానియన్ వ్యవస్థలో యింతకన్న పురోగమించిన దశలో జట్లు వున్నాయి ఇక్కడ రెండు రూపాల పునాలా వుండేది భర్తలందరి సోదరత్వం ఒక రూపం రెండవది అక్క చెల్లెలందరి సోదరీత్వం ఇందులో తోడబుట్టిన సోదరీ సోదరులు వివాహ బంధం నుంచి వెలి పెట్టబడ్డారు ఈ రెండు జట్లలో మగ వాళ్ళు బహుభార్యాత్వాన్ని స్త్రీలు బహుభర్తృత్వాన్ని పాటిస్తున్నారు ఒకే జట్టులో ఈ రెండు ఆచారాలు కనిపిస్తున్నాయి వారి బంధుత్వ వ్యవస్థను చెప్పడానికి ఈ రెండూ ముఖ్యమే తురానియన్, గనోవానియన్ బంధుత్వ వ్యవస్థ పునలాన్ గుంపు పెళ్ళి వున్నట్లు

చూపుతుంది ఇదీ మలయన్ వ్యవస్థ మానవ జాతి శాస్త్రంతో సంబంధం వున్న బహు భార్యాత్వ, బహు భర్తృత్వ రూపాలను ఇది వివరిస్తుంది నాయర్, టిబెటన్ బహు భర్తృత్వ రూపాలు ఈ వ్యవస్థలను వివరించ లేవు వానికంత ప్రాముఖ్యమూ లేదు

మాక్లెన్నాన్ తన 'ప్రిమిటివ్ మేరేజ్'లో రూపొందించిన సిద్ధాంతాలను అభిప్రాయాలను నా పట్టికలోని బంధుత్వ అనుబంధ వ్యవస్థలు తల్లక్రిందులు చేశాయి ఆ వ్యవస్థల మూలాలను వివరిస్తూ నేను చేసిన ఈ ఊహా కల్పన మీద దాడి చేయటానికి అదే కారణం అనుకుంటాను అవి బంధుత్వ అనుబంధ వ్యవస్థలు కానే కాదని అంటూ వాటిస్థానే మరొకటి ప్రవేశ పెట్టడానికి ప్రయత్నించారు

2 తరగతి విభజన వ్యవస్థకు అంటూ మాక్లెన్నాన్ చేసిన ఊహా కల్పన, ఆ వ్యవస్థ మూలాన్ని నిరూపించలేదు

"వర్గీకరణ వ్యవస్థా రూపాలన్నింటా కనబడే పరిస్థితికి వివాహ చట్టం మూల కారణం అందుచేత అవి పుట్టడానికి కారణం కూడ అదే అయి వుంటుంది" అని ఆయన తన ప్రకటన చేశారు (372) నా వివరణకు మూలం అదే, ఆయన వివరణలో అది కొంత భాగం మాత్రమే

ఆయన మలయన్ వ్యవస్థకు మూలం అని చెప్పడానికి ప్రయత్నించే వివాహ నియమం నాయర్ బహు భర్తృత్వంలో కనిపిస్తుంది తురానియన్, గనోవానియన్ వ్యవస్థలకు మూలముగా చెప్పడానికి ప్రయత్నించే వివాహ నియమం టిబెటన్ బహు భర్తృత్వంలో కనిపిస్తుంది కాని తన ఊహాకల్పనను నిరూపించగల బంధుత్వ వ్యవస్థ నాయర్‌లదికాని, టిబెటన్‌లదికాని ఆయన వద్దలేదు అందుచేత నాయర్, టిబెటన్ సమాచారం ఏమీ లేకుండా బంధుత్వాలలో వర్గీకరణ వ్యవస్థగల తెగలు జాతులలో ఎప్పుడూ లేని వివాహ నియమ రూపాలను ఆయన తీసుకొచ్చారు అందుచేత ఆసమస్యమీద ఆయన యిచ్చిన వివరణను వట్టి ఊహమాత్రమేనని మొదట్లోనే తేలిపోతుంది

నా పట్టికలలోని వ్యవస్థలు బంధుత్వ అనుబంధ వ్యవస్థలు కానే కాదని మాక్లెన్నాన్ నిరాకరిస్తున్నాడు "అవి వ్యక్తులను పిలిచేందుకుయోగించే పదాల వ్యవస్థలు మాత్రమే" అని ఆయన చెప్తున్నారు ఈ నిరాకరణ కూడ నిర్ధారణగా లేదు ఆయన ఉపయోగించిన భాష ఆ అభిప్రాయాన్ని కలిగిస్తుంది అమెరికన్ ఇండియనులు వ్లూమ్మూలు పరిచయాలలోను, సంభాషణలలోను తమ యిద్దరి మధ్య మున్న వాస్తవ

బంధుత్వ పదంతో ఒకరినొకరు పిలుచుకుంటారు ఎవ్వరూ ఎదుటి వారి పేరును ఉపయోగించరు, అని నా రచనలో స్పష్టంగా చెప్పాను దక్షిణ భారత దేశంలోను, చైనాలోను కూడ అదే పద్ధతి వున్నదన్నాను అది బంధుత్వ, అనుబంధ వ్యవస్థను చూపుతూంది కనుక ఆ పదాలతో పిలుచుకుంటారన్నాను దానికి తిరుగులేదు కాని మాక్లెన్నాన్ సమగ్రములైన ఈ వ్యవస్థలు పారిభాషిక పదాలు మాత్రమేనని ఒకరినొకరు పిలుచుకోవడానికి వచ్చాయే తప్ప వానికి మరో ఉద్దేశ్యం లేదన్నాడు మానవజాతి ప్రాథమిక దశను చూపించే ఈ అసాధారణ పద్ధతిని తోసేయడం ఈ వ్యవస్థలను అవతల పెట్టటానికి ఉపయోగిస్తుంది

పిలుపుల పద్ధతికో నిమిత్తం లేకుండా బంధుత్వ వ్యవస్థ ఎక్కడో వుండే వుంటుందని మాక్లెన్నాన్ భావన "బంధుత్వ వ్యవస్థలూ పిలుపుల పద్ధతులూ ప్రక్క ప్రక్కనే ప్రారంభమై పెరిగి వుంటాయని కొంత కాలం పాటు వాని చరిత్ర వుమ్మడిగా వుంటుందని ఊహించడానికి తగిన కారణాలున్నాయి" (373) రక్త అనుబంధాల వ్యవస్థ అన్నదే బంధుత్వవ్యవస్థ మరి ఆ వ్యవస్థ పోయిందెక్కడా? అదేమిటో మాక్లెన్నాన్ చూపడు చెప్పడు మనుష్యులను పిలిచేందుకు అదో పద్ధతి అంటూ నా పట్టికలోని వ్యవస్థలను ఉపయోగించుకుంటాడు తన ఊహల కనుగుణంగా వానిని సవరించుకోవడానికి కూడ ప్రయత్నించడు

ప్రపంచ మంతటా వ్యాపించి యుగ యుగాలు గడిపిన ఆటవిక, అనాగరిక తెగలు బంధువులను పిలుచుకొనే పద్ధతిని పట్టి మలయన్ తురానియన్ గనోవానియన్ వ్యవస్థలను సంపూర్ణ సంక్లిష్ట రూపాలలో తయారు చేసేందుకు తాపత్రయ పడ్డారా? ఆసియా, ఆఫ్రికా, పాలినీషియా, అమెరికాలలో ఈ రెండు పద్ధతులనే అనుసరించాలని అనుకొని వుండాలనే, ఈ పని చేసి ఉంటారా? తన తాత సోదరులనుకూడ తాత అనాలని, తన తమ్ముళ్ళలో పెద్ద వాళ్ళని అన్నలనీ, చిన్న వాళ్ళని తమ్ముళ్ళని పిలవాలని అనుకొని వుంటారా? ఇదంతా యాదృచ్ఛిక ఘటనేనా?—అవుననే ఆ రచయిత యొక్క ఊహ

వ్యక్తులను పిలిచే పద్ధతుల అస్థిరం ఏమంటే సంప్రదాయకంగా ఉపయోగించే పన్నీ తాత్కాలికమే అవి మానవ జాతిలోని తెగల వలె అంత వైవిధ్యము కలిగి వుంటాయి కాని బంధుత్వ వ్యవస్థ అలాకాదు ఆ బంధుత్వాలు కుటుంబము, వివాహ నియమాల వట్టి వస్తాయి అవి కుటుంబం కంటేను స్థిరంగా వుంటాయి ఆ వ్యవస్థలు నిలకడుగా వుంటాయి కుటుంబాలు మాత్రం పురోగమిస్తాయి ఆ వ్యవస్థ ఏర్పడి

నపుడు సమాజ పరిస్థితి ఏమిటో ఆ బంధుత్వాలు చెప్తాయి మానవజాతి జీవితంలో అవి నిత్యావసరాలు వివాహ నియమంతో సంబంధించి వుంటాయి కనుకనే భూమి మీద సుదూర ప్రాంతాలలో కూడ అవి ఒకే రీతిగా వుంటాయి యుగ యుగాలు నిలబడి ఉంటాయి.

మలయన్ బంధుత్వ వ్యవస్థ ఏర్పడినపుడు తల్లి తనకు, తన కొడుక్కి, కూతురుకి ఒక బంధుత్వం వున్నదని దానిని ప్రకటించేటందుకు ప్రత్యేక శబ్దాలను ఉపయోగించాలని ఎరిగే వుంటుంది అలాగే తన తల్లితో, తన తల్లి తల్లితో, ఒక విధమైన బంధుత్వాలు వున్నాయని, తన తల్లి యొక్క యితర పిల్లలకు తనకు మరో రకమైన బంధుత్వాలున్నాయని, తన కూతురు పిల్లలకూ తనకు, యింకా యితరులకు మరో రకమైన బంధుత్వాలున్నాయని వాటిని తగు పదాలతో చెప్పాలని ఎరిగే వుంటుంది వివాహ నియమంతో ఏ మాత్రం సంబంధం లేకుండానే మలయన్ వ్యవస్థ లోని బంధుత్వ తరగతు లయిదింటికి పునాది ఆ విధంగా ఏర్పడుతుంది

రక్త సంబంధీకుల కుటుంబమూ, గుంపు వివాహ పద్ధతి వచ్చినపుడు పైన చెప్పిన ప్రాథమిక భావాలు పునాదిగా మలయన్ వ్యవస్థ ఆ గుంపుని కప్పుకుంటుంది ఆ రెండింటికి సాక్ష్యం ఆ వ్యవస్థలో వుంది తోడబుట్టిన వాళ్ళూ జ్ఞాతులూ అయిన వారి మధ్య అంతర్వివాహం వలన ఏర్పడిన బంధుత్వాల — అనుబంధాల వ్యవస్థ మలయన్ వ్యవస్థయే. ఈ వాస్తవాలను గుర్తించకపోతే మలయన్ వ్యవస్థ యొక్క మూలాన్ని మరొక విధంగా చెప్పడం సాధ్యంకాదు ఆ మాదిరి వివాహ పద్ధతి కుటుంబ పద్ధతి మాత్రమే మలయన్ వ్యవస్థను సృష్టించగలదు బంధుత్వాలు అనుబంధాలను ప్రారంభం నుంచి చూపి వివరించగల వ్యవస్థ అది

ఈ అభిప్రాయాలు సరియైనవే అయితే మాక్లెన్నాన్ యొక్క ఊహా కల్పన లోని అంశాలను మరి పరిశీలించనక్కరలేదు తార్కిక చింతనకు అవి దొరకవు ఈ వ్యవస్థల మూలాన్ని చూపడానికి అవి ఏ మాత్రం పనికిరావు

1 నా 'బంధుత్వ వ్యవస్థ ' పుస్తకంలో ప్రతిపాదించిన ఊహాత్మక సిద్ధాంతాలకు మాక్లెన్నాన్ చెప్పిన అభ్యంతరాలు బలం లేనివి

వాస్తవాలను గుర్తించకపోవడం, భావాలలో గందరగోళం, ఆయన ఆఖరి వ్యాసంలో కన్పిస్తున్నాయి ఒకే వ్యక్తుల మధ్య రక్త బంధుత్వాలు, వివాహాలు, బంధుత్వాలు వున్నపుడు వాటిని వేరు వేరుగా తీసుకోరు అదే విధంగా వ్యవస్థలలోని బంధుత్వాల విషయంలో కూడ తప్పులే చేస్తున్నారు

నా ఊహా కల్పన మీద మాక్లెన్నాన్ విమర్శలను ఒక్కొక్కటిగా ఎత్తుకోవడం అనవసరం వాటిలో కొన్ని మాటలు మాత్రమే విమర్శలు మిగిలినవి విషయాన్ని వక్రీకరిస్తాయి ఏ ఒక్కటీ సమస్యను ముట్టుకోదు ఆయన నిరాకరిస్తున్న మొదటి ప్రతిపాదన యిది అంటూ యిలా వ్రాశాడు — "మలయన్ బంధుత్వ వ్యవస్థ రక్త బంధుత్వాల వ్యవస్థ అని మోర్గన్ ఊహిస్తాడు కాని ఆ ఊహకున్న అభ్యంతరాలను గురించి ఏమీ చెప్పడు" (342) నిజానికి అది రక్త బంధుత్వాల, వివాహ బంధుత్వాల వ్యవస్థ ఆ విషయం స్పష్టంగా కనిపిస్తుంది తండ్రి తల్లి, అన్న అక్క, తమ్ముడు, చెల్లెలు, కొడుకు కూతురు, మామ, పినతల్లి, బావ మరదలు, కజిన్, తాత, అవ్వ, మనుమడు, కూతురు వీరేకాక బ్రదర్-ఇన్-లా, సిస్టర్-ఇన్-లా, సన్-ఇన్-లా, డాటర్-ఇన్-లా యింకా యితరేతరుల పేర్లు పట్టికలో యిచ్చాను అవి మాక్లెన్నాన్ ముందేవున్నాయి ఈ వ్యవస్థలను గురించి వేరే చెప్పనక్కరలేదు అవే వచ్చ చెప్పుకుంటాయి అవి బంధుత్వాల అనుబంధాల వ్యవస్థలు తప్ప వేరేమి కాదని ఈ పట్టికలలో చెప్పిన దానికంటే భిన్నమైన వ్యవస్థ అక్కడ చెప్పిన తెగలలో వున్నదని మాక్లెన్నాన్ అభిప్రాయమా? అయితే దానిని చూపించాలి లేదా వున్నట్లు నిరూపించాలి ఆయన ఈ రెండూ చెయ్యలేదు.

అయితే ఆయన చెప్పిన రెండు మూడు ప్రత్యేకాంశాలను పరిశీలించవలసిందే 346 వ పుటలో "ఒకఎని తల్లి కాని ఆమె కొడుకా అని పిలిస్తే దానికి కారణం చెప్పలేము సహజమైన పారంపర్య సూత్రం అక్కడ చెల్లదు అక్కడున్న బంధుత్వం అసలు బంధుత్వం కాదు వ్యక్తుల మాతృత్వం తెలుస్తూనే వుంటూంది అందుచేత మోర్గన్ ప్రతిపాదన కృతకము" ఆయన చెప్పిన మాటను పట్టి ఆ బంధుత్వం తల్లితనం వలన వచ్చింది కాదని, వివాహ బంధుత్వంలో వచ్చినదని తెలుస్తూనే వుంది. ఒకడు తన తల్లి చెల్లెలిని అమ్మా అంటాడు ఆమె అతన్ని కొడుకా అంటుంది నిజానికి ఆమె అతన్ని కనలేదు మలయన్, తురానియన్ గనో వానియన్ వ్యవస్థలో వున్న పరిస్థితి అది రక్త సంబంధీకుల వివాహ వ్యవస్థ వుండనీయండి, పునలావ్ వ్యవస్థ వుండనీయండి తల్లి చెల్లెలు కూడ అతని తండ్రికి భార్యే మన వ్యవస్థలో సవతి తల్లి అనవచ్చు, కొంచెం దగ్గర, దగ్గరగా ఆమె ఆ మారుటికొడుకుని కొడుకనే అంటుంది రక్త బంధుత్వం రీత్యా దీనికి అర్థం లేదు, నిజమే వివాహ బంధుత్వం

రీత్యా అర్థం వుంది ఆయన సందేహానికి సమాధానం యిది అనేక సందర్భాలలో మాక్లెన్నాన్ ఊహాలు యిలాగే ప్రత్యేకించి వుంటాయి కాని అవన్నీ తప్పులే

మలయన్ వ్యవస్థనుండి తురానియన్ వ్యవస్థకు వస్తూ ఆయన యిలా అన్నారు "దీనిని పట్టి ఒకని కొడుకు, ఆయన సోదరి కూతురు, అన్న చెల్లెలు బంధువులే అయినా అంతర్వివాహం చేసుకోవడానికి అభ్యంతరం లేదనిపిస్తూంది కారణం, తెగ ఏర్పడినప్పుడు వారు భిన్న వ్యక్తుల పారంపర్యంలోని భిన్న తెగలకు చెందుతారు గనుక" ఇక్కడి నుంచి రెండు మూడు పుటలు తమ వదనను సాగించి "అందుచేత మోర్గన్ చెప్పిన కారణం సరిపడదు" అన్నారు మాక్లెన్నాన్ తురానియన్, గనోవానియన్ వ్యవస్థలను పరిశీలించడానికి కొంచెం శ్రద్ధచూపి వుంటే "ఒకని కొడుకు అతని చెల్లెలి కూతురు సోదరీ సోదరులు" కారు అని అర్థమయి వుండేది వారు కజిన్స్ మలయన్, తురానియన్ వ్యవస్థల మధ్య నున్న ముఖ్యమైన తేడా యిక్కడే వుంది మలయన్ రక్త సంబంధీకుల కుటుంబానికి, తురానియన్ వ్యవస్థకు చెందిన పునలాన్ కుటుంబానికి మధ్య భేదాన్ని అది చూపిస్తుంది

సాధారణ పాఠకుడు ఈ వ్యవస్థలోని వివరాలను కంఠోపాఠం చేయడానికి శ్రమ పడడు సులభంగా ఆ బంధుత్వాలను అందుకో గలిగితే తప్ప ఆ వ్యవస్థను గురించిన చర్చ బాధ కలిగిస్తుందేకాని సంతోషంగా వుండదు మాక్లెన్నాన్ ఈ బంధుత్వ పదాలను స్వేచ్ఛగా ఉపయోగిస్తాడు సొగ్గా వుపయోగించడు

మరో చోట (960) మాక్లెన్నాన్ వివాహానికి స్త్రీ పురుష సంబంధానికీ, తేడా వుందని నే చెప్పాను అంటాడు, నేనేమీ అలాంటిది చెప్పలేదు ఇక చివరగా వర్గీకరణ వ్యవస్థ మూలానికి నే యిచ్చే వివరణను నిరాకరించేటందుకై నేను రెండు తప్పులను చేశానంటున్నారు " వర్గీకరణ వ్యవస్థ యొక్క మూలాన్ని వివరించడానికి ప్రయత్నిస్తూ మోర్గన్ రెండు తప్పులు చేశాడు ఆ వ్యవస్థలో వున్న ప్రధానమైన విశిష్టతను అంటే సంబంధం వున్న వ్యక్తులను వర్గీకరించడం గురించి ఆయన ఓపిగ్గా ఆలోచించక పోవటం మొదటి తప్పు వర్గీకరణకు మూలంలో వున్న ఆ వ్యవస్థ యొక్క మూలాన్ని ఆయన పట్టుకోలేదు" (960) వర్గీకరణకీ వ్యవస్థకీ తేడా ఏమిటి? ఆ రెండు ఒక్కటే, ఆ రెండు భిన్నమని చెప్పడం సాధ్యం కాదు ఒక దానికి మూలం రెండవ దానికీ మూలమే

"రెండవ పొరపాటు- దీనికి నేను తప్పే అంటాను ఈ వ్యవస్థ అంత తేలికగా రక్త అనుబంధాల వ్యవస్థ అనడం తప్పు ఇక్కడ తప్పేమి లేదు

పట్టికలలో యిచ్చిన వ్యక్తులు ఒకే పూర్వీకుల నుంచి వచ్చిన వాళ్ళో, ఒకరితోనో ఎక్కువ మందితోనో వివాహ బంధుత్వం కలిసిన వాళ్ళో, ఆర్యన్, సెమిటిక్, యురాలియన్ వ్యవస్థలను చూపే పట్టికలలో వర్ణించిన మనుష్యులు వాళ్ళే ఈ వ్యవస్థలన్నింటా వున్న వారికి ఒకరికొకరితో రక్త బంధుత్వమో, అనుబంధమో వుంది. చివరివాటిలో ఆ బంధుత్వాలు నిర్దేశించ బడ్డాయి మొదట వాటిలో తరగతులుగా వర్గీకరించబడ్డాయి కాని అన్నింటిలోను రక్త బంధుత్వము అనుబంధమూనే వాటికి ప్రాతిపదిక మొదటి వాటిలో గుంపు పెళ్ళి రెండవ దానిలో జంటల పెళ్ళి—ఇవి ఆ రెంటికీ మధ్య తేడాను సృష్టించాయి ఒకే పారంపర్యం కులవ్యక్తుల మధ్య దృఢమైన రక్త బంధుత్వాలు వున్నాయని మలయన్, తురానియన్, గనోవానియన్ వ్యవస్థలు చూపిస్తున్నాయి ఇంకా వివాహ బంధుత్వాలను గురించి మనం ఆయా వివాహ రూపాలను చూడాలి పరిశీలనగా పోల్చి చూస్తే మలయన్, తురానియన్ వ్యవస్థలకు మూలం రెండు స్పష్టమైన వివాహ రూపాలు అని అర్థం అవుతుంది అందుకే రక్త సంబంధీకుల వివాహాన్ని పరిశీలించడానికి మొదటి దానినీ, పునలాన్ వివాహాన్ని పరిశీలించడానికి రెండోదాన్ని చూడాలి

పలకరింపులలో బంధుత్వ పదాలనే వాడుతున్నారు. అంటే అవి బంధుత్వ పదాలు కనుక మాక్లెన్నాన్ వాటిని ఆషామాషీ పిలుపులుగా చెప్పబోవడం నిరర్థకరం. ఈ అభిప్రాయాన్ని ఆయన గట్టిగానే చెప్తున్నా ఈ పిలుపులకు మూల మేమిటో చెప్పడానికి ప్రయత్నించడు ఆ శబ్దాలనుపయోగించినపుడు నిశ్చితంగా బంధుత్వ అనుబంధ పదాలుగానే వాడుతారు బంధుత్వ అనుబంధ వ్యవస్థతో సంబంధం లేకుండా స్వతంత్రంగా పిలుపుల పద్ధతి రావడం అసంభవం భాష తాను ప్రతిపాదించబోయే భావాలకు సంబంధం లేకుండా స్వతంత్రంగా పెరగదు. రక్తబంధుత్వాన్నో, అనుబంధాన్నో చెప్పకుండ బంధువుల్ని పిలిస్తే ఈ పదాలకు అర్థం ఏముంటుంది ? ఆషామాషీగా పిలిచే పిలుపులు అంత గొప్ప వ్యవస్థను సృష్టించలేవు భూమిమీద అంత విశాల ప్రదేశాలలో అంత సూక్ష్మమైన వివరాలతో ఒకే విధంగా ఏర్పడలేవు

వర్గీకరణ వ్యవస్థ మూలం గురించి మాక్లెన్నాన్ యిచ్చిన వివరణకూ, ఈ పుస్తకాలలో పిలుపుల పద్ధతులను గురించీ, బంధుత్వాల అనుబంధాల వ్యవస్థను గురించి నేను యిచ్చిన వివరణకూ వున్న తేడాను గమనించమని పాఠకుని కోరుతున్నాను.

## మొదటి ప్రకరణం

# మూడు వారసత్వ నియమాలు

**ఆటవిక దశలో ఆస్తి — చాలా నెమ్మదిగా పురోగమనం — మొదటి వారసత్వ నియమం — గణ సభ్యుల మధ్య ఆస్తి పంపిణీ — అనాగరిక యుగం దిగువ దశలో ఆస్తి — రెండో వారసత్వ నియమానికి బీజం — జ్ఞాతులయిన బంధువులలో పంపిణీ — మనుష్యుని స్వభావం ఎదుగుదల — అనాగరిక యుగం మధ్య దశలో ఆస్తి — వారసత్వ నియమాల గురించి బాగా తెలియదు — బహుశా జ్ఞాతుల మధ్య వారసత్వం వుంటుంది**

వివిధ మానవజాతి దశలలో ఆస్తి ఏ విధంగా అభివృద్ధి పొందింది? దాని యాజమాన్యం, వారసత్వం గురించి ఎటువంటి నిబంధనలు వచ్చాయి? ప్రాచీన సమాజంమీద దాని ప్రభావం ఏమిటి? — అనే విషయాలను పరిశీలించవలసి వుంది.

జీవితానికి ప్రాథమిక అవసరము అయిన జీవనాధారాన్ని సమకూర్చుకోవడంతో మొట్టమొదటి ఆస్తి భావనలు సన్నిహితంగా వున్నాయి జీవనోపాధి సాధనాలకు సహాయకరములైన కళలు అభివృద్ధి పొందిన కొద్దీ ప్రతి మానవ దశాక్రమంలోనూ స్వంత వస్తువులు సహజంగానే ఎక్కువ అవుతాయి కల్పనలు, అన్వేషణలు పెంపొందిన కొద్దీ ఆస్తికూడా పెరుగుతూంది ప్రతి మానవ దశలోను కల్పనల సంఖ్య అంతక్రితంకన్న ఎక్కువ అవుతాయి దానితోపాటు ఆస్తి వైవిధ్యమూ, పరిమాణమూ కూడా పెరుగుతాయి ఆస్తి రూపాలు పెరిగిన కొద్దీ దానిమీద హక్కు, వారసత్వం గురించి కొన్ని నిబంధనలూ వస్తాయి సామాజిక నిర్మాణంయొక్క స్థితిని, అభివృద్ధిని బట్టి ఆస్తిపై హక్కు, వారసత్వం గురించిన నియమాలూ ఆకారరూపం ధరిస్తాయి. ఆ విధంగా కల్పనలు, అన్వేషణలు పెరగటం సామాజికాచారాలు పెంపొందడంతో ఆస్తి పెరుగుదలకు సన్నిహిత సంబంధం వుంటుంది ఆచారాల పెరుగుదలలు మానవజాతి పురోభివృద్ధిలో వచ్చిన వివిధ దశలకు గుర్తుగా వుంటాయి

## 1 ఆటవిక దశలో ఆస్తి

మానవుని ఈ అతి ప్రాథమిక దశను ఊహించడం కూడా కష్టం కల్పనలు అన్వేషణలద్వారా, ఆచారాలు అలవాట్లలో నిహితమైయున్న పెరుగుదల ద్వారా అతడు సంపాదించినదేదీ అప్పటికిలేదు శుద్ధ అజ్ఞానం, అనుభవ రాహిత్యంగల స్థితి నుంచి మానవుని పురోగతి చాల నెమ్మదిగా జరుగుతుంది కాని జామిట్రికల్ రేషియోలో నడుస్తుంది నిప్పు తెలియదు, మాటరాదు కృత్రిమమైన పనిముట్లు కూడ లేవు. అడవి జంతువులలాగ అప్పటికి భూమిమీద వున్న వేవో తిని బ్రతికారు ఊహను బట్టి ఆ స్థితిని అనుమానించ వలసిందే నెమ్మదిగా తనకు తెలియకుండానే వారు ఆటవిక దశలో పురోగమించారు సంజ్ఞలు, ధ్వనులనుంచి మాటలలోకి వచ్చారు వారి మొదటి ఆయుధం దుడ్డు కఱ్ఱ అది క్రమంగా చెకుముకిముల్లుకు వేసిన బల్లెం అయింది అక్కడి నుంచి విల్లు అంబు వచ్చాయి చెకుముకి చాకు, ఉలి నుంచి రాతి గొడ్డలి, సుత్తి వచ్చాయి ఒసిర్ తీగతోను, పేముతోను అల్లిన బుట్టనుంచి మట్టిపూసిన బుట్టలకు వచ్చారు. దానితో ఆహారం ఉడక పెట్టుకునేటందుకు పాత్ర కనబడింది తరువాత కుండలు చేసుకున్నారు ఆ విధంగా నిప్పుకు నిలబడే పాత్ర దొరికింది. పరిమిత ప్రదేశంలో దొరికేపళ్ళు, కాయల నుంచి జీవనోపాధి సముద్రపు ఒడ్డునవున్న చేపలకు పెరిగింది చివరకు బ్రెడ్ దుంపలకు, జంతు వేటకు పెరిగారు బెరడూ, నారతో తాళ్ళు, పగ్గం తయారుచేయడం నుంచి నారతో ఒక రకమైన బట్టలు నేయడం, దుస్తులకు, గుడారాలు కప్పుకునేటందుకు చర్మాలను పదునుపెట్టడం నేర్చుకున్నారు చివరకు కర్రలు పాతి ఆకుతోటో చెక్కలతోటో కప్పి ఇళ్ళు కట్టుకున్నారు. ఆ విధంగా ఆటవిక దశను చేరుకున్నారు ఈ రోజుల్లో కనిపెట్టిన వానిలో మొకాసిన్, మంచు చెప్పులు, నిప్పుతో బెజ్జాలు పొడిచే పద్ధతి వంటి చిన్న చిన్న కల్పనలు వచ్చాయి

ఈ దశ ముగిసే నాటికి మానవజాతి అంతకు పూర్వంకన్న ఎక్కువగా బతుకు తెరువు సంపాదించడం నేర్చుకున్నారు భూమిమీద పలుచోట్లకి వ్యాపించారు మానవుని అభివృద్ధికి తోడ్పడగల వివిధ అంశాలలోని అవకాశాలన్నీ వారికి అందుబాటులోకి వచ్చాయి సమాజ నిర్మాణం విషయంలో వారు రక్త బంధువుల గుంపుల దశనుంచి గణాలకు ఎదిగి, తెగలుగా ఏర్పడ్డారు ఆ విధంగా ప్రధాన పాలనా సంస్థల బీజాలు వారికి అందాయి ఆ నాటికే కల్పనలలో, భాష-కళలలో, పాత్రలు చెయ్యటంలో, ఆచారాలలో, గణాలు ఏర్పడడంతో – యింత వారికి నాగరికత అందుబాటులోకి వచ్చింది దానిని అందుకునేటందుకై మానవజాతి మహోద్యమాన్నే తీసుకుంది

ఆటవికయుగం మానవజాతి పరిస్థితిని బాగా మార్చింది వారిలో పురోగమించిన భాగం గణసమాజాన్ని ఏర్పరుచుకున్నారు అక్కడక్కడా గ్రామాలు కట్టుకొని చిన్న తెగలుగా అభివృద్ధిపొందారు ఇవి వారిలోని కల్పనాశక్తిని పెంపొందించాయి వారిశక్తి యుక్తులన్నీ మోటుగా, కేవలం జీవనోపాధిసాధనకే ఉపయోగపడేవి అప్పటికింకా రక్షణకై గ్రామాలకు కఱ్ఱలతో దడి కట్టుకోలేదు పిండి ఆహారంగా లేదు మనుష్య మాంస భక్షణ పీడవదల లేదు ఆటవిక దశలో మానవుడు భాష విషయంలో బాగా పురోగమించినా కళలు, కల్పనలు, ఆచారాల విషయంలో పైన చెప్పిన వాటిని మించి ఎదగలేద మొత్తంమీద యివి సంఖ్యకు కొద్దిగానే కన్పిస్తాయిగాని వానిలో భవిష్యత్తు ఎంతో యిమిడివుంది భాషయొక్క బీజాలుఅందులో వున్నాయి ప్రభుత్వం కుటుంబం, మతం, గృహనిర్మాణం, ఆస్తి - వీనియొక్క మూల సూత్రాలు అందులో వున్నాయి వీటన్నింటినీ వారి తరువాత తరాలు అనాగరిక యుగంలో పూర్తిగా అభివృద్ధి పొందించారు అటు తర్వాత వచ్చిన నాగరికులు యింకా మెరుగు పెడుతున్నారు

ఆటవికుల ఆస్తి చెప్పతగిందేమీ కాదు దాని విలువను గురించి, దానిపై కోరికను గురించి, దాని వారసత్వం గురించిన భావనలు చాల బలహీనంగా వున్నాయి మోటైన ఆయుధాలు, దస్తులు, పాత్రలు బట్టలు, చెకుముకి పనిముట్లు, రాతిపనిముట్లు, ఎముకల పనిముట్లు శరీరములనున్న ఆ భరణాలు ఇవి ఆటవిక జీవితంలో మానవుని ఆస్తి వాటి సంపాదనకై బలమైన కోరిక వారి మనస్సులలో ఏర్పడనేలేదు, ఏమంటే ఆ వస్తువులే అయినా వున్నది తక్కువ. ఇవాళ మానవుని మనస్సుమీద పెత్తనం చేస్తూన్న లాభాల దురాశ పూర్తిగా పెరగడానికై నాగరికదశ యింకా రావలసియుంది అది వారికి దగ్గరలో లేదు భూములు అన్నవి అప్పటికింకా ఆస్తిరూపం ధరించలేదు అవి తెగయొక్క వుమ్మడి అధికారంలో వుండేవి నివాస గృహాలు — అందులో నివసిస్తున్న వారివి నెమ్మది నెమ్మదిగా కల్పనలు పెరిగినకొద్దీ స్వంతవస్తువుల మీద మోజు పెరుగుతూన్నా అది యింకా ప్రాథమిక దశలోనే వుంది వానిలో బాగా విలువైన వాటిని చనిపోయిన వానితోపాటు పాతిపెట్టేవారు ప్రేత ప్రపంచంలో అతడు వాటిని వుపయోగిస్తాడని వారి భావన అవిపోను మిగిలినవే చాలు, వారసత్వ సమస్యను తీసుకరావడానికి గణాలు ఏర్పడక పూర్వం ఆ వస్తువులను ఎలాపంచుకున్నారో మనకు తెలియదు దానిని గురించిన సమాచారం లేనే లేదు గణంతోపాటు వారసత్వానికి సంబంధించిన మొట్టమొదటి నియమం వచ్చింది వానిని చనిపోయిన వాని గణ

సభ్యుల మధ్య పంచేవారు వాస్తవానికి దగ్గర బంధువులెవరో తీసుకొనేవారు చనిపోయిన వాని ఆస్తి గణంలోనే వుండాలనీ దానిని సభ్యులమధ్య పంచాలనీ సాధారణ నియమం ఈ సూత్రాన్ని గ్రీకు, లాటిన్ తెగలు నాగరికత పొందుకున్నాక కూడ పాటించారు పిల్లలు తల్లి మంచి వారసత్వం, తండ్రి ఎవరో తెలిశాక కూడ ఆయన నుంచి వారికి వారసత్వం వుండదు

## 2. అనాగరిక యుగం దిగువ దశలో ఆస్తి

కుండలు చెయ్యడం తెలుసుకున్న నాటికీ, జంతువుల మచ్చిక, నీటిపాగు క్రింద మొక్కజొన్న పంట పచ్చిన దశకీ మధ్య జరిగిన కాలం అటవిక దశ తన్న తక్కువే మట్టి పాత్రలు చేయడం, వ్రేళ్ళతో నేయడం, వ్యవసాయకళ తప్ప ఈ దశలో గొప్ప కల్పనలేవీ లేవు వ్యవసాయం వలన ఆహారంలోకి పిండి చేరింది ఈ దశలో ఆచారాలు బాగా పెంపొందాయి అను-కండెతో చేతులతో నెయ్యడం ఈ కాలానిదిలా కనిపిస్తుంది అయినా దానిని చాల గొప్ప కల్పనలలో ఒకటిగానే చెప్పాలి ఈ కళ అటవిక దశలో రాలేదు అనడానికి తగిన సాక్ష్యం లేదు అమెరికాలోని ఇరాక్వాలు తదితర తెగలు ఈ దశలోనే మంచి నాణ్యమయిన బెల్టులు, పగ్గాలు తయారు చేశారు వానికి ఎలం నార, కొన్ని రకాల చెట్ల బెరడులతో దారాలు తయారు చేశారు మానవ జాతికి దస్తులమ యిచ్చిన ఈ కళ యొక్క సూత్రాలను బాగా గుర్తించాడు కాని నేతతో బట్ట తయారు చేయడం వారికింకా అందలేదు ఈ దశలోనే చిత్రలేఖనం వచ్చినట్లు కన్పిస్తుంది ఒక వేళ అది అంతకు పూర్వమే వచ్చినా, ఈ దశలో బాగా మెరుగు పడిందని చెప్పవచ్చు ధ్వని సంకేతాక్షరాల కల్పనకు దారి తీసిన దశలలో యిదొకటి దీనికి సంబంధించి వరుస క్రమంలో వచ్చిన కల్పనలు యివి. 1 సంజ్ఞా భాష 2 బొమ్మల భాష 3 సాంప్రదాయక చిహ్నాల భాష 4 ధ్వని సంకేతాల భాష 5 ధ్వని సంకేత అక్షరాలు ధ్వని సంకేతాల భాష వరుసక్రమ దశలలో పెరగడంచేత ఆయా దశలు ఏర్పడడం కూడ దాని ముఖ్యమైనవీ అంత అవగాహన కలిగించేవీని కోపాన్ సమాధుల మీది అక్షరాలు సంప్రదాయక సంకేతాలయిన చిత్రాలు అనవచ్చు అంతకు పూర్వం వున్న మూడు రూపాల భాషను అనుసరించిన అమెరికనులు స్వతంత్రంగా ధ్వని సంకేతాక్షరాల దిశగా పురోగమించినట్లు తోస్తుంది.

గ్రామ రక్షణకై కర్రలతో కోరడి కట్టడం, బాణాల నుంచి రక్షించుకునేటందుకై చర్మంతో డాలు చేయడం, అనేక రకాల గదలు - లోపల రాయి పెట్టి తయారు చేసినవి, లేడి కొమ్ముతో ములుకు తయారు చేసినవి యింకా యింకా అనేక రకాలవి

ఈ దశకు చెందినవే. మనం కనుక్కొన్న నాటికి ఆటవిక యుగం దిగువ దశలో వున్న అమెరికన్ ఇండియనులలో ఇవి వాడుకలో వున్నాయి. ఈ గద ఆటవిక యుగం నాటిది. విల్లు అంబు కనుక్కొన్న తర్వాత దాని ప్రాముఖ్యం కొంత వెనక పట్టింది. కాని అనాగరిక యుగం ఎగువ దశలో మరల ప్రాముఖ్యానికి వచ్చింది. అప్పటికి రాగి ములుకు వేసిన ఈటె వచ్చింది. కలబడి పోరాడడం వచ్చింది. విల్లు, అంబు, గద ఇవి అనాగరిక యుగం దిగువ దశలో వున్న అమెరికన్ ఆదివాసుల ప్రధాన ఆయుధాలు. కుండలు చేయడంలో కూడ కొంత పురోభివృద్ధి వచ్చింది. వాటి ఆకారాలు పెద్దవయ్యాయి. అలంకరించడం వచ్చింది. కాని ఈ దశఆఖరువరకు వానిలో నాజూకు తనం రాలేదు. గృహ నిర్మాణం ఆకారంలో, నిర్మాణ పద్ధతులలో బాగా మెరుగు పడింది. ఇంకా చిన్న చిన్న కల్పనలు ఎన్నో- పక్షులను కొట్టడానికి గాలి గొట్టం, రోలు-రోకలి జాతిరోలు, మట్టితోను రాయితోను చేసిన గొట్టాలు, పొగాకు వాడకం, మేలు రకం రాయి, ఎముక పనిముట్లు, రాతి సుత్తులు పనిముట్లువున్నా, రాతికాములు వానికి చర్మపు తొడుగులు, మొకాసిన్‌లు, ఏదుపంది ముళ్ళతో అలంకరించిన బెల్టులు, పీనిని చెప్పవచ్చు. పీనిలో కొన్ని పక్క వాళ్ళ నుంచి తీసుకున్నవి. అయితే వారు యింతకన్న పై దశలో వుండి వుంటారు. పరస్పరం యిచ్చుపుచ్చుకొంటూ పురోగమించిన తెగలు వెనకబడిన వాటిని ముందుకు లాక్కొగలుగుతాయి. వెనకబడి వున్నవారు వాని ఉపయోగాలనర్థం చేసుకుని తాము ఎదగడానికి వుపయోగించుకోగలిగితే వేగంగా పురోగమిస్తారు.

మొక్క జొన్నను యితర మొక్కలను సాగు చేయడం వలన రొట్టె, సుకోటాస్, హోమిని (అల్గోంకిన్ తెగల వారి ఆహారాలు) లభించాయి. దీనితో కొత్తరకం ఆస్తులు కూడ ప్రారంభమయ్యాయి. తోటలు, దొడ్లు, దున్నిన భూములు వచ్చాయి. సాధారణంగా భూములు తెగల వుమ్మడివైనా వానిమీద దున్నుకున్న వ్యక్తి యొక్క, లేక గుంపు యొక్క హక్కు భుక్తం గుర్తించబడింది. అది వారసత్వానికి వచ్చింది. ఒక సామూహిక గృహంలో నివశించే వారందరూ యించు మించు ఒకే గణం వారవుతారు. గనుక ఈ వారసత్వ నియమం ఆస్తిని గణాన్ని దాటి బయటికి పోనివ్వరు.

భార్యా భర్తల ఆస్తి దేనికది వేరుగా వుంచుతారు. వారు చనిపోతే వారి వారి గణాలకు అది చేరుతుంది. భార్యా పిల్లలు మగడు తండ్రి అయిన వాని నుంచి ఏమీ

తీమకోరు పగడు భార్యది తీమకోడు మగవాడు చనిపోయినపుడు అతని ఆస్తిని భార్యా పిల్లలకి కాక, చెల్లెళ్ళకి చెల్లెళ్ళ పిల్లలకి మేనమామలకి గణంలోని యితర దగ్గర బంధువులకి పంచి పెట్టడం యిరాక్యూల ఆచారం అతని తమ్ముళ్ళకి యిస్తే కొంచెం యివ్వవచ్చు ఆడది చనిపోతే ఆమె పిల్లలకి ఆమె అక్క చెల్లెళ్ళకి, తల్లికి, తల్లి అక్క చెల్లెళ్ళకి పంచుతారు, కాని మగని కివ్వరు అయితే అధిక భాగం ఆమె పిల్లల కిస్తారు ఏ విధంగా అయినా అది గణం లోపలనే వుంటుంది ఒజిబ్వాలలో తల్లి వస్తువులను ఆమె పిల్లలకు పంచుతారు అయితే వాటిని వుపయోగించగల వయస్సు వుంటేనే ఆ వయసు పిల్లలు లేకపోయినా, అసలు పిల్లలు లేకపోయినా వాటిని ఆమె అక్క చెల్లెళ్ళకి, తల్లికి, ఆమె అక్క చెల్లెళ్ళకి యిస్తారే గాని చనిపోయినామె సోదరుల కివ్వరు జీవనం పురుష పారంపర్యానికి మార్పు వచ్చినా వారసత్వం నియమం మాత్రం యింకా స్త్రీ పారంపర్యం వున్న నాటిదే కొనసాగుతుంది

అటవిక దశలో కన్న యిప్పుడు ఆస్తి వైవిధ్యమూ, పరిమాణం కూడ ఎక్కువయ్యింది అయితే వారసత్వం విషయంలో పట్టింపు కలిగేటంతగా పెరగలేదు యిక్కడ పైన చెప్పిన ఆస్తిపంపిణీ పద్ధతిలో రెండవ ఆస్తిపంపిణీ నియమం బీజరూపం కనిపిస్తుంది గణ సభ్యులందరికీ కాక గణంలోని జ్ఞాతి బంధువులకే ఆస్తిని పంచాలనేది ఈ రెండో నియమం జ్ఞాతిత్వము, జ్ఞాతి బంధుత్వము నిర్దేశింపబడినాయి దానిని పట్టి పురుష పారంపర్యంలోకి మార్పు వచ్చిందను కోవచ్చు అయితే స్త్రీ పారంపర్యం లోని మనుష్యులు పురుష పారంపర్యంలోని వారసులు ఒకటి కాదు ఈ రెండు సందర్భాలలోను కూడ నియమం ఒకటే దానిని వర్తింప జేసే పద్ధతి అదే స్త్రీ పారంపర్యం వున్నప్పుడు చనిపోయిన ఆమె పూర్వమాత నుంచి వచ్చిన స్త్రీ పారంపర్యంలోని వారే జ్ఞాతులవుతారు పురుష పారంపర్యంలో ఆ విధంగా వచ్చిన పురుషులే అక్కడ వారసులవుతారు గణంలోని రక్త బంధుత్వం గల మనుషులు ఒక సందర్భంలో వారసులవుతారు జ్ఞాతి బంధుత్వానికి పునాదిగా పూర్వ వ్యక్తి వుండడం వీనిలో సమాన లక్షణం

ఈనాడు పురోగమించిన ఇండియన్ తెగలలో గణ వారసత్వానికి వ్యతిరేకత పెరుగుతోంది కొన్నింటిలో దానిని తొలగించి పిల్లలకు వారసత్వం నిర్ధారణ చేశారు. ఇరాక్యూలు, క్రీక్‌లు, చెరోకీలు, చోక్టాలు, మినో మినీలు, కాకులు, ఒజిబ్వాలలో

ఆస్తిని తండ్రులు తమ కొడుకులకే యివ్వడానికై మార్గాలు వెతుకుతున్నట్లు యింతకు పూర్వమే చూపించాను

ఆటవిక దశలో మహా కిరాతంగా వుండే మనుష్య మాంసభక్షణ యుగం ప్రథమ దశలోనే తగ్గసాగింది యుద్ధాల్లోను, కరువుల్లోను అప్పుడప్పుడూ మాత్రమే దానిని పాటిస్తూండడం అనాగరిక యుగం మధ్య దశకంటా సాగింది అమెరికా సంయుక్త రాష్ట్రాలు, మెక్సికో, అమెరికాలలోని ప్రధాన తెగలలో ఈ రూపంలోనే కనిపించింది పిండి ప్రధాన ఆహార పదార్థమయ్యాక ఈ కిరాతకాచారం వెనక పట్టింది

ఈ విధంగా కచ్చా పచ్చాగా రెండు మానవయుగాలను పర్యాలోచన చేశాను. మానవజాతి భూమి మీద వుండిన కాలంలో యిది యించు మించు ఐదింట నాలుగు పంతుల భాగం అనాగరిక యుగం దిగువశలోనే మానవునిలో వుదాత్తలక్షణాలు కనపడటం ప్రారంభమయ్యాయి వ్యక్తిలో హుందాతనం, మాటకారి తనం, మత చైతన్యం, గాంభీర్యం, పౌరుషం, సాహసం మొదలైనవి సాధారణ లక్షణాలు అయినాయి అయితే రెండోవైపున క్రౌర్యం, మోసకారితనం, మొండి తనం అంత మామూలుగాను వున్నాయి ప్రకృతి పూజ, అతిసాధారణ రూపంలో దేవతల భావన, మహామాత, పద్యరచన, సామూహిక గృహ నిర్మాణం, మొక్క జొన్న రొట్టె, మొదలై నవి ఈ దశలోనివే సింధియాస్మియన్ కుటుంబము, గణాలు, ఫ్రాట్రీలు, తెగలు నుంచి సమాఖ్య నిర్మాణం అప్పుడే వచ్చాయి మానవజాతిని పైకి లేవనెత్త డానికి ఎంతో సాధన భూతం అయిన ఊహా కల్పన, దేవతా కథలు, పురాణకథలు, సంప్రదాయ కథలతో లిపిబద్ధం వాఙ్మయం ఎంతో వచ్చింది మనుష్యజాతిని బాగా వుత్తేజ పరిచేందుకు అదొక సాధనమయింది

## 3. అనాగరిక మధ్యయుగంలో ఆస్తి

మరి యే ఇతర మానవదశలో కన్న ఈ దశకు చెందిన మానవజాతి చరిత్ర సంపూర్ణంగా అదృశ్యమైంది తెల్లవాడు చూసిన నాటికి ఉత్తర దక్షిణ అమెరికాలలోని గ్రామవాసి ఇండియనులలో ఈ దశ మంచి విజృంభ మాణంగా కనిపించింది కొంచెం ప్రయత్నిస్తే వారి పరిపాలనాచారాలు, మత దృక్పథాలు, గృహ జీవిత పద్ధతి, కళలు, ఆస్తి యాజమాన్యము, వారసత్వం గురించిన నియమాలు మొదలైనవి పూర్తిగా దొరికి వుండేవి కాని ఆ అవకాశం జారిపోయింది కాల్పనిక కథలు, తప్పుడుభావనలతో మునిగిపోయిన వాస్తవాలు మాత్రం అక్కడక్కడా దొరుకుతున్నాయి,

పూర్వార్ధ భాగంలో జంతువులను మచ్చిక చేయడంతో ఈ దశ ప్రారంభ మవుతుంది గ్రామవాసి ఇండియనులు వచ్చి యిటుకతో కట్టినవీ, కొన్ని చోట్ల రాయితో కట్టినవీ పెద్ద పెద్ద సామూహిక గృహాలలో నివసించడంతో పశ్చిమార్ధ గోళంలో ఇది ప్రారంభ మవుతుంది పశ్చిమార్ధ గోళంలో గృహ నిర్మాణంతోపాటు మొక్కజొన్నను, యితర పాదులను నీటి పారుదల సాయంతో వ్యవసాయం చేశారు వాటికోసం కాలువలు త్రవ్వారు చతురస్రాకారంలో నీళ్ళు నిల్చేటందుకు గట్లు వేసి మడులు చేశారు వారిని చూసిననాటికి అనాగరిక యుగం మధ్య దశ చివరకంటా పురోగమించారు వారిలో కొందరు కంచు తయారు చేశారు ఇక్కడ నుంచి ఇనుమును పోత పోసే స్థితి చాలా సమీపంలోనే వుంది వీరి సామూహిక గృహం కోట మాదిరిగా వుంది అనాగరిక యుగం దిగువదశలోని కొరడి (Stockade) గల గ్రామానికి, ఎగువ దశలోని కోట గోడ గల పట్టణానికి ఇది మధ్యంతర దశ అమెరికాను కనుగొన్న నాటికి పట్టణాలు అనదగినవిలేవు యుద్ధ విద్యలో వారు అట్టే పురోగమించలేదు రక్షణకై నిర్మించుకున్న సామూహిక గృహాలు ఇండియనుల దాడికి సాధారణంగా లొంగవు అయితే బాణాల నుంచి రక్షణగా ప్రత్తికూరిన క్విల్ట్‌లను తయారు చేశారు కర్ర బ్లేడులో కొనదేరిన చెకుముకి ముక్కలు వరుసగాగుచ్చిరెండంచుల కత్తిని తయారు చేసుకున్నారు విల్లు, అంబు, ఈటె, గద, చెకుముకి బాకులు, పోట కత్తులు, యితర రాతి పనిముట్లు ఉపయోగిస్తున్నారు రాగితో చేసిన గొడ్డలి, ఉలి ఉన్నప్పటికీ ఎందు చేతనో అవిసాధారణోపయోగంలోకి రాలేదు

మొక్కజొన్న, జీన్, దోస, పొగాకులకు తోడు, ప్రత్తి, మిరియం, టొమాటో, కోకోలు కూడ పంటలు పండిస్తున్నారు కొన్ని కొన్ని పళ్ళ చెట్లు పెంచుతున్నారు మాగే (Maguey) రసాన్ని పులియపెట్టి బీరు తయారు చేయటం నేర్చారు మేపుల్ (Maple) రసాన్ని పులియ పెట్టి ఇరాక్వాలు ఒక రకమైన పానీయాన్ని తయారు చేస్తారు ఎన్నో గ్యాలన్ల నీరు పట్టే మంచి మేలు రకం అందాల చిత్రాలతో పెద్ద పెద్ద బానలు తయారు చేశారు పింగాణి తయారీలో ఎంతో మెరుగు వచ్చింది మూకుడులు, పాత్రలు, నీటి కుండలు, అపారంగా తయారు చేశారు సహజమైన లోహాల్ని కనుక్కొన్నారు మొదట్లో ఆభరణాలకి, తరువాత పని ముట్లుగాను, పాత్రలుగాను తయారు చేసుకున్నారు రాగి గొడ్డలి, ఉలి ఈ కాలానివే మూసలలో లోహాన్ని కరుగబెట్టారు వాటిని అచ్చులలో పోతపోశారు బొగ్గు, (ఊదు)తిత్తి వాడకం తెలిసినట్లే వుంది కంచు పోత పోశారు రాతితో మోటైన శిల్పాలు తయారు

చేశారు ప్రత్తితో నేసిన బట్టలు తయారు చేశారు రాతిని చెక్కి ఇల్లు కట్టుకున్నారు నాయకుల సమాధుల వద్ద పాతిన రాళ్ళ మీద చిత్ర సంకేతాలు (Hieroglyph) చెక్కారు కాలగణనకు కేలండర్ (పంచాంగం) తయారు చేశారు ఋతువులను చెప్పేటందుకు రాతితో గడియారాలు తయారు చేశారు చాల ఎత్తైన గోడలుకట్టారు లామానూ, ఒక తరహా కుక్కను, టర్కీ కోడిని, కొన్ని యితర పక్షులను మచ్చిక చేశారు అమెరికాలో యివన్నీ ఒకే దశా కాలానికి చెందినవి ఈ దశలోనే మొట్ట మొదటి మారు హోదాల హెచ్చు తగ్గులతో పురోహిత వర్గం ఏర్పడింది ఎవరి దుస్తులు వారివి వారిదేవుళ్ళువేరు ఆ దేవుళ్ళకు ప్రతిగా బొమ్మలు, మానవ బలి వచ్చాయి మెక్సికో, క్యూస్కోల రెండు పెద్ద ఇండియన్ నగరాలు (pueblo) వచ్చినది ఈ కాలంలోనే వానిలో ఒక్కొక్క దాంట్లో 20 వేల వరకు జనాభావుంది వెనుకటి దశా కాలంలో ఆ గ్రామాలలో ఎందరుండే వారో లెక్క తెలియదు పౌర, సైనిక నాయకులలో సన్నసన్నగా కులీన తెగ సమాజం అప్పుడే తల ఎత్తింది ఒకే ప్రభుత్వం క్రింద పౌరసైనిక నాయకుల సంఖ్య ఎక్కువ కాసాగింది ప్రభుత్వ వ్యవహారాలు సంక్లిష్టం కాసాగాయి పూర్వార్థ భాగంలో అదే దశాకాలానికి చెందిన తెగలు జంతువులను మచ్చిక చేశాయి అవి జీవనోపాధికి మాంసాన్ని, పాలను దండిగా యిచ్చేవి వీరికి బహుశా మొక్కల పెంపకం (తోటలు) తెలియదు ఆహారంలో పిండి పదార్థాలు లేవు అడవిగుర్రాన్ని, ఆవుని, గొర్రెని, మేకని, గాడిదని, పందిని మచ్చిక చేసి మందలుగా పెంచవచ్చునని గ్రహించడం, అవి స్థిరమైన జీవనోపాధికి మూలం కావడం జరిగాక, మానవ పురోగతికి బలమైన వూపు దొరికింది అయితే మందలను పెంచి పోషించడానికై సాధారణ రూపంలో మైదాన జీవితం ఏర్పడే వరకు అది స్థిరపడలేదు యూరపులో అడవులు ఎక్కువ కనుక అది మైదాన జీవితానికి అనుకూలంకాదు కాని ఆసియా పీఠభూములలోను అక్కడి యూఫ్రేట్స్, టైగ్రిస్ మొదలయిన నదీ ప్రాంతాలలోను వున్న పచ్చిక మైదానాలు, మైదాన జీవితం ఏర్పడిన తెగల యొక్క జన్మభూములు సహజంగానే వారు అక్కడికి చేరుతారు మన పూర్వపురుషులంతా ఈ ప్రాంతాల నుంచి వచ్చిన వారే మైదాన జీవితాలు గడుపుతున్న సెమిటిక్ తెగలతోటి వారే ఈ గడ్డి మైదానాల నుంచి పశ్చిమాసియాకు, యూరపుకు అక్కడున్న అటవీ భూములకు వలసపోయేనాటికే వీరికి కాయధాన్యాలు, మొక్కలు సాగు చేయడం తెలిసి వుంటుంది మచ్చిక చేసిన జంతువులు వారి జీవితంలో భాగం అయ్యాయి. వాటి అవసరం కోసం ధాన్యాలు పండించకతప్పదు ఒక్క ఎద్దులు తప్ప

పడమటి దిశగా వలస పోయిన ఆర్యన్ తెగలలో కాయధాన్యాల పంట ఈ మాదిరిగా వచ్చిందేనని భావిస్తున్నారు వారతో నేసిన బట్టలు, నూలు బట్టలు, కంచుపనిముట్లు, ఆయుధాలు పూర్వార్థగోళంలో వచ్చింది ఈదశాకాలంలోనే

అనాగరిక యుగం మధ్య దశను సూచించే కల్పనలు అన్వేషణలు యివి. ఇప్పుడు సమాజం ఉన్నతంగా నిర్మాణం పొందింది దాని వ్యవహారాలు సంక్లిష్ట మౌతున్నాయి భిన్నభిన్న లక్షణాలతో రెండు అర్ధ గోళాలలోను సంస్కృతి భిన్న రూపాలలో వచ్చింది అయితే పురోగతి పంథా మాత్రము ఒకే విధమైనది ఇనుమును కనుక్కోవడం దానిని ఉపయోగించడం దిశగానే రెండుచోట్ల పురోగతి సాగింది ఎగువ దశా కాలంలో ఈ అవరోధాన్ని గడిచి ముందడుగు వెయ్యాలంటే అంచు (వాయి), మొలికి గట్టిగా వుండే లోహపు పనిముట్లు తప్పని సరిగా కావాలి ఇందుకు పనికివచ్చే లోహం ఇనుము ఒక్కటే బాగా పురోగమించిన తెగలు కూడ ఈ పొలిమేరలో నిలబడి పోయాయి కాకి ఖాయిని కరిగించే క్రమాన్ని తెలుసుకోవడం మిగిలింది

పై దానిని ఆలోచించినపుడు వ్యక్తిగత ఆస్తి బాగా పెరిగిందని, మనిషికి భూమికి గల సంబంధాలలో మార్పు వచ్చిందని తెలుస్తూనే వుంది అయితే ప్రాంతీయ విస్తీర్ణం తెగ యొక్క ఉమ్మడి ఆస్తిగానే యింకా వుంది దానిలో కొంత భాగాన్ని ప్రభుత్వ నిర్వహణకు కేటాయించారు మరికొంత భాగాన్ని మతం అవసరాలకి కేటాయించారు మరో పెద్ద భాగాన్ని జనం యొక్క జీవనావసరాలకు కేటాయించారు ఈ భాగం అనేక గణాల మధ్య, ఒకే గ్రామంలో నివసించే కుటుంబాల మధ్య విభజించబడింది తాను అనుభవిస్తూ, తన హక్కులో వున్న ఇళ్ళను, భూములను అమ్మేటందుకూ, తోచిన వారికి యిచ్చేటందుకూ హక్కు ఏర్పడ లేదు అయితే భూములను వుమ్మడిగా, గణాల వారీగా, కుటుంబాల వారీగా స్వంతానికి కలిగి వుండడం, వారి సామూహిక గృహాలలో బంధుత్వం గల కుటుంబాలే నివసిస్తూండడం – యివి గృహాల మీద భూముల మీద వ్యక్తి స్వత్వం ఏర్పడడానికి ముందు దశలో జరిగింది ఆ భూములూ ఇళ్ళలో తమ హక్కును అమ్మేందుకో మరొకరికి బదలాయించేందుకో అధికారం రావడం అంటే వారి గత జీవిత పద్ధతిని భగ్నం చేయడమే లగూనా ప్యూబ్లో యిండియన్‌లలో మిషనరీగా పనిచేసిన రెవరెండ్ సామ్యూల్ గోర్మన్, న్యూమెక్సికోలోని హిస్టారికల్ సొసైటీ సభలో ప్రసంగిస్తూ యిలా అన్నారు "ఆస్తి హక్కు కుటుంబంలో వుంది అది తల్లి నుంచి కూతురికి సంక్రమిస్తుంది వారి భూములు వుమ్మడిగా వుంటాయి అది పూరుమ్మడిది. ఒకరు

పాగు చేసిన మీద అతని వ్యక్తిగత హక్కు ఏర్పడుతుంది దాని నాతడు ఆ గ్రామం లోనే ఎవరికైనా అమ్మవచ్చు పురులు, గాదెల మీద పెత్తనం ఆడవాళ్ళది భవిష్యత్తును గురించి ఇరుగు పొరుగున వున్న స్పానిష్ వాళ్ళకంటే వీరు చాల పొదుపుగా వుంటారు. ఓ యేడాదికి సరిపడా పదార్థాలు వుంచుకోడానికే వారు ప్రయత్నిస్తారు వరుసని రెండేళ్ళు కరువు వస్తేనే ప్యూబ్లో గ్రామం మొత్తం ఆకలి బాధకు గురి అవుతుంది " హక్కు భుక్తం వ్యక్తులకూ కుటుంబాలకూ వుంది అనుకోవచ్చు అయితే ఒక గణంలో ఆ హక్కుదారుడు మరణించినపుడు అతని గణ బంధువులకు వారసత్వంగా పోవలసినదే కాని ఆ హక్కు మరొకరికి సంక్రమించదు సాముహిక గృహాలు వుమ్మడి భూములు యివి వ్యక్తి హక్కుకు వ్యతిరేకం

మాకీ గ్రామవాసి ఇండియనులు ఏడు పెద్ద ప్యూబ్లోలలో వుంటున్నారు వారికి తోటలు, దొడ్లు, గొఱ్ఱెల మందలు, అధికంగానే వ్యక్తిగత ఆస్తిగా వున్నాయి అనేక సైజులలో మేలు రకం మట్టి పాత్రలు తయారు చేస్తున్నారు తాము వడికిన నూలుతో మగ్గాల మీద నూలు కంబళ్ళు నేస్తున్నారు ఒరైబే ప్యూబ్లోలో మేజర్ జె డబ్ల్యు పావెల్ తాను చూసిన ఈ విషయం పట్టి భార్య ఆస్తి మీద కాని, పిల్లల మీద కాని భర్తకు హక్కులేవీ వుండవు అన్నారు జులియన్ తెగకు చెందిన ఒకడు రైబే స్త్రీని పెళ్ళి చేసుకున్నాడు వాళ్ళకి ముగ్గురు పిల్లలు కలిగారు మేజర్ పావెల్ ఆ ప్యూబ్లోలో వున్న కాలంలోనే అతని భార్య చనిపోయింది చనిపోయిన ఆమె బంధువులు ఆమె పిల్లల్ని, ఆమె యింట్లోని సామగ్రిని స్వాధీనం చేసుకున్నారు అతని గుఱ్ఱాన్ని అతని బట్టల్ని ఆయుధాల్ని అతనికిచ్చేశారు అతనికి సంబంధించిన కొన్ని గొంగళ్ళని తీసుకోనిచ్చారు అతని భార్యకి చెందినవి అక్కడే వుండిపోయాయి మేజర్ పావెల్‌తో అతడు ఆ ప్యూబ్లోను విడిచిపెట్టి శాంతా ఫే కు, అక్కడి నుంచి జునీలోని తన తెగ ప్రజల వద్దకు వెళ్ళిపోయాడు యిటువంటిదే మరో ఘటన, మోకీ ప్యూబ్లోలో జరిగినట్టు నేనెఱిగినాయన చూసి చెప్పాడు భర్తను పిల్లలను ఆస్తిని విడిచి ఒకామె చనిపోయింది. చనిపోయినామె బంధువులు పిల్లల్ని ఆస్తిని తీసుకున్నారు భర్త తన బట్టలు తీసుకు వెళ్ళిపోయాడు మేజర్ పావెల్ ఆ వ్యక్తిని చూశారుకాని అతడు మోకీ తెగ వాడేనా మరో తెగకు చెందిన వాడా అనేది తెలుసుకోలేదు ఈ రెండు సందర్భాల్లో కూడ పిల్లలు తల్లికి చెందారు తండ్రివాళ్ళు కాదు తల్లి మరణానంతరం కూడ వారిని అతడు తీసుకుపోవడానికి అంగీకరించలేదు ఇరాక్యూలలోను యితర వుత్తర ప్రాంత తెగల లోను యిదే ఆచారం. పైగా భార్యే ఆస్తిని విడిగా వుంచుతారు ఆమె చనిపోయాక

అది ఆమె బంధువులకే చెందుతుంది దీనిని పట్టి భర్త ఆస్తిని భార్య తీసుకోదు అనిపిస్తుంది భార్య ఆస్తిని భర్త తీసుకోవడం లేదు కనుక అలా అనుకోవాలి మెక్సికోలోని గ్రామవాసి ఇండియన్లలో కూడ యిదే ఆచారం అని మరో చోట చెప్పాను

మగవాళ్ళకు వలెనే ఆడవాళ్ళకి కూడ వారు కాపురం వుంటున్న సామూహిక గృహ భాగాలమీదా, గదుల మీదా, హక్కు భుక్తాలు వుండే వుంటాయి ఆనాటి ఆచారాల ప్రకారం వాటిని సన్నిహిత బంధువులకు బదలాయించే హక్కు వుండి వుంటుంది. గ్రామాలలోని ఈ గృహ భాగాలమీద వున్న వారి హక్కుభుక్తం ఎటువంటిది, వారసత్వం ఎటువంటిది ? దాని నతడు పరాయి వాడికి అమ్మడమో, బదలా చేయించడమో చేయ వచ్చా ? లేకుంటే అతని హక్కు భుక్తానికి పరిమితి ఏమిటి ? దాని స్వభావ మేమిటి ? అనేవి తెలుసు కోవలసి వుంది మగ వాని ఆస్తి వారసత్వం ఎవరికి పోతుంది? స్త్రీల ఆస్తి వారసత్వం ఎవరికి పోతుందో కూడ తెలుసుకోవలసిందే. ఎంతో అవసరమైన ఈ సమాచారాన్ని తెలుసుకునేటందుకు సక్రమంగా చేస్తే కొద్ది పాటి శ్రమ చాలును

దక్షిణ తెగలలోని భూమి హక్కుల గురించి స్పానిష్ రచయితలు మహా గందర గోళం చేసి పెట్టారు ఒక వూరిలోని ప్రజలు వుమ్మడిగా భూములు కలిగి వుండడం దానిని వదిలి పెట్టే హక్కు లేక పోవటం, వారికి ఒకడు నాయకుడుగా వుండడం చూశాక ఆ భూముల్ని ఒక జమిందారీగానూ, ఆ నాయకుని ఫ్యూడల్ ప్రభువు గానూ, ఆ భూముల్ని వుమ్మడిగా కలిగియున్న జనాన్ని దాసులుగానూ భావించారు ఇది వాస్తవాలను వక్రీకరించడం నిజానికి ఈ భూములను గ్రామ ప్రజ వుమ్మడిగా కలిగి వుంటారు ఈ ప్రజలను కలిపి వుంచుతున్న ఐక్యతా బంధం గణమూ, గణంలోని భాగమూ అనుకుంటే ఈ విషయం వెంటనే అర్థమవుతుంది.

మెక్సికోలోను, మధ్య అమెరికాలోను వున్న కొద్ది తెగలలో స్త్రీ పారంపర్యం కొనసాగుతూంది. మిగిలిన అధిక భాగం తెగలలో అది పురుష పారంపర్యానికి మారింది దీనికి ఆస్తి ప్రభావమే కారణమయి వుంటుంది తండ్రి ఆస్తి వారసత్వం గణ సభ్యులుగా కొడుకులకే రావడానికి ఈ మార్పు వచ్చి యుండాలి మాయాలలో పురుష పారంపర్యమే వుంది అజ్టెక్లు, తెజ్కుకాన్లు, త్లాకోపాన్లు, త్లాస్కా-

లాన్‌లలో పురుష పారంపర్యమా స్త్రీ పారంపర్యమా అన్నది చెప్పడం కష్టం బహుశా గ్రామవాసి ఇండియన్లలందరిలో లాగ పురుష పారంపర్యానికి మార్పు వస్తూ వుండి వుంటుంది త్యక్తిలీ పదవి విషయంలో బాగా ఇంకా ప్రాచీన నియమాలు కొన సాగుతూ వుండి వుంటాయి ఈ మార్పుతో గణంలోనే వారసత్వం వుండాలనే నియమం తొలగదు తండ్రి చనిపోయినపుడు ఆయన ఆస్తి పిల్లలకు, కొన్ని సందర్భాలలో పెద్ద కొడుకుకు చెందుతూందని చాల మంది స్పానిష్ రచయితలు వ్రాశారు అంతమాత్రంతో ఈ విషయం పరిష్కారం కాదు

గ్రామ వాసి ఇండియనులలో వార సత్వానికి సంబంధించిన రెండో నియమం అంటే ఆస్తిని గణ బంధువులలో పంచడం కనిపించాలి గణంలో పురుష పారంపర్యం వస్తే ఆయన కొడుకులు గణ బంధువుల అగ్ర స్థానంలో వుంటారు సహజంగానే వారసత్వంలో అధిక భాగం వారికి పోతుంది వారసత్వానికి సంబంధించిన మూడో నియమం — చనిపోయిన వాని ఆస్తి కొడుకులకు మాత్రమే చెందడం అనేది యింకా వారిలో ఏర్పడి వుండదు ముందుకాలపు రచయితలూ తర్వాత కాలం వాళ్ళూ వారసత్వం గురించి చర్చలు జరిపారుకాని ఆ సమాచారం సరిగ్గానూలేదు సమగ్రంగానూ లేదు ఈ సమస్య ఆచారాలు, అలవాట్లు మీద ఆధారపడి వుంటుంది వాటిని చూస్తేనే ఈ పద్ధతి అర్థం అవుతుంది ఇంకా ఎక్కువ సాక్ష్యం దొరుకుతే తప్ప కొడుకులకే ఆస్తి చెందుతుందని గట్టిగా చెప్పలేము

# రెండో ప్రకరణం.

# మూడు వారసత్వ నియమాలు - తరువాయి

అనాగరిక యుగం ఎగువ దశలో ఆస్తి— బానిసత్వం గ్రీకు తెగలలో భూమిహక్కు— ఆ దశాకాలపు సంస్కృతి— దాని విశిష్టత— వారసత్వం మూడో నియమం— కేవలం పిల్లలకే— హిబ్రూ తెగలు— వారసత్వ నియమం— లోరు వహాద్ కూతుళ్ళు— ఫ్రాత్రీకో, బహుశా గణంలో ఆస్తి మిగిలింది— హక్కు పరావర్తనము— అథీనియన్ వారసత్వం— పిల్లలకు మాత్రమే హక్కు పరావర్తనము— గణంలోనే వారసత్వం మిగులుతుంది — వారసురాళ్ళు— వీలునామాలు— రోమనులలో వారసత్వం— హక్కు పరావర్తనము— ఆస్తి గణంలోనే మిగులుతుంది— కులీనుల ప్రాదుర్భావము— మానవ జాతి యొక్క ఆస్తిఆశ— మానవ జాతి మూలం ఒక్కటే

అమెరికన్ ఆదివాసులు అనాగరికయుగం అంతిమదశకు చేరుకొనేలేదు పూర్వార్థ భాగంలో, ఇనుమును ఉత్పత్తి చేయడం, వుపయోగించడంతో అది ప్రారంభ మయింది

కాకి రాయిని కరిగించడం కల్పనలలో కెల్ల గొప్పది దాని ముందర మిగిలిన కల్పనలు, అన్వేషణలు తక్కువ స్థాయివే కంచు పరిజ్ఞానం కలిగినా సమర్థవంతమైన తగినంత బలము గట్టితనము గల పనిముట్లులేక పురోభివృద్ధి నిలిచిపోయింది ఈ లక్షణాలన్నీ ఇనుములో కనిపించాయి దీనిని కనుక్కున్న నాటినుంచి మానవుని తెలివి అతివేగంగా అభివృద్ధి పొందింది మానవ జాతి మొత్తం అనుభవంలో ఇది విశిష్టమైంది అనేక విధాల గణనీయమైనది ఎన్నటికీ గుర్తించు కోవలసిందీని ఆ కాలం అంతా అనేక విజయాలతో నిండి వుంది అందునేత అంతకుముందు కాలపు విజయాలను కూడ వీనికే జమకట్టారేమో అనిపిస్తుంది

## అనాగరిక యుగం ఎగువదశలో ఆస్తి

ఈదశాకాలం చివరికి ఆస్తి అధికమయింది వివిధ రకాల ఆస్తి వ్యక్తి హక్కులో వుండడం పరిపాటి అయింది వ్యవసాయం స్థిర పడింది చేతి వృత్తులు వచ్చాయి. స్థానికంగా వ్యాపారము, విదేశీ వాణిజ్యం వచ్చాయి అయితే వుమ్మడిగా వుంటూండిన భూముల మీద వుమ్మడి హక్కు ఇంకా మారలేదు అక్కడక్కడ ఎక్కువ మంది హక్కులోకి వస్తూంది ఈ దశలోనే బానిసత్వము ఏర్పడింది ఆస్తి వుత్పత్తితోనే అదీ వచ్చింది దానితోనే హిబ్రూలలో మాదిరి పితృ స్వామిక కుటుంబం వచ్చింది లాటిన్ తెగలలో తండ్రి పెత్తనం క్రింద అదే మాదిరి కుటుంబం వచ్చింది కొద్ది మార్పుతో అదే మాదిరి కుటుంబం గ్రీషియన్ తెగలలో వచ్చింది ఈ కారణాలతోనే, ప్రత్యేకించీను వ్యవసాయంలో జీవనోపాధి దండిగా లభించడం వలన జాతులు అభివృద్ధి పొంద సాగాయి అంత వరకు ఒకే ప్రభుత్వం క్రింద కొద్ది వేల మంది వుంటున్న వారల్లా అనేక వేలమంది వుండసాగారు నిర్ణీతమైన ప్రదేశాలలో కోటలు కట్టుకుని పట్టణాలలో నివశిస్తూండిన తెగల జనసంఖ్య పెరగడంతో మంచి ప్రాంతాలను స్వాధీనం చేసుకోవడం కోసం పోరాటాలు ప్రారంభ మయ్యాయి దానితో యుద్ధకళ విస్తరించింది వ్యక్తుల సామర్థ్యానికి అధిక ఫలితాలు కలుగ సాగాయి పరిస్థితులలో వచ్చిన ఈమార్పులూ జీవిత పద్ధతులలో వచ్చిన మార్పులూ నాగరికత సమీపిస్తుందని సూచస్తున్నాయి అది గణ సమాజాన్ని తొలగించి రాజకీయ సమాజాన్ని స్థాపిస్తుంది

పశ్చిమార్థ గోళంలోని ప్రజలు ఈ దశకు చెందరు వారికి ఈఅనుభవాలు లేవు పూర్వార్థ గోళంలోని ప్రజలు నడిచిన దారి వెంబడినే వారూ వస్తున్నారు అయితే వారు వెనుక బడ్డారు అనాగరిక యుగం ఎగువ దశా నాగరిక దశాకాలమూ కలిపినన్ని మొత్తం యేళ్ళ కాలం వారు వెనకబడి యున్నారు

ఈ పురోగతిలో ఆస్తి భావం పెరుగుదలను గూర్చి మనం పరిశీలిస్తున్నాము యాజమాన్యం, వారసత్వం గురించిన నియమాలను పట్టీ, వైవిధ్యాన్ని పట్టీ మనం దాన్ని తెలుసుకోగలం

గ్రీకుల, రోమనుల, హిబ్రూల గత అనుభవాలు, వారి ఆచారాలూ అలవాట్లలో నిక్షిప్తమై వున్నాయి నాగరికత ప్రారంభమైన తరువాత వారు, వాటికి చట్టాల రూపం యిచ్చారు వారు చేసిన చట్టాలూ, ప్రాచీన కాలపు నియమ నిబంధనలూ మనకు

స్పష్టంగా తెలియదు కనుక వానిని పట్టి మధ్యలో వచ్చిన మార్పులను చాల వరకు సరిగ్గానే వూహించగలం

అనాగరిక యుగం వుత్తర భాగంలో భూమి హక్కు విషయమై చాల మార్పులు వచ్చాయి ఇవి రెండు తరహాల యాజమాన్యానికి - 1 ప్రభుత్వానిది, 2 వ్యక్తులది – దారి తీసేయి అయితే నాగరికత వచ్చేవరకు యివి స్థిర పడలేదు గ్రీకులలో భూములు కొన్ని తెగల చేతిలో, కొన్ని మత ప్రయోజనాలకై వుమ్మడిగా ఫ్రాట్రీ చేతిలో, కొన్ని వుమ్మడిగా గణం స్వాధీనంలో వున్నాయి అవి చూశాము కాని భూములలో అధిక భాగం అనేక మంది వ్యక్తుల స్వాధీనంలోకి వచ్చాయి సొలోన్ కాలంలో అథీనియన్ సమాజం గణ సమాజంగా వున్నప్పుడే సర్వ సాధారణంగా భూములు వ్యక్తుల చేతుల్లో వుండేవి వాటిని తనఖా పెట్టడం కూడ ప్రారంభించారు ఆ నాటికి వ్యక్తి హక్కు కొత్త విషయం కాదు రోమను తెగలు మొట్టమొదట ఏర్పడిన నాటికే ప్రజలందరికి చెందిన ప్రాంతం Agerromanus వుండేది భూములు మత అవసరాలకై క్యూరియా చేతిలో, గణాల చేతిలో అనేక మంది వ్యక్తుల చేతుల్లో వుండేది ఈ సామాజిక నిర్మాణాలు అంతరించక వాని స్వాధీనంలో వుండిన భూములు క్రమంగా వ్యక్తిగత ఆస్తిగా మారాయి ఈ నిర్మాణాలు ప్రత్యేక అవసరాలకై కొంత కొంత భూమిని కలిగి వుండేవని జాతికి సంబంధించిన భూములను క్రమక్రమంగా వ్యక్తులు స్వాధీనం చేసుకుంటున్నారని తప్ప అంతకన్న వివరాలు మనకు తెలియవు

ఈ రకమైన అనేక హక్కు రూపాలను చూస్తే వీటన్నింటిలోకి ప్రాచీన మైనది తెగలకు గల వుమ్మడి హక్కు అని తెలుస్తుంది వ్యవసాయం ప్రారంభ మయ్యాక తెగకు చెందిన ఈ భూములలో కొంత కొంత భాగాన్ని గణాల మధ్య పంచారు. దానికి ఆ భూములపై వుమ్మడి హక్కు వుండేది కాలక్రమంలో ఈ భూములను వ్యక్తులకు కేటాయించడం మొదలు పెట్టారు అవి క్రమంగా వారందరి వ్యక్తిగత హక్కులోకి పరిణతి పొందాయి మిగిలిన బంజరు భూములు ఎవరి చేతులలోను కాకుండ గణాలు, తెగలు, జాతి యొక్క వుమ్మడి ఆస్తిగా మిగిలి పోయాయి భూమి హక్కుకు సంబంధించినంత వరకు మానవుని అనుభవం స్థూలంగా ఈ మాదిరిగా వున్నట్లు కనిపిస్తుంది సాధారణ రూపంలో వ్యక్తుల మధ్య పంచిన ఆస్తి వారి స్వంత హక్కుకి లోబడే వుంటుంది

అనాగరిక యుగం ఎగువ దశలో దంపతీ కుటుంబం మొట్టమొదట కనబడింది అది సిందియాస్మియన్ కుటుంబం లోంచి వచ్చింది ఆస్తి పెరుగుదలలూ, దాని వారసత్వ ఆచారాలూతో ఈ కుటుంబ రూపం మారుతూ వచ్చింది పారంపర్యం మగ వానికి మారింది కాని యధార్థమైన ఆస్తి, వ్యక్తి గత ఆస్తి కూడ అనాదిగా వున్న మాదిరిగానే గణం యొక్క వారసత్వంగానే వుండిపోయింది

ఈ దశలో గ్రీకు తెగలలో వున్న వివిధ తరహాల ఆస్తిని గురించిన వివరం మనకు హోమర్ కవితలలో దొరుకుతుంది ప్రాచీనపు అలవాట్లను ప్రతిబింబించే నాగరిక యుగపు ప్రారంభ శాసనాలలో దొరుకుతుంది ఇలియడ్ కావ్యంలో సాగు చేసిన భూముల చుట్టూ వేసిన కోరడులను గురించి, కోరడి మధ్య మున్న 50 ఎకరాలలో సగ భాగం ద్రాక్ష వేయడానికి, మిగిలినది దున్నడానికి పనికి వస్తుందని ఒక చోట చెప్తాడు డైదియస్ అనే అతను ఒక గొప్ప భవనంలో వుండేవాడని, అతనెంతో ధనవంతుడని, ధాన్యం పండే భూములు అతనికి బోలెడు వున్నాయని వ్రాశాడు ఆ రోజుల్లో భూముల చుట్టూ కంచెలు వేసే వారని వాటిని కొలిచే వారని అవి వ్యక్తి గత హక్కుగా వుండేవని నమ్మవచ్చును ఆస్తి దాని వుపయోగాలను గురించిన పరిజ్ఞానం చాల ఎక్కువగా వున్నట్టు యిది సూచిస్తుంది కొన్ని కొన్ని జాతుల గుఱ్ఱాలు ఒక్కొక్క విషయంలో శ్రేష్ఠంగా వుంటాయని వారికప్పటికే తెలుసును పశువుల మందలు, గొఱ్ఱెల మందలు వ్యక్తుల చేతులలో వున్నాయంటూ "ఒక ధనికుని గొఱ్ఱెలు అసంఖ్యాకంగా దొడ్డిలో వున్నాయని వ్రాస్తాడు" నాణేలు ముద్రించడం వారికింకా తెలియదు ఫలితంగా వ్యాపారం సరుకుల మార్పిడి ద్వారానే జరుగు తుండేది" పెద్ద పెద్ద జుట్టు వాళ్ళు గ్రీకులు కొందరు యిత్తడి యిచ్చీ, కొందరు నిగనిగలాడుతున్న ఇనుము యిచ్చీ, మరి కొందరు చర్మాలు యిచ్చీ, యింకొందరు ఎద్లనే యిచ్చీ, మరి కొందరు బానిసలనిచ్చీ సారాయి కొనుక్కున్నారు" అని ఆయన వ్రాశారు బంగారపు కడ్డీలు టాలెంట్సు అనే తూకంతో చెలామణీ అయ్యేవి బంగారం, వెండి, యిత్తడి, ఇనుముతో చేసిన వస్తువులను అనేక రకాల నార, ఊలు బట్టలు, యిళ్ళు, భవంతులు మొదలైన వానిని ఆయన పేర్కొన్నాడు ఇలాగ ఉదాహరణ లిచ్చుకుంటు పోవక్కరలేదు అనాగరిక యుగం ఎగువదశలో అంత క్రితం దశ కన్న సమాజం ఎంత పురోగమించిందో చెప్పడానికి పై ఉదాహరణలు చాలు.

ఇళ్ళు, భూములు, మందలు కాక మార్పుకి ఉపయోగపడే సరుకులు రాశి వాటి ఎక్కువ అయింది అవి వ్యక్తులహక్కులో వున్నాయి వాటి వారసత్వ సమస్య మనుష్యుల దృష్టి నాకర్షించింది చివరకు గ్రీకులంలో మేధా శక్తి పెరిగి ఆ హక్కుకి సంతృప్తి కరమైన పునాది ఏర్పరచ బడింది ప్రాచీన కాలపు అలవాట్లను, తరువాత తరువాత వచ్చిన ఆలోచనలకు అనుగుణంగా మార్చుకుంటూ వచ్చారు అదివరకటి అన్ని రకాల అస్తులు కలిపిన కన్న ఎక్కువ విలువ మచ్చిక అయిన జంతువుల మందకు వుంటుంది అవి ఆహారానికి ఉపయోగపడతాయి ఇతర సరుకులకు మార్చు కోవచ్చు బందీలను విడిపించు కోవడానికి ఉపయోగపడతాయి వాటితో జరిమానాలు చెల్లించు కోవచ్చు మతాచారాల పాటింపులో బలులివ్వవచ్చు- పైగా వాటి సంఖ్య అలా పెరిగి పోతూనే వుంటుంది సంపద అనేటువంటి భావాన్ని అవి మాన వుని ఆలోచనల్లో కలిగించాయి దీని తర్వాత కాలక్రమంలో ఒక పద్ధతి ప్రకారం భూముల్ని దున్నటం వచ్చింది అది భూమి, కుటుంబం ఒకటే అనే భావాన్ని కలిగించింది దానిని అస్తిని తయారు చేసే నిర్మాణంగా మార్చింది త్వరలోనే లాటిన్, గ్రీకు, హీబ్రూ తెగలలో తండ్రి అధికారం క్రింద బానిసలు, పరిచారకులుతో సహా కుటుంబ రూపం ధరించింది. తండ్రి యొక్క అతని సంతానం యొక్క కష్టం అంతకంతకు భూమిమీద ఎక్కువగా వినియోగ పడుతుంది మచ్చికయిన జంతువుల్ని పెంచుతుంది వ్యాపారపు సరుకుల్ని తయారు చేస్తుంది అప్పటికప్పుడే దంపతీ కుటుంబం వచ్చేసింది అది అంతకంతకు ఒంటరిగా నిలబడడానికి అస్కారం చిక్కింది ఆ పిల్లల సహకారంతో ఏర్పడిన అస్తిమీద వారసత్వపు హక్కు పిల్లలకే వుండాలి అనే ఆలోచన వచ్చింది భూమిసాగు రాక పూర్వం మందలు సహజంగానే, బంధుత్వపు ప్రాతిపదికమీద జీవనోపాధి కోసం గ్రూపులుగా ఏర్పడిన వ్యక్తుల యొక్క వుమ్మడి యాజమాన్యంలో వుంటాయి ఈ దశలో జ్ఞాతి వారసత్వం అనేది ధృఢ పడుతుంది భూములు అస్తిరూపంధరించినపుడు, వ్యక్తులకు కేటాయించిన భూములు వారి హక్కులోకి వచ్చి మూడవ వారసత్వ నియమం రూపొందుతుంది ఇది చనిపోయిన వాని అస్తిని అతని పిల్లలకు అంద చేస్తుంది. జ్ఞాతి వారసత్వాన్ని ప్రక్కకు తోసేస్తుంది రోమను గ్రీకు, హీబ్రూ నియమాలన్నింటా, అస్తి కొడుకులు లేక పోతేనే జ్ఞాతులకు వెడుతుంది- అన్న పరావర్తన నియమాన్ని వద్ద అర్థం చేసుకోవలసిందే తప్ప లాటిన్, గ్రీకు, హీబ్రూ తెగలలోని జ్ఞాతి వారసత్వ స్థితిని చెప్పేటం

దుకు సాక్ష్యమేమీ లేదు మొదటి దానిని పట్టి అంతకు ముందు కాలంలో జ్ఞాతులకే వారసత్వం వుండేదని వూహించవలసిందే

భూమి ఉపరి తలాన్నంతనూ అనేక మంది వ్యక్తుల స్వంతఆస్తిగా చేయవచ్చునని వ్యవసాయంతో నిరూపణ అయింది ఆస్తి భోగుదలకు సహజమైన కేంద్రం కుటుంబపు పెద్ద అయ్యాడు ఇక్కడ నుంచి మానవజాతిలో క్రొత్తగా ఆస్తి వ్యాప్తి ప్రారంభ మయింది ఇది అనాగరిక యుగం ఎగువదశ పూర్తి అయ్యే నాటికే వచ్చేసింది మానవుని ఆలోచనల మీద ఆస్తియొక్క ప్రభావం ఎంత బలంగా వుంటుందో అది కలిగించే నూతన లక్షణాలు ఏ విధంగా ప్రబుద్ధమౌతాయో కొంచెం ఆలోచిస్తే అర్థం అవుతాయి అటవికుని మనస్సులో కనపడీ కనపడనట్టున్న కోరిక వీర యుగం నాటి అనాగరిక యుగంలో విపరీతమైన ఆశగా మారినట్లు అనేక కారణాల వల్ల తెలుస్తుంది ప్రాచీనాచారాలుకాని, తరువాత వచ్చినవి కాని ఆ పరిస్థితిని చూపించవు దంపతీ వివాహం వచ్చింది పిల్లల తండ్రికత్వం స్థిరపడింది చనిపోయిన తండ్రి యొక్క వారసత్వం వారికే వున్నదని నిశ్చయించు కొనేందుకు, దారి ఏర్పడింది చరిత్రకు తెలిసిన నాటికి జర్మను తెగలు అనాగరిక యుగం ఎగువ దశలో వున్నారు వారు ఇనుమునువయోగించే వారు అయితే పరిమితంగానే మందలు వారి కుండేవి ధాన్యాలు పండించే వారు నారతోటి, ఉలుతోటి ముతక బట్టలు తయారు చేసేవారు కాని వారిలో భూములపై వ్యక్తి హక్కు అనే భావం యింకా ఏర్పడలేదు. వ్యవసాయానికి పనికి వచ్చే భూములను ఏటేటా నాయకుల పేరున కేటాయించేవారని, పచ్చిక బీళ్ళు ఉమ్మడిగా వున్నాయని సీజరు చెప్పాడు దీనిని పట్టిఅనాగరిక యుగం మధ్య దశలో ఆసియాలోను యూరప్‌లోను భూములపై వ్యక్తికి హక్కు అనే భావం ఏర్పడ లేదని అది తర్వాత కాలంలో మాత్రమే వచ్చిందని ఊహించవచ్చును

హీబ్రూ తెగలు అనాగరిక యుగంలో ఏ విధంగా వుండేవారో విశేషంగా తెలియదు నాగరికతకు పూర్వం భూములపై వ్యక్తి గత హక్కు వారిలో వుండేది మాక్పెలా గుహను యఫ్రాన్ నుంచి అబ్రహాము కొనుక్కున్నాడన్నది- దాని కొక ఉదాహరణ ఆర్యన్ తెగల అనుభవాల వంటివి వారికి గతంలో వున్నాయని నిస్సందేహంగా చెప్పవచ్చు వారి లాగే హీబ్రూలు అనాగరిక యుగం నుంచి బయట పడ్డారు వారికి మచ్చికయిన జంతువులున్నాయి ధాన్యాలున్నాయి ఇనుము ఇత్తడి, వెండి, బంగారం, పింగాణి పాత్రలు బట్టలు వున్నాయి అయితే అబ్రహాము కాలం నాటికి

వ్యవసాయం గురించి వారికి కొద్దిగానే తెలుసును ఎక్సోడస్ (వలస) అనంతరం హీబ్రూ సమాజాన్ని పునర్మించారు పాలస్తీనాలోకి వచ్చాక రక్త బంధుత్వం గల తెగల ప్రాతిపదికమీద ప్రాంతాలను కేటాయించారు అంటే నాగరిక కాలం నాటికి వారింకా గణ సంస్థలోనే వున్నారని రాజకీయ సమాజం ఏర్పడే స్థితి రాలేదని అను కోవాలి ఇంక ఆస్తివారసత్వం, యాజమాన్యం గురించి వారి అనుభవాలు రోమను గ్రీకు తెగల అనుభవాలతో సరి పడుతున్నాయని మోసెస్ చేసిన శాసనాలను పట్టి కొంత వరకు స్పష్టమౌతూంది వారసత్వం ఖచ్చితంగా ప్రాట్రీలో వుంది "తండ్రి యొక్క యిల్లు" అనడాన్ని పట్టి గణంలో కూడ వుండేదని చెప్పవచ్చు పరావర్త నాన్ని పట్టి వూహించవలసిందే కాని ప్రాచీన కాలంలో హీబ్రూలలో వారసత్వాచారం ఏమిటో తెలియదు రోమన్ల పన్నెండు పట్టికల చట్టంలో చెప్పిన మాదిరిగానే వుంది ఆ పరావర్తన నియమం ఈ పరావర్తన నియమమే కాక ఒక ఉదాహరణ కూడ దొరుకుతుంది పిల్లలకు పూర్తి వారసత్వపు హక్కు ఏర్పడ్డాక కొడుకులు లేకపోతే ఆస్తి కూతుళ్ళకు పోవాలి అనేది అందులో వుంది దీనిని పట్టి ఆస్తి కూతుళ్ళతో పాటు వారి భర్తల గణానికి పోతుంది అందుచేత వానికో నియమం ఏర్పరిచారు వారసురాళ్ళ వివాహం గణాలలోని వారితోనే జరగవచ్చునన్నది- దానిని సరిచేసింది సహజంగానే గణంలోపల వివాహం నిషిద్ధం దాని మూలంగానే ఈ సమస్య వచ్చింది హీబ్రూల వారసత్వ సమస్యగా మోసెస్‌ను ఎదుర్కొంది అథీని యన్లలో సొలోన్ ఎదుటకు వచ్చింది ఆస్తి తన సభ్యులలో వుండాలని గణం తన హక్కుగా చెపుతుంది పై రెండు సందర్భాలలో కూడ దాన్ని ఒకే విధంగా సర్దు బాటు చేశారు ఇదే ప్రశ్న రోమను గణాంలోనూ వచ్చిందని వూహించవచ్చును వివాహంతో స్త్రీకి వోటు హక్కు పోతుంది (Deminutio- Catitis) జ్ఞాతి హక్కులు పోతాయి. ఇందులో మరో సమస్య కూడ వుంది వివాహాన్ని గణం లోపల నిషేధిస్తున్న నియమం కొనసాగించాలా? దానిని వదులు చేయాలా? అంటే జ్ఞాతి తత్వం కాక దగ్గర దూరాలతో దానిని పరిమితం చేయాలా అనేది ఇది వివాహ విషయంలో మానవుని ఆలోచనల పర్యవసానం అని చెప్పాలి ఇవన్నీ ఆలోచిస్తే హీబ్రూల ప్రారంభ కాలపు గ్రీకు, రోమను గణ సమాజం ఆచారాలతో పూర్తిగా సరి పోలి వున్నాయి

జలోఫెహాద్ చనిపోయిన నాటికి ఆయనకు కూతుళ్ళే కాని కొడుకులు లేరు కూతుళ్ళకి ఆస్తి యిచ్చేశారు తరువాత వారు వివాహం చేసుకోవలసి వచ్చింది వారు

జోసెఫ్ తెగవారు గనుక బయటి వారిని పెళ్ళి చేసుకోవాలి వారితో ఆస్తి కూడ బయటికి పోతుంది జోసెఫ్ తెగవారు అభ్యంతరం చెప్పారు అది మోసెస్ ముందుకి వచ్చింది "వారు యిస్రాయేలు సంతానం అయిన యితర తెగల యువకుల్ని పెళ్ళి చేసుకుంటే మా తల్లి తండ్రుల ఆస్తి నుంచి తమ వంతు ఆస్తి తీసుకుపోతారు. అది వారు పెళ్ళి చేసుకుంటున్న తెగకు పోతుంది ఆ విధంగా మా ఆస్తిలో భాగం తీసుకు పోతారు" ఈ భాషను పట్టి ఆ చర్య వలన జరిగే ఫలితాలు తెలుస్తున్నాయి వారి బాధ అర్థం అవుతూంది హక్కు భుక్తాలలో వున్న ఆస్తిని గణము, తెగ నుంచి తీసుకు పోవడం అనేది ఇక్కడున్న బాధ హీబ్రూ శాసన కర్త తన తీర్పు యిలా యిచ్చాడు "జోసెఫ్ తెగ వారు చెప్పింది బాగుంది దేవుని ఆదేశం యిది జలోఫెహాద్ కూతుళ్ళు తమ యిష్టం వచ్చినవారిని పెళ్ళిచేసుకోవచ్చును వారు తమ తండ్రి తెగలోని కుటుంబం వారినే పెళ్ళి చేసుకోవాలి ఆ విధంగా ఇస్రాయెలీల వారసత్వం ఒక తెగ నుంచి యింకొక తెగకు మారదు ఇస్రాయెలీలు ప్రతి ఒక్కరు తమ తండ్రుల తెగకు చెందిన వారసత్వాన్ని తమతోనే వుంచుకోవాలి ఇస్రాయెలీ తెగలలో వారసత్వపు హక్కు గల ఆడపిల్ల తన తండ్రి తెగలోని, కుటుంబంలోని వారినే పెళ్ళి చేసుకోవాలి ఆ విధంగా ప్రతి ఇస్రాయెలీ తన తండ్రుల వారసత్వాన్ని అనుభవించాలి" అంటే వారు తమ ప్రాట్రీలోనే వివాహం చేసుకోవాలి తమ గణం వారినే అనేది నిబంధన కాదు ఆ విధంగా జలోఫెహాద్ కూతుళ్ళు "తమ తండ్రి అన్నదమ్ముల కొడుకులను పెళ్ళి చేసుకున్నారు" అంటే వారు తమ ప్రాట్రీలో వారేకాక తమ గణంలోని వారు కూడాను అంతేకాదు దగ్గర జ్ఞాతులు కూడాను

మరో సందర్భంలో మోసెస్ వారసత్వపు నిబంధనను, పరావర్తన నియమాన్ని, అతి స్పష్టంగానే చెప్పారు. "ఇస్రాయెలీలలో ఒకరు కొడుకులు లేకుండా చనిపోతే వారసత్వం కూతుళ్ళకు వెళుతుంది కూతుళ్ళు లేకపోతే అన్నదమ్ములకు వెళుతుంది వారూ లేకపోతే తండ్రి అన్నదమ్ములకు వెళుతుంది వారూ లేకపోతే వారసత్వం కుటుంబంలో అతని తరువాతి జ్ఞాతికి వెడుతుంది"

ఇక్కడ మూడు తరగతుల వారసులను పేర్కొన్నారు మొదట చనిపోయిన వాని పిల్లలు తరువాత జ్ఞాతులు, దగ్గర దూరం పట్టి మూడవది గణ సభ్యులు ఇదీ చనిపోయిన వాని ప్రాట్రీ సభ్యులకు మాత్రమే పరిమితం ఇందులో మొదటి తరగతి వారసులు సంతానం అయితే మగవాళ్ళు ఆస్తి తీసుకుంటారు. ఆడ పిల్లల పోషణ బాధ్యత వారిది. పెద్ద కొడుకుకి రెండు వాటాలున్నాయని ఇంకోచోట చదివాము

కొడుకు లేకపోతే వారసత్వం కూతుళ్ళది జ్ఞాతులు రెండవ తరగతి వీరిని రెండంచెలు చేశారు. చనిపోయిన సోదరులు ఒక భాగం సంతానం లేకపోతే వారసత్వం వారిది రెండవ భాగం, చనిపోయిన వాని తండ్రి సోదరుడు మూడవ తరగతి గణ సభ్యులు. వారిని కూడ దగ్గర దూర తనాన్ని పట్టి నిర్ణయిస్తున్నారు. "కుటుంబంలో అతని తరవాత వచ్చే జ్ఞాతులు", "సెగకు చెందిన కుటుంబం" అనే మాట ఫ్రాట్రీకి ప్రత్యామ్నాయం చనిపోయిన వానికి సంతానం, జ్ఞాతులు లేకపోతే ఫ్రాట్రీలో అతని దగ్గర వానికి ఆస్తి చెందుతుంది. అది జ్ఞాతులకు వారసత్వం లేకుండ చేసింది తండ్రి సోదరుల కంటెను దూర బంధుత్వం గల ఫ్రాట్రీ సభ్యులకు చెందుతుంది చనిపోయిన వాని మేనల్లుళ్ళ కంటె ఎక్కువ ప్రాధాన్యం వారికి యిస్తుంది. పురుషుని వేపు నుంచి పారంపర్యం వస్తుంది ఆస్తి గణంలోనే వారసత్వంగా వుండాలి కొడుకు నుంచి తండ్రికి, మనమని నుంచి తాతకు వారసత్వం వున్నదని ఇక్కడ కన్పిస్తుంది. ఈ విషయంలోను యితర విషయాలన్నింటా కూడ మోజెస్ చట్టానికి పన్నెండు పట్టికల చట్టానికి పోలిక వుంది. దీనిని పట్టి మానవుని అనుభవాలు ఒకే విధంగా నడుస్తాయని వేరు వేరు జాతులలో ఒకే భావాలు సమాంతరంగా పెరుగుతాయని అర్థం అవుతుంది

తరువాత కొంతకాలానికి గణ నియమాలతో సంబంధం లేకుండ లెవిటికల్ చట్టం కొత్త పునాదిమీద వివాహపద్ధతి నేర్పాటు చేసింది రక్తబంధుత్వానికి,అనుబంధాలకు కొన్ని పరిధులను ఏర్పాటుచేసి ఆ లోపల వివాహాలు జరుగరాదని దానికి వెలుపల స్వేచ్ఛగా చేసుకోవచ్చునని ప్రకటించాయి ఇది హీబ్రూలలో వివాహ విషయంలో గల గణ ఆచారాలను నిర్మూలించింది క్రైస్తవ జాతులలో కూడ ఈనాడు దానినే పాటిస్తున్నారు

వారసత్వం గురించిన సోలోన్ చట్టాలకూడ ప్రధాన విషయాలలో మోజెస్ చట్టాల వంటివే. దీనినిబట్టి అథీనియన్ల హీబ్రూల ప్రాచీన ఆచారాలు, నియమాలు, చట్టాలు ఒకే మాదిరిగా వున్నాయని ఊహించగలుగుతాము వారసత్వ విషయమైన మూడోనియమం సోలోన్ కాలంలో అథీనియనులలో గట్టిగా స్థిరపడింది చనిపోయిన తండ్రి యొక్క ఆస్తిని కొడుకులందరు సమానంగా పంచుకుంటున్నారు. కూతుళ్ళను పోషించటం, పెళ్ళికాలంలో వారికి తగినట్లుగా పంచటం వారి బాధ్యతగా వుంటుంది. దీనివలన ఆస్తిగల వారసురాళ్ళు ఏర్పడ్డారు జలోఫెహాద్ కూతుళ్ళ లాగే పెళ్ళి అయినప్పుడు వారు ఆస్తిని తమ గణంనుంచి మగని గణానికి తీసుకుపోగల స్థితి

ఏర్పడింది మోసెస్‌నులాగే సొలోన్‌ను ఈ ప్రశ్న ఎదుర్కొంది అయినా మోసెస్ లాగే నిర్ణయించాడు ఆస్తివారసురాలు అతి సన్నిహితుడైన జ్ఞాతిని పెళ్ళిచేసుకోవచ్చని విధించాడు వారిద్దరూ ఒకే గణానికి సంబంధించినా తప్పులేదన్నాడు గతంలో వారి మధ్య వివాహం నిషిద్ధం ఇది అథీనియన్ చట్టంలో బాగా దృఢపడి పోయింది M De coulanges తన రచనలో ఆస్తి వారసురాలిని పెళ్ళిచేసుకొనే బాధ్యతతో జ్ఞాతికి వారసత్వం సంక్రమిస్తుందని తన పుస్తకంలో వ్రాశాడు అదివరకే వివాహితుడైన జ్ఞాతి ఆస్తిపరురాలిని పెళ్ళి చేసుకునేటందుకై మొదటి భార్యని ప్రక్కకు పెట్టిన ఘటనలు అక్కడక్కడ వున్నాయి డెమాస్తనీసు వ్రాసిన "యూబులిదే"లోని ప్రాదోమాచూస్ ఒక వుదాహరణ అయితే ఆ జ్ఞాతి తన భార్యను విడిచి పెట్టవలసిన నిర్బంధం వుందని కాని, ఆస్తిపరురాలిని వివాహమాడకుండ ఆస్తిని పొందగలగడం కాని జరుగుతుం దనిపించదు పిల్లలు లేకపోతే ఆస్తి జ్ఞాతులకు వెడుతుంది జ్ఞాతులు లేకపోతే గణ సభ్యులకు వెడుతుంది అథీనియన్లలోలాగే హీబ్రూలలో, రోమనులలో ఆస్తి గణంలోనే వుండి తీరాలి అంతకు పూర్వం ఆచారంగావున్న దానిని సొలోన్ ఒక చట్టంగా చేశాడు

సొలోన్ కాలంలో వీలునామాలు రాయడం చూస్తే, ఆస్తి భావనయొక్క పురోగతి కనిపిస్తుంది ఈ హక్కు కనిపించిందంటే చివరకు దానినందరూ అంగీకరిస్తారనీ అనుకోవచ్చు అయితే దానికి వ్యవధి పడుతుంది అనుభవమూ ఎక్కువ కావాలి వీలునామాలను అంతకు పూర్వం అంగీకరించేవారుకారని, సొలోన్ వానినొక చట్టంచేసి ప్రసిద్ధికి వచ్చాడని ప్లూటార్క్ వ్రాశాడు అయితే ఆస్తి, ఇల్లు, చనిపోయిన వాని గణంలోనే వుండాలి అయితే తనకుతోచిన వానికి ఆస్తిని యివ్వవచ్చు అని అనుమతించినపుడు, పిల్లలులేనివాడు బంధువుల కంటే స్నేహితులకు గౌరవం యిస్తాడు ఆస్తిని వారికిస్తాడు ఈ చట్టం మనిషి బ్రతికియున్నకాలంలో అతనికి ఆస్తిమీద వ్యక్తిగతంగా సంపూర్ణాధికారాల్ని కలిగించడ మేకాకుండ తనకు సంతానం లేనపుడు, యిష్టంవచ్చిన వారికి యిచ్చి వేసేటందుకు హక్కును కలిగిస్తోంది అయితే సంతానం వున్నంతవరకు ఆస్తిహక్కు గణానిదేనన్న నియమం గణ ప్రతినిధులుగా అతని సంతానానికి చెందడంలో అమలు జరుగుతూంది ఈనాడు సమాజంలో పెత్తనం చేస్తున్న నియమాలు మెట్టుమెట్టుగా ముందుకు అడుగువేస్తూ వచ్చాయని, ప్రతి అంశం లోను కనబడుతూంది పైన చెప్పిన ఉదాహరణాలన్నీ నాగరికత వచ్చిన తరువాతనే అయినప్పటికి అంతకుపూర్వం అటువంటి అలవాట్లు లేనిదే స్వతంత్రంగా క్రొత్తగా

సొలోన్ శాసనచట్టాలను చేర్చదనుకోలేము ఆస్తిని గురించిన భావనలు అనుభవం ద్వారా క్రమాభివృద్ధిపొందింది, చట్టం స్థాయికి ఎదిగి వుంటాయి చట్టం చేసి వాటిని స్థిరపరిచి వుంటారు

క్రీ పూ 449లో ప్రకటించబడిన రోమనుల పన్నెండు పట్టికల చట్టంలో ఆ నాడు అమలులోవున్న వారసత్వ నియమాలు కనిపిస్తాయి చనిపోయిన వాని పిల్లలకు అతని భార్యకు ఆస్తి సమానంగా చెందుతుంది పురుషసారంపర్యంలో పిల్లలు లేకపోతే వారి దగ్గర జ్ఞాతులకు వెడుతుంది వారూ లేకపోతే గణ సభ్యులకు వెడుతుంది ఇక్కడ కూడ మనకు కనిపించేది ఆస్తి గణంలోనే వుండాలనేది ఈ చట్టానికి ప్రాతిపదిక లాటిన్, గ్రీకు, హీబ్రూ తెగలలో పూర్వీకులు వారసత్వానికి సంబంధించిన ఈ మూడు నియమాలనూ ఒకదాని తర్వాత ఒకటి అనుసరించారా అన్నది చెప్పలేము పరావర్తన నియమాలను పట్టి అవి జరిగినట్టు తెలుసుకోవలసి వస్తుంది 12 పట్టికలలో చెప్పిన క్రమానికి వ్యతిరేకక్రమంలో వారసత్వం వుండేదని వూహించడం సబబు వారసత్వం గణానికి తర్వాత జ్ఞాతులకు, తరువాత కేవలం సంతానానికి వచ్చింది

నాగరికయుగం ఎగువదశలో కులీనవర్గం ఏర్పడడం ఒక క్రొత్త పరిణామం వ్యక్తులహోదాలు, వారి చేతులలో పెద్ద మొత్తాలలో సంపదలుండడం, వీనితో వ్యక్తుల ఏలుకుబడికి పునాది పడింది ప్రజలలో ఒక భాగాన్ని శాశ్వతంగా నీచపరుస్తూ బానిసత్వం వచ్చింది అంతకు పూర్వపు మానవదశా కాలాలలో ఇటువంటి హెచ్చు తగ్గులు లేవు ఇది ఆస్తి హోదాలతో కులీన భావాన్ని బాగావృద్ధిపొందించింది. ఆధునిక సమాజంలో అది బాగా వేళ్ళూనుకొని గణాలు పెంచి పోషించిన ప్రజాతంత్ర నియమాలను నష్టపరిచింది దానితో అసమానమైన సౌకర్యాలూ ఒకే జ్ఞాతికి చెందిన వ్యక్తులలో గౌరవ మర్యాదల హెచ్చుతగ్గులు వచ్చి సంఘంలో సమతూకం చెడింది. అది ద్వేషాలకు, తగవులకు కారణమయింది

మొట్ట మొదట నాయక పదవి గణంలో వారసత్వంగా వుండేది గణ సభ్యు లందరికి సమిష్టి వారసత్వం వుండేది అది అనాగరిక యుగం ఎగువదశ నాటికి గ్రీకు, లాటిన్ తెగలలో విధిగా తండ్రి నుంచి కొడుక్కి రావడం జరిగింది. ఇప్పుడున్న సాక్ష్యాన్ని పట్టి అది వంశ పారంపర్యపు హక్కుగా వచ్చేది అనుకోలేము కాని ఆర్కాన్, ఫిలో బాసిలస్ లేక బాసిలస్‌పదవులు గ్రీకులలో ప్రిన్సిపేటెక్స్‌పదవులు, రోమ నుల కుటుంబాలలో కులీన భావాన్ని పెంచడానికి తోడ్పడ్డాయనుకోవచ్చు ఆ పదవుల

స్థిరంగా వుంటూ వచ్చినా మొదటిరోజునాటి పరిపాలనా వ్యవస్థలయొక్క ప్రజా తంత్ర సూత్రాలను మార్చివేయగలంత బలమైనవి కాలేదు కులీనత పాదుకొనడానికి ఆస్తీ, పదవీ పునాదులయ్యాయి

ఈ నియమం వుండడమూ, పోవడమూ అనేది ఆధునిక సమాజం యొక్క గొప్ప సమస్యలలో ఒకటయింది ఈ మధ్య గడిచిన కాలంలో అదే సమాజందృష్టిని ప్రధానంగా ఆకర్షించింది సమాన హక్కులు, అసమాన హక్కులు, సమాన న్యాయాలు, అసమాన న్యాయాలు, సంపదలు, హోదాలు, అధికార స్థానాలకు గల హక్కులు, న్యాయానికి తెలివికి గల బలం-యివి సమస్యలయ్యాయి అంతిమ ఫలితం ఎలా వుంటుందో సందేహం అవసరంలేదు వేల సంవత్సరాలు గడిచాయి ఒక్క అమెరికాలో తప్ప ప్రత్యేక హక్కులు గల వర్గాలను తొలగించడం జరుగలేదు. అయినా అవి సమాజానికి బరువుగానే వున్నాయని అందరకూ అర్థం అయింది

నాగరికత ఏర్పడిన నాటి నుంచి ఆస్తి విపరీతంగా పెరిగింది అనేక రూపాలు అయింది దాని వుపయోగాలు విస్తరించాయి దాని స్వంతదారుల ప్రయోజనాలకై బహు తెలివిగా నిర్వహించడం వచ్చింది చివరకు ప్రజలకి స్వాధీనం కాకుండా తయారయ్యాయి మానవ మేధస్సు తానుసృష్టించిన దాని యెదుట తెల్లబోయినించుంది మానవుని తెలివి ఆస్తి పైన యాజమాన్యాన్ని సంపాదిస్తుంది ఆస్తికీ, దానిని రక్షించే రాజ్యానికి మధ్య సంబంధాలనూ, ఆస్తి యజమానుల బాధ్యతలనూ, వారికిగల హక్కుల పరిమితిని నిర్ణయించే రోజువస్తుంది వ్యక్తుల ప్రయోజనాలకంటే సమాజ ప్రయోజనాలు అధిక ప్రయోజనం కలవి వాని మధ్య న్యాయమైన సమన్వయంతో కూడిన అను బంధాలను సృష్టించాలి గతంలో లాగనే భవిష్యత్తులో కూడ పురోగతి కలగాలంటే మానవుని భవిష్యత్తు ఆస్తి సంపాదనతోనే ముడిపడి వుండకూడదు మానవుని జీవిత కాలంలో నాగరికతా కాలం చాల స్వల్ప భాగం, రాబోయే కాలానికి పోలిస్తే మరీను ఆస్తి జీవిత లక్ష్యం, గమ్యం కనుక అయితే సమాజం విధ్వంసం కావడం తథ్యం ఆ లక్ష్యం ఆత్మహత్యాసదృశం ప్రభుత్వంలో ప్రజా తంత్రం, సమాజంలో సోదర భావం, హక్కులు సౌకర్యాలలో సమానత్వం అందరికీ విద్య, రాబోయే వున్నత సమాజాన్ని చూపిస్తున్నాయి మానవుని అనుభవం, తెలివి, మేధస్సు ఆచే దారితీస్తున్నాయి ప్రాచీనగణాలలోని స్వాతంత్ర్యం,సమానత్వం సోదరత్వం ఒక వున్నత రూపంలో పునరుజ్జీవం పొందుతాయి మానవుని మనస్సులో ఆస్తి భావం పెరుగుదల వలన వచ్చిన ఫలితాలు కొన్ని, నియమాలుకొన్ని యిక్కడ

చెప్పాను ఈ విషయాన్ని తగిన విధంగా పరిశీలన చేయకపోయినా కనీసం దాని ప్రాధాన్యాన్ని చూపించాను

మూలం ఒకటే కావటం వలన, తెలివి, రూపం ఒకటే అయి మానవుని అనుభవాలు ఒకే దశాకాలంలో అన్ని ప్రదేశాలలోను అన్ని కాలాలలోను ఒకే విధంగా వుంటున్నాయి

కొద్ది కొద్ది మార్పులు వున్నా తెలివితేటలు ఒకే స్థాయిలో నిలబడుతూండటం కనిపిస్తూంది అది పని చేసే తీరు మానవ పురోగతి దశలన్నింటా ఒకే విధంగా వుంటుంది మానవ జాతియొక్క మూలం ఒకేవిధమైనదని చెప్పడానికి వాదన అవసరం లేదు ఆటవిక మానవునిలో, అనాగరిక మానవునిలో, నాగరిక మానవునిలో, తెలివితేటలు ఒకే విధంగా వుంటాయనేది మనకు కనిపిస్తూంది అలా వుండటం చేతనే మానవజాతి ఒకే తరహా పరిస్థితులలో ఒకేమాదిరి పనిముట్లను, పాత్రలను కల్పనలను చేస్తుంది ఒకే మూల భావాల నుంచి ఒకే తరహా ఆచారాలు వృద్ధిపొందుతున్నాయి చిన్నగా ప్రారంభమయి క్రమంగా పెరిగి నాగరికతను సాధించిన సూత్రం చాల గంభీరంగా కనిపిస్తుంది ఆటవికుని మెదడులోని భావాలనుంచి పుట్టిన బాణం ములికి నుంచి, అనాగరికుని తెలివిని చూపించే ఇనుము కరుగ పోత వరకు, నాగరికతా విజయం అని చెప్పదగిన నడిచే రైలు బండివరకు, వున్న సూత్రాలు చిన్నగా ప్రారంభమై పెరిగినవే.

కొంచెం యించు మించు 5 వేల సంవత్సరాల క్రితం మానవజాతిలో ఒక భాగం నాగరికతను పొందటం గొప్పవిషయం మరొకరి సాయం అక్కరలేకుండ స్వయంగా అభివృద్ధి పొంది సెమిటిక్ ఆర్యన్ తెగలు రెండూ దీనిని సాధించాయి మానవ పురోగతిలో ప్రధాన అంతస్సూత్రంగా ఆర్యన్ కుటుంబం వున్నదని చెప్పవచ్చు ఏమంటే మానవజాతిలో వున్నత తరహా వారిని అది తయారు చేసింది. భూమి సంతమూ క్రమంగా తన ఆధీనంలోకి తెచ్చుకొని తన గొప్పతనాన్ని నిరూపించుకొంది. అయినా నాగరికత అనేది యాదృచ్ఛిక పరిస్థితుల వలన వచ్చినదేనని భావించాలి ఏదో కాలంలో అదివచ్చి వుండేదే ఎప్పుడు వచ్చినా అది అసాధారణ ఘటనగానే వుంటుంది ఆటవిక దశలో మానవజాతిని ఎన్నో ఆటంకాలెదుర్కొన్నాయి అతి కష్టం మీద వాటిని అధిగమించింది అనాగరిక యుగం మధ్య దశకు చేరిన తర్వాత వారు సహజమైన లోహాలతో పరిశోధనలు జరుపుతూ ఇనుము కరిగించే క్రమాన్ని తెలుసుకునేందుకు మెట్టు మెట్టుగా నడుస్తున్న దశలో నాగరికత యొక్క స్థితి అను

మానన్పదంగానే వుండింది ఇనుము దాని ఉపయోగాలు తెలిసే వరకు నాగరికత అసంభవం ఈ క్షణం వరకు ఆ పరిధిని మనం దాటి వుండక పోతే ఆశ్చర్యపడ వలసిన పనిలేదు మానవుడు భూమి మీదకు వచ్చినప్పటి నుంచి జరిగిన కాలాన్ని గుర్తు చేసుకుంటే ఆటవిక దశలో, అనాగరిక దశలో ఆతడు గడపిన ఎగుడుదిగుడు లను గుర్తుచేసుకుంటే విధిగా ముందుకు వేసిన అడుగులను గుర్తుచేసుకుంటే దేవుని దయవలన అది వచ్చిందే కాని మరో కొన్ని వేల సంవత్సరాల ఆలస్యం కావడానికి అవకాశం వుంది అనేక అనుకూల పరిస్థితులు తటస్థపడి నాగరికత ఆనాడు వచ్చింది- అని అనుకోక తప్పదు ఈనాడు మన రక్షణకూ, సుఖానికీ ఎన్నో సాధనాలు వున్నాయంటే అతి పురాతన కాలపు పూర్వీకులయిన ఆటవికులు అనాగరికులు చూపిన ఓర్పు, ధీరత్వం, పోరాటాలు, బాధలూనే మూలమని గుర్తు చేసుకోవడం మంచిది ఆటవికుల నుంచి అనాగరికుడుగా, అనాగరికుడినుంచి నాగరికుడిగా అభివృద్ధి పొందేడంటే వారి కష్టాలు బాధలు విజయాలు ఒక మహదాత్మ యొక్క పథకంలో భాగాలేనని అనుకోవాలి

